# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం మహానుభావులైన **సిద్ధాశ్రమం** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **సిద్ధాశ్రమం** వారి వెబ్ సైట్: http://www.siddhashramam.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మనవి ☆

భారతములోని భీష్మపర్వంలో 23వ సర్గనుండి 40వ సర్గ వఱకు చెప్పిన విషయములు 'భగవద్గీత' అను పేరున లోకములో ప్రచారంలో వున్నది. అయితే భగవద్గీత అను పేరును వ్యాసభగవానుడు వాడనందున ఆయన ఈ సర్గలలో వాడిన 'భగవాన్ ఉవాచ' అని చెప్పినదానినే ఈ గ్రంథమునకు పేరుగా నిర్ణయింపబడినది. ఈ గ్రంథములో చెప్పిన విషయములనే సృష్ట్యాదియందు పరబ్రహ్మ-బ్రహ్మకు ఉపదేశించినందువలన వ్యాసభగవానుడు 'శ్రీకృష్ణ ఉవాచ' అని గాక, 'భగవాన్ ఉవాచ' అన్నారు.

భగవద్గీత పేరున ఎందరో మహానుభావులు వారివారి భావములతో దీనికి వ్యాఖ్యానములు రచించినారు. అటువంటివాటిలో ఆదిశంకర విరచిత **శంకరభాష్యము**, జ్ఞానేశ్వర మహారాజు రచించిన **'జ్ఞానేశ్వరి'** బహుళ ప్రచారంలో ఉన్నవి. కానీ ఏ వ్యాసభగవానుడిచే భారతము రచియింపబడినదో ఆ మహానుభావుడే రచియించిన భాగవతములోని కథలు, ఉపనిషద్వాక్యములు సందర్భానుసారముగా, ఉదాహరణలుగా ఇందు ఇవ్వబడినవి.

ఒక విషయమును బోధించుటకు అనువైన ప్రదేశము, సమయము ఉండవలయును. కావున యుద్ధములో ఏనుగులు, గుఱ్ఱములు, సైనికులు చేయు రణగొణధ్వనులమధ్య మఱియు యుద్ధములో జయము ఎవరిదా? అని ఆలోచించుచున్న అర్జునునకు కథాపరమైన ప్రశ్నలకు యుద్ధరంగములో ఉన్న సమాధానము చెప్పెనని, అదేవిధముగా జీవనసంగ్రామమునకు మోక్షార్థికి శత్రువులైనవాటిని సాధనద్వారా ఎట్లు జయించుట అను విషయములకు సంబంధించిన ప్రశ్నలకు సమాధానములు మోక్షార్థికి చెప్పినట్లు భావించవలయునన్నది పెద్దల అభిప్రాయము.

ఏ రచయిత అయినా తను చెప్పదలచుకున్నది పాత్రలద్వారాను, ఆధ్యాత్మిక భావనలను ప్రశ్న-సమాధాన రూపముగా చెప్పును. అదే పద్ధతి ఇందు పాటింపబడినది.

సంగ్రామములు రెండు రకములు - 1) కథాభాగమైన సంగ్రామము ఒకటి. ఇందు చతురంగ బలములతో, అస్త్రశస్త్రములచే చేయబడు యుద్ధము వర్ణింపబడును. ఈ యుద్ధములో శత్రువులను జయించి, రాజ్యము హస్తగతము చేసుకొనుట ముఖ్య లక్షణము. ఈ కథాభాగమైన యుద్ధము గుఱించి యుద్ధము చేయుటయా? లేక మానుటయా? యుద్ధములో ఎవరు జయించెదరు? మొదలగు ప్రశ్నలను అర్జునుడు శ్రీకృష్ణుని అడుగగా దుష్టశిక్షణ రాజ్యపాలకులైన సుక్షత్రియుల కర్తవ్యము గావున దుష్టసంహారమునకై యుద్ధము చేయుమని చెప్పి, ఈ యుద్ధములో మనదే జయము అని శ్రీకృష్ణుడు చెప్పినాడు. దుష్టసంహారము హింసకాదు. నేడునూ పాలకులు కఠిన నేరస్థులకు మరణదండన విధించుచున్నారు. కావున శ్రీకృష్ణుడు హింసను ప్రేరేపింపక దుష్టసంహారమునకు అర్జునుని ప్రేరేపించినాడు.

2) ఆధ్యాత్మిక విభాగము – జీవనసంగ్రామము రెండవ రకము. ఈ సంగ్రామములో తన శత్రువులైన మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, ప్రాణము, జ్ఞానేంద్రియములను జయించవలసి యుండును. ఈ సంగ్రామంలో విజేతగా నిలిచిన జీవుడు ఆత్మశాంతిని పొంది, **దేహసామ్రాజ్య పట్టాభిషిక్తుడై**, దేహత్యాగానంతరము బ్రహ్మయై విరాజిల్లును.

రామాయణములో అగస్త్యమహర్షి యుద్ధము మధ్యలో ఆదిత్యుని గుఱించి అనగా ఆత్మ గుఱించి వివరింపగా ఈ సర్గలలో యుద్ధప్రారంభంలో చెప్పినట్లు కలదు. ఈ సర్గలలో ఆధ్యాత్మిక విభాగమునకు గురువు శ్రీకృష్ణుడు. అర్జునుడు శిష్యుడు.

పై రెండు భాగములకు సంజయుడు గురువు, ధృతరాష్ట్రుడు శిష్యుడు. ఈ సర్గలలో శ్రీకృష్ణుడు చెప్పిన పాఠము గ్రహించి ధృతరాష్ట్రుడు కర్మయోగముగా చెప్పబడే యోగము అవలంబించి, దేహమును పరిత్యజించి ఆత్మయై విరాజిల్లినట్లు భాగవతము – ప్రథమస్కంధములో వివరింపబడినది. అటులనే జ్ఞానయోగమును అవలంబించి అర్జునుడు ఆత్మయై విరాజిల్లినట్లు భాగవతము – ప్రథమస్కంధములో వివరింపబడినది.

ఈ సర్గలలో చెప్పబడిన విషయములు – 1) (బ్రహ్మవిద్య) బ్రహ్మవిద్య విశిష్టత, దీనిని ఎవరికి చెప్పాలి? 2) ఆత్మ 3) ఆదిపురుషుడు 4) అంతరాత్మ 5) హృదయగతాత్మ 6) విరాట్ పురుషుడు 7) అవతారపురుషుడు 8) దేహి 9) ప్రకృతి 10) దేహము 11) ఈశ్వర వృక్షము, సంసారవృక్షము12) గుణములు 13) కర్మ 14) కర్మలోని రకములు 15) దేహము వదలిన తరువాత జీవుడు పయనించు మార్గములు 16) గుణరహితుడై శాంతిని పొందినవాడు ఆత్మయై విరాజిల్లుట అను విషయములు సంక్షిప్తముగా చెప్పబడినది.

**ఆత్మ :** ఆత్మలో సృష్టి లేదు. సృష్టిలో ఆత్మ అంతర్యామిగా ఉన్నది.

**విరాట్‌పురుషుడు :** ఈ సర్వజగత్తు విరాట్పురుషుని రూపమే. ప్రకృతి–పురుషుల సమిష్టి విరాట్పురుషుడు. అతడే బ్రహ్మ, విష్ణువు, శివునిగా సృష్టి, స్థితి, లయములు చేయుచున్నాడు. ఈ కర్మలయందు ఆసక్తి లేనందున ఆ కర్మలు అతనికి బంధముకావు.

**అవతారపురుషుడు :** అవతారపురుషులలో యజ్ఞవరాహావతారము తప్ప మిగిలిన అవతారముల ప్రసక్తి వేదములలో లేదు అని తెలిసియూ, వ్యాసభగవానుడు సాధన రహస్యములను అవతారపురుషుల జన్మ, కర్మలుగా చెప్పి వాటిని తత్త్వరీత్యా గ్రహించినవాడు అమృతుడగునని చెప్పెను.

**దేహి :** దేహి వేఱు. దేహము వేఱు. దేహి శాశ్వతుడు, దేహికి జాగ్రత్స్వప్నసుషుప్తవస్థలవలె దేహమును వీడి, మఱియొక దేహమును పొందుటయూ ఒక అవస్థ. దేహిలో ఒకడు పాపాత్ముడు, 2) వ్యర్థజీవి 3) కర్మయోగి 4) జ్ఞాని అని భేదములు కలవు. మఱల కర్మయోగులలో పునర్జన్మకు వచ్చువారు, రానివారు అని రెండు రకములు. భక్తులలో ఆర్తుడు, అర్థార్థీ, జిజ్ఞాసువు, జ్ఞాని అని నాలుగు రకములు. గుణరహితుడైన దేహి ఆత్మస్వరూపుడగును. గుణరహితుడై శాంతిని పొందినవాడే జ్ఞాని. ఇతడే పండితుడు. ఇతడే స్థితప్రజ్ఞుడు.

**జీవేశ్వరులకు గల భేదము :** ఈశ్వరునకు గత అవతారములన్నియూ తెలియును. దేహికి తన గత జన్మలు తెలియవు.

**వృక్షములు :** ఈశ్వరవృక్షమునకు మూలము పైన కలదు. అశ్వత్థమని సంసారవృక్షమునకు మూలము క్రింద గలదు. దీనిని వైరాగ్యముచే ఛేదించవలయును.

**ప్రకృతి :** అపరాప్రకృతి, పరాప్రకృతి అని ప్రకృతి రెండువిధములు. విరాట్పురుషుని దేహము పరాప్రకృతివలన, దేహియొక్క దేహము అపరాప్రకృతివలన ఏర్పడును. అటులనే ప్రకృతివలన సత్త్వగుణము,

రజోగుణము, తమోగుణములనే మూడు గుణములు కలిగినవి. ఈ గుణములననుసరించి దేహి పాప, పుణ్యయుతమైన కర్మలు చేయుచున్నాడు.

**దేహము :** ఇది స్థూలదేహము, సూక్ష్మదేహము అని రెండు రకములు. స్థూలదేహమునకు పుట్టుక, పెరుగుట, నశించుట అనే అవస్థలు కలవు. స్థూలదేహము నశించును. స్థూలదేహ విచారణలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, పంచప్రాణములు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల గుఱించి, ఇంద్రియములు వాటి ఇంద్రియార్థముల గుఱించి వివరించబడును. సూక్ష్మదేహము నశింపదు. ఈ దేహముతోనే జీవుడు పాప, పుణ్యములు, ఊర్ధ్వఅథోలోకములలో అనుభవము పొంది పునర్జన్మకు వచ్చుచున్నాడు. ఈ సూక్ష్మదేహము సాధనచే నశింపచేసుకొనవలయును. అప్పుడు జీవుడు ఆత్మయగును.

**కర్మ :** కర్మ అను పదము విస్తృతార్థములో వాడుదురు. ఇహలోకమునకు సంబంధించిన కర్మలు – 1) శరీర నిర్వహణకై చేయు పనులు 2) విధులు – బాధ్యతలు 3) జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు– ఇవి గుణమువలన, ఆ గుణములు చేయబడు కర్మలవలన ఏర్పడినవి. మోక్షార్థి జాతిధర్మములను పాటించవలయును.

**పరలోకమునకు సంబంధించిన కర్మలు :** 1) పాపకర్మ. పాపకర్మకు కారణము చెప్పబడినది. 2) పుణ్యకర్మ. ఇది మఱల కామ్యకర్మ, నిష్కామకర్మగా విభజింపబడినవి. పుణ్యకర్మకు దైవము, అధిష్ఠానము, కర్త, కారణము, వివిధచేష్టలు అనునవి ఐదు కారణములు. గుణమునుబట్టి చేయబడు పుణ్యకర్మలలో భేదము కనబడును.

పుణ్యకర్మలు, యోగము, భక్తి అనునవి కర్మయోగము క్రింద, తను దేహము కాదని, గుణములచే చేయబడు కర్మలకు తను కర్తను కానని భావించుట సాంఖ్యయోగము క్రింద వర్గీకరింపబడినవి. కర్మయోగము కర్మణ్యులకు, సాంఖ్యయోగము జ్ఞానులకు చెప్పబడినది.

మఱల కర్మవిభాగము కర్మబంధము కలిగించునది, కర్మబంధము కానివి అని రెండు విభజింపబడినవి.

పుణ్యకర్మలలో త్రిగుణములవలన చేయబడు యజ్ఞము, స్వాధ్యాయము, దానము, తపస్సు, శ్రద్ధ మొదలైనవి చెప్పబడినవి.

**యోగము :** యోగము ఎవరికి వచ్చును? ఎవరికి రాదు? యోగము ఎలా చేయాలో వివరింపబడినది.

**భక్తి :** సర్వభావములు పరమాత్మయందు ఉంచవలయునని చెప్పబడినది.

**సాంఖ్యము :** తను దేహము కాదని గ్రహించుటయే జ్ఞానము. ఈ జ్ఞానము బుద్ధినాశము గాకుండు విధము చెప్పబడినది.

**మార్గములు :** ఈ గుణములు, గుణములచే చేయబడు కర్మలవలన నాలుగు మార్గములు ఏర్పడినవి.

పాపులకు – **ధూమ్రమార్గము**. ఈ మార్గమున పయనించువారు నరకము పాలగుదురు. అవైదిక పద్ధతిని పుణ్యకర్మానుష్ఠానము చేయువారు నరకము పాలగుదురు.

**పుణ్యకర్మానుష్ఠానపరులకు –** వేదవిహితముగా పుణ్యఫలితము కోరినవారు **దక్షిణాయన మార్గము**న పయనించి, బ్రహ్మలోకము చేరి, పుణ్యము క్షీణించగనే పునర్జన్మక వత్తురు.

**పుణ్యఫలితము కోరనివారు –ఉత్తరాయణ మార్గము**న పయనించి, బ్రహ్మలోకమును చేరి శాశ్వతముగా అక్కడనే ఉందురు. తిరిగి జన్మపరంపరలలో చిక్కుకొనరు.

**జ్యోతిర్మార్గము**న పయనించువారు ఆత్మయై విరాజిల్లుదురు.

గుణరహితుడైనవాడు శాంతిని పొంది, బ్రాహ్మీస్థితిని పొంది, దేహత్యాగానంతరము ఆత్మయై విరాజిల్లును.

ఏ మార్గమున పయనించుట మంచిదో పాఠకులే నిర్ణయించుకొనవలసియుండును.

ఇంతవఱకూ చెప్పిన ఈ విషయములే వేదములలో అనగా సంహితలలో, బ్రాహ్మణములలో, ఆరణ్యకములలో, ఉపనిషత్తులలో, అదేవిధముగా రామాయణ, భారత, భాగవతములలో సాంఖ్యాది షడ్దర్శనములలో చెప్పబడినవి. బ్రహ్మత్వము పొందిన గురువులు అర్హులైన శిష్యులకు గురుశిష్య పరంపర న్యాయముగా సృష్ట్యాదినుండి బోధించుచున్నారో విషయము మాత్రము ఒకటే. అదేకోవలో శ్రీకృష్ణుడు గురువుగా ఉండి, అర్జునునకు బోధించినాడు.

వేదపద్ధతిలో రామాయణ, భారత, భాగవతములలో రచియింపబడినవి. కావున వీటిని ఆవిధముగనే చదువుకొనవలయును.

1) ఒకే విషయమునకు సంబంధించిన సమాచారమంతయూ ఒకే ప్రపాఠకములలోగానీ, ఒకే అనువాకములోగానీ ఉండదు. విషయము ఒకే వరుసక్రమములో ఉండదు. అదే కోవలో ఈ సర్గలలో ఒకే విషయమునకు సంబంధించిన సమాచారము అనేక సర్గలలో చెప్పబడినది. ముందు శాస్త్రపాఠముగా, ఆత్మ మొదలైనవి చెప్పి ఆ తర్వాత ఆచరణపాఠముగా కర్మయోగము, సాంఖ్యయోగములు వరుసక్రమంలో వుండవు. అదే కోవలో ఈ సర్గలలో శాస్త్రపాఠము, ఆచరణపాఠములు ఒక వరుసక్రమంలో చెప్పలేదు. వాటిని మనము ఒక వరుసక్రమంలో చెప్పవలసివుండును.

2) వేదము అర్థబాహుళ్యము, భావబాహుళ్యము గలది. అనగా వేదములలో చెప్పిన పదములకు అనేక అర్థములుండును. అదే కోవలో కృపణుడు, కపిధ్వజుడు, వ్యూఢము మొదలైన పదములు ఇందు కనిపించును.

3) వాక్యములోని పదములను విడదీసి కొంత భాగము అర్థమును కలిపి చెప్పవలసివుండును. ఉదాహరణకు సర్వధర్మాన్ పరిత్యజ్య అనగా సర్వధర్మములను పరిత్యజించి అని అర్థముకాక, అపరధర్మములను ప్రారంభంలో పాటించి, ఆరూఢస్థాయిలో పరధర్మములను పాటించి, ప్రకృతిని పరిత్యజించి పరమాత్మను శరణు కోరవలయునని తాత్పర్యము. కొన్ని పదములకు వైదికకోశము చూసి అర్థము చెప్పవలసివుండును.

4) కైవల్య ఉపనిషత్‌లో ఆత్మస్వరూపమును పొందిన అశ్వలాయనుడు అస్మత్ శబ్దము రూపములైన అహమ్, మమ, మయి అను పదములతో ఆత్మగుఱించి చెప్పును. అదేవిధముగా వ్యాసభగవానుడు ఈ సర్గలలో ఆత్మస్వరూపుడైన శ్రీకృష్ణునిపరముగా అస్మత్ శబ్దములైన అహమ్, మమ, మయి అను పదములతో ఆధ్యాత్మికరహస్యములను చెప్పినాడు. కావున, ఆ పదములకు శ్రీకృష్ణుని పరముగా కాక ఆత్మకు సంబంధించిన

అర్థము చెప్పవలయును.

5) వ్యాసభగవానుడు పూర్వీకులచే వాడబడని పదములకు సమానార్థకముగా నూతన పదప్రయోగములు చేసినాడు. ఉదాహరణకు ప్రవృత్తికర్మకు అవ్యవసాయికా బుద్ధియనియు, నివృత్తికర్మకు వ్యవసాయాత్మక బుద్ధియనియు, అటులనే సాంఖ్యమునకు బుద్ధియోగమనియు ఇలా అనేక పదములను ప్రయోగించెను.

6) ఈ సర్గలలో 1) కథాభాగము 2) ఆధ్యాత్మిక విభాగము 3) కథాభాగము, ఆధ్యాత్మిక భాగముల సంధి సమాసములతో శ్లోకములు రచియింపబడినవి. కావున ఆ శ్లోకములు ఏవిభాగమునకు చెందినవో గమనించి ఆవిధముగా అర్థము గ్రహించవలసివుండును. శాస్త్రపాఠము ఒకటికి పదిసార్లు చదివిన చక్కగా అర్థమగును. పూర్వజన్మసంస్కారము గలవారి ఆచరణవలననే అమృతత్వము సాధ్యపడును.

వ్యాసభగవానుడు తన భీష్మపర్వంలో గీతామాహాత్మ్యమును వ్రాయలేదు. వరాహపురాణంలో ఎవరో గీతామాహాత్మ్యము అను పేరిట కొన్ని శ్లోకములను చేర్చినారు. అటులనే ప్రతి సర్గ చివఱ బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే..... మొదలైన వాక్యములు భారతములో లేవు. ఋషిప్రోక్తములుగాని వీటిని ఈ పవిత్ర గ్రంథములో చేర్చలేదు. భారతములో యుద్ధప్రారంభము ఏనాడు జరిగినదో వివరించలేదు. కావున గీతాజయంతి గుఱించి యిందు ప్రస్తావించలేదు.

ప్రతి గ్రంథమునకు ఆ గ్రంథమును చెప్పుటకు, వినుటకు అర్హతలు నిర్ణయింపబడును. అటులనే దీనికి కూడా గురువు ఆత్మదర్శనము చేసినవాడై, గుణరహితుడై యుండవలయును. శిష్యుడు మోక్షార్థియై దీనిని చదివి, ఇందు చెప్పిన విషయములను గ్రహించి ఆచరించువాడై ఉండవలయును. ఊరక చదువువానికంటె చిత్తశుద్ధి కలిగి, ఇందు చెప్పిన విషయములను ఆచరించినవాడు అధికఫలములను పొందును.

...... ❖ ❖ ❖ ......

# భగవాన్ ఉవాచ

(భీష్మపర్వము 25వ అధ్యాయము నుండి

42వ అధ్యాయము వఱకు)



అస్మద్గురు సమారంభాం కృష్ణ సాందీప మధ్యమాం ।
శ్రీ మహాదేవ పర్యంతాం వందే గురు పరంపరాం ॥

## బ్రహ్మవిద్యా సంప్రదాయము

## సిద్ధాశ్రమం

**భగవాన్ ఉవాచ**

ప్రథమ ముద్రణ : జయనామ సం॥ శ్రావణం,
ఆగస్ట్, 2014

ప్రతులు : వేయి (1000)

ప్రతులకు : వ్యవస్థాపకులు :
**సిద్ధాశ్రమము**
ఇ.నెం. 5-3-766,
శాతవాహననగర్, వనస్థలిపురం,
హైద్రాబాద్ - 500 070.
ఫోన్: 040-24240557
www.siddhashramam.org

అక్షరాల కూర్పు : **ఆరవేటి వెంకటసుబ్బయ్య**
Mobile: 98496 92028

ముఖచిత్రం : **జామి శ్రీనివాస్ (పలాస శీను)**

Website &
Public Realtion : Y. VINOD

ముద్రణ : **కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**
ఫోన్: 040-27618261

# బ్రహ్మవిద్యా సంప్రదాయము

## సిద్ధాశ్రమం వారి ప్రచురణలు

వేద సంప్రదాయమును, ఋషుల భావములను యథాతథంగా ఆధ్యాత్మిక ప్రియులకు అందచేయదలచి స్వగృహమును కేంద్రబిందువుగా చేసుకొని **సిద్ధాశ్రమము** నెలకొల్పబడినది. బ్రహ్మవిద్యా సంప్రదాయము ననుసరించి ఈ దిగువ పుస్తకములు ప్రచురింపబడినవి. వీటిని www. siddhashramam.org అను websiteలో పెట్టడమయినది. కావలసినవారు download చేసుకొనవచ్చును.

1. **పూజాపుష్పములు** –సుమారు –300 పేజీలు
   సంస్కృత శ్లోకములలో కీర్తింపబడిన గణపతి, కూమారస్వామి, అయ్యప్ప, శివుడు, అన్నపూర్ణ, రాజరాజేశ్వరి, దేవీఖడ్గమాల, గంగ, లక్ష్మీ, సరస్వతి, శీతల, నారాయణ, సుదర్శన, నారసింహ, శ్రీరామ, శ్రీకృష్ణ, ఆదిత్య, ఆంజనేయ నవగ్రహ, శని, నాగరాజ, ఋణవిమోచన స్తోత్రము, గురుస్తుతి మొదలగు వాటికి సులభమగు తెలుగు అర్థములు వ్రాసి ప్రచురింపబడినది. నేటికి మూడు ముద్రణలు జరిగి భక్తుల ఆదరాభిమానములను పొందినది.

2. **పూజావిధానము** – సుమారు –500 పేజీలు
   పురుష సూక్తము, శ్రీసూక్తము, నమక, చమకములు మంత్ర పుష్పములకు తెలుగు అర్థములు వ్యాఖ్యానము వ్రాయబడినవి. గణపతి పూజ, పురుషసూక్త పూజా విధానము, శ్రీసూక్త పూజా విధానము, రుద్రాభిషేకమలు కొన్ని దేవతల సహస్ర అష్టోత్తరశత నామములతో ఈ పుస్తకము రూపుదిద్దు కొని ప్రచురింప బడినది. ఇప్పటికి రెండు ముద్రణలు జరిగినవి.

3. **భూతనాథోపాఖ్యానము (అయ్యప్ప చరిత్ర)** సుమారు –300 పేజీలు
   సద్గురువులు చెప్పిన ఆధ్యాత్మిక విషయములను దృష్టిలో వుంచుకొని బ్రహ్మవిద్యా సంప్రదాయముగా అయ్యప్ప స్వామి కథకు వేదాంత వివరణ–చరిత్ర–దీక్షా నియమములు–ప్రయాణము–అయ్యప్పస్వామి పూజా విధానముతో ప్రచురింప బడినది. రెండవ ముద్రణలో కొన్ని భజన పాటలు ఫొటోలుచేర్చి ప్రచురింపబడినది.

4. **బ్రహ్మవిద్యా రత్నాకరము** – సుమారు–1300 పేజీలు (రెండు సంపుటములు)
ఇది సుమారు 1300 పేజీలతో రెండు సంపుటములుగా ప్రచురింపబడినది. ఇది సమగ్రముగా బ్రహ్మవిద్యను గుఱించి తెలుపు గ్రంథము. అపరవిద్యగా దేశము, పరిపాలన, వ్యక్తిగత విధులు బాధ్యతలు, పుణ్యకర్మానుష్ఠానము, ఐత్తరేయ ఉపనిషత్, కేన ఉపనిషత్, కఠోపనిషత్, తైత్తిరీయ ఉపనిషత్, ఈశోపనిషత్, ముండక ఉపనిషత్, మాండుక్య ఉపనిషత్, ప్రశ్నోపనిషత్, కైవల్య ఉపనిషత్, పతంజలి యోగ సూత్రములు, నారద భక్తి సూత్రములు, పరవిద్యగా సాధకులు– సాధన రహస్యములతో ప్రచురింపబడినది.

5. **సంధ్యావందనము** – సుమారు 400 పేజీలు
**సంధ్యా వందనము, బ్రహ్మయజ్ఞము – పితృతర్పణము, వైశ్వదేవము, అగ్నిహోత్రము, ఋగ్వేదాంతర్గత సూర్యదేవతాస్తుతు**లతో ఒక పుస్తకము ప్రచురింపబడినది.

6. **భగవానువాచ** – సుమారు 700 పేజీలు
**భగవానువాచ** - అను పేరిట భారతములోని భీష్మపర్వములో 25వ అధ్యాయము నుండి 42వ అధ్యాయము వఱకు **'భగవద్గీత'** అను పేరిట నేడు వాడుకలో ఉన్న దానిని ఆధ్యాత్మికపరముగా భాగవతముతో సమన్వయం చేసి వ్యాఖ్యానించి ప్రచురించడమైనది.

**శుభమగుగాక**



**వేద ధర్మమును ఉద్ధరించండి- ఆచరించండి- ప్రచారం చేయండి.**

# విషయ సూచిక

...... ❖ ❖ ❖ ......

# తొలి పలుకు

**నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।**
**దేవీ సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్ ।।**

ఈ గ్రంథము పేరు **భగవాన్ ఉవాచ.**

సర్వవేదములు పరబ్రహ్మ చతుర్ముఖ బ్రహ్మకు బోధించుటవలన అవి భగవాన్ ఉవాచ అయినవి. భారతములోని భీష్మపర్వంలో 25వ అధ్యాయము నుండి 42వ అధ్యాయము వఱకు చెప్పినవాటిలో శ్రీకృష్ణ ఉవాచ అనిగాక భగవాన్ ఉవాచ అని కలదు. కావున ఈ గ్రంథమునకు **'భగవాన్ ఉవాచ'** అను పేరు నిర్ణయించడమైనది. పైన చెప్పిన అధ్యాయములలో అధ్యాత్మ విషయములు సంక్షిప్తముగా చెప్పబడినవి. కావున వీటిని వేదములలోని ఉపనిషత్తులు, రామాయణ, భారత, భాగవతములద్వారా గ్రహించవలసి ఉండును. అందువలన భగవాన్ ఉవాచలోని శ్లోకములకు ఉపనిషత్తులు, రామాయణాది పురాణములద్వారా విషయములు విశదీకరించబడినవి.

**వేదములు :** వేదములు అపౌరుషేయములు. ఏది తెలిసిన ఈ సర్వమూ తెలియునో అది జ్ఞానము. అట్టి జ్ఞానమును తెలుపునవి వేదములు. వేదము అపరవిద్య, పరవిద్యల సమ్మేళనము అయిన బ్రహ్మవిద్యగా చెప్పినది. ఇహలోక, పరలోకములకు సంబంధించిన సర్వవిషయములు బ్రహ్మవిద్యలో ఉండును. అనగా దేశము ఎలా ఉండాలి? రాజు ఎలా ఉండాలి? రాజ్యపాలన ఎలా ఉండాలి? జాతిధర్మములు, ఆశ్రమధర్మములు ఏమిటి? ధర్మార్థకామములు, వర్ణనలు, ఆత్మ, అధ్యాత్మతత్త్వము, సృష్టి, దేహి, దేహముల విచారణ, జీవుడు ఈశ్వరుడగు సాధన విధానము ఉండును. జీవన సంగ్రామమును దేవ–దానవ–సంగ్రామముగా వర్ణించిరి. అయితే వేదములలో ఒకేచోటగాని, ఒక వరుసక్రమంలోగానీ ఈ విషయములు ఉండవు. వీటిని క్రోడీకరించి ఒక వరుసక్రమంలో చదువవలసి వుండును. వేదము అర్థబాహుళ్యము, భావబాహుళ్యము గలది. కావున వేదములు చదివి, విషయమును గ్రహించుట కష్టము.

కావున ఋషులు వీటిని రామాయణ, భారత, భాగవతములుగా మనకు అందించిరి. వీటిలో కథ అప్రధానము. కథలద్వారా అందించిన సందేశము ప్రధానము. సామాన్యులకు రామాయణములో రాముని కథ, భారతములో కౌరవ-పాండవుల కథ, భాగవతములో ప్రహ్లాదచరిత్ర, వామనచరిత్ర, శ్రీకృష్ణుడు గోపికల కథలు మొదలయిన కథలు ఉండునని భావింతురు. వేదజ్ఞుల దృష్టిలో ఇవి బ్రహ్మవిద్యను బోధించు గ్రంథములు. కావున వీటిని అధ్యయనము చేసి, సాధన చేసిన జీవుడు ఈశ్వరుడగును. అమృతత్త్వమును పొందును.

**రామాయణము:** వాల్మీకిమహర్షి ఆశ్రమమునకు నారదమహర్షి వచ్చి బ్రహ్మవిద్యను రహస్యముగా బోధించినాడు. ఆ తర్వాత బ్రహ్మ వచ్చి నారదోక్త ప్రకారము రామాయణమును రచియించెను. రామాయణము వేదోపబృంహణార్థము రచియింపబడినది. ఆవిధముగా

**సర్వశ్రుతి మనోహరమ్** - వేదసారమును

**ధర్మకామార్థ సహితం** - ధర్మ అర్థ కామములను

**విచిత్రపదమ్** - నానార్థములతో

**నానాచిత్రకథా** - అనేక కథలతో సమాన సంధియోగములతో రామ-అయనమును రచించెను. ఈ సమాససంధులు భాషాపరమైనవి కావు.

**అహో గీతస్య మాధుర్యం శ్లోకానాం చ విశేషతః** (బాలకాండ-4వ సర్గ-17)

శ్లోకములు మాధుర్యముగా ఉన్నవి. విశేషించి గీతయొక్క అర్థము మాధుర్యముగా ఉన్నది. ఈ శ్లోకములో గీత అని, శ్లోకము అని రెండు పదములు ప్రయోగింపబడినవి. కేవలము కథాభాగమును తెలుపునవి **శ్లోకములు**. అటులనే కథాభాగములో వేదాంతార్థమును సంధిచేసి సమాసములతో చెప్పునది **గీత** అని భావము. కావున 'గీత' అను పదమునకు వేదాంతార్థ ప్రతిపాదితమైన **వస్తువు** అని అర్థము.

వేదము చెప్పిన సర్వవిషయములు రామాయణములో కలవు. స్థూలదేహములోని అవయవములను రావణపరివారముగా, సూక్ష్మశరీరములోని అవయవములను దేవతాంశలుగా జన్మించిన వానరులుగా, సత్త్వగుణయుతుడైన జీవుని రామునిగా, రజోగుణయుతుడైన జీవుని రావణునిగా, తమోగుణయుతులైన జీవులను ఇతర రాక్షసులుగా చిత్రీకరించి రాముడు రావణాది రాక్షసులను సంహరించి, శాంతిని పొంది, జీవన్ముక్తుడై బ్రహ్మను దర్శించి, దేహసామ్రాజ్యపట్టాభిషిక్తుడైన విధము, దేహత్యాగానంతరము అనగా సీతాపరిత్యాగానంతరము ఆత్మలో ఏకీభూతుడై, ఆత్మయై విరాజిల్లిన విధము వర్ణింపబడినది.

వేదములో చెప్పిన దేవ-దానవ యుద్ధమునే రామ-రావణ సంగ్రామముగా రామాయణములో వివరింపబడినది. 'రామ' శబ్దమునకు ఆత్మ అని అర్థము. సృష్ట్యాదియందున్న ఆత్మ సృష్టిలో అంతరాత్మగా, విరాట్పురుషునిగా జీవునిగా వచ్చినాడు. ఇది ఆత్మయొక్క ప్రయాణము. కావున **రామ-అయనము** అయినది. ఆత్మస్థానము అనే అయోధ్యనుండి బయలుదేరిన రాముడు అనేక మజిలీలను దాటి రావణసంహారానంతరము తిరిగి అయోధ్య చేరినాడు. ఇది రాముని ప్రయాణము. కావున **రామ - అయనము** అయినది. ఆవిధముగా పైన చెప్పిన సర్వవిషయములను ఇటు కథాభాగము, అటు అధ్యాత్మభావనలను సంధిచేసి, సమాసములతో వాల్మీకిమహర్షి రామాయణమును రచియించినారు. యోగరహస్యములను బాలకాండలో విశ్వామిత్రమహర్షి రామునికి కథలుగా వివరించినారు. అటులనే వివిధ సాధన పద్ధతులను మిగిలిన కాండలలో వివరించినారు. ఈ రామాయణమును రామునికే రాముని సభలో లవకుశులు వినిపించిరి.

ఈ రామాయణమును-

**ధర్మకామార్థసహితం శ్రోతవ్యమనసూయయా** (బాలకాండ - 5వ సర్గ -4)

ధర్మ అర్థ కామములనే పురుషార్థములతో కూడిన ఈ రామాయణమును అసూయాది అసురసంపదలు లేకుండా వినవలయును. విని ఆచరించవలయును. ఆచరించినవాడు ఆత్మయగును. ఇదే రామాయణ ప్రయోజనము.

వాల్మీకిమహర్షి బాటసారులను దోచుకొనే దొంగ /వల్మీకము/పుట్టనుండి పుట్టినట్లు అనిగాని, రామాయణ, భారత, భాగవతములలో లేదు. ఈ అపభ్రంశము లోకములో ప్రచారంలో ఉండుటకు కారణము కలియుగ లక్షణం. అటులనే వాల్మీకి రామాయణంలో చెప్పని అనేక విషయములు లోకములో ప్రచారములో ఉన్నవి. వీటన్నింటికి కారణము కలియుగమే.

**భారత, భాగవతములు -** వ్యాసమహర్షి మొదట భారతమును రచియించి, ఆ తర్వాత భాగవతమును రచియించెను. కాని మొదట అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తునకు శుకబ్రహ్మ భాగవతమును వివరించెను. ఆ తర్వాత పరీక్షిత్తు కుమారుడైన జనమేజయునకు వైశంపాయనుడు జనమేజయుడు చేయుచున్న సర్పయాగ సందర్భమున భారతమును వినిపించెను. అనగా మొదట భాగవతము, ఆ తర్వాత భారతము వ్యాప్తిలోనికి వచ్చినవి.

**భాగవతము -** బ్రహ్మమానసపుత్రుడైన నారదమహర్షిచే ప్రేరేపింపబడి వ్యాసమహర్షి భాగవతమును రచించెను. రామాయణములో వివరించిన సర్వవిషయములు భాగవతములో కలవు. భాగవతము వేదమనే కల్పతరువు నుండి జాఱిపడిన ఫలము. ఈ భాగవతము చదివి -

**"సమస్తంబుఁ గాకయు నయ్యునుండు**
**వస్తు వెఱుఁగంగఁదగు భాగవతమునందు"**

(భాగవతము - ప్రథమస్కంధము - 36)

సమస్తము అయ్యు - అనగా ఈ సర్వస్థావర జంగమములు విరాట్ స్వరూపమే. సమస్తంబు గాకయు - అనగా ఈ సర్వస్థావర జంగమములు ఆత్మ కావు. ఆత్మలో ఈ సర్వజగత్తు ఉండదు. ఈ భాగవతము చదివి సృష్టికారకుడైన విరాట్పురుషుని, సృష్టి ఎలా వచ్చినది గ్రహించి సాధనచే ఆత్మ (వస్తువు)ను తెలియవలయును. ఆవిధముగా ఆత్మను దర్శించిన

**మోక్షకామునకు మోక్షంబు సిద్ధించు**

**భవభయంబులెల్ల బాసిపోవు** (భాగవతము - ద్వితీయస్కంధము - 7)

జననమరణవలయములో తిరుగాడుట అనే భవభయమ్ము తొలగిపోయి, మోక్షార్థికి మోక్షంబు సిద్ధించు. ఉపనిషత్తులలో చెప్పిన విషయములకు ఉదాహరణలుగా అనేక కథలు భాగవతమున చెప్పబడినవి.

భాగవతము - ఏకాదశస్కంధములో శ్రీకృష్ణుడు ఉద్దవునికి చెప్పినది 'ఉద్ధవగీత'గా ప్రచారంలో ఉన్నది.

**భారతము -** వ్యాసభగవానుడు తను రచింపబోవు విషయముల గుఱించి ఆలోచించుచుండగా -

**తత్రాజగామ భగవాన్ బ్రహ్మా లోకగురుః స్వయమ్ ।**

**ప్రీత్యర్థం తస్య చైవర్షేః లోకానాం హితకామ్యయా ॥**

(భారతము - ఆదిపర్వము - ప్రథమాధ్యాయం - 57)

సర్వలోకములకు హితంబు చేయు తలంపుతో సర్వలోకములకు గురువు, ప్రభువు భగవంతుడు అయిన బ్రహ్మ వ్యాసమహర్షికి సంతోషము కలుగజేయుటకు స్వయముగా వచ్చెను. వ్యాసమహర్షి తన ఆలోచనలు బ్రహ్మకు విన్నవించగా ఈ గ్రంథమును వ్రాయుటకు గణపతిని ప్రార్థింపమని చెప్పి బ్రహ్మ తన లోకమునకు వెళ్లెను. వ్యాసమహర్షి తన గ్రంథము వ్రాయుటకు గణపతిని ప్రార్థింపగా గణపతి వచ్చి వ్యాసభగవానుడు చెప్పు శ్లోకములు వ్రాసెను.

**వేదైశ్చతుర్భిః సంయుక్తం - వేదరహస్యం - వేదార్థైర్భూషితం ।**

**సాంగోప నిషధాం - సూక్ష్మార్థ న్యాయయుక్తం ॥**

**విచిత్రపద పర్వణః - విచిత్రార్థాః - గ్రంథ గ్రంథి ॥**

(భారతం - ఆదిపర్వము)

అనగా భారతము నాలుగు వేదముల సారము. విచిత్రపదములు అనగా నానార్థములతో కూడి గ్రంథ గ్రంథి అనగా సంధిసమాసములతో రచియింపబడినది.

**అష్టౌశ్లోకసహస్రాణి అష్టౌ శ్లోక శతాని చ ।**
**అహం వేద్మి శుకో వేత్తి సంజయో వేత్తి వా న వా ॥**

(ఆదిపర్వం – ప్రథమాధ్యాయం – 81)

8,800 శ్లోకములు, గ్రంథగ్రంథితో చెప్పబడినవి. అనగా కథాభాగమును వేదాంతార్థముతో సంధి చేసి సమాసములతో చెప్పబడినవి. ఇందలి గూఢార్థములు శుకబ్రహ్మకు తెలుసు. వైశంపాయనునికి తెలుసు. సూతమహర్షినైన నాకు తెలుసు. సంజయునికి తెలుసునో, తెలియదో తెలియదు. ఈ భారతము కేవలము కథాభాగము అటులనే కథాభాగములతో అపరవిద్య, పరవిద్యల సమ్మేళనముతో రచియింపబడినది. కావున సంజయునికి తెలుసునో, తెలియదో అని అంటే మిగిలినవారి గుఱించి ఏమి చెప్పాలి?

భారతములో ఆది, సభా, వన, విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ, శాంతి, అనుశాసనిక, అశ్వమేథ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థాన, స్వర్గారోహణ అనే పదునెనిమిది (18) పర్వములు కలవు.

వేదములోగల సర్వవిషయములు భారతములో కలవు. అనగా వర్ణనలు, దేశము, రాజు, రాజ్యపాలన, చాతుర్వర్ణములు, పౌరులు, జాతిధర్మములు, ఆశ్రమ ధర్మములు, లోకాచారములు, ధర్మార్థకామములు, పుణ్యకర్మానుష్ఠానము, యోగము, భక్తి అనే కర్మయోగము, సాంఖ్యమైన జ్ఞానయోగము అటులనే ఆత్మ, అధ్యాత్మము, విరాట్, సృష్టి, జీవుడు, జీవుడు ఆత్మస్వరూపుడగు విధము మొదలైన విషయములు వర్ణింపబడినవి. అటులనే భారతములో–

ఉతథ్యగీత – వాసుదేవగీత – ఋషభగీత – షడ్జగీత – శంపాన గీత – మంకిగీత – బోధ్యగీత – హారీతగీత – వృత్రగీత – పరాశరగీత – హంసగీత – మొదలైన గీతలు శాంతిపర్వంలో కలవు. అటులనే భీష్మపర్వంలోగల గీత కలదు. (భాగవతములో ఉద్ధవ గీత కలదు.) ఇవిగాక వసిష్ఠగీత మొదలైనవి అనేక గీతలు కలవు.

భారతములో రామాయణము కలదు. ఇక్ష్వాకువంశ రాజుల చరిత్రలు, షోడశ మహారాజులు, ఇతర రాజుల గురించి వర్ణింపబడినది.

గ్రంథగ్రంథికి ఉదాహరణగా – ద్రుపదుని జన్మవృత్తాంతము అతని కుమారుడైన ధృష్టద్యుమ్నుడు, ద్రౌపదుల జన్మవృత్తాంతము, శిఖండి జన్మవృత్తాంతము, కౌరవ పాండవులు, ఇతర రాజుల పుట్టుక వర్ణింపబడినది. అటులనే బ్రాహ్మణులైన కృపాచార్యుల జన్మవృత్తాంతము, ద్రోణాచార్యుని జన్మవృత్తాంతము, అశ్వత్థామ జన్మవృత్తాంతము వివరింపబడినది. వీరందరూ దేవ, దానవ అంశలతో జన్మించినవారు. వేదములో చెప్పిన దేవ, దానవ యుద్ధమనే పాండవ, కౌరవుల యుద్ధముగా వర్ణించిరి.

**ఇదం తు త్రిషు లోకేషు మహత్ జ్ఞానం ప్రతిష్ఠితమ్ ।**

(ఆదిపర్వం – ప్రథమాధ్యాయం – 27)

భారతములో త్రిలోకములందుగల గొప్ప జ్ఞానము ప్రతిష్ఠితమై ఉన్నది.

**ఇదం హి వేదైః సమితం పవిత్రమపి చోత్తరమ్ ।**

**ధన్యం యశస్యమాయుష్యం శ్రోతవ్యం నియతాత్మభిః ॥**

(ఆదిపర్వం – 95వ అధ్యాయం – 90)

ఈ భారతం వేదసంహితము. పవిత్రమైనది. ధన్యమైనది. యశస్సును కలిగించునది. ఆయువును వృద్ధి చేయునది. అసురసంపదయైన అసూయాది దుర్గుణములు లేకుండా దైవీసంపద కలిగిన నియతాత్మలచే వినదగినది.

**సర్వపాపైః ప్రముచ్యతే –** ఈ భారతమును విని యిందు చెప్పిన విషయములను ఆచరించినవారు సర్వపాపముల నుండి అనగా కర్మబంధములనుండి విడివడుదురు. ఆత్మయై విరాజిల్లుదురు.

భారతములోగల పదునెనిమిది పర్వములలో ఒకటైన **భీష్మపర్వము** – ఇందు వ్యాసమహర్షి ఆగమనము చెప్పబడినది. వ్యాసభగవానుడు అశుభశకునములు

కనబడుచున్నవని, రాజులందరూ నశించిపోవుదురని చెప్పి, సంజయునికి యుద్ధరంగమున తిరిగిననూ అస్త్రములు, శస్త్రములు ఏమియూ చేయజాలనట్లు, వారి సంభాషణలు వినునట్లు, వరమొసగి వెళ్ళిపోయెను. ధృతరాష్ట్రుడు అడుగగా సంజయుడు సప్తద్వీపములను వర్ణించెను. భీష్ముడు పదిదినములు యుద్ధము చేసి శరతల్పగతుడైనాడని చెప్పి, ప్రథమ దివస యుద్ధమునకు ముందు 25వ అధ్యాయమునుండి 42వ అధ్యాయము వఱకు దుర్యోధనుడు ద్రోణాచార్యునితో పలికిన పలుకులు – శ్రీకృష్ణార్జున సంవాదము చెప్పెను. ఇదే శ్రీమద్భగవద్గీత పేరున లోకములో ప్రచారములో ఉన్నది. భీష్మపర్వం 43వ అధ్యాయములో 1 నుండి 3 శ్లోకములలో గీత విశిష్టత చెప్పబడినది. వ్యాసభగవానుడు భారతమును గ్రంథ గ్రంథిగా చెప్పుదునని చెప్పుటవలన ఇందలి విషయములను అటు కథాభాగముగా, ఇటు ఆధ్యాత్మిక విభాగముగా చదువవలసి వుండును.

**సంగ్రామములు రెండు రకములు –** 1) సామ్రాజ్యమునకై చతురంగ బలములతో అతిరథ, మహారథ, వీరులతో శత్రువులపై దాడిచేసి, శత్రువును సంహరించి ఇహలోకమున సామ్రాజ్యమును పొంది, భోగభాగ్యములతో సుఖించుట. ఈ యుద్ధము గుఱించి అర్జునుడు శ్రీకృష్ణుని కొన్ని ప్రశ్నలు వేసినాడు. ఇది కథాభాగము. 2) మోక్షార్థి జీవనసంగ్రామములో అరిషడ్వర్గములనే శత్రువులను, సుఖదుఃఖములనే శత్రువులను, అవిద్య అనే శత్రువును, అంతఃకరణ చతుష్టయము, ఇంద్రియములు అనే సైన్యముతో కర్మయోగము, జ్ఞానయోగము అనే వ్యూహములద్వారా సంహరించి శాంతిని పొంది, దేహసామ్రాజ్య పట్టాభిషిక్తుడై పరలోకమున ఆత్మయై విరాజిల్లి సుఖించుట. ఇది అధ్యాత్మిక విభాగమునకు సంబంధించినది. ఈ విషయము గుఱించి అర్జునుడు అడుగగా భగవానుడు వివరించెను. ఇది 'భగవాన్ ఉవాచ'. ఈ రెండు సంగ్రామములను భీష్మపర్వము 25వ అధ్యాయమునుండి 42వ అధ్యాయము వఱకు వర్ణింపబడినది. ప్రధానముగా అధ్యాత్మవిభాగము వివరింపబడినది.

25వ అధ్యాయము నుండి 42వ అధ్యాయము వఱకుగల అధ్యాత్మ విషయములు

1) బ్రహ్మవిద్య – బ్రహ్మవిద్యయొక్క విశిష్టత. దీనిని ఎవరికి చెప్పాలి.

2) శాస్త్రపాఠము – ఆత్మ, అంతరాత్మ, ఆదిపురుషుడు, ప్రకృతిపురుషుల సమిష్టియైన విరాట్పురుషుడు దేహి, ప్రకృతి, గుణములు, దేహము.

ఆచరణ పాఠము – కర్మయోగముగా పుణ్యకర్మ, యోగము, భక్తి, అటులనే జ్ఞానయోగముగా సాంఖ్యము. అటులనే దేహము వదలిన తర్వాత జీవుడు పయనించు మార్గములు, ఆత్మస్థానమును పొంది ఆత్మయై విరాజిల్లు విధము వర్ణింపబడినది.

కైవల్యోపనిషత్‌లో – ఆత్మస్వరూపమును పొంది అశ్వలాయనుడు **అస్మత్** శబ్దరూపములైన **అహం, మమ, మయి** అనే పదములతో ఆత్మగుఱించి చెప్పును. అదేవిధముగా ఆత్మస్వరూపుడైన శ్రీకృష్ణుడు అహం, మమ, మయి అనే పదములతో విషయమును బోధించును. కావున ఆ పదములకు శ్రీకృష్ణునిపరముగా గాక ఆత్మ, విరాట్పురుషుడు మొదలైన అర్థములు చెప్పబడినవి.

1) ఈ అనువాదములో ఋషిప్రోక్తముగాని విషయములు వదలబడినవి.

2) ఒకే విషయమునకు సంబంధించిన శ్లోకములను ఒకచోట చేర్చి వాటికి భావమునననుసరించి అనువాదము చేసి, ఆ అనువాదమునకు పరిపుష్టిగా రామాయణ, భాగవతములలోని కథలు, ఉపనిషత్తులలో శ్లోకములు సందర్భానుసారము ఉదహరింపబడినవి.

3) గ్రంథ గ్రంథిగా ఉన్న శ్లోకములకు ఈ శ్లోకములు సంధి, సమాసములతో కూడివున్నవని చెప్పబడినది.

ఈ 'భగవాన్ ఉవాచ' (గీత)ను చదివి, అర్థమును గ్రహించి, ఆచరించినవాడు ఆత్మయై విరాజిల్లును. పూర్వజన్మసంస్కారము గలవానికే ఆచరణ సాధ్యపడును.

**ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత ।**

**క్షురస్యధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదంతి ॥**

(కఠోపనిషత్ – తృతీయవల్లీ – 14)

ఓం తత్ సత్

॥ సర్వేజనా స్సుఖినోభవంతు ॥

...... ❖ ❖ ❖ ......

# భీష్మపర్వము 25వ అధ్యాయము

### (అర్జున విషాదయోగము)

## సమీక్ష

ఈ అధ్యాయములో 47 శ్లోకములు గలవు. సంధిసమాసములతో ఇటు కథాభాగము, అటు అధ్యాత్మ విభాగము ఈ అధ్యాయములో చెప్పబడినవి. సంగ్రామములు రెండు రకములు. కత్తులతో, ఆయుధములతో చేయునది ఒక రకము. రెండవది జీవనసంగ్రామము. ఆవిధముగా సంగ్రామమును సంధిచేసి ఇటు కథాభాగమును, అటు ఆధ్యాత్మవిభాగమును వ్యాసభగవానుడు చెప్పినారు.

**కథావిభాగము:** భారతము భీష్మపర్వములో త్రికాలవేదియైన వ్యాసభగవానుడు ధృతరాష్ట్రునివద్దకు వచ్చి ఆయువు తీఱిపోయిన రాజులందఱు ఈ యుద్ధములో పాల్గొనుచున్నారని, దీనికి బాధపడకుమని చెప్పి, ఈ యుద్ధమును ప్రత్యక్షముగా చూడదలచిన దివ్యదృష్టిని ప్రసాదింతునని పలికెను. అంత ధృతరాష్ట్రుడు ఈ యుద్ధమును ప్రత్యక్షముగా చూడలేనుగాని, వినగలను కావున నాకు యుద్ధవిశేషములు చెప్పువానిని నియమించుమని కోరెను. ఆ మాటలు విన్న వ్యాసభగవానుడు సంజయునిని ధృతరాష్ట్రునికి యుద్ధవార్తలు చెప్పువానిగా నియమించి సంజయునకు యుద్ధరంగమున తిరిగిననూ అస్త్ర, శస్త్రములు ఏమియూ చేయజాలవనియూ, ఇతరుల మనోభావములు గ్రహించుట మఱియు ఇతరుల మాటలు వినునట్టి శక్తిని ప్రసాదించి వ్యాసభగవానుడు కురుపాండవుల కీర్తిని ప్రకటింతునని చెప్పి తిరిగి వెళ్ళిపోయెను.

ఆ తరువాత ధృతరాష్ట్రుడు సంజయునిని భూమి గుఱించి చెప్పుమనగా, సంజయుడు జంబూద్వీపము మొదలైన సప్తద్వీపమును, అందలి వర్షములు గుఱించి చెప్పెను. భారతవర్షము భూమి అనగా శరీరము కావున శరీరము గుఱించి చెప్పి, దేహమును జయించు విధానముగా భీష్మపర్వము నుండి సౌప్తికపర్వము వఱకు ఇటు కథాభాగమును, అటు అధ్యాత్మవిభాగమును సంధి, సమాసములతో వివరించెను. సాధకుడు ఆత్మయై విరాజిల్లు విధానము భారతములో చెప్పబడినది.

సంధి అనగా ఇటు కథాభాగమును, అటు అధ్యాత్మిక విభాగమును మేళవించి ఒకే శ్లోకములో చెప్పుట (శ్లేష అనగా ఒక పదమునకు గల రెండు అర్థములు) సమాసమనగా ఆధ్యాత్మిక విషయములకు సంబంధించిన విషయములను ఇతర గ్రంథములనుండి గ్రహించుట.

భీష్ముడు పది దినములు యుద్ధము చేసి చివరకు శరతల్పగతుడైనని చెప్పగా ధృతరాష్ట్రుడు సంజయునిని కురుక్షేత్రమున ఈ పదిదినములు కౌరవపాండవులు ఎట్లు యుద్ధము చేసిరని అడిగెను?

ఆ ప్రశ్నకు సమాధానముగా ప్రథమ దివస యుద్ధమునాటి సంగతులను సంజయుడు చెప్పసాగెను.

దుర్యోధనుడు ద్రోణాచార్యుని సమీపించి పాండవుల వ్యూహమును చూడుడని, పాండవ సేనలోగల **17** మంది ప్రముఖులను పేర్కొని వీరు భీమార్జునులతో సమానులని, అందఱూ మహారథులని చెప్పి కౌరవపక్షమునగల**ఏడుగురు**ప్రముఖులనే పేర్కొనినాడు. కౌరవపక్షములోని వారెవరికీ మహారథులు అనే పదప్రయోగము చేయలేదు. సర్వులూ భీష్మునిని రక్షించండి అని చెప్పెను.

యుద్ధప్రారంభ చిహ్నముగా భీష్ముడు తన శంఖమును ఊదెను. ఆ తర్వాత కౌరవపక్షమున శంఖములు, యుద్ధభేరులు మ్రోగింపబడినవి. ఆ తర్వాత శ్రీకృష్ణుడు, పంచపాండవులు వారివారి శంఖములను ఊదిరి. అటులనే పాండవపక్షమునందలి ప్రముఖులు కూడా వారివారి శంఖములను ఊదిరి.

ఆ తర్వాత అర్జునుడు కౌరవపాండవపక్షమునగల వీరులను చూడగోరి తన రథమును ఉభయ సేనలమధ్యలో నిలుపమని చెప్పగా శ్రీకృష్ణుడు అర్జునుడు చెప్పినట్లు చేసెను. అంత అర్జునుడు యుద్ధసమయమున కొన్ని అపశకునములు కనబడుచున్నవనియూ, గాండీవము చేతినుండి జాఱిపోవుచున్నదనియు చెప్పి, ఇరుపక్షమునగల వీరులను చూచి బంధుమరణము జరగబోవునని దుఃఖాక్రాంతు డయ్యెను. ఈ స్థితిలో కొన్ని పాపములను పేర్కొని తను యుద్ధము చేయనని చెప్పి ధనుర్బాణములను విడిచి రథముపై చతికిలపడెను.

**అధ్యాత్మిక విభాగము :** జీవలక్షణములకు ప్రతినిధిగా ధృతరాష్ట్రుని తీసుకొనినారు. క్షేత్రమనగా దేహము. ఇది ధర్మక్షేత్రము. దేహములోని ప్రతి అవయవమునకు కొన్ని ధర్మములు కలవు. అటులనే ప్రతి అవయవము కొన్ని పనులను చేయును. కావున ఇది కురుక్షేత్రము.

మాండుక్యోపనిషత్తుకు కౌరవ, పాండవ సేనలోని ప్రముఖులు వ్యాఖ్యానముగా చెప్పబడిరి. వ్యూథ శబ్దమును దేహమునకు సమిష్టిగా గ్రహించినారు. అటులనే వ్యష్టిగా స్థూలదేహము, సూక్ష్మదేహముల విచారణను, కౌరవసేన, పాండవసేన ప్రముఖులు వివరింపబడిరి.

బాహ్యశబ్దము ఆధ్యాత్మిక విభాగములో నిరుపయోగము. అందువలన భీష్మాదుల శంఖములపేర్లను పేర్కొనలేదు. అనేక ఉపనిషత్తులలో చెప్పిన ఓంకారశబ్ద ఫలితమునకు శ్రీకృష్ణుని, పాండవుల శంఖముల పేర్లుగా చెప్పబడినవి. ఈ ఓంకారమువలన హృదయగ్రంథి విభేదన జరుగును. కావున పాండవుల శంఖముల ధ్వనివలన కౌరవుల హృదయములు బ్రద్దలైనవని ఉత్ప్రేక్ష చేయబడినది.

కఠోపనిషత్తుకు ఉపబృంహణముగా అర్జునుని రథము, రథికుడు, సారథులు వివరింపబడిరి. అర్జునుని పరముగా జీవులకు బంధువులయెడల గల మోహలక్షణములు వివరింపబడినవి. అటులనే యోగములో కలుగు లక్షణములను అర్జునునిపరముగా వర్ణింపబడినవి.

అర్జునుని పరముగా కొన్ని అపరధర్మములు చెప్పబడినవి.

మాండుక్య ఉపనిషత్తులో జీవుడు బంధములను తొలగించుకోగల సమర్థుడయ్యు సంసారములో మునిగి చేతగానివలె సంసారములో చతికిలబడుచున్నాడని పేర్కొనబడినది. దీనినే అర్జునుడు రథముపై చతికిలబడుటగా చెప్పబడినది.



ఓం శ్రీగురుభ్యో నమః

**ధృతరాష్ట్ర ఉవాచ :** ధృతరాష్ట్రుడు యుద్ధము గుఱించి సంజయుని అడిగెను.

**ధర్మ క్షేత్రే కురుక్షేత్రే । సమవేతా యుయుత్సవః ।**
**మామకాః పాండవాశ్చైవ । కిమకుర్వత సంజయ ॥ 1**

ధర్మక్షేత్రే – కురుక్షేత్రే – సమవేతాః – యుయుత్సవః
మామకాః – పాండవాః – చ – ఏవ – కిమ్ – అకుర్వత – సంజయ.

| | | |
|---|---|---|
| సంజయ | = | ఓ సంజయుడా! |
| ధర్మక్షేత్రే+కురుక్షేత్రే<br>యుయుత్సవః+<br>సమవేతాః+మామకాః+<br>పాండవాః+ఏవ | = | ధర్మక్షేత్రము మఱియు కురుక్షేత్రము అయిన ప్రదేశమునందు యుద్ధము చేయుటకు వచ్చి అక్కడ చేరియున్న నా వారలయిన దుర్యోధనాదులు అనగా కౌరవులు మఱియు పాండవులు |
| చ+కిమ్+అకుర్వత | = | మఱియు (కౌరవ పక్షమున పోరుసల్ప వచ్చిన రాజులు, అటులనే పాండవ పక్షమున యుద్ధము చేయవచ్చిన యాదవులు, ఇతర రాజులు) ఎట్లు (ఈ పది దినములు యుద్ధము)చేసిరి |

ఈ ప్రశ్న తర్వాత ధృతరాష్ట్రుడు సంజయుని యుద్ధము గుఱించి భీష్మపర్వములో అనేక ప్రశ్నలు వేసెను.

**వ్యాఖ్యానము :-**

**కథా భాగము :**

వ్యాస భగవానుని అనుగ్రహము పొందిన సంజయుడు ధృతరాష్ట్రుని పంపున యుద్ధ భూమికి వెళ్ళి 10వ నాటి రాత్రి యుద్ధభూమి నుండి వచ్చి భీష్ముడు యుద్ధములో శరతల్పగతుడైనాడని చెప్పినాడు. ఆ మాట విని ధృతరాష్ట్రుడు విలపించి తేరుకొని ఈ పది దినములలో జరిగిన యుద్ధము గుఱించి చెప్పుమని సంజయుని అడిగెను. అంత సంజయుడు ప్రథమ దివస యుద్ధ ప్రారంభ విషయములు ఇట్లు చెప్పసాగెను.

**ఆధ్యాత్మ భాగము :**

**ధృతరాష్ట్రుడు - అతని గ్రుడ్డితనము :**

ఒక వ్యక్తి ప్రపంచములో గల సర్వ బాహ్య దృశ్యములను బాహ్య చక్షువులతో వీక్షించగలిగియు, వాటియందు అంతరాత్మగా ఉన్న ఆత్మనుగాని, తన శరీరములో హృదయ గుహలో గల స్వయం జ్యోతిగా ఉన్న ఆత్మనుగాని, సృష్ట్యాదియందుగల ఆత్మనుగాని చూడలేక ఉన్నాడు. ఇలా ఆత్మను దర్శించ లేకపోవుటయే గ్రుడ్డితనము. **<u>జీవునికి గ్రుడ్డితనము పుట్టుకతోడనే వచ్చును.</u>** కావున ధృతరాష్ట్రుడు పుట్టు గ్రుడ్డి. ఇట్టి గ్రుడ్డివాళ్ళకు ప్రతినిధి ధృతరాష్ట్రుడు. అనగా ఆత్మ దర్శనము చేయని సామాన్య జీవులందఱికి ప్రతినిధి ధృతరాష్ట్రుడు. ఆత్మదర్శనము చేయని ప్రతివారూ గ్రుడ్డివారే.

ధృత - రాష్ట్రః అనగా ధరియింపబడిన దేహముగలవాడు అని అర్థము. రాష్ట్రము లేక సామ్రాజ్యము అనగా దేహము అని అర్థము. ఈ దేహము జీవుని పూర్వ పుణ్యవిశేషమువలన లభ్యమగును. ఈ దేహముపై ఆధిపత్యము కలిగియుండుటనే **సామ్రాజ్య పట్టాభిషేకమ**ని చెప్పుదురు.

**దేహము - దేహి - ఆత్మల సమిష్టి రూపము ప్రాణి.**

దేహము యొక్క లక్షణములు వేఱు. దేహియొక్క లక్షణములు వేఱు. దేహములో గల ఆత్మ లక్షణములు వేఱు.

ఇటుల ఈ మూడును భిన్న లక్షణములు గలిగి ఉన్నవి. అయినను అవిద్యవలన జీవుడు తనే దేహము అని భావించును. జీవుడు దేహముతో మమేకము అగును.

**సామాన్య జీవ లక్షణము - సంసారియొక్క జీవ లక్షణము** జీవునికి దేహ ధ్యాస కలగగానే, అనగా పుట్టిన వెంటనే ఆకలి-దప్పులు గలుగును. అవిద్యవలన నేను-నాది అను మోహము, తను ఇతరులు అను ద్వంద్వ భావన; అహంకార - మమకారములు; రాగము- ద్వేషము; కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే రజోగుణ తమోగుణ సంబంధములైన అరిషడ్వర్గములు; ధనేషణ, దారేషణ, పుత్రేషణ అనే ఈషణ త్రయములు. ఇవి అన్నియు గలుగును. అంత జీవుడు సంసార

తాపత్రయములలో చిక్కుకొనును. మమతాస్పదంబులు మఱియు చంచలములైన పుత్ర, మిత్ర, కళత్ర, పశు, భృత్య, బల, బంధు, రాజ్య, కోశ, మణి, మందిర, మంత్ర, మాతంగ, మహీ ప్రముఖ విభవంబులందు తగులుకొని నిజ కుటుంబ పారవశ్యమున సర్వాత్మకుండయిన ఈశ్వరునుని దర్శించలేక ఉన్నాడు.

**దేహవిచారణ - క్షేత్రము :**

**క్షీయత ఇతి క్షేత్రం. క్షినివాస గత్యోః.** పొందబడునది. జీవుని పూర్వజన్మ కర్మానుసారము పొందబడునది శరీరము. కావున క్షేత్రము అనగా దేహము. ఈ క్షేత్రము అనే దేహము, దేహియొక్క పూర్వజన్మ కర్మ వలన సంప్రాప్తమయినది. స్థూలదేహమునకే స్త్రీ పురుష లక్షణములుండును. దేహికి స్త్రీ పురుష లక్షణములు ఉండవు. కావున మోక్ష సామ్రాజ్యమును పొందు విధి విధానమునకు స్త్రీ పురుషులు అందఱు అర్హులే. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు అందఱు అర్హులే. అయితే ఈ అర్హత జాతిని బట్టి గాక, గుణముబట్టి, కర్మ బట్టి ఉండును. గుణ రహితుడు అయిన వాడే ఆత్మ స్థానమును చేరుటకు అర్హుడు.

అపరా ప్రకృతివలన దేహము ఏర్పడును. ఈ దేహము మరల స్థూల దేహమని, సూక్ష్మ దేహమని రెండు విభాగములు.

**ధర్మక్షేత్రము - కురుక్షేత్రము :** బాహ్యదృష్టితో చూసిన కురుక్షేత్రము భారతదేశములోగల ఒక పుణ్యప్రదేశము. ఆధ్యాత్మిక దృష్టితో చూసిన స్థూల దేహములోని ఇంద్రియములు, ప్రాణము, అంతఃకరణ చతుష్టయములకు ఒక్కొక్క దానికి ఒకొక్క ధర్మము గలదు. అనగా ఒక్కొక్కటి ఒక్కొక్క పని చేయును. కావున ఇది **ధర్మ క్షేత్రము.**

ఈ దేహమును ఉపకరణముగా చేసుకొని దేహి కర్మలను ఆచరించును. జన్మ రాహిత్యమునకు నిష్కామ కర్మాచరణ చేయుము అన్నది ఉపదేశము. కావున ఇది **కురుక్షేత్రము**

**ధర్మ క్షేత్రము, కురుక్షేత్రము అనగా** ఈ దేహము.

ఈ దేహములోని స్థూల దేహమును కౌరవులుగా, సూక్ష్మ దేహమును పాండవులుగా వర్ణించి ఆత్మస్థానమును చేరు విధివిధానములను భారతములో వ్యాసభగవానుడు వివరించినారు. సర్వమానవదేహములు ధర్మక్షేత్రములు, కురుక్షేత్రములే.

దేహ ధ్యాసవలన జీవునికి తను, ఇతరులు అనే ద్వంద భావన గలిగినది. అందువలన మామకాః, పాండవాః అని పేర్కొనినాడు. తను, తన వాళ్లు అనే భావనయే మోహము. ఈ మోహలత జీవుని పెనవేసుకొని, సంసారములో బంధించుచున్నది. ఈ శ్లోకములో దేహ విచారణకు బీజం పడినది.

...... ❖ ❖ ❖ ......

**సంజయ ఉవాచ :** దుర్యోధనుడు ద్రోణాచార్యులతో పాండవుల వ్యూహమును, సేనను చూడుడని పలికిన విషయమును సంజయుడు చెప్పుచున్నాడు.

**దృష్ట్వా తు పాండవానీకం । వ్యూఢం దుర్యోధనస్తదా ।**
**ఆచార్యముపసంగమ్య । రాజా వచనమబ్రవీత్ ॥ 2**

దృష్ట్వా – తు – పాండవ అనీకమ్ – వ్యూఢమ్ – దుర్యోధనః – తదా
ఆచార్యమ్ – ఉపసంగమ్య – రాజా – వచనమ్ – అబ్రవీత్ ॥

**పశ్యైతాం పాండు పుత్రాణా మాచార్య మహతీం చమూమ్ ।**
**వ్యూఢాం దృపద పుత్రేణ । తవ శిష్యేణ ధీమతా ॥ 3**

పశ్య – ఏతామ్ – పాండు పుత్రాణామ్ – ఆచార్య – మహతీమ్ –
చమూమ్ – వ్యూఢామ్ – దృపద పుత్రేణ – తవ – శిష్యేణ – ధీమతా.

| | |
|---|---|
| తదా+రాజా+ | అప్పుడు అనగా యుద్ధ ప్రారంభమునకు ముందు |
| దుర్యోధనః+ | మానవ వ్యూహముగా కౌరవ సేన, అచల |
| పాండవ అనీకమ్+ | వ్యూహముగా పాండవ సేన నిలబడి యున్నప్పుడు |

| | | |
|---|---|---|
| వ్యూఢమ్+దృష్ట్వా+తు | | రాజు అయిన దుర్యోధనుడు (రాజు ధృతరాష్ట్రుడే. దుర్యోధనుడు రాజ్య పట్టాభిషక్తుడు కాలేదు. అయినను రాజువలె ప్రవర్తించినాడు.) పాండవుల యొక్క సేనను అచల వ్యూహంగా నిలబడినవారి వ్యూహమును మొదట చూచి మానవ వ్యూహముగా నిలబెట్టబడిన తన సైన్యమును చూచి యుద్ధ ప్రారంభమునకు ముందు |
| ఆచార్యమ్+ ఉప సంగమ్య+వచనమ్+ అబ్రవీత్ | = | గురువగు ద్రోణాచార్యుని మిక్కిలి దగ్గరగా సమీపించి ఇట్లు పలికెను |
| ఆచార్య | = | ఓ ద్రోణాచార్యా! |
| ధీమతా+తవ+శిష్యేణ+ దృపద పుత్రేణ | = | బుద్ధిమంతుడైన **ధర్మరాజు**చేతను మీ శిష్యుడైన అర్జునుని చేతను, దృపద పుత్రుడైన ధృష్టద్యుమ్నుని చేతను నిర్మింపబడిన |
| పాండు పుత్రాణామ్+ వ్యూఢామ్+ఏతామ్+ మహతీమ్+చ మూమ్+ పశ్య | = | పాండుపుత్రుల యొక్క అచల వ్యూహమును, అచల వ్యూహములో నిలబెట్టబడిన ఈ పాండవుల గొప్ప సేనను పరికించండి |

**వ్యాఖ్యానము:-** సంజయుడు గత పది దినముల యుద్ధ విశేషములు చెప్పుటకు ప్రారంభించి మొదటి దినము యుద్ధ ప్రారంభమునకు ముందు కౌరవ పాండవులు మాట్లాడిన విషయములను చెప్పుచున్నాడు. యుద్ధ ప్రారంభమునకు ముందు కౌరవులవైపు దుర్యోధనుడు, పాండవులవైపు అర్జునుడు మాట్లాడినారని వారు మాట్లాడిన విషయములను భూతకాలముగా చెప్పుచున్నాడు.

**కథాభాగంగా** కౌరవ సేనలోని వీరులను గుఱించి, పాండవ సేనలోని వీరులను గుఱించి, ఉద్యోగ పర్వములో భీష్ముడు, అందఱి సమక్షమున వివరించినాడు. అటులనే యుద్ధ ప్రారంభమునకు ముందు దుర్యోధనుడు రాజులందఱి సమక్షమున

దుశ్శాసనునితో భీష్మునిని శిఖండి బారిన పడకుండా జాగ్రత్తగా కాపాడుకోవలసినదని చెప్పినాడు.

ఉద్యోగ పర్వములో భీష్ముడు ఇరు పక్షమున గల వీరులలో అతిరథులు, మహారథులు, సమరథులు, అర్ధరథులుగా విభజించి చెప్పినాడు. మరల ఈ యుద్ధ రంగమున భీష్ముని విభజనకు విరుద్ధముగా స్వపక్ష, పరపక్ష వీరుల గుఱించి ప్రస్తావించుటవలన కలుగు ప్రయోజనము ఏమి?

ఈ విధముగ ప్రశ్నించుకొని ఆలోచించిన ఈ విభజన కథా భాగమునకు భిన్నమైన ఆధ్యాత్మిక భావనను వ్యాసభగవానుడు గూఢముగా మనకు చెప్పుచున్నాడని అర్థమగును.

భీష్ముని మరణకారకుడు శిఖండి. ఇతడు పాండవ పక్షమున ఉన్నాడు. ద్రోణుని మరణ కారకుడు ధృష్టద్యుమ్నుడు. ఇతడు కూడా పాండవ పక్షమున ఉన్నాడు. ధృష్టద్యుమ్నుడు ద్రౌపదితో బాటు అగ్నిలోనుంచి ఉద్భవించినాడు. ధృష్టద్యుమ్నుడు తనకు మరణ కారకుడనే విషయం ద్రోణునికి, మిగిలిన వారికి కూడా తెలుసు. కౌరవ పాండవ సేనలోని ప్రముఖుల గుఱించి, దుర్యోధనుడు చెప్పిన దానికి ద్రోణుని ప్రతిస్పందన లేదు. ఆవిధముగా వ్యాస భగవానుడు యిక్కడ తను కథాభాగముగాను, ఆధ్యాత్మ వివరణగాను సంధిగా చెప్పుచున్నానని మనకు చెప్పినాడు.

ధర్మరాజు అర్జునునితో కౌరవ వ్యూహానికి దీటుగా గొప్ప వ్యూహమును పన్నమని చెప్పినాడు. అంత అర్జునుడు ధృష్టద్యుమ్నునితో అచల వ్యూహమును ఒనరింపుమని చెప్పినాడు. ఆవిధముగా ధర్మరాజు, అర్జునుడు ధృష్టద్యుమ్నులచేత అచల వ్యూహము నిర్మింపబడినది. వ్యూహమనగా సమిష్టిగా శరీరనిర్మాణము. సేనలోని వీరులనగా వ్యష్టిలోని శరీరభాగములు.

**అచల వ్యూహము – 'న అన్యఃపంథా'** జీవుడు ఆత్మ స్థానమును చేరుటకు ఇంకొక మార్గము లేదు. ఈ మార్గమునే పయనించి ఆత్మ స్థానమునకు చేరవలయును. ఈ పద్ధతిలో దేశము ననుసరించిగాని కాలము ననుసరించిగాని ఏవిధమైన మార్పుకు అవకాశములేదు. కావున ఈ పద్ధతి అచలము. అనగా దేశ కాల పరిస్థితులవలన మార్పుకు లోను గాని పద్ధతి అని అర్థము. సృష్టికర్త అయిన బ్రహ్మ అయినా లేక

మనము అయినా, అది కృతయుగమైనా, కలియుగమైనా ఆత్మస్థానమునకు చేరు విధి విధానము ఒక్కటే.

4వ శ్లోకము మొదలుకొని – 11వ శ్లోకము వఱకు ఇటు కథాపరంగాను అటు ఆధ్యాత్మిక పరంగాను చెప్పబడినది. **"సంజ్ఞార్థం తాన్ బ్రవీమి – తే"** – మీరు ఈ దేహ విచారణను శ్రద్ధగా వినండి అని కవి మనకు చెప్పుచున్నాడు.

మాండుక్య ఉపనిషత్ దీనికి మూలం. అనగా మాండుక్య ఉపనిషత్‌లో చెప్పిన దానికి వ్యాఖ్యానము చేయబడినది.

...... ❖ ❖ ❖ ......

పాండవ సేనా ప్రముఖులు - ఈ శ్లోకములు సంధిసమాసములతో చెప్పబడినవి.

**అత్ర శూరా మహేష్వాసా । భీమార్జున సమా యుధి ।**
**యుయుధానో విరాటశ్చ । ద్రుపదశ్చ మహారథః ॥ 4**

అత్ర – శూరాః – మహేష్వాసాః – భీమార్జున సమాః – యుధి
యుయుధానః – విరాటః – చ – ద్రుపదః – చ – మహారథః

**దృష్టకేతుశ్చేకితానః । కాశిరాజశ్చ వీర్యవాన్ ।**
**పురుజిత్కుంతి భోజశ్చ । శైబ్యశ్చ నరపుంగవః ॥ 5**

దృష్ట కేతుః – చేకితానః – కాశిరాజః – చ – వీర్యవాన్ ।
పురుజిత్ – కుంతి భోజః – చ – శైబ్యః – చ – నరపుంగవః ॥

**యుధామన్యుశ్చ విక్రాన్త । ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।**
**సౌభద్రో ద్రౌపదేయాశ్చ । సర్వ ఏవ మహా రథాః ॥ 6**

యుధామన్యుః – చ – విక్రాంతః – ఉత్తమౌజాః – చ – వీర్యవాన్ ।
సౌభద్రః – ద్రౌపదేయాః – చ – సర్వః – ఏవ – మహా రథాః ॥

**కథాపరంగా :**

అత్ర = ఈ పాండవ సేనలో
సర్వః+నర పుంగవః+ = సర్వులు (అనగా ప్రతి ఒక్కడు) ఉత్తముడు,
వీర్యవాన్+విక్రాంతః+ వీర్యవంతుడు, విక్రమపరుడు, మహారథుడు,
మహారథః+యుధి+ వీరందఱు యుద్ధమునందు
శూరాః+వీర్యవాన్+ శూరులు, గొప్ప ధనుర్ధారులు మహారథులే
మహేష్వాసాః+ వారు ఎవరు అనగా
మహారథాః+ఏవ

**పాండవులు:**

I) **సౌభద్రః . చ** = సుభద్రకు అర్జునునికి జనియించిన ... 1. అభిమన్యుడు
II) **ద్రౌపదేయాః + చ** = ఉప పాండవులు ...(ద్రౌపదికి పాండవులకు జన్మించినవారు)
2. ప్రతివింధ్యుడు (ధర్మరాజుకు ద్రౌపదికి జన్మించినవాడు)
3. శ్రుత సోముడు (భీమునికి ద్రౌపదికి జన్మించినవాడు)
4. శ్రుతకీర్తి (అర్జునకు ద్రౌపదికి జన్మించినవాడు)
5. శతానీకుడు (నకులునికి ద్రౌపదికి జన్మించినవాడు)
6. శ్రుతసేనుడు (సహదేవునికి ద్రౌపదికి జన్మించినవాడు)

III) **పాంచాలురు –**
7. ద్రుపదః + చ = పాంచాలాధీశుడయిన ద్రుపదుడు (పాండవుల మామ)
8. యుధామన్యుః = యుధామన్యుడు

9. ఉత్తమౌజాః = ఉత్తమౌజుడు

IV) **<u>ధర్మరాజు మామగారు:</u>**

10. శైబ్యః+చ = శిబి దేశపు రాజు అయిన గోవాసనుని కూతురు దేవిక. ఈమె ధర్మరాజుకు ఇంకొక భార్య ఆవిధముగ శైబ్యుడు ధర్మరాజుకు మామ. ఆమెయందు యౌధేయుడు పుట్టాడు.

V) **<u>పాండవుల వియ్యంకుడు:</u>**

11. విరాటః+చ = విరాటదేశాధీశుడైన విరాటుడు. (ఇతడు అభిమన్యుని మామగారు. అర్జునునకు వియ్యంకుడు.)

VI) **<u>పాండవుల తల్లివైపు - యాదవులు:</u>**

12. కుంతిభోజః+చ = కుంతిభోజుడు.

13. పురుజిత్ = పురుజిత్ (పాండవులకు మేనమామ)

14. చేకితానః = చేకితానుడు. (యాదవ ప్రముఖుడు)

15. యుయుధానః+చ = సాత్యకి

16. దృష్టకేతుః+చ = దృష్టకేతువు (కుంతియొక్క సోదరి కొడుకు శిశుపాలుడు. శిశుపాలుని కొడుకు దృష్టకేతువు. ఇతడు శిశుపాలుని అనంతరము ఛేది దేశానికి అధిపతి.)

VII) **<u>ఇతరులు:</u>**

17. కాశిరాజః = కాశీరాజు. (ఇతని పేరు చెప్పలేదు. ఒకనాటి కాశీరాజు కుమార్తెలనే భీష్ముడు ఎత్తుకొచ్చినాడు. ఇప్పటి రాజు పేరు చెప్పలేదు).

భీమార్జున సమాః = వీరందఱు భీమార్జునులతో సమానులు.

**వ్యాఖ్యానము :-** పాండవసేనా ప్రముఖులయిన కొందఱికి అనగా సాత్యకి, దృష్టకేతు, చేకితాన, పురుజిత్, కుంతిభోజులకు, అభిమన్యునకు, ఉపపాండవులకు ఏ విశేషణము వాడలేదు. కావున మహా రథః – వీర్యవాన్ – నరపుంగవః – విక్రాంతః

– అను విశేషణములు అందఱికి చెప్పవలయును. ఏ ఒక్కరికో చెప్పరాదు అనుటకు సూచనగా వ్యక్తి వాచకమునకు విశేషణమునకు నడుమ 'చ' కారముచే వేఱుచేసి పద ప్రయోగము చేయబడినది. ఇందు 17 మందినే పేర్కొనినాడు. ఇందు పాండవులలో ధర్మరాజుని, నకుల సహదేవులను పేర్కొనలేదు. భీష్ముని మరణ కారకుడైన శిఖండిని పేర్కొనలేదు. ద్రోణుని మరణ కారకుడు సర్వ సైన్యాధిపతి అయిన దృష్టద్యుమ్నుని పేర్కొనలేదు. పాండవ సేనలో భీష్ముడు చెప్పిన అనేక మంది ప్రముఖులను పేర్కొనలేదు. వ్యాస భగవానుడు సూక్ష్మ శరీరము గుఱించి చెప్ప తలచుకొన్నందువలన 17 సంఖ్యకు మించునని మిగిలిన వారిని పేర్కొనలేదు. ఈ విధముగా మనకు గోప్యముగా సూక్ష్మశరీరము గుఱించి వ్యాఖ్యానము యివ్వబడినది. ముండక ఉపనిషత్‌లో చెప్పిన 19లో చిత్తము, అహంకారములను కలిపి ఒకటిగాను, మనోబుద్ధులను కలిపి ఒకటిగాను చేసి 17గా వ్యాసభగవానుడు పేర్కొనినాడు. శంఖములు ఊదిరని చెప్పునప్పుడు కూడా శ్రీకృష్ణుడు గాక పాండవ సేనా ప్రముఖులను 17 మందినే పేర్కొనినాడు.

నాలుగు నుంచి ఆఱు శ్లోకములలో వ్యాసభగవానుడు కథాపరంగాను, అధ్యాత్మపరముగా మనకు సూక్ష్మ శరీరము గుఱించి పాండవ సేనలోని వీరులను పరిచయం చేసినారు.

సూక్ష్మ శరీరమును సమిష్టిగాను, స్థూల శరీరమును వ్యష్టిగాను చెప్పదలచి పునర్జన్మకు కారణమగు సూక్ష్మ శరీరమును గుఱించి చెప్పుచూ **'సర్వః'** అని ఏకవచనమును, స్థూల శరీరమును గుఱించి చెప్పునపుడు**'సర్వే'**అని బహువచనమును వాడినారు. కావున సర్వః అనే పదమును సర్వే అని దిద్దరాదు. స్థూలశరీరము నశించును కావున కౌరవ ప్రముఖులు అయిన భీష్మ ద్రోణాదులకు కూడా **మహారథాః** అని పద ప్రయోగములేదు. ఈ స్థూల శరీరము కాలి బూడిద అగును. కావున స్థూల శరీరములోని వారు ఎవరూ మహారథులు కారు. స్థూల శరీరము నశించినను, సూక్ష్మ శరీరము నశింపదు. ఇది పునర్జన్మకు కారణమగును. సూక్ష్మశరీరముగా చెప్పబడే పాండవులు కూడా నశించినగాని జీవుడు ఆత్మస్థానమును చేరలేడు. సూక్ష్మశరీరము భంగమగునంతవరకు జీవుడు జననమరణ వలయములో తిరుగాడును. కావున దీనిని కథాపరంగా అశ్వత్థామ పాండవ వినాశనమును తలపెట్టినట్లు భారతమున

వర్ణింపబడినది.

...... ❖ ❖ ❖ ......

కౌరవ సేనాప్రముఖులు : ఈ శ్లోకములు సంధిసమాసములతో చెప్పబడినవి. స్థూల శరీరము గుఱించి చెప్పుచున్నాడు.

**అస్మాకం తు విశిష్టా యే । తాన్నిబోధ ద్విజోత్తమ ।**

**నాయకా మమ సైన్యస్య । సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే ॥ 7**

అస్మాకమ్ – తు – విశిష్టాః – యే – తాన్ – నిబోధ – ద్విజోత్తమ

నాయకాః – మమ – సైన్యస్య – సంజ్ఞార్థమ్ – తాన్ – బ్రవీమి – తే

**భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ । కృపశ్చ సమితింజయః ।**

**అశ్వత్థామా వికర్ణశ్చ । సౌమదత్తి స్తథైవ చ ॥ 8**

భవాన్ – భీష్మః – చ – కర్ణః – చ – కృపః – చ – సమితింజయః

అశ్వత్థామా – వికర్ణః – చ – సౌమదత్తిః – తథా – ఏవ – చ

**అన్యే చ బహవః శూరా । మదర్థే త్యక్త జీవితాః ।**

**నానాశస్త్ర ప్రహరణాః । సర్వే యుద్ధ విశారదాః ॥ 9**

అన్యే – చ – బహవః – శూరాః – మదర్థే – త్యక్త – జీవితాః

నానాశస్త్ర ప్రహరణాః – సర్వే – యుద్ధ విశారదాః

**కథా పరంగా :**

| | | |
|---|---|---|
| ద్విజోత్తమ+మమ+ | = | ఓ ద్రోణాచార్యా! నా యొక్క సైన్యమునకు |
| సైన్యస్య+యే+ | | ఎవరు నాయకులు గలరో వారిని |
| నాయకాః+తాన్+తే+ | | మీ కొఱకు చెప్పుచున్నాను |

బ్రవీమి

| | | |
|---|---|---|
| అస్మాకమ్+విశిష్టాః+ | = | మన పక్షమున ప్రముఖులయిన |
| సమితింజయః+భీష్మః+ చ+సౌమదత్తి+వికర్ణః+ చ | = | యుద్ధములో జయమును పొందువాడైన భీష్ముడు (ఇతడు దుర్యోధనునికి తాత) భూరిశ్రవుడు (భీష్ముని పినతండ్రి బాహ్లికుడు. బాహ్లికుని కుమారుడు సోమదత్తుడు, సోమదత్తుని కుమారుడు భూరిశ్రవుడు. దుర్యోధనునికి భూరిశ్రవుడు తండ్రి వరుస). వికర్ణుడు, (దుర్యోధనుని తమ్ముడు) |

**గురువులు :**

| | | |
|---|---|---|
| భవాన్+కృపః | = | మీరు (అనగా ద్రోణాచార్యులు) కృపాచార్యులు |

**గురుపుత్రులు :**

| | | |
|---|---|---|
| అశ్వత్థామా + చ | = | అశ్వత్థామ (ద్రోణాచార్యుని కొడుకు) |

**స్నేహితుడు :**

| | | |
|---|---|---|
| కర్ణః + చ | = | కర్ణుడు |

**ఇతరులు :**

| | | |
|---|---|---|
| తథా+ఏవ+చ అన్యే+చ+బహవహః+ శూరాః+సర్వే+ యుద్ధ విశారదాః+ నానా శస్త్ర ప్రహరణాః మదర్థే+త్యక్త+జీవితాః+ తు | = | అట్లే వీరితో సమానులైన ఇతరులయిన అనేకమంది శూరులు కలరు. వారు అందఱు యుద్ధ విశారదులు అనేక అస్త్ర శస్త్రములు, ఆయుధములు ప్రయోగించ సమర్థులే. వీరందఱు నా కొఱకు అసువులు బాయుటకు అయినా సిద్ధపడిన వారు. అంతే తప్ప యుద్ధములో వెనుతిరిగి పాఱిపోవువారు కారు. గతంలో చెప్పిన పాండవపక్ష విశిష్టులను, ఇప్పుడు చెప్పుచున్న కౌరవపక్ష ప్రముఖులను |

తాన్+సంజ్ఞార్థమ్+ = వారిని యధార్థజ్ఞానము గలిగి తెలుసుకొనండి
నిబోధ

**వ్యాఖ్యానము :-** 7వ శ్లోకములో వ్యాసభగవానుడు అస్మత్ శబ్దముయొక్క షష్ఠీవిభక్తి ఏకవచనమును (మమ) – బహువచనం అయిన (అస్మాకమ్)లను వాడి బ్రవీమి, నిబోధ అను రెండు క్రియలను వాడినారు. ఇందు ఒకటి కథాభాగమునకు, రెండవది అధ్యాత్మిక విభాగమునకు ప్రతీకలు. పాండవ పక్షమున 17గురిని, కౌరవుల పక్షమున 7గురిని మొత్తము 24 మంది చతుర్వింశతి తత్త్వములకు సంకేతముగా చెప్పబడిరి. ఈ ప్రముఖులు స్థూలశరీరమునకు, సూక్ష్మశరీరమునకు సంబంధించినవారు.

**"తాన్ – సంజ్ఞార్థం – బ్రవీమి – తే నిబోధ"** అనగా వారిని మీకు సంజ్ఞార్థము చెప్పుచున్నాను. వారిని కథాభాగముగా కాక, దేహములోని వారిగా గ్రహించుడని పాఠకులకు చెప్పినారు.

**సంజ్ఞానమ్** **=** సమ్యక్ జ్ఞానం, యధార్థజ్ఞానం (వైదికకోశము)

**సమితిః (ఇ.స్త్రీ) =** ఈ శబ్దము బ్రహ్మవర్గములోనూ, క్షత్రవర్గము లోనూ, నానార్థ వర్గములోనూ అమరకోశములో చెప్పబడినది.

బ్రహ్మవర్గములో అర్థము చెప్పిన బ్రాహ్మణుల సభలో గొప్పవాడు అని అర్థము. క్షత్రవర్గములో అర్థము చెప్పిన యుద్ధములో గొప్పవాడు అని అర్థము. నానార్థవర్గములో అర్థము చెప్పిన పండితసభలో గొప్పవాడు అని అర్థము.

ఇందు కౌరవ సేనలోగల 11 అక్షౌహిణీ సేనలో ఏడుగురుని మాత్రమే ఇక్కడ పేర్కొనినాడు. యుద్ధములో పాల్గొన్న అనేక మందిని ఇక్కడ పేర్కొనలేదు. యాదవ వీరుడైన కృతవర్మను, భగదత్తుడు మొదలైనవారిని పేర్కొనలేదు. యుద్ధానంతరము బ్రతికిన వారిలో కృతవర్మ ఒకడు. వీరెవరికి మహారథులు అనే పద ప్రయోగం చేయలేదు. స్థూల శరీరము కాలి బూడిద అగును. కావున స్థూల శరీరమునకు సంబందించిన వారు ఎవరూ మహారథులు కారు.

స్థూల శరీరములోని ఒక్కొక్క యింద్రియము ఒక్కొక్క పని చేయును. కావున

స్థూలశరీర యింద్రియములకు ప్రతినిధులైన కౌరవసేనా ప్రముఖులకు సర్వే అని బహువచనము వాడినారు.

...... ❖ ❖ ❖ ......

**స్థూల శరీరము-సూక్ష్మ శరీరముల తారతమ్యములు**

**అపర్యాప్తం తదస్మాకం । బలం భీష్మాభిరక్షితమ్ ।**
**పర్యాప్తంత్విదమేతేషాం । బలం భీమాభిరక్షితమ్ ॥ 10**

అపర్యాప్తమ్ - తత్ - అస్మాకమ్ - బలమ్ - భీష్మాభిరక్షితమ్
పర్యాప్తమ్ - తు - ఇదమ్ - ఏతేషామ్ - బలమ్ - భీమాభిరక్షితమ్

| | |
|---|---|
| అపర్యాప్తమ్+అస్మాకమ్+= తత్+బలమ్+ భీష్మాభిరక్షితమ్ | పరమాత్మ లేకుండా ఇతరులచే వ్యాపించియున్న పరిమితముగా ఉన్న మనయొక్క 11 అక్షౌహిణులు, 7 మంది సేనానాయకులుగా గల మన సైన్య బలము భీష్మునిచే రక్షింపబడుచున్నది. |
| పర్యాప్తమ్+ఏతేషామ్+ = ఇదమ్+బలమ్+ భీమాభిరక్షితమ్+తు | పరమాత్మ కలిగి అపరిమితముగా ఉన్న పాండవులయొక్క 7 అక్షౌహిణులు, 17 మంది సేనానాయకులుగా గల సైన్యబలము భీమునిచే రక్షింపబడుచున్నది. ఒకరివైపు సైన్యబలము ఎక్కువ. ఇంకొకరివైపు సేనానాయకులు ఎక్కువ. అందువలన జయాప జయములు నిర్ణయించ లేకున్నాము |

**వ్యాఖ్యానము:-** స్థూల శరీరము కౌరవులు. ఈ స్థూల శరీరమునకు అధిపతి జలతత్త్వము. జలతత్త్వమునకు ప్రతీకగా గంగాతనయుడైన భీష్ముడు చెప్పబడినాడు. సూక్ష్మ శరీరము పాండవులు. ఈ సూక్ష్మ శరీరమునకు అధిపతి వాయువు లేక మనస్సు. వాయుతత్త్వమునకు ప్రతీకగా వాయుపుత్రుడైన భీముడు చెప్పబడినాడు.

ఇక్కడ జలతత్త్వము, మనస్సు గుఱించి చెప్పదలచి, అటు భీష్ముని పేరు, ఇటు భీముని పేరు చెప్పినారు. స్థూలశరీరము కంటె సూక్ష్మశరీరము యొక్క బలము అధికము.

స్థూల, సూక్ష్మశరీరములు రెండును సప్తాంగః, ఏకోనవింశతి ముఖః – అయినను సూక్ష్మశరీరము స్థూలశరీరముకంటె గొప్పది.

...... ❖ ❖ ❖ ......

దుర్యోధనుడు భీష్ముని రక్షించుడు అని అందఱికి చెప్పుట

**అయనేషు చ సర్వేషు । యథా భాగ మవస్థితాః ।**
**భీష్మమేవాభిరక్షంతు । భవంతః సర్వ ఏవ హి ॥ 11**

అయనేషు – చ – సర్వేషు – యథా – భాగమ్ – అవస్థితాః
భీష్మమ్ – ఏవ – అభిరక్షంతు – భవంతః – సర్వః – ఏవ – హి

ప్రథమదివస యుద్ధమునాడు భీష్మునికి ఎదురుగా శిఖండి నిలబడి ఉన్నాడు. శిఖండి భీష్మునికి మరణ కారకుడగుట వలన శిఖండి బారి నుండి భీష్ముని రక్షించవలసి యున్నది. కావున

| | |
|---|---|
| భవంతః+సర్వేషు+ అయనేషు+యథా+ భాగమ్+అవస్థితాః = | మీరు అందఱు అనగా ద్రోణాచార్యులు, కృపాచార్యులు, అశ్వత్థామ భూరిశ్రవుడు, మొదలయిన మీరందఱు యుద్ధభూమియందు గల అన్ని మార్గములందు ఎవరెవరు ఎక్కడెక్కడ ఉండవలయునని మానుష వ్యూహ నిర్మాణములో నిశ్చయింపబడిరో, ఆవిధముగా మీరు మీ మీ స్థానములలో యుద్ధమునందు పట్టుదల కలిగి ఉన్నవారై |
| చ+సర్వః+ఏవ+భీష్మమ్+= ఏవ+అభిరక్షంతు+హి | మఱియు సర్వవేళలా కలసికట్టుగా భీష్మపితామహుడిని శిఖండితో యుద్ధము చేయునపుడు అన్నివైపులనుండి రక్షించండి. |

**వ్యాఖ్యానము :-** శిఖండి భీష్మునికి మరణకారికుడగుట కారణమునను, శిఖండితో భీష్ముడు యుద్ధము చేయునపుడు మీరందఱు భీష్మునికి బాసటగా నిలవండి. అటులనే ద్రోణుని మరణ కారకుడైన దృష్టద్యుమ్నునితో ద్రోణుడు యుద్ధము చేయునపుడు, ద్రోణాచార్యుల వారిని కూడా కంటికి రెప్పలా కాపాడండి. కౌరవ యోధులారా మనకు భీష్మపితామహుడు, ద్రోణాచార్యుల వారు రెండు కన్నులవంటి వారు.

**ఆధ్యాత్మిక విభాగము:** కాలానుసారముగా నశించిపోయే ఈ స్థూల శరీరమును కడు జాగ్రత్తగా పోషించి రక్షించాలని అజ్ఞాని భావించును. ఆ విధముగనే పోషించి రక్షించును కాని ఒకనాడు మృత్యుదేవత ఈ శరీరమును కబళించును. స్థూల శరీరమునకు అమరత్వము లేదు.

**మృత్యు కారకములు : -**

జీవుడు తమ పూర్వజన్మలో చేసుకున్న కర్మ –
కాలము (పగలు, రాత్రి) – దిక్కులు
దేవదానవ మానవాదులు
పంచ భూతములు – క్రూర మృగములు – సర్పములు
అస్త్రములు – శస్త్రములు – మృత్యుదేవత – రోగములు, ప్రమాదములు.

ఈ మృత్యుకారకములు స్థూలదేహమునే నశింపచేయును.

ఇంతవఱకు ద్రోణాచార్యునితో దుర్యోధనుడు కౌరవ పాండవ వీరుల గుఱించి మఱియు భీష్మునిరక్షణ గుఱించి చెప్పినట్లు వర్ణింపబడినది.

అటులనే రహస్యముగా దేహము గుఱించి అనగా స్థూల దేహము గుఱించి, సూక్ష్మదేహము గుఱించి, ఆధ్యాత్మ భావన చెప్పబడినది.

దుర్యోధనుడు చెప్పిన దానికి ద్రోణుని ప్రతిస్పందన లేదు. అనగా ఈ వీరుల గుఱించి చెప్పినది స్థూల శరీరము, సూక్ష్మ శరీరముల గుఱించి చెప్పినట్లు భావించ

వలయును.

...... ❖ ❖ ❖ ......

**కథాభాగము:**

| | | | |
|---|---|---|---|
| ఒక అక్షౌహిణి అనగా | 21,870 | - | రథములు |
| | 21,870 | - | ఏనుగులు |
| | 65,610 | - | గుఱ్ఱములు |
| | 1,07,350 | - | కాల్బలము |
| **మొత్తము ..** | **2,18,700** | | |

సంగ్రామములో పాల్గొన్నవారు - 18 అక్షౌహిణులు

అనగా- 2,18,700 × 18 = **39,36,600**

కాని ఇది కేవలము కథా భాగముగా చదవరాదని చెప్పుటకు 18వ దినమునాటి యుద్ధమునకు గల కౌరవ - పాండవ సేన గురించి శల్యపర్వము 8వ అధ్యాయము 38-41 శ్లోకములలో ఇట్లు గలదు.

| | **కౌరవసేన** | **-** | **పాండవసేన** |
|---|---|---|---|
| రథములు: | 11,000 | - | 6,000 |
| ఏనుగులు: | 10,700 | - | 6,000 |
| గుఱ్ఱములు: | 2,00,000 | - | 10,000 |
| పదాతిబలము: | 3,00,00,000 | - | 2,00,00,000 |

**మరల స్త్రీ పర్వంలో 26వ అధ్యాయం, 9వ శ్లోకములో యుద్ధములో 166,00,20,000 అని చెప్పబడినది. కావున 18 అక్షౌహిణులనగా నేమిటో ఆధ్యాత్మికభావనతో గ్రహించవలయును.**

## సైన్యము - ఉద్యోగపర్వం ప్రథమాశ్వాసము

**కౌరవుల సైన్యము:**

భగదత్తుడు................ …. .................. 1 అక్షౌహిణి సేనతో వచ్చెను.

భూరిశ్రవుడు,

శల్యుడు .................. ................. 1 అక్షౌహిణి సేనతో వచ్చెను.
కాంబోజాధిపతి అయిన సుదక్షిణుడు......... 1 అక్షౌహిణి సేనతో వచ్చెను.
సింధు దేశాధిపతి అయినజయద్రధుడు,
సౌవీరదేశాధిపతియు .... ................. 1 అక్షౌహిణి సేనతో వచ్చెను.
మహేష్మతి దేశాధిపతి అయిన నీలుడు... 1 అక్షౌహిణి సేనతో వచ్చెను.
అవంతి దేశాధిపతులయిన
విందానువిందులు ఇద్దఱు ................. 2 అక్షౌహిణి సేనతో వచ్చినారు.
కృత వర్మ ................ ...................... 1 అక్షౌహిణి సేనతో వచ్చెను.
ఇతరులు ................. ...................... 3 అక్షౌహిణి సేనతో వచ్చిరి.

**మొత్తము 11 అక్షౌహిణులు.**

ఈ సేన అంతా 1. కురుజాంగల దేశములందు 2. రోహితక అరణ్యమునందు, 3. మరుదేశములో 4. అహిచ్ఛత్రములో 5. కాలకూటంలో 6. గంగా తీరములో 7. వారణావతములో 8. వటస్థానములో విడిది చేసి ఉన్నవి అని తిక్కనగారు రచియింపగా, వ్యాసభగవానుని మూలంలో పంచనదం – కురుజాంగాల దేశము– రోహితక అరణ్యము – మరుదేశము – అహిచ్ఛత్రంలో – కాలకూటంలో – గంగాతీరంలో – వాటధానం – యమున పర్వతంలో విడిది చేసిరి అని చెప్పబడినది.

## పాండవ సైన్యము:

పాంచాలదేశాధీశుడు అయిన ద్రుపదుడు 1 అక్షౌహిణి సేనతో వచ్చెను.
విరాట్ దేశాధిపతి అయిన విరాటుడు ..... 1 అక్షౌహిణి సేనతో వచ్చెను.
ఛేది దేశాధిపతి అయిన శిశుపాలుని
కుమారుడు అయిన దృష్టకేతువు ... 1 అక్షౌహిణి సేనతో వచ్చెను.
మగధ దేశాధిపతి అయిన జరాసంధుని

1. మూలంలో జయత్సేనుడు అని ఉంది. తిక్కన రచనలో సహదేవుడు అని ఉంది.

కొడుకు అయిన జయత్సేనుడుగా

పిలువబడే సహదేవుడు[1]............. 1 అక్షౌహిణి సేనతో వచ్చెను.

కేకయ రాజులు ఐదుగురు .................. 1 అక్షౌహిణి సేనతో వచ్చెను.

పాండ్యదేశాధిపతి .... .... .................. 1 అక్షౌహిణి సేనతో వచ్చెను.

సాత్యకి ................ ........ ............ 1 అక్షౌహిణి సేనతో వచ్చెను.

**మొత్తం .. ............. ................. 7 అక్షౌహిణి సేనలు**

వీరు ఏయే ప్రదేశములలో విడిది చేసినది చెప్పలేదు. స్థూలశరీరములోని అవయవములు విడివిడి స్థానములలో ఉండుటవలన కౌరవసేన ఏయే స్థానములలో విడిది చేసినది వివరముగా చెప్పబడినది. సూక్ష్మశరీరము బాహ్యముగా కనిపించదు. కావున పాండవసేన విడిది చేసిన ప్రదేశములు చెప్పలేదు.

## భీష్ముడు చెప్పిన ప్రకారము - వీరులు

(ఉద్యోగపర్వము చతుర్థాశ్వాసము)

### కౌరవ సేనలో.....

**అతిరథులు:** కురువంశములోని రాజులలో 1) దుర్యోధనుడు 2) భీష్ముడు 3) భీష్ముని పినతండ్రి బాహ్లికుడు 4) బాహ్లికుని కుమారుడు సోమదత్తుడు 5) సోమదత్తుని కుమారుడు భూరిశ్రవుడు – బ్రాహ్మణులలో 6) కృపాచార్యులు 7) ద్రోణాచార్యులు 8) అశ్వత్థామ. ఇతరులలో – 9) మద్రదేశాధీశుడు అయిన శల్యుడు 10) యాదవ ప్రముఖుడైన కృతవర్మ. కర్ణుని అర్ధరథునిగా భీష్ముడు పేర్కొనినాడు.

**మహారథులు:** 1) సింధుదేశాధీశుడు అయిన సైంధవుడు (జయద్రథుడు), 2) త్రిగర్త దేశాధీశులు, అన్నదమ్ములు అయిన ఐదుగురు

**సమరథులు:** 1) దుర్యోధనుని తమ్ములు 2) దుర్యోధనుని కుమారుడైన లక్ష్మణ కుమారుడు 3) గాంధార రాకుమారులైన వృకుడు, నీలుడు 4) శకుని 5) కాంభోజ

రాజు అయిన సుదక్షణుడు 6) కోసలదేశాధిపతి అయిన బృహద్బలుడు 7) ప్రాగ్జ్యోతి పురాధీశుడైన భగదత్తుడు 8) అలంబసుడనే రాక్షసుడు

**అర్ధరథులు :** 1) మాహీష్మతి పురాధీశుడైన నీలుడు 2) అవంతీ దేశాధీశులైన విందానువిందులు 3) దండధారుడు

## పాండవ సేనలో....

**అతిరథులు:** 1) ధర్మరాజు 2) భీముడు 3) అర్జునుడు 4) భీముని కుమారుడు ఘటోత్కచుడు 5) అర్జునుని కుమారుడు అభిమన్యుడు 6) యాదవులలో – కుంతిభోజుడు, 7) సాత్యకి 8) ద్రోణుని మరణకారకుడును, పాంచాల దేశాధీశుడైన ద్రుపదుని కుమారుడు అగు ధృష్టద్యుమ్నుడు 9) పాండ్యరాజు 10) సేనాబిందు

**మహారథులు :** 1) ఉపపాండవులు ఐదుగురు 2) పాంచాల దేశాధీశుడైన ద్రుపదుడు 3) ద్రుపదుని కుమారుడు శిఖండి (ఇతడు భీష్ముని మరణకారకుడు), పాంచాల వంశజులు – 4) ఉత్తమౌజుడు 5) యుధామన్యువు 6) ఛత్రదేవుడు 7) జయంతుడు 8) అమితౌజసుడు 9) విరాటుడు 10) సత్యజిత్తు అనువారు 11) మత్స్యదేశాధీశుడైన విరాటరాజు 12) విరాటుని కొడుకు ఉత్తరుడు – విరటుని దాయాదులైన 13) కాశీకుడు 14) నీలుడు 15) సూర్యదత్తుడు 16) మధిరాక్షుడు 17) శంఖుడు 18) యాదవులలో చేకితానుడు 19) ఛేది దేశాధిపతి అయిన శిశుపాలుని కొడుకు అగు ధృష్టకేతువు 20) రోచమానుడు 21) చిత్రాయుధుడు 22) చంద్రదత్తుడు 23) వ్యాఘ్రదత్తుడు 24) భోజుడు 25) అజుడు

**సమరథులు :** 1) నకులుడు 2) సహదేవుడు 3) కాశ్యుడు

**అర్ధరథులు:** ధృష్టద్యుమ్నుని కొడుకు అయిన ధృతవర్మ.

ధర్మరాజు మామ అయిన శైబ్యుని గురించి యాదవ ప్రముఖుడయిన పురుజిత్ గురించి భీష్ముడు చెప్పలేదు.

భీష్ముడు చెప్పినదానికి ఇప్పుడు దుర్యోధనుడు చెప్పినదానికిగల వ్యత్యాసమును గమనించిన స్థూలశరీరము, సూక్ష్మశరీరముల గురించి రహస్యముగా మనకు సంజ్ఞార్థం చెప్పినట్లు అర్థమగును. భారతము ఆదిపర్వములో వీరిగురించి చెప్పబడినది. కావున ఆదిపర్వము చదివి శరీరములో వీరు ఎవరెవరో గ్రహించవలయును.

...... ❖ ❖ ❖ ......

**వ్యూహ నిర్మాణము** (భీష్మపర్వములో – ప్రథమాశ్వాసము)

**పడమర మొఖం – కౌరవ వ్యూహము – విజృంభించుట కొఱకు నిర్మింపబడినది.**

| బాహ్లికుడు | సోమదత్తుడు | భూరిశ్రవుడు |
|---|---|---|

భీష్ముడు నిర్మించిన **మానుష వ్యూహము**




**ఉభయ సేనల మధ్యభాగము**

భీముడు ధృష్టద్యుమ్నుడు శిఖండి అర్జునుడు

సహదేవుడు నకులుడు అభిమన్యుడు ఉపపాండవులు

ధర్మరాజు, అర్జునుడు, ధృష్టద్యుమ్నులచే నిర్మింపబడిన

***అచల వ్యూహము (వజ్రవ్యూహము)***




**పాండవ సేన – తూర్పు ముఖముగా ఉన్నది. కౌరవులను ఎదుర్కొనుటకు నిర్మింపబడినది. కౌరవ సేన – పడమర ముఖముగా ఉన్నది.**

## ఆధ్యాత్మిక వివరణ

మాండుక్య ఉపనిషత్:

**జాగరిత స్థానో బహిః ప్రజ్ఞః సప్తాంగః ఏకోన వింశతి ముఖః ।**

మాండుక్య–3

జాగ్రదావస్థలో గల జీవునుని వైశ్వానరుడు అని అందురు. ఇతడు దుర్యోధనునిగా యిందు చిత్రీకరింపబడినాడు. భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామ, కర్ణాది వీరులు అస్త్ర శస్త్రముల పాటవమును నమ్ముకొని తనకు యుద్ధములో జయము గలుగునని భావించినాడు. మానుష శక్తిపై ఆధారపడినాడు. అందువలన ఇతని వ్యూహము మానుష వ్యూహము.

స్థూలదేహము సప్తాంగః – సప్త ఆవరణలు గలది.

ప్రకృతి
|
మహత్ – 7
|
అహంకారం – 6
|

*ఆకాశము – 5*
*వాయువు – 4*
*అగ్ని – 3*
*జలము – 2*
*భూమి – 1*

*స్థూలశరీరములో ముఖ్యమైనవి 7. అవి ఏవి అనగా:*
*నోరు, చేతులు, గుహ్యము, కన్ను, చెవి, నాలుక, మనస్సు.*

## ఏకోనవింశతి ముఖః - 19 ముఖములు

**కర్మేంద్రియములు:** 1. నోరు 2. చేతులు 3. పాదములు 4. గుహ్యాము 5. గుదము

**జ్ఞానేంద్రియములు:** 6.చెవులు 7. చర్మము 8. కన్ను 9. నాలుక 10. ముక్కు

**ప్రాణములు:** 11. ప్రాణము 12. అపానము 13. సమానము 14. వ్యానము 15. ఉదానము

**అంతఃకరణములు:** 16. అహంకారము 17. చిత్తము 18. మనస్సు 19.బుద్ధి

మాండుక్య ఉపనిషత్ 19 యింటినే ప్రస్తావించినది. వీటికి ఇంద్రియార్థములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే 5 దింటిని కలిపి సాంఖ్యులు 24 తత్త్వములుగా (19+5=24) చెప్పిరి. చిత్తము, అహంకారములను కలిపి ఒకటిగాను, మనోబుద్ధులను కలిపి ఒకటిగాను, ఆవిధముగా పదిహేడుగా వ్యాసభగవానుడు చెప్పినాడు.

స్థూల శరీరములో నీటిపాలు ఎక్కువ. జల తత్త్వము ప్రధాన పాత్ర వహించును. కావున గంగా తనయుడయిన భీష్ముడు ముఖ్యుడు. స్థూల శరీరములోని అన్ని అవయములు జీవుడు దేహమును వీడిన తర్వాత నశించును. స్థూల శరీరము కాలిపోయి బూడిద అగును. కావున కౌరవ సేనా ప్రముఖులకు మహారథులు అన్న పద ప్రయోగం చేయలేదు.

స్థూల శరీరముతో చేసిన కర్మ సూక్ష్మ శరీరములో నిల్వయుండి పునర్జన్మకు కారణమగును.

కౌరవ సేన 11 అక్షౌహిణులు అనగా దశేంద్రియములు, మనస్సు. ఇవియే స్థూల శరీరముతో చేయబడు కర్మకు కారణములు. ఈ 11లో 7గురు ప్రముఖులు. అనగా నోరు, చేతులు, గుహ్యాము, కన్ను, చెవి, నాలుక, మనస్సు. కావున 11 అక్షౌహిణి సేనలో 7 గురినే పేర్కొనినారు.

**సూక్ష్మశరీరము : స్వప్నస్థానోంఽతః ప్రజ్ఞః సప్తాంగః ఏకోన వింశతి ముఖః**

– మాండుక్య–4

స్వప్నావస్థలోగల జీవునిని తైజసుడని అందురు. ఇతడు ధర్మరాజుగా

భారతములో చిత్రీకరింపబడినాడు. సప్నావస్థలోగల తైజసుడు అంతఃప్రజ్ఞ గలవాడు. అనగా మానుషశక్తినిగాక దైవీశక్తిని నమ్ముకొన్నవాడు.

**సప్తాంగః** - ఇదికూడ సప్త ఆవరణలు కలది. ఏకోన వింశతి ముఖః-19 ముఖములు కలది.

స్థూల శరీరము నశించినను సూక్ష్మ శరీరము నశింపదు. కావున ఈ 17 మందీ ప్రముఖులే. కావున పాండవ సేనలో ప్రముఖులుగా 17 మందిని పేర్కొనినాడు. స్థూల శరీరము మఱియు సూక్ష్మ శరీరములు రెండును **సప్తాంగః ఏకోనవింశతి ముఖః** అయినను ఈ రెండు శరీరములు సమానములు కావు.

స్థూల శరీరము కంటే సూక్ష్మ శరీరము గొప్పది.
కావున స్థూల శరీరము తక్కువ సేనానాయకులు కలది.
సూక్ష్మ శరీరము - ఎక్కువ సేనానాయకులు గలది అని చెప్పబడెను.
అంతః ప్రజ్ఞయే అచల వ్యూహముగా చెప్పబడినది.

సూక్ష్మ శరీరమునకు మనస్సు ముఖ్యము. ప్రాణము, మనస్సు వాయుతత్త్వ జనితములు. కావున పాండవ సేన భీమునిచే రక్షింపబడుచున్నదని చెప్పబడినది.

సూక్ష్మ శరీరములోని ఇంద్రియాదులు, అంతఃకరణ చతుష్టయము విడి విడిగా కర్మ చేయవు. మనస్సు ఒక్కటే పనిచేయును. మనస్సుచే చేయు కర్మ ఫలితమును జీవుడు అనుభవించును. కావున ఏకత్వమునకు చిహ్నముగా **సర్వః** అని ఏక వచనము ప్రయోగింపబడినది.

వ్యూహము అనగా స్థూల శరీరము మఱియు సేన అనగా ఇంద్రియాదులు, ప్రాణము అంతఃకరణ చతుష్టయము. సంజ్ఞార్థం అనగా యథార్థజ్ఞానము చెప్పుచున్నాను. వీటి గుఱించి తెలుసుకొనవలయునని అర్థము.

కౌరవ పాండవ వీరులను అధిభౌతికముగా అధి దైవికముగా స్థూల సూక్ష్మ శరీరములో గల ఇంద్రియాదులు, ప్రాణము అంతఃకరణ చతుష్టయముగా గురు ముఖతా గ్రహించవలయునని చెప్పినాడు. సూక్ష్మశరీరమునకు చెప్పిన సప్తాంగములే పాండవ సేనయొక్క 7 అక్షౌహిణులు.

**దేహవిచారణ :**

1. కొందఱు అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములుగా విభజించి చెప్పుదురు. మఱికొందరు భూతత్త్వము, జలతత్త్వము, అగ్నితత్త్వము, వాయుతత్త్వము మొదలయిన తత్త్వములుగా చెప్పుదురు.
2. కొందఱు శరీరమును భూమిగా వర్ణించి ఆ భూమిని సప్త ద్వీపములుగా విభజించి చెప్పుదురు.

**భూమి:** అధిభౌతికముగా సూర్యుని చుట్టూ తిరిగే ఒక గ్రహము. సూర్యుడు, చంద్రుడు, భూమి అనే గ్రహములు పరిభ్రమణ వలన ఏర్పడు, సూర్య గ్రహణములు, చంద్ర గ్రహణముల గుఱించి జ్యోతిష శాస్త్రము వివరించును. అధ్యాత్మికముగా ఈ గ్రహము జలముపై లేదు. జలములో మునిగితే విష్ణువు వరాహావతారము ధరించి ఈ భూమిని ఉద్ధరించలేదు. గురుత్వాకర్షణ శక్తిచే ఆవిధముగా అంతరిక్షములో గల భూమికి ప్రజలు ఎక్కువైతే భారము ఉండదు. ఈ అధి భౌతికమైన భూమిని ఆదిశేషువుగాని అష్టదిగ్గజములు కాని వాటి వాటి తలలపై ధరించవు. కావున వీటిని అధ్యాత్మికముగా గ్రహించవలసి ఉండును.

**"సూర్యః మే చక్షుర్వాతః ప్రాణోన్త రిక్షమాత్మా పృథివీ శరీరమ్"**

*(- అథర్వవేదం పంచమకాండ, అనువాకం-2, సూక్తం-9-7)*

అనగా సూర్యుడు నా నేత్రము. వాయువు నా ప్రాణం. అంతరిక్షం ఆత్మ. పృథివీ శరీరం.

కావున ఆధ్యాత్మికముగా భూమి అనగా శరీరము.

ఆధ్యాత్మికమయిన భూమి గుఱించి అనేక కథలుగా యోగ రహస్యములు చెప్పబడినవి. ఈ శరీరము దుష్ట భావనలచే, బరువు ఎక్కును. ఆహారమును తగ్గించి, సాధనవలన దుష్ట భావనలు సమూలముగా నశింపచేయుటయే భూ భారమును తగ్గించుటగా చెప్పుదురు.

ఈ శరీరములోని దుష్ట భావములనే భూ భారమును తగ్గించుటకు జీవుడు-

ఆత్మల సమిష్టి కృషి అవసరము. దీనినే కథా పరంగా అర్జునుడు శ్రీకృష్ణుడుగా వర్ణించిరి.

ఈ భూ భారమును తగ్గించుట ఎట్లు? అన్న ప్రశ్నకు రాబోవు శ్లోకములలో ఓంకారమును జపించవలయుననే సమాధానము చెప్పుచున్నాడు.

...... ❖ ❖ ❖ ......

బాహ్య శబ్దము

**తస్య సంజనయన్ హర్షం । కురు వృద్ధః పితామహః ।**
**సింహ నాదం వినద్యో చ్చైః । శంఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥ 12**

తస్య – సంజనయన్ – హర్షమ్ – కురు వృద్ధః – పితామహః –
సింహ నాదమ్ – వినద్య – ఉచ్చైః – శంఖమ్ – దధ్మౌ – ప్రతాపవాన్

**తతః శంఖాశ్చ భేర్యశ్చ । పణవానక గోముఖాః ।**
**సహసైవాభ్య హన్యంత । స శబ్దస్తుములో౽భవత్ ॥ 13**

తతః – శంఖాః – చ – భేర్యః – చ – పణవానక గోముఖాః
సహసా – ఏవ – అభ్య హన్యంత – సః – శబ్దః – తుములః – అభవత్

ప్రతాపవాన్+ = గొప్ప పరాక్రమము గలవాడును,
కురువృద్ధః+ సేనానాయకుడును, కురు వృద్ధుడును
పితామహః+ పితామహుడును అయిన భీష్ముడు (దుర్యోధనుడు ద్రోణాచార్యునితో భీష్ముని మీరందఱూ శిఖండితో భీష్ముడు పోరునప్పుడు రక్షించండి అని పలికిన పలుకులు విని)

తస్య+హర్షమ్+ = దుర్యోధనునకు సంతోషమును కలిగించుచూ
సంజనయన్+ యుద్ధ ప్రారంభ చిహ్నముగా సింహనాదమును
సింహనాదమ్+ బిగ్గరగా చేసి
ఉచ్చైః+వినద్య

శంఖమ్+దధ్మౌ = శంఖమును ఊదెను

| | | |
|---|---|---|
| తతః+శంఖాః+చ | = | భీష్ముడు శంఖమును పూరించిన పిమ్మట కౌరవసైన్యములోని ప్రముఖులు శంఖములు ఊదిరి. |

**ఆ తర్వాత యుద్ధములో వాయించే:**

| | | |
|---|---|---|
| భేర్యః+చ | = | భేరులు |
| పణవ ఆనక గోముఖాః | = | పణవ, ఆనక, గోముఖములు (పణవః – స్తోత్రము చేయునది. గోముఖః – వాద్య విశేషము ఆనకః – తమ్మెట) |
| సహసా+ఏవ+ అభ్య హన్యంత+ సః+శబ్దః+ తుములః+అభవత్ | = | ముందువెనుకలు ఆలోచింపక వెంటనే పాండవులకు ఎదురుగా ప్రయోగింపబడినవి ఆ శబ్దము భయంకరముగా దిక్కులు పిక్కటిల్లునట్లు, గందర గోళముగా చెవులకు వినిపించెను |

**వ్యాఖ్యానము :- మనస్సుపై శబ్దముయొక్క ప్రభావము ఉండును. శబ్ద కాలుష్యమునకు కారణమైన పెద్ద పెద్ద శబ్దములు మనస్సుకు చికాకును కలిగించును. దాని వలన మనస్సుకు అశాంతి కలుగును.**

**బాహ్య శబ్దము:** యంత్రముల వలన కలుగు శబ్దములు, వాహనముల వలన కలుగు రణగొణ శబ్దములు, పెద్ద పెద్ద అరుపులు కూతలు, మైకుద్వారా వినబడు పాటలు, సంగీతము మొదలైనవి బాహ్యశబ్దము క్రింద వర్గీకరింపబడును. బాహ్యశబ్దము మనస్సుకు అశాంతి, చికాకులు కలిగించును. కౌరవుల శంఖధ్వనులు, పణవములు, ఆనకములు, గోముఖములవలన కలిగిన శబ్దములు బాహ్యశబ్దము వంటిది. దీనివలన మనస్సుకు హాయి కలుగదు. మనిషిలోగల గుణములలో మార్పురాదు. మనస్సుకు శాంతి కలుగదు. బాహ్య శబ్దము ఆధ్యాత్మిక పురోగతిలో నిష్ఫలము. బాహ్యశబ్దమువలన ఆత్మదర్శనము కాదు. కథాపరంగా భీష్మాదులు శంఖములు పూరించిరి. ఆ శంఖముల ధ్వని గాని, పణవములు, ఆనకములు, గోముఖముల ధ్వనిగాని పాండవులపై ఎటువంటి ప్రభావము చూపలేదు.

భీష్ముని శంఖము పేరు చెప్పలేదు. అటులనే కౌరవ సేనలోని ప్రముఖుల

శంఖముల పేరులను కూడా చెప్పలేదు. బాహ్యశబ్దమువలన ప్రయోజనములేదు. కావున ఇక్కడ కౌరవ సేనా ప్రముఖుల శంఖముల పేర్లను చెప్పలేదు. దుర్యోధనుడు ద్రోణునితో పలికిన పలుకులు భీష్మునికి ఆనందమును గలుగచేయ వలెను. కాని భీష్ముడు ఆనందపడలేదు. దుర్యోధనునకు సంతోషము గలిగించుటకు భీష్ముడే సింహనాదముచేసి, శంఖమును ఊదెను.

...... ❖ ❖ ❖ ......

శ్రీకృష్ణుడు, పంచపాండవులు శంఖములు ఊదుట.
ఈ శ్లోకములు సంధి సమాసములతో చెప్పబడినవి.

**తతః శ్వేతైర్హయైర్యుక్తే । మహతి స్యందనే స్థితౌ ।**
**మాధవః పాండవశ్చైవ । దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః ॥ 14**

తతః – శ్వేతైః – హయై – యుక్తే – మహతి – స్యందనే – స్థితౌ
మాధవః – పాండవః – చ – ఏవ – దివ్యౌ – శంఖౌ – ప్రదధ్మతుః

**పాంచజన్యం హృషీకేశః । దేవదత్తం ధనంజయః ।**

**పౌండ్రం దధ్మౌ మహాశంఖం । భీమ కర్మా వృకోదరః ॥ 15**

పాంచజన్యమ్ – హృషీకేశో – దేవదత్తమ్ – ధనంజయః
పౌండ్రమ్ – దధ్మౌ – మహాశంఖమ్ – భీమకర్మా – వృకోదరః

**అనంత విజయం రాజా । కుస్తీ పుత్రో యుధిష్ఠిరః ।**
**నకులః సహదేవశ్చ । సుఘోష మణి పుష్పకౌ ॥ 16**

అనంత విజయమ్ – రాజా – కుంతీ పుత్రః – యుధిష్ఠిరః
నకులః – సహదేవః – చ – సుఘోష మణి పుష్పకౌ

పాండవసైన్యములోని వారు శంఖములు ఊదుట

**కాశ్యశ్చ పరమేష్వాసః । శిఖణ్డీ చ మహారథః ।**

**ధృష్టద్యుమ్నో విరాటశ్చ । సాత్యకిశ్చాపరాజితః ॥ 17**

కాశ్యః – చ – పరమేష్వాసః – శిఖణ్డీ – చ – మహారథః

ధృష్టద్యుమ్నః – విరాటః – చ – సాత్యకిః – చ – అపరాజితః

**ద్రుపదో ద్రౌపదేయాశ్చ । సర్వశః పృథివీపతే ।**

**సౌభద్రశ్చ మహాబాహుః । శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్ । 18**

ద్రుపదః – ద్రౌపదేయాః – చ – సర్వశః – పృథివీపతే

సౌభద్రః – చ – మహాబాహుః – శంఖాన్ – దధ్ముః – పృథక్ – పృథక్

**స ఘోషో ధార్తరాష్ట్రాణాం । హృదయాని వ్యదారయత్ ।**

**నభశ్చ పృథివీం చైవ । తుములోఽ వ్యనునాదయన్ ॥ 19**

సః – ఘోషః – ధార్తరాష్ట్రాణామ్ – హృదయాని – వ్యదారయత్

నభః – చ – పృథివీమ్ – చ – ఏవ – తుములః – వ్యను నాదయన్

తతః+శ్వేతైః+హయైః+ = యుద్ధ ప్రారంభ చిహ్నముగా భీష్మాదులు
యుక్తే+మహతి+స్యన్దనే+ శంఖములు పూరించగా మఱియు యుద్ధ భేరులు
స్థితౌ+మాధవః+చ మ్రోగిన పిమ్మట. తెల్లని గుఱ్ఱములచేత
పాండవః పూన్చబడిన గొప్పదైన తెల్లని కంబళిగల
రథమునందు ఉన్న శ్రీకృష్ణుడు, అర్జునుడు

దివ్యౌ+శంఖౌ+ఏవ+ = దివ్యమైన వారి వారి శంఖములను అనగా
హృషీకేశః+ శ్రీకృష్ణుడు పాంచజన్యం అను శంఖమును
పాంచజన్యమ్+చ అర్జునుడు దేవదత్తమను శంఖమును
ధనంజయః+దేవదత్తమ్+బాగుగా ఊదిరి
ప్రదధ్మతుః

| | | |
|---|---|---|
| భీమకర్మా+వృకోదరః+ పౌండ్రమ్+ మహాశంఖమ్+దధ్మౌ | = | గొప్ప గొప్ప ఘనకార్యములు చేయు భీముడు పౌండ్రం అనే గొప్పశంఖమును ఊదెను |
| రాజా+కుంతీ పుత్రః+ యుధిష్ఠిరః+ అనంత విజయమ్ | = | రాజు అయిన కుంతీ పుత్రుడగు ధర్మరాజు (ప్రస్తుతమునకు రాజు కాదు కాని యుద్ధానంతరము భవిష్యత్తులో ఇతడే రాజు) అనంత విజయము అనే శంఖమును ఊదెను. |
| నకులః+చ+సహదేవః+ సుఘోషమణిపుష్పకౌ | = | నకులుడు, సహదేవుడు. సుఘోషము, మణిపుష్పకము అను శంఖములను ఊదిరి. |
| సః+ఘోషః+ ధార్త రాష్ట్రాణామ్+ హృదయాని+ వ్యదారయత్ | = | శ్రీకృష్ణుడు మఱియు పాండవుల శంఖధ్వనులు కౌరవుల యొక్క హృదయములను బ్రద్దలు చేసెను. అటులనే |
| పృథివీపతే+ పరమేష్వాసః+ మహారథః+ అపరాజితః+ మహా బాహుః+ | = | ఓ ధృతరాష్ట్ర మహారాజా! గొప్ప ధనుర్ధారుడు మహారథుడును అపజయము ఎఱుగనివాడును దృఢమైన బాహువులు కలవాడును అయిన పాండవ సేనలోని వీరులైన |

**పాండు పుత్రులు:**

| | | |
|---|---|---|
| సౌభద్రః + చ | = | సుభద్ర కుమారుడైన అభిమన్యుడు |
| ద్రౌపదేయాః+చ | = | ద్రౌపది పుత్రులైన ఉప పాండవులు |

**పాంచాలురు:**

| | | |
|---|---|---|
| ద్రుపదః + చ | = | ద్రుపదుడు మఱియు అతని కుమారులైన |
| శిఖండీ + చ+ ధృష్టద్యుమ్నః | = | భీష్ముని మరణ కారకుడైన శిఖండి మఱియు ద్రోణుని మరణకారకుడైన ధృష్టద్యుమ్నుడు |

**పాండవుల వియ్యంకుడు:**

| | | |
|---|---|---|
| విరాటః | = | విరాటుడు |

**పాండవుల తల్లివైపు యాదవులలో:**

| | | |
|---|---|---|
| సాత్యకిః + చ | = | సాత్యకి |

**ఇతరులలో :**

| | | |
|---|---|---|
| కాశ్యః+చ+ సర్వశః | = | కాశీరాజు మిగిలిన ప్రముఖులు అందఱూ యుద్ధ రంగమంతటా ఎవరి స్థానములలో వారు వుండి |
| పృథక్+పృథక్+ శంఖాన్+దధ్ముః | = | వేఱు వేఱుగా అనగా ఒకరి తర్వాత ఒకరు ఒక క్రమపద్ధతిలో వారి వారి శంఖములను ఊదిరి (పాండవులు ఐదుగురు మిగిలినవారు పం(డెండుమంది మొత్తము పదిహేడుమంది పేర్కొనబడిరి.) ఆ శంఖధ్వని |
| పృథివీమ్+చ | = | భూమిని |
| నభః+ఏవ | = | ఆకాశమును |
| తుములః+ వ్యనునాదయన్ | = | దిక్కులు పిక్కటిల్లునట్లు చేసినది. |

**వ్యాఖ్యానము :- యుద్ధసమయమున మ్రోగింపబడిన శ్రీకృష్ణునియొక్క, పాండవులయొక్క శంఖధ్వనుల ప్రయోజనము ఇతరులు ఊదిన శంఖముల ప్రయోజనము యిందు చెప్పబడినది.**

కౌరవుల శంఖముల పేర్లు చెప్పలేదు. కాని పాండవుల శంఖముల పేర్లు, శ్రీకృష్ణుని శంఖము పేరు చెప్పబడినది.

**శంఖః – శమయతి దుఃఖమతి శంఖః.** శం ఉపరమే. దుఃఖమును ఉపశమింప చేయునది శంఖము అని అర్థము. **శామ్యత్య శుభ మనేనేతి శంఖః –** అనగా అశుభములు దీనిచేత శమించును. **శం సుఖం జనయతీతి శంఖః –** అనగా సుఖమును కలుగచేయునది. పునర్జన్మ అనే దుఃఖమును తొలగించి జన్మ రాహిత్యమును గలుగ చేయునది అని అర్థము.

ఆధ్యాత్మిక విభాగములో మనస్సును ప్రభావితం చేసి జీవుని జనన మరణ దుఃఖము నుండి కాపాడునది ఓంకారము. ఈ ఓంకారము, దాని ప్రయోజనము, విశిష్టతలను పాండవుల శంఖముల పేర్లుగా తెలియజేయ బడినది. ఈ శంఖ ధ్వని అనగా ఓంకార నాదము కౌరవుల హృదయములను అనగా సాధకుని హృదయ గ్రంథిని విభేదన చేయును.

## ఓంకారము

| | |
|---|---|
| పాంచజన్యం: | అంతఃకరణ చతుష్టయమును ఏకాగ్రము ఒనరించి జీవుడు ఉచ్ఛరించునది. |
| దేవదత్తం: | దైవము లేదా వేదముచే జీవన్ముక్తికి అనుగ్రహింప బడినది. |
| పౌండ్రం మహాశంఖం: | తెల్లనిది అనగా స్వచ్ఛమైనది. సంసార సాగర తరుణోపాయమనే గొప్ప ఘనకార్యము చేయునది. మహాశంఖం అనగా దుఃఖనివారణ చేయునది. |
| అనంతవిజయం : | ఆత్మస్థానము పొందుటనే గొప్ప విజయమును కలుగచేయునది. |
| సుఘోష : | ఓంకారనాదము వీనులకు ఇంపుగా ఉండును. |
| మణిపుష్పకము : | మణిపుష్పకము అనగా హృదయ కమలమును వికసింప చేయునది. |

కావున ఈ ఓంకార నాదంవలన హృదయ కమలము వికసించును. ఓంకారమును జపించుట వలన ఆత్మ స్థానమును సాధకులు పొందుదురు. ఇది అనంత విజయము. శంఖముల పేర్లతో గూఢముగా ఓంకారమువలన కలుగు ప్రయోజనమును చెప్పినాడు.

ఓంకార నాదము ఆధార చక్రమునుంచి బ్రహ్మ రంధ్రము వఱకు వ్యాపించి హృదయ గ్రంధి విభేదము జరుగును అని గూఢముగా వివరించినాడు. బ్రహ్మగ్రంథి-విష్ణుగ్రంథి-రుద్రగ్రంథిల విభేదన జరుగును.

కౌరవుల రథములు, ఆ రథములకు పూన్చిన గుఱ్ఱముల గుఱించి పేర్కొనలేదు కాని శ్రీకృష్ణార్జునులు ఎక్కిన రథము, దానికి పూన్చిన గుఱ్ఱముల గుఱించి పేర్కొనినాడు.

**ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు ।**
**బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥**

*– కఠోపనిషత్ తృతీయవల్లీ-3*

**ఇంద్రియాణి హయా నాహు ర్విషయాం స్తేషు గోచరాన్ ।**

*– కఠోపనిషత్ తృతీయవల్లీ-4*

| | | |
|---|---|---|
| జీవుడు | – | రథికుడు (అర్జునుడు) |
| దేహము | – | రథము |
| ఇంద్రియములు | – | గుఱ్ఱములు |
| ఇంద్రియార్థములు | – | మార్గములు |
| బుద్ధి | – | సారథి (శ్రీకృష్ణుడు) |
| మనస్సు | – | పగ్గములు |
| శంఖ ధ్వని | – | ఓంకారము |

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే ॥**

*(ముండకోపనిషత్ - తృతీయముండకం - ప్రథమఖండం-1)*

ఈశ్వరుడు, జీవుడు అనే రెండు పక్షులు నిత్యము కలసి ఉండేవి. అవి మంచి స్నేహితులుగా ఒకే దేహమనే వృక్షమును ఆశ్రయించి ఉన్నవి.

కావున కృష్ణార్జునులు ఒకే రథముపై ఉన్నట్లు వివరింపబడినది. రథము అనగా ఈ శరీరము. ఈ శరీరమునందే జీవేశ్వరులు యిద్దఱు ఉందురు. కావున కృష్ణార్జునులు ఒకే రథముపై ఉండిరి. కాని ఆత్మ వేఱు. జీవాత్మ వేఱు. కావున మాధవః – పాండవః అని విడివిడిగా ఏకవచనము ప్రయోగింపబడినది. గుఱ్ఱములు అనగా ఇంద్రియములు. ఆ గుఱ్ఱములు తెల్లనివి. అనగా ఆ ఇంద్రియములు ధర్మపరమైన కార్యములు చేయునవి అని అర్థము.

దేహములో హృదయ గుహలో గల ఆత్మ, దేహముతో మమేకమై ఉండు జీవుడు ఒకే దేహమనే రథముపై నిత్యము ఉందురు. వీరిరువురి తర్వాత ప్రధాన

పాత్ర మనస్సుది. ఆ మనస్సు గొప్పగొప్ప కార్యములు చేయును. ఈ మొత్తం వివరణ, గూఢముగా చెప్పబడినది.

మిగిలిన పాండవసేన ప్రముఖుల శంఖముల పేర్లను పేర్కొనలేదు. ఇవి కౌరవుల శంఖములవలే ఆధ్యాత్మిక విభాగములో ప్రయోజనము లేదు. గతంలో దుర్యోధనుడు పేర్కొన్న వీరులు గాక ఇప్పుడు శిఖండి, దృష్టద్యుమ్నుల పేర్లు కొత్తగా చేరినవి. శ్రీకృష్ణుడుగాక 17మంది పాండవుల ప్రముఖుల గురించి ప్రస్తావించబడినది.

స్థూల శరీరము సూక్ష్మ శరీరములో గల వాటినే రాక్షస దేవతల యుద్ధముగ చెప్పిరి. దీనినే రావణ రాముని సంగ్రామముగా చెప్పిరి. కౌరవ పాండవ యుద్ధముగా చెప్పిరి.

...... ❖ ❖ ❖ ......

**సంజయుడు ధృతరాష్ట్రునితో:** యుద్ధ ప్రారంభ సమయమున దుర్యోధనుడు ద్రోణాచార్యునితో స్వపక్ష, పరపక్ష వీరుల గురించి ప్రస్తావించినాడనియు, ఆ తర్వాత కౌరవ పాండవుల శంఖములను ఊదిరనియు చెప్పి,ఇప్పుడు పాండవుల పక్షమున అర్జునుడు శ్రీకృష్ణునితో పలికిన పలుకులను చెప్పుచున్నాడు. ఈ మాటలలో అర్జునుని ధర్మప్రస్థావన కనిపించుచున్నది. అటులనే ఇటు కథాభాగము అటు ఆధ్యాత్మిక భావన కలిసి ఉన్నది.

అర్జునుడు శ్రీకృష్ణునితో ఉభయసేనామధ్యలో రథము నిలుపుమని చెప్పుట

**అథ వ్యవస్థితాన్ దృష్ట్వా । ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।**
**ప్రవృత్తే శస్త్ర సంపాతే । ధనురుద్యమ్య పాండవః ॥ 20**

అథ – వ్యవస్థితాన్ – దృష్ట్వా – ధార్తరాష్ట్రాన్ – కపిధ్వజః
ప్రవృత్తే – శస్త్ర సంపాతే – ధనుః – ఉద్యమ్య – పాండవః ॥

**హృషీ కేశం తదా వాక్య । మిదమాహ మహీపతే ।**
**సేనయో రుభయోర్మధ్యే । రథం స్థాపయ మేఽచ్యుత ॥ 21**

హృషీ కేశమ్ – తదా – వాక్యమ్ – ఇదమ్ – ఆహ – మహీపతే
సేనయోః – ఉభయోః – మధ్యే – రథమ్ – స్థాపయ – మే – అచ్యుత

**యావ దేతాన్నిరీక్షేఽహం । యోద్ధుకామానవస్థితాన్ ।**
**కైర్మయా సహ యోద్ధవ్యమ్ । అస్మిన్ రణసముద్యమే ॥ 22**

యావత్ – ఏతాన్ – నిరీక్షే – అహమ్ – యోద్ధు కామాన్ – అవస్థితాన్
కైః – మయా – సహ – యోద్ధవ్యమ్ – అస్మిన్ – రణ సముద్య మే

**యోత్స్యమానాన వేక్షేఽహం । య ఏతేఽత్ర సమాగతాః ।**
**ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః । యుద్ధే ప్రియచికీర్షవః ॥ 23**

యోత్స్య మానాన్ – అవేక్షే – అహమ్–(య)యే–ఏతే –అత్ర – సమాగతాః
ధార్తరాష్ట్రస్య – దుర్బుద్ధేః – యుద్ధే – ప్రియచికీర్షవః

ఎప్పుడు

మహీపతే = ఓ ధృతరాష్ట్ర మహారాజా!

శస్త్రసమ్పాతే+ = అస్త్రశస్త్రముల ప్రయోగము
ప్రవృత్తే(సతి)+అస్మిన్+ ప్రారంభమగుచుండగా కౌరవపాండవులు
రణసముద్యమే ఒకేచోట చేరిన యుద్ధ ప్రయత్నమునందు

వ్యవస్థితాన్+ = వేఱువేఱుగా యుద్ధసన్నద్ధులై నిలచియున్న
ధార్తరాష్ట్రాన్+దుర్బుద్ధేః+ కౌరవులను మఱియు దుర్బుద్ధిగల దుర్యోధనునకు
ధార్తరాష్ట్రస్య+ ప్రియము చేయువారలై ఇప్పుడు యుద్ధసన్నద్ధులై
పియచికీర్షవః వచ్చి చేరియున్న కౌరవ సేనాప్రముఖులను
యోత్స్యమానాన్+
సమాగతాః

| | | |
|---|---|---|
| అథ+యోద్ధుకామాన్+ అవస్థితాన్+ఏతాన్+ దృష్ట్వా | = | ఆ తర్వాత పాండవపక్షమున యుద్ధము చేయగోరి నిలచియున్న వీరిని అనగా స్వజనమును చూచి |

**ఎవరు - ఎవరితో**

| | | |
|---|---|---|
| కపిధ్వజః+పాండవః+ ధనుః+ఉద్యమ్య+ హృషీకేశమ్ | = | రథముపై కపిధ్వజముగల అర్జునుడు ఖాండవ దహన సందర్భమున అగ్నిదేవుడు ప్రసాదించిన రథము, అగ్నిదేవుడు ప్రసాదించిన ధనుస్సును చేత ధరించి శ్రీకృష్ణునిగూర్చి (కపిః అనగా విషయవాసనలతో విచలిత మనస్కుడు) |

**ఎక్కడ?**

| | | |
|---|---|---|
| అచ్యుత | = | ఓ శ్రీకృష్ణా! |
| యావత్(తావత్)+ నిరీక్షే+ అహమ్ | = | ఇరుపక్షమునగల వీరులందఱూ కన్పించునంత దూరమున నేను చూచునట్లు |
| ఉభయోః+సేనయోః+ మధ్యే+మే+రథమ్ స్థాపయ | = | ఉభయసేనలమధ్యలో నా యొక్క రథమును నిలుపుము |

**ఎందులకు?**

| | | |
|---|---|---|
| తదా+అత్ర+యుద్ధే+ మయా+సహ+ కైః(అహం)+ యోద్ధవ్యమ్ | | అప్పుడు ఇక్కడ యుద్ధమునందు నాతో ఎవరు మఱియు ఎవరితో నేను యుద్ధము చేయబడవలసి ఉన్నదో |
| ఏతే+యే+అహమ్+ అవేక్షే+ఇదమ్+ వాక్యమ్+ఆహ | = | వారు ఎవరో నేను చూచెదను అని ఇట్లు పలికెను |

**వ్యాఖ్యానము:-** యుద్ధసన్నద్ధులై ఉన్న కౌరవులను, పాండవులను చూచి ధనుస్సు చేబూని ఉభయ సేనలమధ్యలో రథము నిలుపుమని అర్జునుడు శ్రీకృష్ణునితో పలికెను. కౌరవసేనలోని వారిని అనగా సాధకుడు మొదట స్థూలశరీరమును గుఱించి తెలుసుకొనవలయును. దీనినే దేహవిచారణ అని అందురు. అనగా స్థూల శరీరములోని ప్రముఖములయిన నోరు, చేతులు, గుహ్యము అనే కర్మేంద్రియములు చెవులు, కన్నులు, నాలుక అనే జ్ఞానేంద్రియములు వాటి ఇంద్రియార్థముల గుఱించి మఱియు మనస్సు గుఱించిన శాస్త్రవిషయ పరిజ్ఞానమును పొందవలయును. ఇంద్రియార్థములతో మనస్సు కలియుట, ఆపై కర్మేంద్రియములు పాపపుణ్యకర్మలు చేయుట, ఆహారమునకు గుణములకు గల సంబంధము, మొదలయిన వాటిని గుఱించి అధ్యయనము సాధకుడు చేయవలయును. ఆ తర్వాత సాధన ప్రారంభించవలయును. ఆత్మ స్థానమునకు చేరు సాధనలో సత్యము పలుకుట ముఖ్యమైనది. దగా, మోసము, లంచగొండితనము, కల్తీచేయుట, నల్లబజారు, నాసిరకపు కాంట్రాక్ట్ పనులు చేయుట ఇవి అన్నియు దొంగతనము క్రిందకు వచ్చును. ఇట్టి దొంగతనము చేయరాదు. దుష్టసాంగత్యము కూడదు. స్త్రీ వ్యసనము, జూదము, మొదలైన వ్యసనములు ఉండరాదు. మత్తు పానీయములు స్వీకరించరాదు. దుర్గుణములు ఉండరాదు.

యమనియమాదులు, బ్రహ్మచర్యము పాటించవలయును. అప్పుడు యోగ పద్ధతిలో ఓంకారము జపించవలయును. బుద్ధి ద్వారా ఓంకారమును జపించుచూ మనస్సుద్వారా ఆత్మ గుఱించి చింతింపవలయును. అదే భక్తి పద్ధతిలో అయితే నిరంతరము ఇష్ట దేవతా నామస్మరణ చేయుచూ ఆ ఇష్ట దేవతా రూపమును చింతించవలయును.

దేహ విచారణ చేసి, సద్గుణ సంపన్నుడయిన వాడు చేయు ఓంకారోపాసన సత్ఫలితము లిచ్చును. కేవలము ఓంకారమును జపించినచో అది భాండ శుద్ధిలేని పాకమువలె ఉండును.

కపిః – కంపతే చలతీతి కపి, కపి చలనే చలించునది (అమరకోశము) – విషయవాసనలతో విచలితమయిన జీవాత్మ (వైదికకోశ్) శరీరమునందు ఇట్టి విషయవాసనలతో విచలితమైన జీవాత్మయే ప్రధానముగా గలవాడు కపిధ్వజుడు.

పాండు అనగా కొంచెము పసుపు వర్ణముతో కూడిన తెలుపు వర్ణమని అర్థము. కావున కొంచెము తమోగుణము, ఎక్కువగా సత్త్వగుణము కలవాడను అర్థముతో పాండవః అను పదము ప్రయోగింపబడినది.

**నాతో ఎవరెవరు యుద్ధము చేయగోరుచున్నారో** అనగా జీవునకు సుఖ దుః ఖములు ప్రబల శత్రువులు. ఆ సుఖదుఃఖములు మనతో యుద్ధము చేయుచున్నవి. మనము కోరకపోయిన దుఃఖములు వచ్చి జీవునిని క్రుంగదీయును. సుఖ దుః ఖములు కాలానుసారము వచ్చునని తెలిసినను సుఖము గలిగినప్పుడు ఆనందము, దుఃఖము కలిగినప్పుడు విషాదమును జీవుడు పొందుచున్నాడు. ఈ సుఖ దుః ఖములకు విచలితుడు కాకుండా ఉండుట కష్టము. **నేను ఎవరితో యుద్ధము చేయాలి?** చెడు సంకల్పములతో యుద్ధముచేయాలి. ఆ దుష్ట సంకల్పములను సమూలముగా నాశనం చేయాలి. సత్ సంకల్పమును అలాగే ఉంచి సర్వత్ర దృశ్యమానమగుచున్న విరాట్ పురుషునిని దర్శించాలి. హృదయగత ఆత్మను దర్శించాలి. సుఖ దుఃఖములకు విచలితుడు గాకుండా ఉండి, దుష్ట సంకల్పములను నశింపచేసుకొని, సర్వమును అతని దివ్య కళామయమనుచు విష్ణు నందుల్లము చేర్చిన ఆత్మకు శాంతి గలుగును.

భీష్మ, ద్రోణ, కృపాచార్య, అశ్వత్థామ, కర్ణ, వికర్ణాది కౌరవ ప్రముఖులను పూర్వము ఉత్తర గోగ్రహణ సమయములో చూచి అర్జునుడు రెట్టించిన ఉత్సాహముతో యుద్ధము చేసి, వారిని ఓడించి విరాటు రాజుయొక్క గోవులను విడిపించినాడు. అప్పుడు వారితో అర్జునుడు ఒక్కడే తలపడెను. అప్పుడు భయమును పొందలేదు. విషాదమును పొందలేదు. ఇప్పుడు అర్జునునకు బాసటగా శ్రీకృష్ణుడు మఱియు 7 అక్షౌహిణుల సైన్యమున్నది. అయినా విషాదమును ఏల పొందినాడు? అనగా ముండకోపనిషత్తుకు వ్యాఖ్యానముగా ఇప్పుడు అర్జునుడు చిత్రీకరింపబడినాడు.

దుర్బుద్ధిగల అనగా చెడు సంకల్పములు గల జీవునకు ప్రతినిధి దుర్యోధనుడు. మంచి సంకల్పములుగల జీవునికి ప్రతినిధి అర్జునుడు. పాప పుణ్య కార్యములు చేయు ఉపకరణములయిన నోరు, చేతులు, గుహ్యము, చెవులు, కన్నులు, నాలుక, మనస్సు ఇవి జీవునకు ప్రియము చేయునవి. వీటిని జయించి సత్త్వగుణ సంపన్నుడు

కావలయును. దీనిని కథాపరముగా భీష్మాదులను జయించుటగా వర్ణింపబడినది. భీష్ముడనగా జలతత్త్వము. జలతత్త్వమునుండి వచ్చినది చిత్తము. కావున చిత్తమును శుద్ధి చేయవలయును.

...... ❖ ❖ ❖ ......

ఉభయసేనామధ్యలో రథమును నిలిపి కౌరవులను చూడుమని

శ్రీకృష్ణుడు అర్జునునితో చెప్పుట

**ఏవ ముక్తో హృషీకేశో । గుడాకేశేన భారత ।**
**సేనయో రుభయోర్మధ్యే । స్థాపయిత్వా రథోత్తమమ్ ॥ 24**

ఏవమ్ - ఉక్తః - హృషీకేశః- గుడాకేశేన - భారత -
సేనయోః - ఉభయోః - మధ్యే - స్థాపయిత్వా - రథోత్తమమ్ ॥

**భీష్మ ద్రోణ ప్రముఖతః । సర్వేషాం చ మహీక్షితామ్ ।**
**ఉవాచ పార్థ పశ్యైతాన్ । సమవేతాన్ కురూనితి ॥ 25**

భీష్మ ద్రోణ ప్రముఖతః - సర్వేషామ్ - చ - మహీక్షితామ్ -
ఉవాచ - పార్థ - పశ్య - ఏతాన్ - సమవేతాన్ - కురూన్ ఇతి.

భారత = ఓ ధృతరాష్ట్ర మహారాజా!

గుడాకేశేన+ఏవమ్+ ఉక్తః+హృషీకేశః = ఉభయ సేనల మధ్యలో రథము నిలుపు అని అర్జునునిచే ఆ విధముగా చెప్పబడిన శ్రీకృష్ణుడు

ఉభయోః+సేనయోః+ మధ్యే+ భీష్మద్రోణప్రముఖతః+చ+ సర్వేషామ్+మహీక్షితామ్+ రథోత్తమమ్+స్థాపయిత్వా = ఉభయసేనల మధ్యలో భీష్మ, ద్రోణాచార్య, కృపాచార్య, అశ్వత్థామాది ప్రముఖుల సమక్షమున సర్వ రాజుల సమక్షమున ఉత్తమమయిన అర్జునుని రథమును నిలిపి మఱియు శ్రీకృష్ణుడు అర్జునునితో

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| సమవేతాన్+ఏతాన్+<br>కురూన్+పశ్య+ఇతి+<br>ఉవాచ | = | ఈ యుద్ధ రంగమునకు యుద్ధము చేయుటకు కలసికట్టుగా వచ్చిన ఈ కౌరవులను చూడుము అని పలికెను. (కర్తృత్వము జీవునిది. ఆ కర్మ ఫలితము కూడా జీవునిదే. ఆత్మ సాక్షీభూతుడు.) |

స్వజనములో మనకు మంచి వారియందు మోహము గలుగును. అనగా రాగము గలుగును. చెడ్డవారియందు కోపము, ద్వేషము గలుగును. మనకు సంబంధించిన వారి యందే రాగద్వేషములు గలుగును. మనకు సంబంధములేని వారియందు ఏ భావమూ కలుగదు.

...... ❖ ❖ ❖ ......

అర్జునుడు స్వజనమును చూచి తన స్థితిని శ్రీకృష్ణునితో చెప్పుట

**తత్రా పశ్యత్థ్సితాన్ పార్థః । పితౄనథ పితామహాన్ ।**
**ఆచార్యాన్మాతులాన్ భ్రాతౄన్ । పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా॥26**

తత్ర - అపశ్యత్ - స్థితాన్ - పార్థః - పితౄన్ - అథ - పితామహాన్
ఆచార్యాన్ - మాతులాన్- భ్రాతౄన్ - పుత్రాన్ - పౌత్రాన్-సఖీన్-తథా

**శ్వశురాన్ సుహృదశ్చైవ । సేనయోరుభయోరపి ।**
**తాన్ సమీక్ష్య స కౌన్తేయ । స్సర్వాన్ బన్ధూనవస్థితాన్ ॥ 27**

శ్వశురాన్ - సుహృదః - చ- ఏవ - సేనయోః - ఉభయోః - అపి
తాన్ - సమీక్ష్య - సః - కౌన్తేయః - సర్వాన్ - బన్ధూన్-అవస్థితాన్

**కృపయా పరయావిష్టో । విషీదన్నిదమబ్రవీత్ ।**

అర్జున ఉవాచ

**దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్ ॥28**

కృపయా - పరయా - ఆవిష్టః - విషీదన్ - ఇదమ్ - అబ్రవీత్
దృష్ట్వా-ఇమమ్ - స్వజనమ్ - కృష్ణ -యుయుత్సుమ్ - సముపస్థితమ్ ॥

29,30 శ్లోకములు సంధిసమాసములతో చెప్పబడినవి

**సీదన్తి మమ గాత్రాణి । ముఖం చ పరిశుష్యతి ।**
**వేపథుశ్చ శరీరే మే । రోమహర్షశ్చ జాయతే ॥ 29**

సీదన్తి - మమ - గాత్రాణి - ముఖమ్ - చ - పరిశుష్యతి
వేపథుః - చ - శరీరే - మే - రోమహర్షః - చ - జాయతే ॥

**గాండీవం స్రంసతే హస్తాత్ । త్వక్చైవ పరిదహ్యతే ।**
**న చ శక్నోమ్యవస్థాతుం । భ్రమతీవ చ మే మనః ॥ 30**

గాండీవమ్ - స్రంసతే - హస్తాత్ - త్వక్ - చ - ఏవ - పరిదహ్యతే
న - చ- శక్నోమి - అవస్థాతుమ్ - భ్రమతి - ఇవ - చ - మే - మనః

| | | |
|---|---|---|
| అథ | = | శ్రీకృష్ణుడు రథమును నిలిపిన తర్వాత |
| పార్థః+ఉభయోః+ సేనయోః+అపి | = | అర్జునుడు ఉభయసేనలలోగల వారి నందరిని కూడా |
| తత్ర+స్థితాన్ | = | అక్కడ యుద్ధభూమిలో యుద్ధముచేయుటకు సన్నద్ధులై నిలచి కౌరవ ప్రముఖులతో |
| పితామహాన్+చ+ పితౄన్+పుత్రాన్+ పౌత్రాన్+భ్రాతౄన్+ మాతులాన్+శ్వశురాన్+ తథా+సఖీన్ | = | ముత్తాతలను, తాతలను (బాహ్లికుడు, భీష్ముడు) తండ్రులను (భూరిశ్రవుడు) పుత్రులను (లక్ష్మణకుమారుడు) మనుమలను సోదరులను (కౌరవాదులు) మేనమామలను (శల్యుడు) పిల్లనిచ్చిన మామలను (ద్రుపదుడు, |

| | | |
|---|---|---|
| సుహృదః+ఏవ | | విరాటుడు) అట్లే (బావమరదులను, ధృష్టద్యుమ్నుడు మొ॥) స్నేహితులను (అశ్వత్థామ) సహృదయులను (కాశీరాజు) |
| ఆచార్యాన్+సః+<br>కౌంతేయః+అపశ్యత్ | = | గురువులను (ద్రోణ, కృపాచార్యులు) ఆ అర్జునుడు చూచెను |
| అవస్థితాన్+తాన్+<br>సర్వాన్+బంధూన్+<br>సమీక్ష్య+<br>యుయుత్సుమ్+<br>సముపస్థితమ్+ఇమమ్+<br>స్వజనమ్+దృష్ట్వా | = | యుద్ధరంగమున నిలచియున్న సర్వ బంధువులను చూచి యుద్ధమున పాల్గొనుటకు వచ్చి యుద్ధరంగమున వ్యూహముగా నిలచిన ఈ స్వజనమును చూచి |
| పరయా+కృపయా+<br>ఆవిష్టః+విషీదన్+<br>ఇదమ్+అబ్రవీత్ | = | మిక్కిలి కృపతో కూడినవాడై వారు చనిపోవుదురని దుఃఖపరవశుడై ఇట్లు పలికెను |
| కృష్ణ+మే+శరీరే<br>వేపథుః+చ | = | ఓ శ్రీకృష్ణా! నా యొక్క శరీరమునందు వణుకు గలుగుచున్నది. (ఆసనములో స్థిరత్వము రానప్పుడు శరీరము అటు ఇటు ఊగిస లాడును.) |
| ముఖమ్+పరిశుష్యతి+చ | = | నోరు బాగా ఎండిపోవుచున్నది. (ఓంకారోపాసన కొంతసేపు చేసిన తరువాత నోరు ఎండిపోవును.) |
| మే+మనః+<br>భ్రమతి+చ | = | నా యొక్క మనస్సు చలించుచున్నది. (మనస్సు స్థిరముగా ఉండక లోక వ్యవహారములలో మనస్సు పరిభ్రమించుచుండును. మనస్సుకు ఏకాగ్రత కుదురుట లేదు.) |
| మమ+గాత్రాణి+ | = | నా యొక్క అంగములు పట్టు తప్పుచున్నవి. |

| | | |
|---|---|---|
| సీదన్తి+చ | | (తొడలు బరువు ఎక్కుచు మిగిలినవి తిమ్మిరి ఎక్కినట్లై పట్టు తప్పును.) |
| హస్తాత్+గాండీవమ్+ స్రంసతే + చ | = | చేతినుండి గాండీవమనే ధనుస్సు జాఱిపోవుచున్నది. ఇది కథాభాగము. (యోగ పరంగా చేతిలోయున్న జపమాల చేతినుంచి జారి క్రిందపడును.) |
| త్వక్+ఏవ+పరిదహ్యతే+ చ | = | చర్మము అంతా మండిపోవుచున్నట్లుగా యున్నది. (కుండలినీ శక్తి ఆధారచక్రమునుండి లేచు సమయమున చర్మము మండిపోవుచున్నట్లుగా యుండును. పైకి చర్మము మామూలుగానే ఉన్నట్లు కనబడును. కాని లోపల మండిపోవునట్లుగా ఉండును.) చాలాసేపు ఆసనములో కూర్చొన్న తరువాత |
| అవస్థాతుమ్+ న+శక్నోమి+చ | = | లేచి నిలబడుటకు శక్యము గాకున్నాను. (ఆసనమునుండి లేచి నిలబడుటకు ప్రయత్నించిన శక్యముకాదు సరిగదా ఆపరిస్థితిలో చాలాసార్లు నేలపై పట్టుతప్పి సాధకుడు పడిపోవును. నిద్రాణమైయున్న కుండలినీ శక్తి ఒక్కసారిగా మేల్కొని విజృంభించిన స్థితిలో ఇటువంటి అనుభవమునకు వచ్చును.) |
| (శరీరే)రోమహర్షః+ ఇవ+జాయతే | = | శరీరమునందు గగుర్పాటు అనగా సంతోషముచే రోమములు నిక్కబొడుచుకొని ఆనందము కలుగుచున్నది. |

**వ్యాఖ్యానము :-** వీరునకు శత్రువులను చూచిన కోపము కట్టలు తెంచుకొని

ప్రవహించును. వీరుడు శత్రువు పైకి లంఘించును, శత్రువును ఓడించ వలయుననే భావన గల్గును. పిరికి వాడు శత్రువులను చూచి, వెన్నుచూపి పాటిపోవును లేదా వారిని శరణు కోరును. కాని లోకవ్యవహారమునకు భిన్నముగా అర్జునునకు కృప గలిగినది. ఈ కృప అనే పద ప్రయోగములు చేసి, సామాన్య జీవి లక్షణములు, దేహ సంబంధీకులయిన బంధువులఎడ గలుగు భావనలను తద్వారా జీవుడు పట్టు పురుగువలె మమతానురాగములతో చిక్కుకొని సంసారబద్ధుడగుచున్నాడనే విషయమును వ్యాసభగవానుడు చెప్పదలచినాడు.

మోహ, మద, మాత్సర్యములు – తమో గుణమునకు సంబంధించినవి. కామ, క్రోధములు, లోభము – రజో గుణమునకు సంబంధించినవి. కృప, కరుణ, జాలి, దయ, మమకారము – ఇవి మోహ లక్షణములు. ఇవి అన్నియూ అజ్ఞాన లక్షణములు.

**మోహలక్షణములు :**

మమత్వ ప్రేమ దైన్యజనకులయిన – తల్లిదండ్రులను; కామిత ఫలప్రదాతలైన– సోదరులను; రహస్య సంభోగ చాతుర్య సౌందర్య విశేషములయిన – భార్యలను; మహనీయ మంజుల మధురాలాపంబులు వినయ విద్యాలంకారులయిన శిశువులను (కొడుకులు); శీల వయోరూప ధన్యులయిన – కన్యకలను; సౌజన్య సింధువులయిన – బంధువులను; ప్రాణంబు కంటె మధురానుమయమయిన తృష్ణ గలిగి, వంశ పరంపరాయత్తంబు లయిన విత్తంబులు వర్జింప నేరక ధన, కనక, వస్తు, వాహన, సుందర మందిరంబులును, పశు, భృత్య నికరంబులను వర్జింపలేక, సంసారంబు వర్జించు నుపాయము గానక, స్వయంకృత కర్మ బద్ధుండై, నిజ కుటుంబ పారవశ్యమున విరక్తి మార్గంబు తెలియక, స్వకీయ పరకీయ భిన్న భావంబున సంసార నరకంబున పడును అని ప్రహ్లాదుడు సప్తమస్కంధం – 213లో చెప్పినాడు.

సంసారికి దేహ సంబంధీకుల యందు మోహము సిద్ధంబై యుండును. దేహ సంబంధీకులు మరణించినా, వస్తు వాహనాదులు పోయినా, సంసారికి దుఃఖము గలుగును. మొదట మోహము (కృప) గలుగును. ఆతర్వాత అవి నశించిన దుఃఖము కల్గును. కావున "కృపయా ఆవిష్టః విషీదన్ ఇదమ్ అబ్రవీత్" అని

చెప్పబడినది.

జడభరతుని పూర్వజన్మ అయిన భరతునికి, లేడిపిల్లపై మమకారము గలిగినది. ఆ విధంబుగా లేడిపిల్లపై మోహము గలిగినది. ఆమోహమువలన అతడు యోగ భ్రష్ఠుడై మరల లేడి కడుపున జన్మించి తదుపరి జన్మలో జడభరతునిగా మమతాను రాగములకు అంటక, స్థితప్రజ్ఞుడు అయినాడు. కావున కృప పునర్జన్మకు హేతువు అగును.

తను ఎవరు? ఈ దేహము తనకు ఎటుల సంభవించినది? దేహ సంబంధీకులకు తనకు గల సంబంధము శాశ్వతమా? లేక తాత్కాలికమా? అని విచారించిన జ్ఞానము కలుగును. దేహసంబంధీకులకు తనకుగల సంబంధము చలివేంద్రములోని బాటసారుల వంటిది అని హిరణ్యకశిపుడు భాగవతం – సప్తమస్కంధం – 38లో తన తల్లితో చెప్పును.

అజ్ఞాన జనితమయిన దుఃఖము మనిషిని క్రుంగదీయును. అప్పుడు తాత్కాలిక వైరాగ్యము గలుగును. దీనినే స్మశాన వైరాగ్యము అని అందురు. అటులనే పురాణ వైరాగ్యము, ప్రసూతి వైరాగ్యముకూడా తాత్కాలిక వైరాగ్యముల క్రింద పరిగణింపబడును. తాత్కాలిక వైరాగ్యము ఓటి పడవ వంటిది. ఈ పడవ భవ సాగరమును దాటించలేదు.

కథాపరంగా అర్జునుడు నివాతకవచకేయులతో యుద్ధముచేసి, వారిని సంహరించినాడు. అప్పుడు కృపగలుగలేదు. కొన్ని నెలల క్రిందట ఉత్తర గోగ్రహణ సమయమున తను ఒక్కడే కౌరవులతో యుద్ధము చేసినాడు. అప్పుడు కృప గలుగలేదు. విషాదమును పొందలేదు.

అటువంటిది నేడు ఏల కృప గలిగినది? విషాదము ఏల గలిగినది? ఇచ్చట అజ్ఞానముతో ఉన్న సామాన్య జీవి లక్షణములు చెప్పదలచి, వ్యాసభగవానుడు ఈ విధముగా అర్జునుని పరంగా వర్ణించినాడు.

భయము గలిగిన ఒక వ్యక్తి వణికిపోవును. అడుగు ముందుకు పడదు. కృప

గలిగిన చర్మము మండిపోదు. కావున ఇచ్చట ఓంకారోపాసన చేయు సాధకుని ప్రారంభానుభవమును అనగా **కుండలినీ శక్తి జనియించిన** కాలమునాటి అనుభవములను చెప్పుచున్నాడు అని గ్రహించవలెను.

ఈవిధముగా ప్రారంభములో యోగములో గలుగు పరిస్థితులను అర్జునుని పరంగా 29, 30 శ్లోకములలో వర్ణింపబడినది. యుద్ధభూమిలో కృపగలిగిన అర్జునునకు పైన ఉదహరించిన పరిస్థితులు గలుగవు.

యోగములో కుండలినీ శక్తి విజృంభణ సమయమున గలుగు అనుభూతులను కాలకూటవిషము వచ్చిన సందర్భమున వర్ణింపబడినది.

(భాగవతం – అష్టమస్కంధం– 216)

...... ❖ ❖ ❖ ......

అపశకునములను, అపరధర్మములను చెప్పి
జ్ఞాతులను సంహరించనని అర్జునుడు చెప్పుట

**నిమిత్తాని చ పశ్యామి । విపరీతాని కేశవ ।**
**న చ శ్రేయోఽను పశ్యామి । హత్వా స్వజనమాహవే ॥ 31**

నిమిత్తాని – చ – పశ్యామి – విపరీతాని – కేశవ
న – చ – శ్రేయః – అను పశ్యామి – హత్వా – స్వజనమ్ – ఆహవే ॥

సంధి సమాసములతో ఈ దిగువ శ్లోకము గలదు.

**న కాంక్షే విజయం కృష్ణ । న చ రాజ్యం సుఖాని చ ।**
**కింనో రాజ్యేన గోవింద । కిం భోగైర్జీవితేన వా ॥ 32**

న – కాంక్షే – విజయమ్– కృష్ణ – న – చ – రాజ్యమ్–సుఖాని – చ
కిమ్ – నః – రాజ్యేన – గోవింద – కిమ్ – భోగైః – జీవితేన – వా

**యేషా మర్థే కాంక్షితం నో । రాజ్యం భోగాః సుఖాని చ ।**
**త ఇమేఽవస్థితా యుద్ధే । ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ ॥ 33**

యేషామ్–అర్థే–కాంక్షితమ్–నః–రాజ్యమ్–భోగాః – సుఖాని– చ
త(తే)–ఇమే–అవస్థితాః–యుద్ధే–ప్రాణాన్–త్యక్త్వా–ధనాని–చ

**ఆచార్యాః పితరః పుత్రా । స్తథైవ చ పితామహాః ।**
**మాతులాః శ్వశురాః పౌత్రాః । శ్యాలాః సంబంధినస్తథా ॥34**

ఆచార్యాః – పితరః – పుత్రాః – తథా – ఏవ – చ – పితామహాః
మాతులాః – శ్వశురాః – పౌత్రాః – శ్యాలాః – సంబందినః – తథా

**ఏతాన్న హంతుమిచ్ఛామి । ఘ్నతోఽపి మధుసూదన ।**
**అపి త్రైలోక్య రాజ్యస్య । హేతోః కిం ను మహీకృతే ॥ 35**

ఏతాన్ – న – హంతుమ్ – ఇచ్ఛామి – ఘ్నతః – అపి – మధుసూదన
అపి – త్రైలోక్య రాజ్యస్య – హేతోః – కిమ్ – ను – మహీకృతే ॥

**అపశకునములు:**

చేతినుంచి గాండీవం జాఱిపోవుచున్నది.

| | |
|---|---|
| చ+ఆహవే+ | = మఱియు యుద్ధభూమియందు |
| విపరీతాని+నిమిత్తాని+ | విపరీతములైన అనేకఅశుభ శకునములు |
| పశ్యామి | చూచుచున్నాను |

యుద్ధరంగములో గలుగు అపశకునముల గుఱించి, రామాయణంలో పంచవటివద్ద రాముడు 14 వేల రాక్షసులతో యుద్ధము చేయు సమయమున వర్ణింప బడినది. అటులనే రామ–రావణ సంగ్రామ సమయమున వర్ణింపబడినది.

**అపర ధర్మములు :**

| | | |
|---|---|---|
| చ+కేశవ+స్వజనమ్+<br>హత్వా+శ్రేయః+<br>న+అనుపశ్యామి | = | మఱియు ఓ శ్రీకృష్ణా! బాంధవులను చంపి అనగా చంపుటవలన శ్రేయస్సును యుద్ధానంతరము చూడజాలకున్నాను |

**ఇప్పుడు ఇటు కథా పరముగా అటు అధ్యాత్మ పరంగా యిట్లు 32 నుంచి 35 వఱకు చెప్పుచున్నారు.**

**కథాపరంగా :**

తాత్కాలిక వైరాగ్యము గలిగిన అర్జునుడు. అపరధర్మములను ప్రస్తావించు చున్నాడు.

| | | |
|---|---|---|
| గోవింద | = | ఓ శ్రీకృష్ణా! స్వజనమయిన కౌరవులను చంపి సంపాదించిన |
| రాజ్యేన+భోగైః+కిమ్+<br>నః+వా+జీవితేన+<br>కిమ్ | = | రాజ్య భోగములతో మనకు ఏమి ఆనందము గలుగును. అనగా ఆనందము కలుగదు అని అర్థము. జీవితముతో మనకేమి ప్రయోజనము? అనగా బంధువులందఱు చనిపోగా మనము బ్రతికుండి పొందు ఆనందము ఏమి? అనగా ఆనందము ఉండదు. |
| నః+యేషామ్+అర్థే+<br>రాజ్యమ్+చ+భోగాః+<br>సుఖాని+కాంక్షితమ్ | = | మనము ఎవరియొక్క ప్రయోజనమునందు అనగా మన పుత్రులు, మనుమలు, మనవారి ప్రయోజనము కొఱకు రాజ్య సంపదను మఱియు భోగములు సుఖములు కోరబడినవో |
| (త)తే+ఇమే+యుద్ధే+<br>ప్రాణాన్+చ+ధనాని<br>త్యక్త్వా | = | అట్టి ఈ మన ఆత్మీయులు యుద్ధమునందు ప్రాణములను మఱియు వారు పాలించుచున్న రాజ్యములను ధనములను తృణప్రాయముగా విడచి ఈ యుద్ధరంగమున |

| | | |
|---|---|---|
| ఆచార్యాః+చ+ పితామహాః+పితరః+ తథా+పుత్రాః+పౌత్రాః+ మాతులాః+శ్వశురాః+ శ్యాలాః+తథా+ సంబన్ధినః+ఏవ | = | గురువులు మఱియు ముత్తాతలు, తాతలు తండ్రులు ఆవిధముగనే సోదరులు, పుత్రులు, మనుమలు, మేనమామలు, పిల్లనిచ్చిన మామలు అట్లే మిగిలిన మన బంధువులు, స్నేహితులు, ఈ యుద్ధరంగమున |
| అవస్థితాః | = | తమ ప్రాణములను తృణముగా భావించి యుద్ధ రంగమున ప్రాణములను పణముగా పెట్టి నిలబడి యున్నారు. |

**ఆధ్యాత్మిక పరంగా :**

ఆత్మస్థానమును పొందగోరు సాధకుని లక్షణములు చెప్పుచున్నాడు.

| | | |
|---|---|---|
| కృష్ణ | = | ఓ శ్రీకృష్ణా! |
| విజయమ్+న+కాంక్షే | = | యుద్ధములో విజయమును కోరను అనగా విశాల సామ్రాజ్యము కోరను |
| చ | = | మఱియు |
| రాజ్యమ్+చ+సుఖాని+ న | = | రాజ్యమును ఇహలోక పరలోక సుఖములు కోరను మఱియు, ఈతిబాధలు గలుగకుండు నట్లును కోరను. (ఆత్మస్థానమును పొందగోరు వానికి ఇహలోక పరలోక సుఖభోగములందు కోరిక ఉండరాదు.) |
| మధుసూదన | = | ఓ శ్రీకృష్ణా! |
| త్రైలోక్య రాజ్యస్య+ హేతోః+అపి+ఏతాన్+ హంతుమ్+న+ ఇచ్ఛామి | = | త్రిలోకాధిపత్యము లభించునన్న కూడా వీరిని చంపుటకు ఇష్టపడను అటువంటప్పుడు |

| | | |
|---|---|---|
| మహీకృతే+ను+కిమ్+ ఘ్నతః+అపి | = | ఈ భూమండల సామ్రాజ్యమునకై చంపనని చెప్పవలయునా ఏమి? వారిచే నేను చంపబడినను వీరిని నేను చంపను. |

**వ్యాఖ్యానము :-** నేను బంధువులను చంపనందువలన, నాకు పాపము రాదు. వారు నన్ను చంపిన బంధువును చంపిన పాపము వారికి వచ్చును. ఆ పాపమువలన వారు నరకమున బడుదురు.

వధ పాపమును గలుగచేయును. పాప ఫలితము నరకము. కావున బంధువులను చంపుటవలన నరకము గలుగుననే అపరధర్మము చెప్పబడినది.

సుఖములు

|-------------------------------|

ఇహలోక సుఖములు (ప్రేయస్సు) పరలోక సుఖములు (శ్రేయస్సు)

**ఇహలోక సుఖములు:**

1. భార్య, పిల్లలు, మనుమలు: అనుకూలవతి అయిన భార్యవలన, అనుకూలవతులయిన పుత్ర పౌత్రులవలన కలుగు సుఖము.
2. **వస్తు వాహనములు:** వృత్తి వ్యాపారములవలన సంపాదించిన ధనముతో వస్తు వాహనాదులను పొందుటవలన గలుగు సుఖము, విశాల సామ్రాజ్యము, బంగారము, మణులు, మాణిక్యములు, ధనరాశులు, చక్కని మేడలు, రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, పశు సంపద (గోవులు) షడ్రసోపేతమయిన ఆహారము, మధుర పానీయములు మొదలయిన వాటివలన గలుగు సుఖము.
3. పుణ్యకర్మానుష్ఠానము చేసి దేవతలను ప్రసన్నము చేసుకొని వరములను పొంది తద్వారా పొందబడు సుఖము అవి అన్నియు ప్రేయస్సుకు సంబంధించినవి.

**ఇహలోక సుఖములలోని దోషములు:** ఇహలోక సుఖములు క్షణభంగురములు. మానవులు జీవించి వున్నంతవఱకే వీటిని అనుభవించగలడు. ఆరోగ్యము బాగుగా ఉన్నప్పుడే వీటిని అనుభవించగలడు. ప్రతి కూలురాలు అయిన భార్యవలన, కుపుత్రులవలన, దుర్మార్గులైన మనుమల వలన అశాంతి తప్ప సుఖముండదు.

విశాల సామ్రాజ్యము పొందినను శాంతి కలుగదు. ధన, కనక, వస్తు వాహనాదులు, సంపాదించినను అవి దొంగలబారిన పడకుండా కంటిమీద కునుకు లేకుండా వాటిని రక్షించుకోవలయును. వాటిని దొంగలు అపహరించిన మనస్సుకు అశాంతి గలుగును. ఈవిధముగ వీటిని పొంది, సుఖము అనుభవించుచున్నను, మానసిక అశాంతి తప్పదు.

**పరలోక సుఖములు:** 1. స్వర్గలోక ప్రాప్తి. 2. అమర సుఖములు అనుభవించుట. 3. అప్సరసల తోడి సంభోగ సుఖము. వీటిని పుణ్య కర్మానుష్ఠానము చేతనే పొందవలసి ఉండును. ఇవి కేవలము ధనముచే పొందబడవు.

**పరలోక సుఖములలోని దోషములు:**

పుణ్యము క్షీణించగానే తిరిగి భూలోకమున జన్మించవలసి ఉండును. అప్పుడు ఆజీవునికి స్వర్గ సుఖములన్ని పోవును. పరలోక సుఖములు అశాశ్వతములు.

ఇహలోక పరలోక సుఖములను ప్రేయస్సుగాను, ఆత్మస్థానమును పొంది ఆత్మయై విరాజిల్లుటను శ్రేయస్సుగాను చెప్పుదురు.

ఆత్మ స్థానమును పొందగోరు సాధకునికి ఈ విశాల సామ్రాజ్యము అనగా రాజ్యము, అటులనే మిగిలిన ఇహలోక సుఖములు మఱియు పరలోక సుఖములు వ్యర్థములు. వీటిని తృణీకరించి, ఆత్మ గుఱించి గ్రహించి అమృతత్త్వమును పొందవలయును.

ఈ విషయమునే కఠోపనిషత్‌లో నచికేతుడు యమునిచే ఇహలోక పరలోక సుఖములు ప్రసాదింతునని ప్రలోభపెట్టినను వాటిని తృణీకరించి, యమునిచే ఆత్మ గుఱించిన విషయములు గ్రహించి, సాధనచే ఆత్మస్థానమును పొందినాడు.

కఠోపనిషత్‌లో చెప్పిన విషయములనే, అర్జునుడి పరంగా ఇహలోక, పరలోక సుఖములు కోరనని చెప్పబడినది. వీటినే ఆతర్వాత తర్వాత సాధన చతుష్టయములలో ఇహమూత్రార్థఫల భోగ విరాగము, తీవ్ర మోక్షేచ్ఛలుగా చెప్పబడినవి.

...... ❖ ❖ ❖ ......

**నిహత్య ధార్త రాష్ట్రాన్నః । కా ప్రీతిః స్యాజ్జనార్దన ।**
**పాపమేవాశ్రయేదస్మాన్ । హత్వైతానాతతాయినః ॥ 36**

నిహత్య – ధార్తరాష్ట్రాన్ – నః – కా – ప్రీతిః – స్యాత్ – జనార్దన
పాపమ్–ఏవ–ఆశ్రయేత్–అస్మాన్–హత్వా–ఏతాన్–ఆతతాయినః

**తస్మాన్నార్హా వయం హంతుం । ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్ ।**
**స్వజనం హి కథం హత్వా । సుఖినః స్యామ మాధవ ॥ 37**

తస్మాత్–న–అర్హాః–వయమ్–హంతుమ్–ధార్తరాష్ట్రాన్–స్వబాంధవాన్
స్వజనమ్ – హి – కథమ్ – హత్వా – సుఖినః – స్యామ–మాధవ

**యద్యప్యేతే న పశ్యంతి । లోభోపహతచేతసః**
**కులక్షయకృతందోషం । మిత్ర ద్రోహే చ పాతకమ్ ॥ 38**

యది – అపి – ఏతే – న – పశ్యంతి – లోభోపహతచేతసః
కుల క్షయ కృతమ్ – దోషమ్ – మిత్ర ద్రోహే – చ – పాతకమ్

జనార్దన = ఓ శ్రీకృష్ణా!

ఆతతాయినః+ధార్తరాష్ట్రాన్+నిహత్య+నః+కా+ప్రీతిః+స్యాత్ = మనలను చంపదలచిన వారైన దుర్మార్గులగు కౌరవులను చంపి రాజ్యమును పొందిన మనకు ఏమి సంతోషము కలుగును అనగా సంతోషము గలుగదు.

ఏతాన్+హత్వా+అస్మాన్+పాపమ్+ఏవ+ఆశ్రయేత్ = వీరిని చంపి అనగా బంధువులను చంపుటవలన మనకు పాపమే కలుగును

తస్మాత్ = అందువలన అనగా ధర్మదృష్టితో చూచినచో

మాధవ = ఓ శ్రీకృష్ణా!

| | | |
|---|---|---|
| స్వబాంధవాన్+<br>ధార్తరాష్ట్రాన్+<br>హంతుమ్+వయమ్+<br>న+అర్హాః+హి+ | = | మన జ్ఞాతులయిన కౌరవులను వధించుటకు మనము తగము ఆ కారణమున |
| స్వజనమ్+హత్వా+<br>కథమ్+సుఖినః+స్యామ | = | స్వజనమును అనగా బాంధవులను మిత్రులను, గురువులను, సహృదయులను, వధియించి ఎట్లు-పరలోకమున హాయిగా ఉండగలము. అనగా పుణ్యలోకములను ఎట్లు పొందగలము? |
| లోభోప హతచేతసః+<br>ఏతే+న+పశ్యంతి+<br>యది+అపి | = | రాజ్యలోభముచే బుద్ధి నశించిన వారైన ఈ కౌరవులు పాప పుణ్యములను చూచుట లేదు. వారు చూడకపోయినను కూడా, ధర్మాధర్మ విచక్షణ గల మనము అయినా పాప పుణ్యములను గ్రహించ వలయును కదా |

**అపర ధర్మములు చెప్పుచున్నాడు :**

| | | |
|---|---|---|
| కులక్షయ కృతమ్+<br>దోషమ్+చ+<br>మిత్ర ద్రోహే+పాతకమ్ | = | కులక్షయము చేసిన పాపము, దోషము మఱియు మిత్రద్రోహము చేసిన పాతకము వచ్చును. |

**వ్యాఖ్యానము:-** యుద్ధములో తనను చంపవచ్చినవాడు వేదాంతవేది అయినను, అతనిని చంపిన పాపమురాదు. ఐతే మన బంధువులు దుర్మార్గులయినను వారిని మనమే చంపిన పాపము గల్గును. బంధు మరణము విషాదమును గల్గించును గాని సంతోషమును గల్గించదు. పెద్దలను, గురువులను, స్నేహితులను, సహృదయులను, బాంధవులను చంపుట పాపము అనే అపరధర్మము ఇందు ప్రతిపాదింపబడినది.

**అపరధర్మములు :**

**బంధువులను వధించుట పాపము. కుల క్షయముచేయుట పాపము. మిత్ర ద్రోహము చేయుట పాపము.**

రామాయణములో రాముడు రాక్షస కులమును సంహరించి కుల క్షయము చేసినాడు. అయినా పాపము అంటదు. ఇది విశేష ధర్మము క్రింద పరిగణింపబడును.

అపర ధర్మములలో సామాన్య ధర్మములు, ఆపత్కాల ధర్మములు, విశేష ధర్మములు ఉండును. వీటిని పెద్దల వలన ధర్మ సూక్ష్మములను అడిగి తెలుసుకొనవలసి ఉండును.

గోహత్య, సురాపానము, దొంగతనము చేసిన వానికి ప్రాయశ్చిత్తములు పెద్దలు చెప్పియున్నారు. కాని మిత్రద్రోహికి, కృతఘ్నునికి ప్రాయశ్చిత్తము లేదని బ్రహ్మదేవుడు పలికెను. (రామాయణం – కిష్కింధ కాండ–34 సర్గ 12వ శ్లోకము)

**పూర్వం కృతార్థో మిత్రాణాం న తత్ప్రతి కరోతి యః ।**
**కృతఘ్నః సర్వభూతానాం స వధ్యః ప్లవగేశ్వర ॥**

*(రామాయణం – కిష్కింధకాండ 34 సర్గ 10వ శ్లోకము)*

సుగ్రీవా! ఎవడు పూర్వము మిత్రునిచే ఉపకారమును పొంది మరల మిత్రునకు ప్రత్యుపకారము చేయడో వాడు కృతఘ్నుడు. అట్టి కృతఘ్నుడు సకల భూతములచే చంపదగినవాడు.

...... ❖ ❖ ❖ ......

**కథం న జ్ఞేయమస్మాభిః । పాపాదస్మాన్నివర్తితుమ్ ।**
**కులక్షయకృతం దోషం । ప్రపశ్యద్భిర్జనార్దన ॥ 39**

కథమ్ – న–జ్ఞేయమ్ – ఆస్మాభిః – పాపాత్ – అస్మాత్ – నివర్తితుమ్
కులక్షయకృతమ్–దోషమ్ – ప్రపశ్యద్భిః – జనార్దన

**కులక్షయే ప్రణశ్యంతి । కులధర్మాః సనాతనాః ।**
**ధర్మేనష్టే కులం కృత్స్నమధర్మోஉభి భవత్యుత ॥ 40**

కులక్షయే – ప్రణశ్యంతి – కులధర్మాః – సనాతనాః
ధర్మే – నష్టే – కులమ్ – కృత్స్నమ్ – అధర్మః – అభిభవతి – ఉత

**అధర్మాభిభవాత్కృష్ణ । ప్రదుష్యంతి కులస్త్రియః ।**
**స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ । జాయతే వర్ణసంకరః ॥ 41**

అధర్మ అభి భవాత్ - కృష్ణ - ప్రదుష్యంతి - కులస్త్రియః
స్త్రీషు - దుష్టాసు - వార్ష్ణేయ - జాయతే - వర్ణ - సంకరః

జనార్దన = ఓ కృష్ణా!

కులక్షయకృతమ్+దోషమ్ = కులక్షయము చేయుట దోషము అని

ప్రవిశ్యద్భిః = బాగా తెలిసిన

అస్మాభిః+అస్మాత్+ పాపాత్+నివర్తితుమ్ = మనచేత ఈ పాపమునుండి వైదొలగుట కొఱకు

కథమ్ = ఎట్లు

న+జ్ఞేయమ్ = తెలియదగినది కాదు. అనగా పాపము చేయ రాదని మనము తెలుసుకొనవలయును.

కులమ్+కృత్స్నమ్+ కులక్షయే (సతి) సనాతనాః+కులధర్మాః+ ప్రణశ్యంతి+ఉత+ = కులము మొత్తము నశింపగా కులక్షయము కారణముగా పూర్వమునుండి వచ్చుచున్న కుల ధర్మములు నశించును (కలియుగ ప్రభావమున కూడా కులధర్మములు నశించును)

ధర్మే+నష్టే+ అధర్మః+అభిభవతి = మఱియు కులధర్మము నశింపగా అధర్మము వ్యాపించును

కృష్ణ = ఓ శ్రీకృష్ణా! ఆవిధముగా ధర్మము నష్టమవగా

అధర్మ అభిభవాత్ = అధర్మము పెచ్చు పెరుగును. ( అధర్మము పెచ్చు పెరుగుటవలన సంఘములో అశాంతి పెరుగును. అసాంఘిక కార్యకలాపములు జరుగును.

| | |
|---|---|
| | బలహీనుల ధనము అపహరింప బడును. స్త్రీలకు రక్షణ కరువగును. ఆవిధముగా కుల స్త్రీలకు రక్షణ ఉండదు.) |
| కులస్త్రియః+ప్రదుష్యంతి వార్ష్ణేయ+దుష్టాసు+ స్త్రీషు+వర్ణ సంకరః+ జాయతే = | దుర్మార్గులచే కులస్త్రీలు బలాత్కరింపబడి మిక్కిలి చెడిపోవుదురు ఓ శ్రీకృష్ణా! కాముకులైన స్త్రీ పురుషులవలన వర్ణ సంకరము కలుగును. |

**వ్యాఖ్యానము :-** వేదకాలమునందు చాతుర్వర్ణ వ్యవస్థ ఏర్పడినది.

సామాన్యధర్మముగా ఒక వ్యక్తి పుట్టిన కులమును బట్టి అతని కులము నిర్ణయింప బడును. ఏజాతివారు ఆజాతి స్త్రీని వివాహమాడుట ధర్మము. అలా కానిచో వర్ణ సంకరము.

విశేషధర్మముగ ఒక వ్యక్తి పుట్టిన కులమును బట్టి గాక అతని గుణమును బట్టి, అతడు చేయు పనులను బట్టి అతని జాతి నిర్ణయింపబడును. త్రిశంకుడు ఇక్ష్వాకు వంశములో పుట్టిన క్షత్రియుడు. కాని ఇతడు తన గురువైన వసిష్ఠునిని, వసిష్ఠ పుత్రులను అవమానించి చండాలుడైనాడు.

అటులనే ఋషభుని నూఱుమంది కుమారులలో పెద్దవాడైన భరతుడు కుశావర్తుడు, ఇలా వర్తుడు, బ్రహ్మావర్తుడు, ఆర్యావర్తుడు, మలయకేతువు, భద్రసేనుడు, ఇంద్రస్పృశుడు, విదర్భుడు, కీకటుడు అను 10 మంది వారి వారి పేర్లతో పిలువబడు భూభాగములకు అధిపతులైరి. 81 మంది బ్రాహ్మణులైరి. మిగిలిన 9 మంది అనగా కవి, హరి, అంతరిక్ష, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, అవిర్హోత్రుడు, ద్రమీఢుడు, చమసుడు, కరభాజనుడు, భాగవత ధర్మ పరాయణులైరి కావున కులమును బట్టిగాక గుణమును బట్టి జాతి నిర్ణయింపబడినది.

అని భాగవతం – పంచమస్కంధం 64లో వర్ణింపబడినది.

సామాన్య ధర్మములలో వర్ణ సంకరము దోషము. విశేష ధర్మములలో ఇది దోషము కాదు. అపర ధర్మములలో సామాన్య ధర్మములకు, విశేష ధర్మములకు భేదము కనబడును.

విశేషధర్మముగా బ్రాహ్మణుడు క్షత్రియ జాతి స్త్రీని వివాహము ఆడవచ్చును.

ఉదా: చ్యవనుడు బ్రాహ్మణుడు. అతని భార్య సుకన్య క్షత్రియ జాతి స్త్రీ. విశేష ధర్మముగా ఒకచోట క్షత్రియుడు బ్రాహ్మణ స్త్రీని వివాహమాడినాడు.

ఉదా: యయాతి క్షత్రియుడు. అతడు శుక్రాచార్యుని కూతురు అయిన దేవయానిని వివాహమాడినాడు.

శ్రవణకుమారుని తండ్రి వైశ్యుడు. తల్లి శూద్రురాలు.

**న ద్విజాతి రహం రాజన్ మా భూత్తే మనసో వ్యథా ।**
**శూద్రాయా మాస్మి వైశ్యేన జాతో జనపదాధిప ।**

*(రామాయణము-అయోధ్యకాండ-63వ సర్గ - 53)*

దేశాధిపతి అయిన ఓ రాజా! నేను బ్రాహ్మణుడను, క్షత్రియుడను కాను. నేను వైశ్యునకు అతని భార్య అయిన శూద్ర స్త్రీకి జన్మించిన వాడను. అనుకోకుండా దైవవశమున జరిగిన ఈ పనికి మనస్సులో బాధపడకుము. శ్రవణకుమారుడు స్వర్గమును పొందెను. అతని తల్లి తండ్రులుకూడా స్వర్గమును పొందిరి.

**సామాన్యధర్మము విశేషధర్మములు :**ధర్మపరుడు పాపకృత్యములను చేయరాదు. ఆత్మ స్థానమును పొందగోరు వాడు, శాస్త్రమును అధ్యయనముచేసి వేదమునందు చెప్పిన పాపకృత్యములను చేయరాదు. వేదము కొన్నింటిని, ఋషులు కొన్నింటిని, పాప కృత్యములుగా చెప్పిరి. ఆచారకాండలో కొన్ని పాపకృత్యములుగా పెద్దలచే నిర్ణయింపబడినవి. ఇతరులకు అపకారము చేసిన వచ్చు పాపకృత్యములకు దండన తప్ప ప్రాయశ్చిత్తములేదు. ఈ పాపములను నేరములని అందురు. ఈ నేరములకు తగిన దండనలు కలవు.

శాస్త్రవిహితముగాని పుణ్య కర్మానుష్ఠానములో గల దోషములకు ప్రాయశ్చిత్తములు చెప్పబడినవి.

ధర్మము నష్టమవగా అధర్మము పెచ్చు మీరును. అధర్మమువలన లోకములో సాంఘిక కట్టుబాట్లు ఉండవు. ఈ అధర్మములనే కలియుగ లక్షణములుగా చెప్పుదురు. అనగా పుత్రుడు తమ తల్లి తండ్రులను పోషింపడు. వీరిలో ఒకరిపై ఒకరికి ప్రేమ ఉండదు. భార్య భర్తను గౌరవించదు. భార్యాభర్తల మధ్య అన్యోన్యము ప్రేమ ఉండదు. వీరు కలసి జీవించరు. శిష్యులు గురువును సేవించరు. గురు శిష్యుల మధ్య కలహముండును. ప్రజలు పుణ్య కార్యములు చేయరు. ప్రజలు దుర్మార్గులుగా ప్రవర్తింతురు. బలవంతుడు బలహీనుని ధనమును, స్త్రీలను అపహరించును. స్త్రీలు పణ్యయోనులు అగుదురు. ప్రజలు అతిథి అభ్యాగతులకు అన్న పానీయములు ఇవ్వరు. అన్నమును అమ్ముకొందురు. అధర్మమువలన ఇంద్రుడు సకాలములో వానలు కురియింపడు. పంటలు పండవు. వరదలు, భూకంపాది ప్రకృతి వైపరీత్యములవలన ప్రజలు ఇక్కట్లు పాలగుదురు. అధర్మాచరణ వలన ప్రజలు నరకము పాలగుదురు.

మాతృ దేవోభవ–తల్లిని గౌరవించవలయును. కాని భరతుడు తన తల్లి అయిన కైకను గౌరవించలేదు. ఆమె కోరికవలన లభించిన రాజ్యమును స్వీకరించ లేదు. పితృ దేవోభవ–తండ్రిని గౌరవించ వలయును. కాని ప్రహ్లాదుడు, అతని తండ్రిమాట వినలేదు. ఇవి విశేష ధర్మములు కావున సామాన్య ధర్మము, విశేష ధర్మములలో ఏది పాటించవలయుననే సందేహమే ధర్మ సందేహము.

...... ❖ ❖ ❖ ......

అర్జునుడు అపరధర్మములను చెప్పుట

**సంకరో నరకాయైవ । కులఘ్నానాం కులస్య చ ।**
**పతంతి పితరో హ్యేషాం । లుప్తపిండోదక క్రియాః ॥ 42**

సంకరః – నరకాయ – ఏవ – కులఘ్నానామ్ – కులస్య – చ
పతంతి – పితరః – హి – ఏషామ్ – లుప్తపిండోదక – క్రియాః

**దోషైరేతైః కులఘ్నానాం । వర్ణ సంకర కారకైః ।**

**ఉత్సాద్యన్తే జాతిధర్మాః । కులధర్మాశ్చ శాశ్వతాః ॥ 43**

దోషైః - ఏతైః - కులఘ్నానామ్ - వర్ణ సంకర కారకైః

ఉత్సాద్యన్తే - జాతిధర్మాః - కులధర్మాః - చ - శాశ్వతాః ॥

**ఉత్పన్నకులధర్మాణాం । మనుష్యాణాం జనార్దన ।**

**నరకేఽ నియతం వాసో । భవతీత్యనుశుశ్రుమ ॥ 44**

ఉత్పన్న కులధర్మాణామ్ - మనుష్యాణామ్ - జనార్దన

నరకే - అనియతమ్ - వాసః - భవతి - ఇతి - అనుశుశ్రుమ

| | | |
|---|---|---|
| కులఘ్నానామ్+చ+ కులస్య+హి+నరకాయ+ ఏవ | = | తన కులము వారిని చంపు వారికి మఱియు కుల ధర్మములను పాటింపని వారికి జ్ఞాతులను వధించిన వారికి, మిత్రద్రోహులకు పాపకారణమున నరక ప్రాప్తియే కలుగును |
| ఏషామ్ + సంకరః+ పితరః+లుప్తపిండోదక- క్రియాః+పతంతి | = | వర్ణ సంకరముచేసిన వీరియొక్క పితరులు, అనగా వారి తాత ముత్తాతలు పిండోదక క్రియలు లేనివారై, పుణ్యలోకముల నుండి నరకములో పడుదురు. అటులనే వర్ణసంకరము చేసినవారు కూడా, నరక ప్రాప్తిని పొందుదురు |

**పితృదేవతలు**

| **పితృదేవతలు** | **పితరులు** |
|---|---|
| దేవతలలో ఒక గణము | చనిపోయిన మన పూర్వీకులు అనగా ముత్తాత, తాత, తండ్రి, ముత్తాత భార్య, తాత భార్య, తల్లి |
| వీరిని నిత్యము ఆరాధించవలయును | వీరికి సంవత్సరమునాడు తద్దినము పెట్టవలయును |

| | | |
|---|---|---|
| ఏతైః+వర్ణ సంకర+ కారకైః+దోషైః+చ+ కులఘ్నానామ్ | = | ఈ వర్ణ సంకర కారకుల దోషముచేత వర్ణ సంకర కారకులు మఱియు వారి పితరులు నరక ప్రాప్తిని పొందుదురు మఱియు కులస్థులను వధించి కులమును నాశనము చేసిన వారియొక్క పాపమువలన వారికి నరకప్రాప్తి గలుగును మఱియు వీరిరువురి వలన అనగా వర్ణసంకర కారకులవలన కులఘాతకుల వలన |
| శాశ్వతాః+ కులధర్మాః+చ+ జాతిధర్మాః+ఉత్సాద్యన్తే+ | = | సనాతనములయిన కులధర్మములు అనగా ఆచారములు జాతి ధర్మములు నశింపజేయబడుచున్నవి. |
| జనార్దన | = | ఓ శ్రీకృష్ణా! |
| ఉత్పన్నకులధర్మాణామ్+ మనుష్యాణామ్+ అనియతమ్+నరకే+ వాసః+భవతి+ఇతి+ అనుశుశ్రుమ | = | కుల ధర్మములను నశింపచేసినవారు అయిన మానవులకు అనగా వర్ణ సంకరులై కుల ధర్మములను పాటింపని వారికి శాశ్వతముగా నరకమునందు నివాసము కలుగునని పెద్దల వలన మనము తరతరాలనుండి పెద్దలు చెప్పగా వినియున్నాము |

**వ్యాఖ్యానము :-** ధర్మనిర్ణయము చేయునప్పుడు పెద్దలు యిలా చెప్పారని చెప్పవలయును. ప్రారంభములో సాధకుడు కులధర్మములను పాటింపవలయును. ఆ తర్వాత విజ్ఞాన వైరాగ్యములను పొంది అరిషట్‌వర్గములను జయించవలయును.

...... ❖ ❖ ❖ ......

**అహో బత మహత్పాపం । కర్తుం వ్యవసితా వయమ్ ।**
**యద్రాజ్యసుఖలోభేన । హన్తుం స్వజనముద్యతాః ॥ 45**

అహో – బత – మహత్ – పాపమ్ – కర్తుమ్ – వ్యవసితాః – వయమ్
యత్–రాజ్యసుఖలోభేన – హన్తుమ్ – స్వజనమ్ – ఉద్యతాః ॥

| | | |
|---|---|---|
| అహో+బత+యత్+ | = | అయ్యో! ఎంత దిగజారిపోయాము ఏ రాజ్యసుఖ |
| రాజ్య+సుఖ+లోభేన+ | | లోభములచే స్వజనమును చంపుటకు |
| స్వజనమ్+హన్తుమ్+ | | యుద్ధమునకు ఉద్యమించితిమో. |
| ఉద్యతాః | | స్వజనమును చంపుట పాపము అని తెలిసికూడా ఆవిధముగా చేయతలంచితిమి. ఆ కారణమువలన |
| వయమ్+మహత్+ | = | మనము గొప్ప పాపకార్యమును |
| పాపమ్+కర్తుమ్+ | | చేయుటకు సమ కట్టితిమి. |
| వ్యవసితాః | | |

**వ్యాఖ్యానము:-** అర్జునుడు యుద్ధప్రారంభమున అపరధర్మములను ప్రస్తావించగా ధర్మరాజు యుద్ధానంతరము బాలద్విజ గురువులను వధించుట పాపమని ఇట్లు చెప్పినాడు.

**బాలద్విజసుహృన్మిత్రపితృభ్రాతృగురుద్రుహః ।**
**న మే స్యాన్నిరయాన్మోక్షో హ్యపి వర్షాయుతాయుతైః ॥** (భారతం)

అనగా "బాలురను, బ్రాహ్మణులను, సహృదయులను, మిత్రులను, తండ్రులను, సోదరులను, గురువులను వధించిన నాకు పదికోట్ల సంవత్సరముల తరువాత అయిననూ నరకమునుండి విముక్తి కలుగదు" అని ధర్మరాజు వాపోయినాడు. 1. గురువులను వధించినవారు 2. కుల ధర్మములు పాటింపనివారు 3. జ్ఞాతులను వధించిన వారు 4. మిత్ర ద్రోహులు 5. తన కులస్థులను రాజ్య లోభమున చంపినవారు పాపులు. వీరికి నరక ప్రాప్తి గలుగును. 6. వర్ణ సంకరము పాపము. వర్ణ సంకరముచేసిన వారియొక్క పితరులు పిండోదక క్రియలు లేని వారై పుణ్యలోకములనుండి, నరకమున పడుదురు. అటులనే వర్ణ సంకరము చేసినవారు నరక ప్రాప్తిని పొందుదురు.

ఇందు కొన్ని పాపములు చెప్పబడినవి. రామాయణములో భరతుడు కౌసల్యతో పలుకు సందర్భమున మఱికొన్ని పాపములు చెప్పబడినవి. ఆ పాపములు ఈ దిగువ నుదహరింపబడుచున్నవి.

**1. స్వజనలు యెడ :**

తల్లి దండ్రులకు సేవ చేయక పోవుట. ఋతుకాలమున భార్యతో కలియకపోవుట. పోషింపతగిన వారిని పోషంపక పోవుట ఉద్యోగరీత్యాగాని ధనములోగాని ఉన్నతస్థాయిలో ఉండి బీదస్థితిలో ఉన్న స్వజనమునకు సహాయ సహకారములు అందించకపోవుట పాపము. అట్టివాడు బ్రతికి ఉండియు చచ్చినవాడే.

**2. పెద్దల యెడ :**

గురువులను అవమానించుట. గురువులు చెప్పిన శాస్త్రపాఠమును మఱచిపోవుట. శాస్త్రపాఠమును ఆచరింపకపోవుట. సత్పురుషులకు అపకారము తలపెట్టుట.

**3. బ్రాహ్మణుల యెడ, గోవుల యెడ**

ఋత్విక్కులకు ఒప్పందము ప్రకారము దక్షిణలు యివ్వకపోవుట. బ్రాహ్మణ పూజకు అనగా యజ్ఞమునకు విఘ్నము గలిగించుట. గోవులను తన్నుట. లేగదూడలకు పాలు లేకుండా మొత్తం పాలను పితుకుట.

**4. మిత్రుల యెడ:**

మిత్ర ద్రోహము.

**5. దుర్మార్గ కృత్యములు:**

ధర్మ సమ్మతముకాని పనులు చేయుట.

**6. దానము:**

అపాత్రులకు దానము యిచ్చుట, యాచకుల ఆశలు విఫలము చేయుట.

**7. వ్యసనములు:**

జూదము, మద్యపానము చేయుట.

**8. ఇతరములు:**

సంధ్యా సమయములలో నిద్రించుట, చాడీలు చెప్పుట, రహస్యములు వెల్లడి చేయుట. మోసగించుట. సూర్యునికి ఎదురుగా మల మూత్రములు విసర్జనచేయుట. పాపాత్ములను సేవించుట. శాస్త్రమును అనుసరించక పోవుట. కృతజ్ఞత లేకుండుట. కలహించుకొను వారిని విడదీయకపోవుట. ఆత్మ హత్య చేసుకొనుట. దేవతలను

పితృ దేవతలను పూజింపక పోవుట.

**ఆర్థిక పరముగా:**

లక్క, సారా, మాంసము, లోహము, విషము మొదలైనవి విక్రయించుట. సేవకులకు జీతము ఇవ్వకపోవుట.

**కామపరముగా:**

వ్యభిచారము. స్త్రీని బలాత్కరించుట, చెఱపట్టుట, గురు భార్యాగమనము, పర భార్యా సంగమము.

ఇట్టి పాపములు చేయరాదు. పాపకారణము కామక్రోధలోభాది అరిషడ్వర్గములు.

...... ❖ ❖ ❖ ......

అర్జునుడు కౌరవులు తనను చంపినను అది తనకు క్షేమమే అని పలుకుట

**యది మామ ప్రతీకార । మశస్త్రం శస్త్ర పాణయః ।**
**ధార్త రాష్ట్రా రణే హన్యుః । తన్మే క్షేమతరం భవేత్ ॥ 46**

యది – మామ్ – అప్రతీకారమ్ – అశస్త్రమ్ – శస్త్ర పాణయః
ధార్తరాష్ట్రాః – రణే – హన్యుః – తత్ – మే – క్షేమ తరమ్ – భవేత్

| | |
|---|---|
| యది+రణే+ శస్త్ర పాణయః+ ధార్తరాష్ట్రాః | = ఒకవేళ ఈ యుద్ధమునందు ఆయుధములు చేత ధరించిన కౌరవులు |
| అశస్త్రమ్+అప్రతీకారమ్+ మామ్+హన్యుః+ తత్+మే+క్షేమతరమ్+ భవేత్ | = చేతిలో ఆయుధములు లేకుండా ఉన్నట్టియు వారిపై ప్రతీకారేక్ష లేకుండా ఉన్నట్టియు నన్ను వారు చంపిరేని అది నాకు మిక్కిలి క్షేమము అగును అనగా నిరాయుధుని చంపిన పాపము కౌరవులకు వచ్చును |

**వ్యాఖ్యానము :-** భాగవతులు తమని ఇతరులు కొట్టిన తిట్టిన వారికి మాఱు చేయరు. అనగా వారిని తిట్టరు, కొట్టరు. ఆ విధముగా భాగవతధర్మము పాటించిన వాడిని అగుదును. ఈ విధముగా నాకు మిక్కిలి క్షేమము అగును.

**భాగవత ధర్మము :**

**కం॥ పొడిచినఁ దిట్టినఁ గొట్టినఁ ।**
**బడుచుందురు గాని పరమ భాగవతులు దా**
**రొడఁబడరు మాఱు సేయఁగఁ ।**

**కం॥ చెలఁగరు కలఁగరు సాధులు ।**
**మిళితములయి పరుల వలన మేలుం గీడున్**
**నెలకొనిన నైన నాత్మకు ।**
**నొలయవు సుఖ దుఃఖ చయము లుగ్రము లగుచున్**

*(భాగవతం ప్రథమస్కంధం-486 & 487)*

ప్రతీకారము చేయుటకు ఇష్టపడరు. ఇతరులు చేసిన మేలుకు ఆనందింపరు. అటులనే ఇతరులచే చేయబడు అపకారములకు కృంగిపోరు. భాగవతులను ఇతరులు తిట్టిననూ, కొట్టిననూ, చంపిననూ వారు ఇతరులచే కలిగింపబడు బాధలు అనుభవింతురే తప్ప పరులవలన కలుగు సుఖదుఃఖములకు విచలితులు కారు. మఱియు ఆత్మకు సుఖదుఃఖములు ఉండవని తలంతురు.

...... ❖ ❖ ❖ ......

ముండక ఉపనిషత్తునకు అర్జునుని పరముగా వ్యాఖ్యానము

**ఏవముక్త్వార్జునః సంఖ్యే । రథోపస్థ ఉపావిశత్ ।**
**విసృజ్య సశరం చాపం । శోక సంవిగ్న మానసః ॥ 47**

ఏవమ్ - ఉక్త్వా - అర్జునః - సంఖ్యే - రథోపస్థ (రథోపస్థే) - ఉపావిశత్
విసృజ్య - స శరమ్-చాపమ్ - శోక సంవిగ్న మానసః ॥

| | | |
|---|---|---|
| ఏవమ్+ఉక్త్వా | = | ఈవిధముగా పలికి అనగా కౌరవులు తనని చంపబూనినను తను వారిని చంపనని పలికి |
| శోక సంవిగ్న మానసః+ అర్జునః | = | శోకముచే అనగా బంధు మరణము తలచి వ్యాకుల మనస్కుడైన అర్జునుడు |
| సంఖ్యే+చాపమ్+ సశరమ్+విసృజ్య+ రథోపస్థే+ఉప+ఆవిశత్ | = | యుద్ధమునందు ధనుస్సు, భాణములను విడచి రథమునందు (రథ సమీపమున) అధికమైన ధర్మాధర్మ విచక్షణచే చతికిలబడెను. |

**వ్యాఖ్యానము :-**

అర్జునుడు కౌరవులను జయించ సమర్థుడు అయ్యు చేతగానివానివలె చతికిల బడెను.

జీవుడు జనన మరణ వలయమునుండి విడివడ సమర్థుడయ్యు, సంసారములో చిక్కుకొని చేతగానివానివలె చతికిల బడుచున్నాడు.

**"సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః"**

(ముండక ఉపనిషత్ తృతీయ-ముండకే-ప్రథమ ఖండః-2)

ఒకే చెట్టుపై గల రెండు పక్షులలో అనగా ఆత్మ, జీవులలో అజ్ఞానములో మునిగియున్న జీవుడు మోహము చెందిన వాడై బంధములను తొలగించుకోగల సమర్థుడయ్యు, సంసారములో మునిగి సంసారము గుఱించియే ఒకడు ఆలోచించు చున్నాడు. సంసారమునందు బద్ధుడగుచున్నాడు. ఇంకొకడు బంధ విముక్తికై ఆలోచించుచున్నాడు. దీనికి వ్యాఖ్యానముగా అర్జునుని స్థితి వర్ణింపబడినది.

...... ❖ ❖ ❖ ......

# భీష్మపర్వము 26వ అధ్యాయము

**(సాంఖ్యయోగము)**

## సమీక్ష

**కథావిభాగము:** ఈ అధ్యాయములో 72 శ్లోకములు గలవు. ఈ అధ్యాయములో అటు కథాభాగము, ఇటు ఆధ్యాత్మిక విభాగమునకు సంబంధించిన శాస్త్రపాఠము, ఆచరణపాఠము సంక్షిప్తముగా చెప్పబడినవి. కథాభాగముగా శ్రీకృష్ణుడు యుద్ధరంగమున రథముపై చతికిలబడిన అర్జునుని మాటలను విని హృదయదౌర్బల్యమును విడిచి యుద్ధము చేయుమని అర్జునునితో చెప్పగా, అప్పుడు అర్జునుడు యుద్ధరంగమునకు సంబంధించిన ఈ దిగువ ప్రశ్నలు వేసెను.

**యుద్ధము చేయుటయా లేక మానుటయా?**

ఈ ప్రశ్నకు సమాధానముగా శ్లోకము 31 నుంచి 36 వఱకు చెప్పబడినది.

**భీష్మద్రోణాదులతో ఎట్లు ఎదిరించి పోరాడగలను?**

ఈ ప్రశ్నకు సమాధానముగా 37వ శ్లోకము చెప్పబడినది.

**స్వజనమును చంపిన పాపము కాదా?**

ఈ ప్రశ్నకు సమాధానముగా 38వ శ్లోకము చెప్పబడినది. ఆవిధముగా యుద్ధరంగమునకు సంబంధించిన ప్రశ్నలకు సమాధానము శ్రీకృష్ణుడు చెప్పినాడు.

**ఈ యుద్ధములో కౌరవులను మనము జయించెదమా? లేక కౌరవులు మనని జయించెదరా?**

ఈ ప్రశ్నకు సమాధానము ఈ అధ్యాయములో చెప్పలేదు. 35వ అధ్యాయములో సమాధానము కలదు.

**అధ్యాత్మ విభాగమునకు సంబంధించిన ప్రశ్నలు :**

**దుఃఖము పోయి ఆత్మకు శాంతి ఎలా కలుగును? స్థితప్రజ్ఞుని లక్షణములు ఏమిటి? అతనిని గుర్తించుట ఎట్లు? అతడు ఎట్లు సంచరించును?**

ఈ ప్రశ్నలకు సమాధానముగా మొదట శాస్త్రపాఠము సంక్షిప్తముగా చెప్పబడినది. దుఃఖము ఎలా పోవును? అన్న ప్రశ్నకు సమాధానముగా హృదయగత ఆత్మ, దేహి, దేహముల సమిష్టిరూపం ప్రాణి. వీటిగుఱించి సరియైన జ్ఞానము లేకపోవుటయే దుఃఖమునకు కారణము. కావున వీటి గుఱించి తెలిసిన దుఃఖనివారణ కలుగునని వేఱ్వేఱు లక్షణములుగల దేహి, దేహలక్షణములను తెలిసినవాడు పండితుడని, ఇతడు దుఃఖించడని చెప్పెను. ఈ పండితుణ్ణి జ్ఞాని అని, స్థితప్రజ్ఞుడు అని అందురు.

ఐతరేయ ఉపనిషత్తు, కఠోపనిషత్తు, ఈశోపనిషత్తు, ముండకోపనిషత్తు మొదలైన అనేక ఉపనిషత్తులలో చెప్పిన విషయములను క్రోడీకరించి ఈ సర్గలో ఆత్మలక్షణము, హృదయగత ఆత్మ, విరాట్‌పురుషుల గుఱించి చెప్పబడినవి.

**ఆత్మ లక్షణములు (బ్రహ్మ విచారణ) –**

అజః – న జాయతే – న మ్రియతే । నిత్యః – శాశ్వతః । పురాణః – సనాతనః । అచలః – స్థాణుః । అవినాశి – అనాశినః । అప్రమేయః । అవ్యక్తః – అచింత్యః। అవికార్యః । న హంతి – న హన్యతే । శస్త్రాణి న ఛిందంతి । పావకః న దహతి। ఆపః న క్లేదయంతి । మారుతః న శోషయతి.

ప్రకృతివాదుల సిద్ధాంతం ప్రకారము ఆత్మ అనునది లేదు అన్నదానికి ఈ అధ్యాయములో 26, 27, 28 శ్లోకములలో సమాధానము చెప్పబడినది. ఆవిధముగా ఆత్మ గుఱించి అనాదిగా వస్తున్న రెండు సిద్ధాంతములు ఉదహరింపబడినవి.

ఆత్మ గుఱించిన అనుభవములేని ఉపన్యాసకుడు, సాధన చేయని శ్రోతలు వినిననూ అర్థము కాదని, ఆత్మను సాధన చేసి స్వానుభవములో గ్రహించవలెనని చెప్పబడినది.

**అంతరాత్మ –** సర్వగతః – శరీరణః

**విరాట్ పురుషునిగా –** ఇదం సర్వం తతమ్

**దేహి :**

**ఆత్మ లక్షణములలో చెప్పినవాటిలో కొన్ని దేహికి కూడా వర్తించును.**

**1. అవ్యక్త :** వ్యక్తము గాదు. ఈ కనిపించే బాహ్యరూపముగాక యింకొకటి గలదు. **2. అచింత్య :** కరచరణాదులు లేనందువలన ఆ రూపము అచింత్యము. **3. అవికార్య :** దేహమునకువలె రూపాంతరము చెందనిది. **4. పురాణ : 5. సనాతన :** దేహికూడా సృష్టి ప్రారంభము అయిన తర్వాత సృష్టిలోనికి వచ్చినాడు. కావున ఇతడును సనాతనుడే. **6.** దేహిని కూడా పంచభూతములుగాని అస్త్రశస్త్రములుగాని, మరణకారకములు గాని ఏమియు చేయజాలవు. **"ఆపః నక్లేదయన్తి.... శస్త్రాణి న ఛిందంతి"** అని చెప్పినవి దేహికి కూడా అన్వయించును. కావున నీవు, నేను, ఈ రాజులు అందఱు దేహిరూపమున నిత్యులమని చెప్పబడినది.

**దేహికి అవస్థలు :** జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలవలె దేహాంతర ప్రాప్తియు దేహికి ఒక అవస్థ.

దేహి కర్మానుసారము దేహములను వీడి క్రొత్త దేహములును పొందును.

**దేహిలో భేదము –**

1. మూర్ఖుడు / వ్యర్థజీవి (ఇతనిని ఆత్మ హనోజనాః అని ఈశోపనిషత్తు చెప్పినది.) 2. కామ్యకర్మపరుడు 3. పండితుడు (జ్ఞాని, స్థితప్రజ్ఞుడు, వేదజ్ఞుడు, విదేహుడు, అవధూత)

**దేహము –** ఇది నశించు స్వభావము గలది. పుట్టుక, బాల్యము, యౌవనము, జరా, మృత్యువు అనునవి దేహముయొక్క అవస్థలు. దేహవిచారణగా ఇంద్రియములు, మనస్సు, శబ్దాది విషయములు, బుద్ధి, బుద్ధి స్థిరముగా ఉండుట, బుద్ధివినాశము గుఱించి ఈ అధ్యాయములో వివరించబడినది.

**సత్తు – అసత్తు –** ఆత్మ సత్తు అని, దేహము అసత్తు అని చెప్పబడినది. సత్తుయొక్క స్వభావము, లక్షణములు వేఱు. అటులనే అసత్తుయొక్క స్వభావము, లక్షణములు వేఱు.

**సుఖదుఃఖములు** – సుఖదుఃఖములు ఇంద్రియాదులవలన మఱియు కాలానుసారము వలన కలుగును. ఈ సుఖదుఃఖములకు విచలితుడు కానివాడు అమృతత్త్వమును పొందుటకు అర్హుడని వివరించబడినది. ఈ సుఖదుఃఖములకు విచలితుడు కాకుండుటనే గాంభీర్యము అని అందురు.

**అపరధర్మములు** –పెద్దలను, గురువులను చంపి ఆ రక్తపుకూడు భుజించుటకంటె భిక్షాటన చేసి జీవించుట మేలు అనే అపరధర్మము చెప్పబడినది.

**వేదముల గుఱించి** – దాహముగలవానికి గ్రుక్కెడు నీరు సరిపోవునట్లు సర్వవేదములందు చెప్పిన ఫలితమును నిష్కామకర్మవలన పొందుదురు అని చెప్పబడినది. ఇంతవఱకు శాస్త్రపాఠమును చెప్పి ఇప్పుడు ఆచరణపాఠమును చెప్పుచున్నాడు.

### ఆచరణ పాఠము - సాధనలు

దేహేంద్రియ మనోబుద్ధులచే చేయబడునదంతయూ కర్మవిభాగము క్రింద పరిగణింపబడును. ఊర్ధ్వలోకములను పొందుటకు చేయబడు కర్మ పుణ్యకర్మగా చెప్పబడును. ఈ పుణ్యకర్మానుష్ఠానము గుఱించి సంగ్రహముగా చెప్పబడినది. ఈ పుణ్యకర్మానుష్ఠానములో 1. స్వాధ్యాయము, యజ్ఞయాగాది పుణ్యకర్మలు, దానము. 2. యోగము 3. భక్తి అను విభాగములు కలవు. స్వాధ్యాయము, యజ్ఞయాగాది పుణ్యకర్మలలో అనగా ఈ పుణ్యకర్మానుష్ఠానములో ఒక వ్యక్తి పుట్టిన కులమునుబట్టి, గుణమునుబట్టి కర్మలు విభజింపబడినవి. ప్రారంభములో సర్వులు వారివారి కులధర్మములు పాటింపవలయును. (కలియుగములో కులధర్మములు అపభ్రంశము చెందినవి). కులధర్మములు పాటించవలయును. పాపకర్మలు చేయరాదు.

**అసుర్యా నామ తే లోకా అంధేన తమసా వృతాః ।**

**తాగ్ంం స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యేకే చాత్మహనో జనాః ॥** (ఈశోపనిషత్తు – 3)

అనగా పుణ్యకర్మలు చేయనివారు నరకముపాలగుదురు. వీరు తమనుతామే చంపుకొనువారుగా పరిగణింపబడుదురు.

వేదశాస్త్రవిహితముగా పుణ్యకర్మలను చేయవలయును.

**కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవి షేచ్ఛతగ్ం సమాః ।**

**ఏవం త్వయి నా న్యథేతోఽ_స్తిన కర్మ లిప్యతే నరే ॥** (ఈశోపనిషత్తు – 2)

అనగా పుణ్యకర్మలు చేయుటకే నూఱు సంవత్సరములు జీవించవలయును. నిష్కామకర్మాచరణవలన కర్మ బంధము కాదు.

పుణ్యకర్మలలో ఈ దిగువ విభాగములు కలవు. 1. కామ్యకర్మ (ప్రవృత్తికర్మ). దీనికే ఇందు అవ్యవసాయాత్మకబుద్ధి అని పేరుపెట్టబడినది. ఈ కర్మ బంధమును కలిగించును. 2. నిష్కామకర్మ (నివృత్తికర్మ). దీనికే వ్యవసాయాత్మకాబుద్ధి అని పేరు పెట్టబడినది. ఈ కర్మ బంధము కాదు. కర్మబంధము కాని విధము చెప్పబడినది.

ఒకటి కర్మబంధమును గలుగజేయును. ఇహలోక పరలోక సుఖాపేక్ష గలవారు, స్వర్గముకంటె పొందవలసినది ఏదీ లేదని వాదించువారు, నిశ్చయజ్ఞానము లేనివారు కామ్యకర్మలను ఆచరించి కర్మబంధములలో చిక్కుకొందురు.

లాభాలాభములు, జయాపజయములు మొదలయిన ద్వంద్వములందు సమభావన గలిగిన వారికి కర్మలు బంధము కావు. పుణ్యకర్మల ఫలితమును కోరరాదనే ఉపదేశము యివ్వబడినది.

**యోగము :** ద్వంద్వాతీతస్థితి కలిగిన సమత్వమును యోగము అని నిర్వచనము చేయబడినది. యమనియమములుగా చెప్పబడే నిష్కామ పుణ్యకర్మలు చేసి ఏకాంతప్రదేశమున ఒంటరిగా ఉండి ఇంద్రియార్థములపై మనస్సు ప్రసరించకుండా నిగ్రహించి ద్వంద్వాతీతుడవై ఆత్మానుసంధానము చేయవలయును అని యోగము గుఱించి సంక్షిప్తముగా చెప్పబడినది.

**శబ్దాది విషయములు –** నిరాహారముగా ఉండి తపస్సు / యోగము చేసిననూ విషయములు తగ్గుముఖం పట్టును గాని నశింపవు. ఆత్మదర్శనప్రాప్తి అయిన విషయములు పూర్తిగా నశించును అని చెప్పబడినది.

**3. భక్తి –** భక్తి గుఱించి ఈ అధ్యాయములో చెప్పలేదు.

**సాంఖ్యము :**

సాంఖ్యపద్ధతిలో యజ్ఞయాగాది పుణ్యకర్మాచరణ గాని, ఇంద్రియములను, మనస్సును నిగ్రహించుట అనే యోగపద్ధతిగాని పురుషోత్తముని నిరంతరము స్మరించుట అనే భక్తి పద్ధతిగాని ఉండదు. సాంఖ్యవిచారణలో దేహి, దేహముల విచారణ చేసి అనగా సమష్టి స్వరూపముగా దేహమును, వ్యష్టి స్వరూపముగా ఇంద్రియములను, అంతఃకరణములను విచారించి బుద్ధి స్థిరముగా అనగా స్థిరబుద్ధి కలిగి తన దేహము కాదని గ్రహించి, దేహ లక్షణములైన అహంకార మమకారములను విడచి **"అహం బ్రహ్మాస్మి"** అనే భావనలో ఉందురు. స్థిరబుద్ధి కలిగివుండుటనే బుద్ధిసంపన్నత్వము అని అందురు. బ్రహ్మదేవుడు హిరణ్యకశిపుడు కోరిన వరములన్నియూ ప్రసాదించి బుద్ధిసంపన్నత్వమున ఉండుమని చెప్పెను.

(భాగవతం–సప్తమస్కంధం – 92)

ఎవరు ఏ పద్ధతిని పాటించినా చివరకు బుద్ధిసంపన్నత్వము కలిగి ఉండవలయును. సాధనయొక్క ముఖ్యలక్షణము ఇదియే.

స్థితప్రజ్ఞుడు బాహ్యప్రపంచంలో ఎట్లు సంచరించును అన్నదానికి తాబేలువలె సంచరించునని చెప్పబడినది.

**శాంతి ఎలా కలుగును?** బుద్ధిసంపన్నత్వము కలిగి గుణరహితుడై, ఆత్మస్వరూపుడైనవాడు శాంతిని పొందును అని సంక్షిప్తముగా ఇందు చెప్పబడినది.

**బ్రాహ్మీస్థితి –**శాంతత్వము కలిగియుండుటయే బ్రాహ్మీస్థితి. దీనినే బ్రహ్మానందము కలిగియుండుట అని కూడా అందురు. మఱియు ఈ స్థితి కలవారిని బ్రహ్మర్షి అని అందురు. ఈ స్థితి పొందినవారు దేహత్యాగానంతరము ఆత్మయై విరాజిల్లుదురు.

పుణ్యకర్మ, సాంఖ్యముల తారతమ్యములు వివరించబడినవి. పుణ్యకర్మకంటే సాంఖ్యము గొప్పది అని చెప్పగనే రాబోవు 27వ అధ్యాయములో అర్జునుడు తనను ఈ పుణ్యకర్మానుష్ఠానములో ఏల ప్రవేశపెట్టుచున్నావని ప్రశ్నించును.

ఈ అధ్యాయములో సంక్షిప్తముగా చెప్పిన పుణ్యకర్మానుష్ఠానము రాబోవు 27, 28, 29, 30 అధ్యాయములలో కర్మ గురించి, యోగము గురించి మరికొంత విపులముగా వివరించబడును.

ఈ అధ్యాయములో వ్యాసభగవానుడు ఇతరులచే ప్రయోగింపబడిన పదములకు సమానార్థకముగా ఈ క్రింది పదములను ప్రయోగించినాడు.

ప్రవృత్తికర్మకు అవ్యవసాయకాబుద్ధి అనియు, నివృత్తికర్మకు వ్యవసాయాత్మకా బుద్ధి అనియు, జ్ఞానికి, పండితునకు స్థితప్రజ్ఞుడనియు, గుణరహితస్థితికి శాంతి అనియు, బ్రహ్మానందమునకు బ్రాహ్మీస్థితి అనియు చెప్పబడినవి. దేహేంద్రియ మనోబుద్ధులచే చేయబడినదంతయూ కర్మగా చెప్పుదురు. పుణ్యకర్మలో దేహేంద్రియ మనోబుద్ధులను పుణ్యకర్మలక్రింద వాడుదురు. అటులనే దేహేంద్రియ మనోబుద్ధులను యోగములో నిగ్రహింతురు. అదేవిధముగా దేహేంద్రియ మనోబుద్ధులను భక్తిలో దైవపరముగా వాడుదురు. కావున పుణ్యకర్మ, యోగము, భక్తి వీటిని కర్మయోగము అని సాంఖ్యమునకు బుద్ధియోగము అని చెప్పబడినది.

...... ❖ ❖ ❖ ......



ఓం శ్రీగురుభ్యో నమః

సంజయ ఉవాచ

**తం తథా కృపయావిష్టమ్ । అశ్రుపూర్ణాకులేక్షణమ్ ।**
**విషీదంతమిదం వాక్యమ్ । ఉవాచ మధుసూదనః ॥ 1**

తమ్ – తథా – కృపయా–ఆవిష్టమ్ – అశ్రుపూర్ణా – కులేక్షణమ్ ।
విషీదంతమ్–ఇదమ్ – వాక్యమ్ – ఉవాచ – మధుసూదనః ॥

| | | |
|---|---|---|
| తథా+కృపయా+ | = | ఆవిధముగా యుద్ధరంగమున చతికిలబడిన |
| ఆవిష్టమ్+ | | వాడును, కృపతో కూడికొనియున్నవాడును |
| అశ్రుపూర్ణా కులేక్షణమ్+ | | అశ్రువులతో నిండిన కన్నులు గలిగి |
| విషీదన్తమ్+తమ్ | | శోకమోహములతో, వ్యాకులముతో ఉన్నవాడును |
| | | దుఃఖించుచున్నవాడును అయిన ఆ అర్జునుని గూర్చి |
| | | అనగా అర్జునునితో |
| మధుసూదనః+ | = | శ్రీకృష్ణుడు ఈ మాటలను పలికెను అని |
| ఇదమ్+వాక్యమ్+ | | శ్రీకృష్ణుడు అర్జునునితో చెప్పిన మాటలను |
| ఉవాచ | | సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పుచున్నాడు. |

శ్రీభగవానువాచ

శ్రీకృష్ణుడు అర్జునునితో యుద్ధము చేయమని పలుకుట

**కుతస్త్వా కశ్మల మిదం । విషమే సముపస్థితమ్ ।**
**అనార్య జుష్టమ స్వర్గ్య । మకీర్తికరమర్జున ॥ 2**

కుతః – త్వా – కశ్మలమ్ – ఇదమ్ – విషమే – సముపస్థితమ్ –
అనార్య జుష్టమ్– అస్వర్గ్యమ్ – అకీర్తికరమ్ – అర్జున

ఈ శ్లోకము సంధిసమాసములతో చెప్పబడినది.

**క్లైబ్యం మా స్మగమః పార్థ । నైతత్త్వయ్యుపపద్యతే ।**
**క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప ॥ 3**

క్లైబ్యమ్ – మా – స్మ – గమః – పార్థ – న – ఏతత్ – త్వయి – ఉపపద్యతే
క్షుద్రమ్ – హృదయ దౌర్బల్యమ్ – త్యక్త్వా – ఉత్తిష్ఠ – పరన్తప

**కథాభాగము :**

యుద్ధరంగమున నిలచి బంధుమరణము తలచి అహింసా వాదముతో యుద్ధరంగమున చతికిలబడిన అర్జునుని చూచి –

| | | |
|---|---|---|
| అర్జున | = | ఓ అర్జునా! |
| త్వా | = | నీకు |
| అకీర్తి కరమ్+అస్వర్గ్యమ్ | = | నీ వంటి వీరునకు అపకీర్తిని గలుగ చేయునదియు (అనగా నీవు పిరికివాడవనే అపకీర్తి వచ్చును.) నరకమును గలుగచేయునదియు (అనగా క్షత్రియ జాతి ధర్మమయిన ధర్మ యుద్ధముచేయక వెను తిరిగిన క్షత్రియునకు లభించు వీరస్వర్గము లభింపదు సరిగదా జాతి ధర్మములు పాటింపని పాపమువలన నరకము వచ్చును.) |
| అనార్య జుష్టమ్ | = | ఆర్యులు గానివారిచే అనగా వీరులు గాని వారిచే సేవింప బడదగినదియు |
| కశ్మలమ్+ఇదమ్ | = | ఈ మనో మాలిన్యముగా చెప్పబడే కృప, పిరికితనము, కరుణ, జాలి, దయ, ఈ యుద్ధ సమయమున నీకు ఎట్లు గలిగినవి? అహింసా వాదము ప్రస్తుతము సందర్భోచితము కాదు. యుద్ధముచేయక వెను తిరిగినచో – 1. అపకీర్తి గలుగును. 2. జాతి ధర్మములు పాటింప నందున |

| | | |
|---|---|---|
| | | పాపము గలుగును. పాపమువలన నరక ప్రాప్తి కలుగును. 3. వీరులు కాని వారు పలుకు మాటలవి. అటువంటి మాటలు |
| విషమే+కుతః+ సముపస్థితమ్ | = | ఈ యుద్ధ సమయమున ఎట్లు నీకు దాపురించినది. కృప, మోహాదులకు యిది సమయము కాదు. |
| పరన్తప+క్లైబ్యమ్+ క్షుద్రమ్+ హృదయదౌర్బల్యమ్+ మాస్మగమః | = | శత్రువులను తపింపచేయువాడా! అర్జునా! నపుంసకత్వమును అనగా పురుష హీనత్వమును మఱియు క్షుద్రము హృదయ దౌర్బల్యము లయిన వాటిని పొందకుము. |
| పార్థ | = | ఓ అర్జునా! (పురుషకారమును వహింపుము. నీవు పలుకు ఈమాటలు) |
| త్వయి + ఏతత్+ న + ఉపపద్యతే | = | నీవంటి వీరుని యందు ఈ కశ్మలము శోభాయ మానము కాదు. |
| త్యక్త్వా+ఉత్తిష్ఠ | = | ఈ హృదయదౌర్బల్యమును విడచి, ధనుర్బాణ ములు ధరించి యుద్ధ సన్నద్ధుడవై లెమ్ము. యుద్ధమునకు నడుము బిగించుము. |

**ఆధ్యాత్మిక భాగము :** పై పదములు ఆధ్యాత్మిక విభాగములో కూడా చెప్పవచ్చును.

| | | |
|---|---|---|
| పార్థ+క్షుద్రమ్+ హృదయ దౌర్బల్యమ్+ త్యక్త్వా+ఉత్తిష్ఠ | = | ఓ అర్జునా! తమోగుణ రజోగుణములకు సంబంధించినదియు క్షుద్రమయినదియు హృదయ దౌర్బల్యము అయినదియు అయిన ఈ మనో భావనలను విడచి (సాధనకు) ఉపక్రమింపుము |

**వ్యాఖ్యానము :-** నీవు కర్మ బంధములను త్రెంచుకొనగల సమర్థుడవయ్యు చేతగానివలె ఆ కర్మబంధములలో చిక్కుకొని, జనన మరణములలో తిరుగాడుచున్నావు. నీవు ఆత్మస్థానమును చేరుటకు నడుము బిగించుము. దేహేంద్రియ మనో బుద్ధులతో జీవన సంగ్రామమున యుద్ధము చేయుటకు లెమ్ము.

**ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత** (కఠోపనిషత్ – తృతీయవల్లీ – 14)

పెద్దలను ఆశ్రయింపుము. జాగరూకతతో సాధన చేయుము. త్రిగుణములు క్షుద్రమైనవి హృదయ దౌర్బల్యములయినవి.

3వ శ్లోకములో పార్థ, పరంతప అని రెండుసార్లు సంబోధన పదములు ప్రయోగింపబడినవి. ఇలా ప్రయోగింపబడినచో, ఒకటి కథాభాగమునకు, రెండవది ఆధ్యాత్మిక భాగమునకు సంకేతముగా చెప్పవలయును. ఈవిధముగా కొన్ని శ్లోకములు కనబడును. అప్పుడు కథాభాగముగ, ఆధ్యాత్మిక భాగముగానూ అర్థము చెప్పవలసి ఉండును.

వ్యాసభగవానునికి పూర్వకవి అయిన వాల్మీకి ఇటులనే తన రామాయణములో ఒకే విషయమును ఒకే సర్గలో రెండు విభిన్న పద్ధతులుగా చెప్పును. అందు ఒకదానిని కథా పరంగానూ, రెండవ దానిని ఆధ్యాత్మిక పరంగానూ చెప్పవలసి ఉండును.

**ఉదా :** సీతా లక్ష్మణ సహితుడై రాముడు దండకారణ్యములో ప్రవేశించినాడు. ఎదురుగా విరాధుడను రాక్షసుడు తారసపడెను. ఆ విరాధుడు

**వసానం చర్మ వైయాఘ్రం వసార్ద్రం రుధిరోక్షితమ్**

(రామాయణం – అరణ్యకాండ – ద్వితీయ సర్గ – 6)

రక్తము కారుచున్నదియు, వసతో తడిసినదియు అయిన పులి చర్మమును వస్త్రముగా ధరించి ఉన్నాడు. రాముడు విరాధునిపై బాణములు ప్రయోగించుచున్నాడు.

**తే శరీరం విరాధస్య భిత్త్వా బర్హిణ వాససః**

(రామాయణం – అరణ్యకాండ – తృతీయ సర్గ – 12)

అనగా నెమలి పింఛము వస్త్రముగాగల విరాధునియొక్క శరీరమును రాముడు ప్రయోగించిన బాణములు ఛేదించినవి.

అనగా ఒకసారి పులిచర్మము వస్త్రము, ఇంకొకసారి నెమలి పింఛము వస్త్రము. ధరించినవానిగా విరాధుడువర్ణింపబడినాడు. ఇందు ఒకటి కథాభాగమును, ఇంకొకటి ఆధ్యాత్మిక భాగమును తెలుపును.

**ఇంకొక ఉదాహరణ:**

హనుమంతుడు మహేంద్ర పర్వతముపైనుండి లంఘించి లంకకు చారణులు సంచరించు మార్గమున లంకకు బయలుదేరినాడు.

సముద్రుడు మైనాక పర్వతమును హనుమంతునికి ఆతిథ్యమొసగ సముద్ర జలములలోనుండి లేవమని చెప్పు సందర్భమున మైనాకునితో –

**త్వమిహాసుర సంఘానాం పాతాళతల వాసినామ్**
**దేవరాజ్ఞా గిరి శ్రేష్ఠ పరిఘః సంనివేశితః**

(రామాయణం–సుందరాకాండ–ప్రథమసర్గ–92)

అనగా పాతాళ నివాసులైన అసురులు పాతాళమునుండి పైకి రాకుండుటకు – దేవేంద్రుడు నిన్ను ఇక్కడ అడ్డుగడియగా ఉంచినాడు అని చెప్పబడినది. అనగా ఇక్కడ దేవేంద్రునికి మైనాకునికి సఖ్యత చెప్పబడినది.

**సమా ముపాగతః క్రుద్ధో వజ్రముద్యమ్య దేవరాట్**

(రామాయణం – సుందరకాండ – ప్రథమసర్గ – 126)

కోపించి – వజ్రము పైకెత్తి ఇంద్రుడు నన్ను సమీపించెను. అనగా ఇక్కడ వైరము సూచింపబడినది. మరల మీ నాన్న దయవలన అనగా వాయుదేవుని దయవలన నేను యిక్కడ ఉంటిని.

**హిరణ్యనాభ శైలేన్ద్ర పరితుష్టో ఽ స్మి తే భృశమ్**
**అభయం తే ప్రయచ్ఛామి తిష్ఠ సౌమ్య యథా సుఖమ్**

(రామాయణం – సుందరకాండ – ప్రథమసర్గ 140)

అనగా మైనాకుడా నీవు చేసిన పనికి చాలా ఆనందించితిని. నీకు అభయము యిచ్చుచున్నాను. నీ యిచ్ఛవచ్చిన ప్రదేశమున సుఖముగా ఉండుము అని ఇంద్రుడు పలికెను.

ఈ విధముగా పరస్పర విరుద్ధ భావములు ప్రస్తావించబడినవి. ఇందు ఒకటి– ఆధ్యాత్మిక భావన. ఇంకొకటి కథాభాగము. వాల్మీకి సంఘటనలు తీసుకొనగా వ్యాస భగవానుడు సంబోధన పదములను ఒకే శ్లోకములో రెండు సార్లు ప్రయోగించి ఒకటి కథా భాగమునకు, యింకొకటి ఆధ్యాత్మిక భాగమునకు ప్రతీకగా ఉంచినాడు.

అర్జున ఉవాచ

శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు విని అర్జునుడు యిట్లు పలుకుచున్నాడు

**కథం భీష్మమహం సంఖ్యే । ద్రోణం చ మధుసూదన ।**
**ఇషుభిః ప్రతియోత్స్యామి । పూజార్హా వరిసూదన ॥ 4**

కథమ్ – భీష్మమ్ – అహమ్ – సంఖ్యే – ద్రోణమ్ – చ – మధుసూదన ఇషుభిః – ప్రతియోత్స్యామి – పూజార్హౌ – అరిసూదన.

**గురూనహత్వా హి మహానుభావాన్ ।**
**శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే ।**
**హత్వార్థ కామాంస్తు గురూనిహైవ ।**
**భుఞ్జీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్ ॥ 5**

గురూన్–అహత్వా – హి – మహానుభావాన్–శ్రేయః – భోక్తుమ్ – భైక్ష్యమ్– అపి – ఇహ – లోకే–హత్వా – అర్థ కామాన్ – తు – గురూన్– ఇహ – ఏవ – భుఞ్జీయ – భోగాన్ – రుధిర–ప్రదిగ్ధాన్.

**న చైతద్విద్మః కతరన్నో గరీయో ।**
**యద్వాజయేమ యది వా నో జయేయుః ।**
**యానేవ హత్వా న జిజీవిషామః ।**
**తేஉవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥ 6**

న – చ – ఏతత్ – విద్మః – కతరత్ – నః – గరీయః–యత్ – జయేమ– యది– వా – నః – జయేయుః–యాన్ – ఏవ – హత్వా – న – జిజీవిషామః –తే – అవస్థితాః – ప్రముఖే – ధార్తరాష్ట్రాః

**కార్పణ్య దోషోపహతస్వభావః ।**
**పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢ చేతాః ।**
**యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే ।**
**శిష్యస్తేఽ హం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥ 7**

కార్పణ్య దోషోపహతస్వభావః-పృచ్ఛామి - త్వామ్ - ధర్మ సమ్మూఢ చేతాః -యత్ - శ్రేయః - స్యాత్ - నిశ్చితమ్ - బ్రూహి - తత్ - మే-శిష్యః-తే - అహమ్ - శాధి - మామ్ - త్వామ్ - ప్రపన్నమ్.

**న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్ ।**
**యచ్ఛోక ముచ్ఛోషణమిన్ద్రియాణామ్ ।**
**అవాప్య భూమావసపత్న మృద్ధం ।**
**రాజ్యం సురాణామపి చాధిపత్యమ్ ॥ 8**

న - హి - ప్రపశ్యామి - మమ - అపనుద్యాత్ - యత్ - శోకమ్-ఉచ్ఛోషణమ్- ఇన్ద్రియాణామ్ - అవాప్య - భూమౌ - అసపత్నమ్ - ఋద్ధమ్- రాజ్యమ్ - సురాణామ్ - అపి - చ - ఆధిపత్యమ్

4వ శ్లోకమున మధుసూదన, అరిసూదన అను రెండు సంబోధన పదములు కలవు. ఒకటి కథా భాగమునకు, యింకొకటి ఆధ్యాత్మిక విభాగమైన అపర ధర్మములు చెప్పుటగా గ్రహించవలయును.

| | | |
|---|---|---|
| అరిసూదన+పూజార్హౌ+ | = | శత్రు సంహారకుడవయిన ఓ శ్రీకృష్ణా! |
| భీష్మమ్+ద్రోణమ్+చ | | పూజింపదగిన స్వచ్ఛందమరణముగల భీష్మ పితామహునుని, అస్త్రవిశారదుడైన ద్రోణాచార్యుల వారిని మఱియు ఇతర మహనీయు లయిన కృపాచార్యుల వారిని, గురు పుత్రుడయిన అశ్వత్థామను, ఇతర పెద్దలను |

| | | |
|---|---|---|
| అహమ్+సంఖ్యే+ | = | నేను యుద్ధమునందు ఎట్లు వీరిని ఎదిరించి |
| కథమ్+ఇషుభిః+ | | పోరాడగలను మఱియు ఎట్లు బాణములతో |
| ప్రతియోత్స్యామి | | ప్రతి యుద్ధము చేయుట? |

అనగా పెద్దలయిన వీరిని సంహరించుటకు చేతులు రావు. పూజింప దగిన వీరిని ఎదిరించి యుద్ధముచేయుట తగునా? ఈ ధర్మసందేహము అర్జునునకు ఉత్తర గోగ్రహణ సమయమున కౌరవులతో యుద్ధము చేయునపుడు కలుగలేదు. అందు కేవలము కథాభాగము మాత్రమే చెప్పబడినది. ఇప్పుడు ఆధ్యాత్మిక విషయములతో మేళవించి చెప్పుటవలన ధర్మ సందేహము కలిగినట్లు చెప్పబడినది. ఇందు 5వ శ్లోకములో రాజ్య సంపద కొఱకు స్వజనమును మహానుభావులైన పెద్దలను, గురువులను వధించుటకంటె భిక్షాటన మేలు అనే అపర ధర్మమును ప్రతిపాదించుచున్నాడు.

| | | |
|---|---|---|
| మధుసూదన | = | ఓ శ్రీకృష్ణా! |
| ఇహ+అర్థ కామాన్+ | = | ఈ లోకమునందు అర్థ కామములు రాజ్య |
| భోగాన్+తు+భుంజీయ+ | | భోగము ఇహలోక సుఖములు అనుభవించుట |
| గురూన్+హత్వా+రుధిర | | కొఱకు గురువులను, పెద్దలను, |
| ప్రపదిగ్ధాన్ | | స్వజనమును చంపి రక్తసిక్తములయిన వాటిని |
| | | అనుభవించుట కంటే ఈ యుద్ధమునందు |
| మహానుభావాన్గురూన్+ | = | మహాను భావులయిన పెద్దలను |
| ఏవ+అహత్వా+ | | గురువులను, స్వజనమును, మిత్రులను చంపక |
| ఇహ+లోకే+భైక్ష్యమ్+ | | ఈ లోకమనందు తినుటకు భిక్షాటన చేసి కూడ |
| అపి+భోక్తుమ్+ | | అనగా జీవన యాత్ర సాగించిన |
| శ్రేయః+హి | | శ్రేయస్సుగలుగును. ఆ కారణమున |

యుద్ధరంగమునుండి వెనుతిరిగిన అపకీర్తి, నరకము ఎటుల గలుగునో అదే విధముగ స్వజనమును, పెద్దలను, గురువులను చంపిన అపకీర్తి కాదా? ఇది మాత్రము పాపము కాదా? ఆవిధముగా నరకము గలుగదా? ఈ పని మాత్రము అనార్యులు చేయునది కాదా? మనకంటె పూర్వీకులు ఎవరయిన ఈ విధముగా ప్రవర్తించినారా?

| | | |
|---|---|---|
| యది+వా+జయేమ+చ<br>యత్+వా+నః+<br>జయేయుః+న+విద్మః | = | యుద్ధములో 7 అక్షౌహిణుల సైన్యముగల మనము జయించెదమా లేక 11 అక్షౌహిణుల సైన్యముగల కౌరవులు మనలను జయించెదరా ఎఱుగము. జయాపజయములు దైవాధీనములు. కావున జయము ఎవరిదో చెప్పజాలము. కౌరవులు మనలను జయించెదరా? లేక మనమే కౌరవులను జయించెదమా? |
| యాన్+ఏవ+హత్వా+<br>న+జిజీవిషామః+చ<br>తే+ధార్తరాష్ట్రాః+ప్రముఖే+<br>అవస్థితాః | = | ఎవరిని అనగా స్వజనమును, మహాను బావులను, స్నేహితులను, గురువులను, చంపి ఈ రక్తసిక్తములైన భోగములను అనుభవించ గలమా? అటులనే స్వజనములో ఎవరు చనిపోయిన పిదప మనము జీవించ ఇచ్ఛగింపమో ఆ కౌరవులు, కౌరవ సేనా ప్రముఖులు మన ఎదుట నిలచియున్నారు. ఇటువంటి పరిస్థితులలో మనము యుద్ధము చేయుటయా? లేక వారితో సంధిచేసుకొనుటయా? |

రాజనీతి అనుసరించి మనకంటే అధికులతో సంధిచేసుకొనవలయును. సైనిక బలము చూచినచో వారివి 11 అక్షౌహిణులు, మనవి 7 అక్షౌహిణులు. కావున వారితో యుద్ధమా లేక సంధియా? ఈ రెండింటిలో ఏది శ్రేష్ఠమో తెలియకున్నాను.

| | | |
|---|---|---|
| ఏతత్+కతరత్+నః+ | = | దీనిలో ఏది శ్రేష్ఠమో తెలియకున్నాను. |
| కార్పణ్యదోషోపహత–<br>స్వభావః | = | స్వజనముయందుగల జాలి, దయ, కృప మొదలైన వాటిచే చలింపబడిన మనస్సు కలవాడను అగుట వలనను, ఆత్మదర్శనము చేయనివాడనై అవిద్యచే చుట్టబడిన జీవస్వభావము కలవాడనగుటచేతను |
| ధర్మ సమ్మూఢ చేతాః | = | స్వజనమును చంపుటయా లేక చంపకుండుటయా అనే ధర్మాధర్మములు నిర్ణయింపలేని మనస్సు కలవాడను అగుటవలనను, అపరధర్మములు, |

| | | |
|---|---|---|
| | | పరధర్మములు తెలియనివాడనగుటచేతను |
| యత్+శ్రేయః+స్యాత్+ | = | ఏది అనగ యుద్ధముచేయుటయా లేక యుద్ధము |
| తత్+త్వామ్+పృచ్ఛామి+ | | చేయకుండుటయా అను ఈ రెండింటిలో ఏది |
| మే+నిశ్చితమ్+బ్రూహి | | శ్రేయస్సు అగునో దానిని చెప్పుమని నిన్ను |
| | | అడుగుచున్నాను. కావున ఏది శ్రేయస్సు అగునో |
| | | దానిని నాకు నిశ్చయించి – ఓ శ్రీకృష్ణా! చెప్పుము |
| భూమౌ+అసపత్నమ్+ | = | భూమియందు నిష్కంటకమైనదియు ధనధాన్య |
| ఋద్ధమ్+రాజ్యమ్+ | | సమృద్ధి గలదియు అయిన రాజ్యమును పొందియు |
| అవాప్య | | అనగా ఇహలోక సుఖములు గలిగియు |
| చ | = | మఱియు |
| సురాణామ్+అపి+ | = | దేవతలయొక్క రాజ్యాధిపత్యము పొందియు |
| ఆధిపత్యమ్+న+ | | (అనగా పరలోక సుఖములు పొందియు ఇహలోక |
| ప్రపశ్యామి+హి | | పరలోక సుఖములు పొందు వఱకు వాటిని |
| | | పొందాలనే తపన, వాటిని పొందిన తరువాత అవి |
| | | శాశ్వతముగా ఉండవనే మనో బాధవలన) |
| | | ఆత్మశాంతిని కనుగొనలేక ఉన్నాను. ఆ కారణమున |
| మమ+ | = | నా యొక్క జ్ఞానేంద్రియములయొక్క |
| ఇంద్రియాణామ్+ | | అనగా మనస్సు యొక్క అత్యంత పరితాపమును |
| ఉత్ శోషణమ్+శోకమ్+ | | గలిగించు శోకమును ఏది పోగొట్టునో అనగా |
| యత్+అపనుద్యాత్ | | దుఃఖ రాహిత్యమును గల్గించునదియు, మానసిక |
| | | అశాంతిని పోగొట్టునదియు, ఆత్మకు శాంతి గలుగు |
| | | విధానమును చెప్పమని నిన్ను నేను అడుగుచున్నాను |
| అహమ్+తే+శిష్యః+ | = | నేను నీకు శిష్యుడను అందువలన నిన్ను |
| త్వామ్+ప్రపన్నమ్+ | | శరణు పొందియున్న (అందువలన అనగా నిన్ను |

మామ్+శాధి — ఆశ్రయించుటవలనను, నీకు శిష్యుడను అగుట వలనను నన్ను కరుణించి ఆత్మకు శాంతిగలుగు విధానము ఉపదేశింపుము.

**వ్యాఖ్యానము:-** కథాభాగమునకు సంబంధించి 1. యుద్ధము చేయుటయా లేక యుద్ధము చేయక యుండుటయా? ఈ రెండింటిలో ఏది శ్రేయస్కరమో దానిని నాకు చెప్పుము. 2. భీష్మాదులతో యుద్ధము చేయుట ఎట్లు? స్వజనమును చంపిన పాపము కలుగదా? 3. మనలను వారు జయించెదరా లేక మనమే వారిని జయించెదమా? ఎవరు యుద్ధమున జయించెదరు? అన్న ప్రశ్నకు విశ్వరూప సందర్శనముగా చెప్పబడే 35వ అధ్యాయములో 33వ శ్లోకములో చెప్పబడినది.

**అధ్యాత్మిక విభాగము :** ఇంద్రియములయొక్క అత్యంత పరితాపకరమగు శోకమును ఏది పోగొట్టునో అనగా ఆత్మకు శాంతి గలుగు విధానమును చెప్పుము. గురువులు తమ ప్రియ శిష్యులకు పరమ రహస్యము అయిన అధ్యాత్మిక విభాగమును చెప్పుదురు. ఇహలోక పరలోక సుఖములు పొందియు మానవుడు ఆత్మ శాంతిని పొందలేక ఉన్నాడు. కావున దుఃఖరాహిత్యము ఎలా కలుగుతుంది? ఆత్మకు శాంతి ఎలా కలుగుతుంది అని అర్జునుడు అడిగినాడు. ఆత్మకు శాంతి కలిగిన జన్మ, సంసార, బంధమునుండి మానవుడు విడివడును. భారతములో ధర్మరాజు భీష్మపితామహునిని 'కిం ముచ్యతే జంతుః జన్మ సంసార బంధనాత్' అనగా జన్మ, సంసార బంధములనుండి ముక్తి ఎట్లు కలుగును అని అడిగెను. ఇదే విషయమును భాగవతములో సూతమహర్షిని శౌనకాదులు "ఏమిటం బొడము ఆత్మకు శాంతి"? మునీంద్ర చెప్పవే అని అడిగిరి. లోకములో ప్రేయోమార్గము, శ్రేయోమార్గము అని రెండు మార్గములు కలవు.

ఇహలోక, పరలోక సుఖములు పొందుట **ప్రేయోమార్గము.** ఆత్మకు శాంతి గలుగు విధానము జనన మరణ వలయమునుండి విడివడుట, బ్రహ్మలోకము పొంది బ్రహ్మ అగుట **శ్రేయోమార్గము.** కావున నాకు శ్రేయోమార్గమును ఉపదేశింపుమని అర్జునుడు అడిగెను.

**ఆధ్యాత్మిక పరంగా:** కృపణుడు అనగా

**యో వా ఏతదక్షరం గార్గ్య విదిత్వాస్మిం లోకే ।**

**జుహోతి యజతే తపస్తప్యతే బహూని వర్ష ।**
**సహస్రాణ్యన్తవ దేవాస్యా తద్భవతి యో వా ఏతదక్షరం ।**
**గార్గ్య విదిత్వా స్మాల్లోకాత్ ప్రైతి సకృపణః అథః య ।**
**ఏత దక్షరం గార్గి విదిత్వా ఉస్మా ల్లోకాత్ ప్రైతి స బ్రాహ్మణః ॥**

(బృహదారణ్యక ఉపనిషత్ - 3 - 8 - 10)

అనగా ఈ అక్షర పరబ్రహ్మను తెలుసుకొనక, దర్శించక, యజ్ఞము చేసినను, బహుకాలము తపస్సు చేసినను ఫలితము శూన్యము. దేహత్యాగ సమయమునకు ముందే అక్షరునిని దర్శించనివాడు**కృపణుడు** అలా అక్షర పరబ్రహ్మను దర్శించినవాడు **బ్రాహ్మణుడు**. కావున బ్రాహ్మణత్వము కలుగు విధానమును చెప్పుమని అర్జునుడు అడిగెను. శాంతత్వమన్నా, బ్రాహ్మణత్వమన్నా ఒకటే.

...... ❖ ❖ ❖ ......

సంజయ ఉవాచ

**ఏవముక్త్వా హృషీకేశం । గుడాకేశః పరంతప ।**
**న యోత్స్య ఇతి గోవింద । ముక్త్వా తూష్ణీం బభూవ హ ॥ 9**

ఏవమ్ - ఉక్త్వా - హృషీకేశమ్ - గుడాకేశః - పరంతప - న - యోత్స్య- ఇతి- గోవిందమ్ - ఉక్త్వా - తూష్ణీమ్ - బభూవ - హ

**తమువాచ హృషీకేశః । ప్రహసన్నివ భారత ।**
**సేనయోరుభయోర్మధ్యే । విషీదన్తమిదం వచః ॥ 10**

తమ్ - ఉవాచ - హృషీకేశః - ప్రహసన్ - ఇవ - భారత
సేనయోః - ఉభయోః- మధ్యే - విషీదంతమ్ - ఇదమ్ - వచః

ఈ 9వ శ్లోకములో హృషీకేశమ్, గోవిందమ్ అను రెండు పదములు కలవు. అందు ఒకటి కథాభాగమునకు రెండవది ఆధ్యాత్మికమునకు సంకేతము.

| | | |
|---|---|---|
| పరంతప | = | ఓ ధృతరాష్ట్ర మహారాజా! |
| గుడాకేశః+హృషీకేశమ్+ | = | అర్జునుడు శ్రీకృష్ణునిగూర్చి |
| ఏవమ్+ఉక్త్వా+హ+<br>గోవిందమ్+ఉక్త్వా+<br>న+యోత్స్య+ఇతి+<br>తూష్ణీమ్+బభూవ | | ఈ విధముగా యుద్ధమునకు సంబంధించిన ప్రశ్నలు అడిగి అనగా యుద్ధము చేయుటయా లేక మానుటయా? మఱియు జయము ఎవరిది? అని శ్రీకృష్ణుని గూర్చి పలికి ఈ ప్రశ్నలకు నీవు సమాధానము చెప్పునంత వఱకు యుద్ధము చేయను అని పలికి మౌనముగా ఉండెను. |
| భారత | = | ఓ ధృతరాష్ట్ర మహారాజా! |
| ఉభయోః+సేనయోః+<br>మధ్యే+విషీదంతమ్+<br>తమ్+హృషీకేశః+<br>ప్రహసన్+ఇవ+<br>ఇదమ్+వచః+ఉవాచ | = | రెండు సేనల యొక్క మధ్య భాగము నందు ధనుర్బాణములు వదలి రథముపై చతికిలపడి దుఃఖించుచున్న (అధ్యాత్మపరముగా ఆత్మ శాంతికొఱకు దుఃఖించుచున్న) అర్జునుని గూర్చి శ్రీకృష్ణుడు మందహాసము చేయుచున్న వానివలె ఈ మాటలను పలికెను. |

అర్జునుడు అడిగిన అన్ని ప్రశ్నలకు సమాధానములు తెలుయుటవలన – శ్రీకృష్ణుడు చిఱు మందహాసము చేసినాడు.

...... ❖ ❖ ❖ ......

ఈ 11వ శ్లోకము మొదలు 25వ శ్లోకము వఱకు ఆత్మ–హృదయగత ఆత్మ–దేహి– దేహముల గుఱించి చెప్పబడుచున్నవి.

**పండితుని లక్షణము :**

శ్రీ భగవాన్ ఉవాచ

**అశోచ్యా నన్వశోచస్త్వం । ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।**
**గతాసూనగతాసూంశ్చ । నానుశోచంతి పండితాః ॥ 11**

అశోచ్యాన్ - అన్వశోచః - త్వమ్ - ప్రజ్ఞావాదాన్ - చ - భాషసే
గతాసూన్ - అగతాసూన్ - చ - న - అనుశోచంతి - పండితాః

త్వమ్+అశోచ్యాన్+ = నీవు శోకింపతగని వారిని గూర్చి
అన్వశోచః+చ+ శోకించుచున్నావు, ధర్మాధర్మముల గుఱించి
ప్రజ్ఞా వాదాన్+భాషసే ప్రజ్ఞావంతునివలె మాటలాడుచున్నావు
గతాసూన్+చ+ = చనిపోయేదానిని గుఱించియు అనగా మరణించే
అగతాసూన్+పండితాః+ లక్షణములు గల దేహముల గుఱించియు మఱియు
న+అను శోచంతి ఎన్నటికి మరణించని దేహి, ఆత్మ గుఱించియు
తెలిసిన పండితులు దేహ మరణమునకు దుఃఖింపరు
అనగా మరణించిన వారి గుఱించి మిక్కిలి దుః
ఖింపరు. వారు ఒక ముహూర్త కాలము దుః
ఖింతురు. అంతే తప్ప కృంగిపోరు.

**వ్యాఖ్యానము:-** లోకములో మనకు తెలియని, సంబంధము లేని వారి మరణము గుఱించి మనకు తెలిసిన అది వార్త అగును. దుర్మార్గులయిన కౌరవుల మరణము శోకహేతువు కాదు. అది ఆనంద దాయకము. శత్రువుల మరణవార్త మనకు ఆనందము కలిగించును. మన చుట్టాల, బంధువుల, ఆత్మీయుల మరణవార్త వలన దుఃఖము కలుగును. శివుడు తన భార్య అయిన దాక్షాయణీ మరణమునకు దుః ఖించినాడు. దాక్షాయణీ యొక్క దేహము గుఱించి ఆ దేహములో గల దేహి గుఱించి తెలిసియు శివుడు దుఃఖించినాడు.

అష్ట వసువులలో చివరివాడు తనకు పుత్రుడుగా పుట్టెనని తెలిసియు భీష్ముని మరణమునకు గంగ దుఃఖించినది. శ్రీరాముడు యుద్ధరంగమున పడిపోయిన

లక్ష్మణుని గూర్చి దుఃఖించినాడు. వసిష్ఠులవారు మరణించిన తన పుత్రుడైన శక్తి గుఱించి విలపించి ఆత్మహత్యకు పాలుపడెను. ఆ తరువాత తన మనుమడయిన పరాశరుని చూచి స్వస్థత పొందెను. కావున దేవతలు అయినా, వేదాంత విజ్ఞాన ఘనులయినా ఆత్మీయుల మరణమునకు క్షణకాలము దుఃఖింతురు. అంతే తప్ప ఆ మరణమును తలచుకొని కృంగిపోరు.

శోకమోహములు కలిగిన సంసారికి అపరధర్మము ఆచరించిననూ జన్మరాహిత్యము కలుగదు. నిష్కామ పుణ్యకర్మానుష్ఠానముతో కూడిన ఆత్మజ్ఞానము వలననే జన్మరాహిత్యము కలుగును.

పరధర్మము – అపరధర్మములు రెండునూ తెలిసినవాడు పండితుడు.

ధర్మములలో అపర ధర్మము, పర ధర్మము అని రెండు విభాగములు కలవు. పరధర్మములు అపర ధర్మములకంటె భిన్నములు. అందు అపర ధర్మములలో తల్లి, తండ్రి, సోదరులు, బాంధవులు, స్నేహితులు మొదలైన దేహ సంబంధీకులయెడ తనకుగల విధులు, బాధ్యతలు చెప్పబడును. విధులు, బాధ్యతలు నెఱవేర్చుట పుణ్యము. వారిని బాధించుట, దండించుట, వధించుట, విధులు, బాధ్యతలు నెఱవేర్చకుండుట పాపము.

సామాన్య జనులందఱు ఈ అపర ధర్మములను విధిగా పాటింపవలయును. మోక్షార్థి పర ధర్మములను పాటించును. అందు తను (జీవుడు) ఎవరు? తనకీ దేహ సంబంధము ఎటుల గలిగినది? ఈ బంధువులు తల్లి దండ్రులతో తనకు గల సంబంధము ఎటువంటిది? మొదలగు ప్రశ్నలకు సమాధానములతో పాటు జీవుడు ఆత్మ స్థానమునకు చేరు విధి విధానము చెప్పబడును. ఆత్మస్థానమును చేరి ఆత్మయై విరాజిల్లినవారు **పండితులు**. దేహిలో మూర్ఖుడు, పండితమన్యుడు, పండితులు అని మూడు విభాగములు కలవు. మూర్ఖుడు లేదా వ్యర్థజీవి సంసారతాపత్రయములతో నిజ కుటుంబ పారవశ్యమున కాపురములు చేసి చివరకు చచ్చును. వీరు నరకము పాలగుదురు. పండితమన్యులు పుణ్యకర్మలు చేసి పరలోకసుఖములు పొంది తిరిగి భూలోకమున జన్మింతురు. మూడవ వారు **పండితులు**. ఈ పండితులు రెండు విధములుగా ఉందురు.

**శాస్త్రజ్ఞానముగల పండితులు :** ఒకరు కేవలము శాస్త్రము తెలిసినవారు, వీరు మురికి కాలువ వంటివారు. కంచు గంట వంటి వారు. ఆడవారిచేతిలో

లేడిపిల్లలాగ ఆకర్షణకులోనై– అరిషడ్వర్గములు, ఈషణ త్రయములు గలిగి సంసార కూపములో తిరుగాడుచుందురు. ఇట్టివారి గుఱించి ప్రహ్లాదుడు నిరసించినాడు.

*(భాగవతం – సప్తమస్కంధం – 212, 215)*

దేహి దేహ లక్షణములు తెలిసిన పండితులు రెండవవారు శాస్త్రముతో పాటు అందు వివరించిన ఆత్మ గుఱించి అధ్యాత్మ గుఱించి స్వానుభవములో తెలిసిన వారు. వీరు గంగానదివంటివారు. బంగారపు గంట వంటివారు. గుణరహితులై ఆత్మదర్శనము చేసినవారు వీరు. దేహి – దేహముల గుఱించి శాస్త్రపాఠముతోపాటు అనుభవము కలిగి యుందురు. దేహము అశాశ్వతము. దేహి నిత్యుడు. దేహము వేఱు – దేహి వేఱు. ఇదే విషయమును అనేకులు అనేక మారులు ఇట్లు చెప్పిరి.

హిరణ్యకశిపుడు – తన తల్లితో ఇట్లు చెప్పెను :

**సీ. పాంచభౌతికమైన భవనంబు దేహంబు పురుషుండు దీనిలోఁ బూర్వ కర్మ**
**వశమున నొకవేళ వర్తించు దీపించుఁ దఱి యైన నొకవేళఁ దలఁగి పోవుఁ,**
**జెడునేని దేహంబు సెడుఁగాని పురుషుండు సెడఁ డాతనికి నింతసేటు లేదు,**
**పురుషునికిని దేహపుంజంబునకు వేఱు గాని యేకత్వంబు గానరాదు,**

**ఆ. దారువుల వెలుంగు దహనుని కైవడిఁ, గాయములఁ జరించు గాలి భంగి**
**నాళలీనమైన నభము చాడ్పున వేఱు, దెలియవలయు దేహి దేహములకు.**

*(భాగవతము – సప్తమస్కంధం – 51)*

అనగా ఈ దేహము పంచభూతములచే ఏర్పడినది. జీవుడు ఈ దేహములోనికి తన పూర్వజన్మ కర్మవలన ప్రవేశించును. అటులనే కర్మాంతమున ఈ దేహమును వీడును. దేహము నశించును. దేహి నశింపడు. దేహమునకు, దేహికి ఏకత్వము లేదు. ఇవి రెండును వేఱు, వేఱు.

**శా. నీరాగారనివిష్ట పాంథుల క్రియన్ నిక్కంబు సంసార సం**
**చారుల్ వత్తురు గూడి విత్తురు, సదా సంగంబు లేదొక్కచో**

(భాగవతము – సప్తమస్కంధం – 38)

అనగా చలివేంద్రములో బాటసారులు కలసి, విడిపోవునట్లు బంధువులు

కర్మానుసారము ఈ లోకములో కలియుదురు. విడిపోవుదురు. వీరు దేహ సంబంధీకులే గాని దేహి సంబంధీకులు కారు. ఈ విషయము స్వానుభవములో గ్రహించిన వానికి దేహ సంబంధీకులయందు మోహము ఉండదు. దేహము నశించును. దేహి నశింపదు.

ఇదే విషయమును ప్రహ్లాదుడు తోటి బాలకులతో ఇట్లు చెప్పెను : జన్మ సంస్థాన వర్ధనాప క్షీణత్వ పరిపాక నాశంబులు.... దేహంబునకుంగాని.... ఆత్మకు లేవు. (భాగవతం - సప్తమస్కంధం - 237) అనగా జన్మ, పెరుగుట, నశించుట ఈ దేహమునకే తప్ప ఆ దేహములోని దేహికిగాని, ఆత్మకుగాని లేవు.

ఇదే విషయమును వసుదేవుడు - కంసునితో ఇట్లు చెప్పెను...

**సీ. మేనితోడన పుట్టు మృత్యువు జనులకు, నెల్లి నేఁడైనఁ నూతేండ్ల కైనఁ**
**దెల్లంబు మృత్యువు దేహంబు పంచత నందఁ గర్మానుగుండై శరీరి**
**మాఱుదేహము నూఁది, మఱి తొంటి దేహంబుఁ బాయును దన పూర్వ భాగమెత్తి**
**వేఱొంటిపైఁ బెట్టిఁ వెనుకభాగం బెత్తి గమనించు తృణజలూకయును బోలె.**
**ఆ. వెంట వచ్చు కర్మవిసరంబు, మును మేలు కన్నవేళ నరుఁడు గన్న విన్న**
**తలఁపఁబడిన కార్యతంత్రంబు కలలోనఁ, బాడితోడఁ గానఁబడిన యట్లు.**

(భాగవతము - దశమస్కంధము - 29)

అనగా శరీరముతోనే మృత్యువు కలుగును. దేహము నశింపగా దేహి తన కర్మానుసారము ఇంకొక దేహములోనికి ప్రవేశించును. దీనికి ఉదాహరణగా జలగను చెప్పవచ్చును. దేహము నశించినా కర్మ నశించదు. ఈ కర్మ దేహితోపాటు ఊర్ధ్వ, అథోలోకములకు వచ్చును. ఈవిధముగా దేహి, దేహముల గుఱించి అనేకమంది చెప్పినారు.

**దేహి గుఱించి :** దేహి ఒక రూపమున ధ్రువము. ఇంకొక రూపమున అధ్రువము. ఇంకొక రూపమున ధ్రువము, అధ్రువము గాక ఉండును అని భాగవతం ప్రథమ స్కంధం-325లో చెప్పబడినది.

...... ❖ ❖ ❖ ......

దేహి గుఱించి, ఆత్మ గుఱించి చెప్పుచున్నాడు

**న త్వేవాహం జాతు నాసం । న త్వం నేమే జనాధిపాః ।**
**నచైవ న భవిష్యామః । సర్వే వయమతః పరమ్ ॥ 12**

న-తు-ఏవ-అహమ్-జాతు-న-ఆసమ్-న-త్వమ్-న-ఇమే-జనాధిపాః
న-చ-ఏవ-న-భవిష్యామః-సర్వే-వయమ్-అతః-పరమ్.

| | | |
|---|---|---|
| అహమ్+న+ఆసమ్+న | = | నేను సృష్ట్యాదియందు ఉన్న ఆత్మగాను, హృదయ గుహలో గల ఆత్మగాను లేను అనునది లేదు. అనగా త్రికాలములందు గలను. |
| త్వమ్+ ఇమే+జనాధిపాః+ చ+తు+ఏవ+జాతు+ న+న | = | నీవు ఈ రాజులు, మఱియు ఈ ఏనుగులు, గుఱ్ఱములు, ఈ సైన్యము ఈ స్థావర జంగమాత్మకమైన జగత్తు ఒకప్పుడును లేదు అనునది లేదు. అనగా భూత భవిష్యత్ వర్తమాన కాలములలో దేహము నశించినను దేహి రూపమున ఉందురు. |
| అతః+వయమ్+సర్వే+ ఏవ+పరమ్+భవిష్యామః న+న | = | అందువలన మనమందఱము గతంలోను, వర్తమానములోను, ఇకమీదట భవిష్యత్తులోనూ దేహి రూపమున లేను అనునది లేదు, అనగా శాశ్వతులము. మనము ఈ దేహ రూపమున ఉండము. |

అర్జునా! దేహి రూపమున నీవు మఱియు ఇతరులు, ఆత్మరూపమున నేను శాశ్వతులము సృష్ట్యాదియందుగల ఆత్మ సృష్టిలో అంతర్యామిగా, దేహిగా, హృదయ గుహలోని ఆత్మగా యున్నది.

కావున సృష్టి ఉన్నంతవరకు అనగా భూత, భవిష్యత్ వర్తమానములలో శాశ్వత లక్షణముగల దేహి ఆత్మలు ఉందురు. దేహము మాత్రమే నశించును. దేహి కర్మానుసారము ఇంకొక దేహములో ప్రవేశించును.

మనమందఱము ఇదే దేహముతో గతములో లేము, భవిష్యత్‌లో ఉండము.

అనగా దేహము నశించును కాని మనమందఱము దేహి రూపమున గతంలో వర్తమానములో భవిష్యత్ లోకూడా ఉందుము. అనగా దేహి శాశ్వతుడు.

దేహి తన పూర్వజన్మ కర్మవశమున ఈ దేహములోనికి ప్రవేశించెను. కర్మాంతమున ఈ దేహమును వీడును. మరల కర్మానుసారము మఱియొక దేహమును పొందును.

లయకాల పర్యంతము జనన మరణ వలయములో దేహి తిరుగాడును. దేహి, దేహములలో భిన్నత్వమున్నది. కావున జనాధిపాః అని బహువచనము ప్రయోగింపబడినది. దేహములోగల ఆత్మలో భిన్నత్వము లేదు. దేహమునకు బాల్యయౌవన జరా అవస్థలవలె మరణము ఒక అవస్థ. దేహికి జాగ్రత్ స్వప్న, సుషుప్తి అవస్థలవలె దేహమును వీడుట ఒక అవస్థ. దేహము యొక్క దేహి యొక్క అవస్థలు రాబోవు శ్లోకములలో చెప్పబడుచున్నవి.

...... ❖ ❖ ❖ ......

దేహి - దేహముల అవస్థలు

**దేహినోఽస్మిన్ యథా దేహే । కౌమారం యౌవనం జరా ।**
**తథా దేహాంతర ప్రాప్తిః । ధీరస్తత్ర న ముహ్యతి ॥ 13**

దేహినః – అస్మిన్ – యథా – దేహే – కౌమారమ్ – యౌవనమ్ – జరా
తథా– దేహాంతర ప్రాప్తిః – ధీరః – తత్ర – న – ముహ్యతి.

| | | |
|---|---|---|
| యథా+కౌమారమ్+ యౌవనమ్+జరా+తథా | = | ఏ విధముగా దేహమునకు బాల్యము, యౌవనము, ముసలితనము అనునవి ఎలా అవస్థలో, ఆవిధముగా మరణము దేహమునకు ఒక అవస్థ |
| అస్మిన్+దేహే+దేహినః | = | ఈ దేహము నందుగల దేహికి ఏవిధముగా జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలలో ఆవిధముగా |
| దేహాంతరప్రాప్తిః+ధీరః+ | = | ఈ దేహమును వీడుటయు ఒక అవస్థయే. |

తత్ర+న+ముహ్యతి — ఆత్మస్థానము పొందియు ఆత్మగా విరాజిల్లనివారు తిరిగి జన్మకు వచ్చెదరు. బ్రహ్మాత్వము పొందినవారు తిరిగి ఎన్నటికి జన్మింపరు. కావున దేహి, దేహ లక్షణములు తెలిసిన పండితుడు. ఆ విషయమున అనగా మరణము దేహమునకు ఒక అవస్థ అనియు దేహాంతర ప్రాప్తి దేహికి ఒక అవస్థ అనియు గ్రహించి, ఈ అవస్థల విషయమున బంధువుల విషయమున మోహమును పొందదు.

బాల్యావస్థ నశించి యౌవనావస్థ వచ్చినప్పుడు యౌవనావస్థ నశించి ముసలితనము వచ్చినప్పుడు మనము దుఃఖించుటలేదు. అటులనే మరణము కూడా ఒక అవస్థ. కావున దేహము నశించినప్పుడు దుఃఖించ వలసిన పనిలేదు.

...... ❖ ❖ ❖ ......

ఇంద్రియార్థముల వలన మఱియు జీవుని పూర్వ జన్మ కర్మవలన కాలానుసారము సుఖదుఃఖములు కలుగుచున్నవి.

**మాత్రా స్పర్శాస్తు కౌంతేయ । శీతోష్ణసుఖదుఃఖదాః ।**
**అగమా పాయినోఽనిత్యాః । తాంస్తితిక్షస్వ భారత ॥ 14**

మాత్రా స్పర్శాః - తు - కౌంతేయ - శీతోష్ణ-సుఖ దుఃఖదాః
అగమా పాయినః - అనిత్యాః - తాన్ - తితిక్షస్వ - భారత

**యం హి న వ్యథయంత్యేతే । పురుషం పురుషర్షభ ।**
**సమ దుఃఖసుఖం ధీరం । సోఽమృతత్వాయ కల్పతే ॥ 15**

యమ్ - హి - న - వ్యథయంతి - ఏతే - పురుషమ్ - పురుషర్షభ
సమదుఃఖసుఖమ్ - ధీరమ్ - సః - అమృతత్వాయ - కల్పతే

| | | |
|---|---|---|
| కౌంతేయ | = | ఓ అర్జునా! |
| మాత్రాః+స్పర్శాః+తు | = | పంచ తన్మాత్రల వలన పంచ భూతములు, పంచ భూతముల వలన పంచ జ్ఞానేంద్రియములు, ఆ జ్ఞానేంద్రియములకు ఇంద్రియార్థములు గలిగినవి. శబ్దాది విషయములతో జ్ఞానేంద్రియముల సంయోగము అనగా చెవికి శబ్దము, చర్మమునకు స్పర్శ, కంటికి రూపము, నాలుకకు రసము (రుచి), ముక్కుకు గంధము(వాసన) ఇంద్రియార్థములు. ఈ ఇంద్రియార్థములతో మనస్సు కలసి అవి విషయేంద్రియములయినవి. అప్పుడు |
| శీతోష్ణ+సుఖదుఃఖదాః | = | చర్మము వలన చలి, వేడిని మనస్సు గ్రహించును. అటులనే చెవి వలన శబ్దమును, నేత్రమువలన రూపమును, నాలుక వలన రసమును, ముక్కువలన గంధమును గ్రహించును. అవి మనస్సుకు హితమైన సుఖమును ఆనందమును, మనస్సుకు కష్టమైన దుఃఖమును గలుగజేయునవి అయి వున్నవి. |
| భారత | = | ఓ అర్జునా! |

దేహి తను చేసుకొన్న పూర్వజన్మ కర్మానుసారము, కాలానుసారము దేహికి సుఖదుఃఖములు కలుగుచున్నవి. ఆ సుఖదుఃఖములు పౌర్ణమి అమావాస్యలవలె

| | | |
|---|---|---|
| ఆగమాపాయినః+ అనిత్యాః | = | కాలానుసారము గలుగును. సుఖదుఃఖములు వచ్చి పోవు స్వభావము కలవి. అనిత్యములు అయి ఉన్నవి. సుఖము నిత్యము కాదు. దుఃఖము నిత్యము కాదు. ఆ సుఖ దుఃఖములు అనిత్యములు, |

ఇంతవఅకు శాస్త్ర పాఠమును చెప్పి, యిక సాధన పాఠమును చెప్పుచున్నాడు.)

(సాధన పాఠము)

| | | |
|---|---|---|
| తాన్+తితిక్షస్వ | = | ఆ సుఖదుఃఖములను సహింపుము. సుఖము కలిగినప్పుడు ఉప్పొంగిపోక దుఃఖము కలిగినప్పుడు క్రుంగిపోక గాంభీర్యము వహింపుము. |
| పురుషర్షభ | = | ఓ అర్జునా! |
| ఏతే+సమ దుఃఖ సుఖమ్ | = | ఈ రెండు అనగా కాలానుసారము గలుగు సుఖ దుఃఖములు, విషయేంద్రియముల ద్వారా గలుగు సుఖదుఃఖములు |
| యమ్+ధీరమ్+పురుషమ్ +న+వ్యథయంతి | = | ఏ ధీరుడయిన పురుషుని మనస్సును బాధించవో అనగా ఎవడు సుఖదుఃఖములకు విచలితుడు కాడో |
| సః+అమృతత్వాయ+ కల్పతే | = | అట్టి ధీరుడు అమృతత్వము కొఱకు తగియున్నాడు. |

**వ్యాఖ్యానము:-** శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అనునవి పంచతన్మాత్రలుగా చెప్పుదురు. ఈ పంచతన్మాత్రలనుండి పంచభూతములు వచ్చినవి. ఆ పంచభూతముల వలన స్థూలశరీరము మఱియు జ్ఞానేంద్రియములు వచ్చినవి. ఈ జ్ఞానేంద్రియములకు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు విషయములగును.

| | |
|---|---|
| చెవులకు – | శుభవార్త ఆనందము, అశుభవార్త దుఃఖమును, |
| చర్మమునకు– | శీతాకాలమున చలి, వేసవికాలమున వేడి దుఃఖమును అటులనే శీతాకాలమున వేడి, వేసవికాలమున చలి సుఖమును |
| కన్నుకు– | సుందర దృశ్యము ఆనందము, వికారమయిన దృశ్యము, మరణ దృశ్యము దుఃఖమును |
| నాలుకకు – | మధుర పదార్థములు ఆనందమును, చేదు పదార్ధము అయిష్టతను, |
| ముక్కు – | సువాసన ఆనందమును, దుర్వాసన ఇబ్బందిని కలుగ చేయును. ఇష్టము సుఖమును అయిష్టము దుఃఖమును గలుగజేయును. ఆవిధముగ జ్ఞానేంద్రియములు సుఖ దుఃఖములను గలుగ చేయునవి అగుచున్నవి. |

గాఢనిద్రలో ఉన్నవానికి వాని ప్రక్కనుండి పాము వెళుతున్నా భయము కలుగదు.

ఎందువలన అనగా మనస్సు అప్పుడు లేదు. అటులనే ఏకాగ్రచిత్తునకు శబ్దము వినబడదు. కావున మనస్సును నిగ్రహించుము.

సుఖ దుఃఖములు రెండు రకములు. స్థూల దేహములో గల ఇంద్రియములు ఇంద్రియార్థములు వాటితో మనస్సు కలియుటచే గలుగు సుఖ దుఃఖములు ఒక రకము. దేహియొక్క పూర్వ జన్మ కర్మానుసారము జీవునకు గలుగు సుఖ దుఃఖములు రెండవ రకము. ఈ సుఖ దుఃఖములు పౌర్ణమి, అమావాస్యల వంటివి. పౌర్ణమి పోయి అమావాస్య వచ్చును. అమావాస్య తరువాత పౌర్ణమి వచ్చును. సుఖదుః ఖములు కాలానుసారము గల్గును. ఈ సుఖదుఃఖములు అనిత్యములు. కావున సుఖము కలిగినప్పుడు ఉప్పొంగిపోక, దుఃఖము కలిగినప్పుడు క్రుంగిపోక వాటిని అనిత్యములుగా భావించి కష్టము కలిగినప్పుడు ఓర్చుకొనవలయును.

సుఖ దుఃఖములకు విచలితుడు గానివాడు పండితుడు. కావున సాధకుడు సుఖ దుఃఖములకు విచలితుడు కారాదు. వాటిని సహించవలెను.

15వ శ్లోకమున కౌంతేయ, భారత అని రెండు సంబోధన పదములు కలవు. ఇందు ఒకటి ఇంద్రియార్థములవలన గలుగు సుఖ దుఃఖములకు, ఇంకొకటి కాలానుసారము గలుగు సుఖ దుఃఖములకు చెప్పవలెను.

ప్రకృతిని అధిష్ఠించిన ఈశ్వరుని వలన మహత్ గలిగినది. మహత్ వలన అహంకారము గలిగినది. అహంకారము మూడు విధములయినది. సాత్త్వికాహంకారము వలన మనస్సు, ఇంద్రియాధిష్ఠాన దేవతలు గలిగిరి. రాజసాహంకారము వలన సూక్ష్మ శరీరములోని యింద్రియములు, ప్రాణము, బుద్ధి కలిగినవి. తామసాహంకారము వలన స్థూల శరీరము గలిగినది. స్థూల శరీరము, సూక్ష్మ శరీరముల సమ్మేళనమే ఈ దేహము. తామసాహంకారము నుంచి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అనే పంచ తన్మాత్రలు గలిగినవి. ఆ పంచ తన్మాత్రల వలన ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అనే పంచభూతములు గలిగినవి. ఆ పంచభూతములకు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు గుణములు. ఆ పంచ భూతములవలన చెవులు, చర్మము, కన్ను, నాలుక, ముక్కు అనే ఐదు జ్ఞానేంద్రియములు గలిగినవి. ఆ ఐదు జ్ఞానేంద్రియములకు శబ్దము, స్పర్శ, రూపము,

రసము, గంధములు, అనునవి ఇంద్రియార్థములు.

జ్ఞానేంద్రియములు వాటి వాటి ఇంద్రియార్థములతో అసంకల్పితముగను, సంకల్పితముగను సంబంధము ఏర్పడును. సంకల్పిత సంబంధమువలన ఇవి విషయేంద్రియములగును. విషయేంద్రియముల వలన మనస్సుకు సుఖ దుఃఖములు కలుగును. సుఖదుఃఖముల గుఱించి

**దుఃఖంబులు వాంఛితంబు గాక చేకుఱుభంగి**
**సుఖంబులును గాలాను సారంబులై లబ్ధంబు లగు**

*(భాగవతం సప్తమ స్కంధము-213)*

అని ప్రహ్లాదుడు తోటి బాలకులతో చెప్పును. అనగా దుఃఖములు కోరకపోయినా కాలానుసారము ఎటుల కలుగునో ఆవిధముగనే సుఖములు కూడ కాలానుసారము కలుగును.

**"సామాన్యులు దుఃఖనివారణకు నవ గ్రహములకు పూజలు, శనికి తైలాభిషేకములు, ముడుపులు, మ్రొక్కులు, శివునికి అభిషేకములు, వ్రతములు చేయుదురు. అజ్ఞులు కొందఱు యోగవియోగంబులకు సుఖదుఃఖంబుల నొందుదురు అని హిరణ్యకశిపుడు తన తల్లితో చెప్పును. అనగా అజ్ఞులు యోగవియోగములకు సుఖదుఃఖములను పొందుదురు".**

(పోతన భాగవతము - సప్తమస్కంధము - 56)

కాని, ఆధ్యాత్మిక భావనలు గల పండితుడు దుఃఖ నివారణోపాయములు లేవని గ్రహించి వాటిని సహించుచు అనుభవించును. సాధకుడు సుఖ దుఃఖమునకు విచలితుడు కారాదు అన్నది **సందేశము**. ఆ సుఖ దుఃఖములను అనుభవించ వలయునన్నది **ఉపదేశము**. ఇట్టి వానినే **ధీరుడు** అని అందురు. కాలానుసారము వచ్చు సుఖ దుఃఖములకు విచలితుడు కానివాడు ధీరుడు. ఇట్టి ధీరుడు అమృతత్వమును పొందుటకు తగి యున్నాడు.

(ఇంద్రియములు – ఇంద్రియార్థములపై ప్రసరించకుండా నిగ్రహించవలయును.

దీనినే యోగములో ప్రత్యాహారముగా చెప్పుదురు. ఇలా ప్రత్యాహారమును చేయగలిగిన వాడే ధ్యాన – ధారణ – సమాధులు సాధింపగలడు. ఆ విషయమునే చెప్పుచున్నాడు).

ప్రత్యాహారమునకు ముందు సాధకుడు సజ్జన సాంగత్యము గలిగి




ఉండవలయును. ఆ తర్వాత సాధకుడు పూతనుడై ఉండవలయును. శరీర శుభ్రత, చిత్తశుద్ధిగలిగి ఉండవలయును. దీనినే **పూతనగా** చెప్పుదురు.

ఇంద్రియములు, మనస్సు, ఇంద్రియార్థములు అనునవి బండియొక్క రెండు చక్రములు, ఇరుసు వంటివి. ఇరుసు విరిగితే బండి నడవదు. అనగా మనస్సు లయమైతే యింద్రియార్థములపై యింద్రియములు ప్రసరించవు. దీనినే శకటాసుర సంహారముగా కథా పరంగా చెప్పినారు.

మనస్సు నశించిన ఇంద్రియములకు ఇంద్రియార్థములకు సంబంధము ఉండదు. ఈ యోగరహస్యమునే వ్యాసభగవానుడు గూఢముగా **శకటాసుర సంహారముగ** భాగవతమున చెప్పెను.

ఇలా మనస్సు నిశ్చలముగా ఉండవలయునన్న గాఢనిద్రలోగాని పూర్ణకుంభకములో గాని ఉండాలి. లేదా హంస అనాహతములో ఉండాలి. దీనినే **తృణావర్త సంహారముగా** చెప్పిరి.

అప్పుడు సాధకుడు నిశ్చల సమాధిని పొంది ఆత్మను దర్శించును.

...... ❖ ❖ ❖ ......

మరల బ్రహ్మవిచారణ చేయుచున్నాడు – ఈ సృష్టి సత్, అసత్తుల సమ్మేళనము. అందు సత్ శాశ్వతము. పురుషుడు శాశ్వతము. అసత్తు అశాశ్వతము. దేహము అశాశ్వతము. ఇది అసత్తు.

**నాసతో విద్యతే భావో । నాభావో విద్యతే సతః ।**

**ఉభయోరపి దృష్టోఽంతః । త్వనయోస్తత్త్వదర్శిభిః ॥ 16**

న – అసతః – విద్యతే – భావః – న – అభావః – విద్యతే – సతః

ఉభయోః–అపి – దృష్టః – అంతః – తు – అనయోః – తత్త్వదర్శిభిః

| | | |
|---|---|---|
| సతః+అభావః+ న+విద్యతే+ | = | సత్ పదార్థమయిన ఆత్మకు అశాశ్వతమనునది లేదు అనగా ఆత్మ శాశ్వతము |
| తు+అపి | = | దేహికూడా శాశ్వతుడు. దేహి యొక్క గుణములు పోవుటయే దేహి నశించుటగా చెప్పబడును. |
| అసతః+భావః న+విద్యతే | = | అసత్పదార్థమయిన విశ్వమునకు, దేహమునకు, శాశ్వతత్త్వము లేదు అనగా జగత్తు దేహము అశాశ్వతము |
| తత్త్వ దర్శిభిః+ అనయోః+ఉభయోః+ అన్తః దృష్టః | = | ఆత్మను దర్శించిన వేదజ్ఞులచే, పండితులచే, స్థితప్రజ్ఞులచే ఈ రెండింటి యొక్క అనగా సత్, అసత్‌ల యొక్క పూర్తి స్వరూప స్వభావములు దర్శింపబడెను. |

...... ❖ ❖ ❖ ......

ఇప్పుడు సృష్ట్యాదియందుగల ఆత్మగుఱించి అంతరాత్మ గుఱించి విరాట్‌పురుషుని గుఱించి వివరించుచున్నాడు.

**అవినాశి తు తద్విద్ధి । యేన సర్వమిదం తతమ్ ।**

**వినాశ మవ్యయస్యాస్య । న కశ్చిత్కర్తుమర్హతి ॥ 17**

అవినాశి – తు – తత్ – విద్ధి – యేన – సర్వమ్ – ఇదమ్ – తతమ్

వినాశమ్– అవ్యయస్య – అస్య –న – కశ్చిత్ – కర్తుమ్ – అర్హతి.

| | | |
|---|---|---|
| యేన | = | దేనిచే అనగా విరాట్‌పురుషునిచే బాహ్యముగా స్థావర జంగమాత్మకమైన జగత్తు వ్యాప్తమై ఉన్నదో మఱియు అంతర్యామిగా ఆత్మ వ్యాప్తమై ఉన్నదో |
| ఇదమ్+సర్వమ్+ తతమ్+తత్+అవినాశి+ విద్ధి+తు | = | ఈ సర్వము అనగా స్థావర జంగమాత్మకమయిన ఈ జగత్తు సృజియింప బడినదో దేనిచే ఈ సర్వము వ్యాప్తమై యున్నదో ఆ ఆత్మ శాశ్వతమైనది అని తెలిసికొనుము అనగా ఆత్మ నశింపదు. సృష్ట్యాది యందు గల ఆత్మ అంతర్యామిగా, దేహిగా, హృదయగత ఆత్మగా కూడా ఉన్నది, |
| అస్య+అవ్యయస్య+ వినాశమ్+కర్తుమ్+ కశ్చిత్+న+అర్హతి | = | ఈ నశింపనిదాని యొక్క అనగా ఆత్మయొక్క, హృదయగత ఆత్మయొక్క, దేహియొక్క వినాశమును చేయుటకు ఎవ్వడును సమర్థుడు కాడు అనగా ఆత్మ, దేహికూడ శాశ్వతములు. |

దేహము, జగత్ నాశనము గలవి. ఆత్మ కల్పాంతములో కూడ నశింపదు.

**ఆత్మ**




**యదేవసాక్షాదపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః**(బృహదారణ్యకం -3-4-1) ఏది సాక్షాత్తు అపరోక్షముగా నున్నదో అదియే బ్రహ్మ. ఆ ఆత్మ సర్వ స్థావర జంగమముల యందు అంతర్యామిగా ఉన్నది.

...... ❖ ❖ ❖ ......

దేహము - దేహి

**అంతవంత ఇమే దేహా । నిత్యస్యోక్తాఃశరీరిణః ।**
**అనాశినోఽప్రమేయస్య । తస్మాద్యుధ్యస్వ భారత ॥ 18**

అంతవంతః - ఇమే - దేహాః - నిత్యస్య - ఉక్తాః - శరీరిణః
అనాశినః - అప్రమేయస్య-తస్మాత్ - యుధ్యస్వ - భారత.

| | | |
|---|---|---|
| అనాశినః+ | = | నాశరహితమైనదియును |
| అప్రమేయస్య+నిత్యస్య+ | | అప్రమేయమైనదియును నిత్యమైనదియును |
| శరీరిణః+ఉక్తాః | | అయిన శరీరములోగల హృదయగత ఆత్మ, దేహిలను కూడా ఎవడును నశింపచేయలేదని చెప్పబడినది. |
| ఇమే+దేహాః+ అంతవంతః | = | ఈ దేహములు నశించునవి మఱియు |

నీవు సంహరించినా, సంహరించకపోయినా శరీరములు నశించు స్వభావములు గలవి. దేహి, ఆత్మలు నశింపవు. నశించితే దేహము నశించును కాని ఆత్మ నశింపదు.

| | | |
|---|---|---|
| తస్మాత్ | = | అందువలన అనగా క్షత్రియజాతి ధర్మములు పాటింపవలయును గావున |
| భారత+యుధ్యస్వ | = | ఓ అర్జునా! నీవు యుద్ధము చేయుము |

యుద్ధము చేయవలయునా లేక మానవలయునా అని నీవు నన్ను అడిగిన దానికి యుద్ధము చేయుమని చెప్పుచున్నాను. కథాపరంగా నీవు కౌరవులతో యుద్ధము చేయుము. వేదాంతపరంగా నీవు దేహేంద్రియమనోబుద్ధులు, అరిషట్ వర్గములనే శత్రువులతో యుద్ధము చేయుము.

...... ❖ ❖ ❖ ......

ఆత్మగురించి చెప్పుచున్నాడు

సృష్ట్యాదియందు గల ఆత్మ, హృదయగుహలోగల ఆత్మ అనే ఈ రెండునూ సాక్షిత్వము గలవియే తప్ప కర్తృత్వ బాధ్యత లేవు. ఈ రెండింటికి కర్తృత్వ భోక్తృత్వములు లేవు. కార్యాకారణ కర్తృత్వములు ప్రకృతివే తప్ప పురుషునివి కావు. ప్రకృతి సంసర్గమున దేహి తను కర్తనని భావించి గుణాశ్రయుడై కర్తృత్వమును వహించి కర్మలు చేయుచు ఆకర్మ ఫలములను భోక్తగా అనుభవించుచున్నాడు.

ఆత్మ - సాక్షి; దేహి - కర్త; దేహము - ఉపకరణము.

**య ఏనం వేత్తి హంతారం । యశ్చైనం మన్యతే హతమ్ ।**
**ఉభౌ తౌ న విజానీతో । నాయం హంతి న హన్యతే ॥ 19**

(ఇందలి ద్వితీయ చరణము కఠోపనిషత్ ద్వితీయవల్లి - 19లో గలదు.)

యః-ఏనమ్-వేత్తి-హంతారమ్-యః-చ-ఏనమ్-మన్యతే-హతమ్
ఉభౌ-తౌ-న-విజానీతః-న-అయమ్-హంతి-న-హన్యతే.

**న జాయతే మ్రియతే వా కదాచి ।**
**న్నాయం భూత్వా భవితా వా న భూయః ।**
**అజోనిత్య శ్శాశ్వతోఽయం పురాణో।**
**న హన్యతే హన్యమానే శరీరే ॥ 20**

*(ఇది కఠోపనిషత్-ద్వితీయవల్లీ-18లో కూడా కలదు)*

న - జాయతే - మ్రియతే - వా - కదాచిత్ - న - అయమ్ - భూత్వా- భవితా - వా - న - భూయః - అజః - నిత్యః - శాశ్వతః - అయమ్- పురాణః - న -హన్యతే - హన్యమానే - శరీరే.

**వేదా వినాశినం నిత్యం । య ఏనమజమవ్యయమ్ ।**

**కథం స పురుషః పార్థ । కం ఘాతయతి హంతి కమ్ ॥ 21**

వేద-అవినాశినమ్-నిత్యమ్-యః-ఏనమ్-అజమ్-అవ్యయమ్ -

కథమ్-సః-పురుషః-పార్థ-కమ్-ఘాతయతి-హంతి-కమ్.

| | | |
|---|---|---|
| యః+ఏనమ్+<br>హంతారమ్+వేత్తి+చ | = | ఎవడు ఈ ఆత్మను ఇతరులను చంపునట్టి వానినిగా అనగా హంతకునిగా, కర్తగా తెలుసుకొనునో మఱియు |
| యః+ఏనమ్+హతమ్+<br>మన్యతే | = | ఎవడు ఈ ఆత్మను ఇతరులచే చంపబడు వానినిగా అనగా హతునిగా, భోక్తగా తలంచునో |
| తౌ+ఉభౌ+<br>న+విజానీతః | = | ఆత్మ ఇతరులను చంపునని లేదా ఇతరులచే చంపబడునని తలంచునట్టి ఆ ఇరువురు ఆత్మ తత్త్వమును గ్రహించనివారే |
| అయమ్+న+హంతి+<br>న + హన్యతే | = | నిజమునకు ఈ ఆత్మ చంపదు. అనగా ఆత్మకు కర్తృత్వము లేదు చంపబడదు. |
| అయమ్+అజః+<br>నిత్యః+శాశ్వతః+<br>పురాణః+<br>భూత్వా+భూయః భవితా | = | ఈ ఆత్మ పుట్టుకలేనిది. నిత్యమైనది, శాశ్వతమైనది, అమృతత్త్వము గలది. సనాతనమైనది. సృష్ట్యాది యందుగలది. గతంలో మరల వర్తమానంలో - భవిష్యత్‌లో అనగా సర్వకాలములలో ఉండునది. |
| అయమ్+న+జాయతే+<br>వా+న+మ్రియతే+వా | = | ఈ ఆత్మ పుట్టుట లేనిది అనగా పుట్టుక లేనిది మఱియు అనగా చనిపోనిది అనగా దేహ లక్షణములు కంటే వేఱు అయినది. దేహము పుట్టును, చనిపోవును, కాని ఈ ఆత్మ పుట్టదు, చనిపోదు. మఱియు |
| శరీరే+హన్యమానే(సతి)+<br>కదాచిత్+న+హన్యతే+ | = | శరీరము చంపబడుచున్నను హృదయగత ఆత్మయు, దేహియు ఒకప్పుడును అనగా ఎన్నడును ఇతరులచే చంపబడుట లేదు. |

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| యః+ఏనమ్+నిత్యమ్+ | = | ఎవడు ఈ ఆత్మను నిత్యమైన దానిని గానూ |
| అజమ్+అవినాశినమ్+ | | పుట్టుక లేని దానిని గానూ వినాశనము లేని దానిని |
| అవ్యయమ్+వేద | | గానూ అవ్యయమైన దానిని గానూ తెలిసికొనునో |
| సః+పురుషః+ | = | ఆ పురుషుడు అనగా అట్టివాడు ఎట్లు |
| కథమ్+కమ్+ | | ఎవనిని చంపించును అనగా ఈ ఆత్మను ఎట్లు |
| ఘాతయతి+ | | యితరులచే చంపించును. |
| కమ్+హంతి | | ఎట్లు ఈ ఆత్మను చంపును? |

**వ్యాఖ్యానము :-** ఆత్మకు భోక్తృత్వము లేదు, కర్తృత్వము లేదు. కావున కర్మలకు భోక్త కాదు. అనగా ఆత్మ సాక్షి. ఆత్మ సాక్షిత్వమున హృదయ గుహలో ఉండును. దేహి కర్తృత్వమును వహించి దేహముతో మమేకము అయి ఉండును. హృదయగుహలోని ఆత్మయు, సృష్ట్యాదియందున్న ఆత్మయు సాక్షీభూతులే తప్ప దేనికి కర్తకాడు. భోక్తయు కాడు. జీవుడు గుణాశ్రయుడై కర్తృత్వమును పొంది కర్మలు చేయును. ఆ విధముగా ఫలములను జీవుడు అనుభవించుచున్నాడు చనిపోయేది దేహము. కర్త జీవుడు, ఆత్మ సాక్షీభూతుడు. ఆత్మకు కర్తృత్వము లేదు. కావున భోక్తకాడు. కార్యకారణ కర్తృత్వము ప్రకృతివేగాని పురుషునివికావు. ప్రకృతి సంసర్గమువలన జీవుడు తనే కర్తయని భావించి భోక్తయను అనర్థంబు నొందుచున్నాడు.

ఆత్మ పుట్టుకలేనిది. నిత్యమయినది. దేహ లక్షణములకు వేఱు అయినది. కర్తృత్వ, భోక్తృత్వములు లేక సాక్షిత్వము గలది. దేహము పుట్టును చనిపోవును కాని ఆత్మ శాశ్వతము. సృష్ట్యాదియందుగల ఆత్మకు, దేహములో హృదయ గుహలో గల ఆత్మకు – ఈ రెండింటికి ఇవి సమాన లక్షణములు. సృష్ట్యాదియందున్న ఆత్మ పెద్దది. హృదయగత ఆత్మ సూక్ష్మాతిసూక్ష్మము. ఈ ఒక్క భేదము తప్ప మిగిలిన అన్ని లక్షణములు యిరువురికి సమానము. దేహియు నశింపడు.

...... ❖ ❖ ❖ ......

దేహి గుఱించి చెప్పుచున్నాడు.

**వాసాంసి జీర్ణాని యథా విహాయ**

**నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।**

**తథా శరీరాణి విహాయ జీర్ణా**

**న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ 22**

వాసాంసి-జీర్ణాని-యథా-విహాయ-నవాని-గృహ్ణాతి-నరః-అపరాణి-తథా- శరీరాణి-విహాయ-జీర్ణాని-అన్యాని-సంయాతి-నవాని-దేహీ.

యథా+నరః+జీర్ణాని+ వాసాంసి+విహాయ = ఏవిధముగా నరుడు చినిగిపోయిన వస్త్రములను విడిచిపెట్టి

అపరాణి+నవాని+ గృహ్ణాతి = ఇతరములైన నూతన వస్త్రములను గ్రహించుచున్నాడో

తథా+దేహీ+జీర్ణాని+ శరీరాణి+విహాయ+ అన్యాని+నవాని+ సంయాతి = ఆ విధముగా ఈశ్వరునాజ్ఞచే దేహి అతని ఈ జన్మ కర్మానుసారము జీర్ణములయిన ఆ శరీరములను విడిచిపెట్టి ఇతరములయిన నూతనమైన శరీరములను పొందుచున్నాడు.

**వ్యాఖ్యానము:-** ఈవిధముగ దేహి ఇప్పుడు శరీరములోనికి ప్రవేశించుటకు పూర్వజన్మలో చేసిన కర్మ కారణము. ఆవిధముగనే పూర్వజన్మలో చేసుకొన్న కర్మ ఫలితము అనుభవించటము పూర్తి కాగానే శరీరమును విడుచును. ఈ జన్మలో చేసుకొన్న కర్మానుసారము మఱుజన్మలో కొత్త దేహము ప్రాప్తమగును. ఈవిధముగా ఆత్మస్థానము చేరి బ్రహ్మత్వము పొందువఱకు అనేక దేహములు పొందవలసి ఉండును.

ఒక జీవుడు తను పూర్వజన్మలో చేసుకొన్న కర్మ ఫలితముగా నృగు మహారాజుగా జన్మించినాడు. నృగు మహారాజుగా గోదానము చేయుటలో విధిని అనుసరించనందు వలన మఱుజన్మలో నూతన శరీరముగా ఊసరవిల్లిగా జన్మించినాడు. నలకూబరులు నారదుని అవమానించి తత్ ఫలితముగా నూతన శరీరములయిన మద్దిచెట్లుగా పుట్టినారు.

దేహి దేహములో ప్రవేశించినది మొదలు ఏక్షణములో అయినా ఆశరీరమును వదలిపెట్ట వచ్చును. అనగా మరణము ఎప్పుడయిన రావచ్చును. ముసలితనము వచ్చిన తరువాతనే మరణము వచ్చునని చెప్పలేము. ఈ విషయమునే రాముడు రామాయణం – అయోధ్యాకాండ – 104వ సర్గలో 22వ శ్లోకములో భరతునితో– "మృత్యువు నిత్యము మనతోనే ఉండున"ని చిత్రకూటములో చెప్పును.

దేహి ఈ స్థూల శరీరమును మాత్రమే విడుచును. ఈ దేహి సూక్ష్మ శరీరముతో ఇతర లోకములలో పాప పుణ్యములను అనుభవించి తిరిగి ఈ భూలోకమున నూతన శరీరములోనికి ప్రవేశించును.

అంతర్యామి అయిన హృదయ గుహలో గల ఆత్మను గాని దేహములోగల దేహిని గాని పంచభూతములు ఏమియు చేయజాలవు. శస్త్రములు కూడా ఏమియు చేయజాలవు. ఈ విషయమునే రామాయణములో విరాధుడు రామునితో గూఢముగా ఇట్లు చెప్పినట్లు వర్ణింపబడినది.

**తపసా చాభిసంప్రాప్తా బ్రహ్మణో హి ప్రసాదజా ।**
**శస్త్రేణావధ్యతా లోకేఽ చ్ఛేద్యాభేద్యత్వమేవ చ ॥**

*(రామాయణము–అరణ్యకాండ–3వ సర్గ–6)*

తపస్సుచేసి బ్రహ్మ యొక్క అనుగ్రహమున లోకములో 1) శస్త్రములచేత ఛేదింపబడకుండునట్లుగా మఱియు 2) అవధ్యత అనగా నన్ను ఎవ్వరునూ చంప సమర్థుడు గాకుండుటకు వరము పొందితిని. ఈవిధముగా విరాధుని పరముగా దేహి లక్షణములు గూఢముగా చెప్పబడినవి.

...... ❖ ❖ ❖ ......

ఆత్మ - అంతర్యామి లక్షణములనే ఇట్లు చెప్పుచున్నాడు

**నైనం ఛిన్దన్తి శస్త్రాణి । నైనం దహతి పావకః ।**
**న చైనం క్లేదయంత్యాపో । న శోషయతి మారుతః ॥ 23**

న – ఏనమ్ – ఛిందంతి – శస్త్రాణి – న – ఏనమ్ – దహతి – పావకః
న – చ–ఏనమ్ – క్లేదయంతి – ఆపః – న – శోషయతి – మారుతః

**అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽ య మక్లేద్యోఽ శోష్య ఏవ చ ।**
**నిత్యః సర్వగతః స్థాణు । రచలోఽ యం సనాతనః ॥ 24**

అచ్ఛేద్యః–అయమ్–అదాహ్యః–అయమ్–అక్లేద్యః–అశోష్యః–ఏవ– చ–
నిత్యః – సర్వగతః – స్థాణుః – అచలః – అయమ్ – సనాతనః

**అవ్యక్తోఽ యమచింత్యోఽ యమ్ । అవికార్యోఽ యముచ్యతే ।**
**తస్మాదేవం విదిత్వైనం । నానుశోచితుమర్హసి ॥ 25**

అవ్యక్తః – అయమ్–అచింత్యః–అయమ్–అవికార్యః–అయమ్–ఉచ్యతే –
తస్మాత్ – ఏవమ్ – విదిత్వా – ఏనమ్ – న – అనుశోచితుమ్ – అర్హసి.

ఏనమ్+శస్త్రాణి+ = ఈ ఆత్మను శస్త్రములు ఛేదింపజాలవు.
న+ఛిందంతి+

ఏనమ్+పావకః+ = ఈ ఆత్మను అగ్ని కాల్చజాలదు
న+దహతి

ఏనమ్+ఆపః+ = ఈ ఆత్మను జలములు తడుప జాలదు మఱియు
న+క్లేదయన్తి+చ

మారుతః+న+శోషయతి = వాయువులు ఎండింపనూ జాలవు,

అనగా పంచభూతములు ఆత్మను ఏమియూ చేయజాలవు. ఈ ఆత్మ సృష్ట్యాది యందున్నది. ఆత్మవలన సృష్టిలో పంచ భూతములు వచ్చినవి. సృష్టిలో వచ్చిన

పంచ భూతములు సృష్ట్యాదియందున్న ఆత్మను ప్రభావితం చేయలేవు. ఈ లక్షణములు ఆత్మకు, హృదయగత ఆత్మకు, దేహికి వర్తించును.

| | | |
|---|---|---|
| అయమ్ | = | ఈ ఆత్మ |
| నిత్యః | = | నిత్యుడు, శాశ్వతుడు, అమృతుడు మరణము లేనివాడు. |
| అచలః | = | అచలుడు. మార్పు చెందనివాడు. |
| సనాతనః | = | సృష్ట్యాదియందు గలవాడు. సనాతనుడు |
| స్థాణుః | = | చలింపనివాడు. సర్వత్రా వ్యాపించి ఉండుట వలన ఒక ప్రదేశమునుండి వేఱొక ప్రదేశమునకు వెళ్లనివాడు. |
| అయమ్ | = | ఈ ఆత్మ |
| సర్వగతః | = | అంతరాత్మగా సర్వగతుడు. ఎందెందు వెదకి చూచిన అందందే కలదు. |
| చ | = | మఱియు |
| అయమ్+అశోష్యః+ అదాహ్యః+అక్లేద్యః+ ఏవ+అచ్ఛేద్యః | = | ఈ ఆత్మ అంతర్యామి కావున వాయువులచే ఎండింపబడదు. అగ్నిచే దహింపబడదు. జలముచే తడుపబడదు అనగా పంచభూతములు ఏమియూ చేయజాలవు. శస్త్రములచే ఛేదింపబడదు. |

స్థావరజంగమాత్మకమైన జగత్తులో ఆత్మ అంతర్యామి.

| | | |
|---|---|---|
| అయమ్+అవ్యక్తః+ అయమ్+అచింత్యః+ | = | ఈ ఆత్మ పూలదండలో దారంవలె ఉండుటవలన బాహ్య దృష్టికి గోచరము కాదు, అవ్యక్తము. ఈ ఆత్మ మనస్సు జ్ఞానేంద్రియములచే గ్రహించుటకు వీలుకానిది. దీనిని స్వానుభవంలో గ్రహించ వలయును. |

| | | |
|---|---|---|
| అయమ్+అవికార్యః+ ఉచ్యతే+ | = | ఈ ఆత్మను దర్శించాలి తప్ప ఊహకు అందదు. వికారములేనిది అనగా కార్యాకారణ కర్తృత్వములు లేనిది అనియు దేహమునకువలె, ప్రకృతికివలె రూపాంతరము లొందనిది అని చెప్పబడుచున్నది. |
| తస్మాత్+ఏవమ్+ ఏనమ్+విదిత్వా | = | అందువలన ఈ విధముగా అనగా దేహము నశించునని, ఆత్మ, దేహి నశింపరని గ్రహించి, సాధనచే ఆ చెప్పినవాటిని ఈ ఆత్మను తెలుసుకొని అనగా ఆత్మ నశింపడని తెలుసుకొని ఆత్మజ్ఞానమును పొందుము. |

**కథాభాగము :**

| | | |
|---|---|---|
| అనుశోచితుమ్+ న+అర్హసి | = | నీవు బంధు మరణమునకు శోకించుటకు తగవు. |

ఇంతవఱకు వేదము, ఉపనిషత్తులలో చెప్పిన సారాంశము ప్రకారము ఆత్మ గుఱించి హృదయగత ఆత్మ గుఱించి దేహములో గల దేహి గుఱించి చెప్పినాడు. ఈ విషయమునే ప్రహ్లాదుడు

**1. ఆత్మ నిత్యుడు 2. క్షయ రహితుడు. 3. శుద్ధుండు 4. క్షేత్రజ్ఞుండు 5. గగనాదులకు ఆశ్రయుండు 6. క్రియాశూన్యుండు 7. స్వ ప్రకాశకుండు 8. సృష్టి హేతువు 9. వ్యాపకుండు 10. నిస్సంగుడు 11. పరి పూర్ణుడు 12. ఒక్కడు** అని తోటి బాలురకు ఆత్మగుఱించి చెప్పినాడు. (భాగవతం-సప్తమస్కంధం-237)

...... ❖ ❖ ❖ ......

ఆత్మగురించి ప్రకృతివాదుల సిద్ధాంతమును ప్రతిపాదించుచున్నాడు

**అథ చైనం నిత్యజాతం । నిత్యం వా మన్యసే మృతమ్ ।**
**తథాపి త్వం మహాబాహో । నైవం శోచితుమర్హసి ॥ 26**

అథ – చ – ఏనమ్ – నిత్య జాతమ్ – నిత్యమ్ – వా – మన్యసే – మృతమ్
తథా – అపి– త్వమ్ – మహాబాహో – న – ఏవమ్ – శోచితుమ్ – అర్హసి

**జాతస్య హి ధ్రువో మృత్యుః । ధ్రువం జన్మ మృతస్య చ ।**
**తస్మాదపరిహార్యేఽర్థే । న త్వం శోచితుమర్హసి ॥ 27**

జాతస్య – హి – ధ్రువః – మృత్యుః – ధ్రువమ్ – జన్మ – మృతస్య – చ
తస్మాత్ – అపరిహార్యే – అర్థే – న – త్వమ్ – శోచితుమ్ – అర్హసి.

**అవ్యక్తాదీని భూతాని । వ్యక్తమధ్యాని భారత ।**
**అవ్యక్త నిధనాన్యేవ । తత్ర కా పరిదేవనా ॥ 28**

అవ్యక్తాదీని – భూతాని – వ్యక్తమధ్యాని – భారత
అవ్యక్త నిధనాని – ఏవ – తత్ర – కా – పరిదేవనా

మహాబాహో = ఓ అర్జునా

అథ+వా = ఆ తర్వాత ఆత్మ అంటూ ఏదీలేదు. దేహమే ఆత్మ అని భావించినా

ఏనమ్+నిత్యమ్+ మృతమ్+నిత్యజాతమ్+ త్వమ్+మన్యసే+తథా+ అపి = దీనిని ఈ దేహమును నిత్యమూ మరణించునట్టిదియు నిత్యము పుట్టుచున్నది అనియును నీవు భావించితివేని అట్లయినను ఈ దేహ మరణమునకు

ఏవమ్+శోచితుమ్+ న+అర్హసి = ఈ విధముగా శోకించుటకు తగవు.

| | | |
|---|---|---|
| జాతస్య+హి+మృత్యుః+ ధ్రువః+చ | = | పుట్టిన దానికి ప్రకృతి స్వభావము ననుసరించి ఉనికి, పెరుగుదల ఆ విధముగనే నాశనము తప్పదు. పుట్టిన వానికి పెరుగుట ఒక అవస్థ. ఆ విధముగనే పెరిగిన తర్వాత మరణము ఒక అవస్థ. మఱియు ఆవిధముగానే |
| మృతస్య+జన్మ+ధ్రువమ్ | = | మరణించిన దానికి తిరిగి పుట్టుక తప్పదు. ఇవి మనము చెట్ల ఆకులలో చూచుచున్నాము. చెట్ల ఆకులు క్రొత్తవి పుడుతున్నాయి. కొంత కాలానికి అవి నశించుచున్నాయి. మరల కొంతకాలానికి పుడుతున్నాయి గదా. |
| తస్మాత్+త్వమ్+ | = | అందువలన నీవు తప్పింపశక్యముగాని (ఈ ప్రకృతి) |
| అపరిహార్యే+అర్థే+ శోచితుమ్+న+అర్హసి | | విషయము నందు మరణించిన వారి గుఱించి దుఃఖించుటకు తగవు. |
| భారత | = | ఓ అర్జునా! |
| భూతాని+అవ్యక్తాదీని+ అవ్యక్త నిధనాని+ఏవ+ వ్యక్తమధ్యాని | = | ఈ ప్రాణులు అనగా ఈ శరీరములు పుట్టుకకు ముందు కంటికి కనిపించవు. చనిపోయిన తర్వాత కూడా యివి కంటికి కనిపించవు. పుట్టిన తర్వాత మరణమునకు ముందు మధ్యలో కొంతసేపు అవి మన కంటికి కనిపించుచున్నవి. |
| తత్ర+కా+పరిదేవనా | = | అట్టి ఈ స్వల్ప పరిచయానికి ఎందులకు యీ విచారము. అనగా శోకించవద్దు. |

**వ్యాఖ్యానము:-** ఆత్మ గుఱించిన వాదనలు. అనాదినుండి ఆత్మగుఱించి రెండు వాదనలు గలవు. ఒకటి ఆత్మ ఉన్నది అనే వాదన. రెండవది ఆత్మ అనునది లేదను వాదన. దేహమే ఆత్మ. ఆత్మ అంటూ ఏదీలేదు ఇది కొందఱి వాదన. ఛాందోగ్య

ఉపనిషత్తులో ఒక కథ గలదు. ఆత్మ గుఱించి తెలుసుకొనుటకు ఇంద్రుడు, విరోచనుడు వాళ్ళ గురువగు ప్రజాపతి వద్దకు వచ్చి, ఆత్మ గుఱించి చెప్పమని అడుగుదురు. అంత గురువు మీరు నీటిలో చూడండి. మీకు కనిపించునదే ఆత్మ, అని గ్రహించండి అని పలికెను. అంత విరోచనుడు నీటిలో తన ప్రతి బింబమును చూచి ఆత్మ అనగా దేహము అని గ్రహించి, ప్రజాపతి వద్ద సెలవు తీసుకొని, ఆత్మ దర్శనం అయినదని భావించి, తన తోటి వారితో, దేహమే ఆత్మ అని చెప్పి, గురుకులమును వదలి వెళ్ళను. ఇంద్రుడు మరల గురువును ఆశ్రయించి తన సందేహము నివృత్తి చేసుకొనును.

అటులనే కఠోపనిషత్‌లో నచికేతుడు యమునితో కొందఱు ఆత్మ కలదని, కొందఱు దేహమే ఆత్మ కావున, ఆత్మ అంటూ ఏదీ లేదని అనుచున్నారు. కావున ఆత్మ గుఱించి చెప్పండి అని వినయముగా ప్రార్థించెను. అంత యముడు దేవతలు కూడా ఈ ఆత్మ ఉన్నదా లేదా అని తర్కింతురని చెప్పును.

బౌద్ధమతంలో దేహమే ఆత్మ అని నాగసేనుడు పుళిందుల సంవాదంగా ఉంటుంది. ఆ సంవాదములో గుఱ్ఱములు, స్తంభము, ఇరుసు, చక్రములు, కూర్చుండు స్థలము, పగ్గములు ఇవి అన్ని కలిపి రథ శబ్దముచే వ్యవహరింపబడునట్లు, శరీరములోని అన్ని అవయవములు కలసి ఆత్మ, అని వ్యవహరింపబడుచున్నవని చెప్పబడును. ఆ విధముగా శరీరమే ఆత్మ అనే వాదన గలదు. ఆ వాదనను తీసుకొని ఆత్మ అంటూ ఏదీలేదు. దేహమే ఆత్మ అని భావించినవారికి 26-28 శ్లోకములలో సమాధానము చెప్పబడినది.

ప్రకృతి స్థిరముగా ఉండదు. ప్రకృతి పరిణామములో ఒక కాలమున చెట్లు ఆకులు అన్నీ రాలిపోవును, మరల ఒక కాలమున, తిరిగి ఆ చెట్లు చిగురించును. ఇది ప్రకృతి స్వభావము. ప్రకృతిలో ఇది నిరంతర ప్రక్రియ. అటులనే ఒక కాలమున దేహము నశించును, మరల ఒక కాలమున దేహము పుట్టును. కావున ఈ దేహ వినాశనమునకు దుఃఖింపపనిలేదు.

**ప్రకృతివాదుల సిద్ధాంతము** ప్రకారము పుట్టినది ప్రతీది చనిపోవును. చనిపోయినది మరల పుట్టును. ఇది ప్రకృతి స్వభావము. కావున దుఃఖించవలసిన పనిలేదు.

కణాదుని అణుసిద్ధాంతము, విజ్ఞాన శాస్త్రములు ప్రకృతి వాదులకు చెందినవి. అయితే మన పూర్వీకులకు తెలిసిన అణుసిద్ధాంతము మొదలైన విజ్ఞానశాస్త్రములు మనకు అందలేదు.

**దేహము :** జన్మించుటకు ముందు దేహము కనబడలేదు. అటులనే మరణించిన తరువాత దేహము నశించి కనబడదు. ఈ జనన మరణ కాలముల మధ్యలో కొంత కాలము దేహము కనబడును. కావున కొంతకాలము ఉండి, కనిపించకుండా పోయే దేహము గురించి శోకించుట ఎందులకు? ఆత్మ గలదనే వారికి దేహము మరణించినను దేహి మరణింపదు. కావున శోకింపపనిలేదు అని చెప్పెను. ఆత్మ అన్నది లేదు. దేహమే ఆత్మ అన్న ప్రకృతి వాదుల ప్రకారము పుట్టినది చనిపోవును, చనిపోయినది మరల పుట్టును. కావున దేహమరణమునకు దుఃఖింపపనిలేదు.

ఆ విధముగా ఆత్మ వాదుల సిద్దాంతము ప్రకారము కూడా ప్రకృతివాదుల సిద్ధాంతము ప్రకారము కూడా దుఃఖింపపనిలేదని చెప్పబడినది అని చెప్పెను.

...... ❖ ❖ ❖ ......

ఆత్మను సాధన చేసి గ్రహించవలయును

**ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమ్**
**ఆశ్చర్యవద్వదతి దథైవ చాన్యః ।**
**ఆశ్చర్యవచ్చైన మన్యః శృణోతి**
**శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥ 29**

ఆశ్చర్యవత్–పశ్యతి–కశ్చిత్–ఏనమ్–ఆశ్చర్యవత్–వదతి–తథా–ఏవ–చ–అన్యః–ఆశ్చర్యవత్–చ–ఏనమ్–అన్యః–శృణోతి–శ్రుత్వా–అపి–ఏనమ్–వేద–న–చ–ఏవ–కశ్చిత్.

| | | |
|---|---|---|
| ఏనమ్+కశ్చిత్+<br>ఆశ్చర్యవత్+ఏవ<br>వదతి+చ | = | ఈ ఆత్మను అనగా ఆత్మ గురించి ఒకడు సంసార తాపత్రయములనుంచి విడివడక పోయినా, ఆత్మను తను దర్శించక పోయినా చిలుక |

| | | |
|---|---|---|
| | | పలుకులవలె శాస్త్రములో చెప్పిన దానినే ఆశ్చర్యముగా తనకు తెలిసినట్లు చెప్పుచున్నాడు |
| తథా+అన్యః+ఏనమ్+ ఆశ్చర్యవత్+ఏవ శృణోతి+చ | = | అట్లే ఇంకొకడు సంసార తాపత్రయములలో నుండి సత్త్వగుణ ప్రధానుడు గాకపోయినా ఈ ఆత్మను అనగా ఆత్మ గుఱించి ఆశ్చర్యముగా ఉపన్యాసము విన్నంత మాత్రముననే తనకు ఆత్మ గుఱించి విశదముగా తెలిసినట్లు వినుచున్నాడు. అనగా ఉపన్యాసమును విని తనకు ఆత్మగుఱించి తెలిసినట్లు భావించుచున్నాడు. |
| ఏనమ్+శ్రుత్వా+అపి న+వేద+కశ్చిత్+ ఆశ్చర్యవత్+అన్యః+ పశ్యతి | = | ఈ ఆత్మ గుఱించి శాస్త్రములు చదివినా, విన్నా ఆత్మజ్ఞానము కలుగదు మఱియు ఒకడు ఆ ఆత్మను తెలుసుకొనుటకు సాధనచేసి, తమోగుణమును, రజోగుణమును జయించి, సత్త్వగుణ ప్రధానుడై మనోబుద్ధులను ఏకం చేసి వాటిని దేహియందు ఏకీకరణముచేసి, ఆపై దేహిని క్షేత్రజ్ఞునితో కలపినవాడు మాత్రమే బాహ్య దృష్టికి గోచరము కానిదియు, సూక్ష్మాతి సూక్ష్మమయినదియు, హృదయ గుహలో జ్యోతి స్వరూపమున ఉన్నదియు, అగ్ని శిఖల మధ్యలో వెలుగొందినదియు అయిన ఈ ఆత్మను ఒకడు దర్శించుచున్నాడు. |

**వ్యాఖ్యానము :-** ఒక వ్యక్తి తన ముఖమును తను చూడలేడు. అటువంటిది ఆత్మఅగు తనని తను ఎట్లు దర్శించును? ఇది ఆశ్చర్యమే.

ఈశావాస్య ఉపనిషత్ 15,16వ శ్లోకములలో ఓ సూర్యుడా! నీ కిరణములనే ముసుగును తొలగించుము. నేను నిన్ను చూచెదను అని పలుకగా, ముసుగు తొలగిన తరువాత చూచి తనే ఆత్మ అని గ్రహించును. గుణయుతుడయిన వానిని

దేహి అని అందురు. అతడే గుణరహితుడయిన, ద్వంద్వాతీతుడయిన ఈశ్వరుడు అని పిలువ బడును. ఇదే ఆత్మ దర్శనము. ఆత్మ విషయమున ఊక దంపుడు ఉపన్యాసములు నిరర్థకములు. అందువలన పొల్లు మాటలు కట్టిపెట్టి సాధనకు ఉపక్రమించవలయు నన్నది దీని సారాంశము. వేదాంత ఉపన్యాసములు డాంబికులకు జీవనోపాయంబులు అని నారదమహర్షి చెప్పెను. ఒకడు ఒక విషయమున పరిపూర్ణ అవగాహన, సామర్థ్యము ఉన్ననే ఇతరులకు బోధింపగలడు. అట్టి సామర్థ్యము లేకపోయిననూ బోధించుట ఆశ్చర్యము. ఉదాహరణకు కారును బాగా నడపగలవాడే కారు నడుపుట గుఱించి ఇతరులకు బోధింపగలడు. అట్టి నేర్పరితనము లేనివాడు కారు గుఱించి స్వానుభవములో తెలియనివాడు, కారు నడుపుట గుఱించి బోధించుట ఆశ్చర్యము.

**శ్రవణా యాపి బహుభి ర్యోన లభ్యః శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః ।**
**ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధాఽఽశ్చర్యోజ్ఞాతా కుశలానుశిష్టః ॥**

*(కఠోపనిషత్ - ద్వితీయవల్లి - 7)*

ఆత్మతత్త్వము పలువురకు వినుటకు లభ్యముకాదు. విన్నప్పటికినీ వారు ఈ ఆత్మతత్త్వమును గ్రహించలేరు. అటువంటివారు ఆత్మగుఱించి బోధించుట ఆశ్చర్యము. ఒకడు ఆశ్చర్యముగా చెప్పును. మరొకడు ఆశ్చర్యముగా వినును.

**నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన ।**
**యమే వైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనుం స్వామ్ ॥**

*(ముండకోపనిషత్ - తృతీయముండకం - ద్వితీయఖండ-3)*

ఈ ఆత్మగుఱించి ఉపన్యసించుటవలన లభ్యముకాదు. అటులనే అనేక గ్రంథములు చదివిననూ లభ్యము కాదు. ఎవరైతే సాధన చేయుదురో వారికే ఈ ఆత్మ లభ్యమగును. తన నిజరూపమున దర్శనమిచ్చును.

...... ❖ ❖ ❖ ......

దేహి - దేహముల గుఱించిన సారాంశము

**దేహీ నిత్యమవధ్యోఽయం । దేహే సర్వస్య భారత ।**

**తస్మాత్ సర్వాణి భూతాని । న త్వం శోచితుమర్హసి ॥ 30**

దేహీ – నిత్యమ్ – అవధ్యః – అయమ్ – దేహే – సర్వస్య – భారత

తస్మాత్ –సర్వాణి – భూతాని – న – త్వమ్ – శోచితుమ్ – అర్హసి.

| | | |
|---|---|---|
| భారత | = | ఓ అర్జునా ! |
| దేహే+దేహీ+సర్వస్య | = | దేహమునందు దేహి దేహముయొక్క ప్రతి అణువుతోనూ అనగా ఆపాదతలమస్తకము మమేకమై ఉండును. |
| అయమ్+నిత్యమ్+ అవధ్యః | = | ఈ దేహి ఎప్పుడును అస్త్రశస్త్రాది మరణకారకము లయిన దేనిచేగాని వధింప వీలుకానివాడు. |
| సర్వాణి + భూతాని | = | సర్వభూతముల దేహములు కాలానుసారము, కర్మానుసారము నశించును. |
| తస్మాత్ | = | అందువలన అనగా దేహి నశింపడు, దేహము నశించును అని గ్రహించుము. |

**కథాభాగము :**

| | | |
|---|---|---|
| త్వమ్+శోచితుమ్+ న + అర్హసి | = | అందువలన నీవు శోకించుటకు తగవు. |

ఈవిధముగా దేహి–దేహలక్షణములు చెప్పి అర్జునునికి దుఃఖోపశమనము గలిగించినాడు.

ఈ దుఃఖం ఎలా పోతుంది? అన్న అర్జునుని ప్రశ్నకు దేహము వేఱు. దేహి వేఱు, దేహము నశించు స్వభావముగలది. దేహి నశింపని స్వభావము గలవాడు అని తెలిసిన వానికి దుఃఖము పోతుంది అని సమాధానము యివ్వబడినది.

...... ❖ ❖ ❖ ......

యుద్ధము చేయుటయా? మానుటయా? అన్న అర్జునుని ప్రశ్నకు
సమాధానము చెప్పచున్నాడు.

**స్వధర్మమపి చావేక్ష్య । న వికంపితుమర్హసి ।**
**ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయాఽన్యత్ । క్షత్రియస్య న విద్యతే ॥31**

స్వధర్మమ్ – అపి – చ – ఆవేక్ష్య – న – వికంపితుమ్ – అర్హసి
ధర్మ్యాత్ – హి– యుద్ధాత్ – శ్రేయః – అన్యత్ – క్షత్రియస్య – న – విద్యతే

**యదృచ్ఛయా చోపపన్నం । స్వర్గద్వారమపావృతమ్ ।**
**సుఖినః క్షత్రియాః పార్థ । లభంతే యుద్ధమీదృశమ్ ॥ 32**

యదృచ్ఛయా – చ – ఉపపన్నమ్ – స్వర్గద్వారమ్ – అపావృతమ్
సుఖినః – క్షత్రియాః – పార్థ – లభంతే – యుద్ధమ్ – ఈ దృశమ్.

**అథ చేత్త్వమిమం ధర్మ్యం । సంగ్రామం న కరిష్యసి ।**
**తతస్స్వ ధర్మం కీర్తిం చ । హిత్వా పాపమవాప్స్యసి ॥ 33**

అథ–చేత్–త్వమ్–ఇమమ్–ధర్మ్యమ్–సంగ్రామమ్–న–కరిష్యసి
తతః–స్వధర్మమ్–కీర్తిమ్–చ–హిత్వా–పాపమ్–అవాప్స్యసి

**అకీర్తిం చాపి భూతాని । కథయిష్యంతి తేఽవ్యయామ్ ।**
**సంభావితస్య చాకీర్తిః । మరణాదతిరిచ్యతే ॥ 34**

అకీర్తిమ్ – చ – అపి – భూతాని – కథయిష్యంతి – తే – అవ్యయామ్
సంభావితస్య – చ – అకీర్తిః – మరణాత్ – అతిరిచ్యతే

**భయాద్రణాదుపరతం । మంస్యంతే త్వాం మహారథాః ।**
**యేషాం చ త్వం బహుమతో । భూత్వా యాస్యసి లాఘవమ్**

॥35

భయాత్ – రణాత్ – ఉపరతమ్ – మంస్యంతే – త్వామ్ – మహారథాః
యేషామ్– చ – త్వమ్ – బహుమతః – భూత్వా – యాస్యసి – లాఘవమ్.

**అవాచ్యవాదాంశ్చ బహూన్ । వదిష్యంతి తవాహితాః ।**
**నిందంతస్తవ సామర్థ్యం । తతో దుఃఖతరం ను కిమ్ ॥ 36**

అవాచ్యవాదాన్ – చ – బహూన్ – వదిష్యంతి – తవ – అహితాః
నిందంతః –తవ – సామర్థ్యమ్ – తతః – దుఃఖతరమ్ – ను – కిమ్.

| | | |
|---|---|---|
| స్వధర్మమ్+ఆవేక్ష్య+అపి | = | స్వధర్మమైన క్షత్రియజాతి ధర్మమును పరిశీలించినచో అనగా శత్రువులతో యుద్ధము చేయుట క్షత్రియ ధర్మము కావున శత్రువుల మరణమునకు గాని, యుద్ధములో స్వజనము యొక్క మరణమునకు గాని, యుద్ధభయమువలన గాని |
| వికంపితుమ్+ | = | చలించుటకు, వణికిపోవుటకు తగవు, మఱియు |
| న+అర్హసి+చ | | జాతి ధర్మము పాటింపకపోవుట పాపము. |
| హి | | సుక్షత్రియుడు పాపమును చేయరాదు. ఆ కారణమున |
| ధర్మ్యాత్+యుద్ధాత్+ క్షత్రియస్య+శ్రేయః+ అన్యత్+న+విద్యతే | = | ధర్మయుద్ధము కంటె క్షత్రియునకు శ్రేయస్సును గలిగించునది ఇంకొకటి లేదు. |
| పార్థ | = | ఓ అర్జునా! మనము సంధికి ప్రయత్నించితిమి. కాని వినాశ కాలము దాపురించుట వలన, కౌరవులు మనమాట వినలేదు. అంటే మన ప్రయత్నలోపము లేకపోయినా కాల ప్రభావమున ఇలా యుద్ధం |

| | | |
|---|---|---|
| | | చేయవలసి వచ్చినది. కావున |
| యదృచ్ఛయా+<br>ఉపపన్నమ్+<br>అపావృతమ్+<br>స్వర్గద్వారమ్+చ+<br>ఈదృశమ్+యుద్ధమ్ | = | దైవప్రేరణచే ప్రాప్తించినట్టిదియును (యుద్ధములో మరణించిన సుక్షత్రియులకు వీరస్వర్గము లభించును.) తెఱవబడిన స్వర్గద్వారము అయినదియును మఱియు ఇటువంటి వీర స్వర్గమును పొందే యుద్ధము అనగా అధర్మపరులను తుద ముట్టించుటకు జరుగు ఇటువంటి యుద్ధము |
| సుఖినః+క్షత్రియాః+<br>లభంతే | = | అదృష్టవంతులయిన క్షత్రియులు మాత్రమే పొందుదురు. ఒకవేళ |
| త్వమ్+ఇమమ్+<br>ధర్మ్యమ్+సంగ్రామమ్+<br>న+కరిష్యసి+ చేత్ | = | నీవు ఈ ధర్మయుతమైన యుద్ధమును చేయనిచో |
| తతః+స్వధర్మమ్+<br>అథ+కీర్తిమ్+హిత్వా | = | అటుపిమ్మట స్వధర్మమును మఱియు గతంలో పొందిన కీర్తిని విడచి బ్రతకవలసి యుండును. అప్పుడు లోకములో అపకీర్తి మరణముకంటె బాధాకరము. |
| చ | = | మఱియు |
| పాపమ్+అవాప్స్యసి | = | జాతిధర్మమును పాటించనందున గలుగు పాపమును పొందెదవు. అందువలన నరక ప్రాప్తి కలుగును |
| తే+అవ్యయమ్+<br>అకీర్తిమ్+చ+అపి+ | = | నీ యొక్క గత చరిత్రను వదలి చిరకాలము ఉండునట్టి అపకీర్తి , అప్రతిష్ఠలను కూడా |
| భూతాని+కథయిష్యంతి | = | ప్రజలు చెప్పుకొందురు. ఓ అర్జునా! |
| సంభావితస్య+అకీర్తిః+ | = | లోకములో గౌరవముగా బ్రతికిన వానికి అపకీర్తి, |

| | | |
|---|---|---|
| చ+మరణాత్+అతిరిచ్యతే | | అప్రతిష్ఠలు మరణముకంటె మిక్కిలి బాధా కరమైనది. |

అర్జునా! నీవు శత్రువులపై కరుణవలన యుద్ధము చేయక, యుద్ధరంగమునుండి యిప్పుడు వెనుతిరిగిన

| | | |
|---|---|---|
| మహారథాః+త్వామ్+ భయాత్+రణాత్+ ఉపరతమ్+మంస్యంతే | = | సాటి మహారథులు, అతి రథులు నిన్ను బంధువులను చంపుట ధర్మము కాదనిగాని లేదా కృపవలన యుద్ధము మానెను అని గాక భయము వలన, యుద్ధ రంగము నుండి వెనుతిరిగిన వానినిగా తలంతురు |
| త్వమ్+యేషామ్+ బహుమతః+భూత్వా+ చ+లాఘవమ్+యాస్యసి | = | నీవు ఉత్తర గోగ్రహణ సమయములో ఎవరియొక్క ప్రశంసలు అందుకొని గతంలో గౌరవింపబడినవాడవై గొప్పవీరుడవై ఉంటివో మఱియు అతిరథుడవని ప్రశంసింపబడితివో వారి చేతనే యిప్పుడు చులకన అయ్యెదవు |
| తవ+అహితాః+ తవ+సామర్థ్యమ్+ నిందంతః | = | నీ యొక్క శత్రువులు (నీ వంటే గిట్టనివారు) నీ యొక్క యుద్ధ కౌశలమును, సామర్థ్యమును నిందించుచున్నవారై |
| బహూన్+అవాచ్యవాచాన్ +వదిష్యంతి | = | అనేక అనరానిమాటలను భవిష్యత్తులో చెప్పుకోగలరు |
| చ | = | మఱియు |
| తతః+ను+దుఃఖతరమ్+ కిమ్ | = | అంతకంటె ఆ మాటలు వింటూ బ్రతికి ఉండుట కంటె అధిక దుఃఖము ఏమి ఉన్నది |

**వ్యాఖ్యానము :-** యుద్ధము చేయుటయా? లేక మానుటయా అన్న ప్రశ్నకు సమాధానము ఇట్లు చెప్పబడినది.

అస్వర్గము – క్షత్రియజాతి ధర్మము తప్పినందువలన నరకప్రాప్తి

స్వధర్మమ్ ఆవేక్ష్య అపావృతమ్ స్వర్గద్వారమ్ – స్వధర్మము ననుసరించి చూచిన

క్షత్రియునికి దుష్టశిక్షణార్థము చేయు యుద్ధము ధర్మము. తెఅవబడిన స్వర్గద్వారము.

'ధర్మం కీర్తిం హిత్వా పాపమ్ అవాప్స్యసి'– ధర్మమును కీర్తిని వదలి పాపమును పొందెదవు.

అనార్యజుష్టమ్ – యుద్ధము చేయకుండుట అనార్యులు చేయునది.

క్లైబ్యం – నపుంసకుడు అట్లు చేయును.

క్షుద్రం – క్షుద్రమయినది

హృదయదౌర్బల్యం – పిరికితనముగా పరిగణింపబడును.

త్వం భయాత్ రణాత్ ఉపరతమ్ మంస్యంతే – భయమువలన రణరంగమునుండి వెనుతిరిగితివని భావింతురు.

త్వమ్ లాఘవమ్ యాస్యసి – సాటివారిలో చులకన అయ్యెదవు

తవ సామర్థ్యం నిందంతి – శత్రువులైన కౌరవులు నీ సామర్థ్యమును నిందింతురు

బహూన్ అవాచ్యవాదాన్ వదిష్యంతి – అనరాని మాటలు అందురు

అకీర్తికరమ్ – యుద్ధము మానిన అపకీర్తి గలుగును.

ధర్మ్యాది యుద్ధాత్ అన్యత్ శ్రేయః క్షత్రియస్య న విద్యతే – ధర్మయుద్ధముకంటె శ్రేయస్కరమైనది యింకొకటి లేదు. అనగా పాలకులకు దుష్టశిక్షణ కర్తవ్యము.

...... ❖ ❖ ❖ ......

భీష్మద్రోణాదులతో యుద్ధము చేయగలనా? ఎట్లు వారిని ఎదుర్కొని పోరాడగలను? అన్నదానికి సమాధానము చెప్పుచున్నారు

**హతో వా ప్రాప్స్యసి స్వర్గం । జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।**
**తస్మాదుత్తిష్ఠ కౌంతేయ । యుద్ధాయ కృత నిశ్చయః 37**

హతః–వా–ప్రాప్స్యసి–స్వర్గమ్–జిత్వా–వా–భోక్ష్యసే–మహీమ్

తస్మాత్ – ఉత్తిష్ఠ – కౌంతేయ – యుద్ధాయ – కృతనిశ్చయః

కౌంతేయ = ఓ అర్జునా! భీష్మద్రోణాదులను

జిత్వా+మహీమ్+ = యుద్ధములో జయించినచో రాజ్యమును

| | | |
|---|---|---|
| భోక్ష్యసే | | అనుభవింతువు |
| వా+హతః+స్వర్గమ్+ ప్రాప్స్యసి+ | = | లేదా అదృష్టము కలసిరాక యుద్ధ రంగమున యుద్ధములో మరణించిన వాడవైతివేని వీర స్వర్గమును పొందుదువు |
| వా+తస్మాత్+ యుద్ధాయ+కృతనిశ్చయః +ఉత్తిష్ఠ | = | లేదా గొప్ప వీరుడవని పేరుపొందుదువు. అందువలన కౌరవులతో యుద్ధము చేయుట కొఱకు కృత నిశ్చయుడవై ధనుర్బాణములు ధరించి వీరునిగా యుద్ధము చేయుటకు లెమ్ము |

...... ❖ ❖ ❖ ......

స్వజనమును చంపిన పాపము రాదా? అన్న ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**సుఖ దుఃఖే సమే కృత్వా । లాభా లాభౌ జయాజయౌ ।**
**తతో యుద్ధాయ యుజ్యస్వ । నైవం పాపమవాప్స్యసి ॥ 38**

సుఖదుఃఖే - సమే - కృత్వా - లాభాలాభౌ - జయాజయౌ
తతః - యుద్ధాయ - యుజ్యస్వ - న - ఏవమ్ - పాపమ్ - అవాప్స్యసి.

ఈ శ్లోకము సంధి-సమాసములతో చెప్పబడినది. ఇది కథాభాగముగను అటు అధ్యాత్మ భాగముగను అర్థము చెప్పవలయును.

**ఆధ్యాత్మిక భాగము :-**

స్వజాతి ధర్మములను పాటించుచూ

| | | |
|---|---|---|
| సుఖదుఃఖే+లాభాలాభౌ జయాజయౌ+ సమే+కృత్వా | = | సుఖదుఃఖములయందు లాభనష్టముల యందు జయాపజయములయందు సమముగా దలంచి, సమభావన గలిగి కర్మను ఆచరించినచో కర్మ బంధము కాదు. లేనిచో కర్మ బంధమగును. కర్మబంధము పునర్జన్మకు కారణమగును. |

కర్తృత్వభావన లేకుండా కర్మ చేయవలయును.

**కథాభాగము :-**

| | | |
|---|---|---|
| ఏవమ్+పాపమ్+ న+అవాప్స్యసి | = | ద్వంద్వాతీతుడవై ఈ యుద్ధమున పెద్దలను, గురువులను చంపినను పాపమును పొందవు |
| తతః+యుద్ధాయ+ యుజ్యస్వ | = | అటు పిమ్మట కౌరవులతో యుద్ధము చేయుట కొఱకు ధనుర్బాణములు తీసుకొని సన్నద్ధుడవు కమ్ము. జాతి ధర్మములను పాటించుటవలన, దుష్ట శిక్షణ, శిష్టరక్షణ, ప్రజాపాలన, రాజుల కర్తవ్యము అగుట వలన దుర్మార్గులయిన కౌరవులను ధర్మ యుద్ధములో సంహరించుటకు సన్నద్ధుడవు కమ్ము. |

**వ్యాఖ్యానము :-** క్షత్రియ జాతి ధర్మము యుద్ధము. అటులనే ప్రతివాడు తన జాతి ధర్మములను పాటించుచూ, ఎఱుక గలిగి, మోసపోక, కర్తృత్వభావన వీడి, గుణరహితుడై యుండవలయును. గుణయుతునికి లాభము, జయము, సుఖములు, ఆనందమును గలుగజేయును. నష్టము, అపజయము, దుఃఖములు, విషాదమును గలిగించును. ఆనందము వలన తనంతవాడు లేదని ఉప్పొంగును. దుఃఖము వలన క్రుంగిపోవును. గుణరహితుడు లాభాలాభములందు ఉదాసీనుడుగా ఉండును.

జాతి ధర్మములు పాటించుచూ ద్వంద్వాతీతుడవై గుణరహితుడవై ఉండవలయు నన్నది సారాంశము. కర్మచేయు విధానము స్థూలముగా చెప్పబడినది.

స్థూలశరీరముతో చేసే కర్మలు కర్తృత్వ భావన వలననే సూక్ష్మశరీరములో వాసనారూపమున నిలువ యుండి, పునర్జన్మకు హేతువు లగుచున్నవి. కర్తృత్వ భావన లేని కర్మ జీవునిని బంధింపదు. కర్తృత్వ భావనతో చేసిన కర్మ పుణ్య పాపములను గలుగచేసి జీవునికి బంధము గలుగ చేయుచున్నది. కర్తృత్వ భావన లేని కర్మ బంధము కాదు.

దీనినే ఈశోపనిషత్తు 2వ శ్లోకములో **'కర్మ న లిప్యతే నరః'** అని చెప్పినది. జీవుడు/దేహి ఆత్మ స్థానమును చేరుటకు, ఆత్మయై విరాజిల్లుటకు పుణ్యకర్మ అవసరము.

**పుణ్యకర్మానుష్ఠానము :** పుణ్యకర్మలో నాలుగు పద్ధతులు కలవు.

1. వస్తు వినియోగముతో చేయు బాహ్య యజ్ఞాదులు 2. శారీరక శ్రమకు ఓర్చి చేయు తీర్థ యాత్రలు. 3. ధనము గలిగి చేయు దాన ధర్మాదులు. 4. ధనముతో పనిలేకుండా చేయు స్వాధ్యాయనము. సద్గుణములు కలిగియుండుట.

ఈ పుణ్య కర్మానుష్ఠానములో యింద్రియములను పుణ్యకార్యములు చేయుటయందు వినియోగింతురు.

**యోగపద్ధతి:**

1. కర్మేంద్రియములను నిగ్రహించి 2.జ్ఞానేంద్రియములను యింద్రియార్థములపై ప్రసరించకుండా నిగ్రహించి 3. అంతఃకరణ చతుష్టయమును నిగ్రహించి 4. ఓంకారమును జపించుచూ 5. ప్రాణములను బ్రహ్మరంధ్రముచేర్చి 6. దేహిని హృదయగుహలో గల క్షేత్రజ్ఞునితో కలపి నిశ్చల సమాధిలో ఉందురు.

**భక్తి –** సాకారముగా నిరంతరము పురుషోత్తముని ధ్యానింతురు.

**జ్ఞానము/సాంఖ్యము –** దేహి, దేహము; ప్రకృతి పురుషుల విచారణ చేసి దేహ లక్షణములను ప్రకృతిని వీడి బుద్ధిసంపన్నత్వమున ఉందురు. దీనినే బ్రహ్మీ స్థితి అని అందురు.

సాధకుడు ఏ పద్ధతిని పాటించినను త్రిగుణములను జయించి గుణరహితుడు, ద్వంద్వాతీతుడు కావలయును. బ్రాహ్మీస్థితిని పొందవలయును.

ఈ పుణ్యకర్మ, యోగముల గురించి ముందు ముందు 27, 28, 29, 30 అధ్యాయములలో విపులముగా చెప్పును. ఈ అధ్యాయములో స్థూలముగా చెప్పుచున్నాడు.

...... ❖ ❖ ❖ ......

వ్యవసాయాత్మికాబుద్ధి గలవారి పుణ్యకర్మానుష్ఠానము

**ఏషా తేఽభిహితా సాంఖ్యే । బుద్ధిర్యోగేత్విమాంశృణు ।**
**బుద్ధ్యా యుక్తో యయా పార్థ । కర్మ బంధం ప్రహాస్యసి ॥ 39**

ఏషా-తే-అభిహితా-సాంఖ్యే-బుద్ధిః-యోగే - తు - ఇమామ్ - శృణు
బుద్ధ్యా - యుక్తః -యయా - పార్థ - కర్మ బంధమ్ - ప్రహాస్యసి

**నేహాభిక్రమ నాశోఽస్తి । ప్రత్యవాయో న విద్యతే ।**
**స్వల్పమప్యస్య ధర్మస్య । త్రాయతే మహతో భయాత్ ॥ 40**

న - ఇహ - అభిక్రమనాశః - అస్తి - ప్రత్యవాయః - న - విద్యతే
స్వల్పమ్ - అపి - అస్య - ధర్మస్య - త్రాయతే - మహతః - భయాత్.

**వ్యవసాయాత్మికా బుద్ధి । రేకేహ కురునందన ।**
**బహుశాఖా హ్యనంతాశ్చ । బుద్ధయోఽవ్యవసాయినామ్. 41**

వ్యవసాయాత్మికా-బుద్ధిః - ఏకా - ఇహ - కురునందన
బహుశాఖాః - హి -అనంతాః - చ - బుద్ధయః - అవ్యవసాయినామ్.

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| యయా+బుద్ధ్యా+ యుక్తః+కర్మ బంధమ్+ ప్రహాస్యసి | = | ఏ బుద్ధితో కూడినవాడవై కర్మబంధమును విడువగలవో |
| ఏషా+బుద్ధిః+సాంఖ్యే+ యోగే+తు+అభిహితా | = | ఆ బుద్ధి గుఱించి కర్మానుష్ఠానమునందు, యోగము నందు, భక్తి యందు, సాంఖ్యమునందు పూర్వులచే చెప్పబడినది |
| ఇమామ్+తే+ శృణు | = | పూర్వులచే చెప్పబడిన దీనిని నీ కొఱకు మరల ఇప్పుడు చెప్పుచున్నాను. శ్రద్ధగా వినుము. |

ఏ విధముగా చేసిన కర్మలు బంధము గలిగించునో ఏ విధముగా చేసిన కర్మలు బంధము కావో వాటిని గుఱించి సంగ్రహముగా చెప్పుచున్నాను. వినుము.

పుణ్యకర్మలు – ఫలితముకోరి చేసినచో బ్రహ్మలోక ప్రాప్తి గలుగును. ఆ పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మించెదరు.

| | | |
|---|---|---|
| ఇహ | = | ఇప్పుడు నే చెప్పబోయే నిష్కామకర్మ పద్ధతిలో |
| అభిక్రమనాశః+ న+అస్తి+చ | = | ప్రారంభించినది ఫలితములేక పోవుట అన్నది లేదు. అనగా గొప్ప ఫలితము ఉన్నది. |
| స్వల్పమ్+అపి ప్రత్యవాయః+న+విద్యతే | = | కొంచెము ఆచరించినా కూడా దోషము లేదు. |
| అస్య+ధర్మస్య+ మహతః+భయాత్ త్రాయతే | = | ఈ ధర్మము యొక్క ఆచరణ గొప్ప భయము నుండి, అనగా జనన మరణభయము నుండి రక్షించుచున్నది. |
| కురునందన | = | ఓ అర్జునా! |
| ఇహ+ఏకా+ | = | నివృత్తిమార్గమైన ఈ విధానము నందు |
| వ్యవసాయాత్మికా+ బుద్ధిః | = | వ్యవసాయాత్మిక బుద్ధియొక్క పద్ధతిలో మత భేదముండదు అందఱు ఒకే విధానమును చెప్పుదురు. ఆత్మ స్థానమును చేరి ఆత్మయై విరాజిల్లు ఈ వ్యవసాయాత్మికా బుద్ధిగా చెప్పబడే నివృత్తి కర్మానుష్ఠానములో ఒకే పద్ధతి చెప్పబడును. |
| అవ్యవసాయినామ్+ బుద్ధయః+అనంతాః+ బహుశాఖాః+హి | = | అవ్యవసాయముయొక్క బుద్ధులలో అనగా ప్రవృత్తి కర్మలో కర్మబంధము అయిన పద్ధతులలో కోరికలకై యజ్ఞము చేయుటలో అనేక విధినిషేధములు లెక్కలేని పద్ధతులు బహుశాఖలు గలిగియున్నవి. ఆ కారణమున నివృత్తికర్మానుష్ఠానమును ఆచరింపుము. |

**వ్యాఖ్యానము :-** నిప్పు కొంచెము అయినా అడవినంతా కాల్చును. ఔషధము స్వల్ప పరిమాణముగా తీసుకున్నను రోగమును మాన్పును. అటులనే ఈ నిష్కామ పుణ్యకర్మాచరణ కర్మబంధముల నుండి విడిపించి, పునర్జన్మ అనే భయమునుండి రక్షించుచున్నది. సాధకుడు ఆత్మస్థానమును చేరి ఆత్మయై విరాజిల్లును.

కామ్యకర్మపరుల ఆచరణ పద్ధతులలో అనేక పద్ధతులు గలవు. ఒక్కొక్క కోరికకు ఒక్కొక్క దేవతను ఆరాధించవలసి వుండును. ఒక్కొక్క దేవతను యజించుటకు ఒక్కొక్క పశువును బలి యివ్వవలసి ఉండును. కాని, నిష్కామ పుణ్యకర్మపరుల ఆరాధనలో భిన్న పద్ధతులు లేవు. అందఱిదీ ఒకే మార్గము. విధి విహితముగా చేయని పుణ్యకర్మల వలన ఫలితముండదు. అటులనే ఆవిధముగా చేసిన కర్మలు దోషమును కల్గించును. వాటి వలన పుణ్య కర్మలు చేసినను, నరకము ప్రాప్తించును.

**పుణ్య కర్మలు చేయు పద్ధతులలో :**

1. శాస్త్ర విహితముగాని పద్ధతి వలన నరకము కల్గును.
2. శస్త్ర విహితముగా కోరికలు నెఱవేఱుటకు చేయు పద్ధతిలో కోరికలు నెఱ వేఱును. పుణ్యలోకములు గల్గును. పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మించెదరు. దీనిని ప్రవృత్తి కర్మ అని అందురు. (అటులనే యోగ భ్రష్టులు తిరిగి భూలోకమున జన్మించెదరు.)



**కర్మ**

| **ప్రవృత్తి కర్మ** | **నివృత్తి కర్మ** |
|---|---|
| పునర్జన్మను కలుగ చేయును. ఇందు భిన్న పద్ధతులు కలవు. | అమృతత్త్వమును గలుగచేయును. అందఱూ ఒకే పద్ధతిని చెప్పుదురు. ఆచరణ విధానములో మార్పు ఉండదు. ఏయుగము అయినా ఎవరయినా ఆచరించవలసిన పద్ధతి ఒక్కటే. |
| దీనికి అవ్యవసాయికాబుద్ధి అని పేరు పెట్టబడినది. | దీనికి వ్యవసాయికాబుద్ధి అని పేరు పెట్టబడినది. |

ఆపస్తంబ మహర్షి పద్ధతికి, బోధాయనుని పద్ధతికి, ఇతర పద్ధతులకు మతభేదములు కలవు. అటులనే ఒక్కొక్క కోరికకు ఒక్కొక్క దేవత, ఆదేవతకు సంబంధించిన పశువును ఆలంబనము చేయవలసియుండును. కృష్ణ యజుర్వేదము ఏకోరికకు ఏ దేవతలను యజింపవలయునో ఆ పద్ధతిని గుఱించి చెప్పును.

వేదము ఒకటి అయినా దానికి అనేక శాఖలు గలిగియున్నది.

**"బెక్కు శాఖలు గలిగి యీ పృథివిలోన, నిగమ మొప్పారె భూసుర నివహమందు"**

(భాగవతము ప్రథమస్కంధం-83)

ఇలా బహుశాఖలతో వేదము విస్తరిల్లినది. ఇందు ఒక శాఖ వారి పద్ధతులకు యింకొక శాఖవారి పద్ధతులకు భేదమున్నది. ఒక శాఖవారి ఆచరణ విధానము ఒకలాగా ఉంటుంది. మఱియొక శాఖవారి ఆచరణ విధానము యింకొక లాగా ఉంటుంది. ఏ శాఖవారి పద్ధతులు ఆచరించినా ఫలితము కర్మబంధమే.

...... ❖ ❖ ❖ ......

అవ్యవసాయకా బుద్ధులు

**యా మిమాం పుష్పితాం వాచం । ప్రవదంత్య విపశ్చితః ।**
**వేదవాద రతాః పార్థ । నాన్యదస్తీతి వాదినః ॥ 42**

యామ్ - ఇమామ్ - పుష్పితామ్ - వాచమ్ - ప్రవదంతి - అవిపశ్చితః
వేదవాదరతాః - పార్థ - న - అన్యత్ - అస్తి - ఇతి - వాదినః

**కామాత్మానః స్వర్గపరా । జన్మకర్మఫల ప్రదామ్**
**క్రియావిశేష బహులాం । భోగైశ్వర్య గతిం ప్రతి॥ 43**

కామాత్మానః - స్వర్గపరాః - జన్మకర్మఫల ప్రదామ్
క్రియావిశేష బహులామ్ - భోగైశ్వర్యగతిమ్ - ప్రతి.

**భోగైశ్వర్య ప్రసక్తానాం । తయాపహృతచేతసామ్ ।**
**వ్యవసాయాత్మికా బుద్ధిః । సమాధౌ న విధీయతే ॥ 44**

భోగైశ్వర్య ప్రసక్తానామ్ - తయా - అపహృతచేతసామ్
వ్యవసాయాత్మికా బుద్ధిః - సమాధౌ - న - విధీయతే.

పార్థ = ఓ అర్జునా!

అవిపశ్చితః+కామాత్మానః = ఈ పండిత మన్యులు అనగా వేదజ్ఞులు కానివారు. కోరికలుగలవారు.

అనగా ఇహలోక పరలోక సుఖములను ఐశ్వర్యములను కోరువారు బహుకాలం జీవించుటకు తగిన ఆయువు, భార్యా, పుత్రులు, సామ్రాజ్యము, భూమి, ధనము, బంగారము, వెండి, మణులు, మాణిక్యములు, గృహములు, భవంతులు, సౌధములు, గృహోప కరణములు, వాహనములు రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, పల్లకీలు కారు, పశుసంపద, గోవులు మొదలైనవి, వృత్తి వ్యాపారములలో అభివృద్ధి, పరలోక సుఖములు అప్సరసలతోటి సంభోగము, స్వర్గలోక సుఖములు మొదలయిన అనేక కోరికలచే నిండిన మనస్సు గలవారు.

స్వర్గపరాః+అన్యత్+ న+అస్తి+ఇతి+ వాదినః = స్వర్గలోక సుఖములు మఱియు స్వర్గమే ఉత్కృష్టమని చెప్పువారును అనగా స్వర్గము కంటె గొప్పది ఇంకొకటి లేదు అని మాటలాడు వారును

వేదవాదరతాః = వేదములందు చెప్పిన పుణ్యఫలితములందు ప్రీతి గలవారు. అనగా పుణ్య కర్మానుష్ఠానము, తద్వారా కలుగు భోగములు ఐశ్వర్యములు మాత్రమే తెలిసి వాటి గుఱించే వేదము చెప్పినదని వాదించువారు

జన్మకర్మ ఫలప్రదామ్+ ప్రతి = శాస్త్ర విహితముగా చేసిన పుణ్య కర్మానుష్ఠానమునకు తగిన ఫలితమును గలుగ చేయునదియు పుణ్యము క్షీణించగనే తిరిగి పునర్జన్మను గలుగ చేయునదియు

భోగఃఐశ్వర్యఃగతిమ్ = ఇహలోక పరలోకములలో గల భోగములు అష్ట ఐశ్వర్యమును గలుగచేయునదియు

క్రియా విశేష బహులామ్ = అనంతశాఖలు గలిగి క్రియావిశేషములు గలదియు అయిన

యామ్+ఇమామ్+ పుష్పితామ్+వాచమ్+ ప్రవదంతి = ఏ మాటలు చెవులకు వినసొంపు గలిగించునో అటువంటి మాటలను కంటికి ఆహ్లాదమును కల్గించు పువ్వులవలె మనస్సుకు ఆనందమును గలుగ జేయునట్టివి అయిన ఈ ప్రవృత్తికర్మ గుఱించిన మాటలను చెప్పుచున్నారు.

ప్రవృత్తి కర్మావలంబులు చెప్పు మాటలు విన సొంపుగను మనస్సుకు ఆనందమును గలుగచేయును. వారు వేదములందు చెప్పబడిన పుణ్య కర్మలు, ఆ అనుష్ఠానము, వాటివలన కలుగు సుఖ భోగముల గుఱించి చెప్పుదురు.

ఈ మాటలలో గల దోషమేమి? అన్నదానికి సమాధానము చెప్పుచున్నాడు.

తయా+భోగైశ్వర్య- ప్రసక్తానామ్+ అపహృతచేతసామ్ = అటువంటి మాటలచే ఇహలోక పరలోక భోగములు, అష్టైశ్వర్యములందు ఆసక్తి గలవారికి పండిత మన్యులు చెప్పు మాటలచే అపహరింప బడిన చిత్తముగలవారికి.

వ్యవసాయాత్మికాబుద్ధిః+ న+విధీయతే = నిష్కామ కర్మానుష్ఠానము చేసి, జన్మ రాహిత్యమును గలుగ చేయునదియు, ఆత్మ స్థానమును చేరి, పునర్జన్మ నుండి విడివడి ఆత్మయై విరాజిల్లి, అమృతత్త్వము పొందవలయుననే నిశ్చ యాత్మక మయిన బుద్ధి కలుగదు. అటులనే అణిమాది అష్టసిద్ధులయందు కోరికగల యోగులకు

సమాధౌ = మనస్సును బుద్ధియందు, వాటిని జీవుని యందు, ఆ జీవుని హృదయ గుహలోని ఆత్మయందు కలపి నిశ్చల సమాధియందు ఉండుట అనే బుద్ధి కలుగదు.

**వ్యాఖ్యానము:-** కోరికలు కల వారికి జన్మ రాహిత్యము అయిన అమృతత్త్వము గలుగదు. కామ్య కర్మ ఫలితములను నిరసించిన శ్రీకృష్ణుని అభిప్రాయమునకు భిన్నముగా గీతామాహాత్మ్యము అను పేరిట కొన్ని శ్లోకములను వరాహపురాణములో ఎవరో కల్పించినారు. పండితమన్యుల గుఱించి ముండక ఉపనిషత్‌లో యిట్లు చెప్పబడినది. **"అవిద్యయా మన్తరే వర్తమానాః స్వయం ధీరాః పండితం మన్యమానాః జంఘన్యమానాః పరియంతి మూఢా అన్ధేనైవ నీయమానాయాథాఽ_న్ధాః"**

*(ముండక, 1-2-8)*

| | | |
|---|---|---|
| అవిద్యయామ్+అన్తరే+ వర్తమానాః+మూఢాః | = | అవిద్యలో ఉంటూ ఈ మూర్ఖులు వారంతట వారే పండితులము అనుకొని కృతార్థులము అయితిమి అనుకొని |
| స్వయంధీరాః+పండితమ్ +మన్యమానాః | = | వీరు గురువులై యితరులకు యీ పద్ధతిని బోధించుచున్నారు. యింకొంత మంది మూర్ఖులు ఈ పద్ధతిని అనుసరించుచున్నారు. |
| యదా+అన్ధేన+ఏవ+ | = | ఏ విధముగా గ్రుడ్డివానిచేతనే |
| నీయమానాః + అన్ధాః | = | నడిపింపబడే గ్రుడ్డివారివలె వీరిని అనుసరించు చున్నారు. అయితే యీ గురువులు, వారిని అనుసరించే వారు కూడ |
| జంఘన్యమానాః+ పరియంతి | = | ముసలితనం, వ్యాధులచే బాధపడుచూ జనన మరణ వలయములో తిరుగుచున్నారు. |

జంఘన్యమానాః – కు బదులు – దన్ద్రమన్యమాణాః అనే పదంతో యీ శ్లోకము కఠోపనిషత్తులో – ద్వితీయవల్లిలో – 5 లో చెప్పబడినది. ప్రవృత్తి కర్మావలంబుల గుఱించి ప్రహ్లాదుడు తన తండ్రితో –

**ఉ. కాననివాని నూఁతగొని కాననివాఁడు విశిష్టవస్తువుల్**
**గానని భంగిఁ గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై**
**కానరు విష్ణుఁ గొంద ఱటఁ గందు రకించన వైష్ణవాంఘ్రి సం**
**స్థాన రజోఽ_భిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా.** (భాగవతము-సప్తమ-182)

అనగా గ్రుడ్డివాడు త్రోవచూపగా వానిననుసరించి నడచు గ్రుడ్డివాళ్ళలాగా పండితమన్యులను ఈ అజ్ఞానులు అనుసరించుచున్నారు. కర్మబద్ధులైన వీరు పరమాత్మను చూడలేకున్నారు.

మరీ ఆశ్చర్యం ఏమిటంటే పరవిద్యకు సంబంధించిన ఈ గీతకు వేదములో చెప్పని గీతా యజ్ఞములు చేయుట చూచి ఆయన చెప్పిన దానికి, మన ఆచరణ విరుద్ధంగా వుండుటవలన ఆయన మనలను చూచి నవ్వుకుంటాడేమో గదా!

వేదములో కామ్యకర్మపరులకు కోరికలు ఫలించు విధానము నిష్కామకర్మ పరులకు ఆత్మస్థానమును చేరు విధానము చెప్పబడినది. కావున నివృత్తికర్మగా చెప్పబడే వ్యవసాయాత్మికాబుద్ధిని గలిగి ఉండుము.

...... ❖ ❖ ❖ ......

వేదములు - వాటి ప్రయోజనము

**త్రైగుణ్య విషయా వేదా । నిస్త్రైగుణ్యో భవార్జున ।**
**నిర్ద్వంద్వో నిత్య సత్త్వస్థో । నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ 45**

త్రైగుణ్యవిషయాః - వేదాః - నిస్త్రైగుణ్యః - భవ - అర్జున
నిర్ద్వంద్వః - నిత్యసత్త్వస్థః - నిర్యోగక్షేమః - ఆత్మవాన్.

**యావానర్థ ఉదపానే । సర్వతః సంప్లుతోదకే ।**
**తావాన్ సర్వేషు వేదేషు । బ్రాహ్మణస్య విజానతః ॥ 46**

యావాన్ - అర్థః - ఉదపానే - సర్వతః - సంప్లుతోదకే
తావాన్ - సర్వేషు - వేదేషు- బ్రాహ్మణస్య - విజానతః

| | | |
|---|---|---|
| అర్జున | = | ఓ అర్జునా! |
| త్రైగుణ్య విషయాః+ | = | విషయములు సత్త్వ, రజః, తమోగుణములనే మూడు గుణములకు సంబంధించినవి |

| | | |
|---|---|---|
| వేదాః | = | (విదజ్ఞానే అను ధాతువు నుండి వేదము అను పదము పుట్టినది కావున) వేదమనగా జ్ఞానము అని అర్థము. వేదములు చదివి, జ్ఞానవంతుడవై |
| నిత్య సత్త్వస్థః | = | నిత్యము సత్త్వగుణమున ఉండి ఆపై |
| నిర్యోగక్షేమః | = | యోగక్షేమములు కోరనివాడవును |
| నిస్త్రైగుణ్యః | = | గుణరహితుడవును |
| నిర్ద్వంద్వః | = | ద్వంద్వరహితుడవును |
| ఆత్మవాన్ | = | ఆత్మవంతుడవును |
| భవ | = | అగుము |
| యావాన్+అర్థః+<br>సర్వతః+సంప్లుతోదకే | = | దాహము గలవానికి సర్వత్రా జలములతో నిండియున్న జలాశయముతో ఎంత ప్రయోజనము గలదో |
| తావాన్+(అర్థః)+<br>ఉదాపానే | = | అంతే ప్రయోజనము నూతిలోని నీటియందుగలదు. |

జలాశయములో (నదిలో) నీరు ఎక్కువ ఉండును. నూతిలో నీరు తక్కువ ఉండును. గాని దప్పిక గలవానికి అతని దప్పిక తీర్చగల జలము చాలును. మిగిలిన జలము అంతా త్రాగవలసిన పని లేదు. అటులనే నివృత్తి కర్మావలంబునికి

| | | |
|---|---|---|
| విజానతః+<br>బ్రాహ్మణస్య+<br>సర్వేషు+వేదేషు | = | ద్వంద్వాతీత స్థితి ఎఱిగిన జ్ఞానికి సర్వవేదములందు, బ్రాహ్మణములందు, ఆరణ్యకము లందు, ఉపనిషత్‌లందు చెప్పబడిన విషయములు ఆత్మ గుఱించి చెప్పబడిన విషయము, అధ్యాత్మ గుఱించి చెప్పబడిన విషయములు స్వానుభవములో అవగతమై అతడు ఈశ్వరుడగును. |

**వ్యాఖ్యానము:-** ముందు తమోగుణ, రజోగుణములు లేక సత్త్వగుణ ప్రధానుడవై

యుండుము. ఆతరువాత నేను జీవుడను కాను ఈశ్వరుడను అనే భావన కలిగి అనగా ఆత్మ వంతుడవు అగుము. ద్వందాతీతుడవు కమ్ము. ఈశ్వరుడు ద్వందాతీతుడు. కావున ద్వందాతీత స్థితిని పొందినచో నీవే ఈశ్వరుడవు.

జీవుడు ఈశ్వరుడగు విధానమే సర్వవేదముల సారము

శాస్త్రములు కేవలము చదువుట లేక ప్రవచించుట గాక స్వానుభవములో ద్వంద్వాతీత స్థితిని పొందవలయును. ఇదియే చదువులలో మర్మము. దీనినే ప్రహ్లాదుడు ఇట్లు చెప్పినాడు.

క. **చదివించిరి నను గురువులు, చదివితి ధర్మార్థముఖ్య శాస్త్రంబులు నేఁ**
**జదివినవి గలవు పెక్కులు, చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ.**

*(భాగవతము-సప్తమ స్కంధం ...166)*

ప్రహ్లాదుడు తను ద్వంద్వాతీత స్థితిని పొందితినని తండ్రికి చెప్పగా అది నిజమో కాదో అని హిరణ్యకశిపుడు పరీక్షాధికారిగా ప్రహ్లాదునుని అనేక విధముల హింసించినాడు. ప్రహ్లాదుని ద్వంద్వాతీత స్థితిని చూచి కొడుకు ప్రయోజకుడైనాడని మురిసిపోయినాడు.

...... ❖ ❖ ❖ ......

ఇంతవఱకు పుణ్య కర్మానుష్ఠానము చేయుచు పుణ్య ఫలితము కోరరాదని - పుణ్యకర్మలను అనుష్ఠించి ద్వంద్వాతీత స్థితిని పొందవలయుననియు చెప్పి సారాంశమును మఱియొకమారు చెప్పి ముగించుచున్నాడు.

**కర్మణ్యేవాధికారస్తే । మా ఫలేషు కదాచన ।**
**మా కర్మఫలహేతుర్భూః । మా తే సంగోఽస్త్వకర్మణి ॥ 47**

కర్మణి - ఏవ - అధికారః - తే - మా - ఫలేషు - కదాచన -

మా - కర్మఫలహేతుః- భూః - మా - తే - సంగః - అస్తు - అకర్మణి.

**ఉపదేశము: 1. అర్జునా!**

| | | |
|---|---|---|
| తే+అకర్మణి+ సంగః+కదాచన+ మా+అస్తు | = | నీకు పుణ్యకర్మలు అనుష్ఠించకుండా యుండుట యందు ఆసక్తి ఎన్నడును ఉండరాదు. అనగా నీవు నిత్యము పుణ్య కర్మలు చేయవలయును. పుణ్యకర్మలు మానవద్దు. |

**ఉపదేశము: 2.**

| | | |
|---|---|---|
| తే+కర్మణి+ఏవ+ అధికారః | = | నీకు పుణ్య కర్మలు చేయుట యందే అధికారము. నీవు పుణ్యకర్మలను విధివిహితముగా ఆచరింపుము. |

**ఉపదేశము: 3.**

| | | |
|---|---|---|
| కర్మఫల హేతుః+ మా+భూః | = | కర్మ ఫలితమునకు నీవు హేతువు కారణము కారాదు. అనగా నేను ఈ పుణ్య పుణ్య కర్మానుష్ఠానము చేయుచున్నాని తలంచరాదు. అనగా కర్తృత్వ భావన యుండరాదు. కర్తృత్వ భావన వలన కర్మలు బంధమగును. |

**ఉపదేశము: 4.**

| | | |
|---|---|---|
| ఫలేషు+మా | = | నీకు ఆ పుణ్య కర్మల ఫలితములందు కోరిక యుండరాదు. కర్మఫలితములు కోరినచో కర్మలు బంధములగును. |

...... ❖ ❖ ❖ ......

**యోగము :** ఇంతవఱకు పుణ్యకర్మలు ఎలా చేయవలయునో చెప్పి, ఇప్పుడు

**యోగము** గురించి వివరించుచున్నాడు.

**యోగస్థః కురు కర్మాణి । సంగం త్యక్త్వా ధనంజయ ।**
**సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా । సమత్వం యోగ ఉచ్యతే ॥ 48**

యోగస్థః – కురు – కర్మాణి – సంగమ్ – త్యక్త్వా – ధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోః – సమః – భూత్వా – సమత్వమ్ – యోగః – ఉచ్యతే

**నిష్కామకర్మ:**

సిద్ధ్యసిద్ధ్యోః+సమః+ = ఫలితా ఫలితములందు సమ బుద్ధి గలిగి ఉండి
భూత్వా+కర్మాణి+కురు నే చెప్పిన విధముగ పుణ్య కర్మలను ఆచరింపుము. ఆవిధముగ చేసినచో కర్మ బంధము కాదు.

**యోగము గురించిన నిర్వచనము :**

సమత్వమ్+యోగః+ = ద్వంద్వాతీత స్థితి గలిగి ఉండుటను
ఉచ్యతే యోగము అని చెప్పబడుచున్నది.

**యోగము :**

ధనంజయ+సంగమ్+ = ఓ అర్జునా! ప్రజలతోటి సంబంధమును విడిచి
త్యక్త్వా+యోగస్థః ఏకాంతమున యోగమునందుండి, యోగమును అభ్యసింపుము. ద్వంద్వాతీతుడవు అగుము.

జయాపజయములయందు లాభాలాభములయందు ఫలితా ఫలితములందు సమబుద్ధిగలిగి పుణ్యకర్మాచరణ చేయవలయును. ఏకాంతమునందుండి సమత్వబుద్ధిగలిగి యోగమును అభ్యసింపవలయును.

...... ❖ ❖ ❖ ......

సాంఖ్యము, పుణ్యకర్మల తారతమ్యములు

**దూరేణ హ్యవరం కర్మ । బుద్ధియోగాద్ధనంజయ ।**
**బుద్ధౌ శరణమన్విచ్ఛ । కృపణాః ఫలహేతవః ॥ 49**

దూరేణ - హి - అవరమ్ - కర్మ - బుద్ధియోగాత్ - ధనంజయ
బుద్ధౌ - శరణమ్- అన్విచ్ఛ - కృపణాః - ఫలహేతవః

| | | |
|---|---|---|
| ధనంజయ | = | ఓ అర్జునా! |
| బుద్ధియోగాత్+కర్మ+ అవరమ్+దూరేణ+హి | = | బుద్ధియోగము కంటే (సాంఖ్యముకన్నా) యజ్ఞ సంభారములతో, వస్తు వినియోగముతో చేయు కామ్య కర్మ అతి తక్కువ స్థాయి కలది. |
| ఫలహేతవః+కృపణాః | = | పుణ్యకర్మలు అనుష్ఠించి వాటి ఫలితమును కోరువారు కృపణులు. |

**సాంఖ్యము :**

| | | |
|---|---|---|
| బుద్ధౌ | = | మనస్సును బుద్ధియందు కలపి నిరంతరము ఆత్మానుసంధానము చేయుచూ |
| అన్విచ్ఛ | = | పరమాత్మను అన్వేషించుచూ |
| శరణమ్ | = | పరమాత్మను ఆశ్రయమును కోరి అనగా పరమాత్మను ఆశ్రయించి నిరహంకారముగా ఉండుము. |

...... ❖ ❖ ❖ ......

కర్మ బంధము కాదు

**బుద్ధియుక్తో జహాతీహ । ఉభే సుకృతదుష్కృతే ।**

**తస్మాద్యోగాయ యుజ్యస్వ । యోగః కర్మసు కౌశలమ్ ॥ 50**

బుద్ధియుక్తః - జహాతి - ఇహ - ఉభే - సుకృత - దుష్కృతే

తస్మాత్ - యోగాయ - యుజ్యస్వ - యోగః - కర్మసు - కౌశలమ్

**నిష్కామకర్మ**

| | | |
|---|---|---|
| ఇహ+సుకృత+ దుష్కృతే +ఉభే+ | = | ఈ లోకమునందే అతడు జీవించియుండగనే విధివిహితముగా కర్మాచరణ చేయుటవలన గలుగు |
| జహాతి | | పాపపుణ్యములనే రెండింటిని నిష్కామ కర్మవలన త్యజించుచున్నాడు. అనగా ద్వంద్వాతీతుడు కర్మబంధములనుండి విడివడుచున్నాడు అని చెప్పబడుచున్నాడు. ఇదే |
| కర్మసు+కౌశలమ్+ తస్మాత్ | = | పుణ్యకర్మలయందుగల నేర్పరితనము అందువలన నీవు పుణ్యకర్మలు అనుష్ఠించుచు కర్మ ఫలితమును కోరక ద్వంద్వాతీతుడవై ఉండుము. |

**యోగము :**

| | | |
|---|---|---|
| యోగః | = | ద్వంద్వాతీతస్థితి గలిగి యోగము చేయువాడు పాపపుణ్యములను త్యజించుచున్నాడు. కావున నిష్కామకర్మపరుడు, యోగి, సాంఖ్యుడు వీరు సమత్వబుద్ధి గలిగి అన్ని పాపపుణ్యములనుండి విడివడి జీవన్ముక్తుడగుచున్నాడు. |
| యోగాయ+యజ్యస్వ | = | యోగమును నీవు అనుష్ఠింపుము. ఆత్మాను సంధానము చేయుము. |

**సాంఖ్యము :**

| | | |
|---|---|---|
| బుద్ధి యుక్తః | = | సాంఖ్యము తెలిసి సమత్వ బుద్ధి కలిగి ద్వంద్వాతీత స్థితి కలిగియున్నవాడు పాపపుణ్యములను త్యజించుచున్నాడు. |

కావున ఈ పద్ధతులలో దేనినయినా ఆచరింపుము.

...... ❖ ❖ ❖ ......

ద్వంద్వాతీతులు

**కర్మజం బుద్ధి యుక్తా । హి ఫలం త్యక్త్వా మనీషిణః ।**
**జన్మ బంధ వినిర్ముక్తాః । పదం గచ్ఛంత్య నామయమ్ ॥ 51**

కర్మజమ్ - బుద్ధి యుక్తాః - హి - ఫలమ్ - త్యక్త్వా - మనీషిణః
జన్మబంధవినిర్ముక్తాః - పదమ్ - గచ్ఛంతి - అనామయమ్.

| | | |
|---|---|---|
| కర్మజమ్+ఫలమ్+త్యక్త్వా | = | పుణ్యకర్మల ఫలితమును వదలి అనగా కర్మఫలత్యాగి అయిన ద్వంద్వాతీతుడయినవాడును |
| మనీషిణః | = | ద్వంద్వాతీతుడయిన యోగియు |
| బుద్ధి యుక్తాః | = | బుద్ధితోకూడిన సాంఖ్యులును |
| జన్మ బంధవినిర్ముక్తాః | = | కర్మ బంధములనుండి విడివడినవారై జన్మ పరంపరల నుండి విడివడినవారై దేహత్యాగానంతరము |
| అనామయమ్+పదమ్+ గచ్ఛంతి+హి | = | సర్వోపద్రవరహితమై పునరావృత్తి రహితమయిన బ్రహ్మపదమును పొందుచున్నారు. ఆ బ్రహ్మపదమును పొంద ప్రయత్నించుము |

...... ❖ ❖ ❖ ......

మోహమనే మాలిన్యం

**యదా తే మోహకలిలం । బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గంతాసి నిర్వేదం । శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥ 52**

యదా – తే – మోహ కలిలమ్ – బుద్ధిః – వ్యతితరిష్యతి
తదా – గంతాసి – నిర్వేదమ్ – శ్రోతవ్యస్య – శ్రుతస్య – చ

ఈ భార్యాపుత్రులు నావాళ్ళు. నేను దేహమును అనుకొనుట మోహము. ఈ మోహము వలననే ఆశ కలుగుచున్నది. భూలోక స్వర్గలోక సుఖాలు కోరుట గలుగుచున్నది. వీటి అన్నింటికి కారణము మోహము. కావున

| | | |
|---|---|---|
| యదా+తే+బుద్ధిః+ | = | ఎప్పుడు నీ యొక్క బుద్ధి ఈ మోహమనే |
| మోహకలిలమ్+ | | మాలిన్యమున మునిగి ఉండక వదలి |
| వ్యతితరిష్యతి+ | | బయటపడునో |
| తదా | = | అప్పుడు |
| శ్రోతవ్యస్య+చ+ | = | వినదగిన కామ్యకర్మల ఫలితముగుఱించి మఱియు |
| శ్రుతస్య+నిర్వేదమ్+ | | వినినట్టి మాటలయందు నిర్వేదమును |
| గంతాసి | | పొందుదువు. |

**వ్యాఖ్యానము :-** మోహములో కూరుకు పోయినంత కాలము, పుణ్య కర్మల ఫలితములందు నిర్వేదము గలుగదు. తను దేహము అని అనుకొనుట, దేహ సంబంధీకులు తనవారు అని భావించుటయే మోహము. ఈ మోహము వలననే తన గుఱించి, తన వారి గుఱించి యోగ క్షేమములు గుఱించి, కోరికలు కోరుట సంభవించును. ఈ మోహమును పరమాత్మయే తొలగించ వలయునని భావించిన కుంతి శ్రీకృష్ణుని ఇట్లు ప్రార్థించినది. *(భాగవతము 1–199)*

**ఉ. యాదవులందుఁ బాండవులందు నధీశ్వర! నాకు మోహవి**
**చ్ఛేదము సేయుమయ్య ఘన సింధువుఁ జేరెడి గంగభంగి నీ**
**పాదసరోజచింతనముపై ననిశంబు మదీయబుద్ధి న**
**త్యాదరవృత్తితోఁ గదియు నట్లుగఁ జేయగదయ్య యీశ్వరా!**

అనగా పుట్టింటి వారయిన యాదవులందు, కన్నకొడుకులయిన పాండవుల యందు గల మోహమును తొలగించి నీ పాదపద్మములపై నా బుద్ధి లగ్నమయ్యేటట్లు చేయుము.

చండా మార్కులు చెప్పే వేద పాఠములందు ప్రహ్లాదుడు ఆసక్తి చూపలేదు. నిర్వేదము పొందినాడు. **"అతండు రాగ ద్వేషంబుల చేత విషయాసక్తులైన వారలకు గ్రాహ్యంబులైన ధర్మార్థ కామంబులు దనకు నగ్రాహ్యంబులు"** - (భాగవతం-సప్తమ స్కంధం -208) అని తలచి నిర్వేదమును పొందినాడు. ముండక ఉపనిషత్తులో యిలా నిర్వేదం పొందిన తర్వాత పరవిద్యకై ఆత్మజ్ఞానియైన గురువును ఆశ్రయించ వలయునని చెప్పబడినది. అపరవిద్యకు చెందిన గురువులకు ప్రతినిధులు చండా మార్కులు. పరవిద్యకు చెందిన గురువులకు ప్రతినిధులు నారదాది ఋషులు. అయితే చండా మార్కులు గురువులకు, వారి శిష్యులకు ఉండే కీర్తి ప్రతిష్ఠలు పరవిద్య ననుష్ఠించు గురువుకు, విద్యార్థికి ఉండవు.

శా. **నిన్నున్ మెచ్చరు నీతిపాఠమహిమన్ నీతోడి దైత్యార్భకుల్**
**గన్నారన్నియుఁ జెప్పనేర్తురు గదా! గ్రంథార్థముల్ దక్షు లై**
**యన్నా! యెన్నఁడు నీవు నీతివిదుఁడౌదంచున్ మహా వాంఛతో**
**నున్నాఁడన్, ననుఁ గన్న తండ్రి! భవదీయోత్కర్షముం జూపవే!**

*(భాగవతం సప్తమ స్కంధం -164)*

నీ తోటివారు అపరవిద్య లేదా ప్రవృత్తికర్మ గుఱించి వచించువారు వేదములో చెప్పిన కామ్యకర్మల గుఱించి చక్కగా చెప్పుచున్నారు. నీవు ఆవిధముగా చెప్పనందున నీ వేద పాండిత్యమును, నిన్నును ప్రజలు మెచ్చుకున్నారు. అయినను నీవు వేదజ్ఞుడవు కావలయుననే గొప్ప కోరికతో నేను ఉన్నాను. కావున, పుత్రా! నీవు వేదజ్ఞుడవై ఉండుము.

...... ❖ ❖ ❖ ......

ఎప్పుడు యోగమును పొందగలము:

**శ్రుతివిప్రతిపన్నా తే । యదా స్థాస్యతి నిశ్చలా ।**
**సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి ॥ 53**

శ్రుతి విప్రతిపన్నా – తే – యదా – స్థాస్యతి – నిశ్చలా
సమాధౌ – అచలా – బుద్ధిః – తదా – యోగమ్ – అవాప్స్యసి

ఓ అర్జునా!

శ్రుతి విప్రతిపన్నా+ యదా+తే+బుద్ధిః+ నిశ్చలా+అచలా+ స్థాస్యతి = వేద ప్రణీతములైన కామ్యకర్మల యందు తద్వారా కలుగు ఫలితములందు నీకు నిర్వేదము కలిగినప్పుడు ఎప్పుడు నీ యొక్క మనస్సు, బుద్ధి నిశ్చలమై, చలింపక అనగా మనసు నిశ్చలమై, అటు ఇటు చలింపక ఏకాగ్రత పొంది ఉండునో

తదా+యోగమ్+ సమాధౌ+అవాప్స్యసి = అప్పుడు యోగమును అభ్యసించి నిశ్చల సమాధిని పొందగలవు అనగా మనసు నిశ్చలమై బుద్ధితో సంయోగము చెంది నిశ్చల సమాధిలో ఆత్మానుసంధానము గలిగి జాగ్రదావస్థలో , శాంతత్వము గలిగి స్థితప్రజ్ఞుడవై జీవన్ముక్తుడవు అగుదువు. దేహత్యాగానంతరము ఆత్మ స్థానమును పొంది ఆత్మయై విరాజిల్లుదువు.

...... ❖ ❖ ❖ ......

**అర్జునుని ప్రశ్న :**

అర్జున ఉవాచ

ద్వంద్వాతీతుడిగా చెప్పబడే పండితుడు లేదా స్థితప్రజ్ఞుడు ఎట్లు ఉండును?

**స్థిత ప్రజ్ఞస్య కా భాషా । సమాధిస్థస్య కేశవ ।**
**స్థితధీః కిం ప్రభాషేత । కిమాసీత వ్రజేత కిమ్ ॥ 54**

స్థిత ప్రజ్ఞస్య – కా – భాషా – సమాధిస్థస్య – కేశవ

స్థితధీః – కిమ్ – ప్రభాషేత – కిమ్ – ఆసీత – వ్రజేత – కిమ్.

కేశవ = ఓ శ్రీకృష్ణా!

స్థితధీః+ స్థితప్రజ్ఞస్య = స్థిరబుద్ధి గలిగి స్థితప్రజ్ఞుడైన వానియొక్క

లక్షణములు ఏమిటి? వీరిని గుర్తించుట ఎట్లు? స్థితబుద్ధిగలవాని లక్షణములు ఏమిటి? ఆవిధముగా సుఖ దుఃఖములకు విచలితుడుగాక గంభీర్యము పాటించిన స్థిరబుద్ధి గలవాడు జాగ్రదావస్థలో, కర్మేంద్రియ, జ్ఞానేంద్రి యములను, మనస్సును ఎట్లు పనిచేయించును? కర్మేంద్రియములైన వాక్కుతో ఎట్లు మాటలాడును? సంసారములో ఎట్లు సంచరించును? సామాన్యునికి స్థిత ప్రజ్ఞునికి గల తేడా ఏమిటి?

సమాధిస్థస్య = ఆత్మానుసంధానము చేసి, నిశ్చల సమాధి యందున్న యోగి, ఆ సమాధి స్థితిని వీడి, జాగ్రదావస్థకు వచ్చిన వానియొక్క లక్షణములు ఏమిటి?

కిమ్+వ్రజేతి+కిమ్+ ఆసీత = ఎట్లు కూర్చుండును. మనస్సులో ఆందోళన లేకుండా ఎట్లు స్థిమితంగా ఉండును. బాహ్యప్రపంచములో సంచరించునపుడు అనగా భార్య పిల్లలతోనూ మిత్రుల తోనూ బయటి వ్యక్తులతోనూ శత్రువులతోను వ్యవహరించునపుడు ఎలా వ్యవహరించును? (ఎలా సంసారములో సంచరించును)

| | | |
|---|---|---|
| కా+భాషా | = | అతని భాష ఏది? అనగా లోకములో ఎట్లు వ్యవహరించును? కపట యోగులను, నిజమైన యోగులను గుర్తించుట ఎట్లు? |
| కిమ్+ప్రభాషేత | = | అతని మాట ఎటులుండును? కర్మాచరణ చేయుచు, వాటి ఫలితములను ఆశింపక మఱియు సమత్వ బుద్ధితో కర్మాచరణ చేయువాడు ఎట్లు మాటలాడును? |

**వ్యాఖ్యానము:-** పండితుడన్నా, స్థితప్రజ్ఞుడన్నా ఒక్కటే. **'అహం బ్రహ్మాస్మి'** అనే భావన కలవాడు పండితుడు/స్థితప్రజ్ఞుడు. పుణ్య కర్మానుష్ఠానము చేసి పుణ్య ఫలితము కోరక ద్వంద్వాతీతుడైనవాడు స్థిత ప్రజ్ఞుడని చెప్పబడును. మనో బుద్ధులను ఏకము చేసి నిశ్చల సమాధిలో జీవునుని హృదయగత ఆత్మతో ఏకీభూతము చేసినవాడు స్థిత ప్రజ్ఞుడని చెప్పబడును. దేహి-దేహవిచారణ చేసి తను దేహము కాదని తెలిసి ప్రకృతిని పరిత్యజించి పరమాత్మతో అనుసంధానపరుడయిన సాంఖ్యుడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును. వీరందఱూ గుణరహితులు. ద్వంద్వాతీతులు, శాంతత్వము కల భాగవతోత్తములు స్థితప్రజ్ఞులుగా చెప్పబడుదురు.

స్థితప్రజ్ఞుడైనవాడు పుణ్యకర్మానుష్ఠానపరుడు నిజ జీవితములో ఎట్లు ప్రవర్తించును? సమాధి స్థితిని వీడి, జాగ్రదావస్థలోగల యోగి ఎట్లు ప్రవర్తించును? సాంఖ్యుడు ఎట్లు ప్రవర్తించును?

స్థిత ప్రజ్ఞుడైన వారు సుఖ దుఃఖములకు విచలితుడు గాక సర్వమున్ అతని దివ్య కళామయమంచు, మేలును కీడును, అతని చేష్టలే అని భావించి విష్ణువును శరణుకోరి విష్ణువునందు ఉల్లము చేర్చి యుందురు. దీనికి ఉదాహరణగా రామాయణములో ఋషులు రాక్షసులచే బాధ నొందియూ, వారిని శపింపక, శ్రీరామునుని శరణుకోరి రాక్షస బాధానివారణకై ప్రార్థించిరి.

యోగులు ఆత్మరతి, ఆత్మ క్రీడలో ఉండి సుఖదుఃఖములకు విచలితులు గాక ద్వంద్వాతీతులై ఉందురు. వీనికి ఉదాహరణగా భాగవతమున శమీకుని కథ చెప్పబడినది. పరీక్షిత్ మహారాజు వచ్చిసమాధి స్థితియందున్న శమీకునిపై చనిపోయిన పామును వేసినాడు. పరీక్షిత్ వెళ్ళిన కొంతసేపటికి శమీకుడు తన కుమారుడైన శృంగిరోదనకు జాగ్రదావస్థకు వచ్చి సర్వము గ్రహించి రాజును శపింపక తన భుజమున వ్రేలాడుచున్న చనిపోయిన పామును తీసి పారవేసినాడు. ఇట్టి శాంతత్వముగల వాడు స్థిత ప్రజ్ఞుడు. ఈ స్థితప్రజ్ఞుడినే భాగవతోత్తముడు అని అందురు. విదేహులని, జీవన్ముక్తులని, శాంతులని, పరమ భాగవతోత్తములని చెప్పిన వారినే స్థితప్రజ్ఞులుగా ఇందు చెప్పబడినది.

...... ❖ ❖ ❖ ......

శ్రీభగవాన్ ఉవాచ

స్థితప్రజ్ఞుని లక్షణములు

**ప్రజహాతి యదా కామాన్ । సర్వాన్ పార్థ మనోగతాన్ ।**
**ఆత్మన్యేవాత్మనా తుష్టః । స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥ 55**

ప్రజహాతి – యదా – కామాన్ – సర్వాన్ – పార్థ – మనోగతాన్
ఆత్మని – ఏవ – ఆత్మనా – తుష్టః – స్థితప్రజ్ఞః – తదా – ఉచ్యతే

**దుఃఖేష్వనుద్విగ్నమనాః । సుఖేషు విగతస్పృహః ।**
**వీతరాగ భయ క్రోధః । స్థితధీర్మునిరుచ్యతే ॥ 56**

దుఃఖేషు – అనుద్విగ్నమనాః – సుఖేషు – విగతస్పృహః
వీతరాగ భయక్రోధః – స్థితధీః – మునిః – ఉచ్యతే

స్థిర బుద్ధి గుఱించి వివరించుచున్నాడు.

**యః సర్వత్రానభిస్నేహః । తత్తత్ప్రాప్య శుభాశుభమ్ ।**
**నాభి నందతి నద్వేష్టి । తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 57**

యః – సర్వత్ర – అనభిస్నేహః – తత్ – తత్ – ప్రాప్య – శుభాశుభమ్
న – అభినందతి – న – ద్వేష్టి – తస్య – ప్రజ్ఞా – ప్రతిష్ఠితా.

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| యదా+మనోగతాన్+ సర్వాన్+కామాన్+ ప్రజహాతి | = | ఎప్పుడు ఆత్మానాత్మ వివేకముచే మనస్సులోగల సర్వకోరికలను సంపూర్ణముగా పరిత్యజించు చున్నాడో |
| ఆత్మనా+ఆత్మని+ఏవ | = | మనోబుద్ధులను ఏకంచేసి వాటిని జీవాత్మతో కలిపి, జీవాత్మను ఆత్మతో కలిపి అనగా జీవుని హృదయ గుహలోగల జ్యోతి స్వరూపమయిన ఆత్మయందే కలపి |
| తుష్టః | = | రమించుచూ బ్రహ్మానందమును పొందునో |
| తదా | = | అప్పుడు అతడు |
| స్థితప్రజ్ఞః+ఉచ్యతే | = | స్థితప్రజ్ఞుడని చెప్పబడుచున్నాడు. |
| విగతస్పృహః | = | లోక వ్యవహారములందు ఆసక్తి లేని వాడు, తామరాకుపై నీటిబొట్టువలె సంసారములో ఉన్నవాడును |
| అనుద్విగ్నమనాః | = | గుణముల చర్యవలన మనస్సులో ఆందోళన గలుగును. అటువంటి ఆందోళన లేనివాడును. (గుణములు మనసులో అంతర్లీనముగా నుండును. అవి పరిస్థితులవలన బాహ్య చర్యగా బహిర్గత మగును.) |

| | | |
|---|---|---|
| వీతరాగభయక్రోధః | = | రాగము–ద్వేషము, కాముము–క్రోధము మరణ భయము మొదలయినవి లేనివాడును. (అరి షడ్వర్గములను జయించినవాడును.) |
| సుఖేషు + దుఃఖేషు | = | సుఖదుఃఖముల యందు ఉప్పొంగక, క్రుంగిపోక అవి కాలాను సారము వచ్చునని గ్రహించి, సుఖదుః ఖములకు విచలితుడు కానివాడును. (అనగా కాలానుసారము వచ్చు సుఖదుఃఖములకు విచలితుడు కాకపోవుటయే గాంభీర్యమును పాటించుట అని అందురు.) |
| మునిః | = | కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను స్వాధీనము ఒనర్చుకొన్నవాడు. (సర్వ ధర్మాణాం మననా న్మునిః – సర్వధర్మములు ఎఱిగినవాడు. మన్యతే మునిః – మన జ్ఞానే – జ్ఞానముగలవాడు. వాచం నియచ్ఛతీతి – వాక్‌ను నిలుపువాడు.) |
| స్థితధీః+ఉచ్యతే | = | స్థిరబుద్ధిగలవాడు అని స్థిత ప్రజ్ఞుడని చెప్పబడు చున్నాడు. |
| యః+సర్వత్ర+ అనభిస్నేహః+ | = | ఎవడు అన్ని విషయములందు, అందఱియందు అనగా బంధు మిత్రాదులయందు, ప్రియాప్రియము లందు ఆసక్తి లేనివాడై ఉదాసీనుడై యుండునో |
| తత్+తత్+ శుభాశుభమ్+ప్రాప్య | = | ఆయా కాలములందు పూర్వజన్మ కర్మ వశమున గలుగు శుభములు, అశుభములను పొంది, శుభములకు ఆనందపడి, అశుభము గలుగగానే క్రుంగిపోడో ఎవడు |
| న+ద్వేష్టి+న+అభినందతి | = | శత్రువులను ద్వేషింపడో, ఎవడు దారేషణ, పుత్రేషణ, ధనేషణల యందు ఆనందించడో అనగా ఈషణ త్రయములు లేనివాడో, శుభాశుభములకు విచలితుడు కానివాడో |

తస్య+ప్రజ్ఞా+ప్రతిష్ఠితా = వానియొక్క జ్ఞానము, బుద్ధి స్థిరముగా ఉండును. ఇట్టి స్థిరబుద్ధి గలవాడు స్థితప్రజ్ఞుడు.

**వ్యాఖ్యానము:-** ఈషణ త్రయములు లేనివాడు, అరిషడ్వర్గములు లేనివాడు, శత్రుమిత్రాదులందు రాగద్వేషములు లేనివాడు, శుభాశుభములకు విచలితుడు కానివాడు, సంసార తాపత్రయములు లేనివాడు స్థితప్రజ్ఞుడు. ఈ లక్షణములను బట్టి స్థితప్రజ్ఞునిని పోల్చుకొనవచ్చును.

అయితే ఈ లక్షణములన్ని స్థాణువు యందు మఱియు శవమునందు ఉండును. అటువంటి అప్పుడు వాటిని జీవమున్న మానవుని కంటె శ్రేష్ఠమని అంగీకరింప వచ్చునా? అన్న ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

బ్రహ్మదేవునకు తనచే సృజియింపబడిన మానస పుత్రులయిన సనకసనంద నాదులను గృహస్థులై ప్రజా సర్గము చేయమనగా వారు నిరాకరించిరి. అంత బ్రహ్మ దేవునకు క్రోధము కలిగినది. ఆ క్రోధమువలన రుద్రుడు కలిగినాడు. అనగా బ్రహ్మదేవునికి కోపము వచ్చినది కదా!

శివుడు తన భార్య అయిన దాక్షాయణీ మరణమునకు కారణమయిన దక్షుని శిరస్సును ఖండించ వీరభద్రుని సృజియించినాడు గదా! అనగా శివునికి కూడా కోపము కల్గినది కదా!

విష్ణువునకు దేవతలపై అనురాగము ఉండుటచేతనే గదా మోహినిగా అవతరించి అమృతమును దేవతలకు పంచి యిచ్చినాడు.

ఇంద్రుడు తన పీఠమును ఇతరులు తపస్సుచేసి అధిరోహింతురని తలచి ఆ భయమున వారి తపస్సునకు విఘ్నము గలిగించ అప్సరసలను పంపును గదా!

అటువంటప్పుడు స్థిత ప్రజ్ఞత్వము ఎటుల గలుగును? అన్న ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు. స్థాణువువలె మఱియు శవమువలెగాక తగినంత బలవత్తర కారణము లేక పోయినను ప్రతి చిన్న విషయమునకు రాగ ద్వేషములకు లోనుగాక తాబేలువలె సంచరించువాడు స్థితప్రజ్ఞుడు. వానియొక్క బుద్ధి స్థిరబుద్ధి. ఈ విషయమునే చెప్పుచున్నాడు.

...... ❖ ❖ ❖ ......

స్థితప్రజ్ఞుడు ఎట్లు సంచరించును అన్న ప్రశ్నకు సమాధానము

**యదా సంహరతే చాయం । కూర్మోఽఙ్గానీవ సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః । తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 58**

యదా – సంహరతే – చ – అయమ్ – కూర్మః – అంగాని – ఇవ – సర్వశః
ఇంద్రియాణి – ఇంద్రియార్థేభ్యః – తస్య – ప్రజ్ఞా – ప్రతిష్ఠితా.

| | | |
|---|---|---|
| యదా+అయమ్+ కూర్మః+ఇంద్రియాణి+ ఇంద్రియార్థేభ్యః+చ | = | ఏ విధముగా తాబేలు తనయొక్క ఇంద్రియములను వాటి వాటి యింద్రియార్థముల వైపు అవసరమైనప్పుడు ప్రసరింపజేసి, మరల ఇంద్రియార్థముల నుంచి, వెనుకకు మరలించి తన యొక్క |
| సర్వశః+అంగాని+ సంహరతే + ఇవ | = | సర్వ అవయములను అవసరమైనప్పుడు అవసర మైనంతవఱకు పనిచేయించి, అవసరము లేనప్పుడు మరల తన అవయములను ఉపసంహరించి ముడుచుకొనునో, ఆవిధముగ తగిన సమయములో తగు విధముగా ఇంద్రియముల ద్వారా ఇంద్రియార్థములను అనుభవించి మరల ఉపసంహరించిన అనగా తామరాకుపై నీటిబొట్టులా, సంసారములో ఉండునో |
| తస్య+ప్రజ్ఞా+ ప్రతిష్ఠితా | = | వానియొక్క బుద్ధి స్థిరముగా ఉండును. అట్టి వాడు స్థితప్రజ్ఞుడుగా చెప్పబడును. |

**వ్యాఖ్యానము :-**

స్థితప్రజ్ఞుడు ఎట్లు కూర్చుండును? ఎట్లు సంచరించును అన్న ప్రశ్నకు సమాధానముగా తామరాకుపై నీటిబొట్టువలె లేదా తాబేలువలె సంచరించును అనే సమాధానము చెప్పబడినది.

| **జ్ఞానేంద్రియములు** | **వాటి ఇంద్రియార్థములు** |
|---|---|
| చెవులు | శబ్దము వినుట |
| చర్మము | స్పర్శ |
| కన్నులు | చూచుట |
| నాలుక | రుచి చూచుట. |
| ముక్కు | వాసనను పీల్చుట |

అనగా జ్ఞానేంద్రియములు వాటి వాటి పనులయందు ప్రవర్తిల్లును. ఈ ప్రవర్తిల్లుట రెండు విధములుగా నుండును. ఒకటి సంకల్పితము, రెండవది అసంకల్పితము. అనగా ఆ యింద్రియార్థములను అనుభవించవలయుననే దృఢ సంకల్పముతో మనస్సును ప్రేరేపించుట ఒక విధము.

ఆ యింద్రియార్థములను అనుభవించవలయుననే భావన లేక నిర్వికారముగ, ఉదాసీనతతో ఉండుట రెండవవిధము. ఇంద్రియార్థములను అనుభవించవలయుననే దృఢసంకల్పముతో మనస్సును ప్రేరేపించినచో అవి **విషయములగును**. విషయములు అయినప్పుడు మాత్రమే కర్మేంద్రియములు మనస్సు చెప్పిన పనిని చేయును. ఇంద్రియార్థములను నిగ్రహించి జ్ఞానేంద్రియములు పనిచేసినను అవి విషయములు కావు. దీనికి ఉదాహరణ హనుమంతుడు సీతాన్వేషణ సందర్భమున సీతను చూడవలయుననే సంకల్పముతో రావణాంతఃపురములో ప్రవేశించి, నగ్నముగా ఉన్న స్త్రీలను కూడా పరిశీలించి, పరికించి చూచినాడు. అయితే అతని మనస్సులో ఎటువంటి వికారము లేదు. నిర్వికారముగా చూచుటవలన, ఆ నగ్నస్త్రీలను చూచినను అది కంటికి విషయము కాలేదు.

అటులనే మనము రోడ్డుపై నడచుకుంటూ వెళ్ళునపుడు అసంకల్పితముగా, మన కన్నులు అనేకమంది స్త్రీలను చూచును. అయినను వికారము కలుగదు. అసంకల్పితము అగుటవలన మనము స్త్రీలను చూచినను, అది కంటికి విషయము కాలేదు. ఇటులనే మిగిలిన వాటిని ఊహించవలయును.

...... ❖ ❖ ❖ ......

శబ్దాది విషయముల గుఱించి చెప్పుచున్నాడు

**విషయా వినివర్తంతే । నిరాహారస్య దేహినః ।**
**రసవర్జం రసోఽప్యస్య । పరం దృష్ట్వా నివర్తతే ॥ 59**

విషయాః – వినివర్తంతే – నిరాహారస్య – దేహినః
రసవర్జమ్ – రసః – అపి – అస్య – పరమ్ – దృష్ట్వా – నివర్తతే

మనస్సును ఇంద్రియార్థములు లొంగతీయును

**యతతో హ్యపి కౌంతేయ । పురుషస్య విపశ్చితః ।**
**ఇంద్రియాణి ప్రమాథీని । హరంతి ప్రసభం మనః ॥ 60**

యతతః – హి – అపి – కౌంతేయ – పురుషస్య – విపశ్చితః
ఇంద్రియాణి – ప్రమాథీని – హరంతి – ప్రసభమ్ – మనః

| | | |
|---|---|---|
| నిరాహారస్య+దేహినః+ రసవర్జమ్+నివర్తతే | = | చాలాకాలము నిరాహారముగా యున్నవానికి అనగా నిరాహారముగా తపస్సు చేసినవానికి శబ్దాది విషయములు, కామవాంఛ తాత్కాలికముగా తొలగును. |
| పరమ్+దృష్ట్వా+అస్య రసః+అపి+విషయాః+ వినివర్తంతే | = | ఆత్మదర్శనం అయి స్థిరబుద్ధి గలవానికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అనే యింద్రియార్థములు వాటితో మనస్సు కలియుటచే ఏర్పడు విషయములు నశించును |
| కౌంతేయ | = | ఓ అర్జునా! |
| యతతః+అపి+ విపశ్చితః+పురుషస్య+ ఇంద్రియాణి | = | పూనికతో ఎంత నిగ్రహించినను వివేకవంతుడు అయిన పురుషుని యొక్క జ్ఞానేంద్రియములు |

| | |
|---|---|
| ప్రమాథీని+హి | = వాటి వాటి యింద్రియార్థములపై ప్రసరించి |
| ప్రసభమ్+మనః+ | బలవంతముగా మనస్సును ఆకర్షించి, అతని |
| హరంతి | నిగ్రహమును హరించుచున్నది. |

**వ్యాఖ్యానము :-** స్థిరబుద్ధిగల స్థితప్రజ్ఞునికి, ఆత్మ దర్శనము చేసిన వానికి విషయములు పూర్తిగా నశించును. దీనికి ఉదాహరణగా నారద మహర్షి చెప్పబడును. అతడు రంభాది అప్సరసలను చూచినను, స్వర్గలోక భోగములను చూచినను, వాటిని అనుభవించవలయుననేన భావన గలుగలేదు.

నిరాహారముగా ఉన్ననూ కామవాంఛ పోదు. దీనికి ఉదాహరణగా రామాయణము అరణ్యకాండలో **మాండుకర్ణుని** కథ చెప్పబడినది. ఇతడు 10 వేల సంవత్సరములు నిరాహారముగా, వాయుభక్షణ చేయుచూ, తపస్సు చేసి, చివరకు ఇంద్రుడు పంపిన పంచ అప్సరసలతో, 'పంచాప్సర' సరస్సులో గృహము నిర్మించుకొని, తపస్సుమాని, భోగించుచున్నాడని, రామునికి మునులు కథగా చెప్పిరి. కావున నిరాహారముగా తపస్సుచేసినను, ఆత్మను దర్శించనిచో అతని బుద్ధి శారీరక సుఖములపై ప్రసరించును. దీనినే అనేక కథలలో మునులు అనేక వేలాది సంవత్సరములు, నిరాహారముగా తపస్సు చేసినను, చివరకు విషయములు నశింపక పోవుటవలన, వారు అప్సరసలతో క్రీడించి, తపోభంగమైనట్లు కథలలో వర్ణింపబడును.

దీనికి ఉదాహరణగా రామాయణములో ఋష్యశృంగుని కథ చెప్పబడినది. ఋష్యశృంగుడు బాల్యమునుండి అరణ్యములో తండ్రితో నివసించుచూ, ఇంద్రియ సుఖములను ఎఱుగక తపస్సుచేయుచుండెను. ఒకానొక సమయమున అందమైన వేశ్యలు ఆ అరణ్యమునకు వచ్చిరి. కన్ను ఆ అందమైన వేశ్యల రూపమునకు ఆకర్షితమయినది. ఆ వేశ్యలు ఋష్యశృంగునికి తినుటకు మధుర పదార్థములను ఇచ్చిరి. ఆ పదార్థముల రుచివలన నాలుక ఆనందించినది. వారు చక్కని పాటలు పాడిరి. ఆ పాటలు చెవులకు వినసొంపును గలుగచేసినవి. వారు ఋష్యశృంగునుని కౌగలించుకొనిరి. ఆ స్పర్శ సుఖానుభూతిని గలుగ చేసినది. ఆవిధముగా అతడు ఆకర్షితుడై ఆ వేశ్యలవెంట అంగరాజ్యమునకు వచ్చి, రాకుమార్తె అయిన శాంతను వివాహమాడినాడు.

మనస్సు, బుద్ధి గురించి కఠోపనిషత్‌లో యిట్లు చెప్పబడినది.

**విజ్ఞాన సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః ।**
**సోఽ ధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమ్ం పదమ్ ॥**

*(కఠోపనిషత్ - తృతీయవల్లీ - 9)*

ఏ రథికుడు విజ్ఞానవంతుడయిన బుద్ధి సారథిని గలిగి ఆ బుద్ధిసారథి మనో పగ్గములచే యింద్రియములనే గుఱ్ఱములను సక్రమమార్గమున నడిపించునో అతడు సంసారము యొక్క ఆవలి ఒడ్డు అయినదియు పరమపదము అయిన ఆ సర్వ వ్యాపకత్వమయిన ఆత్మస్థానమును పొందును.

...... ❖ ❖ ❖ ......

ఇంద్రియములను నిగ్రహించినవాని బుద్ధి స్థిరముగా ఉండును

**తాని సర్వాణి సంయమ్య । యుక్త ఆసీత మత్పరః ।**
**వశే హి యస్యేంద్రియాణి । తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 61**

తాని - సర్వాణి - సంయమ్య - యుక్తః - ఆసీత - మత్పరః
వశే - హి - యస్య - ఇంద్రియాణి - తస్య - ప్రజ్ఞా - ప్రతిష్ఠితా

| | | |
|---|---|---|
| యస్య+వశే | = | ఎవని యొక్క జ్ఞానేంద్రియములు సాధకుని వశములో ఉన్నవో |
| తాని+సర్వాణి+ ఇంద్రియాణి+ సంయమ్య | = | ఆ సర్వ జ్ఞానేంద్రియములు వాటి వాటి ఇంద్రియార్థములపై ప్రసరించకుండ ఎవడు మనస్సును నిగ్రహించి వికల్పములు లేక నిశ్చలముగా నుండునో, ఎవడు |
| మత్పరః+యుక్తః+ ఆసీత | = | నా యందే అతడు, తన మనస్సును నిరంతరము ఉంచి ధ్యాననిమగ్నుడై ఉండునో |

| | | |
|---|---|---|
| తస్య+ప్రజ్ఞా+ ప్రతిష్ఠితాః+హి | = | అతనియొక్క బుద్ధి స్థిరముగా ఉండును అనగా ఆత్మయందే ప్రతిష్ఠితమై యుండును అతడు స్థితప్రజ్ఞుడనబడును. ఆ కారణమున స్థితప్రజ్ఞుడవు అగుము. |

ఏ ఒక్క ఇంద్రియము వశములో లేకున్నను పతనము తప్పదు. కావున జ్ఞానేంద్రియములను అన్నింటిని నిగ్రహించవలయును.

...... ❖ ❖ ❖ ......

బుద్ధినాశము గుఱించి చెప్పుచున్నాడు

**ధ్యాయతో విషయాన్ పుంసః । సంగస్తేషూపజాయతే ।**
**సంగాత్సంజాయతే కామః । కామాత్క్రోధోఽభి జాయతే ॥62**

ధ్యాయతః – విషయాన్ – పుంసః – సంగః – తేషు – ఉపజాయతే
సంగాత్ – సంజాయతే – కామః – కామాత్ – క్రోధః – అభి జాయతే.

**క్రోధాద్భవతి సమ్మోహః । సమ్మోహాత్ స్మృతి విభ్రమః ।**
**స్మృతి భ్రంశాద్బుద్ధినాశో । బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥ 63**

క్రోధాత్ – భవతి –సమ్మోహః – సమ్మోహాత్ –స్మృతివిభ్రమః
స్మృతి భ్రంశాత్ – బుద్ధినాశః – బుద్ధి నాశాత్ – ప్రణశ్యతి.

జ్ఞానేంద్రియములు వాటివాటి ఇంద్రియార్థములపై ప్రసరించును. అవి సుఖకరముగా ఉన్న వాటియందు అభిలాష గలుగును. ఆవిధముగా

| | | |
|---|---|---|
| విషయాన్+ధ్యాయతః+ పుంసః | = | శబ్దాది విషయములను ధ్యానించుచున్న పురుషునకు |
| తేషు+సంగః+ ఉపజాయతే | = | ఆ విషయములందు ఆసక్తి గలుగుచున్నది |

| | | |
|---|---|---|
| సంగాత్+కామః+ సంజాయతే | = | ఆసక్తివలన కామము గలుగుచున్నది. ఆ కామమువలన |
| సమ్మోహః+భవతి | = | మోహము గలుగుచున్నది. కోరిక నెఱవేఱకపోయిన |
| క్రోధః+అభిజాయతే | = | క్రోధము గలుగుచున్నది |
| కామాత్+సమ్మోహాత్+ క్రోధాత్+స్మృతివిభ్రమః | = | కామక్రోధ మోహములవలన అనగా అరిషడ్వర్గముల వలన విచక్షణా జ్ఞానము నశించుచున్నది |
| స్మృతిభ్రంశాత్+ బుద్ధినాశః | = | స్మృతిభ్రంశము వలన అనగా విచక్షణాజ్ఞానము నశించుటవలన బుద్ధినాశము గలుగును |
| బుద్ధినాశాత్+ప్రణశ్యతి | = | బుద్ధినాశమువలన జీవుడు నశించిపోవుచున్నాడు |

**వ్యాఖ్యానము :-** దీనికి ఉదాహరణగా రావణుని చిత్రీకరించినారు. శూర్పణఖ వచ్చి రావణునకు సీతయొక్క రూప లావణ్యములను గుఱించి చెప్పి ఆమెను భార్యగా చేసుకొనుమని చెప్పినది. దానిపై రావణుడు సీత అందచందాలను తలచి భార్యగా చేసుకొన తలంచెను. ఏవిధముగా సీతను లంకకు తీసుకొని వచ్చుటయా అని ఆలోచించెను. ఒక నిశ్చయమునకు వచ్చి, మారీచునుని తనకు సహాయము చేయమని ఆజ్ఞాపించెను. ఒంటరిగా వున్న సీతను చూచిన మీదట ఆమెపై అనురాగము గలిగినది. ఒంటరిగా ఈ అరణ్యములో ఏల ఉండితివని, కుశల ప్రశ్నలు వేసినాడు. సంభాషణ పరిచయమువలన సీతపై కామము కలిగినది. సీత తిరస్కారమువలన క్రోధము కలిగినది. కామము, క్రోధము వలన విచక్షణా జ్ఞానమును కోల్పోయినాడు. బుద్ధి నశించి, బలాత్కారముగా ఆమెను లంకకు తెచ్చినాడు. బుద్ధి నశించి, సీతను లంకకు తీసుకొని వచ్చి రామునిచే బంధు మిత్ర సపరివారముగా నశించిపోయినాడు.

అటులనే స్థితప్రజ్ఞునిగా విశ్వామిత్రుని కథ చెప్పబడినది. విశ్వామిత్రునికి పుష్కరమందు కనిపించిన మేనకవలన కామము, ఆ తర్వాత రంభవలన క్రోధము గలిగినను వాటి కారణములు అన్వేషించి బుద్ధితో సాధనచేసి బ్రహ్మత్వమును పొంది స్థితప్రజ్ఞుడయినాడు.

బుద్ధి నాశనము కాకుండుటకు సాధకుడు విషయములను ధ్యానించరాదు. ఆవిధముగా ధ్యానించినచో ఇంద్రియాదులను జయించలేమని కంసుడు భాగవతము దశమస్కంధము పూర్వభాగము 167వ పద్యములో ఇట్లు చెప్పినాడు.

**కం. ఒత్తి కొనుచు రానీఁ జన దెత్తిన రోగముల రిపుల నింద్రియముల ను**
**తృత్తి సమయములఁ జెఱుపక మెత్తన గారాదు రాదు మీఁద జయింపన్.**

అస్వాధీనమైన ఆత్మ గలవాడు, అనగా ఇంద్రియాదులు తన స్వాధీనములో లేని ఒకడు విషయములను ధ్యానించుచు, నశించిపోవుచున్నాడు. ఇంద్రియాదులు తన స్వాధీనములో గలవాడు విషయములను అనుభవించుచున్నను, శాంతిని పొందుచున్నాడు.

...... ❖ ❖ ❖ ......

శాంతి ఎట్లు గలుగును అని అర్జునుడు అడిగిన ప్రశ్నకు సమాధానము

**రాగ ద్వేష వియుక్తైస్తు । విషయానింద్రియైశ్చరన్ ।**
**ఆత్మవశ్యైర్విధేయాత్మా । ప్రసాదమధిగచ్ఛతి ॥ 64**

రాగ ద్వేష వియుక్తై ః - తు - విషయాన్ - ఇంద్రియైః - చరన్
ఆత్మవశ్యైః - విధేయాత్మా - ప్రసాదమ్ - అధిగచ్ఛతి

**ప్రసాదే సర్వదుఃఖానాం । హానిరస్యోపజాయతే ।**
**ప్రసన్నచేతసో హ్యాశు । బుద్ధిః పర్యవతిష్ఠతే ॥ 65**

ప్రసాదే - సర్వదుఃఖానామ్ - హానిః - అస్య - ఉపజాయతే
ప్రసన్నచేతసః - హి - ఆశు - బుద్ధిః - పర్యవతిష్ఠతే

**నాస్తి బుద్ధిరయుక్తస్య । న చాయుక్తస్య భావనా ।**
**న చాభావయతః శాంతి రశాంతస్య కుతః సుఖమ్ ॥ 66**

న – అస్తి – బుద్ధిః – అయుక్తస్య – న – చ – అయుక్తస్య – భావనా
న – చ – అభావయతః – శాంతిః – అశాంతస్య – కుతః – సుఖమ్.

| | | |
|---|---|---|
| విధేయాత్మా+తు+ | = | స్వాధీనమైన మనస్సుగలవాడు ఇంద్రియములను స్వాధీనపఱచుకొనిన విజ్ఞానవంతుడు |
| రాగద్వేషవియుక్తైః+ ఆత్మవశ్యైః+ ఇంద్రియైః+ | = | రాగద్వేషములు లేనివియు తన స్వాధీనమందున్నవియు ఇంద్రియములచేత |
| విషయాన్+చరన్+ ప్రసాదమ్+అధిగచ్ఛతి | = | విషయములను అనుభవించుచున్నను అతడు నశింపడు. అతడు శాంతిని పొందును. |
| అస్య+ప్రసన్న చేతసః+ బుద్ధిః+పర్యవతిష్ఠతే | = | స్వాధీనమయిన మనస్సు ఇంద్రియములు గలవానికి ప్రసన్నచిత్తము గలవానికి బుద్ధి సర్వవేళలా స్థిరముగా నిలుచుచున్నది. |
| సర్వదుఃఖానామ్+ హి+హానిః+ఆశు+ ప్రసాదే+ఉపజాయతే | = | సర్వ సంసార దుఃఖములయొక్క రాగ ద్వేషముల యొక్క నాశము గలిగి శీఘ్రముగా మానసిక శాంతి గలుగుచున్నది. |

**వ్యాఖ్యానము :-** ఇందు చెప్పిన విధానమును ఆచరించి శాంతిని పొందుటయే **సాధన** లేక **దీక్ష** అని అందురు. ఇంద్రియములందు రాగద్వేషములు ఉన్నవి. రాగద్వేషములున్న యింద్రియములతో చరించువాడు అశాంతిని పొందును. రాగద్వేషములు లేని యింద్రియములతో, స్వాధీనమయిన మనస్సు గలవాడు విషయములను అనుభవించుచున్నను శాంతిని పొందును. శాంతి ఎలా గలుగుతుంది? అన్న ప్రశ్నకు సమాధానం యిది. శాంతి కలుగు విధానము గుఱించి శౌనకాదులు సూతమహర్షిని అడుగగా సూతమహర్షి సాధకుడు స్థూల సూక్ష్మశరీరములు రెండింటిని జయించి ఆత్మస్వరూపుడైన వానికి శాంతి కలుగునని భాగవతము ప్రథమస్కంధమున చెప్పెను.

| | | |
|---|---|---|
| అయుక్తస్య+బుద్ధిః+<br>న+అస్తి | = | మనస్సు యింద్రియములు తన వశములో లేనివానికి, అనగా ఇంద్రియ నిగ్రహములేని వానికి. బుద్ధియు స్థిరముగా ఉండదు. అనగా అతడు అవివేకి. |
| చ | = | మఱియు |
| అయుక్తస్య+న+భావనా | = | బుద్ధిలేని వానికి మంచి చెడులను గ్రహించగల ఆలోచనయు అనగా జ్ఞానము ఉండదు. |
| అభావయతః+<br>న+శాంతిః+చ<br>అశాంతస్య+<br>కుతః+సుఖమ్ | = | విచక్షణా జ్ఞానము లేనివానికి మానసిక శాంతి ఉండదు. అశాంతి గలవానికి సుఖము ఎక్కడిది? అనగా సుఖము లేదు. |

**వ్యాఖ్యానము :-** శాశ్వత సుఖము కావాలంటే శాంతి గలగవలెను. శాంతి గలగాలంటే పరమాత్మ యందు యింద్రియములు, మనస్సు, బుద్ధి నిరంతరము ఉండవలయును. దీనినే బ్రహ్మచర్యము అందురు. ఇదే భక్తి యోగముగా నారదమహర్షి తీర్చిదిద్దినారు. దీనినే ధ్యానయోగంగా కైవల్య ఉపనిషత్ చెప్పినది.

...... ❖ ❖ ❖ ......

ఇంద్రియములు - మనస్సు

**ఇంద్రియాణాం హి చరతాం । యన్మనోఽను విధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం । వాయుర్నావమివాంభసి ॥ 67**

ఇంద్రియాణామ్ – హి – చరతామ్ – యత్ – మనః – అనువిధీయతే
తత్ – అస్య – హరతి – ప్రజ్ఞామ్ – వాయుః – నావమ్ – ఇవ – అంభసి.

| | | |
|---|---|---|
| అంభసి+నావమ్+<br>వాయుః+ఇవ | = | సముద్రమునందు గల నావను ప్రచండ వేగముతో వీచు గాలి అనగా తుఫాను నావను ముంచు విధముగా |

| | | |
|---|---|---|
| ఇంద్రియాణామ్+హి+ | = | ఇంద్రియముల యొక్క |
| చరతామ్+మనః | | యింద్రియార్థములలో సంచరించుచున్నట్టి మనస్సు |
| యత్+అనువిధీయతే+ | = | ఏ యింద్రియముతో మమేకమై ఉండునో |
| తత్+అస్య+ప్రజ్ఞామ్+ | | ఆ యింద్రియము అతని యొక్క ప్రజ్ఞను |
| హరతి | | హరించును. నశింపజేయుచున్నది. అతని బుద్ధి స్థిరముగా ఉండదు. |

**వ్యాఖ్యానము :-** వాయువు అనుకూలముగా ఉన్న నావ వేగముగా వెళ్ళును. అదే వాయువు ప్రతి కూలమయినచో నావ వేగము తగ్గును. ఆ వాయువు ప్రచండ వేగముతో వీచి తుఫానుగా మారినచో నావ మునిగిపోవును.

జ్ఞానేంద్రియములలో ఏ ఒక్క యింద్రియము అయినా దాని యింద్రియార్థముతో మనస్సు కలిసిన పతనము తప్పదు. దీనికి ఉదాహరణగా లేడికి సంగీతము ఇష్టము. ఆ సంగీతమునకు వశమై లేడి, వేటగాని చేతికి చిక్కి నశించిపోవుచున్నది. ఏనుగుకు ఆడ ఏనుగుతో స్పర్శ సుఖము ఇష్టము. దానివలన మనుష్యులు ఆడ ఏనుగును పంపి మగ ఏనుగును బంధించుచున్నారు. పురుగుకు దీపంయొక్క కాంతి ఇష్టము. దానివలన ఆ దీపములో పడి కాలిపోవుచున్నది. చేపకు తిండి ఇష్టము. దానివలన ఎఱకు చిక్కి నశించిపోవుచున్నది. కావున పంచేంద్రియముల ఉన్మాదమును తొలగించవలయును.

...... ❖ ❖ ❖ ......

బుద్ధినాశము గాకుండా ఉండుట గుఱించి చెప్పుచున్నాడు

**తస్మాద్యస్య మహాబాహో । నిగృహీతాని సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః । తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 68**

తస్మాత్ – యస్య – మహాబాహో – నిగృహీతాని – సర్వశః
ఇంద్రియాణి – ఇన్ద్రియార్థేభ్యః – తస్య – ప్రజ్ఞా – ప్రతిష్ఠితా.

| | | |
|---|---|---|
| మహాబాహో | = | ఓ అర్జునా! |
| తస్మాత్+యస్య+ | = | అందువలన ఎవనియొక్క యింద్రియములు |
| ఇంద్రియాణి+ | | వాటి వాటి యింద్రియార్థముల నుండి |

| | | |
|---|---|---|
| ఇన్ద్రియార్థేభ్యః+ సర్వశః+నిగృహీతాని | | సర్వవిధముల సర్వ యింద్రియార్థములను నిగ్రహింపబడుచున్నవో |
| తస్య+ప్రజ్ఞా+ ప్రతిష్ఠితా | = | వానియొక్క ప్రజ్ఞ అనగా బుద్ధి నశింపక ఉండును అనగా బుద్ధి స్థిరముగా ఉండును. అతడు స్థితప్రజ్ఞుడు. |

ఈ శ్లోకములో యోగి గుఱించి చెప్పబడుచున్నది.

**యా నిశా సర్వభూతానాం । తస్యాం జాగర్తి సంయమీ ।**
**యస్యాం జాగ్రతి భూతాని । సా నిశా పశ్యతో మునేః ॥ 69**

యా - నిశా - సర్వభూతానామ్ - తస్యామ్ - జాగర్తి - సంయమీ
యస్యామ్ - జాగ్రతి - భూతాని - సా - నిశా - పశ్యతః - మునేః

| | | |
|---|---|---|
| యాస్యామ్+భూతాని+ జాగ్రతి | = | ఏ పగటిపూట సర్వప్రాణులు మేలుకొని ఉండునో |
| పశ్యతః+మునేః+సా+ నిశా | = | పరమాత్మను దర్శించుచున్న మునికి అది రాత్రి |
| సర్వభూతానామ్+యా+ నిశా | = | సర్వభూతములకు ఏది రాత్రియో |
| తస్యామ్+సంయమీ+ జాగ్రతి | = | ఆ రాత్రియందు యోగి మేలుకొని ఉండును |

ఆవిధముగా ఆత్మదర్శన కాంక్షియగు మునికి మన పగలు అతనికి రాత్రిగా, మన రాత్రి అతనికి పగలుగా నుండును. సామాన్యులు యింద్రియ సుఖములలో తేలియాడుచుండగా యోగి యింద్రియములను నిగ్రహించి మనస్సును నిగ్రహించి కడు జాగరూకతతో ఉండును.

...... ❖ ❖ ❖ ......

శాంతిని పొందినవాడు పరమాత్మను పొందును

**అపూర్యమాణ మచల ప్రతిష్ఠం**
**సముద్రమాపః ప్రవిశంతి యద్వత్ ।**
**తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే**
**స శాంతి మాప్నోతి న కామకామీ । 70**

అపూర్యమాణమ్ – అచల ప్రతిష్ఠమ్ – సముద్రమ్ – ఆపః – ప్రవిశంతి– యద్వత్ – తద్వత్ – కామాః – యమ్ – ప్రవిశంతి – సర్వే –సః – శాంతిమ్– ఆప్నోతి – న – కామ కామీ.

| | | |
|---|---|---|
| సః+శాంతిమ్+ ఆప్నోతి | = | వాడు సర్వకోరికలు వదలిన స్థితప్రజ్ఞుడు శాంతిని పొందుచున్నాడు. |
| న+కామకామీ | = | కోరికలు గలవాడు శాంతిని పొందడు, అశాంతిని పొందును. |
| యద్వత్+ఆపః+ అపూర్యమాణమ్+ అచల ప్రతిష్ఠమ్+ సముద్రమ్+ ప్రవిశంతి | = | ఏ విధముగా నదీ జలములు నీటితో పరిపూర్ణముగా నిండియున్నదియును నిశ్చలముగా యున్నదియును అయిన సముద్రమును చేరి అందు కలిసి ఆ నదీజలములు కూడా సముద్రమనియే పిలువబడుచున్నవో |
| తద్వత్+ సర్వే+కామాః+ యమ్+ప్రవిశంతి | = | అట్లే సర్వ కోరికలు వీడి ఏ పరమాత్మను పొందుచున్నాడో అతడు బ్రహ్మమనియే పిలువబడుచున్నాడు. |

ఒకడు **పూర్ణకాముడు**. ఇతడు **శాంతిని** పొందును. ఇతడు నిండుకుండ. దీనికి ఉదాహరణగా భాగవతమున ప్రహ్లాదుడు ఉదహరింపబడినాడు. పరమేశ్వరుడు ప్రహ్లాదునియందుగల సకామత్వము తెలియుటకొఱకు వరములు కోరమనగా “కామంబులు విడచిన పురుషుండు నీ తోడ సమాన విభవుండగునని” పలికెను (భాగవతం–సప్తమస్కంధం–371). ఇంకొకడు కాముకుడు. ఇతడు శాంతిని పొందడు. ఇది తొణుకుతుంది

శాంతిని పొందుచున్నాడు

**విహాయ కామాన్ యః సర్వాన్ । పుమాంశ్చరతి నిఃస్పృహః ।**
**నిర్మమో నిరహంకారః । స శాంతి మధిగచ్ఛతి ॥ 71**

విహాయ – కామాన్ – యః – సర్వాన్ – పుమాన్ – చరతి – నిః స్పృహః
నిర్మమః – నిరహంకారః – సః – శాంతిమ్ – అధిగచ్ఛతి.

యః+పుమాన్+ = ఏ పురుషుడు ఇహ లోకమునకు పరలోకమునకు
సర్వాన్+కామాన్+ సంబంధించిన సర్వకోరికలు విడచి,
విహాయ వర్తించునో ఎవడు

నిఃస్పృహః+ = దేహ ధ్యాస లేక ఉదాసీనత గలిగి వర్తించునో
నిరహంకారః+నిర్మమః+ ఎవడు అహంకార, మమకారములు లేక

చరతి = వర్తించునో

సః+శాంతిమ్+ = అతడు ఆ పురుషుడు శాంతిని
అధిగచ్ఛతి పొందుచున్నాడు

**వ్యాఖ్యానము:-** అర్జునా ! నీవు శాంతి ఎలా గలుగుతుంది అని అడిగినదానికి సమాధానం చెప్పినాను. శాంతిని పొందినవాడు జీవన్ముక్తుడు. అతడు దేహత్యాగానంతరము బ్రహ్మపదవిని పొందుచున్నాడు.

...... ❖ ❖ ❖ ......

బ్రాహ్మీస్థితి, బ్రహ్మానందము

**ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ । నైనాం ప్రాప్య విముహ్యతి ।**
**స్థిత్వాస్యామంతకాలేఽపి । బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ 72**

ఏషా – బ్రాహ్మీ స్థితిః – పార్థ – న – ఏనామ్ – ప్రాప్య – విముహ్యతి
స్థిత్వా – అస్యామ్ – అంతకాలే – అపి – బ్రహ్మనిర్వాణమ్ – ఋచ్ఛతి.

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! శాంతత్వమునే |
| ఏషా+బ్రాహ్మీస్థితిః+ | = | బ్రాహ్మీ స్థితి అందురు. ఈ బ్రాహ్మీ స్థితిని పొందిన |
| ఏనామ్+ప్రాప్య+ | | మోహమును చెందదు |
| న + (ని)ముహ్యతి | | |
| అస్యామ్+స్థిత్వా+ | = | ఈ బ్రాహ్మీ స్థితియందుండి జీవన్ముక్తుడై |
| అపి+అంతకాలే+ | | శాంతత్వము కలిగి సంసారములో ఉండి కూడా |
| బ్రహ్మనిర్వాణమ్ | = | దేహ త్యాగానంతరము బ్రహ్మత్వమును, |
| ఋచ్ఛతి | | అమృతత్త్వమును పొందును. ఆత్మయై విరాజిల్లును. అమృతుడగును. |

**వ్యాఖ్యానము :-** నిష్కామ కర్మాచరణ చేసి, సర్వ కోరికలను విడచి, దేహ ధ్యాసలేక, అహంకార, మమకారములు లేక సర్వమున్ అతని దివ్య కళామయ మనుచు, విష్ణునందుల్లము చేర్చిన వాడు శాంతిని పొందును. వీరినే జీవన్ముక్తుడని అందురు. విదేహుడని అందురు. ఈ స్థితినే ఆత్మాను సంధానము చేసిన స్థితిగా, త్రిగుణాతీత స్థితిగా, శాంతిగా, బ్రాహ్మీస్థితిగా చెప్పుదురు. ఈ స్థితినే "అమృత ఇహ భవతి" – అని అందురు.

**తను దేహము అనే భావనలేక, రాగ, ద్వేషములు వదలి, సర్వకార్యములందు ఉదాసీనుడై, సర్వకోరికలను వదలి, శాంతిని పొందినవాడు బ్రహ్మీస్థితిని పొంది, దేహత్యాగానంతరము బ్రహ్మ పదవిని పొందుచున్నాడు అని స్థూలముగా చెప్పగనే అలా అయితే పుణ్యకర్మలు ఎందుకు చేయవలయును? అని అర్జునుడు రాబోవు అధ్యాయంలో ప్రశ్నించగా ఈ అధ్యాయములో చెప్పిన విషయములనే మతికొంత విపులముగా 27,28,29,30 అధ్యాయములలో చెప్పుచున్నాడు. వీటిని విడివిడిగా కాక సమష్టిగా అధ్యయనము చేసిన విషయము చక్కగా అర్థమగును. సాధన పద్ధతి ఏది అయినా స్థితప్రజ్ఞత్వమును కలిగి, శాంతిని పొంది బ్రాహ్మీస్థితిని పొందవలయును. వ్యవసాయకాబుద్ధులు చెప్పు సారాంశము యిదియే.**

...... ❖ ❖ ❖ ......

# సమీక్ష

26వ అధ్యాయములో సంక్షిప్తముగా చెప్పిన విషయములనే 27వ అధ్యాయము నుండి 30వ అధ్యాయము వఱకు విపులముగా 27, 28, 29, 30 అధ్యాయములలో చెప్పబడుచున్నవి. 27వ అధ్యాయములో 43 శ్లోకములు, 28వ అధ్యాయములో 42 శ్లోకములు, 29వ అధ్యాయములో 29 శ్లోకములు, 30వ అధ్యాయములో 47 శ్లోకములు కలవు. వీటిని మొదట కథాభాగముగాను, ఆధ్యాత్మిక భాగముగాను అర్జునుడు వేసిన ప్రశ్నలుగా మఱియు శాస్త్రపాఠముగా అధ్యయనము చేయవలసి యుండును. ఈ అధ్యాయములను విడివిడిగా చదువుటకంటె సమిష్టిగా చదివిన విషయము చక్కగా బోధపడును.

**అర్జునుని ప్రశ్నలు :**

**కథాభాగము :** 'మామ్ ఘోరే కర్మణి కిం నియోజయసి' అనగా యుద్ధములో ఎవరు జయించెదరో చెప్పకనే నన్ను యుద్ధము చేయమని గొప్ప జననష్టము కలిగించు ఘోరమైన యుద్ధకర్మయందు ఏల నియోగించుచున్నావు?

**ఆధ్యాత్మిక విభాగము :**

**1. కర్మణం బుద్ధిః జ్యాయసీ చేత్ కిం కర్మణి మామ్ నియోజయసి?**

**2. యేన అహం శ్రేయః ఆప్నుయామ్ తత్ ఏకమ్ నిశ్చిత్య వద?**

అనగా జ్ఞానము పుణ్యకర్మానుష్ఠానముకంటే శ్రేష్ఠమైనది అయినచో నన్ను పుణ్యకర్మానుష్ఠానము చేయుమని ఏల చెప్పుచున్నావు/ఏల నియమించుచున్నావు? జ్ఞానము, పుణ్యకర్మానుష్ఠానములలో ఏది శ్రేష్ఠమో ఆ ఒక్కదానినే చెప్పుము.

కర్మ చేయునపుడు 'కిం కర్మ, కిం అకర్మ, కిం వికర్మ ఇతి బోద్ధవ్యమ్'. ఏది కర్మ ఏది వికర్మ ఏది అకర్మయో తెలియవలయును.

**3. అయం పూరుషః కేన బలాత్ ఇవ నియోజితః కేన ప్రయుక్తః పాపమ్ చరతి?**

అనగా దేహి దేనిచేత బలవంతముగా నియోగింపబడి మఱియు ప్రేరేపింపబడి పాపమును చేయుచున్నాడు?

**4. అపరం భవతః జన్మ వివస్వతః జన్మ పరమ్. త్వం ఆదౌ ప్రోక్తవాన్ ఇతి కథమ్ విజానీయామ్?**

అనగా వసుదేవునికి, దేవకికి జన్మించిన నీవు సూర్యునకు ఎట్లు చెప్పితివి?

**5. కర్మణామ్ సన్న్యాసమ్ పునః యోగమ్ శంససి. ఏతయోః యత్ శ్రేయః తత్ ఏకమ్ సునిశ్చితమ్ బ్రూహి?**

అనగా సాంఖ్యమును ప్రశంసించి మరల యోగమును ప్రశంసించుచున్నావు. ఏది ఈ రెండింటిలో శ్రేయస్సును కలిగించునో ఆ ఒక్కదానినే చెప్పుము.

**6. చంచలత్వాత్ ఏతస్య స్థిరామ్ స్థితిమ్ అహమ్ న పశ్యామి?**

అనగా మనస్సు చంచలమగుటవలన దాని స్థిరత్వస్థితిని నేను కనుగొనకున్నాను. అనగా మనస్సును నిగ్రహించుట ఎట్లు?

**7. యోగాత్ చలిత మానసః యోగ సంసిద్ధిమ్ అప్రాప్య కామ్ గతిమ్ గచ్ఛతి. శ్రద్ధయా ఉపేతః కామ్ గతిమ్ గచ్ఛతి. అప్రతిష్ఠః కశ్చిత్ ఛిన్న అభ్రమ్ ఇవ ఉభయ విభ్రష్టః న నశ్యతి?**

అనగా యోగములో చలింపబడిన మనస్సు గలవాడు యోగసిద్ధిని పొందక అనగా యోగభ్రష్టుడు అయినవాని గతి ఏమి? శ్రద్ధతో యోగమును చేసినవాని గతి ఏమి? ఆత్మను దర్శించియూ ఇంద్రియములతోడి సంగమము విడువని వాని గతి ఏమి? అతడు నశించిపోవునా ఏమి?

**శాస్త్ర పాఠము :**

అర్జునుడు వేసిన ప్రశ్నలకు శాస్త్రపాఠమును చెప్పుచున్నాడు.

**బ్రహ్మవిద్య - బ్రహ్మవిద్యయొక్క విశిష్టత :**

రహస్యం - అనగా రహస్యమైనది.

ఉత్తమమ్ - ఉత్తమమమైనది.

పురాతనమ్ - పురాతనమైనది. అనగా సృష్ట్యాదియందు బ్రహ్మకు పరమాత్మ చెప్పినది.

**గురువుయొక్క అర్హతలు :** ఇవి శ్రీకృష్ణుని పరముగా చెప్పబడినవి. గురువు వేదవేదాంగములు అధ్యయనము చేసి నిష్కామ కర్మావలంబియై, ద్వంద్వాతీతుడై, శాంతస్వభావుడై ఆత్మను దర్శించి, ఆత్మస్వరూపుడై ఉండవలయును.

**శిష్యునియొక్క అర్హతలు :** ఇవి అర్జునుని పరముగా చెప్పబడినవి. 1. ముండక ఉపనిషత్తులో చెప్పినట్లు పుణ్యకర్మల ఫలితమునందు నిర్వేదమును పొందినవాడై పునరావృత్తి రహితమగు ఆత్మస్థానమును పొంది ఆత్మయై విరాజిల్లవలెనని అభిలాష కలిగి, కైవల్య ఉపనిషత్తులో చెప్పినట్లు శ్రద్ధ, భక్తి, ధ్యాన యోగములు కలిగి భక్తుడై ఉండవలయును. ప్రియమిత్రుడై ఉండవలయును. ఉపనిషత్తుల్లో ఇతనిని సౌమ్య అని అందురు. గురువుతో ఎన్నటికీ విభేదించనివాడై ఉండవలయును. అనగా తైత్తిరీయ ఉపనిషత్తులో చెప్పినట్లు 'సహనౌ అవతు.... మా విద్విషావహై...'

## బ్రహ్మవిద్యయొక్క కొన్ని గురుపరంపరలు



ఆత్మ / ఆదిపురుషుడు
|
విరాట్ పురుషుడు (నారాయణుడు)
|
బ్రహ్మ

1. మరీచి → కశ్యపుడు → సూర్యుడు → వైవస్వతమనువు → ఇక్ష్వాకు → రాజర్షులు

ఈ పరంపరయే
ఈ సర్గలో చెప్పబడినది.

2. అథర్యుడు → అంగిరసుడు → సత్యవహుడు → అంగిరసుడు → శౌనకుడు

3. అశ్వలాయనుడు → పిప్పలాదుడు → కబంధీ → కౌశల్యుడు → సౌర్యాయణి → సత్యవహుడు → సుకేతుడు → విదర్భదేశస్థుడు (ఇతని పేరు చెప్పలేదు)

4. యముడు → నచికేతుడు

బ్రహ్మ → 5. నారదుడు → వ్యాసుడు → శుకబ్రహ్మ → సూతమహర్షి (పరీక్షిత్ గురుపరంపరలో చేరలేదు) → శౌనకాదులు

బ్రహ్మ → **6. సాందీపుడు** → **శ్రీకృష్ణుడు** → **ఉద్ధవుడు** → **పూర్ణయ్యగారు** → **మార్నూరి నంబి** → **పోతన** → **వేమన** → **మా గురువుగారు**

(శ్రీకృష్ణుడు మైత్రేయునకు అర్జునునకు చెప్పెను. అర్జునుడు గురుపరంపరలో చేరలేదు).

కాలానుసారము గురుశిష్యులు మారుదురు. కాని శాస్త్రపాఠము, ఆచరణలలో మార్పు ఉండదు.

బ్రహ్మవిద్య కాలక్రమమున నశింపలేదుగాని, నష్టమైనది. అటులనే కొంతవఱకే గురుపరంపర తెలియునుగాని నేటివఱకు వున్న గురుపరంపర తెలియదు.

**ఆత్మ :** అజః, నిత్యమ్, అవ్యయమ్ – అవ్యయాత్మ, నిర్దోషమ్ – అనగా శుచిః , సర్వభూతానామ్ సుహృదయః (సర్వభూతములకు సముడు), లోకస్య ప్రభుః – సర్వలోకమహేశ్వరమ్. భూతానామ్ ఈశ్వరః, యజ్ఞ తపసా భోక్తారమ్. యజ్ఞే ప్రతిష్ఠితమ్. అకర్తారం సాక్షి.

**హృదయగత ఆత్మ :** సర్వగతః, సర్వవ్యాపి హృదయగత ఆత్మకు దేహి చేయు పుణ్యపాపములకు కర్తృత్వము లేదు. కర్మఫలమును స్వీకరింపదు సాక్షి.

**విరాట్పురుషుడు :** స్వకీయ మాయచే స్వయంభువునిగా ఆవిర్భవించి తనవల్ల కలిగిన ప్రకృతిని అధిష్ఠించి విరాట్పురుషుడై సృష్టి, స్థితి, లయములనే కర్మలు చేయుచున్నాడు. అయిననూ ఈ కర్మలయందు ఫలాసక్తి లేనందున ఆ కర్మలు విరాట్పురుషునికి బంధములు కావు.

**ప్రకృతి :** ప్రకృతివలన సత్త్వ, రజో, తమో, గుణములనే మూడు గుణములు కలిగినవి.

**సృష్టి :** విరాట్పురుషుడు గుణకర్మ విభాగముచే సత్త్వగుణము గల వర్ణము, రజోగుణముగల వర్ణము, తమోగుణముగల వర్ణము, మిశ్రమగుణముగల వర్ణముగా సర్వప్రాణికోటిని చాతుర్వర్ణములుగా సృజియించెను. దీనిని ప్రారంభసృష్టి అని అందురు. ఈవిధముగనే సర్వప్రాణికోటిని బ్రహ్మ సృజియించెను. దీనిని అనంతర సృష్టి అని అందురు. ప్రజాపతులు చేసిన సృష్టిని ప్రజాపతుల సృష్టి యోగసృష్టి అని అందురు. స్త్రీ, పురుషులవలన, అన్నమువలన కలిగిన వీర్యముచే ఏ జీవరాశి ఆ జీవరాశిని సృజియించుచున్నది. దీనిని మిథునధర్మ సృష్టి అని అందురు.

**జీవుడు /దేహి :** జీవులు విశిష్ట పురుషులు (అవతారపురుషులు)గను, సామాన్య జీవులుగను విభజింపబడిరి.

అవతారపురుషులు – వీరిలో కొందఱు స్వయంభువులు. కొందఱు బ్రహ్మవలన

అయోనిజ సృష్టిలో కలిగిరి. కొందఱు ప్రజాపతులవలన కలిగిరి. ఒక మహానుభావుడు సూర్యవంశమున (రాముడు), ఒక మహానుభావుడు చంద్రవంశమున (కృష్ణుడు), రాక్షసులను సమ్మోహపఱచుటకు ఒక మహానుభావుడు (బుద్ధుడు) అవతరించెను. కలియుగాంతమున ఒక మహానుభావుడు (కల్కి)గా అవతరించగలడు. బుద్ధుని తర్వాత కల్కి వఱకు మధ్యలో అవతారములు లేవు.

**అవతార ప్రయోజనము -**

**యదా యదా హి ధర్మస్య । గ్లానిర్భవతి భారత ।**
**అభ్యుత్థాన మధర్మస్య । తదాత్మానం సృజామ్యహమ్ ॥** (జ్ఞానయోగము - 7)
**పరిత్రాణాయ సాధూనాం । వినాశాయ చ దుష్కృతామ్ ।**
**ధర్మ సంస్థాపనార్థాయ । సంభవామి యుగే యుగే ॥** (జ్ఞానయోగము - 8)

అనగా ధర్మమునకు హాని కలిగినపుడు, అధర్మమునకు వృద్ధి కలిగినపుడు, ధర్మసంస్థాపనకొఱకు అవతరించును.

**అవతారములను తత్త్వరీత్యా గ్రహించిన కలుగు ప్రయోజనము:**

యజ్ఞవరాహావతారము తప్ప మిగిలిన అవతారముల గుఱించిన విషయములు వేదములలో లేవు అని తెలిసియు వ్యాసభగవానుడు అవతారములలో చెప్పిన జన్మ, కర్మలను తత్త్వరీత్యా గ్రహించి ఆచరించినవాడు ఆత్మస్వరూపుడగును. పునర్జన్మను పొందడు.

**జీవేశ్వరులకు గల భేదము:** జీవేశ్వరులకు అనేక అవతారములు / జన్మలు గతించినవి. ఈశ్వరునకు తన గత అవతారములన్నియు గుర్తుండును. సామాన్య జీవులకు తన గతజన్మలు గుర్తుండవు. ఈశ్వరుడు దేహి చేయు పాపపుణ్యములను స్వీకరించడుగాని, దేహికి పాపపుణ్యముల ఫలితమును కలుగజేయుచున్నాడు.

దేహి తన స్వభావమును అనగా ప్రకృతివలన కలిగిన గుణములను అనుసరించి ప్రవర్తించుచున్నాడు.

**దేహిలో భేదము :** 1. పాపాత్ముడు- విధివిహితముగా పుణ్యకర్మలు అనగా యజ్ఞయాగాదులు చేయనివాడు, పాపకర్మలు చేయువాడు పాపాత్ముడు. వీడు నరకము పాలగును. పాపకర్మకు అరిషడ్వర్గములనే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు కారణములు.

2. వ్యర్థజీవి/ మూఢుడు – సంసారములో ఉండి పుణ్యకర్మలు చేయనివాడు, ఇంద్రియారాముడు అయినవాడు వ్యర్థజీవి.

3. పుణ్యకర్మానుష్ఠానముగా చెప్పబడే కర్మయోగము, అటులనే సాంఖ్యయోగము చేయువారు పుణ్యాత్ములు. ఈ పుణ్యకర్మలలో కామ్యకర్మపరులు, నిష్కామకర్మపరులు అని రెండు తరగతులవారు కలరు. నిష్కామకర్మపరుని పండితుడని, జ్ఞానియని, స్థితప్రజ్ఞుడని, ఋషులని, మునులని, జీవన్ముక్తులని మొదలైన అనేక పేర్లతో పిలుతురు.

సర్వులు ప్రకృతివలన కలిగిన గుణములద్వారా పాప, పుణ్యయుత కర్మలు చేయుచున్నారు. ఆవిధముగా దేహివిచారణలో అజ్ఞాని, జ్ఞాని అని రెండు తరగతులు కలవు. అజ్ఞాని పుణ్య, పాపకర్మలకు తను కర్తనని భావించుచూ, భోక్తయై ఆ పాపపుణ్యములను అనుభవించుచున్నాడు. అజ్ఞాని పాపకర్మలు చేయకుండా ఉండవలయునని నిగ్రహించిననూ, అతని నిగ్రహము నిలవదు. అజ్ఞాని, అశ్రద్ధ కలవాడు, సంశయాత్ముడు వీరు ఆత్మస్థానము చేరక నశించెదరు. అనగా జన్మపరంపరలో చిక్కుకొందురు. ప్రకృతివలన జనియించిన గుణములే పుణ్య, పాపకర్మలకు కారణమని, తను కర్తను కానని జ్ఞానులు భావింతురు.

**దేహ విచారణ –** సమిష్టిస్వరూపమైన దేహము నవద్వారములు గలది. ఈ దేహములో దేహి వసించును. వ్యష్టిలో కర్మేంద్రియములకంటె జ్ఞానేంద్రియములు, జ్ఞానేంద్రియముల కంటె ఇంద్రియార్థములు, ఇంద్రియార్థములకంటె మనస్సు, మనస్సు కంటే బుద్ధి, బుద్ధికంటే మహత్తు, మహత్తుకంటే ప్రకృతి, ప్రకృతి కంటే ఆత్మ శ్రేష్ఠమని ఇందు చెప్పినదానికి కఠోపనిషత్తు ఆధారము. ఆత్మకంటే శ్రేష్ఠమైనది ఏదియూ లేదు.

కర్మేంద్రియములు – ఇవి మనస్సు చెప్పిన పనులు చేయును.

జ్ఞానేంద్రియములు – జ్ఞానేంద్రియములు వాటివాటి ఇంద్రియార్థములపై ప్రసరించును. అనగా చెవులు, చర్మము, కన్నులు, నాలుక, ముక్కు అను జ్ఞానేంద్రియములు శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అను ఇంద్రియార్థములపై పనిచేయును. అనగా ఈ జ్ఞానేంద్రియములు ఇంద్రియార్థములను గ్రహించును. అయితే ఈ జ్ఞానేంద్రియములు అసంకల్పితముగా ఇంద్రియార్థములపై ప్రసరించిన మనస్సులో ఏ భావమూ కలుగదు. ఉదాహరణకు మనము రోడ్డుపై

నడచుకొంటూ వెళ్ళుచుండగా అనేకమంది స్త్రీలను చూచిననూ, మనస్సులో ఎట్టి వికారమూ కలుగదు. కావున జ్ఞానేంద్రియములు వాటి వాటి ఇంద్రియార్థములపై ప్రసరించి మన సంకల్పానుసారము మనస్సు వాటితో సంయోగము చెందిన అవి విషయేంద్రియములగును. అప్పుడు రాగద్వేషములు ఇంద్రియార్థముల వలన కలుగుచున్నవి. ఇంద్రియార్థములకు రాగద్వేషములకు జ్ఞాని వశము కారాదు.

కామము (కోరిక) – తమోగుణ, రజోగుణయుతమైన మనస్సు ఇంద్రియార్థములతో మన సంకల్పానుసారము సంయోగము చెంది, రాగము కలిగించు స్థితిని కామము అని అందురు. ఇంద్రియార్థములను అనుభవించవలయుననే కోరిక కలుగుటనే కామము అని అందురు. అయితే ఈ కామములన్నింటిలో స్త్రీ సంభోగేచ్ఛ బలవత్తరమైనది. కామము ఎంత అనుభవించినా తృప్తి లేనిది. అగ్నివలె దేహిని దహించివేయును. పూరింప శక్యముకానిది. జ్ఞానవిజ్ఞానులను నాశనము చేయునది. పొగచే అగ్ని, మురికిచే అద్దము, మావిచే గర్భస్థశిశువు కప్పబడినట్లు ఈ కామము అనేదానిచే జ్ఞానము కప్పబడియున్నది. ఈ కామము మహాపాపకారణము. జ్ఞానికి నిత్యవైరి. అనగా నిత్య శత్రువు. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఈ కామమునకు అధిష్ఠానము. సర్వకోరికలను వదలివేయవలయును. కోరికలు దుఃఖహేతువులు. సత్త్వగుణప్రధానమైన మనస్సులో రాగముండనందున కామము కలుగదు. ఉదాహరణకు రంభను చూచిన రావణుడు ఆమెను బలాత్కరించి, ఆమెతో సంభోగ సుఖమును అనుభవించినాడు. రజోగుణయుతుడైన **మహాభిషు** బ్రహ్మలోకమునందు గంగను చూచి కామవశుడగుటవలన బ్రహ్మ శాపముచే **శంతనుడిగా** పుట్టి గంగతో సంసారము చేసినాడు. పురూరవుడు ఊర్వశితో చాలాకాలము సంసారసుఖము పొందిననూ అతనికి విరక్తి కలుగలేదు. అటులనే యయాతి దేవయానితో తనకు కామము ఎంత అనుభవించిననూ తృప్తి కలుగలేదని భారతములో చెప్పును.

అయితే శుద్ధసత్త్వగుణప్రధానుడైన నారదుడు రంభాది అప్సరసలను చూచిననూ, వారిని అనుభవించవలెననే కోరిక కలుగలేదు. కావున శుద్ధసత్త్వగుణమైన మనస్సు కలిగి దుర్జయమైన ఈ కామమును (కోరికలను) జయించవలయును. ఇంద్రియార్థములపై ఆసక్తి లేనివాడు అనగా కోరికలు లేనివాడు ఆత్మానందమును

పొందును. జ్ఞానేంద్రియములద్వారా మనస్సులో కోరిక కలిగి ఆ కోరికను కర్మేంద్రియముల ద్వారా పొందు సుఖభోగములు ఆది, అంతము కలవి. ఈ విషయమునే నచికేతుడు యమునితో చెప్పినట్లు కఠోపనిషత్‌లో కలదు. ఇంద్రియార్థములు దుఃఖమునకు స్థానములైనవి. కావున బుధులు ఇంద్రియార్థములతో రమింపరు. వాటివలన కలుగు సుఖదుఃఖములకు విచలితులు కారు. ఆనందింపరు.

**కర్మ:** అక్షరుని (ఆత్మ)వలన విరాట్పురుషుడు, విరాట్పురుషునివలన బ్రహ్మ, బ్రహ్మ వలన కర్మ కలిగినది. కర్మ అను పదమునకు విస్తృతార్థము కలదు. దేహి, దేహేంద్రియ మనోబుద్ధులచే చేయబడు సర్వపనులూ కర్మకింద విభాగింపబడును. శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధిచేత జీవుడు కర్మలు చేయును.

**ఇహలోకమునకు సంబంధించిన కర్మ:** 1. దేహనిర్వహణకు సంబంధించిన కర్మ– కాలకృత్యములు, స్నానము, ఆహారము, నిద్ర, గాలి పీల్చుట, వదలుట ఇవి అన్నియూ దేహనిర్వహణకు సంబంధించిన కర్మలు. ఈ కర్మలు చేయకుండా ఎవడును ఉండజాలడు. శరీరసంబంధమైన కర్మలు చేయనివానికి దేహనిర్వహణ సరిగా జరగదు. **న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।** (కర్మయోగము – 5)

2. వృత్తి వ్యాపారాదులు చేసి ధనము సంపాదించుట మఱియు దేహసంబంధీకుల యెడ తన విధులు, బాధ్యతలు నెఱవేఱ్చుట. అనగా తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు, భార్యాపిల్లలు, బంధువులు, మిత్రులయెడ విధులు, బాధ్యతలు నెఱవేఱ్చుట. దీనికి సంసారమనియు, భవసాగరమనియు అందురు. ఈ కర్మ బంధమును కలిగించును. మోక్షార్థి ఈ కర్మలను తామరాకుపై నీటిబొట్టువలె సంసారములో ఉండియూ, సామాన్యునివలె సంసారతాపత్రయములలో చిక్కుకొని నిజకుటుంబ పారవశ్యమున ఉండక, అవసరమైనంతమేరకు ఈ కర్మలను చేయుచూ, తాబేలువలె సంసారములో ప్రవర్తించును.

3. జాతి, ఆశ్రమధర్మములు పాటించుట. సృష్ట్యాదియందు గుణకర్మవిభాగము వలన జాతి, ఆశ్రమ ధర్మములు విధింపబడినవి.

వేదకాలములో సర్వులూ వారివారి జాతి, ఆశ్రమధర్మములు పాటించెడివారు. గుణకర్మవలన ఏర్పడిన జాతులు అనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములు మఱియు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములు కలిగి సర్వులూ జాతి, ఆశ్రమ ధర్మములను పాటించెడివారు. కలియుగములో ఇవి అపభ్రంశము చెందినవి.

*(ఇటు గృహస్థాశ్రమమునకు అటు సన్యాసాశ్రమమునకు చెందని మఠాధిపతులనే కొత్త ఆశ్రమము కలియుగములో చోటు చేసుకొన్నది.)* మోక్షార్థియైనవాడు జాతి, ఆశ్రమ ధర్మములను పాటించవలయును. మోక్షమునకు ఆటంకమైన సర్వవిషయములనూ అనగా త్రిగుణములను, రాగద్వేషములను, అరిషడ్వర్గములను విడువవలయును. ఆవిధముగా వీటిని విడిచి పరమాత్మను సేవించవలయును. ఈ విషయమునే భాగవతములో ఇట్లు చెప్పబడినది.

చ. **తన కులధర్మమున్ విడిచి దానవవైరి పదారవిందముల్**
**పనివడి సేవ సేసి పరిపాకము నొందక యెవ్వఁడేనిఁ జ**
**చ్చిన మఱు మేన నైన నది సిద్ధి వహించుఁ దదీయ సేవఁ బా**
**సినఁ గుల ధర్మగౌరవము సిద్ధి వహించునె యెన్ని మేనులన్!**

(భాగవతము ప్రథమస్కంధము-100)

అనగా తన కులధర్మములను పాటించుచూ త్రిగుణములను విడచి, భగవంతుని సేవించవలయును.

**నియతం కురు-కర్మ** అని ఇందు చెప్పబడినది. స్వధర్మాచరణ శ్రేయస్కరము. స్వధర్మాచరణములో మరణము మేలు. పరధర్మము అనగా ఇతర జాతివారికి చెప్పిన ధర్మములు ఆచరింపరాదు. బాగుగా అనుష్ఠించిన పరధర్మముకంటే గుణము లేనిదైననూ స్వధర్మాచరణ శ్రేయస్సు. పరధర్మాచరణ భయమును కలిగించును.

**పరలోకమునకు సంబంధించిన కర్మ -** ప్రకృతివలన జనియించిన త్రిగుణములవలన దేహి అస్వతంత్రుడై (అవశుడై) ఊర్ధ్వ, అధోలోక ప్రాప్తికి కారణమైన పుణ్య, **పాపకర్మ** చేయుచున్నాడు. **పూర్వజన్మ కర్మవాసనచే నియోగింపబడి, అరిషడ్వర్గములచే ప్రేరేపింపబడి** దేహి పాపమును చేయుచున్నాడు. తమోగుణ, రజోగుణమువలన పాపము చేయుచున్నాడు. ఈ పాపకర్మ కర్మేంద్రియములద్వారా జరుగును. దూషణ, పరుషవాక్కు, నింద, చాడీలు, కొంటె మాటలు చెప్పుట ఇవి అన్నియూ నోరు ద్వారాను, హింస, వధ, పరిగ్రహము (అపాత్రుల వద్దనుండి దానము స్వీకరించుట) మొదలైనవి చేతులద్వారాను, పాపస్థలములకు వెళ్ళుట, అనగా జూదశాలలు, పానశాలలు, వేశ్యావాటికలకు వెళ్లుట అనునవి పాదముల

ద్వారాను, పరాయి స్త్రీని బలాత్కారముగా అనుభవించుట మొదలైనవి గుహ్యము ద్వారాను చేయబడు పాపకర్మలు. అటులనే వేదవిహితము గాని పుణ్యకర్మలు పాపములు కలుగజేయును. (*నేడు మనము చేయు పుణ్యకర్మానుష్ఠానమంతయూ వేదవిరుద్ధము. కావున, ఇవి పాపమును కలుగజేయును. పాపకర్మ నరకమును కలిగించును. నరకములో బాధలనుభవించి తిరిగి భూలోకమున నీచజన్మలు ఎత్తుదురు.*)

**పుణ్యకర్మ :** ఇది మరల కామ్యకర్మ, నిష్కామకర్మ అని రెండు విధములు. వేదవిహిత పుణ్యకర్మలు మానుటకంటె పుణ్యకర్మలు చేయుటమంచిది. వేదవిహిత పుణ్యకర్మలు ఆచరింపకపోవుటవలన నైష్కర్మ్యము అనగా జ్ఞానము కలగదు.

**కామ్యకర్మ :** వేదవిహితముగా పుణ్యకర్మలు కామ్యకర్మపరులు చేయుదురు. వీరు ఇహలోక, పరలోకమునందు గల సుఖభోగములకై ఈ కామ్యకర్మలను ఆచరించుదురు.

**యా మిమాం పుష్పితాం వాచం । ప్రవదంత్య విపశ్చితః ।**
**వేదవాద రతాః పార్థ । నాన్యదస్తీతి వాదినః ॥**

**కామాత్మానః స్వర్గపరా । జన్మకర్మఫల ప్రదామ్**
**క్రియావిశేష బహులాం । భోగైశ్వర్య గతిం ప్రతి ॥**

**భోగైశ్వర్య ప్రసక్తానాం । తయాపహృతచేతసామ్ ।**
**వ్యవసాయాత్మికా బుద్ధిః । సమాధౌ న విధీయతే ॥**

(సాంఖ్యయోగము - 42-44)

ఈ కామ్యకర్మలో ఇహలోకములకు సంబంధించిన భోగములు, ఐశ్వర్యములు పొందుటకు అనేక క్రియలు చెప్పుదురు. ఇవి కంటికి ఆనందమును కలిగించు పూవులవలె ఈ మాటలు చెవికి ఇంపును కలిగించును.

కామ్యకర్మలోని దోషము - ఈ మాటలచే ఆకర్షింపబడిన మనస్సు గలవారలకు అనగా ఈ కామ్యకర్మపరులకు నిశ్చయాత్మకమైన బుద్ధి కలుగదు. అనగా ఆత్మయై విరాజిల్లవలయుననే బుద్ధి కలుగదు. వీరు బ్రహ్మలోకము చేరి పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మింతురు. ఈ మాటలు చెప్పువారు, వారిని అనుసరించువారు

ఈ పుణ్యకర్మలకు తను కర్తనని భావించువారు కర్మబద్ధులగుచున్నారు. వీరు ఆత్మస్థానమును చేరి తిరిగి పుణ్యము క్షీణించగనే భూలోకమున జన్మించెదరు. వీరిని అజ్ఞాని అనియూ, గుడ్డివాళ్ళనియూ, పండితమన్యులనియూ చెప్పుదురు. కామ్యకర్మను వ్యాసభగవానుడు అవ్యవసాయకాబుద్ధి అని నామకరణము చేసినాడు. ఈ కామ్యకర్మ బంధమును కలిగించును.

**నిష్కామకర్మ –** నిష్కామకర్మపరులు వేదవిహితముగా పుణ్యకర్మ చేయుదురు. కానీ పుణ్యఫలితమును కోరరు. అందువలన వీరు కర్మబద్ధులు కారు. ఫలాసక్తి లేనివాడు, కర్మబద్ధుడు కాడు. ఈ నిష్కామకర్మవలన వీరు బ్రహ్మలోకమును పొందుదురు.



**వేదవిహిత కర్మ**

| కర్మ | వికర్మ | అకర్మ |
|---|---|---|
| వేదము చెప్పినంత మేరకు వేదవిహితముగా చేయబడు కర్మ | (కర్మబాహుళ్యము) | (అపభ్రంశము) |

ఈ సర్గలలో కర్మబాహుళ్యమునకు వికర్మ అనియు, అపభ్రంశమునకు అకర్మ అనియు చెప్పిరి.

పుణ్యకర్మాచరణ చేయుచూ కర్మ, వికర్మ, అకర్మలను గుఱించి తెలియవలయును. ఈ విషయమున బుద్ధిమంతులు కూడా సరియైన జ్ఞానమును లేక ఉన్నారు. (మోహమును పొందుచున్నారు). పుణ్యకర్మాచరణ చేయుచూ కర్మబాహుళ్యమైన వికర్మను, అపభ్రంశమైన అకర్మను చేయరాదు. కర్మఫలితమునందు ఆసక్తి లేక పుణ్యకర్మలను ఆచరించవలయును. వీరు పరమపదమును పొందిరి. జనకాదులు ఈవిధముగా ఆచరించి సిద్ధిని పొందిరి. పెద్దలు చేయు పనిని పిన్నలు చేయుదురు గాన పెద్దలు నిష్కామముగా, శ్రద్ధగా పుణ్యకర్మలు ఆచరించవలయును.

శ్రీకృష్ణుడు తన పరముగా చెప్పుచున్నాడు. 1. పుణ్యకర్మానుష్ఠానమునందే ప్రవర్తించుచున్నాను. 2. తను కర్మలు చేయనిచో ప్రజలు కూడా చేయరు. ఆవిధముగా ప్రజలు ఉభయభ్రష్టులగుదురు. పూర్వము అనగా సృష్ట్యాదియందే గుణకర్మ విభాగము అనుసరించి రెండు నిష్ఠలు పరమాత్మచే చెప్పబడినవి. కర్మణ్యులకు కర్మయోగము అనగా పుణ్యకర్మ, యోగము, భక్తి అనునవి చెప్పబడినవి. జ్ఞానులకు / సాంఖ్యులకు నైష్కర్మ్యము, కర్మసంన్యాసము, బుద్ధిసంపన్నత కలిగియుండుట మొదలైన విషయములు చెప్పబడినవి. కర్మయోగము, సాంఖ్యము అను ఈ రెండింటి వలన ఆత్మస్థానమును చేరుదురు. కావున ఈ రెండునూ శ్రేష్ఠములే. అయితే పుణ్యకర్మానుష్ఠానము చేయకుండా జ్ఞానము పొందుట కష్టము. ఆచరణలో కర్మయోగము కంటే సాంఖ్యము కష్టము.

పుణ్యకర్మయోగములో భేదము – శ్రద్ధావంతునకు జ్ఞానము కలుగును. పుణ్యకర్మలు వేదవిహితముగా చేయవలయును. స్వాధ్యాయము ఇది ధనముతో పనిలేనిది. దీని గుఱించి వేదవ్యాసుడు చెప్పినదానిని పోతన ఈవిధముగా అనువదించినాడు.

**త్రైవర్ణికాధములకు వేదములు విననర్హంబులు కావు**. (ప్రథమ స్కంధము – 84). అనగా జాతిధర్మములు, ఆశ్రమ ధర్మములు పాటింపనివారికి వేదములు వినుటకు అర్హత లేదు. మేధావిహీనులైన పురుషులచేత నట్టి వేదంబులు ధరియింపబడుచున్నవి. (ప్రథమ స్కంధము – 84). అనగా వేదములో చెప్పినవాటి అర్థతాత్పర్యములు గ్రహింపక చిలుక పలుకులవలె వేదములు మేధావిహీనులు చదువుచున్నారు. వేదములు అధ్యయనము చేసియూ, వేదములో చెప్పిన కామ్యకర్మలను ఆచరించుచూ ఇతరులచే ఆచరింపచేయువారిని పండితమన్యులు అని అందురు. వేదములు అధ్యయనము చేసి నిష్కామకర్మగా పుణ్యకర్మలు ఆచరించి ఆత్మస్థానమును చేరి అధికార పురుషులై విరాజిల్లెడివారు వేదజ్ఞులు. వీరు మాత్రమే పండితులు.

ద్రవ్యయజ్ఞములు – వేదములో చెప్పిన వ్రతములు మఱియు యజ్ఞములు మొదలైనవి. హోమద్రవ్యములను, పశువులను అగ్నిలో వ్రేల్చి యజ్ఞము చేయుదురు. నిష్కామముగా యజ్ఞములు చేసి ఈ పండితులు బ్రహ్మను పొందినారు. ఆవిధముగా యజ్ఞములు చేయనివానికి ఈ లోకమే లేదు. పరలోకమెక్కడ? యజ్ఞములు చేసి, హవిశ్శేషమును భుజించువారు అమృతులు. సృష్ట్యాదియందు బ్రహ్మ ప్రజలతోపాటు

యజ్ఞములను సృజియించెను. కావున ప్రజలు యజ్ఞములు చేసి, దేవతలను సంతోషపఱచవలయును. బ్రహ్మ స్వాయంభువ మనువు, శతరూపలతోపాటు యజ్ఞములు సృజియించి మీరు యజ్ఞములద్వారా కోరికలు తీర్చుకొనుడని పలికినట్లు భాగవతము, తృతీయ స్కంధమున కలదు. ఆవిధముగా యజ్ఞము చేసినవారికి ఆ దేవతలు కోరిన కోర్కెను తీర్చెదరు. ఇష్టములైనవాటిని, భోగములను ప్రసాదింతురు. యజ్ఞములోని వస్తుసముదాయము, హోమపరికరములు, హోమద్రవ్యములు మఱియు యజ్ఞఫలము అన్నియూ బ్రహ్మమే. ఆవిధముగా యజ్ఞము చేసి యజ్ఞఫలమైన బ్రహ్మను పొందవలయును. కర్మఫలితమును వదలినవాడు సుఖమును, శాంతిని పొందును. కారేరీ యజ్ఞమువలన పర్జన్యుడు (వర్షము), వర్షము వలన పంటలు, తద్వారా అన్నము వలన వీర్యము కలుగుచున్నది. వీర్యము వలన మిథునధర్మ సృష్టిలో ఏ జాతికి చెందినవి ఆ జాతిలో పుట్టుచున్నవి.

ఈ మొత్తము కర్మవిభాగమునకు సంబంధించిన విషయములు ఈశోపనిషత్తు, తైత్తిరీయోపనిషత్తు, ముండక ఉపనిషత్తు మొదలైన ఉపనిషత్తులలో వివరింపబడినవి. భాగవతములో ప్రాచీనబర్హి పరముగా పుణ్యకర్మాచరణ చేసి ఫలితము కోరుటలోని దోషమును చెప్పి అతనిని జ్ఞానమార్గమునకు మరలించినట్లు నారద ఉపదేశముగా భాగవతము 4వ స్కంధములో వర్ణింపబడినది.

**2. యోగము**. ఇది మరల ధ్యానయోగము, ప్రాణాయామము అని రెండు విధములు. 1.ధ్యానయోగము : జ్ఞానేంద్రియములను వాటివాటి ఇంద్రియార్థములందు ప్రసరించకుండా నిగ్రహించుట ధ్యానయోగము క్రింద వచ్చును. దీనినే ఇంద్రియకర్మ అని కూడ అందురు. వీరు జ్ఞానేంద్రియములను నిగ్రహము అనే అగ్నిలో దహించుచున్నారు. అటులనే ఇంద్రియార్థములను ఇంద్రియములతో కలియకుండా నిగ్రహించి ఇంద్రియములనే అగ్నిలో దహించుచున్నారు. శ్రోత్రాది ఇంద్రియములను సంయమము అనే అగ్నిలో దహించుచున్నారు. 2. ప్రాణాయామము: ఆహార నియమము కలిగి ప్రాణమును అపానమునందు, అపానమును ప్రాణమునందును ప్రాణాపానములను కలిపి బాహ్యకుంభకము, అంతఃకుంభకము చేసి ఆత్మసంయమము అనే అగ్నిలో దహించుచున్నారు.

**3. భక్తి :** సర్వ ఇంద్రియములూ భగవంతుని పరముగా పనిచేయుచూ నిరంతరము పురుషోత్తముని స్మరించుచూ సర్వభావములు పరమాత్మయందు సమర్పింతురు. దీనినే ఏకాదశీవ్రతము అని భాగవతమున అంబరీషునిపరముగా చెప్పబడినది. యోగమునకు, భక్తికి గల తేడా యోగములో ఇంద్రియములను నిగ్రహింతురు. భక్తిలో ఇంద్రియములను భగవంతుని పరముగా పని చేయించెదరు. యోగములో నిరాకారముగా ఆత్మను ధ్యానింతురు. భక్తిలో సాకారముగా పురుషోత్తముని జపింతురు. యోగములో ఓంకారమును జపింతురు. భక్తిలో పురుషోత్తముని నామములను జపింతురు. ఈ భేదములు తప్ప యోగమునకు, భక్తికి తేడా లేదు.

**4. జ్ఞానము** (సాంఖ్యము) : గుణరహిత స్థితిని పొందుటయే జ్ఞానము. కావున జ్ఞానులకు కర్మ బంధము కాదు. తను దేహము కాదని తను ఆత్మస్వరూపుడనని గ్రహించుటయే జ్ఞానము. పుణ్యకర్మానుష్ఠాన లక్ష్యము జ్ఞానము పొందుట. కావున సర్వకర్మలు జ్ఞానమునందు పరిసమాప్తి యగును. కొందఱు జన్మతః ఇట్టి జ్ఞానము కలిగివుందురు. అజ్ఞానమును జ్ఞానమనే ఖడ్గముచే ఖండించవలయును. అజ్ఞానముచే జీవులు మోహములో మునిగిపోవుచున్నారు. అజ్ఞానము నశించిన జ్ఞానము మబ్బు తొలగిని సూర్యునివలె ప్రకాశించును.

ద్రవ్యయజ్ఞము, జ్ఞానయజ్ఞముల తారతమ్యములు : ద్రవ్యయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము గొప్పది. కేవలము ఉదరపోషణకై అన్నము వండుకొని తినువారు పాపులు. యజ్ఞములు చేసి యజ్ఞశిష్టమైన అన్నమును భుజించినవారు సాధువులు.

## యోగము

**యోగ నిర్వచనము:** చిత్తవృత్తి నిరోధము యోగమని పతంజలి తన యోగసూత్రములో పేర్కొనినారు.

**సాంఖ్యము, యోగముల తారతమ్యములు:** సాంఖ్యమన్నా, యోగమన్నా ఒక్కటే అని చెప్పినదానికి మరికొంత వివరణ చెప్పుచున్నాడు. కర్మఫలము కోరక కార్యములు, కర్మలు చేయువాడు సన్న్యాసి / సాంఖ్యుడు. అగ్నిహోత్రాది పుణ్యకార్యములు మానినవాడు సన్న్యాసికాదు. జ్ఞానియూ కాదు. సర్వకర్మ ఫలత్యాగము చేయనివాడు యోగి కాదు. కావున సాంఖ్యమన్నా, యోగమన్నాఒక్కటే. వేఱువేఱని పండితులు చెప్పరు. సాంఖ్యము వలన కలుగు ప్రయోజనము యోగము వలన కూడా కలుగుటవలన మఱియు

యోగులు, సాంఖ్యులు బ్రహ్మస్థానమును పొంది ఆత్మయై విరాజిల్లుటవలన యోగమన్నా, సాంఖ్యమన్నా ఒక్కటే.

యోగము ఎవరికి వచ్చును? ఎవరికి రాదు? అపరిగ్రహమును పాటింపనివానికి, సంసార తాపత్రయములలో ఉన్నవానికి, అతిగా భుజించినవానికి, నిరాహారునిగా ఉండువానికి, మొద్దునిద్ర పోవువానికి, జాగరణ చేయువానికి నిత్య బ్రహ్మచారికి యోగము రాదు. **యుక్తాహార విహారస్థ** కలవానికి యోగము వచ్చును. శరీరపోషణకు తగినంత ఆహారము, నిద్ర, సంసారసుఖము అనుభవించుచూ ఉన్నవానికి యోగము వచ్చును.

**జ్ఞానేంద్రియములు, ఇంద్రియార్థములు :** కర్మేంద్రియములను నిగ్రహించి ఇంద్రియార్థములను మనస్సులో స్మరించువాడు **మిథ్యాచారుడు.** జ్ఞానేంద్రియములను వాటివాటి ఇంద్రియార్థములపై ప్రసరించకుండా నిగ్రహించి కర్మేంద్రియముల ద్వారా కర్మ చేయువాడు **సదాచారుడు.**

యోగి బాహ్యప్రపంచంలో ఎటులుండును? స్థితప్రజ్ఞుడు ఎటులుండును? కేవలము శరీరసంబంధ కర్మలు చేయుచూ నీటిబిందువులచేత తడవని పద్మమువలె సంసారములో ఉండియూ, సంసారమునకు బద్ధుడు కాకుండా ఉండును.

యోగము ఎందుకు చేయవలయును? ఆత్మసిద్ధికొఱకు యోగమును చేయవలయును. తనకు తానే బంధువు. తనకు తానే శత్రువు. అనాత్మతో సంయోగము అనగా ప్రకృతి సంసర్గమునకు లోనైన ఆత్మ శత్రువు. అనాత్మతో సంయోగమును వదలి ఆత్మానుసంధానము చేసిన ఆత్మ మిత్రుడు. కావున ప్రతివ్యక్తి తనను తానే ఉద్ధరించుకొన వలయును. ఆవిధముగా ఉద్ధరించుకొనుటకు యోగమును చేయవలయును.

యోగములో స్థాయీభేదము. **1. అరురుక్షుడు** (ప్రారంభకుడు) ఇతడు యమనియమములనే పుణ్యకర్మలను, ఆసనము, ప్రాణాయామాదులు చేయువాడు. ఆత్మదర్శనము చేయనివాడు. **2. యోగారూఢుడు**. శమదమాదులు కలిగి సర్వసంకల్పములు వదలి ఆత్మరతి, ఆత్మక్రీడ యందు ఉన్నవాడు. సర్వత్ర పరమాత్మను దర్శించువాడు. ఆత్మానుసంధానము చేసినవాడు.

యోగము ఎవడు చేయవలయును? పాపరహితుడు, అపరిగ్రహము పాటించువాడు, సంసార తాపత్రయములు లేనివాడు, తను దేహము కాదని తను ఆత్మస్వరూపుడననే భావన కలిగి మరణభయము లేనివాడు యోగమును చేసిన సత్ఫలితము కలుగును.

యోగము ఎలా చేయాలి? 1) అపరిగ్రహమును పాటించవలయును. 2) ప్రదేశము : పవిత్ర ప్రదేశమున, శుచిగా వున్న ప్రదేశమున మరీ ఎత్తు, మరీ పల్లము లేని సమప్రదేశమున ఉండవలయును, 3) యమనియమములు : యమనియమములు పాటించుచూ, సాధనకాలములో బ్రహ్మచర్యము పాటించుచూ, **స్వగురువు**ను, ఇష్టదేవతలను ప్రార్థించవలయును. 4) ఆసనము : శరీరము, మెడ, శిరస్సు నిటారుగా ఉంచి, స్థిరముగా ఆసనమునందు ఉండవలయును. కర్మేంద్రియములను నిగ్రహించ వలయును. ఆధారచక్రమును పీడించవలయును. పద్మాసనము, వజ్రాసనము మొదలైన ఆసనములు వేయవలయుననే నియమము లేదు. సుఖముగా కూర్చున్న ఆసనము చాలును. దీనినే సుఖాసనము అని అందురు. భూమిపై దర్భలు పఱచి ఆపై జింకచర్మము వేసి, దానిపై శుభ్రమైన వస్త్రము వేసి ఆసనమున కూర్చుండవలయును. అనగా ఆసనము మెత్తగా ఉండవలయుననే భావన తప్ప జింకచర్మముతో పనిలేదు. 5) దృష్టి : నాసికాగ్రమును చూచుచు ఉండవలయును. భ్రూమధ్యస్థానమున చూపు నిలుపవలయును. లేదా దూరమును చూచుచు ఉండవలయును. 6) ప్రాణాయామము : ప్రాణమును అపానమునందు, అపానమును ప్రాణమునందు ప్రాణాపానములను సమము చేసి, పూర్ణకుంభకములో ఉండి, ప్రాణాయామము చేయుచూ ప్రాణమును మెల్లమెల్లగా ఒక్కొక్క స్థానమునుండి ఇంకొక స్థానమునకు చేర్చవలయును. అనగా మూలాధార చక్రమును పీడించి, నాభికి చేర్చవలయును. అచటనుండి హృదయస్థానమున నిలుపవలయును. అచటనుండి తాలు మూలమున నిలుపవలయును. దృక్కర్ణ నాసాస్య మార్గములు మూసి, బ్రహ్మరంధ్రమున ప్రాణములు ఉంచవలయును. యోగి దేహత్యాగ సమయమున బ్రహ్మరంధ్రమును చీల్చి బ్రహ్మమందు కలియును. 7) ప్రత్యాహారము : ఇంద్రియములను ఇంద్రియార్థములపై ప్రసరించకుండా నిగ్రహించుటనే ప్రత్యాహారము అని అందురు. **బాహ్యాన్ స్పర్శాన్ బహిరేవ కృత్వా** అనగా ఇంద్రియార్థములను ఇంద్రియములతో సంయోగము

చెందకుండా నిగ్రహించి, జ్ఞానేంద్రియములను, మనస్సును, బుద్ధిని నిగ్రహించవలయును. చిత్తము – చిత్తమును స్వాధీనము చేసికొని నిగ్రహించవలయును. చిత్తశుద్ధి కలిగి ఉండవలయును. ప్రశాంతచిత్తము కలిగియుండవలయును. మనస్సు – ఇది బలవంతమైనది (ప్రమాధీ) చంచలమైనది. వాయువువలె నిగ్రహింప శక్యముకానిది. అయిననూ అభ్యాస, వైరాగ్యమువలన మనోనిగ్రహము సాధ్యపడును. మనస్సును నిగ్రహించనిచో యోగము సాధ్యపడదు. మనస్సు నిగ్రహించి, మనస్సు ఏ విషయములందు సంచరించుచున్నదో గమనించి వాటినుంచి మనస్సును మరలించి ప్రశాంత మనస్సు కలిగి ఏమియూ ఆలోచింపక ఏకాగ్రము చేయవలయును. గాలి లేనిచోట దీపము ఏవిధముగ ఉండునో ఆవిధముగ మనస్సు నిశ్చలముగ ఉండవలయును. మనస్సును బుద్ధిచే భంగించవలయును. బుద్ధి – బుద్ధిని నిశ్చలము చేసి ఆ బుద్ధిని క్షేత్రజ్ఞునితో కలుపవలయును. ధ్యానము – మోక్షపరాయణుడై, ఆత్మను ధ్యానించుచూ ఓంకారమును జపించవలయును. ధారణ – భాగవతము ద్వితీయ స్కంధము 13, 14, 15 పద్యములలో ధారణ గురించి చెప్పబడినది. జీవాత్మను పరమాత్మతో అనుసంధానము చేయుటయే ధారణ. సమాధి – సవికల్ప సమాధి, నిశ్చలసమాధి అని సమాధి రెండు విధములు. గుణరహితుడు మాత్రమే నిశ్చలసమాధిని పొందును. ఇతడు దేహధ్యాస లే**స్థాణువు**వలె ఉండును. ఇతడు బ్రహ్మమును పొందును. ఇందు చెప్పిన యోగపాఠమునకు కైవల్యోపనిషత్తు 5, 7వ శ్లోకములు ఆధారము. ఆ కైవల్యోపనిషత్తు నందు పై శ్లోకములలో చెప్పిన పదములకు అర్థములు ఈ దిగువన చెప్పబడుచున్నవి.

శుచిః – పాపరహితుడై సంసార తాపత్రయములను వీడి;

వివిక్తదేశే – ఏకాంతప్రదేశమున ఉండి;

భక్త్యా స్వగురుం ప్రణమ్య – తన గురువుకు నమస్కరించి;

సుఖాసనస్య – సుఖాసనములో ఉండి;

సమగ్రీవః శిరః శరీరః – మెడ, శిరస్సు, శరీరము నిటారుగా ఉంచి;

సకల ఇంద్రియాణి నిరుద్య – జ్ఞానేంద్రియములను నిగ్రహించి;

అతి ఆశ్రమస్థః – చిత్తము, మనస్సు, బుద్ధి వీటిని నిగ్రహించి అన్యచింతనలు వీడి, పరమాత్మను ధ్యానించుచూ ఉండవలయును.

**ఈ యోగము గురించి రామాయణములో ఇట్లు చెప్పబడినది.**

నిశ్చలసమాధిని స్థాణువువలె ఉండుట అందురు. ఈ స్థాణు పదము అహల్యకథలో అహల్యను స్థాణువుగా ఉండమని గౌతముడు బాహ్యముగా శాపమిచ్చినట్లు కనబడును. కానీ ఇందు యోగము చేయు విధానము చెప్పబడినది. సుందరకాండలో హనుమంతుని పరముగా రామాయణములో ఇట్లు చెప్పబడినది.

పదమన్వేష్టుః – ఆత్మస్థానమును వెదకుటకొఱకు;

ససూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే భూతేభ్యః అంజలి కృత్వా– అనగా సూర్యునకు, ఇంద్రునకు, వాయుదేవునకు, బ్రహ్మకు, సర్వదేవతలకు అంజలి ఘటించి;

సముదగ్ర శిరోగ్రీవః – శిరస్సు, కంఠము, శరీరము నిటారుగా ఉంచి;

బాహుభ్యాం పీడయామాస – ఆధారచక్రమును పీడించి;

దూరాత్ మార్గం అవలోకయన్ – దృష్టిని దూరముగా ఉంచి;

ప్రాణాయామము – ప్రాణాన్ హృదయే రురోధ అనగా హృదయస్థానమున ప్రాణములను నిలిపి;

శిరోధరామ్ + సంహృత్య – కంఠము వంచి (గ్రీవాబంధము చేసి) ఆవిధముగా యోగము గురించి వర్ణింపబడినది.

మైనాకుని రాక, సురస, సింహికలు యోగవిఘ్నముగా చెప్పబడినవి. లంక అనగా సుషుప్తిలో జీవాత్మ ఉండు స్థానము, సర్వావస్థల్లో పరమాత్మయూ ఉండు స్థానము. ప్రకృతిని దర్శించుటయే సీతను చూచుట. అవస్థాత్రయములను, గుణములను దహించి, నిర్మలుడగుటను లంకాదహనముగా వర్ణించిరి. ప్రకృతిని వీడి ఆనందమయుడగుటను మధువనముగా చెప్పిరి. కర్పూరదీప సంయోగమువలె ఆత్మయై విరాజిల్లుటను హనుమంతుడు రామునిచే కౌగలింపబడినట్లు వర్ణింపబడినది.

ఈ యోగము గుఱించి భాగవతము ద్వితీయ స్కంధములో 12, 27 పద్యములలో వర్ణింపబడినది. వీటిని కథలుగా గజేంద్రమోక్షము, పాలసముద్రమధనము మొదలగు కథలుగా భాగవతములో వర్ణింపబడినవి. ఆత్మస్థానమును చేరి ఆత్మయై విరాజిల్లినవానిగా ధృతరాష్ట్రుడు, ధ్రువుని కుమారుడు మొదలైన వారి అనేక కథలు భాగవతమున ఉదాహరణగా ఇవ్వబడినవి.

అటులనే కపిలుని సాంఖ్యసూత్రమునందు, పతంజలి యోగసూత్రమునందు, యోగవాసిష్ఠము మొదలైన అనేక గ్రంథములలో యోగము గుఱించి చెప్పిన ఈ విషయములే వివరింపబడినవి.

యోగములో 1) తాత్కాలిక అంతరాయము 2) శాశ్వత అంతరాయము 3) యోగభ్రష్టత 4) ఇంద్రియములతోటి సంగమము విడువడనివాడు పొందు స్థానము 5) ఆత్మస్థానము చేరి, ఆత్మయై విరాజిల్లుట అను ఐదు అవస్థలు కలవు.

తాత్కాలిక అంతరాయమునకు రామాయణములో విశ్వామిత్రుని కథ చెప్పబడినది. ఇతడు తాత్కాలిక అంతరాయములను అధిగమించి చివరకు బ్రహ్మర్షి అయినాడు. శాశ్వత అంతరాయమునకు రామాయణములో అరణ్యకాండలో మాండుకర్ణుని కథ చెప్పబడినది. ఇతడు చాలాకాలము తపస్సు చేసెను. చివరకు పంచాప్సర సరస్సులో ఐదుగురు అప్సరసలతో వినోదముగా సంసారము చేయుచూ, మోక్షమార్గమునకు దూరమైనాడు. యోగభ్రష్టతకు ఉదాహరణగా భాగవతమున భరతుని కథ చెప్పబడినది. భరతుడు యోగభ్రష్టుడై తను పెంచిన లేడి కడుపున పుట్టి ఆ తరువాత జడభరతునిగా పుట్టి మోక్షమార్గమున పయనించి ఆత్మయై విరాజిల్లినాడు. (భాగవతము – పంచమస్కంధము)

ఇంద్రియములతోటి సంగమము విడువనివానికి ఉదాహరణగా భాగవతములో ధ్రువోపాఖ్యానము చెప్పబడినది. ఇతడు ధ్రువస్థానమును చేరినాడు. ఆత్మయై విరాజిల్లలేదు. ఆత్మస్థానము చేరి ఆత్మయై విరాజిల్లినవానినిగా రామాయణములో విశ్వామిత్రుడు, వసిష్ఠులవారు, శరభంగ మహర్షి, సుతీక్ష్ణుడు, అగస్త్యుడు, అగస్త్యభ్రాత మొదలైనవారి కథలను మఱియు భాగవతములో ధృతరాష్ట్రుడు, ధ్రువుని కుమారుడు, ఇంద్రద్యుమ్న మహారాజు (గజేంద్రుడు) మొదలైన అనేకమంది కథలు చెప్పబడినవి.

ఆత్మస్వరూపుడైనవాడు కర్మబంధములను తొలగించుకొని పరమశాంతిని పొందును. ఇతడు సుఖమును, శాంతిని పొందుచున్నాడు. బ్రాహ్మీస్థితి అనగా బ్రహ్మానందమును పొందుచున్నాడు. ఇతడు సుఖదుఃఖములకు విచలితుడు కాడు.

## భక్తి

దేహేంద్రియ మనోబుద్ధులచే చేయబడు సర్వకర్మలూ పరమాత్మునియందు సమర్పింతురు. అంబరీషునికథ, ప్రహ్లాదుని కథ, గోపికల కథలు భాగవతమున భక్తిపరముగా వివరింపబడినవి. భక్తుడు ఏకచిత్తంబున పరమాత్మను ధ్యానించి అహంకార నిబద్ధంబగు కర్మను త్రుంచివైతురు. భక్తులు పుణ్యకర్మలలో ఒకటైన పూజావిధానమును పాటింతురు.

తమోగుణయుతులైనవారు ఘోరరూపులైన భూతములను, భూతపతులను పూజింతురు. రజోగుణయుతులు వేదోక్తవిధిని దేవతలను పూజింతురు. దేవతలను పూజించుటవలన కర్మఫలితము శీఘ్రముగా కలుగును. సత్త్వగుణయుతులు కర్మఫలితమును కోరక పురుషోత్తముని పూజింతురు. భక్తులు ఏవిధముగా సేవించిన పరమాత్మ వారిని అట్లే అనుగ్రహించును. ఉదాహరణకు కుచేలుడు పరమాత్మను సఖునిగా చూచెను. నందయశోదలు కొడుకుగాను, గోపికలు ప్రియునిగాను, ధర్మరాజాదులు ప్రేమతోను, కంసుడు భయముతోను పరమాత్మను సేవించిరి. సమస్తభావములు పరమాత్మయందు ఉంచినవారు ఆత్మస్వరూపమును పొందిరి.

## జ్ఞానము

దేహి, దేహవిచారణ చేసి క్షేత్రజ్ఞుని కనుగొనుటయే జ్ఞానము. సర్వత్రా ఆత్మను దర్శించుటయే జ్ఞానము. జ్ఞానముద్వారా జ్ఞానులు భవసాగరమును దాటుదురు. జ్ఞానముతో సమానమైనది ఇంకొకటి లేదు. జ్ఞానము పవిత్రమైనది. జ్ఞాని పరమశాంతిని పొందును. నీటిలో ఉన్న తామరాకువలె జ్ఞాని సంసారములో ఉండియూ సంసార తాపత్రయములు అంటక తాబేలువలె సంచరించును. జ్ఞానిని పండితుడని, స్థితప్రజ్ఞుడని, జీవన్ముక్తుడని, బ్రహ్మర్షి యని, యతీశ్వరుడని, విదేహుడని, తపస్వి అని ఇలా వివిధ పేర్లతో వ్యవహరింపబడుచున్నాడు.

**ఇంద్రియములు :** కర్మేంద్రియములైన నోరు, చేతులు, పాదము, గుహ్యము, గుదము అనునవి వాటివాటి పనులందు, జ్ఞానేంద్రియములైన చెవులు, చర్మము, కన్నులు, నాలుక, ముక్కు అనునవి కన్నులు మూసికొని తెఱచుకొనునట్లు వాటివాటి ఇంద్రియార్థములందు అసంకల్పితముగా పనిచేయుచున్నవిగాని, తను కర్తను కానని జ్ఞాని భావించును.

**అవస్థలు :** అవస్థాత్రయములందు జీవుడు విహరించుచున్నాడనియు, తను నిమిత్తమాత్రుడనియు జ్ఞాని భావించును.

**కర్మ :** పాపకర్మలు జ్ఞాని చేయకుండా ఉండును. ఆవిధముగా జ్ఞాని పాపమునుండి నివృత్తుడగును. సర్వకర్మలు జ్ఞానాగ్నిలో దగ్ధమగును. కర్మఫలితముతో ఏ సంబంధమూ ఉండదుగాన జ్ఞాని పుణ్యకర్మలు చేయవచ్చును లేదా చేయకుండానూ ఉండవచ్చును.

**జ్ఞానము :** జ్ఞానము అజ్ఞానముచే ఆవరింపబడియున్నది. కావున అజ్ఞానమును జ్ఞాని తొలగించుకొనవలయును.

**శత్రువులు :** రాగద్వేషములు జ్ఞానికి శత్రువులు. కావున రాగద్వేషముల వశముగాక వాటిని జయించవలయును.

**జ్ఞాని బాధ్యత :** జ్ఞాని కూడా ఫలాపేక్ష లేక పుణ్యకర్మలు వేదవిహితముగాను, శ్రద్ధగాను చేయవలయును. అటులనే అజ్ఞానులకు బుద్ధిభేదము కలిగించరాదు. జ్ఞాని కర్మబంధమునుండి విడివడి జ్ఞానముచే జీవన్ముక్తుడై (శాంతిని పొంది) దేహత్యాగానంతరము బ్రహ్మయగును. జ్ఞానవంతులు ఆత్మస్వరూపమును పొందుదురు.

గుణరహితుడు కానివాడు జ్ఞాని కాలేడు. సాంఖ్యులు (జ్ఞానులు) రెండు విధములు. కర్మయోగము చేసి అనగా పుణ్యకర్మ, యోగము, భక్తి అను అనుష్ఠానపద్ధతులు పాటించి గుణరహితుడైనవాడు ఒక విధమైన జ్ఞాని. అటులనే పూర్వజన్మ కర్మవలన సహజముగా గుణరహితుడైనవాడు మఱియొక విధమైన జ్ఞాని. కావున పుణ్యకర్మానుష్ఠానము, సాంఖ్యము రెండునూ శ్రేష్ఠములే. అయితే పుణ్యకర్మాచరణ చేసి జ్ఞానము పొందుటకంటె సాంఖ్యముద్వారా జ్ఞానము పొందుట కష్టము. సాంఖ్యమన్నా, కర్మయోగమన్నా ఒక్కటే అని పండితులు చెప్పుచున్నారు. జ్ఞానమును పొందుటకు గురువును ఆశ్రయించవలయును. వారికి సేవచేసి విషయములు అడిగి

గ్రహించి, జ్ఞానమును పొందవలయును. ఉపాధులను కాక అందలి ఆత్మను దర్శించినవాడు జ్ఞాని. అగ్ని సమిధలను దహించునట్లు జ్ఞానాగ్ని సర్వకర్మలను దహించును. కావున జ్ఞానవంతుడు సర్వపాపములనుండి, సర్వపుణ్యములనుండి విడివడి సంసారసాగరమును దాటి, దేహత్యాగానంతరము బ్రహ్మయగును.

**ఏది కర్మబంధము :** పుణ్యకర్మానుష్ఠానములో యజ్ఞములు చేసిన దేవతలు యజమాని కోరిన కోర్కెలను తీర్చెదరు. దేవతలు ప్రసాదించినవి తిరిగి దేవతలకు సమర్పించకుండా అనుభవించువాడు దొంగవలె బందీ యగును. యజ్ఞములు చేసి పుణ్యఫలితమును కోరినచో అది కర్మబంధమును కలుగజేయును. ఇహలోక, పరలోక భోగాసక్తి కలవాడు కర్మబద్ధుడు. యోగములో అణిమాది అష్టసిద్ధులను అంగీకరించినవాడు కర్మబద్ధుడగును. భక్తిలో దేవతలను పూజించి, కోరికలను కోరి ఇచ్ఛ, భయ, క్రోధములు కలవాడు కర్మబద్ధుడగును. జ్ఞానములో సంకల్ప పరిత్యాగము చేయనిచో అనగా కామములను పూర్తిగా వదలనిచో కర్మబద్ధుడగును.

**ఏది కర్మబంధము కాదు :** ఫలాపేక్ష లేనివాడు కర్మబద్ధుడు కాడు. అనగా యజ్ఞములు చేసి, యజ్ఞఫలితమును కోరనిచో కర్మ బంధము కాదు. కావున ఫలాసక్తిలేక పుణ్యకర్మలు చేయవలయును.

గుణరహితులు కర్మ బద్ధులు కారు. వీరు ఆత్మస్థానమును పొంది, అధికార పురుషులగుదురు. తిరిగి భూలోకమున జన్మింపరు. సర్వకర్మలు చేయుచూ, చేయించుచూ ఉన్ననూ వీరు కర్మబద్ధులు కారు. అజ్ఞానజనితమైన కర్మ ఫలితమును కోరవద్దు అన్నది **ఉపదేశము**. కర్మ బంధము కానిదానిని శ్రేయోమార్గము అని అందురు. అటులనే యోగములో అణిమాది అష్టసిద్ధులను తృణీకరించి, ఆత్మానుసంధానము చేయువానికి కర్మ బంధము కాదు. కావున యోగమును అభ్యసించుమన్నది **ఉపదేశము**. భక్తిలో సర్వకర్మలూ, సర్వభావములు పురుషోత్తమునియందు సమర్పించినవానికి కర్మ బంధము కాదు. ఇచ్ఛాభయక్రోధము లేనివాడు బంధవిముక్తుడు. జ్ఞానములో జ్ఞానముచే సర్వసంశయములు తొలగినవానికి, ఆత్మవంతునికి, కర్మ సన్న్యాసికి కర్మ బంధము కాదు. కావున సర్వ సంకల్పములను వదలవలయును. సంశయములను జ్ఞానముచే ఖండించుము. హృదయగత ఆత్మను

గ్రహించుము. నిత్య సన్న్యాసి కర్మ బంధములనుండి విడివడును. దేహవిచారణ చేసి దేహేంద్రియ మనోబుద్ధులచే చేయబడు కర్మకు తను కర్తను కానని, ప్రకృతినుండి జనియించిన గుణములే కర్మకు కారణమని గ్రహించు జ్ఞానికి కర్మ బంధము కాదు.

**శాంతి**

కర్మబద్ధుడు శాంతిని పొందడు. కర్మ బద్ధుడు కానివాడు శాంతిని పొందును. కావున కర్మ బంధముగాని పద్ధతులు చెప్పినట్లు ఆచరించువాడు శాంతిని పొందును. అజ్ఞానికి శాంతి ఉండదు.

**ఆత్మస్థానము పొందువాడు.**

క్షీణ కల్మషాః - అనగా పాపరహితుడు.

ఇహలోక పరలోక సుఖాపేక్ష లేనివాడు.

ఇంద్రియార్థములు : బాహ్య స్పర్శేషు అసక్తాత్మా అనగా ఇంద్రియార్థములందు ఇంద్రియములను ప్రసరించకుండా నిగ్రహించినవాడు.

జితేంద్రియః - విజితేంద్రియః

వీతరాగభయక్రోధాః, విగత ఇచ్ఛా భయ క్రోధః కామ క్రోధ వియుక్తానామ్ - అనగా భయము, రాగము, ద్వేషము, ఇచ్ఛ, అరిషడ్వర్గములు అనగా కామక్రోధ లోభ మోహాదులు లేనివాడు.

విమత్సరః - మత్సరము లేనివాడు.

త్యక్తసర్వ పరిగ్రహః, అపరిగ్రహః - అనగా అపరిగ్రహమును పాటించువాడు.

కర్మ ఫల సంగమ్ త్యక్త్వా - పుణ్యకర్మఫలాపేక్ష లేనివాడు.

కామసంకల్ప వర్జితాః - సర్వకోరికలను వదలినవాడు లేదా పూర్ణకాముడు.

నిత్యతృప్తః, యదృచ్ఛా లాభ సంతుష్టః - ఉన్నదానితో తృప్తిపడువాడు.

నిరాశయః - రాజులను, ధనవంతులను ఆశ్రయింపక, పరమాత్మనే ఆశ్రయించి ఉండువాడు.

యోగయుక్తః - యోగయుక్తుడు.

నిరాసీ – ఆశలేనివాడు అనగా ఆశమమకారములు లేనివాడు.

న కాంక్షతి న ద్వేష్టి – కోరికలు, ద్వేషము లేనివాడు.

విగతజ్వరః – ఫలితాఫలితములయందు ఉద్వేగము లేనివాడు.

గత సంగస్య ముక్తస్య – సంగరహితుడైనవాడు.

ద్వంద్వాతీతః – నిర్ద్వంద్వః – శీతోష్ణసుఖదుఃఖేషు – లాభాలాభౌ జయా జయౌ – సిద్ధా సిద్ధౌ – మానావమానయో సమః– సమలోష్టాశ్మ కాంచనః – ప్రియం ప్రాప్య న ప్రహృషేత్, అప్రియం ప్రాప్య న ఉద్విజేత్ – ఛిన్న ద్వైధా సుహృత్ మిత్ర అరి– ఉదాసీనః మధ్యస్థ అబంధుషు ద్వేషి సాధుషు పాపేషు – అనగా లాభాలాభములయందు, జయాపజయములందు, మానావమానములయందు సమభావన కలిగిన ద్వంద్వాతీతుడు.

అసమూఢః – మోహమును పొందనివాడు అనగా ధనేషణ, దారేషణ, పుత్రేషణలయందు మోహమును పొందనివాడు.

జ్ఞానావసిష్ఠ చేతసః – యతచేతసామ్ – యత చిత్తాత్మా – యతాత్మానః – జితాత్మనః – విజితాత్మ – విదిత ఆత్మానామ్ – విశుద్ధ ఆత్మ – బ్రహ్మయోగ యుక్తాత్మా – జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా – అనగా ఇంచుక మాయలేనివాడు, పరిశుద్ధమైన మనస్సు కలవాడు, జీవలక్షణములను వీడినవాడు.

సర్వభూతములయందు – సర్వభూతసమః, సర్వభూతాత్మ భూతాత్మ, సర్వ భూతహితేరతాః – అనగా తనయందు, అఖిల భూతములయందు ఆత్మను దర్శించువాడు.

మోక్షపరాయణః – సర్వలోక మహేశ్వరమ్ జ్ఞాత్వా అనగా మోక్షపరాయణుడై ఆత్మస్థానమును తెలుసుకొని ఆత్మను దర్శించినవాడు.

తత్ ఆత్మనః తత్ బుద్ధయః తత్ నిష్ఠా తత్ పరాయణాః

అంతఃసుఖమ్ అంతరారామః అంతఃజ్యోతిః బ్రహ్మభూతః – మనస్సు సామ్యస్థితిగా చెప్పబడే గుణరహిత స్థితిని పొందినవాడు.

ఇట్టి లక్షణములుగల వాడు కర్మబంధములను తొలగించుకొని పరమశాంతిని పొంది దేహత్యాగానంతరము బ్రహ్మనిర్వాణమును పొందును. కావున పుణ్యకర్మానుష్ఠానమైన పుణ్యకర్మ, యోగము, భక్తి, అటులనే జ్ఞానయోగమును అవలంబించుచూ ఇట్టి లక్షణములను పొందవలయునన్నది **ఉపదేశము**.

27వ అధ్యాయములో ఇతరులచే ప్రయోగింపబడిన పదములకు సమానార్థకముగా ఈ పదములు వ్యాసభగవానునిచే వాడబడినవి.

వేదవిహితకర్మ = కర్మ.

కర్మబాహుళ్యము = వికర్మ.

అపభ్రంశము = అకర్మ.

...... ❖ ❖ ❖ ......



ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మపర్వము 27వ అధ్యాయము

## (కర్మయోగము)

అర్జున ఉవాచ

సాంఖ్యము - పుణ్యకర్మానుష్ఠానములలో శ్రేయోమార్గము కలిగించుదానినే చెప్పుము.

**జ్యాయసీ చేత్కర్మణస్తే । మతా బుద్ధిర్జనార్దన ।**

**తత్కిం కర్మణి ఘోరే మాం । నియోజయసి కేశవ ॥ 1**

జ్యాయసీ - చేత్ - కర్మణః - తే - మతా - బుద్ధిః - జనార్దన

తత్ - కిమ్ - కర్మణి - ఘోరే - మామ్ - నియోజయసి - కేశవ ॥

**వ్యామిశ్రేణేవ వాక్యేన । బుద్ధిం మోహయసీవ మే ।**

**తదేకం వద నిశ్చిత్య । యేన శ్రేయోఽహమాప్నుయామ్ ॥ 2**

వ్యామిశ్రేణ - ఇవ - వాక్యేన - బుద్ధిమ్ - మోహయసి - ఇవ - మే

తత్ - ఏకమ్ - వద - నిశ్చిత్య - యేన - శ్రేయః - అహమ్ -ఆప్నుయామ్

ఈ శ్లోకములో జనార్దన, కేశవ అని రెండు సంబోధనలు గలవు. ఒకటి కథాభాగమునకు, రెండవది అధ్యాత్మ భాగమునకు చెందినదిగా భావించవలయును.

**కథాభాగము:**

| | | |
|---|---|---|
| కేశవ | = | ఓ శ్రీకృష్ణా! యుద్ధములో ఎవరు జయించెదరో చెప్పకనే |
| మామ్ | = | నన్ను, యుద్ధము చేయుమని చెప్పి |
| ఘోరే | = | ఘోర కర్మ అయిన యుద్ధమునందు |
| కిమ్ | = | ఎందులకు |
| నియోజయసి | = | నియోగించుచున్నావు. |

ఈ ప్రశ్నకు సమాధానముగ రాబోవు శ్లోకములలో – **“నియతం కురు కర్మ”**– నీకు విధింప బడిన కర్మ చేయుము అని – **“స్వధర్మే నిధనం శ్రేయః”**అని వివరించును.

**అధ్యాత్మ భాగము:**

| | | |
|---|---|---|
| జనార్దన | = | ఓ శ్రీకృష్ణా! |
| తే + మతా | = | నీ అభిప్రాయము ప్రకారము |
| బుద్ధిః | = | బుద్ధి అనగా బుద్ధి సంపన్నత్వమున ఉండుట అనగా సాంఖ్యము |
| కర్మణః | = | పుణ్యకర్మాచరణ కంటే |
| జ్యాయసీ+చేత్ | = | శ్రేష్ఠమైనది అయినచో |
| తత్+కర్మణి | = | ఆ పుణ్య కర్మానుష్ఠానమునందు |
| మామ్+కిమ్+ నియోజయసి | = | నన్ను ఎందులకు నియమించుచున్నావు |
| ఓ శ్రీకృష్ణా! | | |
| మే | = | నా యొక్క |
| బుద్ధిమ్ | = | బుద్ధిని |
| వ్యామిశ్రేణ+వాక్యేన+ఇవ | = | మిశ్రమమువలె కనబడు సాంఖ్యము, పుణ్యకర్మానుష్ఠానము |
| మోహయసి + ఇవ | = | మోహమును గలుగచేయు వాటివలె ఉన్నవి. అనగా దేనిని పాటించవలయునో చెప్పక తికమక పెట్టుచున్నావు. |
| అహమ్+యేన+ శ్రేయః+ఆప్నుయామ్ | = | నేను ఈ సాంఖ్య, పుణ్యకర్మానుష్ఠాన పద్ధతులలో దేనిచేత శ్రేయస్సును పొందుదునో |
| తత్+ఏకమ్+నిశ్చిత్య+ వద | = | ఆ ఒక్కదానినే నిశ్చయించి చెప్పుము |

**వ్యాఖ్యానము :-** నీవు గత 26వ అధ్యాయములో 39వ శ్లో॥ **"బుధ్యాయుక్తో యయా పార్థ కర్మ బంధం ప్రహాస్యసి"**–అనియు 49వ శ్లో॥ **దూరేణ హ్యవరం కర్మ బుద్ధి యోగాద్ధనఞ్జయ** – అనియు చెప్పితివి. బుద్ధియోగము అనగా సాంఖ్యపద్ధతిలో తను దేహము కాదని, తను ఈశ్వరుడు అని స్వానుభవంలో గ్రహించి, జీవత్వమునకు గల సర్వ కోరికలను పరిత్యజించి గుణరహితుడై శాంతత్త్వము గలిగి ఉండుట గుఱించి చెప్పితివి. ఈ స్థితి పుణ్యకర్మాచరణ కంటే గొప్పది అని చెప్పితివి. మఱల ఇప్పుడు పుణ్య కర్మాచరణ చేయుమని ఎందులకు చెప్పుచున్నావు?

పుణ్యకర్మాచరణలో ప్రేయోమార్గము, శ్రేయోమార్గము అని రెండు మార్గములు కలవు. దేవతలను యజించి ఇష్టకామ్యార్థ సిద్ధిని పొంది ఇహలోక పరలోక సుఖములను పొంది పుణ్యము క్షీణించగనే, తిరిగి భూలోకమున జన్మించుట ప్రేయోమార్గము. ఆత్మ స్థానముచేరి, ఆత్మయై విరాజిల్లుట శ్రేయో మార్గము. ప్రేయోమార్గము, శ్రేయోమార్గములలో శ్రేయోవిధానమును నాకు చెప్పుము. పుణ్య కర్మాచరణ చేయుచూ ఆత్మయై విరాజిల్లు పద్ధతిని చెప్పుము.

...... ❖ ❖ ❖ ......

శ్రీభగవాన్ ఉవాచ

రెండు అనుష్ఠాన పద్ధతులు చెప్పబడినవి.

**లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా । పురా ప్రోక్తా మయానఘ ।**
**జ్ఞాన యోగేన సాంఖ్యానాం । కర్మ యోగేన యోగినామ్ ॥ 3**

లోకే – అస్మిన్ – ద్వివిధా – నిష్ఠా – పురా – ప్రోక్తా – మయా – అనఘ
జ్ఞాన యోగేన – సాంఖ్యానామ్ – కర్మ యోగేన – యోగినామ్

**న కర్మణామనారంభాత్ । నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।**
**న చ సన్న్యసనాదేవ । సిద్ధిం సమధిగచ్ఛతి ॥ 4**

న – కర్మణామ్ – అనారంభాత్ – నైష్కర్మ్యమ్ – పురుషః – అశ్నుతే।
న – చ – సన్న్యసనాత్ – ఏవ – సిద్ధిమ్ – సమధిగచ్ఛతి

అనఘ = పాపరహితుడవయిన ఓ అర్జునా!

అస్మిన్+లోకే+ ద్వివిధా+నిష్ఠా+ మయా+పురా+ప్రోక్తా = ఈ భూలోకమునందు రెండు విధములైన అనుష్ఠాన పద్ధతులు పూర్వము నా చేత అనగా పరమాత్మచేత చెప్పబడినవి

**(ఒక పద్ధతి)**

యోగినామ్+కర్మయోగేన = కర్మ యోగముచే పుణ్యకర్మ, యోగము, భక్తి అను పద్ధతులచే ఆత్మస్థానమును చేరు పద్ధతి చెప్పబడినది.

సాంఖ్యానామ్+ జ్ఞానయోగేన = జ్ఞాన యోగముచేత సాంఖ్యులకు అనగా ఆత్మ రతి, ఆత్మ క్రీడయందున్న వారికి ఆత్మ స్థానమును చేరు పద్ధతి చెప్పబడినది.

**ఏ పద్ధతి పాటించిన గుణరహితుడు కావలయును.**

**కర్మణ్యుల గుఱించి :**

పురుషః+కర్మణామ్+ అనారంభాత్+చ+ నైష్కర్మ్యమ్+న+ సమధిగచ్ఛతి = పురుషుడు (స్త్రీ పురుషులలో ఎవరైనా) పుణ్య కర్మలు ఆచరింపక పోవుటవలన మఱియు పుణ్యకర్మలు ఆచరించి పుణ్యకర్మల యొక్క ఫలితమును కోరుటవలన అతడు సాంఖ్యపద్ధతిలో నిష్క్రియము, సాక్షీభూతము అయిన ఆత్మను చేరలేడు

సన్న్యసనాత్+ఏవ+ సిద్ధిమ్+న+అశ్నుత్ = సామాన్యుడు సాంఖ్యమువలన సిద్ధిని అనగా ఆత్మతో ఏకీభూతస్థితిని పొందడు

**వ్యాఖ్యానము :-** అర్జునా! గతములో నేను చెప్పిన మాటలలో వ్యామిశ్రము లేదు. ఆత్మ స్థానము చేరి, ఆత్మయై విరాజిల్లుటకు వేదము **"న అన్యః పంథా"** అనగా ఇంకొక మార్గము లేదు. అనగా ఒకే మార్గము ఉన్నదని చెప్పినది. దేహము లోనికి

దేహి పూర్వజన్మ కర్మ వశమున ప్రవేశించును. దేహము ఏ వరుస క్రమములో ఏర్పడినదో, ఆ వరుస క్రమములోనే వాటిని అధిగమించి, ఆత్మ స్థానమును చేరవలయును. అనగా అవరోహణక్రమంలో దేహము ఏర్పడినది. కావున ఆరోహణక్రమంలో ఒక్కొక్కస్థానము దాటి ఆత్మస్థానమును చేరవలయును. వీటినే ఆచారకాండలో ఏడుకొండలుగా చెప్పిరి. ఈ ఏడుకొండలు ఎక్కిన తను ఈశ్వరుడు అగును. అటులనే ఈ సప్తప్రాకారములను దాటినవాడు ఆత్మయై విరాజిల్లును.

| **అవరోహణ:** | **ఆరోహణ:** |
|---|---|
| ప్రకృతి | భూ తత్త్వము |
| మహత్ | జల తత్త్వము |
| అహంకారము | అగ్ని తత్త్వము |
| ఆకాశము | వాయు తత్త్వము |
| వాయువు | ఆకాశ తత్త్వము |
| అగ్ని | అహంకారము |
| జలము | మహత్ |
| భూమి | ప్రకృతిలను వీడి ఆత్మయై విరాజిల్లవలెను |

ఆవిధముగా **ఒకొొక్కదానిని అధిగమించవలయును.** ఏ మెట్టు ద్వారా పైనుంచి క్రిందికి దిగితిమో ఆ మెట్టుద్వారానే పైకి ఎక్కవలయును ఈ మార్గమున పయనించుటకు సాధన పద్ధతులు రెండు కలవు.

**ఒక పద్ధతి:** పాపకృత్యములు చేయకుండా ఉండి, పుణ్యకర్మలు చేయుచూ, వాటి ఫలితమును కోరరాదు. అటులనే యోగము, భక్తిపద్ధతులను పాటించ వలయును. ఇది కర్మయోగము.

**రెండవ పద్ధతి:** తను దేహము కాదని గ్రహించి ఆత్మానుసంధానము గలిగి బుద్ధి సంపన్నత్వమున ఉండుట. ఇది సాంఖ్యపద్ధతి.

ఈ రెండు పద్ధతులలో దేనిని పాటించినా సాధన ఫలితము ఒకటే.

భాగవతము సప్తమ స్కంధములో **ప్రహ్లాద అజగర** సంవాదమని ఒక కథ గలదు. ప్రహ్లాదుడు కావేరీ తీరంబున సహ్య పర్వతమున నిర్మల తేజంబుతో ధూళి

ధూసరిత దేహంబుతో తను ఎవరో ఎవ్వరికి నెఱుంగబడక నేల నిద్రించుచున్న ఒక మునిని చూచి అంజలి ఘటించి అతని చరిత్రంబు తెలిసికొనియె. అతడు సాంఖ్య పద్ధతిని పాటించు జ్ఞాని.

రామాయణములో శరభంగాది ఋషులు పుణ్య కర్మాచరణ చేయుచూ పుణ్య ఫలితమును కోరక పుణ్య ఫలితమును ఈశ్వరార్పణచేసి, పాము తన కుబుసమును విడచినట్లు అగ్నిలో దేహమును దహించి, దివ్యదేహముతో వారు బ్రహ్మలోకము చేరినట్లు వివరింపబడినది. ఇది కర్మయోగపద్ధతి.

**కర్మనిష్ఠా పరులకు చెప్పిన పద్ధతి:**

పాప కర్మలు చేయరాదు. పుణ్య కర్మలు చేసి, పుణ్య ఫలితము కోరరాదు. ద్వంద్వాతీతునిగా, గుణరహితునిగా శాంతునిగా ఉండవలయును. ఇతనిని విదేహుడని అందురు.

దేహేంద్రియమనోబుద్ధులచే చేయబడునది అంతయు కర్మ అనియే చెప్పబడును. తన దేహ నిర్వహణకు చేయు పనులు అనగా కాలకృత్యములు తీర్చుకొనుట, ప్రాణమును పీల్చుట వదలుట, స్నానము, ఆహారము, మైధునము, నిద్ర మొదలయిన వన్నీ దేహ నిర్వహణ కర్మగా చెప్పబడును. వృత్తి వ్యాపారాదులు చేసి ధనము సంపాదించి తనని, తన కుటుంబ సభ్యులను పోషించుట, వారియెడ గల తన కర్తవ్యమును, విధులు, బాధ్యతలుగా చెప్పుదురు. ఈ కర్మలు ఇహ లోకమునకు సంబంధించిన కర్మలు.

**యోగులకు చెప్పిన పద్ధతి:**

పాపపు కర్మలు చేయరాదు. మనో బుద్ధులను కలిపి వాటిని జీవునితో సహా హృదయ గుహలోగల ఆత్మతో ఆత్మానుసంధానము చేయ వలయును. ద్వంద్వాతీతునిగా – గుణరహితునిగా – శాంతునిగా ఉండవలయును. ఇతనిని జీవన్ముక్తుడని అందురు.

యోగములో పుణ్యకర్మలను యమ, నియములని అందురు. యోగమునకు యమ నియమములు పునాదులు. ఈ పునాదులపైననే ఆత్మతో ఏకీభూతమగు స్థితి అనే భవనము నిర్మింపబడును.

గోపికలు యోగము చేయలేదు. వేద విహిత నిత్య నైమిత్తికాది కర్మలను చేయలేదు. గోపికలు సంసార తాపత్రయములను వీడి జగత్తులో ఆత్మను వెదకి బుద్ధి సంపన్నత్వమున నుండి జగత్తులో పరమాత్మను వెదకి శ్రీకృష్ణునిని ఏమియూ కోరక నిత్యము శ్రీకృష్ణుని స్మరించుచూ ద్వంద్వాతీతస్థితిని పొంది గుణరహితులై శాంతత్త్వమును గలిగి ఉండిరి. ఈ పద్ధతికి నారద మహర్షి ఏకాంత భక్తి అని పేరు పెట్టెను.

ప్రకృతివలన జనియించిన గుణములచే దేహి పాప పుణ్యయుతమైన కర్మలు చేయుచున్నాడు. ఇవి పరలోకమునకు సంబంధించిన కర్మలు.

...... ❖ ❖ ❖ ......

దేహ నిర్వహణ కర్మ - పుణ్యపాపయుత కర్మ

**న హి కశ్చిత్ క్షణమపి । జాతు తిష్ఠత్యకర్మకృత్ ।**
**కార్యతే హ్యవశః కర్మ । సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ 5**

న- హి - కశ్చిత్ - క్షణమ్ - అపి - జాతు - తిష్ఠతి - అకర్మ కృత్ ।
కార్యతే - హి - అవశః - కర్మ - సర్వః - ప్రకృతిజైః - గుణైః

కశ్చిత్ = ఎవడును
జాతు = ఒకప్పుడును
క్షణమ్+అపి+ = ఒక క్షణకాలముకూడ అసంకల్పితముగా
అకర్మకృత్+ జరుగుచున్న ప్రాణమును పీల్చుట వదలుట అను
న+తిష్ఠతి+హి క్రియలను, కన్నులు మూయుట తెఱచుట అను క్రియలను, నిద్రపోవుట అటులనే తను ఆపాలని అనుకున్నా, ఆపలేని మల మూత్రముల విసర్జనాది వాటిని అనగా దేహనిర్వహణకర్మలను చేయనివాడై ఉండజాలడు. ఆ కారణమున తన దేహమునకు సంబంధించిన కర్మ చేయకుండా ఉండజాలడు.

ఇహలోకములో దేహ నిర్వహణకు సంబంధించిన కర్మ చేయకుండా వున్నచో శరీరము నిలబడదు. ఆహారము తినకుండా ఉన్నచో దేహము మరణించును. కావున శరీర యాత్ర సాగదు.

**పుణ్యపాపయుత కర్మ :**

ప్రకృతిజైః+గుణైః = ప్రకృతివలన జనియించిన సత్త్వగుణము, రజో గుణము, తమోగుణముగా చెప్పబడే గుణములచేత

సర్వః = త్రిమూర్తులు, ఇంద్రాది దేవతలు, రాక్షసులు, మానవులు, పశు పక్ష్యాదులు, సర్వులూ కర్మలు చేయుచున్నారు. దేహి పూర్వజన్మకర్మ వలన గలిగిన మనస్సుచే అనగా కర్మవాసనలచే

అవశః+కర్మ+కార్యతే = అస్వతంత్రుడై గుణబద్ధుడైన దేహిచే బలాత్కారముగా కర్మ అనగా పుణ్యపాపకర్మ చేయుచున్నాడు.

త్రిమూర్తులు సృష్టి, స్థితి, లయములనే కర్మలను చేయుచున్నారు. దేవతలు పుణ్యకర్మను, రాక్షసులు పాపకర్మను చేయుచున్నారు. మానవుడు పూర్వజన్మ కర్మవాసనలవలన త్రిగుణములవలన పుణ్య-పాప కర్మ చేయుచున్నాడు.

...... ❖ ❖ ❖ ......

యోగములో ఇంద్రియములు, ఇంద్రియార్థములు, మనస్సుల గురించి
మిథ్యాచారుడు - సదాచారులుగా చెప్పుచున్నాడు.

**కర్మేంద్రియాణి సంయమ్య । య ఆస్తే మనసా స్మరన్ ।**
**ఇంద్రియార్థాన్విమూఢాత్మా । మిథ్యాచారః స ఉచ్యతే ॥ 6**

కర్మేంద్రియాణి – సంయమ్య – యః – ఆస్తే – మనసా – స్మరన్
ఇంద్రియార్థాన్ – విమూఢాత్మా – మిథ్యాచారః – సః – ఉచ్యతే

ఆత్మోన్నతిని కలుగచేయు కర్మ

**యస్త్వింద్రియాణి మనసా । నియమ్యారభతేఽర్జున ।**
**కర్మేంద్రియైః కర్మ యోగమసక్తః స విశిష్యతే ॥** **7**

యః – తు – ఇంద్రియాణి – మనసా – నియమ్య – ఆరభతే – అర్జున
కర్మేంద్రియైః – కర్మ యోగమ్ – అసక్తః – సః – విశిష్యతే

| | |
|---|---|
| యః<br>కర్మేంద్రియాణి+<br>సంయమ్య+<br>ఇంద్రియార్థాన్+<br>మనసా+స్మరన్+ఆస్తే | = ఎవడు యోగములో కర్మేంద్రియములను కర్మలో ప్రవర్తింపకుండా నియమించి ఇంద్రియార్థములను మనస్సుచే స్మరించుచూ ఉండునో |
| సః+మిథ్యాచారః+<br>విమూఢాత్మా+ఉచ్యతే | = అతడు మిథ్యాచారుడనియు మూఢాత్ముడని చెప్పబడుచున్నాడు |
| అర్జున | = ఓ అర్జునా! |
| యః+ఇంద్రియాణి+<br>తు+మనసా+నియమ్య | = ఎవడు జ్ఞానేంద్రియములను వాటి వాటి ఇంద్రియార్థములపై ప్రసరించకుండా మనస్సు చేత నియమించి (దీనినే యోగములో ప్రత్యాహారముగా చెప్పుదురు.) |
| అసక్తః+కర్మేంద్రియైః | = ఇంద్రియార్థములందు, ఆసక్తి లేకుండా కర్మేంద్రియములచేత కర్మలను చేయుచున్నాడో |
| కర్మయోగమ్+ఆరభతే+<br>సః+విశిష్యతే | = ఎవడు కర్మయోగముగా చెప్పబడే పుణ్యకర్మలను, యోగమును, భక్తిని చేయుచున్నాడో అతడు సదాచారుడనియు శ్రేష్ఠుడనియు చెప్పబడుచున్నాడు |

**వ్యాఖ్యానము:-** బాహ్యముగా కర్మేంద్రియములను నియమించి మానసికముగా ఇంద్రియార్థములను స్మరించుచూ కర్మ చేయువాడు మిథ్యాచారుడు. జ్ఞానేంద్రియములను నియమించి ఇంద్రియార్థములందు ఆసక్తి లేకుండా కర్మేంద్రియములచే కర్మ చేయువాడు సదాచారుడు.

మనస్సుచే చేయబడు కర్మయొక్క ఫలితము, లింగ దేహమున నిల్వయుండి పునర్జన్మకు కారణమగును. ఇది కర్మ బంధమును కల్గించును. పునర్జన్మకు కారణ మయినదియు కర్మ బంధమును గలుగచేయునదియు అయిన కర్మను, ఇతడు చేయుటచే, ఇతడు విమూఢాత్మా అని చెప్పబడుచున్నాడు.

పుణ్యకర్మలు చేయుచూ, ఇంద్రియార్థములను మనస్సుచే నియమించినవాడు సదాచారుడు, శ్రేష్ఠుడు. యోగములో పంచేంద్రియోన్మాదంబున్ పరిమార్చి, ప్రత్యాహారముగా చెప్పబడే ఇంద్రియార్థములను మనస్సుచే నియమించి, బుద్ధిలతకున్ మాఱాకు హత్తించువాడు శ్రేష్ఠుడు. ఇతడు కర్మేంద్రియములచే కర్మ చేసినను అది బంధముకాదు.

...... ❖ ❖ ❖ ......

దేహనిర్వహణ కర్మ - జాతి ధర్మములు

**నియతం కురు కర్మ త్వం । కర్మజ్యాయో హ్యకర్మణః ।**
**శరీర యాత్రాఽపి చ తే । న ప్రసిద్ధ్యేదకర్మణః ॥ 8**

నియతమ్ – కురు – కర్మ – త్వమ్ – కర్మ – జ్యాయః – హి – అకర్మణః
శరీర యాత్రా – అపి – చ – తే – న – ప్రసిద్ధ్యేత్ – అకర్మణః

| | | |
|---|---|---|
| అకర్మణః+ | = | శరీరమునకు సంబంధించిన కర్మలు చేయని వానికి |
| శరీరయాత్రా+అపి+ | | దేహనిర్వహణ కూడా చక్కగా నడవదు. కావున |
| న+ప్రసిద్ధ్యేత్ | | శరీరమునకు సంబంధించిన పనులు చేయుచూ |
| చ+త్వమ్+నియతమ్+ | = | మఱియు నీవు నీ జాతివారికి, నీ ఆశ్రమము |
| కర్మ+కురు | | వారికి, చెప్పిన వాటిని, అనగా జాతిధర్మములను, |

| | | |
|---|---|---|
| | | ఆశ్రమ ధర్మములను అటులనే విధులను బాధ్యతలను చేయుము |
| హి | = | పాపకర్మలను చేయకుము. |
| అకర్మణః+కర్మ+ జ్యాయః + (చ)+ (న) + ప్రసిద్ధ్యేత్ | = | పుణ్యకర్మలు చేయకుండా ఉండుటకంటే పుణ్యకర్మలు చేయుట శ్రేష్ఠము మఱియు పుణ్యకర్మలు చేయుచూ, అరిషడ్వర్గములను వీడనిచో ఆత్మ స్థానము సిద్ధింప నేరదు. కావున జాతి, ఆశ్రమ ధర్మములను పాటింపుచూ పుణ్య కర్మలు చేయుచూ అరిషడ్వర్గములను జయింపుము. |

**వ్యాఖ్యానము :-** ఇహలోకమునకు సంబంధించినవి గాని, పరలోకమునకు సంబంధించినవి గాని అయిన పాప కర్మలను చేయకుము. ఇతర జాతి ధర్మములను, ఇతర ఆశ్రమ ధర్మములను పాటించుట, ఇహలోకమునకు సంబంధించిన విధులు, బాధ్యతలు నెఱవేఱ్చక పోవుట పాపము. కావున నీవు అటువంటి పాపపు పనులు చేయకుము. శాస్త్ర విహితము గాని పుణ్య కర్మాచరణ చేయుట పరలోకమునకు సంబంధించిన పాపము. ఈ పాపమువలన నరకము గలుగును. అటులనే లోకమున మంచి పేరు గలుగదు. అపకీర్తి గలుగును.

కేవలము జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు పాటించినను విధులను, బాధ్యతలను నెఱవేఱ్చినను ఆత్మస్థానము చేరలేడు.

జాతి ఆశ్రమ ధర్మములను ఆచరించుచూ అరిషడ్వర్గములను జయించినచో ఆత్మ స్థానమును పొందుదురు. దీనికి ఉదాహరణగా నారదుని పూర్వజన్మలో అతని తల్లి గుఱించి, నారదుని పూర్వ జన్మ వృత్తాంతము గుఱించి భాగవతమున ప్రథమస్కంధములో ఇట్లు చెప్పబడినది. నారదుడు పూర్వ కల్పంబున ఒక శూద్రజాతి స్త్రీకి జన్మించినాడు. నారదుని తల్లి శూద్ర జాతికి చెప్పబడిన సేవా ధర్మమును ఆచరించినది. అనగా బ్రాహ్మణుల ఇంట పని చేసినది. కాని ఆమె సంసార తాపత్రయములలో చిక్కుకొని, పుత్ర వ్యామోహము గలిగియున్నది. మోహాది

అరిషడ్వర్గములను జయించ లేదు. ఒకనాడు ఆమె పాము కఱచి చనిపోయినది. ఇంతటితో ఆమె కథ పూర్తి అయినది.

నారదుడు గత కల్పములో శూద్రుడుగా పుట్టి అతడు తన జాతివారికి చెప్పిన సేవా ధర్మమును పాటించినాడు. చాతుర్మాస దీక్షచేయు యోగి జనులకు సేవచేసినాడు. వారిచే ఆత్మతత్త్వమును గ్రహించినాడు. తల్లి చనిపోగా దుఃఖ సాగరమున కొట్టు మిట్టాడక, ఇంటిని వదలి, అరణ్యమునకు వెళ్ళి, అరిషడ్వర్గములను జయించి భగవంతునుని ధ్యానించి, ఈశ్వరుని దర్శించినాడు. ఆ శరీరమును వదలి, బ్రహ్మ కుమారునిగా ఈ కల్పమున జనియించినాడు.

కావున జాతి ధర్మములను, ఆశ్రమ ధర్మములను పాటించుచు, పుణ్యకర్మలను చేయుచూ, అరిషడ్వర్గములను జయించిన ఆత్మ స్థానము సిద్ధించును.

కేవలము జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు పాటించినంతమాత్రమున ఆత్మ స్థానము సిద్ధింపదు.

...... ❖ ❖ ❖ ......

కర్మ బంధము - కర్మబంధము కాదు

**యజ్ఞార్థా త్కర్మణోఽ న్యత్ర । లోకోఽ యం కర్మబంధనః ।**
**తదర్థం కర్మ కౌంతేయ । ముక్తసంగః సమాచర ॥ 9**

యజ్ఞార్థాత్ – కర్మణః – అన్యత్ర – లోకః – అయమ్ – కర్మబంధనః
తదర్థమ్ – కర్మ – కౌంతేయ – ముక్తసంగః – సమాచర

కౌంతేయ = ఓ అర్జునా!

**కర్మబంధము :**

| | | |
|---|---|---|
| యజ్ఞార్థాత్+కర్మణః | = | ఫలితము కోరని యజ్ఞయాగాది పుణ్యకర్మలకంటె |
| అన్యత్ర+కర్మ+ | = | ఫలితము కోరిన యజ్ఞయాగాది పుణ్యకర్మయు, |
| అయమ్+లోకః+ | | ఇహలోకమునకు సంబంధించిన విధులు, |
| కర్మబంధనః | | బాధ్యతలు, వృత్తి, వ్యాపారాదులు ఈ లోకమున కర్మబంధము అగుచున్నది. కావున |

**కర్మ బంధము కాదు :**

| | | |
|---|---|---|
| తదర్థమ్+ | = | పుణ్యకర్మలయందు ఫలాపేక్ష లేనివాడవై |
| ముక్తసంగః(సన్)+ | | పుణ్యకర్మలు చక్కగా ఆచరింపుము. |
| సమాచార | | అప్పుడు కర్మబంధము కాదు. |

**వ్యాఖ్యానము :-** ఇహలోక-పరలోక సుఖాలు పొందాలనుకునే వారు యజ్ఞములు చేయవలయును. అనగా పుణ్యకర్మలు ఆచరించవలయును. బ్రాహ్మణ క్షత్రియజాతి వారికి యజ్ఞములు చెప్పబడినవి. ధనము గలవారలకు దాన ధర్మములు చెప్పబడినవి. పుణ్య కర్మలు జాతి ఆశ్రమ ధర్మములలో చెప్పబడినట్లు చేయవలయును. పుణ్యకర్మలు చేసి పుణ్యఫలితము కోరిన కర్మ బంధమగును. పుణ్యఫలితము కోరనిచో కర్మబంధము కాదు. యోగములో అణిమాది అష్టసిద్ధులను కోరిన కర్మబంధము. వాటిని కోరనిచో కర్మ బంధము కాదు. భక్తిపద్ధతిలో భక్తులు ఏక చిత్తంబున పరమాత్మను ధ్యానించి అహంకార నిబద్ధంబగు కర్మను త్రుంచివైతురు. భక్తిపద్ధతిలో కోరికలు కోరిన కర్మ బంధము. కోరనిచో కర్మ బంధము కాదు.

...... ❖ ❖ ❖ ......

వేదకాలములో పుణ్యకర్మలలో ప్రధానమయినది యజ్ఞము. ఇక్కడ ద్రవ్యమయమయిన బాహ్య యజ్ఞము గుఱించియే చెప్పబడుచున్నది.

**సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా । పురోవాచ ప్రజాపతిః ।**
**అనేన ప్రసవిష్యధ్వమేషవోఽ_స్త్విష్టకామధుక్ ॥ 10**

సహ - యజ్ఞాః - ప్రజాః - సృష్ట్వా - పురా - ఉవాచ - ప్రజాపతిః
అనేన - ప్రసవిష్యధ్వమ్ - ఏషః - వః - అస్తు - ఇష్టకామధుక్.

**దేవాన్భావ యతానేన । తే దేవా భావయన్తు వః ।**
**పరస్పరం భావయంతః । శ్రేయః పరమవాప్స్యథ ॥ 11**

దేవాన్ - భావయత - అనేన-తే-దేవాః-భావయంతు-వః
పరస్పరమ్ - భావయంతః - శ్రేయః - పరమ్ - అవాప్స్యథ.

**ఇష్టాన్భోగాన్హి వో దేవా । దాస్యంతే యజ్ఞభావితాః ।**

**తైర్దత్తాన ప్రదాయైభ్యో । యో భుంక్తే స్తేన ఏవ సః ॥ 12**

ఇష్టాన్ – భోగాన్ – హి – వః – దేవాః – దాస్యంతే – యజ్ఞభావితాః

తైః – దత్తాన్ – అప్రదాయ – ఏభ్యః – యః – భుంక్తే – స్తేనః – ఏవ – సః

**యజ్ఞశిష్టాశిన స్సంతో । ముచ్యంతే సర్వ కిల్బిషైః ।**

**భుంజతే తే త్వఘం పాపా । యే పచంత్యాత్మకారణాత్ ॥ 13**

యజ్ఞశిష్ట అశినః – సంతః – ముచ్యంతే – సర్వ – కిల్బిషైః

భుంజతే – తే – తు – అఘమ్ – పాపాః – యే – పచంతి – ఆత్మకారణాత్.

| | | |
|---|---|---|
| పురా+ప్రజాపతిః+ ప్రజాః+సహ+యజ్ఞాః+ సృష్ట్వా | = | పూర్వము సృష్ట్యాదియందు బ్రహ్మ ప్రజలతోపాటు యజ్ఞములను సృజియించి |
| ఏషః (యజ్ఞాః)+వః+ ఇష్టకామధుక్+అస్తు | = | ఈ యజ్ఞములు మీకు అనగా దేవతలకు, రాక్షసులకు, మానవులకు కోరిన కోర్కెలను నెఱవేర్చునవి అగుగాక అనియు |
| అనేన+ప్రసవిష్యధ్వమ్+ ఉవాచ | = | ఈ యజ్ఞము ద్వారా దేవ దానవ మానవులారా మీమీ కోరికలను పొంది, మీరు అభివృద్ధిని పొందుడు అని బ్రహ్మ పలికెను. |

దేవతలు, రాక్షసులు ప్రజాపతిని గూర్చి యజ్ఞములు చేసిరి. మానవులు దేవతల గుఱించి యజ్ఞము చేయుచున్నారు.

| | | |
|---|---|---|
| అనేన+దేవాన్+ భావయత | = | ఈ యజ్ఞము చేత ఏ కోరిక తీరుటకు ఏ దేవతను యజింపవలయునని వేదములో చెప్పబడినదో, ఆ విధముగా ఆ యా దేవతలను యజ్ఞముచేసి సంతోషపఱచుడు |

| | | |
|---|---|---|
| తే+దేవాః+వః+ భావయంతు | = | ఆ విధముగా యజింపబడిన ఆ దేవతలు మీకు వరములను ఒసగి సంతృప్తిని పొందించెదరు. ఆ విధముగా |
| పరస్పరమ్+భావయంతః | = | మీరు దేవతలను, దేవతలు మిమ్ములను సంతృప్తిని పొందించుకొనుడు. |

మీరు యజ్ఞముచేసి యజ్ఞఫలితము కోరనిచో

| | | |
|---|---|---|
| పరమ్ + శ్రేయః+ అవాప్స్యథ | = | గొప్ప శ్రేయస్సు కలది అయిన బ్రహ్మపదమును పొందగలరు. |
| యజ్ఞ+భావితాః+దేవాః+ వః+ఇష్టాన్+భోగాన్+ దాస్యంతే | = | మీరు చేసిన యజ్ఞములచే సంతోషింపబడిన దేవతలు మీకు (మీరు కోరిన) ఇష్టములను భోగములను ఇచ్చెదరు. అనగా వరములు ప్రసాదింతురు |
| తైః+దత్తాన్+ఏభ్యః+ అప్రదాయ+యః | = | వారిచే ఇవ్వబడిన ఫలభోగములను తిరిగి దేవతలకు సమర్పింపక అనగా కర్మఫలత్యాగము చేయక ఎవడు వాటిని |
| భుంక్తే+సః | = | అనుభవించునో అనగా పుణ్యకర్మ ఫలితమును అనుభవించునో వాడు |
| స్తేనః + ఏవ+హి | = | దొంగవలె బద్ధుడగును. దొంగతనము చేసిన దొంగ చెఱసాలలో బందీ అయినట్లు కర్మ ఫలితమును కోరినవాడు కర్మ బద్ధుడగును. |
| యే+ఆత్మకారణాత్+ పచంతి+తే+పాపాః+ తు+అఘమ్+భుంజతే | = | ఎవరు యజ్ఞములు చేయక తన ఉదరపోషణకొఱకు ఆహారమును వండుకొందురో వారు పాపాత్ములు శాస్త్రవిహితముగా యజ్ఞము చేయనివారు కూడా పాపాత్ములే. వారు పాపమును పొందుచున్నారు. |

| | |
|---|---|
| యజ్ఞశిష్టఅశినః+సంతః+= సర్వ+కిల్బిషైః+ ముచ్యంతే | యజ్ఞము చేసి యజ్ఞములో ఆహుతులు యివ్వగా మిగిలిన అన్నమును భుజించునట్టి సత్పురుషులు వేదవిహితముగా అనగా యథావిధి, యథా శాస్త్రముగా యజ్ఞము చేయుదురో వారు సర్వపాపముల నుండి విడివడుచున్నారు |

**వ్యాఖ్యానము:-** ప్రారంభ సృష్టి, అనంతర సృష్టి, ప్రజాపతుల సృష్టి, మిథునధర్మ సృష్టి అని సృష్టి నాలుగు విధములు. విరాట్‌పురుషుడు చేసినది ప్రారంభసృష్టి. బ్రహ్మ చేసినది అనంతరసృష్టి. ప్రారంభసృష్టిలోగలవన్నియు అనంతర సృష్టిలో గలవు. బ్రహ్మ దేవతలను, రాక్షసులను, మానవులను అటులనే మిగిలిన స్థావరజంగమములను, యజ్ఞములను, యజ్ఞసంభారములను, యజ్ఞము చేయు విధివిధానమును సృజియించెను. (భాగవతం – తృతీయస్కంధం) ఆవిధముగా సృజియించి బ్రహ్మ స్వాయంభువ మనువుతోయజ్ఞములు చేయమని చెప్పెను. ఇక్కడ యజ్ఞమనగా ద్రవ్యయజ్ఞము. యజ్ఞము చేయు విధివిధానము గుఱించి కృష్ణయజుర్వేదము – తైత్తిరీయ సంహిత వివరించును.

పుణ్యఫలితము కోరకపోవుటవలన బ్రహ్మ లోకము చేరి అధికార పురుషులగుదురు. తిరిగి భూలోకమున జన్మించరు. ద్రవిడ దేశపు రాజు పూర్వకల్పంబున ఒక నదీ సమీపమున విష్ణువు గుఱించి తపస్సు చేసెను. అతనిని విష్ణువు **మత్స్యావతారము** ధరించి జల ప్రళయమునుంచి రక్షించెను. ఆ రాజు నేడు సప్తమ మనువు అయిన వైవస్వత మనువుగా పాలించుచున్నారు. అటుల పుణ్య ఫలితము కోరనివాడు కర్మబద్ధుడు కాడు. అతడు బ్రహ్మపదమును చేరును. కర్మఫలితమును తిరిగి దేవతలకు సమర్పింప వలయుననుటకు ఉదాహరణగా ఈ కథ చెప్పబడినది.

పాల సముద్ర మథనములో లభించిన అమృతమును తిరిగి దేవతలు విష్ణువునకు సమర్పించిరి. ఆ తరువాత మోహినిగా విష్ణువు అమృతమును దేవతలకు పంచెను. కావున వీరు కర్మ బద్ధులుకారు. పుణ్యకర్మలు చేయవలయునే కాని వాటి ఫలితమును కోరరాదు అన్నది ఇందలి **సందేశము**. దేవతలు, యజ్ఞముచేసి అభివృద్ధిని పొందిరి.

అనగా వారి కోర్కెలను నెఱవేఱ్చుకొనిరి. అదే క్రమములో వారి వారి కోర్కెలు నెఱవేఱుటకు రాక్షసులు యజ్ఞముచేసిరి. ఆతర్వాత ఋషులు నిష్కాములై యజ్ఞముచేసి ఆత్మస్థానమును పొందిరి. కావున వారి వారి కోర్కెలు నెఱవేఱుటకు మానవులు ఆ ఆ దేవతలను యజింపవలయును. ఏ ఏ కోరికకు ఏఏ దేవతను ఎట్లు యజింపవలయునో కృష్ణ యజుర్వేదము చెప్పినది.

**కృష్ణ యజుర్వేదము:** ఐశ్వర్యమును, గ్రామాధిపత్యము, సంతానము, దీర్ఘాయువు కోరువాడు వాయుదేవత కొఱకు తెల్లని పశువును యజ్ఞమున ఆలంబనము చేయవలయును. ప్రజాపతి కొఱకు కొమ్ములు లేని మేకను ఆలంబనము చేయవలయును. పశువులను కోరువారు పూష దేవతకు మేకకు ఒకే సారి పుట్టిన మూడు పిల్లలో నొకదానిని ఆలంబనము చేయవలయును. ఆ విధముగా విధి నిషేధములతో యజ్ఞ విధి విధానము చెప్పబడినది. యజ్ఞమును జాతి, ఆశ్రమముల ప్రకారము కర్మలలో అధికారము గలవారు మాత్రమే చేయవలయును. శాస్త్ర విధిని అనుసరించి చేసిన ఫలితముండును. అశ్రద్ధగా చేసినవాడు లేదా అధికారము లేనివారు చేసిన విపరీత ఫలితము కలుగును.

**ఉదా:** నృగుమహారాజు అశ్రద్ధగా ఒక గోవును బ్రాహ్మణునికి దానము యిచ్చి తత్ఫలితముగా ఊసరవెల్లిగా పుట్టినాడు.

**ఉదా:** చండాలత్వము పొందిన త్రిశంకుడు స శరీరముతో స్వర్గము చేరుటకు విశ్వామిత్రుని బ్రహ్మగా చేసుకొని యజ్ఞమును చేసినను అతడు స్వర్గ నివాసి కాలేదు. సరిగదా విపరీత ఫలము గల్గినది. అనగా తల క్రిందులుగా స్వర్గమునుండి క్రిందికి త్రోసివేయబడినాడు. కావున పుణ్యకర్మలు అశ్రద్ధగా చేయరాదు.

భాగవతము ద్వితీయ స్కంధము మూడవ అధ్యాయము రెండవ శ్లోకమునుంచి పదవ శ్లోకమువఱకు ఏఏ కోరికలకు ఏఏ దేవతలను యజింపవలయునో చెప్పినది.

**"బ్రహ్మవర్చస కామః తు బ్రహ్మణ పతిమ్ యజేత"** –
బ్రహ్మవర్చస్సును కోరువాడు బ్రహ్మను
**ప్రజాకామః ప్రజాపతీన్** సంతానము కోరువాడు ప్రజాపతులను
**శ్రీకామః దేవీమ్** శ్రీకాముడు దుర్గాదేవిని

**తేజస్కామః విభావసుమ్** తేజస్కాముడు అగ్నిని
**వసు కామః వసూన్** ధనమును కోరువాడు అష్టవసువులను
**వీర్య కామః రుద్రాన్** వీర్యకాముడు ఏకాదశ రుద్రులను
**ఆయుష్కామః అశ్వినౌ** ఆయువును కోరువాడు అశ్వినీ దేవతలను
**స్త్రీ కామః అప్సర ఊర్వశీమ్** స్త్రీలను కోరువాడు అప్సరస అయిన ఊర్వశిని
**విద్యా కామః గిరిశమ్** విద్యను కోరువాడు శివునిని యజింపవలయును.
పాపము ఇనుప సంకెల, పుణ్యము బంగారు సంకెల అని గుర్తుంచుకొనవలయును.

యజ్ఞము చేయుటవలన సర్వ పాపములనుంచి విడివడుచున్నారు. అనగా వారికి ఇనప సంకెల తొలగినది. వారు పుణ్య ఫలితమును కోరుటచే ఆ పుణ్య ఫలితము వారిని బంగారు సంకెలుగా బంధించు చున్నది. ఈ కర్మబంధము వలన పుణ్యము క్షీణించగనే తిరిగి జన్మించుచున్నారు.

...... ❖ ❖ ❖ ......

ఈ శ్లోకములలో కర్మ ఎప్పుడు కలిగినది, ఆహారము ఎట్లు కలుగును మఱియు ఆహారము వలన కలిగిన వీర్యమువలన మిథునసృష్టిలో ప్రాణుల పుట్టుక అను మూడు విషయములు చెప్పబడినవి

**అన్నాద్భవంతి భూతాని । పర్జన్యాదన్న సంభవః ।**
**యజ్ఞాద్భవతి పర్జన్యో । యజ్ఞః కర్మ సముద్భవః ॥ 14**

అన్నాత్ – భవంతి – భూతాని – పర్జన్యాత్ – అన్నసంభవః
యజ్ఞాత్ – భవతి – పర్జన్యః – యజ్ఞః – కర్మ సముద్భవః

**కర్మబ్రహ్మోద్భవం విద్ధి । బ్రహ్మాక్షర సముద్భవం ।**
**తస్మాత్సర్వ గతం బ్రహ్మ । నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ 15**

కర్మ – బ్రహ్మోద్భవమ్ – విద్ధి – బ్రహ్మ – అక్షర సముద్భవమ్
తస్మాత్ – సర్వ గతమ్ – బ్రహ్మ – నిత్యమ్ – యజ్ఞే – ప్రతిష్ఠితమ్

ప్రజలు పుణ్యాత్ములని, వ్యర్థజీవులని, పాపాత్ములని మూడు తెఱగులు.

**ఏవం ప్రవర్తితం చక్రం । నాను వర్తయతీహ యః ।**

**అఘాయురింద్రియా రామో । మోఘం పార్థ స జీవతి । 16**

ఏవమ్ – ప్రవర్తితమ్ – చక్రమ్ – న – అనువర్తయతి – ఇహ – యః

అఘాయుః – ఇంద్రియారామః – మోఘమ్ – పార్థ – సః – జీవతి

ఆత్మవా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించనమిషత్ (ఐతరీయ ఉపనిషత్ – ప్రథమోధ్యాయః ప్రథమఖండః–1) సృష్ట్యాది యందు ఆత్మ ఒక్కటే గలదు. ఇంకేదియూ లేదు. ఆ ఆత్మ నశింపనిది. అక్షరము ఆ పరబ్రహ్మ సృష్టిచేయ సంకల్పించినాడు.

| | | |
|---|---|---|
| నిత్యమ్+సర్వగతమ్+ అక్షర సముద్భవమ్+ బ్రహ్మ | = | నిత్యుడు, సర్వగతుడు అయిన అక్షర పరబ్రహ్మనుండి చతుర్ముఖ బ్రహ్మ ఉద్భవమయినాడు. |

చతుర్ముఖ బ్రహ్మవలన సర్వ స్థావర జంగమములు సృజియింపబడినవి. అటులనే యజ్ఞములు, వేదములు, యజ్ఞమునకు సంబంధిన కర్మలు, గుణములు – గుణముల వలన సర్వప్రాణుల కర్మలు గలిగినవి. కావున సర్వప్రాణుల

| | | |
|---|---|---|
| కర్మ+బ్రహ్మోద్భవమ్+ విద్ధి+బ్రహ్మ | = | కర్మ బ్రహ్మవలన సృజియింపబడినదని గ్రహింపుము. అనగా సృష్ట్యాదియందే ప్రాణులు చేయు పనులు గుణకర్మలవలన నిర్ణయింపబడినవి. |
| యజ్ఞే+ప్రతిష్ఠితమ్+ తస్మాత్ | = | యజ్ఞమునందు సర్వకోరికలను పొందు విధి విధానము ప్రతిష్ఠితమై ఉన్నది అందువలన సర్వకోరికలు నెఱవేఱుటకు యజ్ఞము చేయవలయును. |

యజ్ఞో వై విష్ణుః – అని శ్రుతి కలదు. యజ్ఞము విష్ణు స్వరూపము. కావున పరబ్రహ్మ యజ్ఞమునందు ప్రతిష్ఠితుడైనాడు అనికూడా చెప్పవచ్చును.

| | | |
|---|---|---|
| యజ్ఞః | = | యజ్ఞము మొదలయిన పుణ్యకర్మలు. |
| కర్మ సముద్భవః | = | జాతి ఆశ్రమ ధర్మముల ప్రకారము (విహిత కర్మల వలన) ఏర్పడినవి. |
| యజ్ఞాత్+పర్జన్యః+ భవతి | = | ఋత్విక్కులు నల్లని వస్త్రము ధరించి గలిజేరు మొక్కతో విధివిధానముగా **కారేరి** అను యజ్ఞము చేయుటవలన పర్జన్యుడు అనగా మేఘము, మేఘమువలన వర్షము గలుగుచున్నది |
| పర్జన్యాత్+అన్న సంభవః | = | భూమిపై వర్షము పడుటవలన వ్యవసాయమునకు అనుకూలమై విత్తనములు మొలకెత్తి సస్యశ్యామలమై అన్నము గలుగుచున్నది. |
| అన్నాత్+భూతాని+ భవంతి | = | అన్నము వలన కలిగిన వీర్యమువలన ప్రాణులు ఉత్పన్నమగుచున్నవి. ఆత్మస్థానము చేరనివి. చనిపోయి మరల పుట్టుచున్నవి |
| పార్థ | = | ఓ అర్జునా! |
| ఏవమ్+చక్రమ్+ ప్రవర్తితమ్ | = | ఈ విధముగా జనన మరణ చక్రము ప్రవర్తించుచున్నది. అనగా పుణ్య ఫలితములను కోరినవాడు జనన మరణ వలయములో చిక్కుకొని, తిరుగాడునే తప్ప ఆత్మ స్థానమును చేరలేడు. |

**పాపాత్ముడు**

| | | |
|---|---|---|
| ఇహ+యః+న+ అనువర్తయతి+సః+ అఘాయుః | = | ఈ భూలోకమున ఎవడు యజ్ఞములు, పుణ్యకర్మలు చేయడో, మఱియు పాపకర్మలు చేయునో అతడు పాపాత్ముడు. మఱియొకడు |

**వ్యర్థజీవి**

| | | |
|---|---|---|
| ఇంద్రియారామః | = | విషయాసక్తుడై ఇంద్రియముల ప్రీతికై ధనము సంపాదించి పుణ్యకర్మలు చేయక |
| మోఘమ్+జీవతి | = | వ్యర్థముగా జీవించుచున్నాడు. ఇతడు వ్యర్థజీవి. |

**వ్యాఖ్యానము:-** సృష్ట్యాదియందే భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అనే పంచ భూతములు చేయవలసిన పనులు నిర్ణయింపబడినవి. అనగా వాటి కర్మలు నిర్ణయింపబడినవి. ఇంద్రాది దేవతలు, మృత్యువు చేయవలసిన పనులు నిర్ణయింపబడినవి. శరీరములోని ప్రతి ఇంద్రియమునకు ఒక పని నిర్దేశింపబడినవి. అనగా కన్నుకు చూపు, చెవులకు వినికిడి, మొదలైనవి నిర్దేశింపబడినది. ఈ విధముగా సృష్టిలోని దేవ, రాక్షస, మానవ, పశు పక్ష్యాది సర్వ జంగమములు, నక్షత్రములు, నదులు, సముద్రము, పర్వతములు, కొండలు, వృక్షములయొక్క ఆహారపు అలవాటులు, మొదలయిన సర్వకర్మలు నిర్ణయింపబడినవి. బ్రాహ్మణాదుల గుణములు, వారు చేయవలసిన కర్మలు నిర్ణయింపబడినవి. అనగా జాతి ధర్మములు నిర్ణయింపబడినవి. అటులనే ఆశ్రమ ధర్మములు నిర్ణయింప బడినవి. అనగా గుణమును బట్టి కర్మలు నిర్ణయింపబడినవి.

ఆ విధముగా బ్రాహ్మణ వర్ణములకు క్షత్రియులకు పుణ్యకర్మానుష్ఠానముగా యజ్ఞములు నిర్దేశింపబడినవి. అందువలన ఎవరికి నిర్ణయింపబడిన పనులు వారు చేయవలయును.

సింహము, పులి, మొదలయినవి క్రూరజంతువులుగా సృష్ట్యాదియందే నిర్ణయింపబడినవి. అప్పుడే వాటి ఆహారము, అలవాట్లు, సంతానము పొందు విధానము, అవి చేయు పనులు నిర్ణయింపబడినవి. అటులనే సర్వ ప్రాణుల గుఱించి ఊహించవలయును.

యజ్ఞములో పశువులను బలి యిచ్చుటవలన సోమలతచే తయారుచేయబడిన సోమరసముచే దేవతలకు చరు పురోడాశములు అగ్నిలో హోమము చేయుటచే దేవతలకు, పితృదేవతలకు ఆహారము ఒసగబడుచున్నది. **కారేరీ** అనే యజ్ఞమువలన వర్షము కలుగును. వర్షమువలన ప్రాణి కోటికి ఆహారము, అనగా పశువులకు గడ్డి, పక్షులకు పండ్లు గింజలు, మానవులకు ఆహారము గలుగుచున్నది. ఆహారమువలన జీవించుచున్న మృగములు ఇతర క్రూరమృగములకు ఆహారమగుచున్నవి. వర్షము వలన వృక్షలతా గుల్మాదులకు ఆహారము గలుగుచున్నది. ఈ విధముగా సర్వప్రాణులకు

ఆహారము గలుగుచున్నది. అన్నము వలన వీర్యము గలుగుచున్నది. ఆ వీర్యము స్త్రీ యోనిలో బడి గర్భము దాల్చుట జరుగుచున్నది.

ఎవడు యజ్ఞము చేసి, యజ్ఞఫలితము కోరి, కర్మ బద్ధుడగునో, వాడు పుణ్యలోకములకు చేరి, పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మించు చున్నాడు. మరల అతడు శ్రౌతస్మార్తాది కర్మలు చేసి మరణించుచున్నాడు. మరల జన్మించు చున్నాడు. అటులనే వ్యర్థజీవులు, పాపాత్ములు పుణ్యఫలితము కోరినవారు చనిపోయి మరల పుట్టుచున్నారు.

యజ్ఞములు చేయనివాడు అనగా పుణ్యకర్మలు చేయనివాడు ధన, కనక, వస్తు, వాహనాదులు, పశువులు, తోటలు, గృహము, మొదలయినవి సంపాదించి భార్యా పుత్రులతో ఆనందమును అనుభవించుచూ పుణ్య కర్మనుష్ఠానము చేయనివాడు వ్యర్థజీవి. పాపపు పనులు చేయనందున పాపాత్ముడు కాడు. ఇతడు ధర్మ కార్యములు చేయనందున ధర్మపరుడు కాడు. కావున ఇతడు వ్యర్థజీవి. పాపపు పనులు చేయువాడు వేదవిహితముగా పుణ్యకార్యములు చేయనివాడు పాపాత్ముడు.

...... ❖ ❖ ❖ ......

జ్ఞాని పుణ్యకర్మానుష్ఠానము విధిగా చేయనవసరములేదు

**యస్త్వా త్మరతి రేవ స్యాత్ । ఆత్మ తృప్తశ్చ మానవః ।**
**ఆత్మన్యేవ చ సంతుష్టః । తస్య కార్యం న విద్యతే ॥ 17**

యః - తు - ఆత్మరతిః - ఏవ - స్యాత్ - ఆత్మతృప్తః - చ - మానవః
ఆత్మని - ఏవ - చ - సంతుష్టః - తస్య - కార్యమ్ - న - విద్యతే

**నైవ తస్య కృతేనార్థో । నాకృతేనేహ కశ్చన ।**
**న చాస్య సర్వభూతేషు । కశ్చిదర్థవ్యపాశ్రయః 18**

న - ఏవ - తస్య - కృతేన - అర్థః - న - అకృతేన - ఇహ - కశ్చన
న - చ - అస్య - సర్వభూతేషు - కశ్చిత్ - అర్థవ్యపాశ్రయః

| | | |
|---|---|---|
| యః+మానవః+తు | = | ఏ మానవుడు సంసార తాపత్రయములలో ఉండియు |
| సంతుష్టః+చ+ ఆత్మని+ఏవ | = | నిత్య సంతుష్టుడై నిరంతరము ఆత్మయందే అనగా దేహ భావనలేని విదేహ స్థితియందే ఉండి |
| ఆత్మతృప్తః+చ+ ఆత్మరతిః+ఏవ+స్యాత్ | = | నిత్యసంతుష్టుడై యాదృచ్ఛాలాభ సంతుష్టుడై ఆత్మ రతి, ఆత్మ క్రీడలయందు ఉండునో |
| తస్య+కార్యమ్+ న+విద్యతే | = | అనగా సాంఖ్యునకు, జ్ఞానికి చేయవలసిన పుణ్యకర్మ విధిగా ఉండదు. అనగా అతడు పుణ్యకర్మ చేయవచ్చును లేదా చేయకపోవచ్చును. |
| చ | = | మఱియు ఏ యోగి పుంగవునికి లేదా జీవన్ముక్తునికి |
| సర్వభూతేషు | = | సర్వభూతముల యందు సమదర్శన గలవానికి |
| అస్య | = | జ్ఞానికి (జీవన్ముక్తునకు) |
| కశ్చిత్+న+ అర్థవ్యపాశ్రయః | = | కర్మఫలితముతో ఏ సంబంధము ఉండదు. |
| తస్య | = | అట్టివానికి అనగా నిష్కామ పుణ్య కర్మానుష్ఠాన పరుడయిన విదేహునికి శాంతత్వము గలిగి బ్రహ్మీభూతస్థితి పొందిన జీవన్ముక్తునకు |
| ఇహ+కృతేన+ఏవ+ కశ్చన+అర్థః+ న (అస్తి)+చ+ అకృతేన | = | ఈ లోకమున పుణ్యకర్మానుష్ఠానము చేయుటచేత ఎట్టి ప్రయోజనము లేదు మఱియు పుణ్యకర్మలు చేయక పోయినను నష్టములేదు. |

**వ్యాఖ్యానము :-** ఇహలోక పరలోక సుఖాపేక్షాపరుడై యుండునో, ఇంద్రియార్థములతో మనస్సు కలసి కర్మేంద్రియములతో అనుభవించునో అట్టివానికి పుణ్యకర్మాచరణ విధింపబడినది. ఎవడు పుణ్యకర్మలు చేయుచూ సంసార తాపత్రయములను వీడి, సర్వ కోరికలను వదలి ఇంద్రియార్థములపై మనస్సు ప్రసరింపకుండా చేసి, పుణ్య ఫలితము కోరక, త్రిగుణాతీతుడై జీవత్వమును

నశింపజేసుకొని ఉండునో అట్టి సాంఖ్యునకు పుణ్యకర్మ విధిగా చేయవలయునని విధింపబడలేదు. అతడు పుణ్యకర్మ చేయవచ్చును లేదా చేయకుండా ఉండవచ్చును.

కర్మబంధము కాదు.

**తస్మాదసక్తః సతతం । కార్యం కర్మ సమాచర ।**
**అసక్తో హ్యాచరన్కర్మ । పరమాప్నోతి పూరుషః ॥ 19**

తస్మాత్ – అసక్తః – సతతమ్ – కార్యమ్ – కర్మ – సమాచర
అసక్తః – హి – ఆచరన్ – కర్మ – పరమ్ – ఆప్నోతి – పూరుషః

| | | |
|---|---|---|
| తస్మాత్+అసక్తః+ సతతమ్+కార్యమ్+ కర్మ | = | అందువలన పుణ్యకర్మాచరణ చేయుచూ ఫలాపేక్షలేని వాడవై నిత్యము చేయదగిన కర్మను అనగా యజ్ఞ యాగాది పుణ్యకర్మానుష్ఠానమనే కర్మను వేదవిహితముగా |
| సమాచర | = | శ్రద్ధగా, నిష్కామముగా చేయుము. |
| అసక్తః+కర్మ+ ఆచరన్+పూరుషః | = | ఫలాపేక్షలేక కర్మను ఆచరించుచున్న పురుషుడు కర్మబంధముల నుండి విడివడి |
| హి | = | శాంతిని పొంది దేహత్యాగానంతరము |
| పరమ్+ఆప్నోతి | = | పరమపదమును అనగా ఆత్మస్థానమును పొందును. |

**వ్యాఖ్యానము :-** శిష్యులు వేదము నేర్చుకొనునప్పుడు శ్రద్ధగా వల్లెవేసి నేర్చుకొందురు. వారు గురువులయిన తర్వాత శ్రద్ధగా వేదమును శిష్యులకు చెప్పుదురు. అంటే శిష్యులుగా ఉంటూ వేదము చదివినారు. గురువులు అయిన తర్వాత వేదము చెప్పినారు. కావున జ్ఞానము గలిగిన తర్వాత కూడా కర్మాను ష్ఠానం చేయవలసినదే. ఏదో అజగరవృత్తిలో గల ఒక మహానుభావుని ఉదాహరణగా తీసుకొని కర్మానుష్ఠానము మానరాదు.

...... ❖ ❖ ❖ ......

పుణ్యకర్మల ఫలితము కోరక పుణ్యకర్మలు చేయవలయును.

**కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః ।**
**లోక సంగ్రహమేవాపి । సంపశ్యన్ కర్తుమర్హసి ॥ 20**

కర్మణా - ఏవ - హి - సంసిద్ధిమ్ - ఆస్థితాః - జనకాదయః
లోక సంగ్రహమ్ - ఏవ - అపి - సంపశ్యన్ - కర్తుమ్ - అర్హసి

| | | |
|---|---|---|
| జనకాదయః | = | నిమి చక్రవర్తి పుత్రుడైన జనకుడు మొదటి జనకుడు జనకుని వంశమునందు జనియించిన మిథిలానగరాధిపతులందఱు జనకుడను పేరునే ప్రసిద్ధులైరి. జనకుడు మొదలైనవారు |
| కర్మణా+ఏవ | = | యజ్ఞ యాగాది పుణ్యకర్మానుష్ఠానముచేసి తత్ఫలితమును కోరకపోవుట చేతనే |
| హి | = | శాంతిని పొంది జీవన్ముక్తులై దేహత్యాగానంతరము |
| సంసిద్ధిమ్ + ఆస్థితాః | = | పరమపదమైన ఆత్మ స్థానమును పొందిరి. కావున ఓ అర్జునా! నీవు |
| లోక సంగ్రహమ్+ ఏవ+అపి | = | లోకములోని సామాన్య ప్రజలను పుణ్య కర్మానుష్ఠానమను సన్మార్గమున ప్రవర్తింప చేయుటకు కూడా |
| సంపశ్యన్ | = | సామాన్య జనులను దృష్టిలో ఉంచుకొని కూడా నీవు పుణ్యకర్మానుష్ఠానము |
| కర్తుమ్+అర్హసి | = | చేయుటకు తగియున్నావు. అనగా సామాన్య జనులను దృష్టిలో ఉంచుకొని నీవు పుణ్య కర్మానుష్ఠానము చేయవలయును. |

**వ్యాఖ్యానము:-** మిథిలాధిపతులకు జనకుడు అనునది ఒక బిరుదు లాంటిది. నిమికొడుకు జనకుడు. అప్పటినుంచి ఆ వంశస్థులందఱూ కర్మానుష్ఠాన రహస్యము

తెలుసుకొని ఆత్మదర్శనంచేసి ప్రతివారూ జనకులు అయినారు. సీత తండ్రి అయిన జనకుని పేరు ఆసీరధ్వజుడు. అలా భారతకాలము వఱకు ఆవంశస్థులు అందఱు జనకులే. అయితే బలరాముడు మిథిలకు వెళ్ళి దర్శించిన జనకుని పేరుగాని, యిందు కృష్ణుడు ఉదహరించిన జనకుని పేరుగాని తెలియదు.

...... ❖ ❖ ❖ ......

లోకరీతి - పెద్దలను పిన్నలు అనుసరించెదరు.

**యద్యదా చరతి శ్రేష్ఠః । తత్తదేవేతరో జనః ।**
**స యత్ప్రమాణం కురుతే । లోకస్తదనువర్తతే ॥ 21**

యత్ – యత్ – ఆచరతి – శ్రేష్ఠః – తత్ – తత్ –ఏవ –ఇతరః – జనః
సః – యత్ – ప్రమాణమ్ – కురుతే – లోకః – తత్ – అనువర్తతే

శ్రేష్ఠః = శ్రేష్ఠుడు (పెద్దవారు–జ్ఞాని–గురువు).
యత్+యత్+ఆచరతి = వేటి వేటిని ఆచరించునో
ఇతరః+జనః+తత్+ తత్+ఏవ+అనువర్తతే = ఇతర జనులు అనగా పిన్నవారు వాటివాటినే ఆచరించెదరు. పెద్దలను పిల్లలు అనుకరించెదరు.
సః+యత్+ప్రమాణమ్+ కురుతే+తత్+లోకః = శ్రేష్ఠుడు దేనిని ప్రమాణముగా చేయుచున్నాడో దానినే లోకమందలి ప్రజలు ప్రమాణముగా అంగీకరింతురు.

**వ్యాఖ్యానము:-** విదేహస్థితిని పొందిన వానికి, జీవన్ముక్తునకు ఈ లోకములో చేయవలసిన విధులు లేవు. వారు పుణ్యకర్మలు చేసినను, చేయకపోయినను వారికి గలుగు నష్టము లేదు. కాని లోకములో ప్రజలు రాజును అనుసరించెదరు. "యథా రాజా తథా ప్రజాః" అటులనే ప్రజలు పెద్దలను, గురువులను, అనుసరించెదరు. తాత, తండ్రి మొదలయిన పెద్దలను చూచి పిల్లలు అనుకరించెదరు. కావున పెద్దలు లోకములో ప్రజల హితము కొఱకు, శ్రద్ధగా పుణ్య కర్మలు చేయవలయును అన్నది శ్రీకృష్ణ భగవానుని అభిప్రాయము.

కావున ఓ అర్జునా! ప్రజలు సన్మార్గమున ప్రవర్తించుటకు, నీవును పుణ్య కర్మలను ఫలితము కోరక ఆచరింపుము. పెద్దల ఆచరణ యితరులకు మార్గదర్శకముగా ఉండవలయును.

...... ❖ ❖ ❖ ......

శ్రీకృష్ణుడు తనని ఉదాహరణగా తీసుకొని
పుణ్యకర్మానుష్ఠానము గుఱించి చెప్పుచున్నాడు

**న మే పార్థాస్తి కర్తవ్యం । త్రిషులోకేషు కించన ।**
**నానవాప్తమవాప్తవ్యం । వర్త ఏవ చ కర్మణి ॥ 22**

న – మే – పార్థ – అస్తి – కర్తవ్యమ్ – త్రిషులోకేషు – కించన
న – అనవాప్తమ్ – అవాప్తవ్యమ్ – వర్త – ఏవ – చ – కర్మణి

**యది హ్యహం న వర్తేయం । జాతు కర్మణ్యతన్ద్రితః ।**
**మమ వర్త్మాను వర్తన్తే । మనుష్యాః పార్థ సర్వశః ॥ 23**

యది – హి – అహమ్ – న – వర్తేయమ్ – జాతు – కర్మణి – అతంద్రితః
మమ – వర్త్మ – అనువర్తన్తే – మనుష్యాః – పార్థ – సర్వశః

**ఉత్సీదేయురిమే లోకా । న కుర్యాం కర్మ చేదహమ్ ।**
**సంకరస్య చ కర్తా స్యామ్ । ఉపహన్యామి మాః ప్రజాః ॥ 24**

ఉత్సీదేయుః – ఇమే – లోకాః – న – కుర్యామ్ – కర్మ – చేత్ – అహమ్
సంకరస్య – చ – కర్తా – స్యామ్ – ఉపహన్యామ్ – ఇమాః – ప్రజాః

పార్థ = ఓ అర్జునా!
మే = నాకు పుణ్యకర్మలు ఆచరించుటచే
త్రిషులోకేషు = మూడు లోకములందు

| | | |
|---|---|---|
| అవాప్తవ్యమ్+న | = | పొందవలసిన సుఖభోగములు లేవు |
| చ | = | మఱియు |
| అనవాప్తమ్+ న+అస్తి | = | పొందబడనిదియు లేదు. నేను పూర్ణ కాముడను |
| కించన + కర్తవ్యమ్+ కర్మణి+ఏవ+(వర్తే) వర్త | = | నాకు సుఖ భోగములు పొందుటకై చేయవలసిన పుణ్య కర్మానుష్ఠాన కర్తవ్యము లేదు. అయినను నేను ఇతరులకు మార్గదర్శకునిగా ఉండుటకు పుణ్యకర్మలు చేయుటయందే ప్రవర్తించుచున్నాను |
| పార్థ | = | ఓ అర్జునా! |
| జాతు+అహమ్+ అతంద్రితః+హి+ కర్మణి+న+వర్తేయమ్+ యది | = | ఒకప్పుడైనా నేను శ్రద్ధగా శాస్త్రవిధి ప్రకారము పుణ్యకర్మల యందు ప్రవర్తింపకున్నచో అనగా నేను పుణ్యకర్మలు చేయనిచో దానిని ఉదాహరణగా తీసుకొని |
| మనుష్యాః+సర్వశః+ మమ+వర్త్మ+అనువర్తన్తే | = | మనుష్యులు సర్వవిధములా నా యొక్క మార్గమునే అనుసరింతురు. అనగా పుణ్య కర్మలు చేయక ఊర్ధ్వలోక ప్రాప్తిలేక చెడిపోవుదురు. అర్జునా! |
| అహమ్+కర్మ+ న+కుర్యామ్+చేత్+ ఇమే+లోకాః+ ఉత్సీదేయుః+చ | = | నేను పుణ్యకర్మను శ్రద్ధగాను, విధివిహితముగాను చేయనిచో 14 లోకములందలివారు చెడిపోవుదురు మఱియు |
| సంకరస్య+కర్తా+ స్యామ్+ఇమాః+ప్రజాః+ ఉపహన్యామ్ | = | శాస్త్రవిధి, శ్రద్ధ గలిగి పుణ్యకర్మలు చేయ వలయును. నేను శాస్త్ర విధిని పాటింపకయో లేక శ్రద్ధలేకయో లేక శాస్త్రవిధి, శ్రద్ధ అను ఈ రెండునూ లేకనో చేసినచో ప్రజలు నన్ను ఆదర్శముగా తీసుకొని నా మార్గమును అనుస రించుటచే, కర్మ |

సంకరమునకు కర్తను అగుదును. ఆవిధముగా ప్రజలను చెడగొట్టినవాడ నగుదును.

**వ్యాఖ్యానము :-** విరాట్ పురుషునిగా అతనికి మూడు లోకములందును చేయవలసిన సృష్టి, స్థితి, లయ కర్మలు ఉన్నవి. కాని ఒక మానవునిగా, జీవన్ముక్తునిగా, యోగీశ్వరునిగా అతను చేయవలసిన పుణ్య కర్మలు లేవు.

...... ❖ ❖ ❖ ......

జ్ఞానికూడా పుణ్యకర్మలను ఫలాపేక్ష లేక శ్రద్ధగా చేయవలయును.

**సక్తాః కర్మణ్య విద్వాంసో । యథా కుర్వంతి భారత ।**
**కుర్యాద్విద్వాంస్తథా సక్తః । చికీర్షుర్లోకసంగ్రహమ్ ॥ 25**

సక్తాః – కర్మణి – అవిద్వాంసః – యథా – కుర్వంతి – భారత
కుర్యాత్ – విద్వాన్ – తథా – అసక్తః – చికీర్షుః – లోకసంగ్రహమ్

**న బుద్ధి భేదం జనయే । దజ్ఞానాం కర్మసంగినామ్ ।**
**జోషయేత్సర్వ కర్మాణి । విద్వాన్యుక్తః సమాచరన్ ॥ 26**

న – బుద్ధి భేదమ్ – జనయేత్ – అజ్ఞానామ్ – కర్మసంగినామ్
జోషయేత్ – సర్వకర్మాణి – విద్వాన్ – యుక్తః – సమాచరన్

భారత = ఓ అర్జునా!
యథా+అవిద్వాంసః+ = ఏ విధముగా అవిద్వాంసులు, అజ్ఞానులు,
కర్మణి+సక్తాః+కుర్వంతి పండితమన్యులు పుణ్యకర్మలయందు ఫలాపేక్షగల వారలై చేయుచున్నారో
తథా = ఆవిధముగా
విద్వాన్ = విద్వాంసుడు (పండితుడు, జ్ఞాని)– పుణ్యకర్మల యందు

| | | |
|---|---|---|
| అసక్తః+ | = | ఫలాపేక్షలేక లోకకల్యాణమును చేయకోరువాడై |
| లోకసంగ్రహమ్+చికీర్షుః+ | | పుణ్యకర్మలు చేయవలయును. |
| కుర్యాత్ | | |
| విద్వాన్+కర్మసంగినామ్+ | = | ఫలాపేక్ష లేకుండా, పుణ్యకర్మలు శ్రద్ధగా, |
| అజ్ఞానామ్+బుద్ధి+ | | విధివిహితముగా చేయు విద్వాంసుడు ఫలాపేక్ష |
| భేదమ్+న+జనయేత్ | | పరులయిన అజ్ఞానులకు బుద్ధిభేదమును కలిగింపరాదు |
| సర్వకర్మాణి+యుక్తః+ | = | పుణ్యప్రదములయిన యజ్ఞయాగాది సర్వకర్మలను |
| సమాచరన్+జోషయేత్ | | విద్వాంసుడు శాస్త్రవిధి శ్రద్ధలతోగూడి ఆచరించుచూ వారిచే ఆచరింపజాయుచూ వారిని ఆనందింపచేయ వలయును. |

**వ్యాఖ్యానము :-** విద్వాంసులు, అవిద్వాంసులలో (పండితులు, పండితమన్యులలో) పుణ్యకర్మలు శాస్త్రవిహితముగా శ్రద్ధగా చేయుటలో ఎట్టి భేదములేదు. పుణ్యకర్మల ఫలితమును కోరుటలోనే భేదము కలదు. అవిద్వాంసులు పుణ్యకర్మల ఫలితమును కోరుదురు. విద్వాంసులు పుణ్యకర్మల ఫలితమును కోరరు.

అజ్ఞానులు ఒక మూఢవిశ్వాసమునకు బద్ధులై ఉందురు. అట్టివారికి జ్ఞాని సత్యమును చెప్పినచో అతనిని నాస్తికుడని పిలుతురు తప్ప మూర్ఖులు జ్ఞానవంతులు కాలేరు. నేడు వేదములో చెప్పని అనేక దేవీ, దేవతలు పూజలు అందుకొనుచున్నారు. వీరి గుఱించి వేదము చెప్పలేదని వేదప్రమాణమును చూపినను మూర్ఖులు మారరు సరిగదా ఆ చెప్పినవానిని నాస్తికులు అని అందురు. కావున జ్ఞాని అజ్ఞానులకు బుద్ధిభేదము కలిగించరాదు.

...... ❖ ❖ ❖ ......

సాంఖ్యపద్ధతి ప్రకారము ప్రకృతివలన జనియించిన గుణములు కర్మకు కారణము. కాని అజ్ఞాని తను కర్తనని భావించి భోక్త అగుచున్నాడు.

**ప్రకృతేః క్రియమాణాని । గుణైః కర్మాణి సర్వశః ।**
**అహంకార విమూఢాత్మా । కర్తాఽహమితి మన్యతే ॥ 27**

ప్రకృతేః - క్రియమాణాని - గుణైః - కర్మాణి - సర్వశః
అహంకార విమూఢాత్మా - కర్తా - అహమ్ - ఇతి - మన్యతే.

| | | |
|---|---|---|
| ప్రకృతేః+గుణైః+ క్రియమాణాని+సర్వశః+ కర్మాణి | = | సామాన్యుడు ప్రకృతివలన గలిగిన గుణములచేత చేయబడుచున్న సర్వపుణ్యపాపకర్మలకు |
| అహంకారవిమూఢాత్మా | = | అహంకారముచే వివేకశూన్యుడయినవాడు పండితమన్యుడు |
| అహమ్+కర్తా+ఇతి+ మన్యతే | = | నేను కర్తను అని తలంచుచున్నాడు. ఆవిధముగా అతడు కర్మబద్ధుడై భోక్త అగుచున్నాడు. జననమరణ వలయములో తిరుగాడుచున్నాడు. |

**వ్యాఖ్యానము:-** ఈశ్వరుడు ఏవిధముగా అరూపుడు, నిస్సంగుడు, నిర్గుణుడో అదేవిధముగా దేహి కూడా అరూపుడు, నిర్గుణుడు, నిస్సంగుడు. కాని అవిద్యవలన దేహముతోనూ, మనస్సులో అంతర్గతముగాగల గుణములతోనూ మమేకం అయి కర్మలకు తనే కర్తనని భావించి కర్మఫలితమునకు భోక్త అగుచున్నాడు. దేహము జడము, గుణములు జడము, దేహి చైతన్యస్వరూపుడు.

...... ❖ ❖ ❖ ......

జ్ఞాని కర్మబద్ధుడు కాడు

**తత్త్వవిత్తు మహాబాహో । గుణకర్మ విభాగయోః ।**
**గుణాగుణేషు వర్తన్త । ఇతి మత్వా న సజ్జతే ॥ 28**

తత్త్వవిత్ - తు - మహాబాహో - గుణ కర్మ విభాగయోః
గుణాః - గుణేషు - వర్తన్త (వర్తన్తే) - ఇతి - మత్వా - న - సజ్జతే.

మహాబాహో! ఓ అర్జునా!

| | | |
|---|---|---|
| గుణకర్మ విభాగయోః | = | గుణములవలన చేయబడు కర్మలను, పాప పుణ్యకర్మలవలన గలుగు ఫలితములను తెలిసిన అనగా గుణ-కర్మల విభాగమును తెలిసిన |
| తత్త్వవిత్ | = | తత్త్వవేత్త |
| గుణాః+గుణేషు+ (వర్తంతే) వర్తన్త+ఇతి+ మత్వా+న+ సజ్జతే | = | గుణములు, గుణములయందు ప్రవర్తించు చున్నవని గ్రహించి ఆసక్తుడు కాడు. ఆవిధముగా అతడు కర్మబద్ధుడు కాడు. కర్మఫలితమునందు ఆసక్తిని కలిగిఉండడు |

**వ్యాఖ్యానము :-** దేహి గుణములతో కూడి, ఆ గుణమునకు సంబంధించిన కర్మ చేయును.

సత్త్వగుణయుతులైన దేవతలు, ఋషులు, భగవంతునినే ఆశ్రయించి నిష్కామముగా అతనిని యజించుచున్నారు. వీరు కర్మబద్ధులు కారు. అటులనే సత్త్వగుణయుతులైన మానవులు నిష్కామముగా పుణ్యకర్మలు ఆచరించినవారు కర్మబద్ధులు కారు. సత్త్వగుణ ప్రధానులయినవారు ఇతరులను హింసింపక సాధుభావము గలిగి ఉన్నారు. రజోగుణయుతులైన మానవులు సత్కర్మలు చేయుచూ వాటి ఫలితములందు ఆసక్తి కలిగియున్నారు. తమోగుణయుతులైన రాక్షసులు హింసాది కర్మలు చేయుచున్నారు.

...... ❖ ❖ ❖ ......

జ్ఞాని బాధ్యత

**ప్రకృతేర్గుణ సమ్మూఢాః । సజ్జన్తే గుణ కర్మసు ।**
**తాన కృత్స్న విదో మన్దా । న్కృత్స్న విన్నవిచాలయేత్ ॥ 29**

ప్రకృతేః గుణ సమ్మూఢాః - సజ్జన్తే - గుణకర్మసు - తాన్
అకృత్స్నవిదః - మన్దాన్ - కృత్స్నవిత్ - న - విచాలయేత్

| | | |
|---|---|---|
| గుణకర్మసు+సజ్జన్తే | = | గుణముల యందు వాటివలన కలుగు కర్మలయందు ఆసక్తిగల కర్మనిష్ఠులు, పుణ్య కర్మ ఫలితములందు ఆసక్తులగుచున్నారు. శుద్ధ సత్త్వగుణ ప్రధానులైన వారు, సత్త్వగుణ ప్రధానులై పుణ్యకర్మలు చేసి వాటి పుణ్యఫలితములందు ఆసక్తులగుచుండుట లేదు. కావున |
| కృత్స్నవిత్+ప్రకృతేః+ గుణసమ్మూఢాః+ అకృత్స్నవిదః+మన్దాన్+ న+విచాలయేత్ | = | పుణ్య కర్మల స్వరూపముల నెఱిగిన జ్ఞాని ప్రకృతి వలన జనియించిన గుణములచే మోహితులైనవారికి మందబుద్ధిగలవారికి బుద్ధి భేదము గలిగించరాదు |

**వ్యాఖ్యానము :-** అనగా కర్మ ఫలా పేక్ష కూడదని చెప్పరాదు. ఎందువలన అనగా వారు తమోగుణ, రజోగుణయుతులు. కావున వారు పుణ్య కర్మలు చేసి వాటి ఫలితమును కోరుదురు. ఇది వారి స్వభావము. ఫలాపేక్షపరులైన వారు కర్మ ఫలితములందు నిర్వేదము పొందిన తర్వాతనే వారికి ఆత్మ తత్త్వమును, ఆత్మ స్థానమును చేరు విధానమును జ్ఞాని చెప్పవలయును.

...... ❖ ❖ ❖ ......

భక్తిపద్ధతి - ఈ పద్ధతిలో కర్మ బంధము కాదు.

**మయి సర్వాణి కర్మాణి । సన్న్యస్యాధ్యాత్మ చేతసా ।**
**నిరాశీర్నిర్మమో భూత్వా । యుధ్యస్వ విగతజ్వరః ॥ 30**

మయి – సర్వాణి – కర్మాణి – సన్న్యస్య – అధ్యాత్మచేతసా
నిరాశీః – నిర్మమః – భూత్వా – యుద్ధస్వ – విగతజ్వరః

**"తదేకంవద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్"** – అన్న ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు:

| | | |
|---|---|---|
| అధ్యాత్మ చేతసా+ | = | అధ్యాత్మభావనతో దేహేంద్రియ మనోబుద్ధులచే |
| సర్వాణి+కర్మాణి+ | = | చేయబడు సర్వకర్మలను నా యందు అనగా |
| మయి+సన్న్యస్య | | పరమాత్మయందు సమర్పించి |
| నిరాశీః+నిర్మమః+ | = | ఆశ లేనివాడవును మమకారం లేనివాడవును |
| భూత్వా+విగతజ్వరః | | అయి (ఫలితాఫలితములను ఆశింపక పుణ్యకర్మలను ఆచరింపుము) |

**కథాభాగము:**

| | | |
|---|---|---|
| విగతజ్వరః+యుద్ధస్వ | = | మనము జయించెదమా? లేక ఓడిపోవుదమా? అన్న సందేహము మాని, జయాపజయముల గురించి ఆలోచింపక, ద్వంద్వాతీతుడవై నీ జాతి ధర్మమయిన యుద్ధము చేయుము |

**వ్యాఖ్యానము :- పుణ్యకర్మానుష్ఠానము గురించి శ్రీకృష్ణుని అభిప్రాయము**

1. పాప కార్యములు చేయరాదు. వీరు పాపాత్ములు. వీరు నరకము పాలగుదురు. వీరిని ఈశ ఉపనిషత్తు **"ఆత్మ హనో జనాః"** అన్నది.
2. వృత్తి వ్యాపారములతో ధనము సంపాదించి, సంసారములో ఉండి ఇంద్రియ ప్రీతికై జీవించు ఆత్మారాములు వ్యర్థజీవులు. పొల్లు కబుర్లతో జీవితము గడుపువారు వ్యర్థజీవులు.

3. పుణ్య కర్మలు చేయవలయును. పుణ్యకర్మలు చేయకపోయినచో ఆత్మతత్త్వము పొందలేడు. యజ్ఞయాగాది పుణ్యకర్మలద్వారా దేవతలను యజింపవలయును. ఆ ఫలితమును దేవతలకు అర్పించి తిరిగి వారు యిచ్చిన ప్రసాదమును అనుభవించవలయును. పుణ్య కర్మలు చేసి, పుణ్య ఫలితము కోరువారికి నిశ్చయాత్మక బుద్ధి కలగదు. అనగా వారు అధ్యాత్మ తత్త్వమును గ్రహించలేరు. ద్వంద్వాతీతుడై, గుణరహితుడై పుణ్యకర్మలు చేయుచూ పుణ్యఫలితమును కోరకుండా ఉండవలయును. అనగా పుణ్య ఫలితమునందు నిర్వేదము పొందవలయును. ఇట్టి నిర్వేదము పొందిన వాడు ఆత్మ తత్త్వమును గ్రహించుటకు గురువును ఆశ్రయించవలయునని ముండక ఉపనిషత్ చెప్పినది.
4. పుణ్య ఫలితము కోరినచో, ఆపుణ్య కర్మ బంధము అగును. పుణ్య కర్మానుష్ఠానముగాక ఇహలోకమున సంసారమునకై చేయబడు కర్మ బంధము. ఆవిధముగా పుణ్య ఫలితము కోరనిచో, కర్మ బంధము కాదు.
5. దేహి గుణములవలన కర్మలు చేయుచున్నాడు. ఆ కర్మకు తను కర్తనని భావించి భోక్త యగుచున్నాడు. అనగా ఆ కర్మ ఫలితమును అనుభవించుచున్నాడు.
6. జ్ఞాని కూడా కర్మలు లోకహితముకొఱకు చేయవలయును.
7. జ్ఞాని అజ్ఞానికి బుద్ధి భేదము కల్గించరాదు.
8. నిరాశీ, నిర్మమ గలిగి పుణ్యకర్మలు అనుష్ఠించవలయును.

**యోగము:**

1. ఇంద్రియార్థములను మనస్సుతో అనుభవించువాడు మిథ్యాచారుడు.
2. జ్ఞానేంద్రియములను వాటి వాటి ఇంద్రియార్థములనుంచి మరలించి మనస్సుచే వాటిని నియమించి కర్తృత్వ భావన లేక కర్మేంద్రియములచే కర్మచేయువాడు సదాచారుడు, ఇతడు శ్రేష్ఠుడు. మనోబుద్ధులను ఏకంచేసి వాటిని కూటస్థునితోనూ, కూటస్థుని క్షేత్రజ్ఞునితోను కలపవలయును.
3. మనస్సులో ఆశ, మమకారములు లేకుండా గుణరహితుడై యోగమును అనుష్ఠించవలయును.

**భక్తి - పద్ధతి**

దేహేంద్రియ మనోబుద్ధులచే చేయబడు సర్వకర్మలు భగవంతుని పరంగా ఉండవలయును. దీనికి ఉదాహరణగా భాగవతం నవమస్కంధములో 86-88 పద్యములలో అంబరీషోపాఖ్యానములో చెప్పబడినది.

| | | |
|---|---|---|
| శిరస్సు | - | పరమాత్మముందు తలవంచి నమస్కరించుటయందు |
| చెవులు | - | హరికథలు వినుటయందు |
| కన్నులు | - | పరమాత్మ రూపలావణ్యములను వీక్షించుటయందు |
| నాలుక | - | తులసీదళములు తినుటయందు |
| ముక్కు | - | భగవంతునికి సమర్పించిన పూవులు మొదలయిన వాటియందు |
| నోరు | - | భగవన్నామమును జపించుటయందు |
| చేతులు | - | విష్ణుమందిరములు శుభ్రము చేయుటయందు |
| పాదములు | - | విష్ణుమందిరములకు వెళ్ళుటయందు |
| చిత్తము | - | విష్ణుపాదములచెంత |
| కామము | - | చక్రికైంకర్యమందు |
| సంగమము | - | భక్తులతో కలసి ఉండుట **(దీనినే ఏకాదశీ వ్రతము అందురు)** |

...... ❖ ❖ ❖ ......

కర్మబంధము కాని విధమును చెప్పుచున్నాడు

**యే మే మతమిదం నిత్య । మనుతిష్ఠంతి మానవాః ।**

**శ్రద్ధావంతోఽ న సూయంతో । ముచ్యంతే తేఽ పి కర్మభిః ॥31**

యే - మే - మతమ్ - ఇదమ్ - నిత్యమ్ - అనుతిష్ఠంతి - మానవాః

శ్రద్ధావంతః - అనసూయంతః - ముచ్యంతే - తే - అపి - కర్మభిః

అభిప్రాయమును పాటింపనిచో గలుగు ఫలితమును చెప్పుచున్నాడు

**యే త్వేతదభ్య సూయంతో । నాను తిష్ఠంతి మే మతమ్ ।**
**సర్వజ్ఞాన విమూఢాంస్తాన్ । విద్ధి నష్టాన చేతసః ॥ 32**

యే – తు – ఏతత్ – అభ్యసూయంతః – న – అనుతిష్ఠంతి – మే – మతమ్
సర్వజ్ఞాన విమూఢాన్ – తాన్ – విద్ధి – నష్టాన్ – అచేతసః

జీవుల స్వభావము

**సదృశం చేష్టతే స్వస్యాః । ప్రకృతేః జ్ఞాన వానపి ।**
**ప్రకృతిం యాంతి భూతాని । నిగ్రహః కిం కరిష్యతి ॥ 33**

సదృశమ్ – చేష్టతే – స్వస్యాః – ప్రకృతేః – జ్ఞానవాన్ – అపి
ప్రకృతిమ్ – యాంతి – భూతాని – నిగ్రహః – కిమ్ – కరిష్యతి.

| | | |
|---|---|---|
| శ్రద్ధావంతః+ అనసూయంతః | = | పుణ్యకర్మలు విధివిహితముగాను, శ్రద్ధ గాను చేయు శ్రద్ధావంతులై |
| యే+మానవాః | = | అసూయాది దుర్గుణములు లేనివారలైన యే మానవులు |
| మే+ఇదమ్+మతమ్ | = | నా యొక్క ఈ అభిప్రాయమును |
| నిత్యమ్+అనుతిష్ఠంతి+ అపి+తే+కర్మభిః+ ముచ్యంతే | = | ఎల్లప్పుడు అనుసరించెదరో అట్టివారు కర్మబంధములనుండి విడివడుదురు. ఆత్మస్థానమును కూడ పొందుదురు. |
| యే+మే+ఏతత్+ మతమ్+ అభ్యసూయంతః+న+ అనుతిష్ఠంతి | = | ఎవరు నా యొక్క ఈ అభిప్రాయమును నిందించుచున్నవారలై నా అభిప్రాయము ప్రకారము అనుసరించరో |
| తాన్+ సర్వజ్ఞాన విమూఢాన్+ అచేతసః | = | వారిని జ్ఞానమంతయు నశించిన మూర్ఖులుగా, పండితమన్యులుగా చిత్తశుద్ధి లేనివారినిగా |

| | | |
|---|---|---|
| తు+నష్టాన్+విద్ధి+ | = | కర్మ బంధములలో చిక్కుకొన్నవారినిగా ఆత్మస్థానమును పొందని వారినిగా గ్రహింపుము |
| ప్రకృతిమ్+భూతాని+ యాంతి | = | తమ స్వభావమునకు తగినట్లుగా సర్వ భూతములు అనగా ప్రాణులు కర్మలయందు ప్రవర్తిల్లుచున్నవి |
| జ్ఞానవాన్+అపి+ స్వస్యాః+ప్రకృతేః+ సదృశమ్+చేష్టతే+ నిగ్రహః+కిమ్+కరిష్యతి | = | జ్ఞానవంతుడు కూడ తన ప్రకృతికి తగినట్లుగా అనగా శుద్ధసత్త్వగుణప్రధానుడై అనగా పుణ్య ఫలితము కోరక పుణ్యకర్మలను నిష్కామముగా చేయుచున్నాడు. అజ్ఞాని, గుణయుతుడు ఇంద్రియ నిగ్రహము ఎట్లు చేయగలడు? |

దీనినే 42వ అధ్యాయములో 60వ శ్లోకములో నీవు యుద్ధము చేయను అని అన్నను నీ గుణమువలన నీవు యుద్ధము చేయుదువు అని అర్జునుడితో శ్రీకృష్ణుడు చెప్పెను.

**వ్యాఖ్యానము:-** దేవతలు తమ స్వభావములకు తగినట్లు సత్వగుణ ప్రధానమైన కర్మలయందు ప్రవర్తిల్లుచున్నారు. రాక్షసులు తమ ప్రవృత్తికి తగినట్లు యజ్ఞములకు విఘ్నముచేయుట, స్త్రీలను బలాత్కరించుట, స్వర్గమును ఆక్రమించుట అనగా సుఖభోగములందు మునిగి తేలుచున్నారు. రజోగుణయుతులైన మానవులు పుణ్య కర్మ ఫలితమును కోరుచున్నారు. సత్త్వగుణప్రధానులైన మానవులు కర్మ ఫలితమును కోరుట లేదు. తమోగుణ ప్రధానమైన పాము పగబట్టి కాటువేసి విషము గ్రక్కుచున్నది. క్రూరమృగములు, ఇతర సాధు జంతువులను చంపుచున్నవి. సత్వగుణ ప్రధానములైన ఆవు, మేకలు మొదలయిన పెంపుడు జంతువులు సాధువులుగా యున్నవి. ఈ విధముగా దేవ, దానవ, మానవ, పశు, పక్షి, మృగాదులు వాటి వాటి స్వభావమునకు తగినట్లు ప్రవర్తించుచున్నవి. కావున జ్ఞాని, విద్వాంసుడు, గుణరహితుడు అయిన వారు మాత్రమే ఇంద్రియములను నిగ్రహించగలరు. అజ్ఞాని, అవిద్వాంసుడు, గుణయుతుడు అయిన వారు నిగ్రహించలేరు. సాధనచే తన స్వభావమును మార్చుకొనవలయును అన్నది **ఉపదేశము**.

...... ❖ ❖ ❖ ......

దేహ విచారణ (ఇంద్రియములు - ఇంద్రియార్థములు)

**ఇంద్రియస్యేంద్రియస్యార్థే । రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయోర్న వశమాగచ్ఛేత్ । తౌ హ్యస్య పరిపంథినౌ ॥ 34**

ఇంద్రియస్య - ఇంద్రియస్య - అర్థే - రాగద్వేషౌ - వ్యవస్థితౌ
తయోః - న - వశమ్ - ఆగచ్ఛేత్ - తౌ - హి - అస్య - పరిపంథినౌ

| | | |
|---|---|---|
| ఇంద్రియస్య+ | = | ప్రతి జ్ఞానేంద్రియము యొక్క ఇంద్రియార్థమునందు |
| ఇంద్రియస్య+అర్థే+హి+ | | మనస్సు మమేకము అగుటవలన మనస్సునకు |
| రాగద్వేషౌ+వ్యవస్థితౌ | | రాగము, ద్వేషము అనగా ఇష్టత, అయిష్టతలు ఏర్పడి యున్నవి. |
| తౌ+అస్య+పరిపంథినౌ+ | = | ఆ రాగద్వేషములు రెండూ జ్ఞానికి శత్రువులు. |
| తయోః+వశమ్+ | | కావున జ్ఞాని అయినవాడు రాగముయొక్కయు, |
| న+ఆగచ్ఛేత్ | | ద్వేషముయొక్కయు వశమును పొందకూడదు |

**వ్యాఖ్యానము :-** చెవులకు శుభవార్త వినబడిన ఇష్టముగలిగి, మనస్సుకు ఆనందము గలిగించును. తన గుఱించి ఇతరులు పలికిన కఠినోక్తులు మనస్సుకు బాధ కలిగించును. అశుభవార్తలు మనస్సుకు దుఃఖమును గలిగించును. ఇటులనే మిగిలిన ఇంద్రియముల గుఱించి ఊహించవలయును.

అనగా జ్ఞాని అయినవాడు, రాగ ద్వేషములను తన వశములో ఉంచుకొన వలయును. ఉదాహరణకు శూర్పణఖ మంచి అందకత్తెగా రాముని వద్దకు వచ్చి, నిన్ను పతిగా వరించితినని చెప్పినది. రాముడు ఆమెయొక్క సౌందర్యమును వీక్షించియు, ఆమెయందు రాగకలితుడు కాలేదు. ఈవిధముగనే సీతాపహరణ చేసిన రావణుని యందు ద్వేషము యున్నను, దానిని అదుపులో ఉంచుకొని అంగదుని రాయబారమునకు పంపినాడు. ఈ విధముగా జ్ఞాని రాగద్వేషములకు వశముగాక వాటిని తన అదుపులో ఉంచుకొనవలయును. మనస్సు యింద్రియములతో కూడనిచో యింద్రియములు యింద్రియార్థము లందు ప్రసరించినను రాగ ద్వేషములు కలగవు.

...... ❖ ❖ ❖ ......

జాతి, ఆశ్రమ ధర్మముల గురించి చెప్పబడుచున్నది

**శ్రేయాన్ స్వధర్మో విగుణః । పర ధర్మాత్స్వనుష్ఠితాత్ ।**
**స్వ ధర్మే నిధనంశ్రేయః । పరధర్మో భయావహః ॥ 35**

శ్రేయాన్ – స్వధర్మః – విగుణః – పరధర్మాత్ – స్వనుష్ఠితాత్
స్వధర్మే – నిధనమ్ – శ్రేయః – పరధర్మః – భయావహః

| | | |
|---|---|---|
| పరధర్మః+భయావహః | = | తన జాతి వారికి, ఆశ్రమమువారికి విధింపబడని జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు గాక ఇతర జాతివారికి, ఇతర ఆశ్రమమువారికి చెప్పినవి పాటించుట నరకమును గలిగించును, పునర్జన్మను గలిగించును. ఆ విధముగా అవి భయమును గొల్పును. |
| స్వనుష్ఠితాత్+ | = | బాగుగా ఆచరింపబడిన |
| పరధర్మాత్+విగుణః+ | = | ఇతర జాతి ధర్మములు, ఆశ్రమధర్మముల కంటె |
| స్వధర్మః+శ్రేయాన్+ | | విశేష గుణములు లేనిదియు అయిన స్వధర్మములు ఆచరించుట శ్రేయస్కరము. క్షత్రియునకు |
| స్వధర్మే+నిధనమ్+ శ్రేయః | = | స్వధర్మాచరణయందు అనగా యుద్ధమునందు వీరస్వర్గము పొందుట శ్రేయస్కరము |

**వ్యాఖ్యానము :-** బ్రాహ్మణునకు అహింస ధర్మము. క్షత్రియునకు దుష్టశిక్షణ శిష్టరక్షణ ధర్మము. అహింసను పాటించుట యుద్ధమును చేయుటకంటె గొప్పది. అయినను క్షత్రియులు అహింసను గాక యుద్ధమునే చేయవలయును.

**కథా భాగము :**

కావున ఓ అర్జునా! నీ క్షత్రియ జాతికి చెప్పిన యుద్ధము చేయుము. బ్రాహ్మణజాతికి చెప్పిన అహింసను, భిక్షాటనను నీవు పాటింపరాదు. (క్షత్రియునకు బ్రాహ్మణుల యింట భిక్షాటన చేయుట ఆపత్కాల ధర్మము.)

ఏది శ్రేయస్కరము అని అడిగిన దానికి స్వధర్మాచరణ శ్రేయస్కరము అని చెప్పబడినది. ఎవరికి ఉద్దేశించి చెప్పబడిన జాతి ఆశ్రమ ధర్మములు వారు ఆచరించవలయును. పుణ్యకర్మాచరణలో ఇది అతిముఖ్యమైనది ఇతరులకు చెప్పిన వాటిని ఆచరించరాదు. జాతి ఆశ్రమధర్మములు గుఱించి, నర-నారాయణులలో ఒకరైన, నారాయణుడు బదరికావనంలో నారదునికి భాగవతము - సప్తమ స్కంధములో వివరించినారు. (వాటిని మరల ఈ గ్రంథముయొక్క చివర శ్రీకృష్ణునిచే అర్జునునకు చెప్పబడినవి).

నేడు కలియుగములో ఈ జాతి ఆశ్రమ ధర్మములు అపభ్రంశము పొందినవి. బ్రాహ్మణులు స్వాధ్యాయము, యజ్ఞ యాగాది క్రతువులు మాని సేవాధర్మమున సూర్యచంద్రవంశ రాజులను గాక ఇతర శూద్రకుల రాజులను, ధనవంతులను సేవించి, ఆ పడుపుకూడు భుజించుచుండిరి. ఇది కలియుగ ప్రభావము.

...... ❖ ❖ ❖ ......

జాతి, ఆశ్రమ ధర్మముల గుఱించి చెప్పబడుచున్నది - అర్జునుని ప్రశ్న

అర్జున ఉవాచ

**అథకేన ప్రయుక్తోఽయం । పాపం చరతి పూరుషః ।**
**అనిచ్ఛన్నపి వార్ష్ణేయ । బలాదివ నియోజితః ॥ 36**

అథ - కేన - ప్రయుక్తః - అయమ్ - పాపమ్ - చరతి - పూరుషః
అనిచ్ఛన్ - అపి వార్ష్ణేయ - బలాత్ - ఇవ - నియోజితః

వార్ష్ణేయ = ఓ శ్రీకృష్ణా!
అయమ్+పూరుషః+ = ఈ దేహి నరక ప్రాప్తిని కోరక పోయినను
అనిచ్ఛన్+అపి+బలాత్+ కూడా బలాత్కారముగా ఎవరో బలవంతముగా
ఇవ+నియోజితః పాపకార్యం చేయమని నియమించినట్లు మఱియు
అథ+కేన+ప్రయుక్తః+ = దేనిచేత ప్రేరేపింపబడి పాపమును
పాపమ్+చరతి చేయుచున్నాడు?

**వ్యాఖ్యానము :-** పుణ్యము చేసి పుణ్య లోకములు పొందవలయునని ప్రతి వ్యక్తి కోరుకొనును. అంతే తప్ప నరకమును పొందవలయునని ఎవడునూ కోరడు. అయినను నరకమును గలిగించు పాపపు పనులు ఎందులకు చేయుచున్నాడు? ఆవిధముగా పాపమును చేయుటకు ఎవరు నియమించుచున్నారు? ఎవరు ప్రేరేపించుచున్నారు? దీనికి కారణమేమి?

దేహి స్వతహాగా గుణరహితుడు. అతడు ఈశ్వరుని ప్రతి బింబము. ఈశ్వరునికి బంధమోక్షములు లేనట్లు నిజమునకు దేహికిని బంధ మోక్షములు లేవు. అయినను దేహి నరక ప్రాప్తిని గలిగించు పాప కర్మలను చేయుచున్నాడు.

ఇచ్చట పాపము అను పదమును రెండు అర్థములలో ప్రయోగింపబడినది. ఒకటి కర్మ బంధము గల్గించు కర్మలు ఏల చేయుచున్నాడు?

రెండవది నరక ప్రాప్తిని గల్గించు కర్మలను ఏల చేయుచున్నాడు?

పూర్వజన్మ కర్మవాసనలచే నియమింపబడిన మనస్సుచే దేహి పాప కర్మలు చేయుచున్నాడు. దేహికి ఇహలోక పరలోక సుఖములను అనుభవించవలయుననే కోరికయే కర్మబంధము గలిగించు కర్మలు చేయుటకు కారణము. ఈ సుఖములను బలాత్కారముగానైనను అనుభవించవలయుననే కోరిక పాప కారణము అగుచున్నది. పాపపుపనులు దేహి చేయుటకు కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మత్సరములు కారణమగుచున్నవి. దేహి అరిషడ్వర్గములతో కూడుటవలన అవి దేహిని బలవంతముగా పాప కర్మలయందు ప్రేరేపించుచున్నవి.

ఈ పాపకార్యములను కర్మేంద్రియములైన మాట, చేతులు, పాదము, గుహ్యము, జ్ఞానేంద్రియము అయిన మనస్సుచేత చేయుచున్నాడు. కామ క్రోధలోభములు – రజో గుణమునకు సంబంధించినవి. మోహ మద మాత్సర్యములు – తమోగుణమునకు సంబంధించినవి. దేహి – అరిషడ్వర్గములనే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములతో గూడి బలాత్కారముగా కర్మలు చేయుచున్నాడు.

మనస్సుచేత ప్రేరేపింపబడి వాచా అనగా నోరుచేత, చేతులు, పాదములచేత, గుహ్యముచేత, పాప కార్యములు చేయుచున్నాడు.

పూర్వజన్మ కర్మవాసనలవలన మనస్సు పనిచేయును. జ్ఞానేంద్రియములు వాటివాటి యింద్రియార్థములపైప్రసరించుటవలన మనస్సు కలసి పుణ్య, పాపయుత

కర్మకు ప్రేరణ కలుగుచున్నది. ఆ ప్రేరణవలన కర్మేంద్రియములు పుణ్యపాపయుత కర్మను చేయుచున్నవి. మనస్సుచే నియోగింపబడి జ్ఞానేంద్రియములచే ప్రేరేపింపబడి కర్మేంద్రియములచే కర్మ చేయబడుచున్నది.

**నోటిచే:** అసత్యము పలుకుట, ఇతరుల మనస్సుకు బాధకలిగించునట్లు మాటలాడుట ఇతరులను నిందించుట, పరుష వాక్కు, చాడీలు కొంటె మాటలు చెప్పుట మొదలయినవి మఱియు ఆత్మ స్తుతి చేయుటచేత పాపమును చేయుచున్నాడు.

**చేతులు:** అపరిగ్రహమును పాటింపక అపాత్రులవద్ద దానమును స్వీకరించి పాపమును చేయుచున్నాడు. స్త్రీలను బలాత్కరించుట, దొంగతనము చేయుట, ఇతరులను వధించుట మొదలగు పాప కార్యములు చేయుచున్నాడు.

**పాదములు:** వేశ్యావాటికలలో సంచరించుటచేత పాపమును చేయుచున్నాడు.

**గుహ్యము:** పరస్త్రీలతో వారికి ఇష్టము లేకపోయిన బలవంతముగా అనుభవించుట మొదలయిన పాపములు చేయుచున్నాడు.

కర్మేంద్రియములచేత, మనస్సుచేత, దేహి పాపమును చేయుచున్నాడు. రజోగుణ తమోగుణములచే ఉద్భవించిన అరిషట్వర్గములచేత బలాత్కారముగా పాపకర్మ చేయుచున్నాడు. మనస్సు మఱియు కర్మేంద్రియమలచేత పాపమును చేయుచున్నాడు. రజోగుణసముద్భవములైన అష్టమదములచే పాపము చేయుచున్నాడు.

...... ❖ ❖ ❖ ......

శ్రీ భగవాన్ ఉవాచ

అరిషడ్వర్గములు మఱియు కామము గుఱించి వివరించుచున్నాడు

ఇంద్రియార్థములనే కామముగా ఇందు వివరించుచున్నాడు.

ఇంద్రియార్థములలో మిక్కిలి బలమైనది స్త్రీ సంభోగేచ్ఛ

**కామ ఏషక్రోధ ఏష । రజోగుణ సముద్భవః ।**

**మహాశనో మహాపాప్మా । విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥ 37**

కామః – ఏషః – క్రోధః – ఏషః – రజోగుణ సముద్భవః
మహాశనః – మహాపాప్మా – విద్ధి – ఏనమ్ – ఇహ – వైరిణమ్

**ధూమేనావ్రియతే వహ్నిః । యథాదర్శో మలేన చ ।**
**యథోల్బేనావృతో గర్భః । తథా తేనేద మావృతమ్ ॥ 38**

ధూమేన – ఆవ్రియతే – వహ్నిః – యథా – ఆదర్శః – మలేన – చ
యథా – ఉల్బేన – ఆవృతః – గర్భః – తథా – తేన – ఇదమ్ – ఆవృతమ్

**ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా**
**కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ 39**

ఆవృతమ్ – జ్ఞానమ్ – ఏతేన – జ్ఞానినః – నిత్యవైరిణా
కామరూపేణ – కౌన్తేయ – దుష్పూరేణ – అనలేన – చ

**ఇన్ద్రియాణి మనో బుద్ధి । రస్యాధిష్ఠాన ముచ్యతే ।**
**ఏతైర్విమోహ యత్యేష । జ్ఞానమా వృత్య దేహినమ్ ॥ 40**

ఇన్ద్రియాణి – మనః – బుద్ధిః – అస్య – అధిష్ఠానమ్ – ఉచ్యతే
ఏతైః – విమోహయతి – ఏషః – జ్ఞానమ్ – ఆవృత్య – దేహినమ్

**తస్మాత్త్వ మిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్ ॥ 41**

తస్మాత్ – త్వమ్ – ఇన్ద్రియాణి – ఆదౌ – నియమ్య – భరతర్షభ
పాప్మానమ్ – ప్రజహి – హి – ఏనమ్ – జ్ఞాన విజ్ఞాననాశనమ్

| | | |
|---|---|---|
| ఏషః+కామః+క్రోధః+ | = | ఈ కామము క్రోధము, లోభము రజోగుణమువలన |
| రజోగుణ సముద్భవః | | జనియించిన వానిగ తెలియుము మోహము, మదము, మత్సరములు తమోగుణము వలన జనియించినవానిగ తెలియును. |

**కామము గుఱించి వివరించుచున్నాడు:**

| | | |
|---|---|---|
| ఏషః+మహాశనః+ మహాపాప్మా | = | ఈ రజోగుణ సముద్భవమైన కామము ఎంత అనుభవించినను తృప్తి పొందునది కాదు. మిక్కిలి పాపమునకు కారణభూతమయినది |
| ఏనమ్+ఇహ+వైరిణమ్+ విద్ధి | = | ఈ కామమును ఈ మోక్ష మార్గమున శత్రువుగా ఎఱుంగుము |
| యథా+ధూమేన+ వహ్నిః+ఆవ్రియతే | = | ఏ విధముగా పొగచే అగ్ని కప్పబడి యున్నదో (ఇదొక ఉదాహరణ) |
| మలేన+ఆదర్శః | = | దుమ్ముచే, మురికిచే అద్దము కప్పబడి యున్నదో, (ఇది ఒక ఉదాహరణ) |
| ఉల్బేన+గర్భః+ఆవృతః | = | మావిచే గర్భము అనగా గర్భస్థ శిశువు కప్పబడి యుండునో (ఇది ఒక ఉదాహరణ) |
| తథా+తేన+ఇదమ్+ ఆవృతమ్ | = | ఆవిధముగా కామాది అరిషడ్వర్గములచేత దేహియొక్క ఈ జ్ఞానము కప్పబడియున్నది. |
| కౌన్తేయ | = | ఓ అర్జునా! |
| జ్ఞానినః+జ్ఞానమ్+ ఏతేన+దుష్పూరేణ+ నిత్యవైరిణా+ కామరూపేణ+అనలేన | = | జ్ఞానియొక్క జ్ఞానము నిండింప శక్యము కానిదియు, నిత్యశత్రువు అయిన ఈ కామమనే అగ్నిచే దహింపబడుచున్నది. ఆవిధముగా జ్ఞానము నశించుచున్నది. |
| చ+ఆవృతమ్ | = | మఱియు కామముచేత జ్ఞానము కప్పబడి ఉన్నది. ఈ కామము ఎంత అనుభవించినా తృప్తి నొందనిది. ఆ విధముగా తృప్తిలేని ఈ కామముచేత జ్ఞానము కప్పబడి ఉన్నది. కావున ఆత్మస్థానమును పొందగోరు జ్ఞాని ఈ కామము అనే నిత్య శత్రువుతో యుద్ధము చేసి జయింపవలయును. అనగా అరిషడ్వర్గములనే శత్రువులను జయింపుము. |

| | | |
|---|---|---|
| ఇన్ద్రియాణి+మనః+ | = | జ్ఞానేంద్రియములు, మనస్సు బుద్ధి |
| బుద్ధిః+అస్య+ | | ఈ కామమునకు అధిష్ఠానమని చెప్పబడుచున్నది |
| అధిష్ఠానమ్+ఉచ్యతే | | |
| ఏతైః+జ్ఞానమ్+ఆవృత్య+ | = | వీటిచేత అనగా జ్ఞానేంద్రియములు, ఇంద్రి |
| ఏషః+దేహినమ్+ | | యార్థములు మనోబుద్ధులచేత అధిష్ఠానమయిన |
| విమోహయతి | | కామముచేత, అరిషడ్వర్గములచేత జ్ఞానము |
| | | కప్పబడి ఈ దేహిని అనగా జీవునిని |
| | | (సంసారములో) విశేషముగా మోహపెట్టుచున్నవి |
| భరతర్షభ | = | ఓ అర్జునా! |
| తస్మాత్+త్వమ్+ఆదౌ+ | = | అందువలన నీవు మొదట కర్మయోగములో |
| ఇన్ద్రియాణి+హి+ | | ఇంద్రియములను మనస్సు బుద్ధి ఇవి కామమునకు |
| నియమ్య | | అధిష్ఠానమని గ్రహించి మనోబుద్ధులను |
| | | నియమించి |
| ఏనమ్+ | = | ఈ జ్ఞానమును వివేకమును నశింప |
| జ్ఞానవిజ్ఞాన నాశనమ్+ | | చేయునదియు పాపకారణమయినదియు అయిన |
| పాప్మానమ్+ప్రజహి | | ఈ కామమును జయించుము |

**వ్యాఖ్యానము :-** దేహి ప్రకృతివలన జనియించిన గుణములతో కలియుట వలన కర్మ జరుగుచున్నది. దేహికి గుణములు సహజములు కావు. కావున సాధనచేసి, దేహి గుణములనుండి విడివడవచ్చును. దేహియొక్క జ్ఞానము ఈ రజోగుణతమో గుణములచే కప్పబడి యున్నది. ఆ తెర తొలగిన ఆత్మ జ్ఞానము ప్రకాశమానమగును. కావున సాధనచే మొదట తమోగుణమును జయించి ఆ తర్వాత రజోగుణమును జయించి అనగా అరిషడ్వర్గమనే తెరను తొలగించినచో ఆత్మ జ్ఞానము ప్రకటిత మగును. ఈ మోహమును జ్ఞాని నశింపజేయవలయును. కావున కుంతి యాదవుల యందు, పాండవులయందు మోహమును విచ్ఛేదము చేయుమని కోరినది. ఈ మోహమే **మోహిని**గా వచ్చి అసురులకు అమృతమును అందకుండునట్లు చేసినది.

...... ❖ ❖ ❖ ......

**ఇన్ద్రియాణి పరాణ్యాహురిన్ద్రియేభ్యః పరం మనః ।**
**మనసస్తు పరాబుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః ॥ 42**

ఇన్ద్రియాణి – పరాణి – ఆహుః – ఇన్ద్రియేభ్యః – పరమ్ – మనః – మనసః తు – పరా – బుద్ధిః – యః – బుద్ధేః – పరతః – తు – సః

**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా । సంస్తభ్యాత్మానమాత్మనా ।**
**జహి శత్రుం మహాబాహో । కామరూపం దురాసదమ్ ॥ 43**

ఏవమ్ – బుద్ధేః – పరమ్ – బుద్ధ్వా – సంస్తభ్య – ఆత్మనమ్ – ఆత్మనా జహి – శత్రుమ్ – మహాబాహో – కామరూపమ్ – దురాసదమ్

| | | |
|---|---|---|
| ఇన్ద్రియాణి+పరాణి | = | కర్మేంద్రియములు కంటే జ్ఞానేంద్రియములు శ్రేష్ఠములైనవి |
| ఇన్ద్రియేభ్యః+మనః+ పరమ్ | = | జ్ఞానేంద్రియములు కంటే మనస్సు గొప్పది |
| మనసః+బుద్ధిః+పరా | = | మనస్సుకంటె బుద్ధి గొప్పది. |
| బుద్ధేః+తు+పరతః | = | బుద్ధి కంటె మహత్ గొప్పది |
| తు+యః+సః+ఆహుః | = | మహత్ కంటె ప్రకృతి గొప్పది. ప్రకృతి కంటె ఎవడు సృష్ట్యాదియందు గలడో అట్టి ఆత్మ గొప్పది అని చెప్పుదురు. |
| మహాబాహో+ | = | అర్జునా! |
| ఏవమ్+బుద్ధ్వా+ సంస్తభ్య+దురాసదమ్+ కామరూపమ్+శత్రుమ్+ జహి | | ఈ ప్రకారముగా తెలుసుకొని ఇంద్రియములను మనోబుద్ధులను నిగ్రహించి దుర్జయమైన కామము అనెడి శత్రువును జయింపుము |

బుద్ధేః+పరమ్+ = బుద్ధికంటె గొప్పది అయిన
ఆత్మనా+ఆత్మానమ్ జీవాత్మచేత ఆత్మను గ్రహించుము.

**వ్యాఖ్యానము :- కఠోపనిషత్ – తృతీయవల్లి 10 &11 శ్లోకములలో ఇట్లు చెప్పబడినది:**

**ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరంమనః ।**
**మనసస్తు పరాబుద్ధిః బుద్ధౌ రాత్మామహన్ పరః ॥ 10**
**మహతః పరమవ్యక్త మవ్యక్తా త్పురుషం పరః ।**
**పురుషాన్న పరం కించిత్ సాకాష్ఠాసా పరాగతిః ॥ 11**

ఇంద్రియముల కంటె యింద్రియార్థములు గొప్పవి. యింద్రియార్థముల కంటె మనస్సు గొప్పది. మనస్సు కంటె బుద్ధి గొప్పది. బుద్ధి కంటె మహత్ గొప్పది. మహత్ కంటె ప్రకృతి గొప్పది. ప్రకృతి కంటె (పరమపురుషుడు) ఆత్మ గొప్పది. ఆత్మ కంటె గొప్పది ఇతరమేదియు లేదు. ఈ విషయమునే ఇట్లు చెప్పబడినవి.

ఈ విషయమునే భాగవతములో ప్రహ్లాదుడు ఇట్లు చెప్పినాడు:

**మార్గంబుఁ దప్పి వర్తించు చిత్తంబుకంటె వైరులెవ్వరు**
**చిత్తంబు వైరి గాక చిత్తమును నీకు వశముగాఁ చేయవయ్య**

(భాగవతము – సప్తమస్కంధం – 266)

దీనికి ఉదాహరణగా కామక్రోధములకు ప్రతినిధిగా చెప్పబడే **అశ్వత్థామను** అర్జునుడు జయించినట్లు భాగవతమున చెప్పడినది.

...... ❖ ❖ ❖ ......

ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము 28వ అధ్యాయము

## (జ్ఞానయోగము)

శ్రీ భగవానువాచ

**ఇమం వివస్వతే యోగం । ప్రోక్తవానహమవ్యయమ్ ।**
**వివస్వాన్ మనవే ప్రాహ । మనురిక్ష్వాకవేऽబ్రవీత్ ॥ 1**

ఇమమ్ - వివస్వతే - యోగమ్ - ప్రోక్తవాన్ - అహమ్ - అవ్యయమ్
వివస్వాన్ - మనవే - ప్రాహ - మనుః - ఇక్ష్వాకవే - అబ్రవీత్.

**ఏవం పరమ్పరాప్రాప్త । మిమం రాజర్షయో విదుః ।**
**స కాలేనేహ మహతా । యోగో నష్టః పరన్తప ॥ 2**

ఏవమ్ - పరంపరా - ప్రాప్తమ్ - ఇమమ్ - రాజర్షయః - విదుః
సః - కాలేన - ఇహ - మహతా - యోగః - నష్టః - పరన్తప

**స ఏవాయం మయా తేऽద్య యోగః ప్రోక్తః పురాతనః**
**భక్తోऽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ 3**

సః - ఏవ - అయమ్ - మయా - తే - అద్య - యోగః - ప్రోక్తః - పురాతనః
భక్తః - అసి - మే - సఖా - చ - ఇతి - రహస్యమ్ - హి - ఏతత్ - ఉత్తమమ్

| | | |
|---|---|---|
| అహమ్+అవ్యయమ్+<br>ఇమమ్+యోగమ్+<br>ప్రోక్తవాన్+వివస్వతే | = | నేను ఆత్మగా కాలక్రమములో నశింపనిదైన ఈ బ్రహ్మవిద్యను బ్రహ్మకు చెప్పియుంటిని. అతడు అతనిచే జనియింపబడిన మరీచికి అతడు సూర్యునకు చెప్పెను |

| | | |
|---|---|---|
| వివస్వాన్+మనవే+ ప్రాహ+మనుః+ ఇక్ష్వాకవే+అబ్రవీత్ | = | సూర్యుడు అతనిచే జనియింపబడిన వైవస్వత మనువుకు చెప్పెను. వైవస్వత మనువు అతనిచే జనియింపబడిన ఇక్ష్వాకునకు చెప్పెను. |
| పరన్తప+ఇమమ్+ ఏవమ్+పరమ్పరా+ ప్రాప్తమ్ | = | ఓ అర్జునా! ఆవిధముగా నాచే సృజియింపబడిన బ్రహ్మకు, బ్రహ్మ నారదాది ఋషులకు, వారు వారి వారి శిష్యులకు ఈవిధముగా బ్రహ్మవిద్యను గురుపరంపరగా చెప్పబడిన ఈ పద్ధతిని అనగా జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములకు సంబంధించిన కర్మలు, విధులు బాధ్యతలకు సంబంధించిన కర్మలు, పుణ్యకర్మలు చేసియూ ఆ కర్మబంధములలో చిక్కుకొనక ఆత్మ స్థానమును చేరు నిష్కామకర్మ విధానమును, యోగమును, భక్తిని, సాంఖ్యమును అవలంభించి ఆత్మస్థానము చేరు విధానమైన కర్మయోగమును, సాంఖ్యయోగము అను ఈ రెండు పద్ధతులను |
| రాజర్షయః+విదుః | = | గృహస్థాశ్రమములో ఉండి పుణ్య కర్మానుష్ఠానముచే గాని, యోగముచే గాని, భక్తిచేగాని ఆత్మను దర్శించువారు రాజర్షులు. ఆత్మను దర్శించియు ఇంద్రియాదులను, విషయములను, అరిషడ్వర్గములను యోగవిఘ్నములైన జాలి, కరుణ, మొదలైనవాటిని సంపూర్ణముగా జయించని రాజర్షులు ఆత్మస్థానమును చేరు పద్ధతిని గ్రహించిరి |
| సః+యోగః+మహతా+ కాలేన+ఇహ+నష్టః | = | పురాతనమైన, రహస్యమైన బ్రహ్మవిద్య గొప్ప కాలప్రభావముచేత ప్రస్తుతము నశింపలేదు గాని నష్టమయినది. అనగా బహుళ ప్రచారములో లేదు. |

| | | |
|---|---|---|
| మే+సఖా+చ+భక్తః+<br>హి+అసి+పురాతనః+<br>ఏవ | = | నాకు నీవు స్నేహితుడవు సత్త్వగుణప్రధానుడవైన భక్తుడవు. బ్రహ్మవిద్యను తెలుసుకొనగోరు అభిలాషాపరుడవయి ఉన్నావు, కావున పురాతనమైన అనగా సృష్ట్యాదియందు బ్రహ్మకు చెప్పినది అయిన |
| రహస్యమ్+ఏతత్+<br>ఉత్తమమ్+సః+యోగః+<br>అయమ్+అద్య+మయా+<br>తే+ప్రోక్తః+ఇతి | = | అయోగ్యులకు చెప్పరానిదియును, రహస్యమైనదియు, ఉత్తమమైనదియు అయిన బ్రహ్మవిద్యను ఇప్పుడు నాచేత నీ కొఱకు చెప్పబడుచున్నది. |

**వ్యాఖ్యానము :-** సప్తమ మనువు అయిన వైవస్వత మనువు అతని వంశము గుఱించి భాగవతమున నవమ స్కంధములో ఇట్లు విపులముగా చెప్పబడినది.

పోయిన కల్పాంతమున సత్యవ్రతుండను ద్రవిడ దేశపురాజు విష్ణువును సేవించి విజ్ఞానమును పొంది, సూర్యునకు అతని భార్య అయిన సంజ్ఞయందు శ్రాద్ధదేవుండు అను పేరున ఇప్పటి మనువు అయిన వైవస్వత మనువు పుట్టెను. వైవస్వత మనువునకు అతని భార్య అయిన శ్రద్ధయందు ఇక్ష్వాకుడు, నృగుడు, శర్యాతి, దిష్టుడు, ధృష్టుడు, కరూశకుండు, అరిష్యంతుడు, పృషధ్రుండు, నభగుడు, కవి, అను పేరున పదిమంది కుమారులు గలిగిరి. **ఇక్ష్వాకువు సూర్య వంశమునకు మూలపురుషుడు.** కావున ఇతని వలన సూర్యవంశము కలిగినది.

ఈ కొడుకులు పుట్టకముందు వైవశ్వత మనువు మిత్రావరుణుల నుద్దేశించి యాగము చేసినాడు. ఆ విధముగ వారలకు కూతురు పుట్టినది. ఆ కూతురు పేరు **'ఇలా'**. వైవస్వతమనువు వసిష్ఠుని ప్రార్థింప అతడు భగవంతుని ప్రార్థింప 'ఇలా' అనే ఆమె **'సుద్యుమ్నుండను'** మగవానిగా అయినాడు. ఆ 'సుద్యుమ్నుడు' మేరువు పర్వత ప్రాంతమున గల **కుమారవనము** లోనికి వెళ్లి, మరల ఆడదిగా మారినాడు. ఇప్పుడు చంద్రుని కొడుకైన బుధుడు ఈమెను మోహించి వివాహము చేసికొనగా వారలకు **పురూరవుడు** పుట్టినాడు. ఇది **చంద్రవంశము**. ఈవిధముగా వైవశ్వత మనువు వలన సూర్యవంశము, చంద్రవంశము కలిగినవి.

అధిక సంఖ్యాకులు ఇహలోక పరలోక సుఖాపేక్షపరులగుటచేత, బ్రహ్మవిద్య బహుళ ప్రచారములో లేదు. ఈ పద్ధతి సామాన్యులు మెచ్చురు, ఆచరింపరు.

**"నిన్నున్ మెచ్చురు నీతి పాఠ మహిమన్ నీతోడి దైత్యార్భకుల్**
**గన్నా రన్నియుఁజెప్పనేర్తురు గదా! గ్రంథార్థముల్ దక్షులై"**

*(భాగవతము-సప్తమస్కంధం-164)*

కామ్యకర్మపరులైన వారి మాటలు చెవులకు వినసొంపుగా యుండుటచే ప్రజలు మెచ్చుకొందురు. వీరి సంఖ్య అధికము. వీరి శిష్యుల సంఖ్యయు అధికమే. కాని బ్రహ్మవిద్యను గుఱించి చెప్పువారి సంఖ్య అతి స్వల్పము. ఈ గురువుల బోధనలను సామాన్య ప్రజలు మెచ్చరు.

ఈ బ్రహ్మవిద్యను గ్రహించగోరు శిష్యుడు-

1. సత్త్వగుణాశ్రయుడై ఉండవలయును. పుణ్యకర్మల ఫలితమునందు నిర్వేదము గలిగి ఉండవలయును.
2. కాలక్రమమున గురువంతటి వాడు శిష్యుడు అయిననూ గురువును ధిక్కరించ రాదు. గురువు తర్వాత ఆ గురుకులాశ్రమమును నడిపించగల సత్తాగలవాడై యుండవలయును. గురువుతో మిత్రత్వముగలిగి భక్తుడు సఖుడని పిలువబడు వాడుగా ఉండవలయును. బ్రహ్మవిద్య ఉపదేశమునకు పైన చెప్పిన అర్హతలుగలిగి సాధకుడు ఉండవలయును.

ఈ బ్రహ్మవిద్యనే పరబ్రహ్మ బ్రహ్మకు చెప్పెను. ఈ విషయమునే గురు పరంపరా న్యాయముగా నేటి వఱకు అర్హులకు చెప్పబడుచున్నది. అదే విషయమును ఇప్పుడు శ్రీకృష్ణుడు అర్జునునకు చెప్పెను.

...... ❖ ❖ ❖ ......

అర్జున ఉవాచ

జీవేశ్వరులకు గల భేదమును అర్జునుని ప్రశ్నకు భగవానుని సమాధానము ద్వారా చెప్పబడుచున్నది.

**అపరం భవతో జన్మ । పరం జన్మ వివస్వతః ।**

**కథమే తద్విజానీయాం । త్వమాదౌ ప్రోక్తవానితి ॥ 4**

అపరమ్ - భవతః - జన్మ - పరమ్ - జన్మ - వివస్వతః

కథమ్- ఏతత్ - విజానీయామ్ - త్వమ్ - ఆదౌ - ప్రోక్తవాన్ - ఇతి

| | | |
|---|---|---|
| భవతః+జన్మ+అపరమ్ | = | వసుదేవునికి, దేవకికి జన్మించి నంద యశోదల ఇంట పెరిగి కృష్ణునిగా పిలువబడుచూ యుద్ధరంగమున నాకు సహాయకునిగా రథ సారధిగా వున్న నీ యొక్క జన్మ ఇప్పటిది అనగా వర్తమానము లోనిది. |
| ఆదౌ+వివస్వతః+జన్మ+ పరమ్ | = | భూతకాలములో సృష్టి ఆరంభమున బ్రహ్మ యొక్కయు సూర్యుని యొక్కయు ఆవిర్భావము వెనుక ఎప్పుడో జరిగినది. కావున |
| ఏతత్+త్వమ్+ ప్రోక్తవాన్+ఇతి+కథమ్+ విజానీయామ్ | = | ఈ బ్రహ్మవిద్యను శ్రీకృష్ణునిగా జన్మించిన నీవు బ్రహ్మకు చెప్పియుంటివని నేను ఎట్లు నమ్మగలను? (తెలుసుకొనగలను?) |

**వ్యాఖ్యానము :-**

జీవేశ్వరులకు భేదము:

| **జీవుడు** | **ఈశ్వరుడు** |
|---|---|
| అనాది | అనాది |
| అరూపుడు | అరూపుడు |
| సూక్ష్ముడు | సూక్ష్ముడు |
| 15 కళలు గలవాడు | 16 కళలు గల వాడు |
| మాయా మోహితుడు | మాయకు లోబడని వాడు |
| గుణయుతుడు | గుణ రహితుడు |
| గత జన్మల జ్ఞాపకము లేనివాడు | గత జన్మల జ్ఞాపకము గలవాడు |
| అనగా తన జన్మల | అనగా తన అవతారముల గుఱించి |
| గుఱించి తెలియనివాడు | తెలిసినవాడు |

చిత్తమునందు అణగియున్న సంస్కారములపై యోగి సంయమము చేసిన పూర్వజన్మల జ్ఞానము కలుగును. కొందఱిలో పసితనముననే ఏ యోగము చేయక పోయినను గత జన్మ విషయములు జ్ఞప్తికి వచ్చును. కాని గతజన్మలు అన్నియు గుర్తుకు రావు. ఈ విధమైన కథలు అప్పుడప్పుడు వినుచున్నాము.

సృష్ట్యాదియందుగల బ్రహ్మ, సూర్యుడు నీకు (అనగా శ్రీకృష్ణునికి) ఈ బ్రహ్మవిద్యను చెప్పిరి అన్న పొసగును. కాని నీ ముందు తరముల వారికి కృష్ణునిగా నీవు ఎట్లు చెప్పితివి. నీవు చెప్పితివి అన్న విషయమును నేను నమ్ముట ఎట్లు? కృష్ణునిగా చెప్పుట కుదరదు.

**'కృష్ణః – సర్వం కరోతీతి కృష్ణః'** సర్వమును సృష్టిచేయువాడు. అనగా కృష్ణ పదమునకు ఆత్మ అని అర్థము. కావున పరబ్రహ్మగా సృష్ట్యాదియందు బ్రహ్మకు చెప్పెను. బ్రహ్మాది దేవతలు అందఱు ఆత్మ తర్వాత వచ్చిన వారే. కృష్ణ పదమునకు ఆత్మ అనే అర్థముండుటవలన రామాయణములో బ్రహ్మ యుద్ధ కాండలో రావణ సంహారానంతరము రాముని వద్దకు వచ్చి సంభోదించు సందర్భమున ఓ రామా! నీవు కృష్ణుడవని పలుకును.

సృష్ట్యాదియందు ఆత్మ ఒక్కటియే గలదు. ఇతరమేదియూ లేదు. ఆ ఆత్మ తనకు తానుగా హిరణ్మయ దేహమును ధరియించి పురుషుడైనది. అతని దేహము మన దేహము వంటిది కాదు. ఆ ఆది పురుషుడు ప్రకృతిని సృజియించినాడు. ఇక్కడ అనేక వాదములు కలవు.

గుణాతీతుడైన వానిలో గుణములకు కారణమైన ప్రకృతి ఎట్లు జనియించినది? ఈ ప్రశ్నకు కొందఱు మాయ అని అనిరి. కొందఱు ఎండమావులలో నీరువలె ప్రకృతి దృశ్యమానమగుచున్నదని చెప్పిరి. కొందఱు పురుషుడే తనకు తాను ప్రకృతి– కర్మ – కాలము – జీవునిగా విభజించుకొనెను కాని వీటి లక్షణములు మాత్రము ఒకటి కావు అని చెప్పిరి.

ఏది ఏమయినా ప్రకృతి జనియించినది.

ఆ ప్రకృతితో గూడిన పురుషుడు విరాట్ పురుషుడయినాడు.

ఈ విరాట్‌పురుషునకు రెండు స్వరూపములు కలవు. ఒకటి దేవతా రూపము. ఈ విరాట్ పురుపుడే సృష్టి – స్థితి – లయ కారకుడు.

**విశ్వ జన్మ స్థితి విలయంబు లెవ్వని వలన నేర్పడు?** (భాగవతము – ప్రధమ స్కంధమున గలదు) రెండవది సర్వజీవుల రూపము.

...... ❖ ❖ ❖ ......

శ్రీ భగవానువాచ

**బహూని మే వ్యతీతాని । జన్మాని తవ చార్జున ।**
**తాన్యహం వేద సర్వాణి । న త్వం వేత్థ పరన్తప ॥ 5**

బహూని – మే – వ్యతీతాని – జన్మాని – తవ – చ – అర్జున
తాని – అహమ్ – వేద – సర్వాణి – న – త్వమ్ – వేత్థ – పరన్తప

ఈ శ్లోకములో అర్జున – పరంతప అని రెండు సంబోధనలు కలవు. ఒకటి కథాభాగముగాను, రెండవది అధ్యాత్మ విభాగముగాను చెప్పవలయును.

**కథాభాగముగా :**

| | |
|---|---|
| అర్జున | = ఓ అర్జునా! |
| మే+చ+తవ+ | = నాకు మఱియు నీకు అనేక జన్మలు |
| బహూని+జన్మాని | గతించినవి |

**అధ్యాత్మికముగా:**

| | |
|---|---|
| పరన్తప | = ఓ అర్జునా! |
| (మే)+(చ)+(తవ)+ | = నాకు హృదయగత ఆత్మగా మఱియు |
| (బహూని+జన్మాని)+ | నీకు జీవునిగ అనేక జన్మలు గతించినవి |
| వ్యతీతాని | |
| తాని+సర్వాణి+ | = ఆ సర్వజన్మలను, సర్వ అవతారములను |
| అహమ్+వేద+త్వమ్+ | నేను ఆత్మగా సర్వజ్ఞుడనగుటవలన గ్రహింతును. |
| న+వేత్థ | నీవు జీవునిగా గ్రహించలేవు అనగా నీవు ఎఱుగవు. |

**వ్యాఖ్యానము:-** ఆత్మ, హృదయ గుహలోగల ఆత్మ సర్వజ్ఞుడు. జీవుడు సర్వజ్ఞుడు కాదు.

జీవేశ్వరులు ఇద్దఱూ ఒకే చెట్టు అనే దేహమున స్నేహితులుగాన సమాన వయస్సు గలవారిగా యుండిరి. ఈశ్వరుడు ప్రకృతితో గూడక, సాక్షీభూతుడుగా ఉండును. జీవుడు ప్రకృతితో గూడి మోహములో తను – ఇతరులు అనే ద్వంద్వ భావనలో ఉండును.

ఇంతకు పూర్వము భీష్మపర్వం 26వ అధ్యాయములో 12వ శ్లోకములో నీవు నేను ఈ రాజులు మనము అందఱము భూతకాలములో ఉంటిమి. వర్తమాన కాలములో ఉన్నాము. భవిష్యత్తులో ఉండగలము అని చెప్పెను. అయితే జీవునికి గతజన్మల జ్ఞానము ఉండదు. ఈశ్వరునికి గతజన్మల జ్ఞానము ఉండును.

హృదయ గత ఆత్మగా నాకు, దేహములో ఉన్న జీవునిగా నీకు అనేక జన్మలు గతించిపోయినవి అని ఇప్పుడు చెప్పెను.

...... ❖ ❖ ❖ ......

ఆత్మ - విరాట్పురుషుడు

**అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్**
**ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా 6**

అజః – అపి – సన్ – అవ్యయాత్మా – భూతానామ్ – ఈశ్వరః – అపి – సన్
ప్రకృతిమ్ – స్వామ్ – అధిష్ఠాయ – సంభవామి – ఆత్మ మాయయా

అవతారములు - ప్రయోజనము

**యదా యదా హి ధర్మస్య । గ్లానిర్భవతి భారత ।**
**అభ్యుత్థానమధర్మస్య । తదాత్మానం సృజామ్యహమ్ ॥ 7**

యదా – యదా – హి – ధర్మస్య – గ్లానిః – భవతి – భారత
అభ్యుత్థానమ్ – అధర్మస్య – తదా – ఆత్మానమ్ – సృజామి – అహమ్

**పరిత్రాణాయ సాధూనాం । వినాశాయ చ దుష్కృతామ్ ।**
**ధర్మ సంస్థాపనార్థాయ । సంభవామి యుగే యుగే ॥ 8**

పరిత్రాణాయ – సాధూనామ్ – వినాశాయ – చ – దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ – సంభవామి – యుగే – యుగే

తత్త్వరీత్యా అవతారము గ్రహించిన ఆత్మను పొందును

**జన్మ కర్మ చ మే దివ్య । మేవం యో వేత్తి తత్త్వతః ।**
**త్యక్త్వా దేహం పునర్జన్మ । నైతి మామేతి సోఽర్జున ॥ 9**

జన్మ – కర్మ – చ – మే – దివ్యమ్ – ఏవమ్ – యః – వేత్తి – తత్త్వతః
త్యక్త్వా – దేహమ్ – పునః – జన్మ–న–ఏతి – మామ్ – ఏతి – సః – అర్జున

**ఆత్మ, ఆదిపురుషుడు :**

| | | |
|---|---|---|
| అజః+అవ్యయాత్మా+ అపి+సన్ | = | పుట్టుకలేనిది, స్వయంభువు అవ్యయమైనది. అయినను ఆత్మ తనంత తానుగా హిరణ్మయ కోశమును నిర్మించుకొని, అందు వసియించి పురుష శబ్దవాచ్యుడైనది. ఇతనిని ఆది పురుషుడని పరబ్రహ్మ, పరమాత్మ అని కూడా అందురు. |
| భూతానామ్+ఈశ్వరః+ అపి+సన్ | = | సర్వప్రాణులకు నియామకుడను అయినను దేహములో దేహిగా, హృదయగత ఆత్మగా వసియించుచున్నాను. |

**విరాట్ పురుషుడు :**

| | | |
|---|---|---|
| స్వామ్+ప్రకృతిమ్+ అధిష్ఠాయ+ ఆత్మమాయయా+ సంభవామి | = | నా నుంచి జనియించిన ప్రకృతిని అధిష్ఠించి విరాట్పురుషునిగా నా మాయచే స్వయంభువునిగా ఆవిర్భవించుచున్నాను |
| భారత | = | ఓ అర్జునా! |
| యదా+యదా+ ధర్మస్య+గ్లానిః+భవతి+ అధర్మస్య+అభ్యుత్థానమ్+ హి+తదా+ఆత్మానమ్+ అహమ్+సృజామి | = | ఎప్పుడెప్పుడు ధర్మమునకు హాని కలుగుచున్నదో అధర్మమునకు పెరుగుదల కలుగుచున్నదో శిష్టరక్షణ, దుష్టశిక్షణకు అవసరము కలుగుచున్నదో అప్పుడు నన్ను నేనే సృజియించుకొందును. |
| యుగే+యుగే సాధూనామ్+ పరిత్రాణాయ+ దుష్కృతామ్+వినాశాయ | = | ప్రతి యుగమునందు అవసరమయినప్పుడు అనగా సజ్జనులను బాగుగా రక్షించుటకొఱకు దుర్మార్గులను సంహరించుటకు |
| ధర్మ సంస్థాపనార్థాయ+ సంభవామి | = | సజ్జనులకై వేద, ధర్మ ప్రతిష్ఠాపనకొఱకు, రాక్షసులకై పాషండ ధర్మప్రబోధన కొఱకు నేను పుట్టుచున్నాను. |

| | | |
|---|---|---|
| అర్జున | = | ఓ అర్జునా! |
| యః+మే+ఏవమ్+ దివ్యమ్+జన్మ+చ+ కర్మ+తత్త్వతః+వేత్తి | = | ఎవడు నా యొక్క దివ్య అవతారములు మఱియు ఆ అవతారములలో నే చేసిన పనులు, అయోనిజ సృష్టిలో గల అవతారములు గాని మిథున ధర్మ సృష్టిలోగల అవతారములు గాని ఏ అవతారములైన ఆ అవతారములలో చేసిన పనులు, కథాపరముగా గాక తత్త్వరీత్యా అందలి తత్త్వరహస్యములను ఎవడు గ్రహించి ఆచరించునో |
| సః+దేహమ్+త్యక్త్వా+ పునః+జన్మ+న+ఏతి | = | అతడు దేహమును వీడిన పిమ్మట (దేహ త్యాగానంతరము) పునర్జన్మ పొందదు |
| మామ్+ఏతి | = | నన్నే (ఆత్మస్థానమునే) పొందును |

**వ్యాఖ్యానము :-**

**విరాట్‌పురుషుడు**

ఇందు ఆత్మ, ఆదిపురుషుల లక్షణములు చెప్పబడినవి. ప్రకృతి పురుషుల సమిష్టి రూపము అయిన విరాట్ పురుషుడు చెప్పబడినాడు. ఆత్మ జీవాత్మగా, హృదయ గుహలోగల ఆత్మగా, అనగా రెండుగా దేహములో వసియించుచుండెనని చెప్పబడినది. ఆత్మ స్వరూపమున ఒక్కడు. జీవస్వరూపమున భిన్నుడు. సజ్జనులను రక్షించుటకు, దుర్జనులను సంహరించుటకు ఆ విరాట్ పురుషుడే అవతారపురుషునిగా ఆవిర్భవించును.

చ॥ **జననము లేక కర్మముల జాడల బోక సమస్త చిత్త వ**
**ర్తనుఁడగు చక్రికిన్ గవు లుదార పదంబులు జన్మ కర్మముల్**
**వినుతులు సేయుచుండుదురు వేద రహస్యములందు నెందుఁ జూ**
**చిన మఱిలేవు జీవునికిఁ జెప్పిన కైవడి జన్మ కర్మముల్**

(భాగవతము - ప్రథమస్కంధం-68)

అనగా ఆత్మకు జననముగాని, కర్మలుగాని లేవు. వేదములో అవతారపురుషుల వర్ణనలు వర్ణింపబడవు. కానీ కవులు, అవతారపురుషునిగా వర్ణించి అవతారపురుషుని యొక్క గుణగణములను వర్ణింతురు. పాలసముద్ర మథన సమయములో దేవతలలో ఒకనిగా ఉండెను. మఱియు మందరపర్వతమును నిలబెట్టుటకు కూర్మావతారమును ధరియించెను. అమృతకలశ హస్తుడై ధన్వంతరిగాను, అమృతమును, దేవతలకు పంచుటకు, మోహినిగాను అవతరించెను. ఇదే **పరిత్రాణము.** ఆత్మస్థానమును చేరగోరిన వారిలో ఒకడుగా ఉండి వారిని ఆత్మ స్థానమునకు చేర్చును. దుర్మార్గులైన రాక్షసాదులను సంహరించెను. రాక్షస కులమునందు పుట్టిన ప్రహ్లాదునుని రక్షించెను. వేద ధర్మ ప్రతిష్ఠాపనకై కపిలునిగా జన్మించి, సాంఖ్యమును ఉపదేశించెను. వ్యాసునిగా జన్మించి, వేదసారమైన భారత, భాగవతములను ప్రజలకు అందించెను. రాక్షస సమ్మోహనంబు కొఱకు వేద ధర్మముగాని పాషండ ధర్మమును బుద్ధునిగా అవతరించి, ప్రజలకు కలియుగములో బోధించెను. పాషండ ధర్మములే ఈ కలియుగములో సర్వత్రా ప్రచారముగాను, ఆచారముగానూ యున్నవి.

విరాట్‌పురుషునిగా జన్మించుట మొదటి అవతారము. అతడే ఆ తర్వాత సృష్టిలోని సర్వ స్థావర జంగమములుగా అనగా సర్వ అవతారములు ధరించెను. కావున అతని అవతారములు అసంఖ్యాకము. అవతారములుగా అవతరించిన ఈ సర్వ జీవరాసులలో విశిష్టములైనవి అవతార పురుషులుగా చెప్పుదురు.

**అవతారములు: అయోనిజ సృష్టిలో:**

**స్వయంభువులు:** – తనంత తానుగా కోరిన దేహమును ధరించినవి.

1. మత్స్యావతారము; 2. పాల సముద్ర మథన సమయములో ధరించిన కూర్మావతారము, ధన్వంతరి, మోహిని; 3. హయగ్రీవ అవతారము; 4. నారసింహావ తారము; 5. హంసావతారము

**బ్రహ్మవలన అయోనిజ సృష్టి:**

1. యజ్ఞవరాహావతారము; 2. సనకస నందనాదులు; 3. నారదుడు

**ప్రజాపతుల సృష్టిలో:**

1. నర నారాయణులు; 2. కపిలుడు; 3. దత్తాత్రేయుడు; 4. వామనుడు

**స్వాయంభవుని వంశములో:**

1. ధ్రువుడు; 2. పృథుచక్రవర్తి; 3. ఋషభుడు

**భృగు వంశములో:** పరశురాముడు

**సూర్య వంశములో:** శ్రీరాముడు

**వసిష్ఠుని వంశములో:** వ్యాస భగవానుడు

**యాదవ వంశములో:** శ్రీకృష్ణుడు

**కలియుగములో:** బుద్ధుడు

**కలియుగాంతమున:** కల్కి

ఇలా అవతరించిన అవతార పురుషులలో కొందఱికి వారు పరమాత్మ అనే జ్ఞప్తి లేదు.

అనేక యోగ సాధన రహస్యములను అవతార పురుషుల కథలుగా మనకు అందించిరి. కావున

**ఆ॥ అతిరహస్యమైన హరి జన్మ కథనంబు**
**మనుజుఁ డెవ్వఁ డేని మాపు రేపుఁ**
**జాల భక్తితోడఁ జదివిన సంసార**
**దుఃఖరాశిఁ బాసి తొలఁగి పోవు.** *(భాగవతము-ప్రథమస్కంధం-66)*

అవతారపురుషులయొక్క జన్మ, అందు చెప్పిన విషయములు అతిరహస్యములు. కావున ఆ అతిరహస్యములను గ్రహించి, ఆవిధముగా పాటించినవానికి సంసారము లోని దుఃఖరాశి తొలగిపోవును. కావున హరిజన్మ కథనంబులైన రామాయణము, భారతము, భాగవతములు చదివి అందలి సాధన రహస్యములను గ్రహించవలయును. శాస్త్రపాఠమునకు ఆచరణ పాఠముగా అవతారములు, ఆ అవతారములలో చేసిన కర్మ విధానమును తత్త్వరీత్యా గ్రహించినచో, పునర్జన్మను పొందక ఈశ్వరుడగును.

పుణ్యకర్మలు, యోగము మొదలైన సాధనలు ఏవిధముగా చేయవలయునో వాటిని అవతార పురుషుల కథలుగా చెప్పబడినవి. ఇవి అతి రహస్యములుగా చెప్పబడినవి. యోగ పాఠమునకు సంబంధించిన కథలు మత్స్యావ తారముగా,

కూర్మావతారముగా, వరాహావతారముగా, నరసింహావతారముగా, శ్రీకృష్ణ - బలరాముని అవతారముగా చెప్పబడినవి. యోగపాఠమును, పుణ్యకర్మానుష్ఠాన పాఠములను, రెండింటిని కలిపి శ్రీరాముని కథగా, రామాయణములో చెప్పబడినది. ఇటులనే సర్వ అవతారముల గుఱించి గ్రహించవలయును. ఆవిధముగా ఆచరించ వలయును.

ఇవి సాధకునికి పాఠములు, సామాన్యుడికి కథలు.

...... ❖ ❖ ❖ ......

పుణ్యకర్మాచరణ గుఱించి సంక్షిప్తముగా చెప్పుచున్నాడు

**వీతరాగ భయక్రోధా । మన్మయా మాముపాశ్రితాః ।**
**బహవో జ్ఞాన తపసా । పూతా మద్భావమాగతాః ॥ 10**

వీత - రాగ - భయ - క్రోధాః - మన్మయాః - మామ్ - ఉపాశ్రితాః
బహవః - జ్ఞానతపసా - పూతాః - మత్ - భావమ్ - ఆగతాః

**యే యథా మాం ప్రపద్యన్తే । తాం స్తథైవ భజామ్యహమ్ ।**
**మమ వర్త్మానువర్తన్తే । మనుష్యాః పార్థ సర్వశః ॥ 11**

యే - యథా - మామ్ - ప్రపద్యన్తే - తాన్ - తథా-ఏవ-భజామి-అహమ్
మమ - వర్త్మ - అనువర్తన్తే - మనుష్యాః - పార్థ - సర్వశః

పుణ్యకర్మానుష్ఠానము లేదా యోగమును అనుష్ఠించుచూ....

**సాంఖ్యపద్ధతి :**

జ్ఞాన తపసా+ వీతరాగ భయక్రోధాః = జ్ఞానముచేత (జ్ఞానులు) రాగముద్వేషములు వదలిన వారు అనగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే అరిషట్ వర్గములను జయించిన వారు, తను ఆత్మ అని, దేహము కాదని, గ్రహించి మరణ భయములేనివారు అనగా సాంఖ్యులు.

**యోగపద్ధతి :**

| | | |
|---|---|---|
| మన్మయాః | = | నా యందే చిత్తము గలవారు అనగా ఆత్మాను సంధానము చేయు యోగులు, తపస్విలు |

**భక్తిపద్ధతి :**

| | | |
|---|---|---|
| మామ్+ఉపాశ్రితాః+ బహవః+పూతాః+మత్+ భావమ్+ఆగతాః | = | సమస్త భావములు నా యందే ఉంచి నన్నే అనగా పురుషోత్తముని శరణుకోరిన భక్తులు అనేకమంది కర్మబంధములను తొలగించుకొని పవిత్రులైరి. దేహ త్యాగానంతరమువారు నా యొక్క స్వరూపమును ఆత్మస్వరూపమును పొందిరి |
| పార్థ | = | ఓ అర్జునా! |
| మనుష్యాః+సర్వశః+ మమ+వర్త్మ+అనువర్తన్తే | = | మనుష్యులు ఎవరు ఏపద్ధతిని పాటించిన వారందఱూ అన్ని విధములు నా యొక్క మార్గమునే అనుసరించుచున్నారు. |
| యే | = | ఎవరు |
| యథా+మామ్+ ప్రపద్యన్తే+ అహమ్+తథా+ఏవ+ తాన్+భజామి | = | ఏ విధముగా అనగా కర్మ, యోగ, భక్తి పద్ధతులలో ఏపద్ధతిలో అయినా నన్ను ఆశ్రయించుచున్నారో నేను ఆ విధముగనే అనగా తమోగుణయుతులకు, రజోగుణయుతులకు పునర్జన్మను సత్త్వగుణ ఆశ్రయులకు సాయుజ్యమును, గుణ రహితులకు ఆత్మ స్వరూపము అగునట్లు అనగా బ్రహ్మయై విరాజిల్లునట్లు వారిని అనుగ్రహించుచున్నాను. |

**వ్యాఖ్యానము :-**

హయగ్రీవునిగా వేదములు కర్మాచరణ చెప్పితిని. కపిలునిగా సాంఖ్యమును, యోగమును చెప్పితిని. నారదునిగా భక్తి మార్గమును ఉపదేశించితిని. కావున అందఱునూ నా మార్గమునే అనుసరించుచున్నారు.

తమోగుణయుతులు, రజోగుణయుతులు అయిన రాక్షసులు తపస్సుచేసి, యోగము చేసి, పుణ్యకర్మలు చేసి, బ్రహ్మను దర్శించి, వరములు పొంది, పునర్జన్మకు వచ్చిరి. సత్త్వగుణాశ్రయులైన దేవతలు, మానవులు బ్రహ్మను ఆరాధించి, దర్శించి, బ్రహ్మలోకమునందు నిత్య సంతోషులుగా ఉండిరి. గుణరహితులు బ్రహ్మను దర్శించి బ్రహ్మయై విరాజిల్లుచున్నారు. ఈ విధముగా కర్మ, యోగ, భక్తి పద్ధతి ఏదైన వారి వారి గుణములను బట్టి ఫలితమును పొందుచున్నారు.

...... ❖ ❖ ❖ ......

కామ్యకర్మ ఫలితము శీఘ్రముగా కలుగును

**కాంక్షన్తః కర్మణాం సిద్ధిం । యజన్త ఇహ దేవతాః ।**
**క్షిప్రం హి మానుషే లోకే । సిద్ధిర్భవతి కర్మజా ॥ 12**

కాంక్షంతః - కర్మణామ్ - సిద్ధిమ్- యజంత - ఇహ - దేవతాః
క్షిప్రమ్ - హి - మానుషే - లోకే - సిద్ధిః - భవతి - కర్మజా

| | | |
|---|---|---|
| ఇహ+మానుషే+లోకే+<br>కర్మణామ్+కాంక్షతః+<br>సిద్ధిమ్+దేవతాః+<br>యజంత (యజంతే) | = | ఈ భూలోకమున యజ్ఞములు చేసి కోరికలు కోరినవారు ఆ కోరికలు సిద్ధించుటకు దేవతలను యజించిన |
| కర్మజా+సిద్ధిః+<br>క్షిప్రమ్+భవతి | = | యజ్ఞములవలన వారి కోరికలు శీఘ్రముగా నెఱవేఱుచున్నవి |
| హి | = | ఆత్మదర్శనప్రాప్తి దేవతలను యజించిన కలుగదు. ఆ కారణమున పరమాత్మనే ధ్యానించవలయును |

దేవతలకు విశ్వమయత లేదు. దేవతలను యజించిన ఇహలోక, పరలోక కోరికలు నెఱవేఱును. కాని ఆత్మయగుటకు హృదయగత ఆత్మగా, అంతర్యామిగా విశ్వములో చరించు సృష్ట్యాదియందున్న ఆత్మనే ధ్యానించవలయును. అటుల యజించి, ధ్యానించి, పూజించిన వాడు ఆత్మ అగును.

జీవునికి కర్మలు బంధమును గలిగించునట్లు, విరాట్‌పురుషుడయిన ఈశ్వరునికి సృష్టి - స్థితి - లయ కర్మలు, కర్మబంధమును కల్గించవు.

విరాట్‌పురుషుని ప్రారంభసృష్టి

**చాతుర్వర్ణం మయా సృష్టం । గుణకర్మవిభాగశః ।**
**తస్య కర్తార మపి మాం । విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ 13**

చాతుర్వర్ణమ్ - మయా - సృష్టమ్ - గుణకర్మవిభాగశః
తస్య - కర్తారమ్ - అపి - మామ్ - విద్ధి - అకర్తారమ్ - అవ్యయమ్.

**న మాం కర్మాణి లింపంతి । న మే కర్మఫలే స్పృహా ।**
**ఇతి మాం యోఽభిజానాతి । కర్మభిర్న స బధ్యతే ॥ 14**

న - మామ్ - కర్మాణి - లింపంతి - న - మే - కర్మఫలే - స్పృహా
ఇతి - మామ్ - యః - అభిజానాతి - కర్మభిః - న - సః - బధ్యతే.

**ఆత్మగా**

| | | |
|---|---|---|
| మామ్+అకర్తారమ్+ అవ్యయమ్+విద్ధి | = | నన్ను ఆత్మగా సృష్టి, స్థితి, లయములకు కర్తను గాననియు, కేవలము సాక్షీభూతుడననియు, అవ్యయుడనియూ, అనగా శాశ్వతుడననియూ గ్రహింపుము. |

**14 లోకములలో గల సృష్టిగుఱించి వివరించుచున్నాడు:**

**విరాట్‌పురుషునిగా-**

| | | |
|---|---|---|
| గుణకర్మ విభాగశః+ చాతుర్వర్ణమ్+మయా+ సృష్టమ్ | = | తమోగుణము, రజోగుణము, సత్త్వ గుణము, శుద్ధ సత్త్వగుణము అను నాలుగు గుణములను బట్టి ఆ గుణములచే గుణబద్ధులై, వారుచేయు కర్మలను బట్టి నాలుగు వర్ణముల సమూహమును, ఈ 14 లోకములలో, సర్వ స్థావర జంగమములలో |

| | | |
|---|---|---|
| | | నా చేత అనగా ప్రకృతి–పురుష సమిష్టి రూపమైన విరాట్ పురుషునిచేత, సర్వస్థావర జంగమాత్మకమైన ఈ 14 లోకములతో గూడిన విశ్వము సృజియింప బడినది. |
| తస్య+కర్తారమ్+అపి | = | విరాట్ పురుషునిగా ఆవిధముగా సృష్టి, స్థితి, లయములను కర్మలు చేయుచున్నను ఆ కర్మలు బంధము కావు. నన్ను ఆ కర్మలు బంధించవు అని గ్రహింపుము. |
| మే+కర్మఫలే+న+ స్పృహా+మామ్+కర్మాణి+ న+లింపంతి+ఇతి | = | నాకు, విరాట్‌పురుషునిగా సృష్టి, స్థితి, లయములనే కర్మలయందుగాని, కర్మఫలమందుగాని ఆసక్తి లేదు. అనగా నాకు కర్తృత్వములేదు, అందువలన నన్ను, విరాట్‌పురుషుడయిన నన్ను కర్మలు, కర్మలవలన గలుగు ఫలితములు బంధింపవు |
| యః | = | ఎవడు |
| మామ్+అభిజానాతి | = | విరాట్‌పురుషుడనైన నేను కర్తృత్వభావన లేక కర్మ చేసినట్లుగా అతడును కర్మాచరణ రహస్యమును తెలుసుకొనునో |
| సః+కర్మభిః+న+బధ్యతే | = | అతడు కర్మలచే బంధింపబడడు. |

**వ్యాఖ్యానము:-** ఆత్మకు సృష్టితో సంబంధము లేదు. ఆ తర్వాత ఆత్మ హిరణ్మయ కోశమును నిర్మించుకొని అందు వసియించి పురుషుడైనాడు. ఆత్మస్వరూప స్వభావములు, పురుషుని స్వరూప స్వభావములు ఒకటే. భేదము ఒక్క రూపములోనే గలదు. ఆత్మకు రూపము లేదు. అనగా విరూపము. **"యథా తధ్యద"** అన్నట్లు పురుషునకు ఏరూపము కావాలనుకుంటే, ఆ రూపమే గలుగును. ప్రహ్లాదుని కోరికపై నరసింహ రూపమును ధరియించెను. ఆది పురుషునివలన ప్రకృతి జనియించినది. ఆ ప్రకృతితో పురుషుడు కూడి విరాట్ పురుషుడైనాడు. ఈ విరాట్ పురుషుడు రజోగుణముతో

కూడి, బ్రహ్మయై సృష్టి చేసినాడు. సత్త్వగుణముతో కూడి, విష్ణువై స్థితి కారకుడైనాడు. తమోగుణముతో కూడి, శివుడై లయము చేయుచున్నాడు. ప్రకృతి పురుషుల సమిష్టి రూపమైన విరాట్ పురుషుడు సృష్టి, స్థితి, లయ కారకుడు.

విరాట్ పురుషునిగా మొదట 14 లోకములను సృజియించి లోకపాలురను సృజియించెను. ఆ తర్వాత దేవ, దానవ, యక్ష, రాక్షస, మానవ, పశు, పక్షి, మృగాదులను, అనగా భూచర, జలచర, గగన చర, సర్వ జంగమములను సృజియించెను. వాటికి ఆహారమును గల్పించెను. నక్షత్రములు, మేఘములు, సూర్య చంద్రాది గ్రహములు, సముద్రములు, నదులు, పర్వతములు, కొండలు, వృక్ష లతా గుల్మాదులు అను సర్వస్థావరములను సృజియించెను. వీటిలో కొన్ని స్థావరములకు ఆహారమును సృజియించెను. వృక్ష లతా గుల్మాదులకు ఆహారము కావలయును. గ్రహములు, నక్షత్రములు, కొండలు, సముద్రములకు, ఆహారము అవసరములేదు. ఈ విధముగా 14 లోకములలో గల వాటిని సృజియించెను.

విరాట్పురుషునిచే గుణ, కర్మలవలన **ప్రారంభ సృష్టి** చేయబడినది.

చతుర్ముఖ బ్రహ్మచే కూడా గుణ, కర్మలవలన **అనంతర సృష్టి** చేయబడినది.

ప్రజాపతులచే స్థావరములు, జంగమములు కల్పింపబడినవి

మిథునధర్మ సృష్టిలో స్త్రీ పురుషులచే ఆయా జాతికి సంబంధించినవి జనియించినవి.

**ఉదా:** ఆవు, ఎద్దులవలన - ఆవులు, ఎద్దు జనించినవి.

ఆడమేక, మగమేకవలన - మేకలు జనించినవి.

అటులనే ఆడ మగవలన - మానవులు జన్మించిరి.

ఆడ మగల సంభోగముచే ఏర్పడిన వానిలో గుణ కర్మల వలన సృష్టి జరగదు. ఏజాతివి, ఆ జాతినే సృజియించును. ఒక్క భారతదేశములోనే బ్రాహ్మణాది వర్ణ వ్యవస్థ కలదు. ఈ వ్యవస్థ మిగిలిన దేశములలో లేదు. కావున గుణ కర్మలవలన బ్రాహ్మణాది వర్ణములను భగవంతుడు సృజియించెనని చెప్పినచో ఆ బ్రాహ్మణాది వర్ణ వ్యవస్థలేని ఇతర దేశ ప్రజలను ఎవరు సృజియించిరనే ప్రశ్న ఉదయించును. కావున చాతుర్వర్ణములకు సత్త్వరజస్తమో గుణము, మిశ్రమగుణము అను నాలుగు వర్ణములతో

సర్వప్రాణులు సృజియింపబడినవి అని చెప్పవలయును. సప్త ద్వీపములలో గుణ-కర్మలనుబట్టి చాతుర్వర్ణములు ఏర్పడినవి.

**సప్త ద్వీపములుగా గల భూమిపై...**

| **ద్వీపము** | | **చాతుర్వర్ణవ్యవస్థ** |
|---|---|---|
| 1. జంబూ ద్వీపము | - | నవ వర్షములుగా విభజింపబడిన ఈ ద్వీపములో భారత దేశము (భరత వర్షము) లోనే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే నాలుగు వర్ణములతో కూడిన వర్ణ వ్యవస్థ కలదు. మిగిలిన 8 వర్షములలో ఇట్టి వర్ణ వ్యవస్థలేదు. |

**ఇతర ద్వీపములలోని వర్ణ వ్యవస్థ:**

| | | |
|---|---|---|
| 2. ప్లక్ష ద్వీపము | - | హంసలు, పతంగులు, ఊర్ధ్వాంకునులు, సత్యాంగులు. |
| 3. శాల్మలీ ద్వీపము | - | శ్రుతి ధరులు, విద్యాధరులు, వసుంధరులు, ఇధ్మ ధరులు. |
| 4. కుశ ద్వీపము | - | కుశలులు, కోవిదులు, అభియుక్తులు, కులకులు |
| 5. క్రౌంచ ద్వీపము | - | గురువులు, ఋషభులు, ద్రవిణకులు దీవకులు |
| 6. శాక ద్వీపము | - | ఋతవ్రతులు, సత్యవ్రతులు, దానవ్రతులు, సువ్రతులు. |
| 7. పుష్కర ద్వీపము | - | ఇక్కడ చాతుర్వర్ణ వ్యవస్థలేదు. |

సత్త్వగుణము వలన-దేవతలను, ఋషులను; రజోగుణము వలన -అసురులను; తమోగుణము వలన - యక్ష రాక్షసులను; మిశ్రమ గుణములుగా - మానవులను సృజియించెను.

**కర్మ :** కర్తృత్వము లేనప్పుడు భోక్తృత్వముండదు. దీనికి ఒక ఉదాహరణ ద్వారా గ్రహింతుము. యుద్ధములో ఒక సైనికుడు పై అధికారుల ఆజ్ఞ ప్రకారము ఫైరింగ్ చేసి, శత్రుదేశపు సైనికులను చంపినాడు. ఆ సైనికునికి ప్రతిభాశాలి అనే ప్రశంస

లభించును. అదే సైనికుడు తన గ్రామమునకు వచ్చి కోపములో ఒక వ్యక్తిని చంపినచో, అతనికి ఉరిశిక్ష పడును. ఇదే **కర్మాచరణ రహస్యము.**

అనగా కర్తృత్వములేని కర్మాచరణవలన కర్మబద్ధుడు కాడు. నిష్కామ కర్మాచరణవలన కర్మ బద్ధుడుకాడు. గుణకర్మలవలన జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు నిర్ణయింపబడినవి. కావున ఆవిధముగా జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు పాటించుటవలన కర్మ బంధము కాదు. తనకు చెప్పని జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు పాటించుటవలన కర్మ బంధమును కల్గించును.

...... ❖ ❖ ❖ ......

కర్మబంధముగాని కర్మాచరణ రహస్యము

**ఏవం జ్ఞాత్వా కృతం కర్మ । పూర్వైరపి ముముక్షిభిః ।**
**కురు కర్మైవ తస్మాత్త్వం । పూర్వైః పూర్వతరం కృతమ్ ॥ 15**

ఏవమ్ – జ్ఞాత్వా – కృతమ్ – కర్మ – పూర్వైః – అపి– ముముక్షిభిః
కురు – కర్మ – ఏవ – తస్మాత్ – త్వమ్ – పూర్వైః – పూర్వతరమ్ – కృతమ్.

కర్మ - అకర్మ - వికర్మల గుఱించి తెలుసుకొనవలయును

**కిం కర్మ కిమకర్మేతి । కవయోఽప్యత్ర మోహితాః ।**
**తత్తే కర్మ ప్రవక్ష్యామి । యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥16**

కిమ్ – కర్మ – కిమ్ – అకర్మ – ఇతి – కవయః – అపి – అత్ర – మోహితాః
తత్ – తే – కర్మ – ప్రవక్ష్యామి – యత్ – జ్ఞాత్వా – మోక్ష్యసే – అశుభాత్

**కర్మణో హ్యపి బోద్ధవ్యం । బోద్ధవ్యం చ వికర్మణః ।**
**అకర్మణ శ్చ బోద్ధవ్యం । గహనా కర్మణోగతిః ॥ 17**

కర్మణః – హి – అపి – బోద్ధవ్యమ్ – బోద్ధవ్యమ్ – చ – వికర్మణః
అకర్మణః – చ – బోద్ధవ్యమ్ – గహనా – కర్మణః – గతిః

**కర్మణ్య కర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః ।**
**స బుద్ధిమాన్ మనుష్యేషు । స యుక్తః కృత్స్న కర్మకృత్ ॥ 18**

కర్మణి – అకర్మ – యః – పశ్యేత్ – అకర్మణి – చ – కర్మ – యః
సః – బుద్ధిమాన్ – మనుష్యేషు – సః – యుక్తః – కృత్స్న కర్మకృత్

| | | |
|---|---|---|
| ఏవమ్+జ్ఞాత్వా+ | = | ఈ విధముగా కర్మాచరణ రహస్యమును గ్రహించి |
| కవయః+అపి | | పూర్వులయిన ముముక్షువులచేత ఫలాసక్తిలేని కర్మ |
| పూర్వైః+ముముక్షిభిః+ | | చేయబడినది. వారు కర్మబద్ధులు కాలేదు. |
| కర్మ+కృతమ్ | | అందువలన నీవు కూడా పూర్వులచేత |
| తస్మాత్+త్వమ్+అపి+ | | (పెద్దలచేత) పూర్వతరము వారు చేసిన |
| పూర్వైః+పూర్వతరమ్+ | | ఫలాసక్తి లేని పుణ్యకర్మాచరణ చేయుము |
| కృతమ్+ఏవ+కర్మ+కురు | | జ్ఞానవంతులు కానివారు–"అర్థవాద బహుళంబులైన వేదంబులచేత నష్టమనీషం గలిగి" |
| కిమ్+కర్మ | = | పుణ్యకర్మాచరణ ఎలా చేయవలయును? |
| కిమ్+అకర్మ+ఇతి+ | = | ఏ కర్మాచరణను కర్మ బాహుళ్యము అని చెప్పుదురు? |
| అత్ర+మోహితాః | | ఏ కర్మాచరణను అపభ్రంశము అని చెప్పుదురు? ఈ కర్మాచరణయందు కర్మాచరణ రహస్యము తెలియక మోహితులైరి. కావున |

| | | |
|---|---|---|
| యత్+జ్ఞాత్వా+ అశుభాత్+మోక్ష్యసే+ తత్+కర్మ+తే+ ప్రవక్ష్యామి | = | దేనిని తెలుసుకొని కర్మబంధమునుండి విడివడుదువో ఆత్మ స్థానమును పొందుదువో ఆ కర్మ విధానమును నీ కొఱకు మరల మరల చెప్పుచున్నాను. ఆవిధముగా నీవు ఆచరించిన నీవు శాంతి గలిగి దేహత్యాగానంతరము ఆత్మస్థానమును పొందుదువు. |
| కర్మణః+బోద్ధవ్యమ్+చ+ వికర్మణః+బోద్ధవ్యమ్+ చ+అకర్మణః+అపి+ బోద్ధవ్యమ్ | = | వేదవిహిత పుణ్యకర్మాచరణ విధానమును తెలియవలయును కర్మబాహుళ్యము గుఱించి తెలియవలయును. అపభ్రంశము గుఱించి తెలియవలయును. అయితే |
| కర్మణః+గతిః+గహనా+ హి | = | ఆచరణలో కర్మ, కర్మబాహుళ్యము, అపభ్రంశముల గుఱించి తెలియుట కష్టము. ఆ కారణమున వేదజ్ఞులను అడిగి వేదవిహిత కర్మ గుఱించి గ్రహించవలయును |

కర్మ, కర్మబాహుళ్యము, అపభ్రంశములకు వేదవ్యాసుడు కర్మ, వికర్మ, అకర్మలుగా వివరించినారు.

| | | |
|---|---|---|
| యః+కర్మణి+కర్మ+ పశ్యేత్ | = | ఎవడు వేదోక్త కర్మలయందు నిష్కామకర్మను చూచునో |
| కర్మణి+యః+అకర్మణి+ అకర్మ+చ+(వికర్మణి)+ సః+మనుష్యేషు+ బుద్ధిమాన్ | = | కర్మలయందు ఎవడు కర్మబాహుళ్యమును, అపభ్రంశమును గ్రహించి కర్మ, వికర్మ, అకర్మలను గ్రహించునో, అపభ్రంశమును కర్మబాహుళ్యమును గ్రహించునో మనుష్యులలో అతడు బుద్ధిమంతుడు |
| సః+కృత్స్న కర్మ కృత్+ యుక్తః | = | అతడు సమస్తమయిన పుణ్యకర్మలు చేసినవాడు వివేకముతో కూడినవాడు, వివేకవంతుడు అగును. |

**వ్యాఖ్యానము :-**

ఈ విషయమునే కఠోపనిషత్తులో –

**"అనుపశ్య యథా పూర్వే ప్రతిపశ్య తథాऽపరే"** (ప్రథమవల్లి -6)

మోక్షమార్గమును పొందిన మీ పూర్వులు సంసారములోవుండి వారు ఏవిధముగా పుణ్య కర్మలు చేసిరో గమనించుము. ఆవిధముగా చేయుము.

**తైత్తిరీయములో – శీక్షావల్లిలో 11వ అనువాకములో**

**అథ యదితే కర్మ విచికిత్సావా వృత్త విచికిత్సా వాస్యాత్**

**యే తత్ర బ్రాహ్మణాః సమ్మర్శినః యుక్తాః అయుక్తాః అలూక్షా**

**ధర్మ కామాస్స్యు యథా తే తత్ర వర్తేరన్ తథా తత్ర వర్తేథాః**

**యాన్యస్మాకగ్ం సుచరితాని తాని త్వయా ఉపాస్యాని.**

కర్మాచరణలో కర్మ, కర్మ బాహుళ్యము, అపభ్రంశము అను మూడు విభాగములు కలవు. కర్మ అనగా వేద విహిత కర్మాచరణ అనగా కర్మ ఏవిధముగా చేయవలయునని వేదము విధించినదో ఆ విధముగా కర్మ చేయుట.

అపభ్రంశము అనగా చేయకూడని పనిని చేయుట. శాస్త్ర విహితముకాని కర్మాచరణ చేయుట. రుద్రుడులేని యాగములేదు. దక్షుడు శివ ద్వేషియై రుద్రుని ఆహ్వానింపక యజ్ఞము చేసినాడు. తత్ఫలితముగా దక్షుడు నశించిపోయినాడు. ఇది ఒక ఉదాహరణ. దీనిని బట్టి ఈ విధమైన కర్మాచరణవలన గలుగు ఫలితమును ఊహించవలయును.

**కర్మబాహుళ్యము:**

చేయవలసిన దానికంటే ఎక్కువ చేయుట. ఉదా: అన్నము ఉడికిన తర్వాత ఆ పాత్రను మంటపైనుంచి దింపవలయును. లేనిచో అన్నము పాడగును. అటులనే పాలను ఇంకా ఇంకా మరగ కాచినచో ఆ పాత్రకూడా పాడగును. అపభ్రంశము, కర్మబాహుళ్యమునకు ఉదాహరణగా దక్షుని కథ చెప్పబడినది.

"ఇట్టి మూఢాత్ముండు తత్త్వవిముఖుండగు .... గ్రామ్యసుఖ కాంక్షలంజేసి సక్తుండై యర్థవాదంబు లయిన వేదంబులుచే నష్టమనీషం గలిగి కర్మతంత్రంబు విస్తృతంబుసేయుచు ................ (భాగవతం–చతుర్థ స్కంధం –47)

(అపభ్రంశంబు) మూఢ బుద్ధులు నష్టశౌచులై నశింతురు పాషండులగుచు......

(భృగు శాపము). (భాగవతం-చతుర్థస్కంధం-51)

కావున వేదములో చెప్పినట్లు మాత్రమే పుణ్యకర్మలు చేయవలయును.

ఈ విషయమునే రామాయణములో **"యథాశాస్త్రం యథావిధిః"** అని వాల్మీకిమహర్షి చెప్పినారు.

నందీశ్వరుడు దక్షుని యాగమును తప్పుబట్టి బ్రాహ్మణులను శపించినాడు. దానికి ప్రతిగా భృగు మహర్షి శపించినాడు. కర్మబాహుళ్యము చేయుచున్న వారిని ఒకరు శపించిరి. అపభ్రంశము చేయుచున్నవారిని ఇంకొకరు శపించిరి. ఆవిధముగా కథగా భాగవతము చతుర్థ స్కంధములో దక్షప్రజాపతి కథగా చెప్పబడినది. కావున కృష్ణ యజుర్వేదములో – ఒక్కొక్క కర్మాచరణకు కొన్ని విధులు నిషేధములు చెప్పబడినవి. విధిని ఆచరించిన సత్ఫలితము ఉండును. నిషేధమును ఆచరించిన యజ్ఞ కర్త అయిన యజమాని కాని లేదా ఋత్విక్‌గాని చనిపోవును. కృష్ణ యజుర్వేద సంహితలో అనేక విధులు అనేక నిషేధములు చెప్పబడినవి. కావున ఆ సంహితలో చెప్పిన విధి విధానముగానే ఆచరణ ఉండవలయును. ప్రథమ కాండ – ప్రథమ ప్రపాఠకము – ప్రథమ సూక్తముతో ప్రారంభించి, సప్తమ కాండ – పంచమ ప్రపాఠకము – పంచ వింశో అనువాకము వఱకు అనేక విధి విహిత కర్మలు, అకర్మలు, వికర్మలు చెప్పబడినవి. ఈ వేదముతో పాటు మిగిలిన మూడు వేదములను అటులనే నాలుగు వేదములలో చెప్పబడిన బ్రాహ్మణములు, ఆరణ్యకములు మరల వాటియందు చెప్పబడిన కర్మ విభాగము మంత్ర విభాగములను క్షుణ్ణముగా అర్థము చేసుకొని యజ్ఞములు చేయవలయును. ఇట్టి విధి విధానములేని ఆహుతులను దేవతలు స్వీకరింపరు.

**పండితుని నిర్వచనము:** కర్మ బంధములను సర్వమును జ్ఞానాగ్నిలో దహనము చేసినవాడు **పండితుడు**. వేదశాస్త్రములు చదివి యజ్ఞ యాగాది అగ్నిహోత్రాది కర్మలను విధి విహితముగా చేసి ఆ పుణ్య ఫలితమువలన బ్రహ్మలోకము పొంది, పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మించువారు పండిత మన్యులు.

**ముండక ఉపనిషత్ - ప్రథమ ముండకే ద్వితీయ ఖండః :**

7. ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్త మవరం యేషు కర్మ ।
   ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢా జరామృత్యుంతే పునరేవాపియన్తి ॥
8. అవిద్యాయా మన్తరే వర్తమానాఃస్వయం ధీరాః పండితం మన్యమానాః
   జంఘన్య మానాః పరియంతి మూఢాః అన్ధేనైవ నీయమానా యధాఽన్ధాః
10. ఇష్టా పూర్తం మన్యమానా వరిష్ఠం నాన్య చ్ఛ్రేయో వేదయన్తే ప్రమూఢాః
   నాకస్య పృష్ఠే తే సుకృతేఽను భూత్వా ఇమం లోకం హీన తరం వా విశంతి

అనగా యజ్ఞఫలితము కోరి 16 మంది ఋత్విజులు, యజమాని, యజమాని భార్య మొత్తము 18 మందిచే చేయబడు యజ్ఞములు ఓటి పడవలవంటివి. భవసాగరమును దాటించలేవు. బ్రహ్మలోకప్రాప్తి తాత్కాలికముగా పొంది, ఇదే శ్రేయస్కరమని తలంచువారు మూర్ఖులు. వారు పుణ్యము క్షీణించగనే తిరిగి జన్మపరంపరలలో తిరుగాడుదురు. ఈ మూర్ఖులు వారంతట వారే పండితులమని, ధీరులమని, కృతార్థులమైతిమని భావింతురు. వీరు నిజమునకు జ్ఞానశూన్యులైన బాలురవంటివారు. వీరు ఇష్టాపూర్తములు అనే పుణ్యకర్మలు చేసి, బ్రహ్మలోకము చేరి పుణ్యము క్షీణించగనే బ్రహ్మలోకము యొక్క వెలుపలి ద్వారముద్వారా మరల భూలోకమున జన్మించుచున్నారు.

...... ❖ ❖ ❖ ......

ఎవరు పండితుడు? పండితుని లక్షణములు ఏమిటి? చెప్పుచున్నాడు:

**యస్య సర్వే సమారమ్భాః । కామసంకల్ప వర్జితాః ।**
**జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం । తమాహుః పణ్డితం బుధాః ॥ 19**

యస్య - సర్వే - సమారమ్భాః - కామ సంకల్ప వర్జితాః
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణమ్ - తమ్ - ఆహుః - పణ్డితమ్ - బుధాః

పండితునికి కర్మలు బంధము కావు

**త్యక్త్వా కర్మఫలాసఙ్గమ్ । నిత్యతృప్తో నిరాశ్రయః ।**
**కర్మణ్యభి ప్రవృత్తోఽపి । నైవ కించిత్కరోతి సః ॥ 20**

త్యక్త్వా – కర్మఫలాసంగమ్ – నిత్యతృప్తః – నిరాశ్రయః
కర్మణి – అభి ప్రవృత్తః – అపి – న – ఏవ – కించిత్ – కరోతి – సః

పండితుడు - కర్మబంధమును పొందడు

**నిరాశీర్యత చిత్తాత్మా । త్యక్త సర్వపరిగ్రహః ।**
**శారీరం కేవలం కర్మ । కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 21**

నిరాశీః – యత చిత్తాత్మా – త్యక్త సర్వపరిగ్రహః
శారీరమ్ – కేవలమ్ – కర్మ – కుర్వన్ – న – ఆప్నోతి – కిల్బిషమ్

**యదృచ్ఛాలాభ సన్తుష్టోద్వన్ద్వాతీతో విమత్సరః ।**
**సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥ 22**

యదృచ్ఛాలాభ సన్తుష్టః – ద్వన్ద్వాతీతః – విమత్సరః
సమః – సిద్ధౌ – అసిద్ధౌ – చ – కృత్వా – అపి – న – నిబధ్యతే

| | | |
|---|---|---|
| యస్య | = | ఎవని యొక్క |
| సర్వే + సమారమ్భాః | = | శాస్త్రవిహితమయిన సర్వ పుణ్య కర్మలు |
| కామ సంకల్ప వర్జితాః | = | కామ సంకల్ప వర్జితములో అనగా ఎటువంటి కోరికలు లేనివో (అనగా నిష్కామ కర్మలో) |
| జ్ఞానాగ్ని దగ్ధకర్మాణమ్+ | = | జ్ఞానాగ్నిలో సర్వకర్మల యొక్క ఫలితములు |
| తమ్+బుధాః+ | | దగ్ధమయినవో అతనిని జ్ఞానులు |
| పండితమ్+ఆహుః | | పండితుడని చెప్పుదురు |

పండితుడు అనగా శాస్త్రములు చదివినవాడు కాదని. జ్ఞానాగ్నిలో సర్వకర్మలు దగ్ధమయినవాడే పండితుడని శ్రీకృష్ణుడు నిర్వచించినాడు.

పండితుని గుఱించి 26వ అధ్యాయమున 11వ శ్లోకములో చెప్పినదానిని యిక్కడ అనుసంధానము చేయవలయును.

| | | |
|---|---|---|
| సః+కర్మఫలాసంగమ్+<br>త్యక్త్వా+నిత్యతృప్తః+<br>నిరాశ్రయః+కర్మణి+<br>అభిప్రవృత్తః+అపి+<br>కించిత్+న+కరోతి+ఏవ | = | కర్మలవలన కలుగు ఫలితమునందలి కోరికను వదలి యదృచ్ఛా లాభ సంతుష్టుడై అనగా ప్రాప్తంబైన లేశమైన పదివేలనుచున్ – నిత్యతృప్తుడై కవి, పండితులు రాజులను ధనమదాంధులను సేవించి ఆ పడుపుకూడు భుజింపక భగవంతుడనైన నన్నే ఆశ్రయించినవాడును అనగా ప్రకృతిచేత జనియించిన గుణములు, ఆ గుణములచే కర్మలయందు ప్రవృత్తుడైనను ఏ కొంచెము కర్మకూడా చేయనివాడే అగును. అందువలన అతనికి ఆ కర్మలు బంధములు కావు. |
| కేవలమ్+శారీరమ్+<br>కర్మ + కుర్వన్+<br>త్యక్త సర్వపరిగ్రహః+<br>నిరాశీః+యత చిత్తాత్మా+<br>కిల్బిషమ్+న+ఆప్నోతి+ | = | కేవలము శరీరమును గూర్చి కర్మ చేయుచూ అనగా కాలకృత్యములు, స్నానపానాదులు, ఆహార నిద్రలు చేయుచూ అపరిగ్రహమును పాటించువాడును (అనగా ఎవరిని ఆశ్రయింపక భగవంతునినే ఆశ్రయించుచూ, "పోము హిరణ్యదానములు పుచ్చుకొనంగ" – బంగారాది దానములు పుచ్చుకొనుటకు పోము అని శృంగి చెప్పినట్లు ఉండి. ఆశ లేనివాడును, ఉన్నదానితో తృప్తి చెందువాడును, స్వాధీన చిత్తుడును (చిత్తమును నిగ్రహించినవాడు) పుణ్యకర్మలు చేసినప్పటికి కర్మబంధమును, పాపమును పొందదు. అనగా అట్టివాడు, కర్మబంధములనుండి విడివడి ఆత్మస్థానమును చేరును. |

| | | |
|---|---|---|
| యదృచ్ఛాలాభసంతుష్టః | = | ప్రాప్తమయిన లేశమయిన పదివేలనుచున్ తృప్తిని పొందినివాడును, అనగా ఈశ్వర కృపచే లభించిన దానితో తృప్తి పొందినవాడును |
| ద్వంద్వాతీతః | = | ద్వంద్వాతీతుడును అనగా కాలానుసారము ప్రాప్తములైన సుఖ-దుఃఖములందు విచలితుడు కానివాడును అయిన పుణ్య కర్మానుష్ఠాన పరుడును |
| విమత్సరః | = | అరిషట్వర్గములు లేనివాడు అనగా కామ, క్రోధ, లోభ, మోహ, మద,మాత్సర్యములు లేనివాడును. |
| సిద్ధౌ+చ+అసిద్ధౌ+సమః | = | ఇట్టి లక్షణములే గలిగి యోగములో సిద్ధి పొందినను, సిద్ధి పొందక పోయినను అనగా నిశ్చల సమాధి పొందిననూ, వికల్ప సమాధి పొందిననూ, కార్య సాఫల్యము గలిగినా గలుగక పోయినా సమముగా చూచువాడును, సమభావన గలిగిన వాడును |
| కృత్వా+అపి+ న+నిబధ్యతే | = | పుణ్యకర్మలు చేసినను కూడ కర్మబంధము కాదు అతడు కర్మలే బంధింపబడడు. |

...... ❖ ❖ ❖ ......

**యోగి**

**గతసఙ్గస్య ముక్తస్య । జ్ఞానావస్థిత చేతసః ।**
**యజ్ఞాయాచరతః కర్మ । సమగ్రం ప్రవిలీయతే ॥ 23**

గతసంగస్య - ముక్తస్య - జ్ఞానావస్థిత చేతసః
యజ్ఞాయ - ఆచరతః - కర్మ - సమగ్రమ్ - ప్రవిలీయతే

**సాంఖ్యము:**

| | | |
|---|---|---|
| జ్ఞానావస్థిత చేతసః | = | జ్ఞాని తను దేహము కాదని, దేహిని కాదని ఆత్మ స్వరూపుడునని, గ్రహించును, జ్ఞానమునందు మనస్సు గలిగి ఉండును. ఆత్మరతి, ఆత్మ క్రీడ యందు ఉండును. అట్టి జ్ఞానియొక్క కర్మయూ, |

**యోగము:**

| | | |
|---|---|---|
| గత సంగస్య+ముక్తస్య | = | సంగరహితుడును, సంసారబంధమునుండి విడివడినవాడును అయినవాని కర్మయు |

**పుణ్య కర్మానుష్ఠానపరుడు:**

| | | |
|---|---|---|
| యజ్ఞాయ+కర్మ+ ఆచరతః+సమగ్రమ్+ ప్రవిలీయతే | = | పుణ్యఫలితము కోరక యజ్ఞముకొఱకు కర్మ చేయు వాని యొక్క కర్మయు సంపూర్ణముగ విలీనమగును. అతడు ఆత్మ స్థానమును చేరి ఆత్మయై విరాజిల్లును. |

...... ❖ ❖ ❖ ......

జ్ఞానమనగా నేమిటో వివరించుచున్నాడు. ఈ సర్వము-బ్రహ్మ / ఆత్మగా గ్రహించుటయే జ్ఞానము. ఋగ్వేదము ఈ జ్ఞానమును ప్రజ్ఞానం అని అన్నది.

యజ్ఞము, యజ్ఞములో వాడబడు సర్వ యజ్ఞసంభారములు యజ్ఞకర్త
ఈ సర్వము బ్రహ్మమే

**బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।**
**బ్రహ్మైవ తేన గన్తవ్యం । బ్రహ్మ కర్మ సమాధినా ॥ 24**

బ్రహ్మ-అర్పణమ్ - బ్రహ్మ-హవిః - బ్రహ్మ-అగ్నౌ - బ్రహ్మణా-హుతమ్
బ్రహ్మ-ఏవ-తేన-గన్తవ్యమ్ - బ్రహ్మ కర్మ - సమాధినా.

పుణ్యకర్మానుష్ఠానములో హోమ ద్రవ్యములచే చేయబడు బాహ్య యజ్ఞము:

| | | |
|---|---|---|
| బ్రహ్మణా+అగ్నౌ+<br>బ్రహ్మ+హవిః+బ్రహ్మ | = | యజ్ఞముచేయు యజ్ఞకర్తచేత అగ్నియందు వ్రేల్చబడు పశువులు బ్రహ్మము హవిస్సు, హోమద్రవ్యములు, దర్భలు బ్రహ్మము |
| హుతమ్+అర్పణమ్+<br>బ్రహ్మ | = | హుతమగు చరువు పురోడాశములు-బ్రహ్మము స్రుక్కు, స్రువములు, కపాలములు (పాత్రలు), జుహువు, మొదలైన పాత్రలు, హోమ సాధనములు అన్నీ బ్రహ్మమే. |
| తేన+బ్రహ్మకర్మ+<br>గంతవ్యమ్+బ్రహ్మ+<br>ఏవ+సమాధినా | = | ఆ యజ్ఞముచేత పొంద దగినదియు బ్రహ్మమే అనగా ఈ సర్వము బ్రహ్మమని గ్రహించి, బ్రహ్మను చేరుటకై, పుణ్యకర్మలు చేసి, యజ్ఞముచేసి, యజమానుడు బ్రహ్మత్వమును పొందవలయును. నిశ్చల సమాధిచేత పొందదగినదియు బ్రహ్మమే. |

...... ❖ ❖ ❖ ......

పుణ్యకర్మానుష్ఠాన పద్ధతులు

**దైవమేవా పరే యజ్ఞం । యోగినః పర్యుపాసతే ।**
**బ్రహ్మాగ్నావపరే యజ్ఞం । యజ్ఞేనైవోపజుహ్వతి ॥ 25**

దైవమ్ - ఏవ - అపరే - యజ్ఞమ్ - యోగినః - పర్యుపాసతే
బ్రహ్మ - అగ్నౌ - అపరే - యజ్ఞమ్ - యజ్ఞేన - ఏవ - ఉపజుహ్వతి

యోగము: ఇంద్రియములు, ఇంద్రియార్థములు

**శ్రోత్రాదీనీన్ద్రియాణ్యన్యే । సంయమాగ్నిషు జుహ్వతి ।**
**శబ్దాదీన్విషయానన్య । ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి ॥ 26**

శ్రోత్రాదీని – ఇంద్రియాణి – అన్యే – సంయమ అగ్నిషు – జుహ్వతి
శబ్దాదీన్ – విషయాన్ – అన్యే – ఇంద్రియాగ్నిషు – జుహ్వతి

యోగము: ఇంద్రియకర్మలు - ప్రాణకర్మలు

**సర్వాణీన్ద్రియ కర్మాణి । ప్రాణకర్మాణి చాపరే ।**
**ఆత్మ సంయమ యోగాగ్నౌ । జుహ్వతి జ్ఞానదీపితే ॥ 27**

సర్వాణి – ఇన్ద్రియ కర్మాణి – ప్రాణ – కర్మాణి – చ – అపరే
ఆత్మ సంయమ – యోగాగ్నౌ – జుహ్వతి – జ్ఞానదీపితే

**ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా । యోగయజ్ఞాస్తథాపరే ।**
**స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ । యతయః సంశిత వ్రతాః ॥ 28**

ద్రవ్యయజ్ఞాః – తపోయజ్ఞాః – యోగయజ్ఞాః – తథా – అపరే
స్వాధ్యాయ– జ్ఞానయజ్ఞాః – చ – యతయః – సంశిత వ్రతాః

ప్రాణాయామము

**అపానే జుహ్వతి ప్రాణం । ప్రాణేఽపానం తథాపరే ।**
**ప్రాణాపానగతీ రుధ్వా । ప్రాణాయామ పరాయణాః ॥ 29**

అపానే – జుహ్వతి – ప్రాణమ్ – ప్రాణే – అపానమ్ – తథా – అపరే
ప్రాణాపానగతీ–రుధ్వా – ప్రాణాయామపరాయణాః

**అపరే నియతాహారాః । ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి ।**
**సర్వేఽప్యేతే యజ్ఞవిదో । యజ్ఞక్షపితకల్మషాః ॥ 30**

అపరే – నియతాహారాః – ప్రాణాన్ – ప్రాణేషు – జుహ్వతి
సర్వే – అపి – ఏతే – యజ్ఞవిదః – యజ్ఞక్షపిత కల్మషాః

**యజ్ఞ శిష్టామృత భుజో । యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।**

**నాయం లోకోஉస్త్య యజ్ఞస్య । కుతోஉన్యః కురుసత్తమ ॥31**

యజ్ఞ శిష్టామృత భుజః – యాన్తి – బ్రహ్మ – సనాతనమ్

న – అయమ్ – లోకః – అస్తి – అయజ్ఞస్య – కుతః – అన్యః – కురుసత్తమ

**ఏవం బహువిధా యజ్ఞా । వితతా బ్రహ్మణో ముఖే ।**

**కర్మజాన్ విద్ధి తాన్ । సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ 32**

ఏవమ్ – బహువిధాః – యజ్ఞాః – వితతాః – బ్రహ్మణః – ముఖే

కర్మజాన్ – విద్ధి – తాన్ – సర్వాన్ – ఏవమ్ – జ్ఞాత్వా – విమోక్ష్యసే

| | | |
|---|---|---|
| అపరే+దైవమ్+<br>యజ్ఞమ్+అగ్నౌ+ఏవ+<br>ఉపజుహ్వతి+యజ్ఞేన+<br>ఏవ | = | కొందఱు దైవము నుద్దేశించి యజ్ఞమును, ఆ హోమద్రవ్యములను వేద విహితముగా అగ్నియందు వ్రేల్చి హోమము చేయుచున్నారు. ఆవిధముగా ఆ యజ్ఞముచేతనే బ్రహ్మను పొందుచున్నారు. |
| అపరే+యోగినః+<br>బ్రహ్మ+పర్యుపాసతే+<br>యజ్ఞమ్ | = | కొందఱు యోగులు ఆత్మానుసంధానము చేసి బ్రహ్మమును చక్కగా ఉపాసించుచున్నారు. ఆవిధముగా యజ్ఞమును చేయుచున్నారు, బ్రహ్మను పొందుచున్నారు. |

బ్రహ్మమును చేరుటకు కొందఱు బాహ్య యజ్ఞమును, కొందఱు మానసిక యజ్ఞముగా చెప్పబడే యోగమును చేయుచున్నారు.

| | | |
|---|---|---|
| అన్యే+శ్రోత్రాదీని+<br>ఇంద్రియాణి+సంయమ+<br>అగ్నిషు+జుహ్వతి | = | కొందఱు చెవులు, చర్మము, కన్నులు, నాలుక, ముక్కు అనే జ్ఞానేంద్రియములను వాటి వాటి ఇంద్రియార్థములందు ప్రసరించకుండా నిగ్రహించి, నిగ్రహము అనే అగ్నియందు వ్రేల్చు |

చున్నారు, అనగా ఇంద్రియార్థములందు ఇంద్రియములను ప్రసరించకుండా, నిగ్రహించు చున్నారు. ఇది ఒక పద్ధతి.

| | | |
|---|---|---|
| అన్యే+శబ్దాదీన్+ | = | కొందఱు శబ్ద, స్పర్శ, రూప, రస,గంధములనే |
| విషయాన్+ | | ఇంద్రియార్థములను ఇంద్రియములనే |
| ఇంద్రియాగ్నిషు+జుహ్వతి | | అగ్నియందు, వ్రేల్చుచున్నారు. ఇది ఒక పద్ధతి. |

అనగా కొందఱు ఇంద్రియములను నిగ్రహించుచున్నారు. కొందఱు ఇంద్రియార్థములను నిగ్రహించుచున్నారు, అనగా మనస్సును యింద్రియార్థములతో కలవనీయకుండా చేయుచున్నారు. కొందఱు యోగము చేయుచూ జ్ఞానేంద్రియములను నిగ్రహించుచున్నారు.

| | | |
|---|---|---|
| అపరే+సర్వాణి+ | = | కొందఱు కర్మేంద్రియములను, |
| ఇన్ద్రియ కర్మాణి+చ+ | | జ్ఞానేంద్రియములను వాటి వాటి కర్మలయందు |
| ప్రాణ+కర్మాణి+ | | పనిచేయకుండా నిగ్రహించి ప్రాణము, అపానము, సమానము, ఈ మూడింటిని నిగ్రహించి, ఆకలి దప్పులను జయించుచున్నారు. వ్యానవాయువును నిగ్రహించి, శీతోష్ణములను జయించు చున్నారు. ఉదాన వాయువును సుషుమ్నా నాడిలో ప్రవేశింప జేసి, ప్రాణాయామము చేయుచున్నారు. |
| జ్ఞానదీపితే+ | | నిత్యానిత్య వివేకముతో మనోబుద్ధులను ఏకము |
| ఆత్మ సంయమ+ | | జేసి జ్ఞానముచే ప్రకాశింపచేయబడిన జీవాత్మను |
| యోగాగ్నౌ+జుహ్వతి | | పరమాత్మతో అనుసంధానము చేయుట అనే ఆత్మసంయమము అనెడి యోగము అనే అగ్నిలో వ్రేల్చుచున్నారు. |

**యోగము:**

1. కర్మేంద్రియములను నిగ్రహించి, 2. జ్ఞానేంద్రియములను నిగ్రహించి, 3. ప్రాణమును నియమించి ప్రాణాయామముచేసి 4. మనోబుద్ధులను ఏకముచేసి 5. జీవాత్మను ఆత్మతో కలిపి నిశ్చలసమాధిలో ఉందురు.

## పుణ్యకర్మలోని రకములు

ద్రవ్య యజ్ఞము–ధనముతో సంబంధములేని పుణ్యకర్మలూ చెప్పబడుచున్నవి. తైత్తిరీయ ఉపనిషత్‌లో శీక్షావల్లిలో నవమ అనువాకములో చెప్పిన వాటినే అనగా మౌద్గల్యుని కొడుకు నాకుడు స్వాధ్యాయము చేయవలయునని; రాధీతరుని కొడుకు సత్యవహుడు సత్యము పలుకవలయునని; పౌరుశిష్టి కొడుకు తపోనిత్యుడు తపస్సు చేయవలయునని చెప్పిరి. వీటినే ఇందు ఇట్లు చెప్పబడినది.

**కర్మిష్ఠులు :**

| | | |
|---|---|---|
| అపరే+ద్రవ్యయాజ్ఞాః+ సంశితవ్రతాః | = | కొందఱు కర్మిష్ఠులు అగ్నిహోత్రము, సమిధలు, నెయ్యి మొదలయిన వివిధ ద్రవ్యములను ఉపయోగించి, వివిధ యజ్ఞములను చేయు చున్నారు. కొందఱు వ్రతములు చేయుచున్నారు. |
| చ+స్వాధ్యాయ | = | మఱియు కొందఱు ధనముతో పనిలేకుండా ద్రవ్యములతో పనిలేకుండా, మానసిక యజ్ఞములు చేయుచున్నారు. వాటిలో కొందఱు వేదములు చదువుట, చదివినది గ్రహించుట, గ్రహించినది ఆచరించుట (అనే యజ్ఞమును) చేయుచున్నారు. |

**యోగులు :**

| | | |
|---|---|---|
| యతయః | = | యతులు. ('యతం ఇంద్రియ సంయమః ఏషా యస్తీతి యతినః' (న.పుం) – ఇంద్రియ నియమం గలవారు. 'యచ్ఛంతి ఇంద్రియేభ్య ఇతియతయః ' జయింపబడిన ఇంద్రియములు గలవారు.) వీరు |
| యోగయజ్ఞాః | = | యోగము (అనే యజ్ఞము) చేయుచున్నారు. |
| తపోయజ్ఞాః | = | తపస్సు (అనే యజ్ఞము) చేయుచున్నారు. |

**సాంఖ్యులు :**

| | | |
|---|---|---|
| జ్ఞానయజ్ఞాః | = | దేహి దేహవిచారణ చేసి క్షేత్రజ్ఞుని తెలుసుకొనుట (అనే యజ్ఞము) చేయుచున్నారు. |

ఈవిధముగా కర్మణ్యులు, యోగులు, తపస్సు చేయువారు, సాంఖ్యులు వారివారి పద్ధతులలో సాధన చేయుచున్నారు.

యోగము రెండు విధములు. ఒకటి ప్రాణాయామము రెండవది ధ్యాన యోగము

| | | |
|---|---|---|
| అపరే+ప్రాణాయామ- పరాయణాః+ నియతాహారాః+ప్రాణే+ అపానమ్+తథా+ అపానే+ప్రాణమ్+ జుహ్వతి+అపరే+ | = | కొందఱు ప్రాణాయామ పరాయణులు ఆహార నియమము గలిగి అనగా కందమూలములు భక్షించి, జల భక్షణచేసి, వాయు భక్షణచేసి, ప్రాణమునందు అపానమును అటులనే అపానమునందు ప్రాణమును హోమము చేయుచున్నారు. అనగా వీటిని కలుపుచున్నారు. |
| ప్రాణాపాన గతీ+రుధ్వా ప్రాణాన్+ప్రాణేషు+ జుహ్వతి | = | కొందఱు ప్రాణము అపానముల గతులను నిలిపి అనగా పూర్ణ కుంభకములో ఉండి ప్రాణములను ప్రాణములందు హోమము చేయుచున్నారు |
| ఏతే+సర్వే+అపి యజ్ఞవిదః+యజ్ఞ క్షపిత- కల్మషాః | = | వీరు అందఱు కూడా యజ్ఞము తెలిసినవారు, యజ్ఞముచే పాపరహితులైన వారు. |
| కురుసత్తమ+ యజ్ఞశిష్టామృత భుజః+ సనాతనమ్+బ్రహ్మ+ యాన్తి | = | ఓ అర్జునా! త్రిగుణరహితులై, ద్వంద్వాతీతులై బాహ్య యజ్ఞముచేసి అమృతముగా చెప్పబడిన యజ్ఞ శిష్టమయిన ఆహారము భుజించినవారు, సనాతనమయిన అనగా ప్రకృతికి అవ్వల సృష్ట్యాదియందు గల పరబ్రహ్మను పొందుచున్నారు. |

| | | |
|---|---|---|
| అయజ్ఞస్య+అయమ్+ లోకః+అన్యః+న+అస్తి+ కుతః | = | పుణ్యకర్మానుష్ఠానం చేయని వానికి, అనగా వ్యర్థజీవికి, పాపికి, ఈ లోకము ఆనందముగా ఉన్నను, పై లోకమున సుఖభోగములు ఉండవు. అతడు నరక బాధలను అనుభవించును. పుణ్య కర్మలు చేయనివాడు ఎట్లు ఊర్ధ్వ లోకములు పొందును. |
| ఏవమ్బహువిధాః+ యజ్ఞాః | = | ఇట్లు ద్రవ్య యజ్ఞములు, అటులనే ద్రవ్యముతో పనిలేని తపో యజ్ఞము, యోగ యజ్ఞము, స్వాధ్యాయ యజ్ఞము మొదలైన వివిధ యజ్ఞములను వాటి ఆచరణ విధానమును |
| బ్రహ్మణః+ముఖే+ వితతాః | = | బ్రహ్మయొక్క ముఖమునుండి వెలువడిన వేదముల ద్వారా సవిస్తరముగా చెప్పబడియున్నవి. |
| తాన్+సర్వాన్+ కర్మజాన్+విద్ధి | = | ఆ సర్వ యజ్ఞముల ఆచరణ విధానమును పుణ్యకర్మ వలన గలిగినవిగా తెలుసుకొనుము |
| ఏవమ్+జ్ఞాత్వా+ విమోక్ష్యసే | = | ఈ విధముగా తెలుసుకొని గుణరహితుడవైనచో పుణ్యకర్మ ఫలితమును కోరక కర్మబంధముల నుండి విడివడుదువు. ఆత్మస్థానమును చేరి ఆత్మయై విరాజిల్లుదువు. |

...... ❖ ❖ ❖ ......

బాహ్య యజ్ఞము-మానసిక యజ్ఞములలో ఏది శ్రేష్ఠమో చెప్పుచున్నాడు:

**శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ । జ్ఞానయజ్ఞః పరన్తప ।**
**సర్వం కర్మాఖిలం పార్థ । జ్ఞానే పరిసమాప్యతే ॥ 33**

శ్రేయాన్ – ద్రవ్యమయాత్ – యజ్ఞాత్ – జ్ఞానయజ్ఞః – పరన్తప
సర్వమ్ – కర్మ – అఖిలమ్ – పార్థ – జ్ఞానే – పరిసమాప్యతే.

ఈ శ్లోకమున పరంతప, పార్థ అని రెండు సంబోధనలు కలవు.

| | | |
|---|---|---|
| పార్థ+ద్రవ్యమయాత్+ యజ్ఞాత్ | = | ఓ అర్జునా! ద్రవ్యమయమైన బాహ్యయజ్ఞముకంటె |
| జ్ఞానయజ్ఞః+శ్రేయాన్ | = | జ్ఞానయజ్ఞము శ్రేష్ఠము అయినది. |
| పరంతప+సర్వమ్+ కర్మ+అఖిలమ్+జ్ఞానే+ పరిసమాప్యతే | = | ఓ అర్జునా! కర్మ అంతయు నాశము కాని ఆత్మ. జ్ఞానమునందు పరిసమాప్తి యగును. |

**వ్యాఖ్యానము :-** కృష్ణ యజుర్వేదములో అశ్వమేధయాగములో అశ్వమును వధించుట ఎటులనో ఆ యాగము ఎటుల చేయవలయునో వివరించును. అదే వేద శాఖకు చెందిన బృహదారణ్యకములో అశ్వము అనగా విరాట్‌పురుషుడని వివరించును. ఆ విధముగా అశ్వమేధమనగా మనస్సును బుద్ధితో లయము చేసి జ్ఞానముతో విశ్వరూపమును దర్శించి - సర్వము అతడే అని గ్రహించుట జ్ఞానము. కావున అశ్వమును చంపుటకంటె మనస్సును బుద్ధితో లయము చేయుట శ్రేష్ఠము. అటులనే తపస్సు, యోగము, స్వాధ్యాయములు, బాహ్యయజ్ఞముకంటే శ్రేష్ఠము.

కావున జ్ఞానములో పరిసమాప్తిని పొందు కర్మ విభాగమును గ్రహించ వలయును.

**యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః । యుక్తా అయుక్తాః । అలూక్షా ధర్మకామాస్యుః । యథా తే తేషు వర్తేరన్ । తథా తేషు వర్తేథా.**

(తైత్తిరీయ ఉపనిషత్-శిక్షావల్లి-ఏకాదశోఽ నువాకః)

ఎక్కడ వేదవిదులు, వివేక కుశలురు, ధర్మపరులు రాజు కొలువులో బ్రతికేవారుగాక స్వతంత్రముగా జీవనము గడుపువారు గలరో, వారు అచ్చట ఏ విధముగా ప్రవర్తింతురో ఆ విధముగా అక్కడ ప్రవర్తించుము.

**అలూక్షా ధర్మకామాస్యుః** అని చెప్పిన దానినే **జ్ఞానిన** <u>**స్తత్త్వదర్శినః**</u> అని యిందు చెప్పబడినది.

వారిని ఆశ్రయించుము అని చెప్పుచున్నాడు. అపరవిద్య అయిన కర్మాచరణచేసి కర్మలోగల గుణదోషములను గ్రహించి నిర్వేదము పొంది పరవిద్య అయిన ఆత్మ

జ్ఞానమును పొంద సమర్థుడయిన గురువును ఆశ్రయించవలయును అని ముండక ఉపనిషత్తు చెప్పినది. ఇహలోక పరలోక సుఖములయందు ఆసక్తిలేనివానికే ఆత్మను గురించి చెప్పవలయునని కఠోపనిషత్తు చెప్పినది. ప్రశ్నోపనిషత్తులో ఆఱుగురు శిష్యులు గురువయిన పిప్పలాదుని చేరి సేవించి తత్త్వమును గ్రహించినారు.

...... ❖ ❖ ❖ ......

ఆత్మను దర్శించిన గురువులను చేరి సేవించి జ్ఞానమును పొందవలయును

**తద్విద్ధి ప్రణిపాతేన । పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం । జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ 34**

తత్ – విద్ధి – ప్రణిపాతేన – పరిప్రశ్నేన – సేవయా
ఉపదేక్ష్యన్తి – తే – జ్ఞానమ్ – జ్ఞానినః – తత్త్వదర్శినః

పరవిద్య అయిన ఆత్మ జ్ఞానము తెలుసుకొనుటకు ముందు సాధకుడు అర్హత సంపాదించి ఆపై గుణరహితుడు ఆత్మదర్శనం చేసిన గురువును మాత్రమే ఆశ్రయించవలయును.

| | | |
|---|---|---|
| ప్రణిపాతేన+సేవయా+ పరిప్రశ్నేన+ | = | వారి పాదములకు ప్రణమిల్లుటచేత వారిని సేవించుట ద్వారా వారు చెప్పినది ఆచరించ వలయుననే సదుద్దేశంతో, వారిని అడిగి తెలుసు కొనుటచేత (సందేహ నివృత్తికై వినయముగా అడిగి తెలుసుకొనుచూ) |
| తత్+విద్ధి | = | ఆ కర్మ విధానములోని విధి–నిషేధములను ఆచరించు విధి విధానములను, కర్మ బంధ ములనుండి, విడివడు విధానమును, యోగభక్తి, సాంఖ్యములను తెలిసికొనుము. |
| తత్త్వదర్శినః+జ్ఞానినః+ తే+జ్ఞానమ్+ | = | ఆత్మతత్త్వమును దర్శించిన జ్ఞానులయిన ఆ గురువులు నీకు జ్ఞానమును ఉపదేశింతురు. |

ఉపదేక్ష్యంతి — దానిని ఆచరించి ఆత్మదర్శనప్రాప్తి పొంది, ఆత్మయై విరాజిల్లుము.

**వ్యాఖ్యానము :-** సేవ అనగా ఓర్పుతో, నేర్పుతో, భయభక్తులతో, లౌకిక వ్యాపారములలో జంఝాటము లేకుండా, ఇతర వ్యాపకము లేకుండా, చంచలబుద్ధి లేకుండా గురువుకు సేవ చేయుచూ ఉండవలయును. ఆవిధముగా గతజన్మలో నారదుడు యోగిజనులను సేవించినాడు. వారు ఈశ్వరునికి సంబంధించిన విజ్ఞానమును ఉపదేశించిరి. దానిని ఆచరించి నారదుడుగా బ్రహ్మమానసపుత్రునిగా ఆవిర్భవించెను.

**పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయానాస్త్యకృతః కృతేన ।**
**తద్విజ్ఞానార్థం స గురు మేవాభి గచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ॥**

*(ముండకోపనిషత్ - ప్రథమముండకం-ద్వితీయఖండం-12)*

అనగా పుణ్యఫలితమువలన కలుగు పుణ్యలోకాదులను, పుణ్యఫలితములోని గుణదోషములను పరీక్షించి, పుణ్యఫలితమునందు ఉదాసీనత కలిగి, పుణ్యకర్మానుష్ఠానము చేత ఆత్మను పొందలేమని గ్రహించి ఆత్మతత్త్వము గ్రహించి ఆత్మయై విరాజిల్లుటకు చేతిలో దర్భలు (ఇది శిష్యునియొక్క లక్షణము) శ్రోత్రియుడును, బ్రహ్మనిష్ఠుడును అయిన (ఇది గురువుయొక్క లక్షణము). గురువును ఆశ్రయించ వలయును ఈ గురుశిష్య లక్షణములను నారద - వాల్మీకి; నారద-వ్యాస; శుకబ్రహ్మ-పరీక్షిత్; సూతమహర్షి-శౌనకాదుల పేరున పురాణములలో మఱికొంత విపులముగా వర్ణించిరి. గురువు శత్రుమిత్రాదులయందు సముడుగా అనగా ద్వంద్వాతీతుడై ఉండవలయును. ముక్తకర్మచయుడై ఉండవలయును. అనగా కర్మబంధమునుండి విడివడినవాడై ఉండవలయును. తపస్వి, మహాయోగియై ఉండవలయును. అయితే ఈ గురువులను సామాన్యులు పోల్చుకొనలేరు. అటులనే ఈ గురువులు అనర్హులను శిష్యులుగా స్వీకరించరు.

...... ❖ ❖ ❖ ......

జ్ఞానప్రశంస

**యద్ జ్ఞాత్వా న పునర్మోహమ్ । ఏవం యాస్యసి పాణ్డవ ।**
**యేన భూతాన్యశేషేణ । ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥ 35**

యత్ – జ్ఞాత్వా –న– పునః – మోహమ్ – ఏవమ్ – యాస్యసి – పాండవ
యేన – భూతాని – అశేషేణ – ద్రక్ష్యసి – ఆత్మని – అథో – మయి.

**అపి చేదసి పాపేభ్యః । సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞాన ప్లవేనైవ । వృజినం సంతరిష్యసి ॥ 36**

అపి – చేత్ – అసి – పాపేభ్యః – సర్వేభ్యః – పాపకృత్తమః
సర్వమ్ – జ్ఞాన ప్లవేన – ఏవ – వృజినమ్ – సంతరిష్యసి

**యథైధాంసి సమిద్ధోఽగ్నిః । భస్మసాత్కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్నిః సర్వకర్మాణి । భస్మసాత్కురుతే తథా ॥ 37**

యథా – ఏధాంసి – సమిద్ధః – అగ్నిః – భస్మసాత్ – కురుతే – అర్జున
జ్ఞానాగ్నిః – సర్వకర్మాణి – భస్మసాత్ – కురుతే – తథా

**నహి జ్ఞానేన సదృశం । పవిత్ర మిహ విద్యతే ।**
**తత్స్వయం యోగ సంసిద్ధః । కాలేనాత్మని విందతి ॥ 38**

న – హి – జ్ఞానేన – సదృశమ్ – పవిత్రమ్ – ఇహ – విద్యతే
తత్ – స్వయమ్ – యోగ సంసిద్ధః – కాలేన – ఆత్మని – విందతి.

జ్ఞానవంతుడు పరమశాంతిని పొందును

**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం । తత్పరః సంయతేన్ద్రియః ।**
**జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి । మచిరేణాధిగచ్ఛతి ॥ 39**

శ్రద్ధావాన్ – లభతే – జ్ఞానమ్ – తత్పరః – సంయతేన్ద్రియః
జ్ఞానమ్ – లబ్ధ్వా – పరామ్ – శాన్తిమ్ – అచిరేణ – అధిగచ్ఛతి

| | | |
|---|---|---|
| పాండవ | = | ఓ అర్జునా! |
| యత్+జ్ఞాత్వా+పునః+ ఏవమ్+మోహమ్+ న+యాస్యసి | = | వారి ఉపదేశమువలన ఏ ఆత్మతత్త్వమును తెలుసుకొని ఆ తరువాత ఏ విధముగా మోహమును పొందవో |
| యేన+ఆత్మని+అథో+ మయి+అశేషేణ+ భూతాని+ద్రక్ష్యసి | = | దేనిచేత, ఏ జ్ఞానముచేత నీ యందు ఆ తర్వాత అనగా మోహవిచ్ఛేదనము అయిన తర్వాత నా యందు సమస్త ప్రాణులయందు ఆత్మను అటులనే నీవు, నేను ఒకటే అని చూడగలవో |
| పాపకృత్తమః+అపి సర్వేభ్యః+పాపేభ్యః+ అసి+చేత్+జ్ఞాన ప్లవేన+ ఏవ+సర్వమ్+వృజినమ్+ సంతరిష్యసి | = | యజ్ఞములోని విధినిషేధములను పాటింపక, లేదా సదాచారములు పాటింపక పాపము చేసినవాడ వైననూ గుణరహితుడవై నిరంతర నామస్మరణ వలన అటువంటి సర్వపాపములవలన విడివడి జ్ఞానమనెడి ఓడ ద్వారా సర్వకర్మబంధములనుండి విడివడి, భవసాగరమును దాటగలవు. |
| అర్జున+యథా+ సమిద్ధః+అగ్నిః+ ఏధాంసి+భస్మసాత్+ కురుతే | = | ఓ అర్జునా! ఏవిధముగా బాగా ప్రజ్వలించుచున్న అగ్నిచే సమిధలను భస్మము చేయునో |

| | | |
|---|---|---|
| తథా+జ్ఞానాగ్నిః+ | = | అట్లే జ్ఞానమనెడి అగ్నిచే అనగా తను దేహము |
| సర్వకర్మాణి+భస్మసాత్+ | = | కాదు, ఆత్మనని గ్రహించి ద్వంద్వాతీత స్థితిని |
| కురుతే | | పొందిన వానియొక్క సర్వకర్మలు, ఆ కర్మలవలన కలిగిన సర్వబంధములను భస్మము చేయబడు చున్నవి. |
| ఇహ+జ్ఞానేన+ | = | ఈ లోకమున జ్ఞానముతో సమానమైనది అనగా |
| సదృశమ్+పవిత్రమ్+ | | భవసాగరమును దాటించే ఓడ వంటిది. |
| న + విద్యతే | | పవిత్రమైనది యింకొకటి లేదు. |
| తత్+యోగసంసిద్ధః | = | పుణ్యఫలితము కోరని పుణ్యకర్మాచరణ చేయువాడు యోగమును అవలంబించి, నిశ్చల సమాధిని పొందినవాడు |
| కాలేన+స్వయమ్+ | = | కాలక్రమమున దేహత్యాగముచేసి |
| ఆత్మని+విందతి | | శుద్ధసత్త్వమయంబైన దేహంబు విడచి సృష్ట్యాది యందుగల ఆత్మయందు ఉండును. బ్రహ్మయై విరాజిల్లును. |

ఆత్మ స్వరూపమును పొందును. అమృతుడు అగును. ఎన్నటికి భూలోకమున జన్మింపడు. జీవన్ముక్తుడై దేహత్యాగానంతరము ఆత్మయై విరాజిల్లును.

| | | |
|---|---|---|
| శ్రద్ధావాన్ | = | శ్రద్ధగలవాడును, పుణ్య కర్మఫలితమును కోరక వేద విహితము లైన యజ్ఞ యాగాది క్రతువులు, నిత్యాగ్నిహోత్రము మొదలైన పుణ్యకర్మలు శ్రద్ధగా చేయువాడును అనగా కర్మణ్యుడు |
| సంయతేంద్రియః | = | ఇంద్రియములను,మనస్సును,బుద్ధిని నియమించి, యోగము చేసినవాడును అనగా యోగి |
| తత్పరః | = | ఆత్మస్థానమును చేరవలయుననే తీవ్ర మోక్షేచ్ఛ గలవాడును, భక్తుడును, సాంఖ్యుడును వీరులకు |

| | | |
|---|---|---|
| జ్ఞానమ్ | = | జ్ఞానమును పొంది |
| శాన్తిమ్+లభతే | = | గొప్ప శాంతి పొందుదురు. అనగా జీవన్ముక్తుడు అగును. |
| జ్ఞానమ్+లబ్ధ్వా+అచిరేణ పరామ్+అధిగచ్ఛతి | = | జ్ఞానమును పొంది. దేహ త్యాగానంతరము శీఘ్రముగా అనగా కాలవ్యవధి లేకుండా ఆత్మస్థానమును పొందుచున్నాడు. |

ఆనందమయుండై బ్రహ్మను చేరి బ్రహ్మయగును. స్వస్వరూపమును పొందును. గుణరహితుడైనవాడు పొందు స్థితి శాంతము. ఇట్టి స్థితి పొందిన వానిని జీవన్ముక్తుడని, విదేహుడని, ఏకాంత భక్తుడని, జ్ఞానియని, పండితుడని అందురు. వీరు దేహ త్యాగానంతరము ఆత్మను పొందుదురు.

**వ్యాఖ్యానము :-**

**"యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవాను పశ్యతి**
**సర్వభూతేషు చాత్మానం"** (ఈశ ఉపనిషత్తు – 6)

అన్ని ఉపనిషత్తులు ఈ విషయమునే చెప్పినవి. ఉదాహరణగా ఈశ ఉపనిషత్తును ఉదహరింపబడినది. మోహమును పొందనిచో అనగా మోహవిచ్ఛేదము అయినచో అఖిల భూతములందు సమ భావన గలిగి, సర్వత్రా ఆత్మదర్శనము గలుగును. విశ్వరూపమును దర్శించగలరు. దీనినే సుదర్శనము అని అందురు. కథా పరముగా సుదర్శన చక్రముగా వర్ణింతురు.

**పాపములు:** దేహి అవిద్యావరణలో ఉండి, తను దేహము అనుకొని

1. దేహి తన దేహ పోషణకు సంబంధించి చేయు కర్మలలోగల దోషములవలన ఏర్పడు పాపములు.

**అన్నము:** యజ్ఞయాగాదులయందు, పితృదేవతల ఆరాధనయందు గాక మిగిలిన దినములలో మాంసమును భుజించుట దోషము. ఇరుగు పొరుగు వారిని, స్వజనమును విడిచి మృష్టాన్నమును భుజించుట దోషము. దుష్టాన్నమును వడ్డించుట దోషము. అతిథి అభ్యాగతులకు, ఇతరులకు అన్నమును, అన్నదానసమయమున వడ్డించుచూ వారిపై కోపమును చూపుట దోషము.

**పానీయములు:** కల్లు, సారా, మొదలయిన మత్తుపదార్థములు త్రాగుట దోషములు.

**భార్యతో సంగమము:** నిషిద్ధకాలమున భార్యతో కలియుట దోషము, ఋతుకాలమున భార్యతో కలియకుండుట దోషము. పరస్త్రీలతో కలియుట దోషము అనగా వ్యభిచారము దోషము.

**వృత్తి వ్యాపారములలో:** అమ్మకూడని వస్తువులు అమ్ముట దోషము. కల్తీ చేయుట పాపము. దొంగతనము, లంచగొండితనము మొదలయినవి పాపము.

**దానము:** అయోగ్యులనుండి దానము స్వీకరించుట దోషము.

2. దేహ సంబంధీకులు తనవారనుకొని అజ్ఞాన అవిద్యాయుతుడై యుండుట దోషము. తనవారియందు, విధులు బాధ్యతలు, నెఱవేఋ్చచూ ఆత్మ విచారణ చేయక ఉండుట దోషము.

3. శాస్త్రవిహితముకాని పుణ్యకర్మాచరణ చేయుట దోషము. ఇట్టి దోషములకు ప్రాయశ్చిత్తము చెప్పబడినను, అట్టి కర్మలు చేయకూడదు. అజ్ఞానములోను, అవిద్యలోను దేహి ఉన్నంతవఱకు ఈ దోషములు పాపములుగా పరిగణింపబడును. కావున దీనికి ఉదాహరణగా అజామీళోపాఖ్యానము భాగవతమున చెప్పబడినది. అజామీళుడు బ్రాహ్మణుడు. సర్వ వేదములు చదివినవాడు. బ్రాహ్మణ స్త్రీని వివాహ మాడినాడు. ధర్మపరుడు. అతడు ఒకనాడు అడవినుంచి దర్భలు తెచ్చుచూ ఒక శూద్ర వనిత, ఆమె విటుడు ఒక పొదరింటిలో కామకేళిలో ఉండగా చూచి మనస్సు వశము తప్పి, లోలుడై అజామీళుడు ఆ శూద్ర స్త్రీతో కాపురము చేసెను. ఇది దోషము.

ఆవిధముగా దోషి అగుటవలన, యమ భటులు ఇతనిని నరకమునకు తీసుకొని పోవుటకు వచ్చిరి. ఆ సమయమున అజామీళుడు తన కుమారులలో నొకడైన నారాయణుని నోరార నారాయణ అని పిలిచెను. ఆ పిలుపునకు విష్ణు భటులు వచ్చి ఇతనిని యమభటులనుండి విడిపించిరి. ఆ తరువాత అతడు (అజామీళుడు) గంగా ద్వారము చేరి యోగమునుచేసి పుణ్యాత్ముడై దేహమును వీడి ఆత్మ స్థానమును చేరెను.

పుణ్యకర్మ ఫలత్యాగము, ద్వంద్వాతీత స్థితి, గుణ రహిత స్థితి గలిగి ఉండుట, తనయందు సర్వ భూతములయందు ఆత్మనే దర్శించుట, ఆత్మానుసంధానము గలిగి యుండుట మొదలైనవి జ్ఞానము అని చెప్పుదురు. కావున ఇట్టి జ్ఞానము భవసాగరమును దాటించును.

...... ❖ ❖ ❖ ......

అజ్ఞాని

**అజ్ఞశ్చా శ్రద్ధ దానశ్చ । సంశయాత్మా వినశ్యతి ।**
**నాయం లోకోఽస్తి న పరో । న సుఖం సంశయాత్మనః ॥40**

అజ్ఞః - చ - అశ్రద్ధదానః - చ - సంశయాత్మా - వినశ్యతి
న - అయమ్ - లోకః - అస్తి - న - పరః - న - సుఖమ్ - సంశయాత్మనః

అజ్ఞః+చ+అశ్రద్ధదానః = జ్ఞానహీనుడును అనగా తను దేహము అనుకొని కుటుంబ పోషణయందే శ్రద్ధగలిగినవాడును, పుణ్యకర్మలు చేయని వ్యర్థజీవియు మఱియు పుణ్యకర్మలయందు శ్రద్ధలేనివాడు అనగా వేద విహితముగా చేయనివాడు

చ = మఱియు

సంశయాత్మా = ఆత్మస్థానమునకు చేరుటకు నే చెప్పిన కర్మ విభాగమునందు సంశయము గలవాడును అనగా పుణ్యకర్మల ఫలితమును కోరినవాడును

అయమ్+లోకః+న+పరః+అస్తి+వినశ్యతి = ఈ లోకము తప్ప, యితర లోకము అనగా పరలోకము లేదనిచెప్పువాడును ఆత్మస్థానమును చేరక జన్మ పరంపరలలో చిక్కుకొని నశించును.

సంశయాత్మనః+న+న+సుఖమ్ = అట్టి సంశయాత్మునకు ఈ లోకమున మానసిక శాంతి ఉండదు. పరలోక సుఖానుభవము ఉండదు.

...... ❖ ❖ ❖ ......

కర్మలు బంధము కావు

**యోగ సన్న్యస్త కర్మాణం । జ్ఞాన సంఛిన్న సంశయమ్ ।**
**ఆత్మవన్తం న కర్మాణి । నిబధ్నన్తి ధనఞ్జయ ॥ 41**

యోగ – సన్న్యస్త కర్మాణమ్ – జ్ఞాన సంఛిన్న సంశయమ్
ఆత్మవన్తమ్ – న – కర్మాణి – నిబధ్నన్తి – ధనంజయ

**తస్మాదజ్ఞాన సమ్భూతం । హృత్స్థం జ్ఞానాసినాత్మనః ।**
**ఛిత్త్వైనం సంశయం యోగ । మాతిష్ఠోత్తిష్ఠ భారత ॥ 42**

తస్మాత్ – అజ్ఞాన సంభూతమ్ – హృత్స్థమ్ – జ్ఞాన – అసినా – ఆత్మనః
ఛిత్వా – ఏనమ్ – సంశయమ్ – యోగమ్ – ఆతిష్ఠ – ఉత్తిష్ఠ – భారత

**కథాభాగము:**

| | | |
|---|---|---|
| భారత | = | ఓ అర్జునా! |
| తస్మాత్+ | = | అందువలన జాతిధర్మములు పాటించుచూ |
| అజ్ఞాన సంభూతమ్+ | | అజ్ఞానమువలన గలిగిన భావనలవలన |
| ఏనమ్+సంశయమ్ | | యుద్ధము చేయుటయా లేక మానుటయా అను |
| ఉత్తిష్ఠ | | ఈ సంశయమును వదలి ధనుర్బాణములు ధరించి యుద్ధము చేయుటకు లెమ్ము |

**అధ్యాత్మ విభాగము:**

| | | |
|---|---|---|
| ధనంజయ+ | = | ఓ అర్జునా! యోగము చేయువానికి కర్మయొక్క |
| యోగ+ | | ఫలితమును వదలినవానికి జ్ఞానవంతునకు, |
| సన్న్యస్త కర్మాణమ్+ | | అహంకారము తొలగిన సంశయ రహితునికి |
| జ్ఞాన సంఛిన్నసంశయమ్ | | |
| ఆత్మవన్తమ్+ | = | ఆత్మవంతుడు అయినవానికి కర్మలు అతనిని |
| కర్మాణి+న+నిబధ్నన్తి | | బంధించవు |

అజ్ఞానమనే దేహభ్రాంతిని వదలి–

| | | |
|---|---|---|
| ఆత్మనః+హృత్థమ్+ | = | నీ యొక్క హృదయమందున్న అజ్ఞానమును |
| జ్ఞాన అసినా+ఛిత్త్వా+ | = | జ్ఞానమనెడి ఖడ్గముచే ఖండించి అనగా |
| యోగమ్+ఆతిష్ఠ | | దేహభ్రాంతిని వదలి యోగమును ఆచరింపుము |
| | = | హృదయగుహలోగల ఆత్మతో కలసి నిశ్చల సమాధిలో ఉండుము. అందువలన శాంతి గలుగును. దేహ త్యాగానంతరము ఆత్మ స్థానమును చేరుదువు. |



**వ్యాఖ్యానము:-** అహంకారము భిన్నంబు అయిన వానికి, భక్తి గలుగ చిత్తంబు సత్త్వగుణంబున ప్రసన్నంబగు. తత్త్వజ్ఞానంబు సిద్ధించు, అహంకారము భిన్నంబగు, అహంకారంబు భిన్నంబైన సంశయములు తొలగును. అప్పుడు కర్మ ఫలంబులు నిశ్శేషంబులై నశించు *(భాగవతం-ప్రథమ స్కంధం-58)*

...... ❖ ❖ ❖ ......

ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము 29వ అధ్యాయము

## (కర్మసన్న్యాసయోగము)

అర్జున ఉవాచ

**సన్న్యాసం కర్మణాం కృష్ణ । పునర్యోగం చ శంససి ।**
**యచ్ఛ్రేయ ఏతయోరేకం । తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥ 1**

సన్న్యాసమ్ – కర్మణామ్ – కృష్ణ – పునః – యోగమ్ – చ – శంససి
యత్ – శ్రేయః – ఏతయోః – ఏకమ్ – తత్ – మే – బ్రూహి – సునిశ్చితమ్

పుణ్యకర్మలు చేయకుండా ఉండుటకంటే, పుణ్య కర్మలు చేయుట శ్రేష్ఠమని చెప్పితివి. అటులనే

| | | |
|---|---|---|
| కృష్ణ | = | ఓ శ్రీకృష్ణా! |
| కర్మణామ్+సన్న్యాసమ్+ పునః+యోగమ్+ శంససి | = | సాంఖ్యమును ప్రశంసించి మరల కర్మయోగమును ప్రశంసించుచున్నావు. |
| ఏతయోః+యత్+ శ్రేయః+తత్+ఏకమ్+ సునిశ్చితమ్+ మే+బ్రూహి+చ | = | సాంఖ్యము, కర్మయోగములలో ఏది ఆచరించిన శ్రేయస్సు గలుగునో ఆ ఒక్క దానినే బాగుగ నిశ్చయించి నాకు చెప్పుము. మఱియు సాంఖ్యము, యోగములలో ఏది శ్రేష్ఠమో ఆ ఒక్కదానినే నాకు చెప్పుము. |

...... ❖ ❖ ❖ ......

శ్రీభగవానువాచ

**సన్న్యాసః కర్మయోగశ్చ । నిః శ్రేయసకరావుభౌ ।**
**తయోస్తు కర్మ సన్న్యాసాత్ । కర్మయోగో విశిష్యతే ॥ 2**

సన్న్యాసః – కర్మయోగః – చ – నిశ్శ్రేయస కరౌ – ఉభౌ
తయోః – తు – కర్మ సన్న్యాసాత్ – కర్మయోగః – విశిష్యతే

| | | |
|---|---|---|
| సన్న్యాసః+కర్మయోగః+ | = | సాంఖ్యము కర్మయోగము అను |
| ఉభౌ+నిశ్శ్రేయసకరౌ | | రెండును అచల స్థిరకల్యాణమును గలిగించునట్టివే |
| తయోః+ | = | ఆ రెండింటిలో సాంఖ్యముకంటె కర్మయోగము |
| కర్మసన్న్యాసాత్+ | | ఆచరణ సులభము అని నా అభిప్రాయము |
| కర్మయోగః+ | | |
| విశిష్యతే+తు | | |

...... ❖ ❖ ❖ ......

సాంఖ్యుడు అనగా ఎవరో చెప్పుచున్నాడు

**జ్ఞేయః స నిత్యసన్న్యాసీ । యోనద్వేష్టి న కాంక్షతి ।**
**నిర్ద్వంద్వో హి మహాబాహో । సుఖం బన్ధాత్ప్రముచ్యతే ॥ 3**

జ్ఞేయః – సః – నిత్యసన్న్యాసీ – యః – న – ద్వేష్టి – న – కాంక్షతి
నిర్ద్వంద్వః – హి – మహాబాహో – సుఖమ్ – బన్ధాత్ – ప్రముచ్యతే

| | | |
|---|---|---|
| మహాబాహో | = | ఓ అర్జునా! |
| యః+హి+న+ | = | ఎవడు సంసారతాపత్రయములు లేనివాడో |
| కాంక్షతి+న+ద్వేష్టి+ | | అనగా ఈషణత్రయములు లేనివాడో, కోరికలు |
| నిర్ద్వంద్వః | | లేనివాడో ఎవరినీ ద్వేషింపనివాడో, రాగద్వేషములు లేనివాడో, సుఖ దుఃఖాది ద్వంద్వములకు విచలితుడు కానివాడో |

| | | |
|---|---|---|
| సః+నిత్యసన్న్యాసీ+ జ్ఞేయః | = | అట్టివాడు నిత్యసన్న్యాసిగా, అనగా సాంఖ్యునిగా తెలియదగినవాడు. |
| బన్ధాత్+ప్రముచ్యతే+ సుఖమ్ | = | కర్మబంధములనుండి విడివడును. దేహ త్యాగానంతరము బ్రహ్మలోక నివాసాది సుఖము గలిగి ఆత్మయై విరాజిల్లును. |

**వ్యాఖ్యానము :- సాంఖ్యము:** దేహము వేఱు, దేహి వేఱు అని గ్రహించి దేహ లక్షణములను దేహి లక్షణములను గ్రహించిన జ్ఞాని, దేహి అయిన తను దేహముతో మమేకముగాక, అంతఃకరణశుద్ధి కలిగి, నిత్య సంతోషియై ద్వంద్వాతీతుడై, గుణరహితుడై, ప్రకృతింబాసి పరమశాంతిని కలిగి, జ్ఞానము గలిగి, దేహ త్యాగానంతరము బ్రహ్మయై విరాజిల్లును.

**సాంఖ్యమును ఆచరించు విధానము:** లింగ దేహమున ఉండు మనస్సును, మనో వ్యాపారములను గ్రహించవలయును. ఏ ఇంద్రియము ఎప్పుడెప్పుడు ఏవిధముగా ప్రవర్తించుచున్నదో గ్రహించవలయును. శోకము, మోహములకు లోనుగాక అరిషట్వర్గములను జయించవలయును. ద్వంద్వములైన రాగ ద్వేషములను జయించవలయును. ప్రకృతివలన జనించిన త్రిగుణములను వదలవలయును. ఇతడు శాంతత్వము గలిగి, దేహత్యాగానంతరము ఆత్మయై విరాజిల్లును.

శ్రీకృష్ణునిచే బోధింపబడిన సాంఖ్యమును అర్జునుడు శ్రీకృష్ణుని దేహత్యాగానంతరము పాటించినట్లు భాగవతమున ఇట్లు వర్ణింపబడినది.

“తొల్లి తనకుభయ సేనా మధ్యంబున నచ్యుతుండానతిచ్చిన గీతలు దలంచి, ప్రకృతి గుణంబులకు నిధానంబనియును, గుణంబు లింగంబునకు మూలంబనియు, లింగంబు దేహంబునకు బీజంబనియును, దేహము ద్వైత భ్రమకు కారణంబనియు హేతుమద్భావంబున శోక హేతువహంకార మమకారాత్మకంబయిన ద్వైత భ్రమంబనియును గ్రహించి, శోకంబు వర్జించి, కామ క్రోధాదులు జయించి, హరి చరణారవింద చింతామల బుద్ధియై, సదా ధ్యాన భక్తి విశేషంబులన్ “బ్రహ్మోహ” మనియెడి జ్ఞానంబున ప్రకృతింబాసి ఆత్మ స్థానమును చేరెను. (భాగవతం-ప్రథమ స్కంధం-380) అనగా దేహి దేహ విచారణ చేసి ప్రకృతింబాసి, ఆత్మ స్థానమును చేరెను. ప్రకృతివలన గుణములు గలుగును. ఆ గుణములు లింగదేహమునకు

మూలము. స్థూలసూక్ష్మశరీరములకు లింగశరీరము బీజం వంటిది. లింగశరీరము బాహ్యచక్షువులకు గోచరముకాదు. స్థూలశరీరము బాహ్యచక్షువులకు గోచరమగును. ఈ స్థూలదేహమువలన నేను–నీవు – తను యితరులు అనే ద్వైతభ్రమ గలుగుచున్నది. కావున శోకమోహములను, రాగద్వేషములను, అరిషడ్వర్గములను జయించి నేనే బ్రహ్మమును, నేను దేహము కాదు అనే భావనతో ప్రకృతింబాసి ఆత్మస్థానము చేరెను.

...... ❖ ❖ ❖ ......

సాంఖ్యము - కర్మయోగము

**సాంఖ్యయోగౌ పృథగ్బాలాః । ప్రవదన్తి న పణ్డితాః ।**
**ఏకమప్యాస్థితః సమ్యగుభయోర్విన్దతే ఫలమ్ ॥ 4**

సాంఖ్యయోగౌ – పృథక్ – బాలాః – ప్రవదన్తి – న – పండితాః
ఏకమ్ – అపి – ఆస్థితః – సమ్యక్ – ఉభయోః – విందతే – ఫలమ్

**యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం । తద్యోగైరపి గమ్యతే ।**
**ఏకం సాంఖ్యం చ యోగం చ । యః పశ్యతి స పశ్యతి ॥ 5**

యత్ – సాంఖ్యైః – ప్రాప్యతే – స్థానమ్ – తత్ – యోగైః – అపి – గమ్యతే
ఏకమ్ – సాంఖ్యమ్ – చ – యోగమ్ – చ – యః – పశ్యతి – సః – పశ్యతి

**సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తుమయోగతః ।**
**యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధి గచ్ఛతి ॥ 6**

సన్న్యాసః – తు – మహాబాహో – దుఃఖమ్ – ఆప్తుమ్ – అయోగతః
యోగయుక్తః – మునిః – బ్రహ్మ – నచిరేణ – అధిగచ్ఛతి.

వీరికి కర్మలు బంధముకావు.

**యోగ యుక్తో విశుద్ధాత్మా । విజితాత్మా జితేన్ద్రియః ।**
**సర్వభూతాత్మ భూతాత్మా । కుర్వన్నపి న లిప్యతే ॥ 7**

యోగయుక్తః – విశుద్ధాత్మా – విజితాత్మా – జితేన్ద్రియః
సర్వభూతాత్మ – భూతాత్మా – కుర్వన్ – అపి – న – లిప్యతే

బాలాః+సాంఖ్యయోగౌ+ = బాలురవంటి అజ్ఞానులు సాంఖ్యము,
పృథక్+ప్రవదన్తి+ కర్మయోగము వేఱు వేఱు అని చెప్పుదురు.
పండితాః+న పండితులు అయినవారు ఆ విధముగా చెప్పరు.

ఉభయోః+ఏకమ్+అపి = సాంఖ్యము, కర్మయోగము అను ఈ రెండింటిలో
సమ్యక్+ఆస్థితః+ఫలమ్ ఏ ఒక్కదానినైనా చక్కగా స్థితుడైనవాడు అనగా
విందతే చక్కగా ఆచరించినవాడు ఆత్మ స్థానమును పొందుట అనే ఫలమును పొందును.

కపిలుని సాంఖ్య సూత్రములలో–యోగముచేయు విధానమును గుఱించిన ప్రస్తావన కలదు.

యత్+స్థానమ్+ = ఏ ఆత్మ స్థానమును సాంఖ్యము చేత
సాంఖ్యైః+ప్రాప్యతే+ పొందబడునో, ఆ ఆత్మస్థానము కర్మయోగముచేత
తత్+యోగైః+అపి+ కూడా పొందబడును
గమ్యతే

యః+సాంఖ్యమ్+చ+ = ఎవడు సాంఖ్యమును మఱియు కర్మయోగమును
యోగమ్+ఏకమ్+ ఒకటిగా చూచునో అనగా ఆ రెండింటిలో
పశ్యతి+సః+పశ్యతి+చ ఏ ఒక్కదానిని అయినా బాగుగా ఆచరించిన అతడు ఆత్మను దర్శించును. మఱియు ఆత్మయై విరాజిల్లును

మహాబాహో = ఓ అర్జునా!

| | | |
|---|---|---|
| తు+దుఃఖమ్+ | = | పుణ్య కర్మానుష్ఠానము చేయుచూ విధి నిషేధములను సరిగా పాటింపనివాడు నరకమును మఱియు పుణ్యఫలితమును కోరినవాడుపునర్జన్మను పొందును. దుఃఖమును పొందును. |
| యోగయుక్తః+నచిరేణ+ బ్రహ్మ+అధిగచ్ఛతి | = | కర్మయోగయుక్తుడు శీఘ్రముగా శాంతిని పొంది దేహత్యాగానంతరము ఆత్మను పొంది ఆత్మయై విరాజిల్లును |
| అయోగతః+సన్న్యాసః+ మునిః+ఆప్తుమ్ | = | గుణరహితుడు గాకుండా (మన్యతేమునిః- జ్ఞానము కలవాడు) జ్ఞానమును పొందుటకు సాధ్యపడదు. అనగా గుణరహితుడు కానివాడు జ్ఞాని/సాంఖ్యుడు కాలేడు. |
| విశుద్ధాత్మా+విజితాత్మా సర్వభూతాత్మ+భూతాత్మా జితేన్ద్రియః+కుర్వన్+అపి+ న+లిప్యతే | = | విశుద్ధాత్ముడు అనగా గుణరహితుడును విజితాత్ముడు అనగా కూటస్థుడును సర్వభూతము లందు, తన యందు ఆత్మను దర్శించినవాడును యోగయుక్తుడును జితేంద్రియత్వము పొందిన వాడును, వీరు పుణ్యకర్మలు చేసినను ఆ కర్మలు, కర్మఫలితములు వీరిని అంటవు |

**వ్యాఖ్యానము :-** ఆత్మను దర్శించిన వారందఱూ ఆత్మయై విరాజిల్లరు. దీనినే కథలుగా రాక్షసులు బ్రహ్మను దర్శించి, వరములు పొంది, నశించిరి అని చెప్పుదురు. కావున ఆత్మను దర్శించుట, ఆత్మస్థానము చేరుట, ఆత్మయై విరాజిల్లుట ఒకటి కావు.

కృష్ణయజుర్వేదములోని సప్తకాండలలోనూ యజ్ఞములో పాటింపవలసిన విధి నిషేధములను చెప్పును. ఏ ఒక్క నిషేధము ఆచరించినా యజ్ఞకర్త నశించును. కావుననే రామాయణములో దశరథుడు

**“శాన్త యశ్చాభి వర్ధన్తాం యథా కల్పం యథా విధి”** (బాలకాండ-అష్టమ సర్గ -15)

**“యజ్ఞస్య సద్యః కర్తా వినశ్యతి”** (బాలకాండ-అష్టమ సర్గ -17)

వేదములో చెప్పినట్లు అదే పద్ధతిలో యజ్ఞము చేయవలయును. లేనిచో ఆ యజ్ఞము చేసినవాడు నశించిపోవును.

ఒక కర్మ బంధము. ఒక కర్మ బంధముకాదు. ఈ విషయమునే ఈశోపనిషత్ యిట్లు చెప్పెను

**“ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే”** (ఈశ ఉపనిషత్-2)

ఏవం+త్వయి+నరే = ఈ విధమయిన నీ వంటి మానవులకు
కర్మ+న+లిప్యతే+ కర్మ ఫలము అంటదు. ఈ విధమయిన దాని
ఇతః+అన్యథా+ కంటె ఇంకొక పద్ధతి (కర్మ ఫలము అంటకుండా
న+అస్తి ఉండే పద్ధతి) లేదు.

ఈ మంత్రముయొక్క విపుల వ్యాఖ్యానము వ్యాసభగవానుడు కర్మబంధము కానివిధమును అనేకమారులు చెప్పినాడు.

...... ❖ ❖ ❖ ......

సాంఖ్యపద్ధతిలో దేహేంద్రియ కర్మలకు తను కర్తను కానని భావించును

**నైవ కించిత్కరోమీతి । యుక్తో మన్యేత తత్త్వవిత్ ।**
**పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ । గచ్ఛన్ స్వపన్ శ్వసన్।8**

న - ఏవ - కించిత్ - కరోమి - ఇతి - యుక్తః - మన్యేత - తత్త్వవిత్
పశ్యన్ - శృణ్వన్ - స్పృశన్ - జిఘ్రన్ - అశ్నన్- గచ్ఛన్ - స్వపన్ - శ్వసన్

**ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిష న్నిమిషన్నపి ।**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు । వర్తన్త ఇతి ధారయన్ ॥ 9**

ప్రలపన్ - విసృజన్ - గృహ్ణన్ - ఉన్మిషన్ - నిమిషన్ - అపి
ఇంద్రియాణి - ఇంద్రియార్థేషు - వర్తంతే - ఇతి - ధారయన్.

ఈ శ్లోకములలో జాగ్రదావస్థలోని ఇంద్రియ వ్యాపారము అటులనే త్రయావస్థలలో విహరించు జీవుని గుఱించి వివరింపబడినది.

జాగ్రదావస్థలో

**కర్మేంద్రియములు :**

| | | |
|---|---|---|
| నోరు | – ప్రలపన్ | = మాటలాడుచు |
| చేతులు | – గృహ్ణన్ | = గ్రహించుచు |
| పాదములు | – గచ్ఛన్ | = నడుచుచు |
| గుహ్యముగుదము | – విసృజన్ | = వీర్యమును, మల మూత్రములను విసర్జించుచూ |

**జ్ఞానేంద్రియములు:**

| | | |
|---|---|---|
| చెవులు | – శృణ్వన్ | = వినుచూ |
| చర్మము | – స్పృశన్ | = స్పృశించుచూ |
| కన్నులు | – పశ్యన్ | = చూచుచు |
| నాలుక | – అశ్నన్ | = తినుచూ |
| ముక్కు | – జిఘ్రన్ | = ఆఘ్రాణించుచూ |
| ప్రాణము | – శ్వసన్ | = ప్రాణవాయువును పీల్చుచూ విడుచుచూ |

**ఇతర క్రియలు:** – అసంకల్పితముగను, సంకల్పితముగను

ఉన్మిషన్ నిమిషన్ – కన్నులు మూయుచు, తెఱయుచూ (ఆవిధముగా అసంకల్పితముగా పై కర్మలు జరుగుచుండును).

**అవస్థలు:**

స్వపన్ + అపి = జాగ్రదావస్థ, నిద్రావస్థలలో ఉన్నను కూడా

(సుషుప్తిలో ప్రాణవ్యాపారము తప్ప మిగిలిన వాటి వ్యాపారముండదు.)

ఇంద్రియాణి+ వర్తంతే+ఇతి+ ఇంద్రియార్థేషు+ ధారయన్ = కర్మేంద్రియములు వాటి వాటి పనులు చేయుచున్నవని, జ్ఞానేంద్రియములు వాటి వాటి ఇంద్రియార్థములందు ప్రవర్తించుచున్నవని తలచుచు

యుక్తః+తత్త్వవిత్+ = ఆత్మతో అనుసంధానము గలిగిన సాంఖ్యుడు
కించిత్+ఏవ+ గుణములే కర్మకు కారణమని భావించి ఏ కొంచెము
న+కరోమి+ కర్మకూడా నేను చేయుటలేదు అని భావించును
మన్యేత+ఇతి

...... ❖ ❖ ❖ ......

భక్తిపరంగా కర్మబంధము కాని విధము

**బ్రహ్మణ్యాధాయ కర్మాణి । సఙ్గం త్యక్త్వా కరోతి యః ।**
**లిప్యతే న స పాపేన । పద్మపత్ర మివామ్భసా ॥ 10**

బ్రహ్మణి – ఆధాయ – కర్మాణి – సంగమ్ – త్యక్త్వా – కరోతి – యః
లిప్యతే – న – సః – పాపేన – పద్మపత్రమ్ – ఇవ – అంభసా.

అంభసా+పద్మ పత్రమ్+ = నీటిలో వుండియూ ఆ నీటి చేత తామరాకు
ఇవ+యః+సంగమ్+ తడవబడని విధముగ ఎవడు ఇంద్రియార్థముల
త్యక్త్వా తోటి సంగమము విడిచి ఉండునో
కర్మాణి+బ్రహ్మణి+ = సర్వ కర్మలను పరమాత్మయందు ఉంచి
ఆధాయ+కరోతి (బ్రహ్మార్పణముగా సర్వకర్మలు చేయుచూ) కర్మలను చేయుచున్నాడో
సః+పాపేన+ = అతడు కర్మ బంధములచే బంధింపబడడు.
న+లిప్యతే కర్మ ఫలితములు అతనికి అంటవు.

**వ్యాఖ్యానము :-** అయితే ఈ స్థితిని నిజముగా పొందినాడా లేదా అని పరీక్షింపబడును. నద్వేష్టి: అనగా ద్వేషము ఉండరాదు. ఉదా: ఇట్టి స్థితిని పొందినాడా లేదా అని హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని అనేక బాధలకు గురిచేసినాడు. తనను హింసించిన తండ్రిని ద్వేషింపక ప్రహ్లాదుడు ఈ పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు.

భాగవతంలో వసుదేవుని ఆఱుగురు కొడుకులను కంసుడు సంహరించి, వసుదేవుని వద్దకు వచ్చి వారి కర్మానుసారం వారు పుట్టినారు, చనిపోయినారు. దీనికి

నేను కర్తను కాను అని పలుకును. అంత వసుదేవుడు. బావా! నీ వచనము నిక్కము సుమా అని అనెను. కొడుకులకై దుఃఖించలేదు. కంసుని ద్వేషించలేదు. ఇది విదేహస్థితి. ఇట్టి స్థితి పొందిన వారికే కర్మలు బంధములు కావు.

...... ❖ ❖ ❖ ......

యోగము

**కాయేన మనసా బుద్ధ్యా । కేవలైరిన్ద్రియైరపి ।**
**యోగినః కర్మ కుర్వన్తి । సఙ్గం త్యక్త్వాత్మ శుద్ధయే ॥ 11**

కాయేన - మనసా - బుద్ధ్యా - కేవలైః - ఇన్ద్రియైః - అపి
యోగినః - కర్మ - కుర్వన్తి - సంగమ్ - త్యక్త్వా - ఆత్మశుద్ధయే

| | | |
|---|---|---|
| ఆత్మ శుద్ధయే+యోగినః+ సంగమ్+త్యక్త్వా+కాయేన+ ఇంద్రియైః | = | ఆత్మశుద్ధి కొఱకు యోగులు ఏకాంత ప్రదేశమున ఒంటరిగానుండి, శరీరముచేత కర్మేంద్రియములచేత, జ్ఞానేంద్రియములచేత |
| మనసా+బుద్ధ్యా+అపి+ కేవలైః+కర్మ+కుర్వన్తి | = | మనస్సుచేత, బుద్ధిచేతను కేవలము యోగము చేయుదురు. |

**వ్యాఖ్యానము :-** అనగా శరీరముచేత స్థిరాసనమున నుండి; జ్ఞానేంద్రియములను నిగ్రహించి దృష్టిని నిలిపి ఓంకారమును జపించుచూ మనస్సును నిశ్చలముగా ఉంచి; మనస్సును బుద్ధిని కలపి, ఆ రెండింటిని దేహితో కలపి, దేహిని క్షేత్రజ్ఞునితో కలపి యోగము చేయుదురు.

...... ❖ ❖ ❖ ......

కర్మబంధము - కర్మబంధముకాదు

**యుక్తః కర్మఫలం త్యక్త్వా । శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్ ।**
**అయుక్తః కామకారేణ । ఫలే సక్తో నిబధ్యతే ॥ 12**

యుక్తః – కర్మఫలమ్ – త్యక్త్వా – శాన్తిమ్ – ఆప్నోతి – నైష్ఠికీమ్
అయుక్తః – కామకారేణ – ఫలే – సక్తః – నిబధ్యతే

**కర్మబంధము :**

పుణ్యకర్మానుష్ఠానపరుడు

కామకారేణ+ఫలే+సక్తః = ఇహలోక పరలోకసుఖభోగములందలి ఆసక్తిచేత పుణ్యఫలమునందలి ఆసక్తిచేత కర్మబద్ధుడు అగుచున్నాడు.

**యోగి :**

అయుక్తః+నిబధ్యతే = హృదయగత ఆత్మతో ఏకీభూతుడుగాక అణిమాది సిద్ధులయందలి ఆసక్తిచేత కర్మబద్ధుడగుచున్నాడు

యుక్తః+నైష్ఠికీమ్+ శాన్తిమ్+ఆప్నోతి = నిశ్చలసమాధిలో ఆత్మానుసంధానము గలిగి ఆత్మశాంతిని పొందుచున్నాడు. వీరికి కర్మ బంధము కాదు.

**కర్మబంధము కాదు :**

పుణ్యకర్మానుష్ఠానపరుడు

కర్మఫలమ్+త్యక్త్వా = పుణ్యఫలితమును విడిచి, పుణ్యకర్మలు చేసిన ఆ కర్మ బంధముకాదు

...... ❖ ❖ ❖ ......

సుఖమును పొందుచున్నాడు

**సర్వకర్మాణి మనసా । సన్న్యస్యాస్తే సుఖంవశీ ।**
**నవద్వారే పురే దేహీ । నైవ కుర్వన్నకారయన్ ॥ 13**

సర్వకర్మాణి - మనసా - సన్న్యస్య - ఆస్తే - సుఖమ్ - వశీ
నవద్వారే - పురే - దేహీ - న - ఏవ - కుర్వన్ - న - కారయన్

| | | |
|---|---|---|
| వశీ+దేహీ+మనసా | = | ఇంద్రియనిగ్రహము కలవాడగు దేహి (జ్ఞాని) మనస్సుచే ఇంద్రియాదులను నిగ్రహించి |
| న+కుర్వన్ | = | పుణ్యకర్మలను స్వయముగా ఆచరింపక అనగా కర్తృత్వ బాధ్యత లేకుండా |
| న+కారయన్+ఏవ | = | తను ఋత్విక్‌గా యుండి, ఇతరులచే చేయింపక, అనగా కర్తృత్వ, భోక్తృత్వము లేకుండా |
| సర్వకర్మాణి+సన్న్యస్య | = | సర్వకర్మలను పరిత్యజించినవాడు (సాంఖ్యుడు) |
| నవద్వారే+పురే+ సుఖమ్+ఆస్తే | = | నవద్వారములు గల ఈ దేహమనే పట్టణమునందు సుఖమును, శాంతిని పొందుచున్నాడు. |

**వ్యాఖ్యానము :-** సాంఖ్యులు దేహేంద్రియ మనోబుద్ధులచే చేయబడు కర్మకు తను కర్తనుగానని భావించును. సాంఖ్యులు రెండువిధములు. కర్మయోగమును పాటించి గుణరహితులయినవారు ఒకరు. పూర్వజన్మ సంస్కారమువలన సాంఖ్యులయినవారు యింకొకరు. భాగవతము, సప్తమస్కంధములో ప్రహ్లాదుడు సంభాషించిన అజగరవృత్తిలోనివారు, అటులనే ఏకాదశస్కంధములో యదువుతో సంభాషించినవారు ఈ కోవకు చెందిన సాంఖ్యులు. వీరికి గురువులు లేనట్లే శిష్యులు ఉండరు.

...... ❖ ❖ ❖ ......

హృదయగత ఆత్మ - దేహి

**న కర్తృత్వం న కర్మాణి । లోకస్య సృజతి ప్రభుః ।**
**న కర్మ ఫల సంయోగం । స్వభావస్తు ప్రవర్తతే ॥ 14**

న – కర్తృత్వమ్ – న – కర్మాణి – లోకస్య – సృజతి – ప్రభుః
న – కర్మ – ఫల – సంయోగమ్ – స్వభావః – తు – ప్రవర్తతే

**నాదత్తే కస్యచిత్పాపం । న చైవ సుకృతం విభుః ॥**
**అజ్ఞానేనావృతం జ్ఞానం । తేన ముహ్యన్తి జన్తవః ॥ 15**

న – ఆదత్తే – కస్యచిత్ – పాపమ్ – న – చ – ఏవ – సుకృతమ్ – విభుః
అజ్ఞానేన – ఆవృతమ్ – జ్ఞానమ్ – తేన – ముహ్యన్తి – జన్తవః

జ్ఞానము - అజ్ఞానము

**జ్ఞానేన తు తదజ్ఞానం । యేషాం నాశిత మాత్మనః ।**
**తేషామాదిత్యవత్ జ్ఞానం । ప్రకాశయతి తత్పరమ్ ॥ 16**

జ్ఞానేన – తు – తత్ – అజ్ఞానమ్ – యేషామ్ – నాశితమ్ – ఆత్మనః
తేషామ్ – ఆదిత్యవత్ – జ్ఞానమ్ – ప్రకాశయతి – తత్ – పరమ్

**తద్బుద్ధయ స్తదాత్మానస్తన్నిష్ఠా స్తత్పరాయణాః ।**
**గచ్ఛన్త్య పునరావృత్తిం । జ్ఞాన నిర్ధూత కల్మషాః ॥ 17**

తత్ – బుద్ధయః – తత్ – ఆత్మానః – తత్ –నిష్ఠాః – తత్ – పరాయణాః
గచ్ఛన్తి – అపునరావృత్తిమ్ – జ్ఞాననిర్ధూత కల్మషాః

**దేహికి**

| | | |
|---|---|---|
| స్వభావః+ప్రవర్తతే | = | దేహి తన స్వభావము ననుసరించి ప్రవర్తించు చున్నాడు |
| తు+లోకస్య+ప్రభుః+ సృజతి | = | కర్మఫలాసక్తిగల దేహికి కర్మఫలితమును లోకకర్త అయిన ఈశ్వరుడు గలుగచేయుచున్నాడు. |

**దేహములో హృదయ గుహలో గల ఆత్మకు**

| | | |
|---|---|---|
| న+కర్మాణి | = | చేయవలసిన కర్మలను విధింపలేదు |
| న+కర్తృత్వమ్ | = | కర్తృత్వం బాధ్యతను గలుగచేయలేదు. |
| న+కర్మఫలసంయోగమ్ | = | కర్మఫలితమును విధింపలేదు. అనగా అతడు సాక్షీభూతుడు |
| విభుః+కస్యచిత్+ పాపమ్+న+ఆదత్తే | = | హృదయగత ఆత్మ ఎవనియొక్క పాపమును స్వీకరించదు |
| చ+సుకృతమ్+ఏవ+న | = | మఱియు పుణ్యమును స్వీకరించదు |

**జ్ఞానము**

| | | |
|---|---|---|
| జ్ఞానమ్+అజ్ఞానేన+ ఆవృతమ్+తేన+ జన్తవః+ముహ్యన్తి | = | జ్ఞానము అజ్ఞానముచే ఆవరింపబడి యున్నది. ఆ అజ్ఞానముచేత మానవులు మోహితు లగుచున్నారు. |

కావున ఆ అజ్ఞానము తొలగిన జ్ఞానము ప్రకాశవంతమగును.

| | | |
|---|---|---|
| తు | = | ఆకాశమున సూర్యుడు ప్రకాశించుచూ సర్వమును ప్రకాశింపచేయుచున్నాడు |
| యేషామ్+తత్+ అజ్ఞానమ్+ఆత్మనః+ జ్ఞానేన+నాశితమ్ | = | ఎవనియొక్క ఆ అజ్ఞానము తనయొక్క జ్ఞానముచే నశింపచేయబడునో |
| తేషామ్+తత్+జ్ఞానమ్+ ఆదిత్యవత్+ప్రకాశయతి | = | వారియొక్క జ్ఞానము ఆదిత్యునివలె ప్రకాశించును |

| | | |
|---|---|---|
| తత్+బుద్ధయః | = | ఆత్మయందే రమించు జ్ఞానులును |
| తత్+నిష్ఠాః | = | ఆత్మనిష్ఠాపరులును |
| తత్+ఆత్మానః | = | జీవాత్మతో ఆత్మను కలిపినవారును |
| తత్+పరాయణాః | = | ఆత్మస్థానమును చేరుటయే గమ్యముగా గలవారును |
| జ్ఞాననిర్ధూత కల్మషాః | = | జ్ఞానముచే అజ్ఞానమనే మాలిన్యమును పోగొట్టుకొన్న వారును |
| అపునరావృత్తిమ్ | = | జీవత్వమునుండి విడివడి ఆత్మస్వరూపులై. పునరావృత్తి రహితమైన ఆత్మస్థానమును |
| గచ్ఛన్తి | = | చేరుదురు. వీరికి కర్మ బంధము కాదు. |

**వ్యాఖ్యానము :-** అకాశమందున్న సూర్యునికి మనకు మధ్య నల్లని మేఘము ఆవరించినంతసేపు ఆ సూర్యుడు కనిపించుటలేదు. ఆ నల్లని మేఘము తొలగినంతనే మనకు ఆకాశమున సూర్యుడు కనబడును. అటులనే అజ్ఞానము తొలగిన జ్ఞానము ప్రకాశించును.

...... ❖ ❖ ❖ ......

ఉపాధులను కాక ఆత్మను దర్శించువాడు పండితుడు
అఖిల భూతములందు ఆత్మను దర్శించువాడు పండితుడు

**విద్యావినయ సంపన్నే । బ్రాహ్మణే గవి హస్తిని ।**
**శుని చైవ శ్వపాకే చ । పణ్డితాః సమదర్శినః ॥ 18**

విద్యావినయ సంపన్నే – బ్రాహ్మణే – గవి – హస్తిని
శుని – చ – ఏవ – శ్వపాకే – చ – పండితాః – సమదర్శినః

సర్వ ఉపాధులు ప్రకృతి జనితములు. సర్వ ఉపాధులలో ఆత్మ కలదు. కావున

| | | |
|---|---|---|
| హస్తిని+గవి+చ | = | ఏనుగుయొక్క ఉపాధి యందుగల ఆత్మను గోవుయొక్క ఉపాధి యందుగల ఆత్మను మఱియు |

| | | |
|---|---|---|
| శుని | = | కుక్కయొక్క ఉపాధి యందుగల ఆత్మను |
| శ్వపాకే+చ | = | చండాలునియొక్క ఉపాధి యందుగల ఆత్మను |
| విద్యా వినయ సంపన్నే+ బ్రాహ్మణే+ఏవ | = | విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణుని యొక్క ఉపాధి యందుగల ఆత్మను |
| సమదర్శినః+పండితాః | = | సమదృష్టి గలిగి పండితులు చూతురు. |

**వ్యాఖ్యానము :-**

**పండితులు**

పండితుని గురించి 26వ అధ్యాయము 11వ శ్లోకములో; 28వ అధ్యాయము 19వ శ్లోకములో; ఇప్పుడు 29వ అధ్యాయము 18వ శ్లోకములో చెప్పబడినది.

వీటిని ఒకచోట చేర్చుకొని చదువవలయును.

ఏ విధమయిన కర్మాచరణ చేసిననూ సర్వత్రా ఆత్మను దర్శించుట అనే స్థితిని పొందవలయును. వీరే పండితులు.

ఉపాధులను గాక సర్వ ఉపాధులలో గల ఆత్మను దర్శించవలయును. శాస్త్ర పాండిత్యముగాక ద్వంద్వాతీతులై కష్ట సుఖములకు విచలితులు గాక తనయందు సర్వ భూతములయందు ఆత్మను దర్శించిన వారు పండితులు.

ఉపాధులలో భిన్నత్వమున్నది. గుణయుతుడయిన దేహిలో గుణమును బట్టి భిన్నత్వమున్నను అంతరాత్మ అయిన ఆత్మలో భిన్నత్వము లేదు.

భావాద్వైతము, క్రియాద్వైతము, ద్రవ్యాద్వైతములు అని **అద్వైతము మూడు విధములు:**

**భావాద్వైతము:** సర్వప్రాణులను సృజియించినవాడు విరాట్పురుషుడే పటుతంతు న్యాయంబున కార్య కారణంబులందు వస్తువు ఒక్కటియే యుండునని యెఱిగి ఏకత్వాలోచనంబు చేసి వికల్పములేదని భావించుట భావాద్వైతము.

కారణము - ప్రకృతి; కార్యము - ఉపాధులు

ప్రకృతివలననే సర్వ ఉపాధులు వచ్చినవి అని గ్రహించుట భావాద్వైతము

**క్రియాద్వైతము:** మనోవాక్కాయ కృతంబులైన సర్వ కర్మంబులును ఫల భేదంబు సేయక పర బ్రహ్మార్పణంబు సేయుట క్రియాద్వైతంబు. పుణ్య ఫలితములు భగవంతునికి అర్పించుట క్రియాద్వైతము.

**ద్రవ్యాద్వైతము:** పుత్ర మిత్ర కళత్రాది సర్వ ప్రాణులకు, దనకును దేహంబునకుం బంచ భూతాత్మకత్వంబున భోక్త యొక్కరుండను పరమార్థత్వంబున, నర్థ కామంబుల యెడ నైక్య దృష్టింజేయుట ద్రవ్యాద్వైతము. అనగా అన్ని భూతముల దేహములు పంచ భూతాత్మకములు అని గ్రహించుట ద్రవ్యాద్వైతంబు. ఆ దేహములో గల ఆత్మను దర్శింపక స్త్రీ యిది పురుషుడను నేను అని భావింపక అద్వైతాను సంధానంబు సేయువాడు మూఢుండగు అని నారదమహర్షి చెప్పెను.

ఉపాధులు ప్రకృతిచే జనియించినవనియు, ఒకే ప్రకృతి వలన భిన్న భిన్న ఉపాధులు ఏర్పడినవనియు, పూర్వజన్మ కర్మ వశమున ఆ ఉపాధులలో ప్రవేశించిన దేహి తన యొక్క గుణ కర్మలచే భిన్నుడనియూ, సర్వ ఉపాదులలో హృదయ గుహలోగల ఆత్మ ఒక్కడే అనియూ ఈ హృదయగత ఆత్మలో భిన్నత్వము లేదనియూ పండితులు భావింతురు. ఈ విధముగా ప్రతి ప్రాణియు–ఉపాధి – దేహి – హృదయగత ఆత్మల సమిష్ఠి అనియు గ్రహింతురు. ఇదియే సమ దృష్టి. అంతే తప్ప కుక్కను, ఏనుగును ఒకలాగ చూచినవాడు పిచ్చివాడు. ఆవిధముగా చూచినవాడు మూర్ఖుడని నారదుని భావన. ఈ శ్లోకముచెప్పిన శ్రీకృష్ణుడే ధర్మరాజును, దుర్యోధనుని ఒకే విధముగా చూడలేదుగదా! గోప వనితలను, కౌరవ కాంతలను ఒకే విధముగా చూడలేదుగదా! దేవతలను, రాక్షసులను సమదృష్టితో చూడలేదుగదా! సమ దృష్టి అనే పేరుతో ఆవుకు గడ్డివేసి, ఆవిధముగనే కుక్కకు తినుటకు గడ్డివేస్తే, అతనిని ఏమనాలి?

పండితులు తనయందు సర్వ భూతములయందు ఆత్మను చూచుట అనే సమ దృష్టి గలిగి యుందురు. అంతే తప్ప సర్వ ఉపాధులను సర్వజీవులను ఒకేలాగ చూడరు.

**యచ్చ స్థావరం సర్వం తత్ ప్రజ్ఞా నేత్రమ్ ప్రజ్ఞానే ప్రతిష్ఠితం ।**
**ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ ॥**

(ఐతరేయ ఉపనిషత్ – తృతీయాధ్యాయః)

అనగా ఈ సృష్టిలోని సర్వజీవరాసులు విరాట్పురుషునియందు ప్రతిష్ఠితమై యున్నవని, ఆవిధముగా ప్రజ్ఞానేత్రముతో చూచుటయే ప్రజ్ఞానము. ఈ విషయమునే పై శ్లోకములో ఆవిధముగా చెప్పబడినది.

...... ❖ ❖ ❖ ......

ఆత్మ - హృదయగత ఆత్మ

**ఇహైవ తైర్జితః సర్గో । యేషాం సామ్యే స్థితం మనః ।**
**నిర్దోషం హి సమం బ్రహ్మ । తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥ 19**

ఇహ – ఏవ – తైః – జితః – సర్గః – యేషామ్ – సామ్యే – స్థితమ్ – మనః
నిర్దోషమ్ – హి – సమమ్ – బ్రహ్మ – తస్మాత్ – బ్రహ్మణి – తే – స్థితాః

| | | |
|---|---|---|
| బ్రహ్మ+నిర్దోషమ్ | = | సృష్ట్యాదియందున్న ఆత్మ, హృదయగుహలోగల ఆత్మ కళంకరహితమైనది (శుచిః) |
| సమమ్ | = | సాక్షీభూతుడగుటవలన సర్వభూతముల యందు సముడు. |
| హి | = | సృష్టి, స్థితి, లయములు చేసినను విరాట్ పురుషుడు కర్మబద్ధుడు కాడు. గుణరహితుడు. |
| తస్మాత్+యేషామ్+ మనః+సామ్యే+స్థితమ్+ తైః+ఇహ+ఏవ+సర్గః+ జితః | = | అందువలన ఎవరియొక్క మనస్సు గుణరహితమై యున్నదో జీవాత్మ హృదయ గుహలో గల ఆత్మతో ఏకీభూతమై ఉన్నదో వారిచేత అనగా గుణరహితులచేత ఇచ్చటనే వారు జీవించియుండగనే బ్రహ్మలోకము జయింపబడినది అనగా వీరు జీవన్ముక్తులు |
| తే+బ్రహ్మణి+స్థితాః | = | జీవన్ముక్తులు అయినవారు దేహ త్యాగానంతరము సృష్ట్యాదియందున్న ఆత్మయందు ఉందురు. |

...... ❖ ❖ ❖ ......

జ్ఞానము

**న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య । నోద్విజే త్ప్రాప్యచా ప్రియమ్ ।**
**స్థిరబుద్ధిరసమ్మూఢో । బ్రహ్మ విద్బ్రహ్మణి స్థితః ॥ 20**

న–ప్రహృష్యేత్–ప్రియమ్–ప్రాప్య–న–ఉద్విజేత్–ప్రాప్య–చ–అప్రియమ్
స్థిరబుద్ధిః – అసమ్మూఢః – బ్రహ్మవిత్ – బ్రహ్మణి – స్థితః

**బాహ్యస్పర్శేష్వ సక్తాత్మా । విన్దత్యాత్మని యత్సుఖమ్ ।**
**స బ్రహ్మయోగయుక్తాత్మా । సుఖ మక్షయమశ్నుతే ॥ 21**

బాహ్యస్పర్శేషు – అసక్తాత్మా – విన్దతి – ఆత్మని – యత్ – సుఖమ్
సః – బ్రహ్మయోగయుక్తాత్మా – సుఖమ్ – అక్షయమ్ – అశ్నుతే

ఇహలోక పరలోకసుఖములకు సంబంధించిన కోరికలు దుఃఖ హేతువులు.
కావున జ్ఞాని ఇహలోక పరలోకసుఖములు కోరడు.

**యేహి సంస్పర్శజా భోగా । దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యన్తవన్తః కౌన్తేయ । న తేషు రమతే బుధః ॥ 22**

యే – హి – సంస్పర్శజాః – భోగాః – దుఃఖయోనయః – ఏవ – తే
ఆద్యన్త వన్తః – కౌన్తేయ – న – తేషు – రమతే – బుధః

**శక్నోతీ హైవ యస్సోఢుం । ప్రాక్ శరీరవిమోక్షణాత్ ।**
**కామ క్రోధోద్భవం వేగం । స యుక్తః స సుఖీ నరః ॥ 23**

శక్నోతి – ఇహ – ఏవ – యః – సోఢుమ్ – ప్రాక్ – శరీరవిమోక్షణాత్
కామ క్రోధోద్భవమ్ – వేగమ్ – సః – యుక్తః – సః – సుఖీ – నరః

**యోఽన్తః సుఖోఽన్తరా రామః స్తథాన్తర్జ్యోతిరేవ యః ।**
**సయోగీ బ్రహ్మనిర్వాణం । బ్రహ్మ భూతోఽధిగచ్ఛతి ॥ 24**

యః-అన్తః-సుఖః- అంతరా రామః - తథా - అన్తః జ్యోతిః - ఏవ - యః
సః - యోగీ - బ్రహ్మనిర్వాణమ్ - బ్రహ్మ భూతః - అధిగచ్ఛతి.

**లభన్తే బ్రహ్మ నిర్వాణ । మృషయః క్షీణ కల్మషాః ।**
**ఛిన్నద్వైధా యతాత్మానః । సర్వభూత హితే రతాః ॥ 25**

లభన్తే - బ్రహ్మ నిర్వాణమ్ - ఋషయః - క్షీణ కల్మషాః
ఛిన్న ద్వైధాః - యతాత్మానః - సర్వ భూత హితే రతాః

**కామ క్రోధ వియుక్తానాం । యతీనాం యతచేతసామ్ ।**
**అభితో బ్రహ్మనిర్వాణం । వర్తతే విదితాత్మనామ్ ॥ 26**

కామ క్రోధ వియుక్తానామ్ - యతీనామ్ - యతచేతసామ్
అభితః - బ్రహ్మనిర్వాణమ్ - వర్తతే - విదితాత్మనామ్

| | | |
|---|---|---|
| ప్రియమ్+ప్రాప్య+ న+ప్రహృష్యేత్ | = | ప్రియమును పొంది ఉప్పొంగిపోనివాడు |
| చ | = | మఱియు |
| అప్రియమ్+ప్రాప్య+ న+ఉద్విజేత్ | = | అప్రియమును పొంది క్రుంగిపోనివాడు, ఉద్వేగమునకు లోను కానివాడు అనగా ప్రియాప్రియములందు సమభావన గలవాడు |
| స్థిరబుద్ధిః+అసమ్మూఢః | = | స్థిరబుద్ధి గలవాడు మోహములేనివాడు అనగా అరిషడ్వర్గములను జయించినవాడు |
| బ్రహ్మవిత్ | = | హృదయగుహలో గల ఆత్మను దర్శించిన బ్రహ్మవేత్త దేహ త్యాగానంతరము |

| | | |
|---|---|---|
| బ్రహ్మణి+స్థితః | = | సృష్ట్యాదియందుగల ఆత్మతో ఏకీభూతుడై యుండును. |
| బ్రహ్మయోగ యుక్తాత్మా | = | బ్రహ్మ సాక్షాత్కారమునకై యోగయుక్తాత్ముడైన వాడును |
| బాహ్య స్పర్శేషు+ అసక్తాత్మా | = | ఇంద్రియార్థములందు ఆసక్తి లేనివాడును |
| యత్+సుఖమ్+ ఆత్మని+విన్దతి+ (తత్)+అక్షయమ్+ సుఖమ్+సః+అశ్నుతే | = | ఏ సుఖమును, శాంతిని నిశ్చలసమాధిలో హృదయగత ఆత్మయందు ఏకీభూతుడై పొందుచున్నాడో అట్టి అనంతమైన సుఖమును అతడు ఆ జీవన్ముక్తుడు దేహ త్యాగానంతరము సృష్ట్యాదియందుగల ఆత్మతో ఏకీభూతుడై అట్టి పరమానందమునే పొందుచున్నాడు. |
| కౌంతేయ | = | ఓ అర్జునా! |
| యే+సంస్పర్శజాః+ భోగాః+ఆద్యన్త వన్తః | = | ఏవి విషయేంద్రియములవలన పుట్టిన భోగములో అవి ఆది, అంతము కలవి. |
| హి | = | పుణ్య ఫలితము కోరుటవలన గలిగిన పరలోక సుఖములు, పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మించును. కావున |
| దుఃఖయోనయః+ ఏవ+బుధః+తేషు+న+ రమతే | = | ఇహలోక పరలోక సుఖములు దుఃఖ హేతువులే. కావున జ్ఞాని ఆ ఇహలోక పరలోక సుఖములందు రమింపడు |
| యః+ఇహ+ఏవ+ శరీర విమోక్షణాత్+ ప్రాక్+కామక్రోధోద్భవమ్+ వేగమ్+సోఢుమ్+శక్నోతి | = | ఎవడు ఈభూలోకముననే మరణించుటకు ముందే కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మత్సరము, అనే అరిషడ్వర్గముల వలన గలుగు వికారములను, వాటివలన గలుగు చర్యలను, సహించుటకు సమర్థుడు అగుచున్నాడో, |

| | | |
|---|---|---|
| సః+నరః+సః+యుక్తః+ సుఖీ | = | ఆ మానవుడు ఆత్మానుసంధానము చేసినవాడు సుఖవంతుడు. అతడు ఆత్మానందమును అనుభవించును. |
| యః+అన్తః సుఖః | = | ఎవడు పుణ్యకర్మానుష్ఠానము చేసి సర్వ కోరికలు విడచి, ద్వంద్వ రహితుడై శాంతత్వము గలవాడో |
| తథా+యః+ అంతరారామః+ అన్తఃజ్యోతిః+ఏవ | = | అటులనే ఎవడు యోగమును చేసి ఆత్మ యందే క్రీడించునో, అంతర్జ్యోతి అయిన ఆత్మయందు రమించునో |
| సః+యోగీ+బ్రహ్మభూతః బ్రహ్మనిర్వాణమ్+ అధిగచ్ఛతి | = | అట్టి యోగి దేహ త్యాగానంతరము, బ్రహ్మ స్వరూపుడై బ్రహ్మ నిర్వాణమును పొందుచున్నాడు. |
| సర్వ భూత హితే రతాః | = | సర్వ భూతముల హితమునందు ఆసక్తిగల వారును |
| ఛిన్నద్వైధాః | = | సర్వ సంశయములు తొలగించుకొనిన వారును |
| క్షీణకల్మషాః+ యతాత్మానః | = | పాప రహితులును, జితేంద్రియులు అయిన |
| ఋషయః+ బ్రహ్మనిర్వాణమ్+లభన్తే | = | ఋషులు – (జ్ఞానస్య పారగమాత్ ఋషిః – జ్ఞానము యొక్క పారమును పొందినవారు) బ్రహ్మ నిర్వాణమును పొందుదురు. |
| కామక్రోధ వియుక్తానామ్ | = | తమోగుణ జనితములైన, మోహ, మద, మాత్సర్యములను, రజోగుణ జనితము లయిన కామ, క్రోధ, లోభములను అనగా అరిషడ్వర్గములను జయించినవారు, సత్త్వ గుణాశ్రయులును |
| యతచేతసామ్+ విదితాత్మనామ్ | = | చిత్తమును స్వాధీనపఱచుకొనిన వారును (నియతేంద్రియులు) ఆత్మతత్త్వమును గ్రహించిన వారును |

| | | |
|---|---|---|
| అభితః | = | అంతటను అనగా తనయందు సర్వభూతముల యందు సర్వత్రా ఆత్మను దర్శించిన వారునూ అయిన |
| యతీనామ్ | = | యతీశ్వరులకు "యచ్ఛంతి ఇంద్రియేభ్యః ఇతి యతయః" ఇంద్రియములవలన జయించినవారు అనగా జితేంద్రియులు. ) |
| వర్తతే+బ్రహ్మనిర్వాణమ్ | = | శాంతత్వము గలిగి, ఆత్మ రతి, ఆత్మ క్రీడయందు, జీవన్ముక్తులై వర్తించుచున్నారు. అట్టివాడు బ్రహ్మ నిర్వాణమును పొందును. |

**వ్యాఖ్యానము :-** జీవన్ముక్తుడు తను జీవించి ఉండగనే పరమానందమును పొందును. దేహ త్యాగానంతరము కూడా అట్టి పరమానందమునే పొందుచున్నాడు. యోగములో ఆత్మ దర్శనము, ఆత్మ స్థానమును చేరుట, శాంతి, పరమానందమును పొందుట అను నాలుగు స్థితులు కలవు. ఆత్మ దర్శనముచేసి, కోరికలు కోరువారు, పుణ్య కర్మల ఫలితమును కోరువారు, ఆత్మ స్థానమును చేరి, పుణ్య ఫలితము క్షీణించగనే తిరిగి మర్త్యలోకమున జన్మింతురు. కోరికలను సంపూర్ణముగా విడిచినవాడు, పరమ శాంతిని పొంది, పరమానందమును పొంది, ఆత్మయై విరాజిల్లును. దీనినే శుకబ్రహ్మ పరీక్షిత్తునకు ఇట్లు చెప్పెను –

**ఉపాధి పరంపరావస్థానంబునం బ్రకృతింబాసి, ఆనందమయుండై బ్రహ్మమందు కలియు.** (భాగవతం – ద్వితీయ స్కంధం – 32)

**"కామంబులు విడచిన పురుషుండు నీతోడ సమాన విభవుండగు"**సని ప్రహ్లాదుడు నృసింహమూర్తితో పలుకును (భాగవతం – సప్తమ స్కంధం–371)

...... ❖ ❖ ❖ ......

ధ్యానయోగమును స్థూలముగా చెప్పుచున్నాడు

**స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షు శ్చైవాన్తరే భ్రువోః ।**
**ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తర చారిణౌ ॥ 27**

స్పర్శాన్ – కృత్వా – బహిః – బాహ్యాన్ – చక్షుః –చ–ఏవ– అన్తరే – భ్రువోః
ప్రాణాపానౌ – సమౌ– కృత్వా – నాసా– అభ్యన్తర – చారిణౌ

**యతేన్ద్రియ మనో బుద్ధిః । మునిర్మోక్ష పరాయణః ।**
**విగతేచ్ఛా భయక్రోధో యః । సదా ముక్త ఏవ సః । 28**

యత్ – ఇంద్రియః–మనః–బుద్ధిః – మునిః – మోక్ష పరాయణః
విగత– ఇచ్ఛాభయక్రోధః – యః – సదా – ముక్తః – ఏవ – సః

యః = ఎవడు పుణ్యకర్మగా చెప్పబడే యమ, నియమములు ఆచరించుచూ,

<u>**ఆసనము**</u> నందు ఉండి దృష్టిని

చక్షుః = దృష్టిని ప్రారంభములో కన్నులు తెఱచి ముక్కు కొనను చూచుచూ సాధన చేసి, సాధన పెరిగిన తరువాత,

అన్తరే+భ్రువోః+చ = భ్రూమధ్యము నందు దృష్టిని నిలిపి,కన్నులు తెఱచి, ముక్కు కొనను చూచుచూ లేక కన్నులు తెఱచి, దూరముగా ఉన్న ఒక వస్తువుపై నిలిపి కన్నులు మూసి దృష్టిని భ్రూమధ్యమునందు నిలిపి,

**ప్రాణాయామము:**

| | | |
|---|---|---|
| నాసా+అభ్యన్తర+చారిణౌ+ | = | ముక్కులో సంచరించుచున్న ప్రాణము |
| ప్రాణాపానౌ+సమౌకృత్వా | | అపానములను సమముచేసి ఆ తర్వాత ప్రాణమును ముక్కులోపలనే తిరుగునట్లు చేసి ఆ తర్వాత పూర్ణ కుంభకమునందు ఉండి |

**ప్రత్యాహారము:**

| | | |
|---|---|---|
| బాహ్యాన్+స్పర్శాన్+ | = | జ్ఞానేంద్రియములకు బాహ్య విషయములయిన |
| బహిః+కృత్వా+ఏవ | | శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులను మనస్సుచే గ్రహించక వాటిని బయటనే వుంచి |
| ఇంద్రియః+యత్ | = | ఇంద్రియములను మనస్సుచే నియమించి |

**ధ్యానము:**

| | | |
|---|---|---|
| మనః | = | మనస్సును నిశ్చలము చేసి |

**ధారణ:**

| | | |
|---|---|---|
| బుద్ధిః+ | = | బుద్ధియుతుడై అనగా రాగ-ద్వేషములు, భయము, |
| విగత ఇచ్ఛాభయక్రోధః | | కామ, క్రోధ, లోభము, మోహము, మదము మాత్సర్యములను విడచి, కల్మష రహితుడైన |

**నిశ్చల సమాధి:**

| | | |
|---|---|---|
| సః+మోక్షపరాయణః+ మునిః | = | ఆ మోక్షపరాయణుడగు ముని |
| సదా+ముక్తః + ఏవ | = | నిత్య ముక్తుడు. జీవన్ముక్తుడు. అమృత ఇహా భవతి శాంతిని పొందును. |

...... ❖ ❖ ❖ ......

సాంఖ్యుడు / జ్ఞాని శాంతిని పొందును

**భోక్తారం యజ్ఞతపసాం । సర్వలోకమహేశ్వరమ్ ।**
**సుహృదం సర్వభూతానాం । జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి ॥29**

భోక్తారమ్ – యజ్ఞ తపసామ్ – సర్వలోక మహేశ్వరమ్
సుహృదమ్ – సర్వభూతానామ్ – జ్ఞాత్వా – మామ్ – శాంతిమ్ – ఋచ్ఛతి

మామ్ = నన్ను అనగా ఆత్మను

యజ్ఞ తపసామ్+ భోక్తారమ్ = యజ్ఞములకును, తపస్సులకును భోక్తయు అనగా యజ్ఞము చేసి ఆ ఫలితమును పరమాత్మకు సమర్పించ వలయును. అటులనే తపస్సుకు భోక్తగను, అనగా తపస్సుచేసి తపోఫలితమును పరమాత్మకు సమర్పించ వలయును.

సర్వలోక మహేశ్వరమ్ = సర్వలోక మహేశ్వరుడును నియామకుడును

సర్వభూతానామ్+ సుహృదమ్+జ్ఞాత్వా+ శాంతిమ్ = సర్వభూతములకు సముడు, ప్రియుడు, నెచ్చెలిగను అయిన పరమాత్మను తెలుసుకొని శాంతిని పొంది జీవన్ముక్తుడై దేహత్యాగానంతరము సృష్ట్యాది యందుగల

ఋచ్ఛతి = ఆత్మను పొందును. ఆత్మయై విరాజిల్లును.

**వ్యాఖ్యానము :-** ధ్యానమునకు లక్ష్యము ఉండవలయును. భ్రమరకీటక న్యాయముగా ధారణలో నన్నే స్మరించి. విగతకల్మషుడై బుద్ధిచే మలత్రయములను వదలి గుణరహితుడై శాంతిని పొంది బ్రహ్మయగును. 26వ అధ్యాయము 71వ శ్లోకములో, అటులనే 29వ అధ్యాయము 29వ శ్లోకములో శాంతి గురించి చెప్పబడినది. ధ్యానయోగము గురించి విపులముగా రాబోవు 30వ అధ్యాయములో చెప్పబడును.

...... ❖ ❖ ❖ ......

ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము 30వ అధ్యాయము

## (ఆత్మసంయమయోగము)

శ్రీ భగవానువాచ

**అనాశ్రితః కర్మఫలం । కార్యం కర్మ కరోతి యః ।**
**స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్నచాక్రియః ॥ 1**

అనాశ్రితః – కర్మఫలమ్ – కార్యమ్ – కర్మ – కరోతి – యః
సః – సన్న్యాసీ – చ – యోగీ – చ – న – నిరగ్నిః–న–చ – అక్రియః

| | | |
|---|---|---|
| యః+కార్యమ్+కర్మ+ కరోతి | = | ఎవడు కర్తవ్యమును అనగా జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు, వ్యక్తిగత విధులు, బాధ్యతలు, పాటించుచూ సజ్జనుడై యజ్ఞ యాగాది క్రతువులు, అగ్నిహోత్రము, ఇష్టాపూర్తములు మొదలైన పుణ్య కర్మానుష్ఠానము చేయుచున్నాడో |
| చ+కర్మఫలమ్+ అనాశ్రితః+సః+ సన్న్యాసీ+చ+యోగీ | = | మఱియు ఆత్మదర్శన ప్రాప్తికై పుణ్యకర్మల ఫలితమును అపేక్షించనివాడై యుండునో అట్టివాడు సాంఖ్యుడు/జ్ఞాని అని పిలువబడును. మఱియు సంకల్ప రాహిత్యముగల అతడే యోగి అనియు పిలువబడును. |
| న+నిరగ్నిః+చ+ న+అక్రియః | = | అంతే తప్ప తత్త్వవిచారణ పేరిట అగ్నిహోత్రము యజ్ఞములు చేయనివాడు మఱియు క్రియా రహితుడు అనగా జాతి ఆశ్రమ ధర్మములు, విధులు, బాధ్యతలు, నెఱవేర్చనివాడు జ్ఞాని కాదు, యోగీ కాదు. అతడు సంసారియూ కాదు. అతడు వ్యర్థజీవి. |

**వ్యాఖ్యానము :-** జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు పాటించుచూ, చేయవలసిన విధులను, బాధ్యతలను నెఱవేర్చుచూ, అగ్నిహోత్రాది పుణ్య కర్మానుష్ఠానమును చేయుచూ తత్ఫలమును కోరువారు సంసారులు. పుణ్యఫలము కోరనివారు జ్ఞానులు. మఱియు యోగులు. యోగులన్నా, సాంఖ్యులన్నా ఒక్కటే అని గతంలో చెప్పినదానినే ఇప్పుడు విపులముగా వివరించుచున్నాడు.

...... ❖ ❖ ❖ ......

జాతి ధర్మములను, ఆశ్రమ ధర్మములను, విధులను, బాధ్యతలను
పాటించుచూ, పుణ్యకర్మలు ఆచరించుచూ, ఆ పుణ్య కర్మఫలితమును
కోరనివాడు-ద్వంద్వాతీతుడైనవాడు సాంఖ్యుడు. అతడే యోగి.

**యం సన్న్యాసమితి ప్రాహుః । యోగం తం విద్ధి పాణ్డవ ।**
**న హ్యన్న్యస్త సంకల్పో । యోగీ భవతి కశ్చన ॥ 2**

యమ్ - సన్న్యాసమ్ - ఇతి-ప్రాహుః-యోగమ్-తమ్-విద్ధి - పాండవ
న - హి - అసన్న్యస్త సంకల్పః - యోగీ - భవతి - కశ్చన.

| | | |
|---|---|---|
| పాండవ | = | ఓ అర్జునా! |
| యమ్+సన్న్యాసమ్+ ఇతి+ప్రాహుః | = | దేనిని అనగా సంకల్ప రాహిత్యమును సాంఖ్యమని, జ్ఞానమని చెప్పుదురో |
| తమ్+యోగమ్+విద్ధి | = | దానిని యోగము అని తెలియుము |
| కశ్చన | = | ఎవడును |
| హి | = | జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు, వ్యక్తిగత విధులు, బాధ్యతలు, పాటింపని వాడు పుణ్యకర్మలు చేయనివాడు, పుణ్యకర్మల ఫలితమును కోరువాడు. |
| అసన్న్యస్త సంకల్పః | = | సంకల్ప త్యాగము చేయనివాడు |
| యోగీ+న+భవతి | = | యోగికాలేడు |

...... ❖ ❖ ❖ ......

యోగారూఢులు

**ఆరురుక్షోర్మునేర్యోగం । కర్మ కారణముచ్యతే ।**
**యోగారూఢస్య తస్యైవ । శమః కారణముచ్యతే ॥ 3**

ఆరురుక్షోః – మునేః – యోగమ్ – కర్మ – కారణమ్ – ఉచ్యతే
యోగారూఢస్య – తస్య – ఏవ – శమః – కారణమ్ – ఉచ్యతే

| | | |
|---|---|---|
| యోగమ్+ఆరురుక్షోః+ మునేః | = | యోగమును ప్రారంభించదలచిన మునికి |
| కర్మ+కారణమ్+ఉచ్యతే | = | యోగమునకు, యమనియమాదులు, ఆసనము కారణము అని చెప్పబడుచున్నది. |
| తస్య+యోగారూఢస్య+ శమః+ఏవ+కారణమ్+ ఉచ్యతే | = | యోగమును చేయుచున్న యోగారూఢునకు అంతరేంద్రియములయిన చిత్తము, మనస్సు, బుద్ధులను నిగ్రహించుట, ధ్యాన, ధారణలు సమాధిస్థితిని పొందుటకు కారణమని చెప్పబడును |

**వ్యాఖ్యానము :-** యోగులలో ప్రారంభకులు, ఉన్నతస్థాయివారు అని రెండు రకములు. యమ, నియమములు, ఆసనము, ప్రాణాయామము అనే కర్మను ప్రారంభకులు పాటించవలయును. వీరికి ఇవి యోగమునకు కారణములు.

**ఉన్నతులు:** ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, సమాధిస్థితిని పొందవలయును. ఆత్మ శాంతిని పొందుటకు ఇవి కారణములు.

యోగారూఢుడు ద్వంద్వాతీతుడై శాంతిని పొందవలయును. యోగారూఢులను గుఱించి రామాయణములో వర్ణించుచూ అరణ్యములోని ఋషులు రాక్షసులచే బాధింప బడుచూ వారిని తమ తపోశక్తిచే నిర్మూలింపక, పరమ శాంతిని గలిగి, రాక్షసుల బారినుండి తమని రక్షింపమని భగవంతునినే శరణు కోరినారు. పుణ్య కర్మ ఫలితమును రామునికే సమర్పింతుమని పలికినారు. అనగా వీరు యోగారూఢులు. రామాయణములో హనుమంతుడు యోగారూఢుడు. ఆకాశ మార్గమున అనగా

సుషుమ్నా మార్గమున పయనించి, సీత/ప్రకృతిని దర్శించి, గ్రహించి అహంకార ఆవరణ అనే లంకను కాల్చి, ప్రకృతింబాసి ఆనందమయుండై అనగా మధువనములో ప్రవేశించి, ఆ తరువాత శ్రీరామునిచే కౌగిలింపబడి కర్పూరదీప సంయోగమువలె బ్రహ్మీభూతుడయినాడు.

...... ❖ ❖ ❖ ......

**యదా హి నేన్ద్రియార్థేషు । న కర్మ స్వనుషజ్జతే ।**
**సర్వ సంకల్ప సన్న్యాసీ । యోగారూఢస్తదోచ్యతే ॥ 4**

యదా - హి - న - ఇంద్రియార్థేషు - న - కర్మసు - అనుషజ్జతే
సర్వసంకల్ప సన్న్యాసీ - యోగారూఢః - తదా - ఉచ్యతే

**సాంఖ్యుడు**

యదా+కర్మసు+ = ఎప్పుడు గుణరహితుడై పుణ్యకర్మల ఫలితము
న+అనుషజ్జతే నందు ఆసక్తుడు కాడో అతడు సాంఖ్యుడు

**యోగి**

ఇంద్రియార్థేషు+న = ఎప్పుడు ఇంద్రియార్థములందు అనురక్తుడు కాడో
సర్వసంకల్ప సన్న్యాసీ = మనస్సునందుగల సర్వసంకల్పములను వదలి
హి = గుణరహితుడై పరమ శాంతిని పొందునో
తదా+యోగారూఢః+ ఉచ్యతే = అప్పుడు యోగారూఢుడు అని చెప్పబడును.

...... ❖ ❖ ❖ ......

ఆత్మ ఒకరికి బంధువు - ఒకరికి శత్రువు

**ఉద్ధరేదాత్మనాత్మానం । నాత్మానమవసాదయేత్ ।**
**ఆత్మైవ హ్యాత్మనో బన్ధుః । ఆత్మైవరిపురాత్మనః ॥ 5**

ఉద్ధరేత్ – ఆత్మనా – ఆత్మానమ్ – న – ఆత్మానమ్ – అవసాదయేత్
ఆత్మా – ఏవ – హి – ఆత్మనః – బన్ధుః – ఆత్మ – ఏవ – రిపుః – ఆత్మనః

**బన్ధురాత్మాత్మనస్తస్య । యేనాత్మైవాత్మనా జితః ।**
**అనాత్మనస్తు శత్రుత్వే । వర్తేతాత్మైవ శత్రువత్ ॥ 6**

బన్ధుః – ఆత్మా – ఆత్మనః – తస్య – యేన – ఆత్మా – ఏవ – ఆత్మనా–జితః
అనాత్మనః – తు – శత్రుత్వే – వర్తేత – ఆత్మా – ఏవ – శత్రువత్

హృదయగుహలో గల ఆత్మ – జీవాత్మ బింబ ప్రతిబింబములు. కావున రెండింటికి ఆత్మ అనే పదమే వాడబడును.

| | | |
|---|---|---|
| ఆత్మనా+ఆత్మానమ్+ ఉద్ధరేత్ | = | జీవాత్మచేత అనగా తను సాధనచేత జీవాత్మను భవసాగరమునుండి ఉద్ధరించుకొనవలయును. |
| ఆత్మానమ్+న+ అవసాదయేత్ | = | జీవాత్మను అధోగతిపాలు చేయరాదు. |
| ఆత్మా+ఏవ | = | సృష్ట్యాదియందున్న ఆత్మయే (వీరిరువురు చిన్ననాటి స్నేహితులు) |
| ఆత్మనః+బంధుః+హి | = | తనకు బంధువు ఏలననగా |
| ఆత్మనః+ఆత్మా+ఏవ+ రిపుః | = | జీవాత్మకు చిత్తము ఇంద్రియములు. ఇంద్రియానీకము, చిత్తము వశము కానిచో శత్రువు |

కావున యోగి ఇంద్రియములను అంతఃకరణ చతుష్టయమును జయించ వలయును.

| | | |
|---|---|---|
| యేన+ఆత్మనా+ఆత్మా+ జితః+తస్య+ఆత్మనః+ ఆత్మా+ఏవ+బంధుః | = | ఏ జీవాత్మ చేత సృష్ట్యాదియందుగల ఆత్మ జయింపబడినచో ఆ సాధకునికి సృష్ట్యాదియందుగల ఆత్మయే బంధువు |
| అనాత్మనః+తు | = | దేహమే తను అని భావించినవానికి ప్రకృతితోగూడిన గుణయుతునకు రాగద్వేష యుతునకు, సంసార తాపత్రయములలో చిక్కుకొన్నవానికి, కర్మఫలితము కోరినవానికి |
| ఆత్మా+ఏవ+శత్రువత్+ శత్రుత్వే+వర్తేత | = | తనకుతానే శత్రువువలె శత్రుత్వమునందు వర్తించును |

**వ్యాఖ్యానము :-** దేహమే నేను అను భావనగలవారు రాక్షసులు. ఈ రాక్షసులు తమ వినాశనమును తామే కొనితెచ్చుకొందురు. భస్మాసురుడు తన చేతిని తన తలపై పెట్టుకొని భస్మము అయినట్లు కథగా వర్ణింపబడినది.

...... ❖ ❖ ❖ ......

సాధనపద్ధతులు ఏవి అయినా ద్వంద్వాతీత స్థితిని పొందవలయును.

ద్వంద్వాతీత లక్షణములు

**జితాత్మనః ప్రశాన్తస్య । పరమాత్మా సమాహితః ।**
**శీతోష్ణ సుఖ దుఃఖేషు । తథా మానావమానయోః ॥ 7**

జితాత్మనః - ప్రశాంతస్య - పరమాత్మా - సమాహితః
శీతోష్ణ సుఖ దుఃఖేషు - తథా - మానావ మానయోః

రజోగుణము అశాంతిని, సత్త్వగుణము శాంతిని గలుగచేయును.

| | | |
|---|---|---|
| శీతోష్ణసుఖదుఃఖేషు | = | చర్మము శీతమును, ఉష్ణమును గ్రహించును. అటులనే మిగిలిన జ్ఞానేంద్రియములు వాటి వాటి యింద్రియార్థములను గ్రహించును. ఆ విధముగా యింద్రియార్థములు మనస్సుచే గ్రహించని వానికి, |

| | | |
|---|---|---|
| | | సుఖ దుఃఖముల యందు విచలితుడు గాక, అవి కాలానుసారము గలుగునని గ్రహించిన వానికి |
| తథా | = | అట్లే |
| మానావ మానయోః | = | గౌరవమందును, అగౌరవమందును విచలితుడు గాని వానికి, అనగా ద్వంద్వాతీతునకు |
| జితాత్మనః | = | జీవాత్మవలన హృదయ గత ఆత్మను జయించిన వానికి, అనగా ఆత్మా నుసంధానము చేసిన వానికి |
| ప్రశాన్తస్య | = | ప్రశాంత చిత్తముగల వానికి అనగా అరిషడ్వర్గములు జయించినవానికి |
| పరమాత్మా+ సమాహితః | = | సృష్టాదియందుగల ఆత్మ చేరువయై యుండును. ఆత్మదర్శనమగును. ఇతడే యోగారూఢుడు. |

...... ❖ ❖ ❖ ......

కూటస్థుడు

**జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా । కూటస్థో విజితేన్ద్రియః ।**
**యుక్త ఇత్యుచ్యతే యోగీ । సమలోష్టాశ్మ కాంచనః ॥ 8**

జ్ఞాన – విజ్ఞాన – తృప్త – ఆత్మా – కూటస్థః – విజితేన్ద్రియః
యుక్తః – ఇతి – ఉచ్యతే – యోగీ – సమ – లోష్ట – అశ్మ – కాంచనః

సమలోష్ట అశ్మకాంచనః అనగా :

| | | |
|---|---|---|
| అశ్మ+లోష్ట+కాంచనః+ సమ | = | రాయి, మట్టిగడ్డ బంగారములయందు సమదృష్టిగలవాడును. |
| జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా | = | జ్ఞానము, విజ్ఞానములచే గూడి, సర్వ కోరికలు నెఱవేఱినవాడును అనగా పూర్ణకాముడును |

| | | |
|---|---|---|
| విజితేన్ద్రియః | = | ఇంద్రియములను జయించినవాడును అనగా కామ క్రోధాది అరిషడ్వర్గములను జయించినవాడును జితేంద్రియుడును |
| యుక్తః+యోగీ | = | యోగయుక్తుడు అయిన యోగి |
| కూటస్థః+ఇతి+ఉచ్యతే | = | (కూటేన నిశ్చలత్వేన తిష్ఠతీతి కూటస్థః) వికారములు లేక నిశ్చలమైయుండువానిని యోగారూఢుడని చెప్పబడును |

అట్టివాడు యోగి అని, కూటస్థుడని చెప్పబడును. దేహి కూటస్థుడయిన క్షేత్రజ్ఞునితో ఏకీభూతుడగును.

...... ❖ ❖ ❖ ......

**సుహృన్మిత్రా ర్యుదాసీన । మధ్యస్థద్వేష్యబంధుషు ।**
**సాధుష్వపి చ పాపేషు । సమబుద్ధిర్విశిష్యతే ॥ 9**

సుహృత్ - మిత్రా - అరి - ఉదాసీన - మధ్యస్థ - ద్వేషి -అబంధుషు
సాధుషు - అపి - చ - పాపేషు - సమబుద్ధిః - విశిష్యతే

| | | |
|---|---|---|
| సుహృత్+మిత్రా+అరి+ ఉదాసీన+మధ్యస్థ+ | = | మంచివారియందు, స్నేహితులయందు, శత్రువుల యందు, ఉదాసీనులయందు, మధ్యస్థులయందు (తటస్థుల యందు) |
| అబంధుషు+పాపేషు+ అపి+ద్వేషి+సాధుషు+ చ+సమబుద్ధిః+ విశిష్యతే | = | బంధువులు కానివారియందు విరోధులయందు, పాపులయందు మఱియు సాధువులయందు సమబుద్ధి గలవాడు మిక్కిలి శ్రేష్ఠుడు. ఇతడు యోగారూఢుడు. |

...... ❖ ❖ ❖ ......

యోగము చేయు విధానము 15వ శ్లోకమువఱకు చెప్పబడుచున్నది.

**యోగీ యుంజీత సతతమ్ । ఆత్మానం రహసిస్థితః ।**
**ఏకాకీ యతచిత్తాత్మా । నిరాశీరపరిగ్రహః ॥ 10**

యోగీ – యుంజీత – సతతమ్ – ఆత్మానమ్ – రహసిస్థితః
ఏకాకీ – యతచిత్తాత్మా – నిరాశీః – అపరి గ్రహః

**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య । స్థిరమాసనమాత్మనః ।**
**నాత్యుచ్ఛ్రితం నాతినీచం । చేలాజినకుశోత్తరమ్ ॥ 11**

శుచౌ – దేశే – ప్రతిష్ఠాప్య – స్థిరమ్ – ఆసనమ్ – ఆత్మనః
న–అతి–ఉచ్ఛ్రితమ్ –న– అతి – నీచమ్ – చేలాజిన కుశఉత్తరమ్

**తత్రైకాగ్రం మనః కృత్వా । యతచిత్తేన్ద్రియక్రియః ।**
**ఉపవిశ్యాసనే యుంజ్యాత్ । యోగమాత్మ విశుద్ధయే ॥ 12**

తత్ర – ఏకాగ్రమ్ – మనః – కృత్వా – యత – చిత్త – ఇన్ద్రియ – క్రియః
ఉపవిశ్య – ఆసనే – యుంజ్యాత్ – యోగమ్ – ఆత్మ – విశుద్ధయే ॥

**సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।**
**సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥ 13**

సమమ్ – కాయ – శిరోగ్రీవమ్ – ధారయన్ – అచలమ్ – స్థిరః
సంప్రేక్ష్య – నాసిక – అగ్రమ్ – స్వమ్ – దిశః – చ – అనవలోకయన్

**ప్రశాన్తాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః ।**
**మనస్సంయమ్య మచ్చిత్తో । యుక్త ఆసీత మత్పరః ॥ 14**

ప్రశాన్త – ఆత్మా – విగతభీః – బ్రహ్మచారి వ్రతే – స్థితః
మనః – సంయమ్య – మత్ – చిత్తః – యుక్తః – ఆసీత – మత్ – పరః

**యుంజన్నేవం సదాత్మానం । యోగీ నియత మానసః ।**
**శాన్తిం నిర్వాణపరమాం । మత్సంస్థామధిగచ్ఛతి ॥ 15**

యుంజన్ - ఏవమ్ - సదా - ఆత్మానమ్ - యోగీ - నియత - మానసః
శాన్తిమ్ - నిర్వాణ-పరమామ్ - మత్ - సంస్థామ్ - అధిగచ్ఛతి.

అపరిగ్రహః+నిరాశీః+ = ఎవరివద్దనుండి ఏదియూ స్వీకరింపక అనగా అపరిగ్రహము పాటించుచూ, హిరణ్యాది దానములు పుచ్చుకొనని స్వతంత్రుడై అశలేనివాడై

యతచిత్తాత్మా = చిత్తమును స్వాధీనపఱచుకొనినవాడు

**ప్రదేశము:**

రహసిస్థితః+ఏకాకీ = ఏకాంత ప్రదేశమున ఉన్నవాడై ఒంటరిగానుండి

సతతమ్ = ఎల్లప్పుడూ రాగ ద్వేష రహితుడై

ఆత్మానమ్+యుంజీత = జీవాత్మను ఆత్మాను సంధానము చేయవలయును.

యోగీ = అట్టి యోగి శ్రేష్ఠుడు

అందఱూ ఒకేచోట కూడి సామూహికముగా యోగముచేయు విధానము లేదు.

ఆత్మ +విశుద్ధయే = ప్రకృతినుండి విడివడుటకు, అనగా జీవాత్మ యందుగల దుర్గుణములు - రాగ ద్వేషములు, అహంకార మమకారములు, అరిషట్వర్గములు, ఈషణత్రయములు తొలగి, శాంతి గలుగుటకు

**యమ - నియమములు:**

బ్రహ్మచారివ్రతే+స్థితః = బ్రహ్మచర్యమునందు ఉన్నట్టివాడై అనగా యమనియమములు పాటించుచూ

**స్థలము:**

| | | |
|---|---|---|
| శుచౌ+దేశే | = | పవిత్ర ప్రదేశమున |
| న+అతి+ఉచ్ఛ్రితమ్ న+అతి+నీచమ్ | = | మిక్కిలి ఎత్తుగాని, మిక్కిలి పల్లముగాని స్థలమున |

**ఆసనము:**

| | | |
|---|---|---|
| చేలాజిన కుశఉత్తరమ్ | = | సమప్రదేశమున మొదట భూమిపై దర్భలు పఱచి, వాటిపై జింక చర్మమును పఱచి, దానిపై శుభ్రమైన వస్త్రమును పఱచి, (ఆసనం మెత్తగా ఉండాలి, యిదే ముఖ్యోద్దేశం జింక చర్మాలు, పులి చర్మాలతో యింతకు మించి ప్రయోజనంలేదు). |
| ఆత్మనః | = | తన యొక్క శరీరమును ఇటు అటు కదల్పక |
| స్థిరమ్+ఆసనమ్+ ప్రతిష్ఠాప్య | = | స్థిరమైన ఆసనమున స్థిరముగా కూర్చొని |
| కాయశిరోగ్రీవమ్+ సమమ్ | = | శరీరమును అనగా వెన్నెముక, శిరస్సు, మెడ, వీటిని సమముగా |
| అచలమ్+స్థిరః | = | నిటారుగా ఉంచి అటు యిటు కదలక, స్థిరముగా ఆసనముపై కూర్చుండి |

**దృష్టి :**

| | | |
|---|---|---|
| దిశః+అనవలోకయన్ | = | అటు యిటు దిక్కులను చూడక |
| స్వమ్+నాసిక అగ్రమ్+ సంప్రేక్ష్య | = | తనయొక్క ముక్కు కొనను చూచుచూ |
| చ | = | మఱియు నిశ్శబ్ద వాతావరణములో ఓంకారమును జపించుచూ |
| ధారయన్ | = | మనస్సులోని వికల్పములను బుద్ధిచే మరలించుచూ, మనోబుద్ధులను ఆత్మయందు కేంద్రీకృతము చేయుచూ |

| | | |
|---|---|---|
| తత్ర+ఆసనే+ఉపవిశ్య | = | ఆ విధముగా సుఖాసనము నందు కూర్చుండి |
| యోగమ్+యుంజ్యాత్ | = | యోగమును అభ్యసింపవలయును. |

ఇందు ప్రదేశము, స్థలము, ఆసనము చెప్పబడినది. ఇవి యోగ ప్రారంభంలో అవసరము. ఆ తర్వాత వీటికి ప్రాధాన్యత లేదు.

**ప్రత్యాహారము:** ఇన్ద్రియములు, చిత్తము, మనస్సు.

| | | |
|---|---|---|
| యత+ఇన్ద్రియ+చిత్త+ క్రియః | = | జ్ఞానేంద్రియములను ఇంద్రియార్థములపై ప్రసరించకుండా చేసి, చిత్తవృత్తులను నియమించి |
| మనః+ఏకాగ్రమ్+కృత్వా | = | మనస్సును చలించకుండా నిశ్చలముగా ఏకాగ్రముగా చేసి |

**ధ్యానము:**

**చిత్తము:**

| | | |
|---|---|---|
| మచ్చిత్తః | = | నా యందు చిత్తమును ఉంచి అనగా ఇతర విషయముల గుఱించి ఆలోచింపక వికల్పములు లేక |

**మనస్సు:**

| | | |
|---|---|---|
| మనః+సంయమ్య | = | మనస్సును నిశ్చలము చేసి |
| ప్రశాంతాత్మా | = | మనస్సును ప్రశాంతముగా ఉంచుకొని |
| విగతభీః | = | భయమును వీడి |

**బుద్ధి:**

| | | |
|---|---|---|
| మత్+పరః+యుక్తః | = | బుద్ధిని నా యందు ఉంచి |
| ఆసీత | = | యోగములో ఉండవలయును. |
| ఏవమ్ | = | ఈ విధముగా |
| నియత+మానసః+యోగీ | = | నియత మానసుడైన అనగా యోగమును చేయుచున్న యోగికి |

**ధారణ:**

| | | |
|---|---|---|
| సదా+ఆత్మానమ్ | = | నిరంతరము తనను |
| మత్ + సంస్థామ్ | = | నా యందు ప్రయత్నపూర్వకముగా |
| యుంజన్ | = | ఉంచుచూ సాధనచేసి, పరమాత్మతో అను సంధానము చేయుచూ |

**సమాధి:**

| | | |
|---|---|---|
| నిర్వాణ+పరమామ్+ శాన్తిమ్+అధిగచ్ఛతి | = | పరమశాంతిని పొంది అనగా బ్రహ్మర్షియై దేహత్యాగానంతరము ఆత్మ స్థానమును పొందును |

**వ్యాఖ్యానము :-** పుణ్యనదీ తీరమున, పుణ్య ప్రదేశమున అనగా గురువుల ఆశ్రమమున, ఋషుల ఆశ్రమమున, తన ఇంటిలో ఒక గదిలో యోగమును అభ్యసించవలయును. రామాయణములో శరభంగ మహర్షి ఆశ్రమమున, సుతీక్షణ ఆశ్రమమున, అగస్త్యుని ఆశ్రమమున, వసిష్ఠముని ఆశ్రమమున, విశ్వామిత్ర మహర్షి ఆశ్రమమున అనేకమంది యోగమును చేయుచున్నట్లు వర్ణింపబడినది.

అనగా యోగము చేయునప్పుడు ప్రారంభములో శరీరములో అనేక మార్పులు గలుగును. నోటిపూత వచ్చును, కండ్లకు అనారోగ్యమువచ్చును, తలనొప్పి వచ్చును, జీర్ణకోశమున మార్పులు కలుగును, కామక్రోధములు విజృంభించును. అవి కాలక్రమమున తొలగిపోయి, ఆరోగ్యము కుదుటపడును. కుండలినీ శక్తి విజృంభించు నప్పుడు కొన్ని సమస్యలు కలుగును. అందువలన భయపడ రాదు.

కామ క్రోధములు విజృంభించును, అహంకారము ఎక్కువగును, అశాంతి ఎక్కువగును. ఈ యోగములో గలుగు అనుభవములను రామాయణములో విశ్వామిత్రుని పరముగా శతానందుడు చెప్పినాడు.

...... ❖ ❖ ❖ ......

ఎవరికి యోగం వచ్చును, ఎవరికి రాదు అనే విషయమును చెప్పుచున్నాడు.

**నాత్యశ్నతస్తు యోగోఽస్తి । న చైకాన్త మనశ్నతః ।**
**న చాతి స్వప్నశీలస్య । జాగ్రతో నైవ చార్జున ॥ 16**

న – అతి – అశ్నతః – తు – యోగః – అస్తి –న–చ– ఏకాన్తమ్ – అనశ్నతః
న – చ – అతి – స్వప్నశీలస్య – జాగ్రతః – న – ఏవ – చ – అర్జున

**యుక్తాహార విహారస్య । యుక్తచేష్టస్య కర్మసు ।**
**యుక్త స్వప్నావ బోధస్య । యోగో భవతి ధుఃఖహా ॥ 17**

యుక్త ఆహార విహారస్య – యుక్తచేష్టస్య – కర్మసు
యుక్త స్వప్న అవ బోధస్య – యోగః – భవతి – ధుఃఖహా

| | | |
|---|---|---|
| అర్జున | = | ఓ అర్జునా! ప్రారంభములో |
| యోగః | = | యోగము |
| ఏకాన్తమ్ | = | ఒంటరిగా ఉండి సాధన చేయవలయును |

**ఆహారము:**

| | | |
|---|---|---|
| అతి+అశ్నతః+న+ఆస్తి | = | అతిగా భుజించిన వానికి యోగము రాదు. |
| చ | = | మఱియు |
| అనశ్నతః | = | పూర్తిగా ఉపవాసము ఉండు వానికి యోగము కలుగ నేరదు. |

**నిద్ర:**

| | | |
|---|---|---|
| జాగ్రతః+న+చ | = | రాత్రి నిద్రపోకుండా జాగరణ చేయువానికి యోగము రాదు మఱియు |
| అతి+స్వప్నశీలస్య+ఏవ+ న+చ | = | మొద్దునిద్రపోవు వానికి యోగము రాదు మఱియు |

| | | |
|---|---|---|
| న+తు | = | లోకవ్యవహారములందు మునిగి తేలుతూ ఉండువానికి, సంసార తాపత్రయములలో జీవితము గడుపువానికి బ్రహ్మచర్యమునందు ఎక్కువ కాలము గడుపు వానికి యోగము రాదు. |

ఎవరికి యోగము వచ్చునో చెప్పుచున్నాడు.

| | | |
|---|---|---|
| యుక్త ఆహార విహారస్య | = | దేహ పోషణకు తగినంత బలమైన ఆహారము తీసుకొని సంచరించువానికి |
| కర్మసు+యుక్తచేష్టస్య | = | సంసారము, వృత్తి వ్యాపారములందు తామరాకుపై నీటిబొట్టువలె ఉందువానికి |
| యుక్త స్వప్నావ బోధస్య | = | మితమైన నిద్ర, మితమైన జాగరణగల వానికి |
| దుఃఖహా | = | దుఃఖమును పోగొట్టి శాంతిని గలుగచేయునదగు |
| యోగః+భవతి | = | యోగము వచ్చును |

**వ్యాఖ్యానము:-** ఆహార, నిద్ర, మైధునములలో గడుపువానికి యోగము రాదు. గృహస్థుడుగా ఉండి యుక్తా ఆహార విహారస్యుడైన వానికి యోగము వచ్చును. దీనికి ఉదాహరణగా వసిష్ఠ, విశ్వామిత్రాదులు చెప్పబడిరి. వసిష్ఠ మహర్షికి 100 పుత్రులు. విశ్వామిత్రుడు పుష్కరతీరమున తపస్సుచేయుచూ నలుగురు పుత్రులను కనెను. ఋషులందఱూ భార్యా పిల్లలతో ఉన్న సంసారులు ఆత్మదర్శనం చేసినవారు. వీరందఋ భార్య, పిల్లలతో ఉన్నారు. నిత్య బ్రహ్మచారికి యోగము రాదు. హనుమంతుని పేరున చెప్పబడు కథ ఒక యోగ రహస్యము. ఆ యోగ రహస్యము తెలియకుండా, సామాన్య కథగా దానిని వ్యాఖ్యానించరాదు. ఇది జ్ఞప్తియందుంచుకొని వారి కథలను చదివిన యోగము గుఱించి తెలియును.

యోగి ఆ తర్వాత సాత్వికాహారము, ఆ తర్వాత కందమూలములు తీసుకొనును. సవికల్ప సమాధిలో యోగి ఉన్నాడని చెప్పుటకు, **జలభక్షణ** చేసినట్లు వర్ణింతురు. నిశ్చల సమాధిలో యోగి ఉన్నాడని చెప్పుటకు **వాయుభక్షణ** చేసినట్లు వర్ణింతురు. శారీరక స్థితి ననుసరించి, సంసార జీవితము బ్రహ్మచర్యము పాటించవలయును. ఆవిధముగా ఆహార విహారములు గల వానికి యోగము వచ్చును.

...... ❖ ❖ ❖ ......

యోగయుక్తుడు

**యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే ।**

**నిస్స్పృహః సర్వకామేభ్యో । యుక్త ఇత్యుచ్యతే తదా ॥ 18**

యదా - వినియతమ్ - చిత్తమ్ - ఆత్మని - ఏవ - అవతిష్ఠతే

నిఃస్పృహః - సర్వకామేభ్యః - యుక్తః - ఇతి - ఉచ్యతే - తదా

**యథా దీపో నివాతస్థో । నేఙ్గతే సోపమా స్మృతా ।**

**యోగినో యతచిత్తస్య । యుఞ్జతో యోగమాత్మనః ॥ 19**

యథా - దీపః - నివాతస్థః - న - ఇంగతే - సా - ఉపమా - స్మృతా

యోగినః - యత - చిత్తస్య - యుంజతః - యోగమ్ - ఆత్మనః

యదా+చిత్తమ్ = ఎప్పుడు చిత్తము
సర్వకామేభ్యః+ = సమస్తమైన కోరికలనుండి అనగా ఇహలోక
నిఃస్పృహః పరలోక భోగములనుండి నిఃస్పృహ కలిగి
వినియతమ్ = బాగుగా నిగ్రహింపబడినదైన మనస్సు బుద్ధితో
సంయోగము చెంది దేహి
ఆత్మని+ఏవ+అవతిష్ఠతే = హృదయగుహలోగల ఆత్మయందే ఉండునో
తదా+యుక్తః+ఇతి+ = అప్పుడు అతడు యోగయుక్తుడని
ఉచ్యతే చెప్పబడుచున్నాడు

నిశ్చలసమాధిలో ఉన్నవాడు యోగి అని చెప్పబడును.

నివాతస్థః+దీపః+ = గాలిలేనిచోట దీపము ఏ విధముగా
యథా+న+ఇంగతే చలింపక నిశ్చలముగా వెలుగుచూ ఉండునో
సా+ఉపమా = అట్టి దృష్టాంతము
యోగమ్+యుంజతః = యోగమును అనుష్ఠించుచున్న
యోగినః+ఆత్మనః+ = యోగి యొక్క చిత్తము నిగ్రహింపబడి
ఉండవలయును.
యత+చిత్తస్య+స్మృతా అని చెప్పబడుచున్నది.

...... ❖ ❖ ❖ ......

యోగప్రశంస చేయబడుచున్నది

**యత్రోపరమతే చిత్తం । నిరుద్ధం యోగసేవయా ।**

**యత్ర చైవాత్మనాత్మానం । పశ్యన్నాత్మని తుష్యతి ॥ 20**

యత్ర – ఉపరమతే – చిత్తమ్ – నిరుద్ధమ్ – యోగసేవయా

యత్ర – చ – ఏవ – ఆత్మనా – ఆత్మానమ్ – పశ్యన్–ఆత్మని–తుష్యతి

**సుఖమాత్యన్తికం యత్త । ద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్ ।**

**వేత్తి యత్ర న చైవాయం । స్థితశ్చలతి తత్త్వతః ॥ 21**

సుఖమ్ – ఆత్యన్తికమ్ – యత్ – తత్ – బుద్ధి గ్రాహ్యమ్ – అతీంద్రియమ్

వేత్తి – యత్ర – న – చ – ఏవ – అయమ్ – స్థితః – చలతి – తత్త్వతః

**యం లబ్ధ్వా చాపరం లాభం । మన్యతే నాధికం తతః ।**

**యస్మిన్ స్థితో న దుఃఖేన । గురుణాపి విచాల్యతే ॥ 22**

యమ్ – లబ్ధ్వా –చ– అపరమ్ – లాభమ్ – మన్యతే –న– అధికమ్ – తతః

యస్మిన్ – స్థితః –న–దుఃఖేన– గురుణా– అపి –విచాల్యతే.

**తం విద్యాద్దుఃఖ సంయోగ । వియోగం యోగసంజ్ఞితమ్ ।**

**స నిశ్చయేన యోక్తవ్యో । యోగోఽనిర్విణ్ణచేతసా ॥ 23**

తమ్ – విద్యాత్ – దుఃఖ సంయోగ వియోగమ్ – యోగ సంజ్ఞితమ్

సః – నిశ్చయేన – యోక్తవ్యః – యోగః – అనిర్విణ్ణ – చేతసా

**సంకల్ప ప్రభవాన్ కామాం । స్త్యక్త్వా సర్వానశేషతః ।**

**మనసైనేన్ద్రియగ్రామం । వినియమ్య సమన్తతః ॥ 24**

సంకల్ప ప్రభవాన్ – కామాన్ – త్యక్త్వా – సర్వాన్ – అశేషతః

మనసా – ఏవ – ఇన్ద్రియగ్రామమ్ – వినియమ్య – సమన్తతః

| | | |
|---|---|---|
| యోగసేవయా+చిత్తమ్+ నిరుద్ధమ్+ఉపరమతే | = | యోగాభ్యాసముచేత చిత్తచాంచల్యము అరికట్టబడినదై జీవుడు ఉపరతిని పొందుచున్నాడు |
| చ+యత్ర+యత్ర+ ఆత్మనా+ఆత్మని+ఏవ+ ఆత్మానమ్+పశ్యన్+ తుష్యతి | = | మఱియు ఎప్పుడెప్పుడు జీవాత్మచేత హృదయగుహలోగల ఆత్మయందే ఆత్మయొక్క ప్రకాశమును చూచుచు ఆనందము పొందునో, అప్పుడు అతడు యోగారూఢుడు అని చెప్పబడును. |
| యత్+అతీంద్రియమ్ | = | ఏది ఇంద్రియములచే గ్రహింపలేమో |
| బుద్ధి గ్రాహ్యమ్+తత్ | = | బుద్ధిచే జీవుడు మాత్రమే గ్రహింపగలడో దానిని – ఆత్మను |
| ఆత్యన్తికమ్+సుఖమ్+ వేత్తి | = | అనంతమయిన సుఖమును దేహి తెలియుచున్నాడో |
| చ | = | మఱియు |
| అయమ్+తత్త్వతః+ ఏవ+యత్ర+స్థితః+ న+చలతి | = | ఈ యోగి తత్త్వరీత్యా ఎక్కడ అనగా ఈ హృదయగుహలో ఉండి సుఖదుఃఖములకు విచలితుడు కాడో అతడు యోగారూఢుడు |
| యమ్+లబ్ధ్వా+తతః+ అపరమ్+లాభమ్+ అధికమ్+న+మన్యతే | = | ఏ లాభమును పొంది అటుపిమ్మట ఇంతకు మించిన లాభము గొప్పది ఏదియూ లేదని తలంచడో అనగా ఆత్మస్థానమును పొందుట అన్నిలాభముల కంటే గొప్ప లాభము అని తలంచునో |
| చ | = | మఱియు |
| యస్మిన్+స్థితః | = | దేనియందు అనగా ఆత్మనందుండి |
| గురుణా | = | గొప్ప ఆనందముచే తన్మయుడై, తన్నుతాను మఱచి దేహ ధ్యాసలేక ఉండునో మఱియు |
| దుఃఖేన + అపి | = | దేహధ్యాసవలన గలుగు దుఃఖము చేత |

| | | |
|---|---|---|
| న+విచాల్యతే | = | విచలితుడుకాడో అతడు యోగారూఢుడు |
| తమ్+దుఃఖ సంయోగ+ వియోగమ్ | = | అట్టి సంయోగమువలన సుఖము, ఆనందము కలుగును. అట్లే వియోగమువలన దుఃఖము గలుగును. సంయోగవియోగములందు ఆనందము, దుఃఖము లేక ఉండుదానిని |
| యోగసంజ్ఞితమ్+ విద్యాత్ | = | యోగము అను పేరుగల దానినిగా ఎఱుగవలయును |
| అనిర్విణ్ణ+చేతసా+ నిశ్చయేన+సః+యోగః యోక్తవ్యః | = | సుఖదుఃఖములు లేని చిత్తముచేత ఆత్మ అనాత్మలను నిశ్చయించి అట్టి ఆత్మానందమును గలుగచేయు యోగము సాధనచేసి, ఆత్మస్థానము పొందదగినది. |
| సంకల్ప+ప్రభవాన్+ సర్వాన్+కామాన్+ఏవ అశేషతః+త్యక్త్వా+ మనసా | = | వికల్పములనుండి జనించిన సర్వకోరికలను నిశ్శేషముగా విడచిపెట్టి మనస్సుచేత |
| ఇంద్రియగ్రామమ్+ సమన్తతః | = | సర్వజ్ఞానేంద్రియముల సమూహమును సంపూర్ణముగా |
| వినియమ్య | = | నియమించి మనస్సంకల్పముచే ఓంకారమును ధ్యానించుచూ మనో బుద్ధులను ఏకము చేయవలయును |

**వ్యాఖ్యానము :-** నిశ్చలసమాధిలో దేహధ్యాసలేక ఉండును. దుఃఖములకు విచలితుడు కాడు. వసుదేవుడు తన ఆఱుగురు కొడుకులు కంసునిచే హతులైనను, విచలితుడు కాలేదు. ఎంతటి యోగి అయినా జాగ్రదావస్థలో దుఃఖమును పొందును. వసిష్ఠులవారు తన పుత్రుని మరణమునకు విచలితుడై ఆత్మహత్యా ప్రయత్నము చేసెను. శ్రీకృష్ణుడు తన కళ్ళముందు కృతవర్మచే సాత్యకి చంపబడగా విచలితుడై కృతవర్మను చంపెను. కావున నిశ్చల సమాధిలో మాత్రమే దుఃఖములకు విచలితుడు కాడని భావించవలెను.

మనస్సులో సంకల్ప వికల్పములుండును. ఈశ్వరుని గురించి ఆలోచించునది సంకల్పము. ఇతర విషయములను గురించి ఆలోచించునది వికల్పము. వికల్పములను సంపూర్ణముగా నశింపచేయవలయును. సర్వత్రా ఆత్మను దర్శించు స్థాయివఱకు సంకల్పమును ఉంచి నిశ్చల సమాధిలో ఆ సంకల్పము గూడా లేకుండా పోవునట్లు చేయవలయును. వీటికి రామాయణములో **సంకల్పమునకు మారీచుడని, వికల్పమునకు సుబాహుడు,** ఇతర రాక్షసులు పేర్కొనబడిరి. రాముడు మొదట సుబాహునుని, ఇతర రాక్షసులను సంహరించినాడు. ఆ తరువాత కొంత కాలమునకు మారీచుని సంహరించినాడు. అనగా సంకల్ప వికల్పములు నశించినవి. దేహధ్యాస పోయినది. ప్రకృతినుండి విడివడెను. దీనినే సీతాపహరణగా చెప్పినారు. ఆ తర్వాత దేహి కూటస్థుడు కావలయును. దీనినే రావణ సంహారముగా చెప్పిరి. ఆ తర్వాత సీత అగ్ని ప్రవేశము, బ్రహ్మాది దేవతల రాక, తత్త్వమసి గురించి బ్రహ్మ రామునికి చెప్పుట, ఆతర్వాత రాముడు దేహ సామ్రాజ్య పట్టాభిషిక్తుడగుటతో రామాయణము ముగిసినది. ఈ విషయమునే ఈ శ్లోకములో చెప్పుచున్నాడు.

నందిగ్రామములో భరతుడు ఉన్నట్లు రామాయణములో చెప్పబడినది. అనగా పశుప్రవృత్తుల సమూహమును నిగ్రహించి ఉన్నాడని అర్థము. **రామపాదుకలు** రామునికి ప్రతినిధులుగా గ్రహించి అనగా ఆత్మకు ప్రతినిధి అయిన **ప్రాణమును** వశీకరించుకొని ఉన్నాడని అర్థము. ఈ ప్రాణమును ఏవిధముగా పని చేయించవలయునో రాబోవు శ్లోకములో చెప్పుచున్నాడు.

...... ❖ ❖ ❖ ......

ప్రాణము - మనస్సు

**శనైః శనైరుపరమేద్బుద్ధ్యా ధృతి గృహీతయా ।**

**ఆత్మసంస్థం మనః కృత్వా । న కించిదపి చిన్తయేత్ ॥ 25**

శనైః - శనైః - ఉపరమేత్ - బుద్ధ్యా - ధృతి - గృహీతయా

ఆత్మసంస్థమ్ - మనః - కృత్వా - న - కించిత్ - అపి - చిన్తయేత్

| | | |
|---|---|---|
| శనైః+శనైః | = | మెల్లమెల్లగా ఒక్కొక్క స్థానమును ప్రాణమును దాటించుచూ |
| ధృతి+గృహీతయా | = | పూనికతో |
| ఉపరమేత్ | = | ఆధారమునుంచి ప్రాణమును బ్రహ్మ రంధ్రమునకు చేర్చవలయును. |

**మనస్సు:**

| | | |
|---|---|---|
| కించిత్+అపి | = | ఇతర విషయములను ఏ కొంచెముకూడా |
| న+చింతయేత్ | = | చింతింపకుండా యుండి |
| మనః | = | మనస్సును నిశ్చలముగా చేసి, |
| బుద్ధ్యా | = | బుద్ధితో కలపి, బుద్ధిని దేహితో కలిపి |
| ఆత్మసంస్థమ్ | = | హృదయ గుహలోగల ఆత్మయందు |
| కృత్వా | = | పొందించి నిశ్చల సమాధిలో ఉండ వలయును. |

**వ్యాఖ్యానము:-** అంఘ్రిమూలమున మూలాధార చక్రంబు పీడించి ప్రాణంబు బిగియబట్టి, నాభితలము చేర్చి అక్కడనుంచి హృత్సరోజము మీదికి, ఆపై కంఠస్థానము, ఆపై తాలు మూలమునకు ఆ తర్వాత భ్రూయుగ మధ్యంబు, ఆతర్వాత బ్రహ్మ రంధ్రమునకు ప్రాణమును చేర్చవలయును. దీనినే ఇట్లు చెప్పుచున్నాడు.

భద్రాసనస్థుడై, ప్రాణమును పూర్ణకుంభకములో ఉంచి, వికల్పములను బుద్ధిచే అరికట్టి, మనస్సును నిశ్చలము ఒనరించి, జీవాత్మను హృదయగత ఆత్మతో చేర్చి, నిశ్చల సమాధి స్థితిని పొంది, గుణరహితుడై, శాంతత్త్వము గలిగి, నిత్య సుఖమును పొందును.

...... ❖ ❖ ❖ ......

ధ్యానయోగము - మనస్సు

**యతో యతో నిశ్చరతి । మనశ్చఞ్చల మస్థిరమ్ ।**
**తతస్తతో నియమ్యై తత్ । ఆత్మన్యేవ వశం నయేత్ ॥ 26**

యతః - యతః - నిశ్చరతి - మనః - చంచలమ్ - అస్థిరమ్
తతః - తతః - నియమ్య - ఏతత్ - ఆత్మని - ఏవ - వశమ్ - నయేత్

యోగములో ముఖ్యమైనది, కష్టమయినది యిదే.

| | | |
|---|---|---|
| చంచలమ్+అస్థిరమ్+ | = | చంచలము, అస్థిరము అగు మనస్సు |
| మనః+యతః+యతః+ | | ఎక్కడెక్కడ అనగా ఏయే విషయములందు |
| నిశ్చరతి | | చరించుచున్నదో గమనించి |
| తతః+తతః+ఏతత్+ | = | ఆయా విషయముల నుండి అనగా ఆలోచనల |
| వశమ్+నియమ్య | | నుండి మరలించి ఈ మనస్సును తన ఆధీనములో ఉంచి మనోబుద్ధులను నియమించి, |
| ఆత్మని+ఏవ | = | హృదయగత ఆత్మయందే దేహిని |
| నయేత్ | = | పొందింపవలయును |

...... ❖ ❖ ❖ ......

పరమసౌఖ్యమును, సుఖమును పొందుచున్నాడు

**ప్రశాన్త మనసం హ్యేనం । యోగినం సుఖముత్తమమ్ ।**
**ఉపైతి శాన్త రజసం । బ్రహ్మభూతమకల్మషమ్ ॥ 27**

ప్రశాన్తమనసమ్- హి - ఏనమ్ - యోగినమ్ - సుఖమ్ - ఉత్తమమ్
ఉపైతి - శాన్తరజసమ్ - బ్రహ్మభూతమ్ - అకల్మషమ్ ॥

**యుంజన్నేవం సదాత్మానం । యోగీ విగతకల్మషః ।**
**సుఖేన బ్రహ్మ సంస్పర్శ । మత్యన్తం సుఖమశ్నుతే ॥ 28**

యుంజన్ - ఏవమ్ - సదా - ఆత్మానమ్ - యోగీ - విగతకల్మషః
సుఖేన - బ్రహ్మ సంస్పర్శమ్ - అత్యన్తమ్ - సుఖమ్ - అశ్నుతే

హి+అకల్మషమ్+ = తామరాకుపై నీటిబొట్టువలె సంసారంలో
శాన్తరజసమ్+ ఉన్నవాడును, కర్మబంధ రహితుడును, పాప
ప్రశాంతమనసమ్+ రహితుడును సత్త్వగుణాశ్రయుడై, శాంతత్త్వము
బ్రహ్మభూతమ్+ గలవాడును. ప్రశాంత మనస్కుడును
ఏనమ్+యోగినమ్+ బ్రహ్మీస్థితియందు ఉన్నవాడును అగు ఈ యోగి
ఉత్తమమ్+సుఖమ్+ పరమ సౌఖ్యమును బ్రహ్మానందమును పొందును
ఉపైతి

విగతకల్మషః+యోగీ = మనో మాలిన్యములు పోయినవాడు అయిన యోగి
ఏవమ్+ ఆత్మానమ్+ = ఈవిధముగా జీవాత్మను ఎల్లప్పుడు
సదా+యుంజన్ హృదయగత ఆత్మయందు ఉంచుచూ

సుఖేన+ = సుఖాను భూతిచే ఆత్మానుసంధానము
బ్రహ్మసంస్పర్శమ్+ నిచ్చునదియు పరమసౌఖ్యము అయినదియూ
అత్యంతమ్+సుఖమ్ అయిన సుఖమును పొందుచున్నాడు.
అశ్నుతే

...... ❖ ❖ ❖ ......

యోగారూఢుడు

**సర్వ భూతస్థమాత్మానం । సర్వభూతాని చాత్మని ।**
**ఈక్షతే యోగయుక్తాత్మా । సర్వత్ర సమదర్శనః ॥ 29**

సర్వ భూతస్థమ్ - ఆత్మానమ్ - సర్వభూతాని - చ - ఆత్మని
ఈక్షతే - యోగయుక్తాత్మా - సర్వత్ర - సమదర్శనః

**యో మాం పశ్యతి సర్వత్ర । సర్వం చ మయి పశ్యతి ।**
**తస్యాహం న ప్రణశ్యామి । న చ మే న ప్రణశ్యతి ॥ 30**

యః – మామ్ – పశ్యతి – సర్వత్ర – సర్వమ్ – చ – మయి – పశ్యతి
తస్య – అహమ్ – న – ప్రణశ్యామి – సః – చ – మే – న – ప్రణశ్యతి

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయివర్తతే ॥ 31**

సర్వభూతస్థితమ్ – యః – మామ్ – భజతి – ఏకత్వమ్ – ఆస్థితః
సర్వథా – వర్తమానః – అపి – సః – యోగీ – మయి – వర్తతే

**ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతియోఽర్జున ।**
**సుఖం వా యది వాదుఃఖం స యోగీ పరమో మతః ॥ 32**

ఆత్మౌపమ్యేన –సర్వత్ర –సమమ్ –పశ్యతి–యః –అర్జున
సుఖమ్–వా–యది– వా–దుఃఖమ్ –సః – యోగీ –పరమః –మతః

| | | |
|---|---|---|
| యోగయుక్తాత్మా+ | = | యోగ యుక్తుడైన యోగి,అనగా యోగారూఢుడు, |
| సర్వత్ర+సమదర్శనః+ | | సర్వత్ర సమదర్శనుడై అనగా భేదదృష్టి లేనివాడై |
| ఆత్మానమ్+ | | తనలోగల ఆత్మను సర్వప్రాణుల |
| సర్వభూతస్థమ్+చ | | హృదయ గుహయందునూ, మఱియు |
| సర్వభూతాని+ఆత్మని+ | | సర్వభూతములను ఆత్మయందు, అనగా |
| ఈక్షతే | | విరాట్ పురుషునియందు చూచును. |
| యః+సర్వత్ర+మామ్+ | = | ఎవడు సర్వత్రా నన్ను చూచునో |
| పశ్యతి+చ+సర్వమ్+ | | మఱియు ఎవడు సర్వము నా యందు చూచునో |
| మయి+పశ్యతి | | |
| తస్య | = | అట్టివానికి |

| | | |
|---|---|---|
| అహమ్+న +ప్రణశ్యామి | = | నేను కనబడకపోను. అనగా ఆత్మ కనిపించును |
| చ | = | మఱియు |
| సః+మే+న+ప్రణశ్యతి | = | అతడు నాకు కనబడకపోడు. అతడు బ్రహ్మత్వమును పొందును. అనగా అతడు నేను పరస్పరం దర్శించు కొనుచున్నాము. |
| యః+సర్వభూతస్థితమ్+ మామ్+ఏకత్వమ్+ ఆస్థితః+మామ్+భజతి | = | ఎవడు సర్వభూతములయందున్న నన్ను అభేదదృష్టి గలిగి అనగా ఆత్మరూపమున నున్న నన్ను (ఆత్మను) భజించునో అనగా దర్శించునో |
| సః+యోగీ+సర్వథా+ వర్తమానః+అపి+ మయి+వర్తతే | = | అట్టియోగి సంసారమందుండి కూడ నా యందు ఉన్నవాడు అగుచున్నాడు. అనగా బ్రహ్మయగుచున్నాడు. |
| అర్జున | = | ఓ అర్జునా! |
| యః | = | ఎవడు |
| సుఖమ్+వా+యది+వా+ దుఃఖమ్+సమమ్+పశ్యతి | = | కాలక్రమమున పూర్వజన్మ కర్మానుసారము ఒకవేళ సుఖముగాని లేక దుఃఖముగాని గలిగినను ఆ సుఖదుఃఖములు రెండింటిని (ఆనందించక, దుః ఖించక) సమానముగా చూచునో |
| సర్వత్ర+ఆత్మౌపమ్యేన | = | ఎవడు సర్వత్ర నన్ను చూచునో జీవాత్మ, పరమాత్మలను సమ్యక్ జ్ఞానముచే అనగా తనవలెనే ఏకత్వమున దర్శించునో |
| సః+యోగీ+పరమః+ మతః | = | అట్టివాడు శ్రేష్ఠుడని నా అభిప్రాయము. ఇతడు యోగారూఢుడు. |

**వ్యాఖ్యానము:-** సర్వత్రా ఆత్మను చూచువాడు యోగారూఢుడు. ఉదా: ప్రహ్లాదుడు.

**“తనయందు నఖిలభూతములందు నొక భంగి సమహి తత్త్వంబున బరగువాఁడు”** – (భాగవతం – సప్తమస్కంధం–115)

జడభరతుడు – జడభరతుని బలి యిచ్చుటకు కాళికాలయమునకు ఆటవికులు తీసుకొని వెళ్ళినారు. అంత

**"అచ్చట విప్రసూనుఁడు భయంబొక యించుక లేక చంపఁగా వచ్చిన వారియందుఁ గరవాలమునందును గాళియందుఁ దానచ్యుత భావముంచి"–** ఉండెను.

(భాగవతము పంచమ స్కంధము-137)

...... ❖ ❖ ❖ ......

మనస్సును నిగ్రహించుట ఎట్లు?

అర్జున ఉవాచ

**యోఽయం యోగస్త్వయా ప్రోక్త స్సామ్యేన మధుసూదన ।**

**ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితాం స్థిరామ్ ॥ 33**

యః – అయమ్ – యోగః – త్వయా – ప్రోక్తః – సామ్యేన – మధుసూదన

ఏతస్య – అహమ్ – న – పశ్యామి – చంచలత్వాత్ – స్థితామ్ – స్థిరామ్

**చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్ధృఢమ్ ।**

**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥ 34**

చంచలమ్– హి– మనః –కృష్ణ –ప్రమాథి– బలవత్ – దృఢమ్

తస్య –అహమ్–నిగ్రహమ్ –మన్యే– వాయుః –ఇవ –సుదుష్కరమ్

మధుసూదన = ఓ శ్రీకృష్ణా!

త్వయా+సామ్యేన+ = నీచేత మనస్సుయొక్క సమత్వముచే సిద్ధింపదగిన

యః = ఏ

అయమ్+యోగః+ప్రోక్తః = ఈ యోగము చెప్పబడెనో అది అనగా మనస్సు

చంచలత్వాత్ = చంచలమగుటవలన

| | | |
|---|---|---|
| ఏతస్య+ | = | ఈ మనస్సుకు స్థిరత్వ స్థితిని |
| స్థిరామ్+స్థితామ్ | | |
| అహమ్+న+పశ్యామి | = | నేను కనుగొనలేక ఉన్నాను. అనగా మనస్సు చంచలము గదా దానిని నిగ్రహించుట ఎట్లు? |
| కృష్ణ | = | ఓ శ్రీకృష్ణా! |
| వాయుః+ఇవ | = | వాయువువలె |
| మనః+చంచలమ్ | = | మనస్సు చంచలము. ఒకచోట స్థిరముగా ఉండదు. |
| బలవత్ | = | వాయువువలె బలవంతమైనది |
| దృఢమ్ | = | దృఢమైనది, నిగ్రహించుట కూడ కష్టము |
| ప్రమాథి | = | ఇంద్రియములతో కూడ విషయవాసనలవైపు పరుగెత్తి ప్రమాదమును గలుగచేయునది. ఇంద్రియముల కంటె దృఢమైనది |
| హి | = | నిగ్రహింపరానిది |
| తస్య | = | అట్టి మనస్సును |
| నిగ్రహమ్ | = | నిగ్రహించుట |
| సుదుష్కరమ్+అహమ్+ మన్యే | = | మిగుల కష్టసాధ్యమైనదని నేను తలంచుచున్నాను. |

...... ❖ ❖ ❖ ......

శ్రీ భగవానువాచ

**అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।**
**అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥ 35**

అసంశయమ్ – మహాబాహో – మనః – దుర్నిగ్రహమ్ –చలమ్
అభ్యాసేన – తు – కౌన్తేయ – వైరాగ్యేణ – చ – గృహ్యతే

**అసంయతాత్మనా యోగో । దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా । శక్యోఽవాప్తు ముపాయతః ॥ 36**

అసంయతాత్మనా - యోగః - దుష్ప్రాపః - ఇతి - మే- మతిః
వశ్యాత్మనా - తు - యతతా - శక్యః - అవాప్తుమ్ - ఉపాయతః

| | | |
|---|---|---|
| మహాబాహో | = | ఓ అర్జునా! |
| మనః+చలమ్ | = | మనస్సు చలించు స్వభావము కలది |
| దుర్నిగ్రహమ్ | = | నిగ్రహించుట కష్టము. ఇందు ఏమాత్రము |
| అసంశయమ్ | = | సందేహములేదు. |
| అభ్యాసేన+వైరాగ్యేణ+ తు+చ | = | అభ్యాసముచేత, వైరాగ్యముచేత మఱియు ధృఢ సంకల్పముచేత, ప్రయత్న పూర్వకముగా, బుద్ధిచేత మానస వేగంబు బుద్ధిచే బంధించి, దేహిచేత |
| గృహ్యతే | = | మనస్సు సాధకునిచే నిగ్రహింపబడుచున్నది. అనగా బుద్ధిచే నిగ్రహింపబడుచున్నది. |
| కౌన్తేయ | = | ఓ అర్జునా! |
| అసంయాతాత్మనా | = | పూనికతో మనస్సు నిగ్రహింపని వానిచేత |
| తు | = | బుద్ధితో మనస్సును ఏకీభూతముచేయని వాని చేత |
| యోగః+దుష్ప్రాపః+ ఇతి+మే+మతిః | = | యోగము పొంద శక్యము కానిది అని నా యొక్క అభిప్రాయము |
| ఉపాయతః+యతతా | = | ఏదో ఒక ఉపాయమువలన నిరంతర ప్రయత్నము చేయుటచేత |
| వశ్యాత్మనా+అవాప్తుమ్ శక్యః | = | స్వాధీనమయిన మనస్సుచేత యోగము (ఆత్మను) పొందుట శక్యమైనది అని నా అభిప్రాయము |

...... ❖ ❖ ❖ ......

అర్జున ఉవాచ

యోగభ్రష్టుని గతి ఏమి?

**అయతిః శ్రద్ధయోపేతో । యోగాచ్చలితమానసః ।**

**అప్రాప్య యోగ సంసిద్ధిం । కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥ 37**

అయతిః - శ్రద్ధయా - ఉపేతః - యోగాత్ - చలితమానసః

అప్రాప్య - యోగసంసిద్ధిమ్ - కామ్ - గతిమ్ - కృష్ణ - గచ్ఛతి

**కచ్చిన్నో భయవిభ్రష్టః । చిన్నాభ్రమివ నశ్యతి ।**

**అప్రతిష్ఠో మహాబాహో । విమూఢో బ్రహ్మణః పథి ॥ 38**

కచ్చిత్ - న - ఉభయ విభ్రష్టః - ఛిన్నఅభ్రమ్ - ఇవ - నశ్యతి

అప్రతిష్ఠః - మహాబాహో - విమూఢః - బ్రహ్మణః - పథి

**ఏతన్మే సంశయం కృష్ణ । ఛేత్తుమర్హస్యశేషతః ।**

**త్వదన్యః సుశయస్యాస్య । ఛేత్తా న హ్యుప పద్యతే ॥ 39**

ఏతత్ - మే - సంశయమ్- కృష్ణ - ఛేత్తుమ్ - అర్హసి - అశేషతః

త్వదన్యః- సంశయస్య - అస్య - ఛేత్తా - న - హి - ఉపపద్యతే

| | | |
|---|---|---|
| కృష్ణ | = | ఓ శ్రీకృష్ణా! |
| యోగాత్+చలితమానసః | = | యోగమునుండి చలింపబడిన మనస్సు |
| అయతిః+ | | గలవాడును ఇంద్రియనిగ్రహము లేనివాడు అయిన సాధకుడు |
| యోగసంసిద్ధిమ్+ అప్రాప్య+కామ్ | = | యోగసిద్ధిని పొందక యోగభ్రష్టుడైనవాడు |
| గతిమ్+గచ్ఛతి | = | ఏ గతిని పొందుచున్నాడు అనగా యోగభ్రష్టుని గతి ఏమి? |

| | | |
|---|---|---|
| శ్రద్ధయా+ఉపేతః | = | శ్రద్ధతో యోగము చేసి, ఇంద్రియసంగమముతో కూడినవాడు ఏ గతిని పొందును? |

**ఒకడు యోగభ్రష్టుడు ఇతని గతి ఏమి? రెండవవాడు-దేహ త్యాగకాలమున ఇంద్రియంబులతోడి సంగమంబు విడువనివాని గతి ఏమి?**

| | | |
|---|---|---|
| మహాబాహో | = | ఓ శ్రీకృష్ణా! |
| కచ్చిత్+విమూఢః+ అప్రతిష్ఠః+బ్రహ్మణః+ పథి+ఛిన్న అభ్రమ్+ఇవ ఉభయవిభ్రష్టః+ న+నశ్యతి | = | ఒకానొకడు అజ్ఞాని అప్రతిష్ఠుడై అనగా యోగభ్రష్టుడై ఆత్మస్థాన మార్గమున ఆత్మస్థానము చేరలేక చెదరిన మేఘమువలె వ్యర్థుడై ఉభయభ్రష్టుడై నశించిపోడు కదా! |
| కృష్ణ | = | ఓ శ్రీకృష్ణా! |
| మే+ఏతత్+సంశయమ్ | = | నాకు ఈ సంశయమును |
| అశేషతః+ఛేత్తుమ్+అర్హసి | = | నిశ్శేషముగా తొలగించుటకు తగుదువు |
| హి+అస్య+సంశయస్య+ ఛేత్తా | = | ఏలననగా ఈ సంశయమును తొలగింపతగినవాడు |
| త్వదన్యః+న+ఉపపద్యతే | = | నీకంటే ఇంకొకడు లభింపడు. |

**వ్యాఖ్యానము :-** ఆత్మస్థానమును పొందని యోగములో భ్రష్టత్వము అంతరాయము అని రెండు విధములు గలవు. వీరి గతి ఏమిటి? యోగములో పరిపూర్ణత పొందిన వాడు, ఆత్మస్థానమును చేరును. అలా కానిచో, దేహత్యాగ కాలమున, ఇంద్రియముల తోడి సంగమము విడువనివాడు మహర్లోకముచేరి, ఆ పై, లయకాలమున బ్రహ్మతో కలసి, బ్రహ్మతో సహా ఆత్మను చేరుకొనును. ఇది క్రమ ముక్తి. ఇతడు భూలోకమున జన్మింపడు. ధ్రువస్థానమును పొందును. ఉదా: ధ్రువుడు. యోగభ్రష్టుడు తిరిగి జన్మించును.

మఱు జన్మలో సాధన పూర్తిచేయును. యోగములో అంతరాయములు కలిగినచో వాటిని కాలక్రమములో అధిగమించి, చివరకు బ్రహ్మత్వమును పొందును. **ఉదా:** విశ్వామిత్రుడు.

...... ❖ ❖ ❖ ......

శ్రీ భగవానువాచ

**పార్థనైవేహ నాముత్ర । వినాశస్తస్య విద్యతే ।**
**న హి కల్యాణ కృత్ కశ్చిత్ । దుర్గతిం తాత గచ్ఛతి ॥ 40**

పార్థ – న – ఏవ– ఇహ – న – అముత్ర – వినాశః – తస్య – విద్యతే
న – హి – కల్యాణకృత్ – కశ్చిత్ – దుర్గతిమ్ – తాత – గచ్ఛతి.

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| తస్య+ఇహ+ఏవ+ | = | యోగము చేసి, కృతకృత్యుడు గానివానికి, |
| అముత్ర+వినాశః+న+ | | ఈ లోకమందు గాని, పరలోకమునందు గాని |
| విద్యతే | | వినాశములేదని గ్రహించుము |
| తాత | = | నాయనా! ఓ అర్జునా! |
| కశ్చిత్+కల్యాణకృత్ | = | ఎప్పుడును, ఎవడును మంచిపనిని చేసినవాడు |
| హి+దుర్గతిమ్+ | | యోగమును అభ్యసించినవాడు దుర్గతిని |
| న+న+గచ్ఛతి | | పొందనే పొందడు |

**వ్యాఖ్యానము :-** యోగములో అంతరాయములు పొందినవాడు, ఆ అంతరాయములను జయించి, చివరకు బ్రహ్మప్రాప్తిని పొందును. విశ్వామిత్రుడు తపస్సు చేయుచుండగా అప్సరస అయిన మేనక వచ్చినది. కామపరవశుడై తపో దీక్షను వదలి, మేనకతో 15 సంవత్సరములు కాపురము చేసి ఒక కూతురును పొందెను. ఆ విధముగా కామము వలన అంతరాయము పొంది, ఆ తర్వాత దానిని సరిదిద్దుకొనెను. కామమును జయించెను. రంభ వచ్చినది. కామమునకు వశుడు కాలేదు. కాని కోపమువచ్చి ఆమెను శపించెను. ఆ తర్వాత కోపమును నిగ్రహించెను. ఆ విధముగా ఒక్కొక్క అంతరాయమును జయించి చివరకు బ్రహ్మర్షి అయ్యెను.

...... ❖ ❖ ❖ ......

యోగభ్రష్టుడు

**ప్రాప్య పుణ్యకృతాం లోకా । నుషిత్వా శాశ్వతీః సమాః ।**

**శుచీనాం శ్రీమతాం గేహే । యోగ భ్రష్టోఽభిజాయతే ॥ 41**

ప్రాప్య - పుణ్యకృతామ్ - లోకాన్ - ఉషిత్వా - శాశ్వతీః - సమాః

శుచీనామ్ - శ్రీమతామ్ - గేహే - యోగభ్రష్టః - అభిజాయతే

**అథవా యోగినా మేవ । కులే భవతి ధీమతామ్ ।**

**ఏతద్ధి దుర్లభతరం । లోకే జన్మ యదీదృశమ్ ॥ 42**

అథవా - యోగినామ్ - ఏవ - కులే - భవతి - ధీమతామ్

ఏతత్ - హి - దుర్లభతరమ్ - లోకే - జన్మ - యత్ - ఈదృశమ్

**తత్ర తం బుద్ధి సంయోగం । లభతే పౌర్వదేహికమ్ ।**

**యతతే చ తతో భూయః । సంసిద్ధౌ కురునన్దన ॥ 43**

తత్ర - తమ్ - బుద్ధిసంయోగమ్ - లభతే - పౌర్వదేహికమ్

యతతే - చ - తతః - భూయః - సంసిద్ధౌ - కురునన్దన

**పూర్వాభ్యాసేన తేనైవ । హ్రియతే హ్యవశోఽపి సః ।**

**జిజ్ఞాసురపి యోగస్య । శబ్దబ్రహ్మాతి వర్తతే ॥ 44**

పూర్వాభ్యాసేన - తేన - ఏవ - హ్రియతే - హి - అవశః - అపి -సః

జిజ్ఞాసుః - అపి - యోగస్య - శబ్దబ్రహ్మ - అతివర్తతే

**ప్రయత్నాద్యత మానస్తు । యోగీ సంశుద్ధకిల్బిషః ।**

**అనేక జన్మ సంసిద్ధః । తతో యాతి పరాం గతిమ్ ॥ 45**

ప్రయత్నాత్ - యతమానః - తు - యోగీ - సంశుద్ధకిల్బిషః

అనేక జన్మ సంసిద్ధః - తతః - యాతి - పరామ్ - గతిమ్

సత్త్వగుణమునకు సంబంధించినవి అయిన జాలి, కరుణ, దయ, ప్రేమల వలన యోగభ్రష్టుడైన అనగా ఆత్మ స్థానమును చేరని యోగి...

యోగభ్రష్టుడు ఆచారవంతుల గృహములలోగాని, శ్రీమంతుల గృహములలో గాని జన్మించును.

| | | |
|---|---|---|
| పుణ్యకృతామ్+లోకాన్+ ప్రాప్య+శాశ్వతీః+సమాః+ ఉషిత్వా | = | పుణ్యాతిరేకంబున, పుణ్యలోకములను పొంది కల్పాంతము వఱకు అందు వసియించి, క్రమ ముక్తిని పొందును. |
| హి+ఈ దృశమ్+ జన్మ+యత్+ఏతత్+ లోకే+దుర్లభతరమ్ | = | ఇట్టి జన్మ ఏది కలదో అది అనగా ఇటువంటి జన్మ లోకమునందు మిక్కిలి దుర్లభమైనది. |
| యోగభ్రష్టః | = | యోగభ్రష్టుడు మఱుజన్మలోగాని లేదా యింకొక జన్మలోగాని |
| శుచీనామ్ | = | పరిశుద్ధులు, అయిన బ్రాహ్మణ కుటుంబములో గాని, |
| శ్రీమతామ్+గేహే | = | శ్రీమంతుల యింటియందుగాని లేదా మరణ సమయమున అతని సంకల్పానుసారముగా గాని, |
| అభిజాయతే | = | తిరిగి జన్మించును. మరల ఆ జన్మలలో తిరిగి సాధనచేసి, ఆత్మస్థానమును పొందును. |
| అథవా+ధీమతామ్+ యోగినామ్+కులే+ ఏవ+భవతి | = | అలా కాని పక్షములో బుద్ధిమంతులైన యోగులయొక్క కులమునందే జన్మించును |
| కురునన్దన | = | ఓ అర్జునా! |
| తత్ర+తమ్+ పౌర్వదేహికమ్+ బుద్ధిసంయోగమ్+ లభతే | = | ఆ మఱుజన్మ యందు ఆ యోగభ్రష్టునకు పూర్వజన్మ సంబంధమైన యోగ సాధన వలన ఈ జన్మలో ఆ యోగమును పూర్తిచేసి, ఆత్మస్థానమును పొందుచున్నాడు. |

| | | |
|---|---|---|
| చ | = | మఱియు |
| తతః+భూయః+ సంసిద్ధౌ+యతతే | = | ఆ విధమైన పూర్వజన్మసంస్కారమువలన మరల సిద్ధికొఱకు ప్రయత్నించును |

ఈ శ్లోకమునకు వివరణగా భరతుడు, లేడిపిల్ల, ఆ తరువాత జడ భరతుని కథ చెప్పబడినది.

| | | |
|---|---|---|
| హి | = | పూర్వజన్మ సంస్కారమున ఈ జన్మలో ఏ గురువు వద్ద యోగము అభ్యసింపక పోయినను, |
| తేన+పూర్వాభ్యాసేన+ ఏవ+అవశః+అపి+ హ్రియతే | = | ఆ గత జన్మమందలి అభ్యాసముచేతనే అప్రయత్నముగ యోగాభ్యాసమువైపు మఱలింపబడుచున్నాడు. |
| శబ్దబ్రహ్మ+యోగస్య+ జిజ్ఞాసుః+సః+అపి+ అతివర్తతే | = | ఓం కారమును జపించుచూ యోగము యొక్క జిజ్ఞాసువు అయి అతడు సంసార సాగరమును కూడా అధిగమించుచున్నాడు, చివరకు ఆత్మస్వరూపుడు అగుచున్నాడు. |
| తతః+ అనేక జన్మ సంసిద్ధః+ ప్రయత్నాత్+తు+ యతమానః+యోగీ | = | అటుపిమ్మట అనేక జన్మల సంస్కారముతో పట్టుదలవలన మనోబుద్ధులను ఏకముచేసి కూటస్థునుని, క్షేత్రజ్ఞునితో కలపి ఆ విధముగా యోగముచేయ ప్రయత్నించుచున్న యోగి |
| సంశుద్ధ కిల్బిషః+ పరామ్+గతిమ్+యాతి | = | మాలిన్య రహితుడై, పాప రహితుడై, కర్మ బంధములు తొలగి, పరిశుద్ధుడై, ఆత్మస్థానమును పొందుచున్నాడు |

**వ్యాఖ్యానము :-** యోగసిద్ధిని పొందినవాడు బ్రహ్మమందు గలియును. **ఒకే జన్మలో** హనుమంతుని పరముగా సుందరకాండలో యోగవిఘ్నములను దాటి అహంకారావరణకు చేరి భూత సూక్ష్మేంద్రియములను లయము చేసి మహత్‌ను దర్శించి ప్రకృతిని వీడి ఆనందమయుండై అమృతత్త్వమును పొందు విధానమును వర్ణింపబడినది.

యోగసిద్ధిని పొందియు దేహత్యాగకాలమున యింద్రియముల తోటి సంగమంబు విడువనివాడు బ్రహ్మలోకముచేరి, కల్పాంతము అందువసియించి కల్పాంతరమున పుణ్య తారతమ్యంబులు అధికార విశేషంబుగా జన్మింతురు.

**ఉదా:** ధ్రువుడు. ధ్రువస్థానమును పొంది కల్పాంతము వఱకు అక్కడ ఉండును. ఆ తర్వాత పరబ్రహ్మతో ఏకీభూతుడగును. ఇతడు భూలోకమున తిరిగి జన్మించడు.

యోగభ్రష్టుడు మఱల భూలోకమున జన్మించి యోగసాధనను పూర్తిచేయును.

ఉదాహరణ : జడభరతుడు.

భరతుడు భారతదేశపు చక్రవర్తి. అతడు కాలాంజన పర్వతమున తపస్సుచేయుచూ, ఒకలేడిపిల్ల సంగమమువలన యోగభ్రష్టత గలిగినది. అతడు మరణ సమయమున, ఆ లేడిపిల్లను తలచుచూ, దేహమును వదలి మఱుజన్మలో లేడికడుపున జన్మించెను. పూర్వజన్మ స్మృతి గలిగి వుండెను. తదుపరి ఆ లేడిదేహమును వదలి బ్రాహ్మణుని యింట జన్మించి, తిరిగి యోగమును కొనసాగించి సంగరహితుడై, సమదర్శనత్వము పొంది, ఆత్మను దర్శించెను.

కొందఱు యోగ భ్రష్టులు బ్రాహ్మణాది వర్ణంబులందు గాక తక్కువ జాతి కులములో పుట్టి లోక ప్రసిద్ధులైరి.

దీనికి ఉదా : గజేంద్రమోక్షము కథ చెప్పబడినది.

గజేంద్రుడు పూర్వజన్మలో ఇంద్రద్యుమ్నుడనే మహారాజు. నిశ్చల సమాధిని పొందని యోగ భ్రష్టుడు. ఈ జన్మలో గజేంద్రునిగా జన్మించినాడు. ఇతడు దశలక్ష కోటి ఆడ ఏనుగులకు నాథుడయి, సంసార లంపటంలో ఉన్నాడు. అదృష్టము కలసి వచ్చినది. (ఈశ్వరాయత్తంబైన చిత్తంబు సంవిత్తంబుగాకుండుటంచేసి –మార్గంబుదప్పి మొసలికి చిక్కినాడు). ఎవరికీ పట్టుచిక్కని మొసలి ఇతనిని పట్టుకున్నది. అప్పుడు గజేంద్రుడు, పూర్వజన్మజ్ఞాన దివ్యసంపత్తితో తన మనంబున ఈశ్వర సన్నిధానంబు కల్పించుకొని భగవంతుని గుణనామ కీర్తనలు వర్ణించి శరణాగతియై హరిని ప్రార్థించినాడు. విష్ణువు మకరిని సంహరింప చివరకు గజేంద్రరూపము నశించి, విష్ణురూపుడై వెలుగుచుండె.

...... ❖ ❖ ❖ ......

బాహ్యయజ్ఞములు చేయువానికంటె, యోగి అధికుడు

**తపస్విభ్యోఽధికో యోగీ । జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।**
**కర్మిభ్యశ్చాధికో యోగీ । తస్మాద్యోగీ భవార్జున ॥ 46**

తపస్విభ్యః - అధికః - యోగీ - జ్ఞానిభ్యః - అపి - మతః - అధికః
కర్మిభ్యః - చ - అధికః - యోగీ - తస్మాత్ - యోగీ - భవ - అర్జున

**యోగినా మపి సర్వేషాం । మద్గతే నాన్తరాత్మనా ।**
**శ్రద్ధావాన్ భజతే యో మాం । సమే యుక్త తమో మతః ॥47**

యోగినామ్ - అపి - సర్వేషామ్ - మద్గతేన - అంతరాత్మనా
శ్రద్ధావాన్ - భజతే - యః - మామ్ - సః-మే - యుక్తతమః - మతః

| | | |
|---|---|---|
| అర్జున | = | ఓ అర్జునా! |
| అధికః+కర్మిభ్యః+ | = | వ్యర్థజీవి కంటే పుణ్యకర్మలు చేయువాడు అధికుడు, |
| అధికః+అధికః+మతః | | ఆ విధముగా పుణ్యకర్మానుష్ఠానము చేయువారి కంటేపుణ్యకర్మలు చేయుచూ, వాటి ఫలితమును కోరనివాడు అధికుడు. వారి కంటే మానసిక యజ్ఞముగా చెప్పబడే ఇంద్రియ నిగ్రహముగా చెప్పబడే యోగము చేయువాడు అధికుడని నా అభిప్రాయము |
| తస్మాత్+తపస్విభ్యః+ | = | అందువలన తపోయుతుడైన యోగి మఱియు |
| యోగీ+చ+జ్ఞానిభ్యః+ | | జ్ఞానయుతుడైన యోగి వీరు శ్రేష్ఠులు. కావున ఓ |
| అపి+యోగీ+యోగీ+ | | అర్జునా! నీవు అటువంటి యోగివి కమ్ము |
| భవ+సర్వేషామ్ | | కర్మానుష్ఠానపరులైన అందఱిలోనూ |
| యః+శ్రద్ధావాన్+ | = | ఎవడు శ్రద్ధగలవాడై పుణ్యఫలితమును కోరక |
| మామ్+భజతే+ | | నన్ను భజించునో అతడు యోగులలోను |

| | |
|---|---|
| యోగినామ్+మద్గతేన+ | నా యందు లగ్నమైనవాడును, అనగా |
| అంతరాత్మనా+సః+అపి+ | ఇంద్రియములను నిగ్రహించి, అరిషడ్వర్గములను |
| మే+యుక్తతమః+ | జయించినవాడు నాకు మనుజులలో శ్రేష్ఠుడని నా |
| మతః | అభిప్రాయము. |

**వ్యాఖ్యానము:-** ఆరూఢస్థితిలోని యోగులు రెండు రకములు. యోగము చేసి కోరికలు కోరినవాడు హిరణ్యకశిపుడు. అటులనే యోగము చేసి ఏ కోరికలు కోరనివారు వసిష్ఠులవారు. వసిష్ఠులవారు హిరణ్యకశిపునికంటె చాలా ఉన్నతుడు అని పెద్దల అభిప్రాయము.

...... ❖ ❖ ❖ ......



# భీష్మ పర్వము 31వ అధ్యాయము జ్ఞానవిజ్ఞానయోగము నుండి 36వ అధ్యాయము భక్తియోగము వరకు సమీక్ష

31వ అధ్యాయములో 30 శ్లోకములు, 32వ అధ్యాయములో 28 శ్లోకములు, 33వ అధ్యాయములో 34 శ్లోకములు, 34వ అధ్యాయములో 42 శ్లోకములు, 35వ అధ్యాయములో 55 శ్లోకములు, 36వ అధ్యాయములో 20 శ్లోకములు ఉన్నవి.

**అర్జునుడి ప్రశ్నలు :** కథాభాగముగా ఏవియూ లేవు. ఆధ్యాత్మిక భాగముగా 32వ అధ్యాయములో

1. **కిమ్ తత్ బ్రహ్మ - బ్రహ్మమనగానేమి?**
2. **కిమ్ అధ్యాత్మమ్ - అధ్యాత్మమనగా నేమి?**
3. **కిమ్ కర్మ - కర్మ అనగానేమి?**
4. **కిమ్ అధిభూతమ్ - అధిభూతమనగానేమి?**
5. **కిమ్ అధిదైవమ్ - అధిదైవమనగానేమి?**
6. **కః అధియజ్ఞః - అధియజ్ఞుడు ఎవడు?**
7. **నియతాత్మ.... ప్రయాణకాలే కథమ్ జ్ఞేయః - నియతాత్ములచేత దేహత్యాగ సమయమున ఎట్లు తెలియదగినవాడవు?**

ఈ ఏడు ప్రశ్నలకు భగవానుడు సమాధానము చెప్పుచున్నాడు.

**34వ అధ్యాయములోని ప్రశ్నలు :**

1. **నాచేత ఎట్లు ధ్యానింపదగినవాడవు అగుచున్నావు?**
2. **చరాచరజగత్తు అంతా విరాట్ పురుషుడయినప్పుడు ఈ సృష్టిలో అతని విభూతులు ఎట్లు తెలుసుకొందును?**
3. **సర్వభావములు విరాట్‌పురుషునివలన గలిగినప్పుడు ఏఏ భావములందు నీవుగలవని గ్రహించుట?**
4. **ఆత్మగా ఎల్లప్పుడు ధ్యానము చేయుచూ నిన్ను గ్రహించినచో గలుగు ఫలితమేమి?**

**36వ అధ్యాయములోని ప్రశ్న:**

**1. ఆత్మరూపమున నిరాకారముగా ఉపాసించు యోగులు, పురుషోత్తమునిగా సాకారరూపమున ఉపాసించు భక్తులలో ఎవరు శ్రేష్ఠులు?**

**బ్రహ్మవిద్య :** ఉత్తమమ్. పవిత్రమ్. రాజవిద్యా అనగా విద్యలలోకెల్లా శ్రేష్ఠము. గుహ్యతమం మఱియు రాజగుహ్యమ్ అనగా మిక్కిలి రహస్యమయినది. ధర్మమనగా ధర్మయుతమైనది. అవ్యయమ్ అనగా నాశనము లేనిది. కర్తుంసుసుఖం – ఆచరించుటకు సులభమయినది. బ్రహ్మవిద్యను తెలుసుకొనిన అశుభములనుండి విడివడును. అసూయాది దుర్గుణములు లేనివానికి బోధింపబడునది. దీనిని శాస్త్రపాఠముగను, ఆచరణగను చెప్పబడుచున్నది.

కైవల్య ఉపనిషత్‌లో బ్రహ్మ అశ్వలాయనునికి, ఆత్మను శ్రద్ధ, భక్తి, ధ్యానయోగముతో తెలుసుకొనవలయునని చెప్పినదానికి ఇందు ఆత్మను ఏవిధముగా తెలుసుకొనవలయునో ఆ విధానమును చెప్పుచున్నాను వినుము అని శ్రీకృష్ణుడు అర్జునునితో పలికెను. ముండక ఉపనిషత్‌లో గురువును శిష్యుడు ఏది తెలిసిన ఈ సర్వము తెలియును అని అడిగినదానికి యిందు జ్ఞానము, విజ్ఞానసహితముగా చెప్పుచున్నాను వినుమని శ్రీకృష్ణుడు పలికినట్లు కలదు.

**ఆత్మగుఱించి**

***31వ అధ్యాయములో*** – ఆత్మయందు ఈ జగత్తుగాని జీవులుగాని లేవు. అవ్యక్తమ్, పరమ్, అవ్యయమ్, అనుత్తమమ్, అజమ్, సృష్ట్యాదియందు ఆత్మ తప్ప యింకేదియును లేదు. లయకాలమున ఆత్మ తప్ప యింకేదియు ఉండదు.

***32వ అధ్యాయములో*** – తమస్సుకు పరమైనది. అక్షయమైనది బ్రహ్మము అని చెప్పబడును. కవిః, దివ్యః, పురాణః, సనాతనః, పరమః పురుషః, అనుశాసితారః, అక్షరః, అణోః అణీయాంసః, ఆదిత్యవర్ణమ్, తమసః పరస్తాత్, అవ్యక్తాత్ పరః, అవ్యక్తః

***33వ అధ్యాయములో*** – అవ్యక్తము, గతిః, భూతాది, సాక్షి, అవ్యయము, శుచిః , ప్రభుః, భర్త తెలియదగినవాడను. ఆత్మలో జగత్తు లేదు, నిదానము, శరణు యిచ్చువాడను, ఆత్మనే శరణుకోరవలయును, సర్వభూతములకు సముడు,

ప్రియులుగాని అప్రియులుగాని లేరు, సుహృత్ శత్రుమిత్ర భావన లేనివాడు, భూతమహేశ్వరుడు, ఆత్మగా ఒక్కడు.

***34వ అధ్యాయములో –*** ఆత్మయొక్క ఆవిర్భావమును దేవతలు, ఋషులు కూడా ఎఱుంగరు. అజమ్, అనాది, లోకమహేశ్వరః, పరబ్రహ్మ, పరంధామ, పవిత్రః, ప్రకృతికి పరుడు, శాశ్వతః, దివ్యః, ఆదిపురుషుడు, పురుషః, ఆదిదేవః, విభుః.

***35వ అధ్యాయములో –*** అవ్యయుడు, ఆదిదేవుడు, ఆదిపురుషుడు, సనాతనుడు, అక్షరుడు, పురుషుడు, ఆత్మతో సమానుడు లేడు, తెలుసుకొనదగినవాడు.

***36వ అధ్యాయములో –*** అచింత్యమ్, అచలమ్, సర్వత్రగమ్, అనిర్దేశ్యమ్, అవ్యక్తమ్, అక్షరమ్, జీవునిగా కూటస్థమ్.

**అంతరాత్మ గుఱించి**

***31వ అధ్యాయములో –*** పంచభూతములలో, సూర్యచంద్రాదులలో మమేకమై ఉన్నది. సర్వజీవులలో మణిగణములలో సూత్రమువలె ఉన్నది. కావున బాహ్య చక్షువులకు గోచరము కాదు. యోగమాయా సమావృతుడనగుటవలన సర్వులకు కనిపించుటలేదు.

***32వ అధ్యాయములో –*** అంతరాత్మగా సర్వభూతములలో చరించును.

***33వ అధ్యాయములో –*** అంతరాత్మగా సర్వస్థావర జంగమములలో వ్యాపించి ఉన్నది.

***34వ అధ్యాయములో –*** అంతరాత్మగా సర్వప్రాణుల హృదయగుహలో ఉండి, ఆత్మను ధ్యానించువారి అజ్ఞానమును నశింపచేయుచున్నాను.

**విరాట్పురుషుని గుఱించి**

***31వ అధ్యాయములో –*** ప్రకృతి పురుషుల సమిష్టి రూపము విరాట్పురుషుడు. సృష్టి, స్థితి, లయస్థానములు అతడే. సృష్టి – స్థితి – లయకారకుడు అతడే. సర్వభావములు విరాట్వలననే గలిగినవి. ఈ సర్వము విరాట్ పురుషుడే. విరాట్ పురుషుడు బీజము. ప్రకృతి క్షేత్రము. భూతభవిష్యత్ వర్తమాన కాలములలోని సర్వజీవరాసులు విరాట్పురుషునికి తెలియును.

***32వ అధ్యాయములో*** –విరాట్–సర్వస్యధాతారమ్ – సర్వమును ధరించువాడు.

***33వ అధ్యాయములో*** – విరాట్ – సర్వభూతముల సృష్టికారకుడు. సర్వభూతములు విరాట్ దేహమునందు ఉండుటవలన స్థితికారకుడు. సర్వభూతములు విరాట్‌నందే లయమగుచున్నవి. కావున సృష్టి, స్థితి లయములకు స్థానమయినవాడు. ఈ సృష్టి సర్వము విరాట్ పురుషుడే. అతడు కానిది అణువుకూడా లేదు. విరాట్‌గా విశ్వతోముఖుడు. అనగా భిన్నుడు.

జగత్తుకు తండ్రిని. సృష్టికి బీజము. జగత్తుకు స్థానము. నిధానము. జగత్తును పోషించువాడు. వేదములు, క్రతువులు, యజ్ఞములు, ఆజ్యము, అగ్ని, మంత్రము, ఓంకారము, హుతము, స్వధా, యజ్ఞపురుషుడు, యజ్ఞభోక్తా, ఔషధము.

సత్తు, అసత్తు, అమృతము, మృత్యువు, సూర్యునిగా తపింపచేయుచున్నాడు. పర్జన్య రూపమున వర్షము కురియించుచున్నాడు. ఉపాధులలో పురుషరూపమున వసియించుటవలన ఉపాధులు, జగత్తు పని చేయుచున్నవి. విరాట్ పురుషుని అధ్యక్షతన ప్రకృతి ఈ సర్వఉపాధులను సృజియించుచున్నది.

**విరాట్‌యొక్క కర్మ :** విరాట్‌పురుషుడు ప్రకృతిని అధిష్ఠించి ప్రకృతివలన సర్వభూతముల ఉపాధులను సృజియించుచున్నాడు. కల్పాంతమునందు సర్వస్థావర జంగమముల ఉపాధులు ప్రకృతియందు లయమగుచున్నవి. మరల సృష్ట్యాదియందు ప్రకృతిని నిమిత్తకారణముగా చేసుకొని సర్వమును సృజియించుచున్నాడు. సృష్టి – స్థితి – లయములనే కర్మలయందు ఆసక్తి లేక ఉదాసీనుడుగా ఉండుటవలన కర్మలు అతనిని బంధించవు.

***34వ అధ్యాయములో*** –ధాత, విశ్వతోముఖుడు, భూతభావనుడు, భూతేశుడు, దేవదేవుడు, జగత్పతి.

విరాట్ పురుషుని నాలుగు అంశలలో ఒకదానిచేతనే ఈ సర్వజగత్తు వ్యాపించియున్నది. ఇతడే సృష్టి, స్థితి, లయకారకుడు. ఇతనివలననే సర్వజగత్తు ప్రవర్తిల్లుచున్నది. సృష్టికి మూలకారకుడు. విరాట్ పురుషుడు బీజము. ప్రకృతి క్షేత్రము.

దేవతలకంటె, ఋషులకంటె ముందు వాడు. గావున దేవదానవులు, ఋషులు విరాట్ ఆవిర్భావమును ఎఱుంగరు.

**ప్రారంభసృష్టిలో :**

అధిదైవిక సృష్టి – 14 మంది మనువులు, సప్తఋషులు, సనకసనందనాదులు 14 లోకములు కలిగినవి.

అధిభౌతిక సృష్టి ,ఈ ప్రజలు మఱియు వివిధ భావములు అనగా జ్ఞానము, బుద్ధి, క్షమా, అసమ్మోహము (మోహరాహిత్యము) మోహము, సమ (సమభావన) (ద్వంద్వభావన), తుష్టిః (సంతోషము) (విచారము), సత్యము (అసత్యము), సుఖము దుఃఖము, భావము అభావము, భయము అభయము, అహింస (హింస), యశస్సు అయశస్సు, కీర్తి అపకీర్తి, క్రియలు, పుణ్యకర్మలు, శమము, దమము, తపస్సు, దానము. అనగా సమస్త భావములు కలిగినవి.

త్రికాలములందలి సృష్టి విరాట్ పరుషుడే గావున అతని విభూతులకు అంతములేదు. శక్తియుక్తము, కాంతివంతము, ఐశ్వర్యవంతము అయినవి విరాట్పురుషుని విభూతులుగా గ్రహించవలయును.

దేవతలలో – ఇంద్రుడు; ద్వాదశ ఆదిత్యులలో – విష్ణువు; ఏకాదశ రుద్రులలో – శంకరుడు; అష్ట వసువులలో – పావకుడు; సప్తమరుత్తులలో – మరీచి; జల దేవతలలో – వరుణుడు; శాసకులలో – యముడు; పవిత్రము చేయువాటిలో – అగ్ని; వీచువాటిలో వాయువు; యక్షరాక్షసులలో – కుబేరుడు, సత్కామములు, మన్మథుడు; సేనాపతులలో – కుమారస్వామి.

**సిద్ధులు :** సిద్ధులలో – కపిలుడు; **పితృదేవతలు :** పితృదేవతలలో – అర్యముడు; **రాక్షసులు :** రాక్షసులలో – ప్రహ్లాదుడు; **గరుడ :** పక్షులలో – గరుత్మంతుడు; **గంధర్వులు :** గంధర్వులలో – చిత్రరథుడు;

**సర్పములు – నాగులు :** సర్పములలో – వాసుకి; నాగులలో – ఆదిశేషువు.

**క్షీరసాగర మథన సమయమున జనియించిన వాటిలో :** ఏనుగులలో – ఐరావతము; గుఱ్ఱములలో – ఉచ్చైఃశ్రవము; గోవులలో – కామధేనువు.

**ఋషులలో :** దేవర్షులలో – నారదుడు; మహర్షులలో – భృగువు; పురోహితులలో– బృహస్పతి; జ్ఞానవంతులలో – శుక్రాచార్యులు; మునులలో – వ్యాసుడు.

**కాలము :** గణించువాటిలో – కాలము; ఋతువులలో – వసంతఋతువు; మాసములలో – మార్గశీర్షము; హరించువాటిలో –మృత్యువు;

**అధిభౌతికము :** గొప్ప కిరణములు గలవాటిలో – సూర్యుడు; నక్షత్రములలో– చంద్రుడు; అనగా కాంతినిచ్చువాటిలో – సూర్యచంద్రులు.

**మానవులు :** ఆయుధధారులలో – శ్రీరాముడు; వృష్ణివంశజులలో – శ్రీకృష్ణుడు; పాండవులలో అర్జునుడు; మానవులలో – రాజు; స్త్రీలలో – కీర్తి, శ్రీ.

**మానవదేహము :** ఇంద్రియములలో – మనస్సు, ప్రాణము; జ్ఞానవంతులలో జ్ఞానము; జయేచ్ఛగలవారిలో – పౌరుషము; సత్యవంతులలో – సత్త్వగుణము; తేజోవంతులలో – తేజము; స్మృతి, మేధా, ధృతి, క్షమ.

**మృగములు :** మృగములలో – సింహము.

**జలచరములు :** జలచరములలో – మొసలి;

**వేదములు – విద్య :** వేదములలో – సామవేదము; సామములలో – బృహత్సామము; ఛందస్సులలో – గాయత్రీఛందస్సు; అక్షరములలో – ఓంకారము, అకారము; సమాసములలో – ద్వంద్వసమాసము; యజ్ఞములలో – జపయజ్ఞము; విద్యలలో – అధ్యాత్మవిద్య.

**ఇతరములు :** జయాపజయములలో – జయము; నీతులలో – రాజనీతి; దండించువాటిలో – దండము; వాదనలలో – వాదము; రహస్యములలో – పరమరహస్యము; నియమములలో – వాక్‌నియమము, మౌనము; వంచకులలో – జూదము.

**స్థావరములలో :** స్థావరములలో – హిమాలయము; శిఖరములలో – మేరుశిఖరము; సరస్సులలో – సాగరము; నదులలో – గంగ; వృక్షములలో – అశ్వత్థము; ఆయుధములలో – వజ్రాయుధము; భావములలో, గుణములలో, జ్ఞానము, పౌరుషము, తేజము, సత్త్వగుణము, స్మృతి, మేధా, ధృతి, క్షమ, జయము, రాజనీతి, పరమరహస్యము

***35వ అధ్యాయములో –*** గత అధ్యాయములో విరాట్‌పురుషుడు సృష్టి కారకుడని చెప్పి ఈ అధ్యాయములో స్థితి, లయములు వర్ణింపబడినవి. ఆవిధముగా సృష్టి – స్థితి – లయములకు ప్రధాన కారకుడు విరాట్‌పురుషుడని వివరింపబడినది.

విశ్వమునకు ఆధారము. తేజోరూపము, శశిసూర్యనేత్రము, ధర్మరక్షకుడు, సర్వశ్రేష్ఠుడు, తండ్రి, గురువు, పూజ్యుడు.

విరాట్ పురుషుడిని జ్ఞాననేత్రముతో చూడవలయును. సర్వవిశ్వమును విరాట్ పురుషునిగా చూచుటయే ప్రజ్ఞానము.

విరాట్ పురుషునకురెండు రూపములు కలవు. అందు ఒకటి దేవతారూపము. ఇది అధిదైవికము. ఇది బాహ్యచక్షువులకు గోచరము కాదు. ఇంకొకటి జీవరూపము. మఱియు స్థావర జంగమాత్మకము. ఈ రూపములో నానావర్ణములు, నానా ఆకృతులు గలవు. ఇవి బాహ్యచక్షువులకు గోచరము.

**దేవతారూపము :** దివ్యములయిన ఆభరణములు, ఆయుధములు, మాలలు, గలిగి దివ్యగంధముపై పూతగా పూసుకొని కిరీటము, గద, చక్రముగల రూపము. ఈ రూపములో ప్రజాపతి బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ద్వాదశ ఆదిత్యులు. ఏకాదశరుద్రులు, అష్టవసువులు, సప్తమరుత్తులు, అశ్వినీదేవతలు, విశ్వేదేవతలు, వాయువు, యముడు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, పితృదేవతలు, యక్షులు, గంధర్వులు అసురులు, సిద్ధులు, సాంఖ్యులు, దివ్యసర్పములు మొదలయినవి విరాట్ దేహమునందు స్థితులై ఉండిరి.

**సామాన్య జీవరూపము :** అనేక వర్ణములు. అనేక ఆకృతులు గలిగి అనేక శిరస్సులు బాహువులు, నేత్రములు, పాదములు మొదలయినవి గలిగి ఉన్నవి. సమస్త జీవులు యితడే అగుటవలన శరీర అవయవములు అనేకములు. సమస్త స్థావరములు యితనియందే గలవు. సమస్త జంగమములు యితనియందే గలవు.

ఈ విరాట్ రూపమును చూడ దేవతలు కూడా కాంక్షింతురు. ఈ రూపమును అయోగ్యులు చూడలేరు. దేవతలు కీర్తించుచున్నారు. మహర్షులు స్వస్తివాక్యములు పలుకుచున్నారు. రాక్షసులు భయపడుచున్నారు.

విరాట్‌రూపమును బ్రహ్మాదిదేవతలు, నారదాది ఋషులు, కుంతీ, శ్రీకృష్ణుని పెంచిన తల్లియగు యశోద, రాయబారసమయమున ధృతరాష్ట్రుడు చూచిరి.

**కాలపురుషుడు :** కాలపురుషరూపమున సర్వమును లయము చేయును. ఈ విశ్వమును తన తేజస్సుచే తపింపచేయును. ఉగ్రము, సర్వలోకములు ఈ రూపమును చూచి వ్యథ చెందుచున్నవి.

దీప్తహుతాశన వక్త్రం - బహుదంష్ట్రాకరాళం

ఈతని నోటిలో భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, జయద్రథుడు (సైంధవుడు) అటులనే కౌరవ ప్రముఖులు, పాండవసేనలోని ప్రముఖులు, సర్వము ఈ కాలపురుషుని కోరలలో చిక్కుకొని నశించుటను అర్జునుడు చూచెను.

గతములో మనము జయించెదమా? లేక వారు జయించెదరా? అని అడిగిన అర్జునుడి ప్రశ్నకు - కౌరవ ప్రముఖులు అందఱు చనిపోయి విజయము మనకు తథ్యమని మాటలతో గాక దృశ్యముగా చూపించినాడు.

ఈ కాలపురుషునిలో సత్పురుషులు సముద్రములో నదులు కలియునట్లు కలియుచున్నారు. ఆవిధముగా వారి జీవత్వము తొలగి బ్రహ్మయై విరాజిల్లుచున్నారు. దుర్మార్గులు అగ్నిలో మిడతలు పడునట్లు పడి నశించిపోవుచున్నారు. వారు జననమరణ వలయంలో తిరుగాడుచున్నారు.

కాలపురుషుని రూపమును చూచి భయపడిన అర్జునుడు శ్రీకృష్ణునుని పూర్వరూపముతో దర్శనము యిమ్ము అని ప్రార్థించి, తను తెలియక చేసిన తప్పులను క్షమింపుమని వేడుకొనెను.

## కాలము గుఱించి

***32వ అధ్యాయములో -*** చతుర్ముఖబ్రహ్మకు వేయి యుగములు పగలు అటులనే వేయి యుగములు రాత్రి అని చెప్పబడినది. ఆత్మతో ఏకీభూతముకాని జీవులు బ్రహ్మయొక్క పగటికాలమున సృష్టిలోనికి వచ్చి రాత్రికాలమున లయమగుచున్నవి. జీవుల ఉపాధులు ప్రకృతిలోనూ, జీవులు విరాట్ పురుషునిలోనూ లయమగుచున్నారు. అధిభౌతికమయిన సూర్యుని వలన అయనములు, ఋతువులు, మాసములు, పగలు గలుగుచున్నవి. చంద్రునివలన పక్షములు గలుగుచున్నవి.

## మాయ గురించి

***31వ అధ్యాయములో*** – పరమేశ్వరుని మాయ దాటశక్యముగానిది అని చెప్పబడినది. పరమాత్మను శరణుబొందినవారు మాయను తరింతురు. అయితే అసురభావయుతులు ఈశ్వరుని శరణుకోరుటలేదు.

## ప్రకృతి గురించి

***31వ అధ్యాయములో***–ప్రకృతి, మహత్, అహంకారము, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అనే అష్ట ఆవరణలు కలిగి ప్రకృతి ఉన్నది. ఈ బ్రహ్మాండమును పురుషుడు ఆవరించి ఉన్నాడు. జీవుల దేహము అపరా ప్రకృతివలన గలిగినది. విరాట్ పురుషుని దేహము పరాప్రకృతి సంబంధమైనది. అనగా జీవేశ్వరుల దేహములు ఒకటిగావు. ప్రకృతివలన గుణములు వచ్చినవి. ఈ గుణములవలన మానవుడు ఆత్మను దర్శింపలేక ఉన్నాడు.

***33వ అధ్యాయములో*** – ప్రకృతి తల్లి. ఇదియే క్షేత్రము. సర్వజీవరాసులను మోహింపజేయు మోహిని. గుణయుతులు ప్రకృతిని ఆశ్రయించి ఆత్మను దర్శింపలేక ఉన్నారు.

## జీవుని గురించి

***31వ అధ్యాయములో*** – దేహముకంటె వేఱు అయి ఉన్నాడు.

**జీవులలోని రకములు:** అసురభావయుతులయిన వారు ఈశ్వరుని శరణు కోరుటలేదు. ఇహలోక, పరలోక సుఖాపేక్షగలవారు, కోరికలు గలవారు ఆ కోరికలకు సంబంధించి వేదములలో చెప్పినట్లు ఆ దేవతలను యజించుచున్నారు. ఎవరు ఏ దేవతను ఆరాధించవలయునని తలంతురో వారికి ఆ దేవతారాధనకు సంబంధించిన శ్రద్ధ పరమాత్మచే యివ్వబడుచున్నది. ఆ కర్మఫలితము కూడా విరాట్పురుషునిచే యివ్వబడుచున్నది. ఎవరు ఏ దేవతను యజింతురో వారు దేహత్యాగానంతరము ఆ దేవతా లోకములను పొందుదురు.

**పుణ్యకర్మచేత పుణ్యఫలితము కోరుటలోగల దోషము:**పుణ్యకర్మలవలన గలిగిన ఫలితము శాశ్వతము కాదు. పుణ్యఫలితము క్షీణించగనే వారు తిరిగి జన్మింతురు.

ఉత్తమ జీవులు – వీరు ఈశ్వరునిచే యజింతురు. ఈశ్వరుని దర్శించినవారిలో ఆర్తుడు, అర్థార్థీ, జిజ్ఞాసువు, జ్ఞాని అని నాలుగు తరగతులు. వీరందఱు శ్రేష్ఠులేగాని జ్ఞాని పరమశ్రేష్ఠుడు. అనేక జన్మల సంస్కారమువలన ఒకడు జ్ఞానవంతుడగును. ఈ జ్ఞానులు అధ్యాత్మతత్త్వమును, బ్రహ్మమును సంపూర్ణముగా తెలియుదురు.

బ్రహ్మ, అధ్యాత్మమ్, కర్మ, అధిభూతమ్, అధిదైవమ్, అధియజ్ఞములను తెలిసి దేహత్యాగ సమయమున ఈశ్వరుని చింతించుచు, ప్రాణమును బ్రహ్మరంధ్రము చేర్చి బ్రహ్మరంధ్రమును చీల్చినవారు బ్రహ్మయగుదురు.

**ఆత్మను దర్శించలేనివారు:** సర్వజీవరాసులు త్రిగుణములచే మోహింపబడు చున్నవి. వారు అజ్ఞానయుతులై ద్వంద్వములు గలిగి, గుణములచే మోహితులై ఆత్మను దర్శింపలేక ఉన్నారు.

***33వ అధ్యాయములో –***కృష్ణునిగా మానవశరీరమును ధరించి యుండుటవలన నేను ఈశ్వరుడనని గ్రహించక కౌరవాదులు చులకనగా చూచుచున్నారు.

అవతార పురుషునికి శాశ్వతత్త్వము లేదు. అతడు కాలమునకు లోబడి మరణించును. ఆత్మ శాశ్వతము, కాలమునకు లోబడదు. అది మరణించదు.

ఆకాశమునందుగల మేఘమువలె దేహమును అంటక సాక్షిత్వమున హృదయగత ఆత్మ ఉండును. వాయువులో ధూళికణములవలె దేహముతో మమేకమై దేహి ఉండును. పాపులు – ధర్మయుతులు కానివారు. శ్రద్ధలేనివారు, అశ్రద్ధతో కూడినవారు మూర్ఖులు. ఆత్మతత్త్వము ఎఱుగని మూర్ఖులు కర్మబద్ధులై ఆత్మస్థానమును పొందక తిరిగి జన్మకు వచ్చి సంసార తాపత్రయములలో చిక్కుకొని జననమరణ వలయములో తిరుగాడుచున్నారు. వ్యర్థ ఆశలుగలవారు, వ్యర్థకర్మలు చేయువారు, విపరీతజ్ఞానము గలవారు, ప్రకృతిని ఆశ్రయించినవారు, పురుషుని ఆశ్రయించనివారు ఆత్మను దర్శింపలేక ఉన్నారు.

స్వర్గమును పొందువారు – పాపరహితులు, త్రైవిద్య అయిన ధర్మార్థ కామములను ఎఱిగినవారు, యజ్ఞములచేత యజ్ఞపురుషుని యజించి సోమరసమును దేవతలకిచ్చి, యజ్ఞాంతమున సోమపానము చేసిన పుణ్యాత్ములు స్వర్గము కావలయునని కోరి స్వర్గములో సర్వసుఖములను అనుభవించుచున్నారు. పుణ్యము క్షీణించగనే తిరిగి

భూలోకమున జన్మించుచున్నారు. పుణ్యఫలితము కోరనివారు ఆత్మస్థానము చేరి తిరిగి జన్మింపరు.

ఆత్మతత్త్వమును ఎఱిగి, ఆత్మను దర్శించి, ఆత్మస్థానమును పొంది ఆత్మలో ఏకీభూతమయినవారు తిరిగి జన్మింపరు. భక్తులు అనన్యమనస్సుచే సాకారరూపమున ఈశ్వరుని భజించి, అమృతత్త్వమును పొందుదురు.

## మార్గముల గుఱించి

***32వ అధ్యాయములో –*** దేహత్యాగానంతరము జీవులు పయనించు మార్గములు.

1. పాపులు – వీరు చీకటిమార్గమున నరకము చేరి ఆ నరకములో బాధలు అనుభవించి తిరిగి భూలోకమున జన్మింతురు.
2. పుణ్యఫలితము కోరినవారు – పుణ్యకర్మలు చేసి పుణ్యఫలితము కోరినవారు పితృయానమున బ్రహ్మలోకము చేరి సుఖభోగములను అనుభవించి పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మింతురు.
3. పుణ్యఫలితము కోరనివారు – పుణ్యకర్మలు చేసి పుణ్యఫలితము కోరనివారు దేవయానమున బ్రహ్మలోకము చేరి అక్కడ వసియింతురు. మరల వారు భూలోకమున జన్మింపరు. ఊర్ధ్వలోకములలో అధికారపురుషులుగా ఆవిర్భవింతురు.
4. యోగులు : యోగులు జ్యోతిర్మార్గమున ఆత్మస్థానము చేరి ఆత్మలో ఏకీభూతులై ఆత్మయై విరాజిల్లుదురు.

## సాధన గుఱించి

***32వ అధ్యాయములో –*** పుణ్యకర్మలు – వేదములు, యజ్ఞములు, దానములు, తపస్సు, యోగము, భక్తి, సాంఖ్యము.

**యోగుల సాధన :** బ్రహ్మచర్యము పాటించుచు, ఓంకారమును జపించుచు, జితేంద్రియత్వము గలిగి, ద్వంద్వాతీతులై జీవన్ముక్తులై దేహత్యాగ సమయమున యోగబలముతో చలింపని మనస్సుతో కూటస్థునుని క్షేత్రజ్ఞునితో చేర్చి ప్రాణమును భ్రూమధ్యమునందు నిలిపి, సర్వద్వారములను మూసి, బ్రహ్మరంధ్రము చించి బ్రహ్మమందు కలియును.

తపస్సునందు, యోగమునందు సర్వపుణ్యఫలితములు గలవు.

**భక్తిపద్ధతి :** భక్తులు అనన్యచిత్తముతో సాకారరూపమున భగవంతునుని స్మరించుచూ, దేహమును వదలి బ్రహ్మపదములో చేరుదురు.

బ్రహ్మపర్యంతముగల లోకములు పునరావృత్తి గలవి. బ్రహ్మపదమును చేరిన పునర్జన్మను పొందరు.

బ్రహ్మపదమును చేరి బ్రహ్మయై విరాజిల్లనివారు జననమరణ వలయములో తిరుగాడుదురు.

***33వ అధ్యాయములో –*** కర్మణ్యులు – యజ్ఞేన యజంతః – యజ్ఞములద్వారా యజించుచున్నారు. పుణ్యఫలితము కోరనివారు ఆత్మస్థానమున వసియించుచున్నారు

యోగులు – యోగపద్ధతిద్వారా ఆత్మను తెలుసుకొనుచున్నారు.

భక్తులు – ఈశ్వరునుని అనన్యభక్తితో ఆరాధించి ఈశ్వరుని చేరుకొనుచున్నారు.

సాంఖ్యులు – దేహి దేహవిచారణ చేసి తను దేహముకాదని ఆత్మస్వరూపుడనని తెలుసుకొనుచున్నారు.

**భక్తి – పూజ :** కొందఱు కోరికల కొఱకు సర్వేశ్వరుడనయిన వానిని ప్రథమమున పూజింపక విధిని తప్పి దేవతలను పూజించుచున్నారు. విరాట్ సర్వదేవతా స్వరూపుడగుటవలన ఎవరు ఏ దేవతలను పూజించినా ఈశ్వరునినే పూజించినట్లు అగును.

దేవతలను ఆరాధించువారు దేవతలను, పితృదేవతలను ఆరాధించువారు పితృదేవతలను, భూతములను ఆరాధించువారు భూతములను పొందుచున్నారు. జలముతో అభిషేకించి, పత్రములు, పుష్పములతో పూజించి, పండ్లను నైవేద్యముగా పెట్టుచున్నారు. ఆ పూజను స్వీకరించి పండ్లను తినుచున్నాను.

ఈశ్వరార్చన – ఇతర చింతలు మాని ఈశ్వరునుని ఆరాధించువారు ఈశ్వరునుని పొందుదురు. అట్టి భక్తులయొక్క యోగక్షేమములు ఈశ్వరుడే వహించుచున్నాడు.

**పుణ్యకర్మానుష్ఠానపరులు - వారి సాధనలు :**

కర్మ - దేనిని యజ్ఞములో హోమము చేయుచున్నారో, దేనిని దానము చేయుచున్నారో అనగా పుణ్యకర్మలు చేసినవారు. పుణ్యకర్మానుష్ఠానపరులుగా చెప్పబడుదురు.

భక్తి - ఏయే కర్మలను ఆచరించుచున్నారో దేనిని తినుచున్నారో అనగా సమస్త కర్మలను ఈశ్వరునియందు సమర్పించినవారు భక్తులుగా చెప్పబడుదురు.

యోగము - ఆత్మానసంధానము చేసిన వారు యోగులుగా చెప్పబడుదురు.

తపస్సు - తపస్సు చేసినవారు ఎవరయినా తపస్విగా చెప్పబడుదురు.

ద్వంద్వాతీతులయినవారు కర్మబంధములనుండి విడివడుదురు.

**భక్తుడు :** దురాచారుడయినా, సదాచారుడయినా ఈశ్వరునుని అనన్యభక్తితో పూజించినవాడు సాధువే. అతడు ధర్మాత్ముడు. అతడు శాంతిని పొందును. దేహత్యాగానంతరము అమృతుడగును. భక్తుడు దుర్గతిని పొందదు. నశింపడు.

పాపయోనులు అనగా ఊసరవెల్లిగా పుట్టిన నృగుమహారాజు, మద్దిచెట్టుగా పుట్టిన నలకూబరులు అయినా - స్త్రీలు అయినా చాతుర్వర్ణములలో జనియించిన వారు ఎవరైనా అనన్యభక్తితో ఈశ్వరునుని సేవించినవారు ఆత్మస్థానమును పొందుదురు.

ఈశ్వరుని చేరుటకు ప్రయత్నించువారు (యితతః) ఈశ్వరుని కీర్తించుచూ, దృఢవ్రతులై, నిత్యయుక్తులై ఈశ్వరుని ఉపాసించుచున్నారు.

కావున ఈశ్వరునునికి నమస్కరింపుము. ఈశ్వరునియందు మనస్సు నుంచుము. ఈశ్వరునుని పూజింపుము. భక్తుడవు కమ్ము. అనగా భక్తి పద్ధతులలో చెప్పబడిన ఏ పద్ధతినయినా పాటింపుము. ఈశ్వర పరాయణుడయినవాడు ఈశ్వరునుని పొందును.

***34వ అధ్యాయములో -*** యోగము : ఆత్మానుసంధానము చేయువారు ఆత్మతో రమింతురు.

**భక్తి :** ప్రేమపూర్వకముగా భజించు భక్తులు భగవంతునియందుచిత్తమును, ప్రాణమును ఉంచి భగవంతుని కథలు ఒకరికొకరు చెప్పుకొనుచూ ఆనందింతురు.

**సాంఖ్యము :** బుద్ధియోగము అవలంబించువారికి సిద్ధిని ప్రసాదింపబడును.

***36వ అధ్యాయములో –*** యోగులు – భక్తులు యిరువురు శ్రేష్ఠులే. అయితే సాకార ఉపాసనకంటే నిరాకారోపాసన కష్టము.

కర్మానుష్ఠానము : పుణ్యకర్మలు చేయుము. పుణ్యకర్మలు చేసి పుణ్యఫలితమును కోరకుము.

యోగము : మనోబుద్ధులను ఏకము చేసి కూటస్థుని క్షేత్రజ్ఞునియందు చేర్చి నిశ్చలసమాధిలో ఉండుము.

భక్తి : అనన్యభక్తిద్వారా ఉపాసింపుము.

జ్ఞానము : సర్వము ఆత్మస్వరూపమని ఎఱిగి జ్ఞానము గలిగి ఉండుము.

పుణ్యకర్మలు చేయుటకంటె కర్మఫలత్యాగము శ్రేష్ఠము. కర్మఫలత్యాగము కంటె యోగమును అభ్యాసము చేయుట శ్రేష్ఠము. యోగాభ్యాసము కంటె ధ్యానము శ్రేష్ఠము. ధ్యానము కంటె జ్ఞానము శ్రేష్ఠము. జ్ఞానము కంటె శాంతి గలిగి ఉండుట శ్రేష్ఠము. శాంతిని గలిగి దేహత్యాగానంతరము ఆత్మయై విరాజిల్లుట శ్రేష్ఠము.

“వైష్ణవ పదారోహణంబు సేయువాఁడు.... గుణత్రయంబునలయించి, ప్రధానంబు నొంది, ప్రధానాత్మకత్వమున దేహంబును, నుపాధి పరంపరావసానంబునం బ్రకృతిం బాసి యానందమయుండై యానందంబునం బరమాత్మ రూపంబైన వాసుదేవ బ్రహ్మంబునందు గలియును”.

*(భాగవతము – ద్వితీయ స్కంధము – 32)*

గుణత్రయంబు లయించి అని చెప్పినదానినే – సమశత్రౌ చ మిత్రౌ చ; మానవమానయోః (సమః); శీతోష్ణ సుఖదుఃఖేషు సమః; తుల్యనిందాస్తుతిః (సమః); – మొదలయిన ద్వంద్వాతీతస్థితులు చెప్పి యిట్టి వారు నాకు ఇష్టులు అని చెప్పబడినది.

గుణత్రయమును జయించినవారు ప్రధానంబు నొందుదురు. వీరు శాంతి గలిగి జీవన్ముక్తులై, విదేహులై ఉందురు. వీరు ప్రకృతినుండి జనించిన తమోగుణ, రజోగుణములను జయించి సత్త్వగుణము గలిగి ఆపై గుణరహితులై దేహత్యాగానంతరము ఆత్మయై విరాజిల్లుదురు.

***32వ అధ్యాయములో–*** దేహత్యాగసమయము – దేహత్యాగ సమయమున ఏయే భావములతో దేహమును వదలుచున్నారో ఆ భావముల అనుసారము పునర్జన్మకు వచ్చుచున్నారు. ఆత్మను దర్శించువారు ఆత్మను పొందుచున్నారు. వారికి పునర్జన్మ లేదు.

***34వ అధ్యాయములో –*** ఆత్మతత్త్వము గ్రహించినవాడు ఆత్మను పొందును. ఆత్మను దర్శించినవారు సర్వపాపములనుండి, సర్వబంధములనుండి విముక్తులగుదురు. విభూతులను గూర్చి తత్త్వరీత్యా గ్రహించినవారు బంధవిముక్తులగుదురు.

***34వ అధ్యాయములో –***నిరాకారముగా యోగములో ఆత్మరూపమున ధ్యానించవలయును. సాకారముగా భక్తిలో పురుషోత్తమునిగా ధ్యానించవలయును.

***35వ అధ్యాయములో –ఆత్మలో ఏకీభూతమగుట :***తత్త్వజ్ఞానము ఎఱుంగుటకు, విశ్వరూపము చూచుటకు ఆత్మలో ప్రవేశించుటకు సాధన అవసరము. ద్వంద్వరహితులయిన నిష్కామకర్మానుష్ఠానపరులు, సంగవర్జితులయిన యోగులు, భక్తులు, ఆత్మలో ప్రవేశించెదరు.

***32వ అధ్యాయములో –*** ఆత్మస్థానము పరమాంగతిమ్ అముః – ఉత్కృష్ట స్థానముగా చెప్పుదురు.

అధ్యాత్మము – ఆత్మతత్త్వము అధ్యాత్మమనబడును.

కర్మ – విరాట్ పురుషుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగా చేయు సృష్టి, స్థితి, లయములు కర్మమనబడును. అదేవిధముగా జీవులు చేయు పనులు కర్మ అనబడును.

అధిభూతమ్ – నశించు ఈ శరీరము అధిభూతము అనబడును.

అధిదైవమ్ - దేహములోగల దేహి అధి దైవమనబడును.

అభియజ్ఞః - దేహములో హృదయగుహలోగల ఆత్మయే అధియజ్ఞుడు.

వ్యాసభగవానుడు సమానార్థకములుగా ప్రయోగించిన పదములు.

1. **కిమ్ తత్ బ్రహ్మ = బ్రహ్మ / ఆత్మ**
2. **కిమ్ అధ్యాత్మమ్ = ఆత్మతత్త్వము**
3. **కిమ్ కర్మ = విరాట్పురుషుడు చేసిన సృష్టి, స్థితి, లయములు**
4. **కిమ్ అధిభూతమ్ = దేహము**
5. **కిమ్ అధిదైవమ్ = జీవుడు**
6. **కః అధియజ్ఞః = హృదయగత ఆత్మ**

...... ❖ ❖ ❖ ......



ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము 31వ అధ్యాయము

## (జ్ఞాన విజ్ఞాన యోగము)

కైవల్య ఉపనిషత్‌లో అశ్వలాయనుడు బ్రహ్మను చేరి బ్రహ్మవిద్యను ఉపదేశింపుమని ప్రార్థింప, శ్రద్ధ, భక్తి, యోగములచేత ఆత్మను గ్రహింపుమని బ్రహ్మ చెప్పును. అదే విషయములు యిట్లు చెప్పబడుచున్నవి.

శ్రీ భగవానువాచ

ఆత్మను తెలుసుకొను విధము (బ్రహ్మవిద్య) చెప్పబడుచున్నది.

**మయ్యాసక్త మనాః పార్థ । యోగం యుంజన్మదాశ్రయః ।**
**అసంశయం సమగ్రం మాం । యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥ 1**

మయి–ఆసక్త మనాః –పార్థ –యోగమ్–యుంజన్–మదాశ్రయః
అసంశయమ్–సమగ్రమ్–మామ్–యథా–జ్ఞాస్యసి–తత్–శృణు

**జ్ఞానంతేஉహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః ।**
**యత్ జ్ఞాత్వా నేహ భూయోஉన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే ॥ 2**

జ్ఞానమ్–తే–అహమ్–సవిజ్ఞానమ్–ఇదమ్–వక్ష్యామి–అశేషతః
యత్–జ్ఞాత్వా–న–ఇహ–భూయః–అన్యత్–జ్ఞాతవ్యమ్–అవశిష్యతే

**మనుష్యాణాం సహస్రేషు । కశ్చిద్యతతి సిద్ధయే ।**
**యతతామపి సిద్ధానాం । కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ 3**

మనుష్యాణామ్ – సహస్రేషు – కశ్చిత్ – యతతి – సిద్ధయే
యతతామ్ – అపి – సిద్ధానామ్ – కశ్చిత్ – మామ్ – వేత్తి – తత్త్వతః

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| మయి | = | (నా యందు) బ్రహ్మను చేరుట యందు |
| ఆసక్త మనాః | = | ఆసక్త మయిన మనస్సుగలవాడవును అనగా శ్రద్ధగలవాడవును |
| మదాశ్రయః (సన్) | = | నన్నే ఆశ్రయించినవాడవును అయి అనగా ఆత్మను ఆశ్రయించినవాడవై, భక్తిగలవాడవై |
| యోగమ్+యుంజన్ | = | యోగమును చేయుచున్నవాడవై అనగా యోగమును అభ్యసించుచు |
| మామ్ | = | (నన్ను) ఆత్మను అనగా సృష్ట్యాది యందున్న ఆత్మ విశ్వముగా ఎలా విస్తరిల్లినదో |
| సమగ్రమ్+అసంశయమ్ | = | సంపూర్ణముగా, సందేహము లేకుండా |
| యథా+జ్ఞాస్యసి | = | ఏ విధముగా తెలుసుకొందువో |
| తత్+శృణు | = | ఆ విధానమును వినుము |
| యత్+జ్ఞాత్వా+ఇహ+భూయః | = | దేనిని తెలుసుకొని ఈ లోకమున మరల |
| అన్యత్+జ్ఞాతవ్యమ్ | = | ఇంకొకటి తెలుసుకొనుటకు |
| న+అవశిష్యతే | = | మిగిలియుండదో అట్టి |
| ఇదమ్+జ్ఞానమ్ | = | ఈ జ్ఞానమును అనగా శాస్త్రవిషయములను అనగా అపరవిద్యను |
| సవిజ్ఞానమ్ | = | విజ్ఞానముతో సహా అనగా అనుభవజన్య జ్ఞానముతో సహా అనగా పరవిద్యను |
| అశేషతః+తే+అహమ్ | = | సంపూర్ణముగా నీకు నేను |
| వక్ష్యామి | = | చెప్పుచున్నాను. అనగా ఏది తెలిసికొన్నచో ఈ సర్వము తెలియునో దీనిని శాస్త్రపాఠముగాను, ఆచరణ విధానముగాను చెప్పుచున్నాను. |

| | | |
|---|---|---|
| మనుష్యాణామ్+సహస్రేషు | = | వేల కొలది మనుష్యులలో |
| కశ్చిత్+సిద్ధయే+యతతి | = | ఒకానొకడు పుణ్యానుభవ పుణ్యలోకములు గాక బహ్మత్వమును పొందుటకొఱకు ప్రయత్నించు చున్నాడు. |
| సిద్ధానామ్+యతతామ్+అపి | | అలా బ్రహ్మత్వసిద్ధి కొఱకు ప్రయత్నించువారిలో కూడా యోగభ్రష్టుడు గాకుండా |
| కశ్చిత్+మామ్+ తత్త్వతః+వేత్తి | = | ఒకానొకడు నన్ను అనగా ఆత్మను తత్త్వరీత్యా ఎఱుగును. |

**వ్యాఖ్యానము :-** ముండక ఉపనిషత్ 1-3లో శిష్యుడు గురువును - **"కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి"**

ఏది తెలుసుకొన్న ఈ సర్వము తెలియును అని శౌనకుడు అతని గురువును అడుగగా అతడు అపరవిద్య, పరవిద్యలనే విద్యలు రెండు గలవు. ఆ రెండింటిని తెలుసుకొన్న ఈ సర్వము తెలియునని చెప్పినాడు. అపరవిద్య ఇహలోక పరలోకములకు సంబంధించిన సర్వవిషయములను విశదీకరించును. ఈ అపరవిద్యను గ్రహించుటకు నాలుగు వేదములను శీక్షా, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను షడంగములతో చదువవలయును. అనగా వేదవేదాంగములను శ్రద్ధగా చదివి అందలి సారాంశమును గ్రహించవలయును. పుణ్యకర్మలు చేయు విధివిధానము వివరింపబడి ఆ పుణ్యఫలితముగా పుణ్యలోకములలో పొందు సుఖ-భోగముల గుఱించి చెప్పును. అటులనే ఆత్మస్థానము పొందు విధివిధానము కూడ వేదములలో వివరింపబడును. కానీ అధికసంఖ్యాకులు కామ్యకర్మములందు, వాటి ఫలితములందు మ్రొగ్గుచూపుదురు. పుణ్యకర్మల ఫలితమువలన పుణ్యలోకములు పొందియు, పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మింతురు అని గ్రహించిన జ్ఞాని ఆ పుణ్యఫలితములను కోరక నిష్కామకర్మావలంబియై శ్రద్ధా, భక్తి, ధ్యానయోగములను అవలంబించి బ్రహ్మత్వమును పొందవలయును. ఆచరణ పాఠము పరవిద్య. పరవిద్య పాటించువారి సంఖ్య అతి స్వల్పము. ఈ విషయమునే రాబోవు శ్లోకములో వివరించుచున్నాడు.

...... ❖ ❖ ❖ ......

అపరా ప్రకృతి - పరా ప్రకృతి

**భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ ।**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥ 4**

భూమిః – అపః – అనలః – వాయుః –ఖమ్– మనః – బుద్ధిః – ఏవమ్–చ
అహంకారః – ఇతి – ఇయమ్ – మే – భిన్నా – ప్రకృతిః – అష్టధా

**అపరేయ మితస్త్వన్యాం । ప్రకృతి విద్ధి మే పరామ్ ।**
**జీవభూతాం మహాబాహో । యయేదం ధార్యతే జగత్ ॥ 5**

అపరా – ఇయమ్ – ఇతః – తు – అన్యామ్ – ప్రకృతిమ్ – విద్ధి – మే – పరామ్
జీవభూతామ్ – మహాబాహో – యయా – ఇదమ్ – ధార్యతే – జగత్

| | | |
|---|---|---|
| మహాబాహో | = | ఓ అర్జునా! ప్రకృతివలన మహత్, మహత్ వలన |
| అహంకారః+మనః+ | = | అహంకారము, సాత్త్వికాహంకారమువలన మనస్సు |
| బుద్ధిః | | రజో అహంకారమువలన బుద్ధి, తమోహంకారము వలన పుట్టిన పంచతన్మాత్రల వలన |
| ఖమ్+వాయుః+అనలః+ ఆపః+భూమిః+ఇతి | = | ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అని |
| మే+ఇయమ్+ప్రకృతిః | = | నా యొక్క ఈ ప్రకృతి |
| అష్టధా+భిన్నా | = | అష్టవిధములయినది. |

అనగా అష్ట ఆవరణములు గలిగి ఉన్నది. 1. ప్రకృతి 2. మహత్ 3. అహంకారము 4. ఆకాశము 5. వాయువు 6. అగ్ని 7. జలము 8. భూమి అనే అష్ట ఆవరణలతో ఈ బ్రహ్మాండము కూడివున్నది. జీవుల దేహము ఈ అపరా ప్రకృతిచే ఏర్పడినది.

| | | |
|---|---|---|
| మహాబాహో | = | ఓ అర్జునా! జీవుల ఉపాధికి కారణమయిన |
| మే+ఇయమ్+ప్రకృతిమ్ అపరా+విద్ధి | = | నా యొక్క ఈ అపరా ప్రకృతిని తక్కువదిగా తెలియుము |
| ఇతః+అన్యామ్+యయా | = | దీనికంటే ఇతరమయిన ఏ దేహముచేత అనగా విరాట్‌దేహము చేత |
| ఇదమ్+జగత్ | = | ఈ సర్వజగత్తు |
| ధార్యతే+జీవభూతామ్+ పరామ్+తు | = | ధరింపబడుచున్నదో, అట్టి సర్వజీవులకు నిలయమయిన విరాట్‌దేహము యొక్క పరాప్రకృతి ఉత్కృష్టమయినదిగా తెలియుము విరాట్‌పురుషుని దేహమునుంచి సర్వస్థావరజంగమములు ఏర్పడినవి. ఈ సృష్టి అంతా విరాట్ దేహమే. |

**వ్యాఖ్యానము :-**

**సృష్టి గురించి వివరించుచున్నాడు:**

ప్రశ్నోపనిషత్ చతుర్థప్రశ్న - శ్లోకం 8

పృథివీచ పృథివీ మాత్రా చాఽఽపశ్చాఽఽపోమాత్రా చ తేజశ్చ తేజో మాత్రా చ వాయుశ్చ వాయు మాత్రా చ ఆకాశశ్చాఽఽకాశ మాత్రా చ చక్షుశ్చ ద్రష్టవ్యం చ శ్రోతం చ శ్రోతవ్యం చ ఘ్రాణం చ ఘ్రాతవ్యం చ రసశ్చ రసయతవ్యం చ త్వక్చ స్పర్శ యితవ్యం చ వాక్చ వక్తవ్యం చ హస్తౌచాఽఽదాతవ్యం చో పస్థ శ్చానంద యతవ్యం చ పాయుశ్చ విసర్జ యితవ్యం చ పాదౌ చ గంతవ్యం చ మనశ్చ మంతవ్యం చ బుద్ధిశ్చ బోద్ధవ్యం చాహంకారశ్చాహం కర్తవ్యం చ చిత్తం చ చేత యితవ్యం చ తేజశ్చ విద్యోతయితవ్యం చ ప్రాణశ్చ విధారయితవ్యం చ ॥

ఇదే విషయము భాగవతమున మరికొంత విపులముగా యిట్లు చెప్పబడినది.

ఈశ్వరుడు ప్రకృతిని అధిష్ఠించి ఉండుటవలన

|

మహత్తత్త్వము వచ్చినది. దానినుండి

|

అహంకారము వచ్చినది. అది మూడు భాగములయినది.



సాత్త్వికాహంకారము — మనస్సు

రాజసాహంకారము — బుద్ధి, ప్రాణము

తామసాహంకారము —
శబ్దతన్మాత్ర — ఆకాశము
స్పర్శతన్మాత్ర — వాయువు
రూపతన్మాత్ర — అగ్ని
రసతన్మాత్ర — జలము
గంధతన్మాత్ర — భూమి

మూలప్రకృతియు మహదహంకారంబులును బంచతన్మాత్రంబులు నివి యెనిమిదియుం బ్రకృతులనియు రజస్సత్త్వతమంబులు మూఁడును బ్రకృతి గుణంబు లనియును, గర్మేంద్రియంబులయిన వాక్పాణిపాదపాయూపస్థంబులును జ్ఞానేంద్రియంబులైన శ్రవణనయనరసనాత్వగ్ఘ్రాణంబులును మనంబును మహీసలిల తేజోవాయు గగనంబులును నివి పదాఱును వికారంబు లనియును గపిలాది పూర్వాచార్యులచేతఁ జెప్పంబడియె. *(భాగవతము – సప్తమస్కంధం – 237)*

జీవులకు ఒక దేహమున్నది. విరాట్‌పురుషునకు ఒక దేహమున్నది. ఏ ప్రకృతివలన జీవుల దేహము ఏర్పడినదో అది అపరా ప్రకృతి. ఏ ప్రకృతివలన విరాట్ పురుషుని దేహము ఏర్పడినదో అది పరా ప్రకృతి. అనగా వీరిరువురి దేహలక్షణములు ఒకటి గావు. అటులనే దేహలక్షణములు, దేహి లక్షణములు ఒకటిగావు.

...... ❖ ❖ ❖ ......

ప్రకృతి - ఆత్మ - విరాట్ పురుషుడు

**ఏతద్యోనీని భూతాని । సర్వాణీత్యుపధారయ ।**
**అహం కృత్స్నస్య జగతః । ప్రభవః ప్రలయస్తథా ॥ 6**

ఏతత్ – యోనీని – భూతాని – సర్వాణి – ఇతి – ఉపధారయ
అహమ్ – కృత్స్నస్య – జగతః – ప్రభవః – ప్రలయః – తథా

**మత్తః పరతరం నాన్యత్ । కించిదస్తి ధనంజయ ।**
**మయి సర్వమిదం ప్రోతం । సూత్రే మణిగణా ఇవ ॥ 7**

మత్తః – పరతరమ్ – న – అన్యత్ – కించిత్ – అస్తి – ధనంజయ
మయి – సర్వమ్ – ఇదమ్ – ప్రోతమ్ – సూత్రే – మణిగణాః – ఇవ

సర్వాణి + భూతాని = సర్వ భూతములు

ఏతత్ + యోనీని = ప్రకృతి – మహత్ – అహంకారము అనే ఈ సృష్టి జనన కారణమైన స్థానముల నుండియే (జన స్థానముల) జనియించుచున్నవి.

**విరాట్ పురుషుడు**

అహమ్+కృత్స్నస్య+ = నేను, విరాట్పురుషునిగా సమస్తమయిన
జగతః+ప్రభవః జగత్తునకు సృష్టికర్తను
తథా+ప్రలయః = అటులనే స్థితికర్తను లయకర్తను అని
ఇతి +ఉపధారయ గ్రహించుము

**ఆత్మగా:**

ధనంజయ = ఓ అర్జునా!
మత్తః+అన్యత్+కించిత్ = నా కంటె ఇంకొకటి ఏమియు
పరతరమ్+న అస్తి = లేదు. అనగా ఈ సృష్టి సర్వము నేనే

| | | |
|---|---|---|
| మయి | = | నాయందు విరాట్ పురుషుని దేహమునందు రథనాభిలో రథచక్రపు ఆకులు అమరియున్నట్లు ఈ సర్వజగత్తు కూర్చబడియున్నది. |

**అంతరాత్మగా :**

| | | |
|---|---|---|
| ఇదమ్+సర్వమ్+సూత్రే+ మణిగణాః+ఇవ+ప్రోతమ్ | = | ఈ సర్వము సూత్రమునందు మణుల సమూహము వలె కూర్చబడినది |

**మూలప్రకృతి మొదలయిన వర్గంబునకు వేఱై మణిగణంబులం జొచ్చి యున్న సూత్రంబుచందంబున నాత్మ యిన్నింటియందునుం జొచ్చి దీపించు**

(భాగవతము - సప్తమస్కంధం-237)

...... ❖ ❖ ❖ ......

అంతర్యామిగా

**రసోఽహమప్సు కౌన్తేయ । ప్రభాస్మి శశిసూర్యయోః ।**
**ప్రణవః సర్వ వేదేషు । శబ్దః ఖే పౌరుషం నృషు ॥ 8**

రసః - అహమ్ - అప్సు - కౌన్తేయ - ప్రభా - అస్మి - శశి సూర్యయోః
ప్రణవః - సర్వ వేదేషు - శబ్దః - ఖే - పౌరుషమ్ - నృషు

**పుణ్యో గన్ధః పృథివ్యాం చ । తేజశ్చాస్మివిభావసౌ ।**
**జీవనం సర్వభూతేషు । తపశ్చాస్మి తపస్విషు ॥ 9**

పుణ్యః - గన్ధః - పృథివ్యామ్ - చ - తేజః - చ - అస్మి - విభావసౌ
జీవనమ్ - సర్వ భూతేషు - తపః - చ - అస్మి - తపస్విషు

**బీజం మాం సర్వభూతానాం । విద్ధిపార్థ సనాతనమ్ ।**
**బుద్ధి ర్బుద్ధిమతామస్మి । తేజస్తేజస్వినా మహమ్ ॥ 10**

బీజమ్ – మామ్ – సర్వభూతానామ్ – విద్ధి – పార్థ – సనాతనమ్
బుద్ధిః – బుద్ధిమతామ్ – అస్మి – తేజః – తేజస్వినామ్ – అహమ్

**బలం బలవతాం చాహం । కామరాగవివర్జితమ్ ।**
**ధర్మా విరుద్ధో భూతేషు । కామోఽస్మి భరతర్షభ ॥ 11**

బలమ్ – బలవతామ్ – చ – అహమ్ – కామరాగ వివర్జితమ్
ధర్మావిరుద్ధః – భూతేషు – కామః – అస్మి – భరతర్షభ

విరాట్‌పురుషుడు

**యే చైవ సాత్త్వికా భావా । రాజసా స్తామసాశ్చ యే ।**
**మత్త ఏవేతి తాన్విద్ధి । న త్వహం తేషు తే మయి ॥ 12**

యే–చ– ఏవ – సాత్త్వికాః – భావాః – రాజసాః – తామసాః – చ – యే
మత్తః – ఏవ – ఇతి – తాన్ – విద్ధి–న – తు – అహమ్ – తేషు – తే – మయి

కౌన్తేయ = ఓ అర్జునా!
అహమ్+శశిసూర్యయోః +ప్రభా = నేను అంతరాత్మగా చంద్రసూర్యుల యందుగల కాంతిని

చంద్రుని నుండి చంద్రకాంతిని; సూర్యుని నుండి సూర్యకాంతిని విడదీయలేము అటులనే పంచ భూతములనుండి వాటి గుణములను విడదీయలేము.

ఖే+శబ్దః = పంచ భూతములలో ఒకటైన ఆకాశమునందు శబ్ద గుణమును
అప్సు+రసః = పంచ భూతములలో ఒకటైన జలమునందు రస గుణమును

| | | |
|---|---|---|
| సర్వవేదేషు+ప్రణవః | = | సర్వవేదముల యందు సాధన కొఱకు ప్రస్తుతింపబడిన ప్రణవమును. అనగా ఓంకారమును ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ) |

**విడదీయగల అంతర్యామిత్వముగా**

| | | |
|---|---|---|
| నృషు+పౌరుషమ్+అస్మి | = | మానవులయందు పౌరుషమును నేను అయి ఉన్నాను |

మానవుడు మరణించగనే అతనిలోని పౌరుషము ఉండదు. ఆవిధముగా పౌరుషమును, మానవుని నుండి విడదీయవచ్చును.

**విడదీయలేని అంతర్యామిత్వముగా**

| | | |
|---|---|---|
| విభావసౌ+తేజః | = | పంచ భూతములలోని అగ్ని యందు తేజస్సును |
| చ | = | మఱియు |
| పృథివ్యామ్+పుణ్యః+చ | = | పంచ భూతములలోని భూమి యందు |
| గన్ధః + అస్మి | | ఆ పంచభూతమునకు గుణమైన శబ్దస్పర్శరూప రసగంధములలో నేను. |
| చ | = | మఱియు విడదీయుటకు వీలు అయిన అంతర్యామిత్వమున |

**విడదీయగల అంతర్యామిత్వముగా**

| | | |
|---|---|---|
| సర్వభూతేషు+జీవనమ్ | = | సర్వభూతములందు ప్రాణము నేను అయి ఉన్నాను. (ఆత్మ బింబము. ప్రాణము దాని ఛాయ) |
| చ | = | మఱియు |
| తపస్విషు+తపః+ | = | తపస్సుచేయు వారి యందు |
| అస్మి | | తపస్సు అయి ఉన్నాను |
| పార్థ | = | ఓ అర్జునా! |

| | | |
|---|---|---|
| సనాతనమ్+అహమ్+ విద్ధి | = | సృష్ట్యాదియందుగల ఆత్మను నేను అని గ్రహించుము. |

**విరాట్ పురుషుడు**

| | | |
|---|---|---|
| మామ్+సర్వభూతానమ్ బీజమ్ | = | నన్ను సర్వభూతముల సృష్టికి మూలకారణమయిన బీజము అని తెలియుము |
| బుద్ధిమతామ్+బుద్ధిః తేజస్మినామ్+తేజః అస్మి | = | బుద్ధిమంతులలో బుద్ధి నేను తేజోవంతులలో తేజస్సు నేను అయి ఉన్నాను |
| భరతర్షభ | = | ఓ అర్జునా! |

**విడదీయగల అంతర్యామిత్వము:**

| | | |
|---|---|---|
| అహమ్+బలవతామ్+ కామరాగవివర్జితమ్+ బలమ్ | = | నేను విడదీయగల అంతర్యామిత్వమున బలవంతులలో కామరాగ వివర్జితమయిన బలమును నేను అయి ఉన్నాను. |
| చ | = | మఱియు |
| భూతేషు+ధర్మావిరుద్ధః+ కామః +అస్మి | = | ప్రాణులయందు ధర్మవిరుద్ధము కాని – అనగా ధర్మపరమయిన కామము నేను అయి ఉన్నాను. |

**విరాట్పురుషునిగా**

| | | |
|---|---|---|
| సాత్త్వికాః+రాజసాః+చ తామసాః+ ఏవ | = | సత్త్వగుణము వలన, రజోగుణము వలన తమోగుణము వలన |
| యే+భావాః+ తాన్ మత్తః + ఏవ+విద్ధి | = | ఏ భావములుగలవో వాటిని నా నుండియే అనగా విరాట్పురుషుని నుండియే జనియించినవని గ్రహించుము. |
| చ | = | మఱియు |

యే + తు = ఏఏ కర్మలు, మంత్రములు, యజ్ఞములు కలవో అవి అన్నియూ నానుండియే జనియించుచున్నవి అని గ్రహించుము. సర్వము నేనే. నేను కానిది పరమాణువు కూడా లేదు.

**ఆత్మగా**

మయి+తే+న = నా యందు అనగా ఆత్మయందు ఈ సర్వస్థావర జంగమములు, ప్రకృతి జీవులు లేవు

**అంతర్యామిగా**

అహమ్+తేషు+ఇతి+చ = నేను అంతర్యామిగా ఆ సర్వస్థావర జంగమములలో ప్రకృతిలో జీవులలో ఉన్నానని గ్రహించుము.

**వ్యాఖ్యానము :-** ప్రకృతి క్షేత్రము. విరాట్ పురుషుడు బీజము. ఈవిధముగా సృష్టి జరిగినది. అదేవిధముగా ప్రకృతి యోని అనియు, అందు పురుషుడు వీర్యము పెట్టిన సృష్టి జరిగినదనియు యింకొక ఉదాహరణ సృష్టి గురించి యివ్వబడెను.

అదేవిధముగా ఊర్ణనాభి తనలో నుంచియే దారమును తీసి గూడును అల్లును. అదేవిధముగా సృష్టి జరిగినదని ఉదాహరణ యివ్వబడెను. ఈవిధముగా మూడు ఉదాహరణలు సృష్టి గురించి యివ్వబడెను.

ఆకాశమునకు శబ్దము, వాయువునకు స్పర్శ, అగ్నికి రూపము, జలమునకు రసము, భూమికి గంధము వీటిని పంచభూతములనుండి ఆ గుణములను విడదీయలేము. అటులనే సూర్యచంద్రులనుండి వాటి కాంతిని విడదీయలేము. వేదములలో 'ఓం'కారము ప్రముఖపాత్ర వహించును. మానవులయందుగల తపస్సు, తేజస్సు, బుద్ధి, పౌరుషము, బలము, ప్రాణము, కామము, ఇవి మానవుడు చనిపోయిన తరవాత ఈ మానవులనుండి విడివడును.

...... ❖ ❖ ❖ ......

మాయా స్వరూపము - మాయను దాటు విధానము

**త్రిభిర్గుణమయై ర్భావైః । ఏభిః సర్వ మిదం జగత్ ।**
**మోహితం నాభిజానాతి । మామేభ్యః పరమ వ్యయమ్ ॥ 13**

త్రిభిః – గుణమయైః – భావైః – ఏభిః – సర్వమ్ – ఇదమ్ – జగత్
మోహితమ్ – న – అభిజానాతి – మామ్ – ఏభ్యః – పరమ్ – అవ్యయమ్

మాయను దాటు విధానము

**దైవీ హ్యేషా గుణమయీ । మమ మాయా దురత్యయా ।**
**మామేవ యే ప్రపద్యన్తే । మాయా మేతాం తరన్తి తే ॥ 14**

దైవీ – హి – ఏషా – గుణమయీ – మమ – మాయా – దురత్యయా
మామ్ – ఏవ – యే – ప్రపద్యన్తే – మాయామ్ – ఏతామ్ – తరన్తి – తే.

మాయా ప్రభావము

**న మాం దుష్కృతినో మూఢాః । ప్రపద్యన్తే నరాధమాః ।**
**మాయయాపహృతజ్ఞానా । ఆసురం భావమాశ్రితాః ॥ 15**

న – మామ్ – దుష్కృతినః – మూఢాః – ప్రపద్యన్తే – నరాధమాః
మాయయా – అపహృత జ్ఞానాః – ఆసురమ్ – భావమ్ – ఆశ్రితాః

ఇదమ్+సర్వమ్+జగత్+ = ఈ సర్వవిశ్వము సత్త్వ, రజో, తమోగుణములనే
ఏభిః+త్రిభిః మూడు గుణముల చేత
గుణమయైః + భావైః = ఆ గుణములచేత గలిగిన భావములచేత
మోహితమ్(సత్) = మోహమును పొందింపబడినవై అనగా గుణములచే మోహింపబడుటవలన
ఏభ్యః+పరమ్+ = ప్రకృతి, పురుషుడు, విరాట్పురుషుడుకంటె

| | | |
|---|---|---|
| అవ్యయమ్+మామ్+ | | విలక్షణమైనట్టియు, నాశనరహితమైనట్టియు |
| న+అభిజానాతి | | నన్ను అనగా ఆత్మను ప్రాణికోటి తెలియజాల కున్నది. |
| మమ+ఏషా+మాయా | = | నా యొక్క ఈ మాయ |
| దైవీ+గుణమయీ+ | = | మోహినీ స్వరూపమయినదియు గుణములతో |
| దురత్యయా | | కూడినదియు దాటశక్యముకానిది. |
| యే+మామ్+ఏవ+ | = | ఎవరు నన్నే ఆత్మనే శరణు కోరుచున్నారో |
| ప్రపద్యన్తే | | |
| తే+ఏతామ్+మాయామ్ | = | వారు ఈ మాయను దాటుచున్నారు |
| +తరంతి | | |
| హి | = | ఆనందమయులై ఆత్మయందు కలసి ఆత్మస్వరూపు లగుచున్నారు. |
| మాయయా | = | నాదైన మాయచేత అనగా త్రిగుణములచేత |
| అపహృతజ్ఞానాః+ | = | జ్ఞానశూన్యులును దుష్కృత్యములు |
| దుష్కృతినః+మూఢాః+ | | (పాప కృత్యములు) చేయు వారును |
| నరాధమాః | | మూర్ఖులయిన నరాధములును |
| ఆసురమ్+భావమ్+ | = | అసుర సంబంధమయిన భావమును |
| ఆశ్రితాః+మామ్+ | | ఆశ్రయించినవారును నన్ను అనగా ఆత్మను |
| న+ప్రపద్యన్తే | | శరణు కోరుటలేదు. |

**వ్యాఖ్యానము :-** ఈ గుణములనే **మోహిని**గా వర్ణించి, మోహిని అమృతమును రాక్షసులకు అందకుండా చేసినట్లు కథగా వర్ణించిరి. అనగా త్రిగుణ యుతులైనవారు అమృతత్త్వమును పొందలేరని ఈ కథ ద్వారా మనకు సందేశము ఇవ్వబడినది.

ఈ విషయమునే ప్రహ్లాదుడు ఈ మాయను దాటు విధానము గుఱించి ఇలా అనెను... **"మాధవ శేముషీతరణిసాంగత్యంబునంగాక దుర్మేధన్ దాఁటఁగ వచ్చునే"**

అనగా భగవంతుడనే ఓడను ఆశ్రయించుట తప్ప మాయను దాటుటకు ఇంకొక విధానము లేదు. పరమాత్మను ఆశ్రయించియే మాయను దాటవలెను.

*(భాగవతము, సప్తమ స్కంధము -183)*

తమోగుణయుతులు (రాక్షసులు) భగవంతునుని శరణు కోరరు. రజోగుణయుతులు ఇహలోక పరలోక సుఖాపేక్షాపరులు. దేవతలను ఆరాధింతురు. సత్త్వగుణాశ్రయులు, బ్రహ్మత్వము పొందగోరువారు మాత్రమే భగవంతునుని శరణు కోరుదురు.

ఉదాహరణగా గజేంద్రుని కథ చెప్పినారు. గజేంద్రుడు కథా కాలమునాటికి శేషసాయి పవళించిన పాలసముద్రములోనే గల త్రికూట పర్వతము వద్ద ఉండెను. గజేంద్రుడు, విష్ణువు ఇద్దఱూ పాలసముద్రములోనే ఉన్నారు. గజేంద్రుడు శరణు జొచ్చినాడు. విష్ణువు వచ్చి గజేంద్రున్ని తన చేతితో స్పృశించినాడు.

ఆ॥ .......(నపుడు) **శౌరి కేలనంటి తడవ**

**హస్తిలోకనాథుఁడజ్ఞాన రహితుఁడై విష్ణురూపుఁడగుచు వెలుఁగుచుండె-**

*(భాగవతము అష్టమ స్కంధం - 121)*

అనగా గజేంద్రుని విష్ణువు తన చేతితో స్పృశింపగా గజేంద్రునిలో అజ్ఞానము నశించి అతడు విష్ణురూపుడు అయ్యెను.

శరణాగతివలన అహంకారము నశించి, అజ్ఞానము తొలగి పూర్వజన్మ కర్మవాసనలు దగ్ధమవుతాయి. శరణుకోరనిచో విద్యామదమువలన పునర్జన్మకు వచ్చెదరు. అనగా పాపాత్ములు అజ్ఞానులు ఆత్మను శరణు కోరుటలేదు.

దీనిని కథలుగా రాక్షసులు, విష్ణువును పూజింపక, ఆశ్రయింపక శరణు కోరక ఉన్నట్లు వర్ణింతురు. రాక్షసులు తపస్సు చేసి, వరములు పొంది నశించినట్లు వర్ణింతురు. పుణ్యకర్మానుష్ఠానము చేసి, ఇహలోక సుఖములు, పరలోక సుఖములు కోరువారు రాక్షసులని పెద్దల భావన. "రాక్షసులకు హరి భజనంబు శక్యంబు కాదు" అని ప్రహ్లాదుడు తోటి రాక్షస బాలురతో చెప్పును.

...... ❖ ❖ ❖ ......

పుణ్యాత్ములలో భగవంతుని దర్శించి, భగవంతుని శరణుకోరిన వారిలోని విభాగములు

**చతుర్విధా భజన్తే మాం । జనాస్సుకృతినోఽర్జున ।**
**ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ । జ్ఞానీ చ భరతర్షభ ॥ 16**

చతుః – విధాః – భజన్తే – మామ్ – జనాః – సుకృతినః – అర్జున
ఆర్తః – జిజ్ఞాసుః – అర్థార్థీ – జ్ఞానీ – చ – భరతర్షభ

**తేషాం జ్ఞానీ నిత్యయుక్త । ఏకభక్తిర్విశిష్యతే ।**
**ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ । మహం స చ మమ ప్రియః ॥ 17**

తేషామ్ – జ్ఞానీ – నిత్యయుక్తః – ఏక భక్తిః – విశిష్యతే
ప్రియః – హి – జ్ఞానినః – అతి – అర్థమ్ – అహమ్ – సః – చ – మమ – ప్రియః

అర్జున = ఓ అర్జునా!

మామ్ = నన్ను పురుషోత్తమునిగా

ఆర్తః = **ఆర్తుడు** అనగా శారీరక మానసిక బాధలనుండి విముక్తిని కోరువాడు

అర్థార్థీ = **అర్థము**ను కోరువాడు అనగా ఇహలోక, పరలోక భోగ భాగ్యములను, సుఖములను కోరువాడు.

జిజ్ఞాసుః = **జిజ్ఞాసువు**. పరమ పురుషునుని తెలుసుకొన గోరువాడు.

చ = మఱియు

జ్ఞానీ = **జ్ఞానవంతుడు** అనగా ద్వంద్వాతీతుడై ఏ కోరికలు లేకుండా ఈ సృష్టి సర్వము పరమాత్మ యని దర్శించువాడు అని

| | | |
|---|---|---|
| చతుః+విధాః+సుకృతినః+ | = | నాలుగు విధములు అయిన సుకృతకర్ములయిన |
| జనాః+భజన్తే | | పుణ్యాత్ములయిన జనులు భజియించుచున్నారు, సేవించుచున్నారు. |
| భరతర్షభ | = | ఓ అర్జునా! |
| తేషామ్ | = | ఆ నలుగురిలో |
| నిత్యయుక్తః | = | నిత్యము నా యందే అనగా భగవంతుని యందే చిత్తము గలిగియున్నట్టి వాడును |
| ఏక భక్తిః | = | యదృచ్ఛాలాభ సంతుష్టుడై, కోరికలు ఏమియులేని ఏకాంత భక్తి గలవాడును అయిన |
| జ్ఞానీ+విశిష్యతే | = | జ్ఞాని శ్రేష్ఠుడు అగుచున్నాడు |
| జ్ఞానినః+అహమ్+ ప్రియః+చ+సః | = | అట్టి జ్ఞానికి నేను ప్రియుడను మఱియు అట్టి జ్ఞాని |
| మమ+అత్యర్థమ్+ ప్రియః+ హి | = | నాకు మిక్కిలి ప్రియుడు అట్టి జ్ఞాని జీవన్ముక్తుడై దేహత్యాగానంతరము ఆత్మయందు ఏకీభూతుడై ఆత్మయై విరాజిల్లును. |

**వ్యాఖ్యానము :-** ఇదే విషయమును గోపికలు - శ్రీకృష్ణునితో ఇట్లు అనిరి.

**కం॥ కొలిచినఁగొలుతురు కొందఱు**
**గొలుతురు దముఁగొలువకున్నఁగొందఱు పతులం**
**గొలిచినను గొలువకున్నను**
**గొలువరు మరికొందరుచెలమి గోపకుమారా!**

*(భాగవతము దశమస్కంధం -1074)*

అనగా కొందఱు భక్తులు (ఆర్తులు, అర్థార్థులు) తమకు వరములు ప్రసాదించిన వారినే ఆరాధింతురు. కొందఱు (జ్ఞానులు) కోరికలు తీర్చినా, తీర్చకపోయినా నిత్యమూ ఆరాధింతురు. కొందఱు మూర్ఖులు పరమాత్మను పూజింపరు.

గోప బాలురు శ్రీకృష్ణునికి ప్రియులు. శ్రీకృష్ణునకు గోపబాలురు ప్రియమైనవారు. కావుననే గోప బాలురు అజగరము నోటిలోనికి ప్రవేశింపగా వారి రక్షణార్థమై తను కూడా ఆ అజగరము నోటిలోనికి ప్రవేశించి, అజగరమును సంహరించి, వారిని కాపాడినాడు.

గోపికలకు శ్రీకృష్ణుడు ప్రియుడు. వారు శ్రీకృష్ణునకి ప్రియులు. కావుననే

**పాయని గేహశృంఖలలఁ బాసి నిరంతర మత్పరత్వముం**
**జేయుచు నున్న మీకుఁ బ్రతిసేయ యుగంబులనైన నేర నన్**
**బాయక కొల్చు మానసము ప్రత్యుపకారముగాఁ దలంచి నా**
**పాయుటఁదప్పుగాఁగొనక భామినులార! కృపన్ శమింపరే.**

*(భాగవతము-దశమస్కంధం -1081)*

అనగా సంసార శృంఖలములనుండి విడివడినవారు జ్ఞానులు. అట్టి జ్ఞానులైన గోపికల నుద్దేశించి శ్రీకృష్ణుడు వారితో ఇట్లనెను. సంసారమనే సంకెళ్ళను త్రెంచుకొని అనగా సంసారతాపత్రయములను వీడి నాయందే నిరంతరము మీయొక్క మనస్సును ఉంచిన మీకు ఎన్ని యుగములకైనా ప్రత్యుపకారము చేయలేను. మిమ్ములను కూడా నిత్యమూ నేను తలంచుటయే ప్రత్యుపకారముగా భావించుడు.

...... ❖ ❖ ❖ ......

**ఉదారాః సర్వ ఏవైతే । జ్ఞానీత్వాత్మైవ మే మతమ్ ।**
**ఆస్థితః సహి యుక్తాత్మా । మమేవానుత్తమాం గతిమ్ ॥ 18**

ఉదారాః – సర్వః – ఏవ – ఏతే – జ్ఞానీ – తు – ఆత్మా – ఏవ – మే – మతమ్
ఆస్థితః – సః – హి – యుక్తాత్మా – మామ్ – ఏవ – అనుత్తమామ్ – గతిమ్

**బహూనాం జన్మనామన్తే । జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।**
**వాసుదేవః సర్వమితి । స మహాత్మా సు దుర్లభః ॥ 19**

బహూనామ్ – జన్మనామ్ – అన్తే – జ్ఞానవాన్ – మామ్ – ప్రపద్యతే
వాసుదేవః – సర్వమ్ – ఇతి – సః – మహాత్మా – సుదుర్లభః

| | | |
|---|---|---|
| ఏతే+సర్వః+ఉదారాః+ఏవ | = | ఈ చతుర్విధ సుకృత జనులు అందఱును నన్ను దర్శించిన వారగుటవలన గొప్పవారే |
| తు | = | ఈ నలుగురు గొప్పవారిలో |
| జ్ఞానీ+ఆత్మా+ఏవ+మే+ మతమ్ | = | జ్ఞాని అయిన వారు సాక్షాత్తు ఆత్మయే అని నాయొక్క అభిప్రాయము |
| సః+మామ్+ఏవ+ యుక్తాత్మా (సన్) | = | అతడు నా యందే నియమింపబడిన మనస్సుగలవాడై |
| అనుత్తమామ్+గతిమ్+ ఆస్థితః+హి | = | సర్వోత్కృష్టమైన గతిని పొందినవాడు. అతడు దేహ త్యాగానంతరము నన్నే పొందును. |
| బహూనామ్+జన్మనామ్+ అన్తే | = | అనేక జన్మల అంతమున |
| సర్వమ్+వాసుదేవః+ఇతి | = | ఈ దృశ్యమాన ప్రపంచము సర్వము వాసుదేవుడే అని భావించే |
| జ్ఞానవాన్+మామ్+ ప్రపద్యతే | = | జ్ఞాని నన్ను శరణు కోరుచున్నాడు |
| సః+మహాత్మా+ సుదుర్లభః | = | అట్టి మహాత్ముడు ప్రాణికోటిలో అరుదు |

**వ్యాఖ్యానము :-** ఇట్టి జ్ఞానుల గుఱించి అనేక ఉదాహరణలు భాగవతమున యివ్వబడినవి. అట్టి ఉదాహరణలలో గోపబాలురు ఒకరు. వీరు కృష్ణునితో అనగా ఆత్మతో క్రీడించిరి. ఎన్నో జన్మలనుండి కర్మవాసనలు బీజరూపమున జీవునితో పెనవేసుకొని ఉన్నవి. ఆ కర్మవాసనలు నశించవలయునన్న సమస్త భావనలు భగవంతుని యందే సమర్పించు గోపబాలురవలే యుండవలయును. ఆ భగవంతుడే పరమగతియని నమ్మిన జ్ఞానులైన గోపబాలుర గుఱించి బ్రహ్మ యిట్లనెను.

**శా. ఏలా బ్రహ్మపదంబు వేదములకున్ వీక్షింపఁగా రాని ని**
**న్నీలోకంబున నీవనాంతరమునం దీమందలోఁ గృష్ణ యం**
**చాలాపాది సమస్త భావములు నీయందే సమర్పించు నీ**
**బ్రేలం దొక్కని పాదరేణువులుపై వేష్టించినం జాలదే?**

*(భాగవతము - దశమస్కంధం -572)*

అనగా బ్రహ్మపదము ఎందులకు? వేదములు కూడా దర్శింప వీలుకాని నిన్ను ఈ భూలోకమున, ఈ అడవిలో, ఈ ఆవులమందలో 'కృష్ణా! కృష్ణా!' పిలుచుచూ వారి సమస్తభావములూ నీయందు సమర్పించుచున్న ఈ గోపబాలుర పాదములలో ఒకని పాదరేణువుగా ఉంటే ఈ జన్మకు ఇది చాలును.

కర్మానుష్ఠానము చేసినా, యోగాభ్యాసముచేసినా, భక్తిని పాటించినా, సాంఖ్యపద్ధతిని పాటించినా వారి వారి సాధనలలో ఈ అబేధ స్థితికి చేరవలయును. అప్పుడు అందరినీ జ్ఞాని అనియే అందురు. సర్వము అతడే. దీనిని కథగా భాగవతములో బ్రహ్మ గోవులను, గోపబాలురను దాచినాడు. అంత శ్రీకృష్ణుడు సమస్తమునూ తానే అయినాడు. ఆ తర్వాత బలరాముడు

**దన చెలికాండ్రను గ్రేపుల, వనజాక్షుం దనుచుఁజూచె వసుధాధీశా!**

*(భాగవతము దశమస్కంధం -528)*

అనగా సర్వము వాసుదేవునిగా బలరాముడు చూచెను.

...... ❖ ❖ ❖ ......

అజ్ఞానులు కోరికలు గలవారలై ఆయా కోరికలు తీరుటకు
వివిధ దేవతలను ఆరాధించుచున్నారు

**కామ స్తై స్తై ర్హృత జ్ఞానాః । ప్రపద్యన్తేఽన్యదేవతాః ।**
**తం తం నియమమాస్థాయ । ప్రకృత్యా నియతాః స్వయా ॥ 20**

కామైః - తైః - తైః - హృతజ్ఞానాః - ప్రపద్యన్తే - అన్యదేవతాః
తమ్ - తమ్ - నియమమ్ - ఆస్థాయ - ప్రకృత్యా - నియతాః - స్వయా

**యో యో యాం యాం తనుం భక్తః । శ్రద్ధయార్చితుమిచ్ఛతి ।**
**తస్య తస్యాచలాం శ్రద్ధాం । తామేవ విదధామ్యహమ్ ॥ 21**

యః – యః – యామ్ – యామ్ – తనుమ్ – భక్తః – శ్రద్ధయా – అర్చితుమ్– ఇచ్ఛతి
తస్య – తస్య – అచలామ్ – శ్రద్ధామ్ – తామ్ – ఏవ – విదధామి – అహమ్

**స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధన మీహతే ।**
**లభతే చ తతః కామాన్ । మయైవ విహితాన్ హి తాన్ ॥22**

సః – తయా – శ్రద్ధయా – యుక్తః – తస్య – ఆరాధనమ్ – ఈహతే
లభతే –చ– తతః – కామాన్ – మయా – ఏవ – విహితాన్ – హి–తాన్

| | | |
|---|---|---|
| తైః + తైః + కామైః | = | ఇహలోక పరలోక భోగములకు సంబంధించిన ఆ కోరికల చేత |
| స్వయా + ప్రకృత్యా+ నియతాః | = | స్వభావముచేత ప్రేరితులై |
| హృతజ్ఞానాః (సంతః)+ అన్యదేవతాః | = | అపహరింపబడిన జ్ఞానముగలవారులై అనగా జ్ఞాన శూన్యులై ఆత్మను గాక ఇతర దేవతలను |
| తమ్+తమ్+నియమమ్+ ఆస్థాయ+ప్రపద్యన్తే | = | ఆ యా దేవతలను ఆరాధించుటకు సంబంధించిన నియమములను వేదవిహిత విధినిషేధములను పాటించి ఆ యా దేవతలను ప్రజలు ఆరాధించు చున్నారు (జ్ఞాని ఆత్మను ఆరాధించు చున్నాడు). |
| యః+యః+భక్తః (సన్) | = | ఏ ఏ కోరికలు గలవాడు, భక్తుడై ఆ కోరికలు తీరుటకు |
| యామ్+యామ్+తనుమ్ | = | వేదములో చెప్పబడిన ఏయే దేవతలను |
| శ్రద్ధయా+అర్చితుమ్+ ఇచ్ఛతి | = | శ్రద్ధచేత అనగా శ్రద్ధతో అర్చించుట కొఱకు కోరుచున్నాడో అనగా యజ్ఞములు చేయుచున్నాడో |

| | | |
|---|---|---|
| తస్య+తస్య+తామ్+ అచలామ్+శ్రద్ధామ్+ఏవ | = | ఆయా కోరికలు గలవానికి అట్టి స్థిరమయిన శ్రద్ధనే |
| అహమ్+విదధామి | = | నేను వారికి గలుగు చేయుచున్నాను. |
| హి | = | సర్వదేవతలు విరాట్‌పురుషుని నుంచి జనియించిరి. కావున |
| సః+తయా+శ్రద్ధయా+ యుక్తః (సన్) | = | అట్టి కోరికలు గలవాడు ఆయా దేవతలను అట్టి శ్రద్ధతో కూడినవాడై |
| తస్య+ఆరాధనమ్+ ఈహతే+చ | = | విరాట్‌పురుషుని నుంచి జనియించిన ఆ దేవత యొక్క ఆరాధనను, యజ్ఞయాగాది క్రతువులు, పూజ మొదలయినవి చేయుచున్నాడు మఱియు కోరికలను కోరుచున్నాడు. |
| తతః+విహితాన్+ | = | అందువలన కోరిన ఇష్టములయిన |
| తాన్+కామాన్+మయా+ ఏవ+లభతే | = | కోరికలను నా చేతనే - అనగా నావలననే పొందుచున్నాడు. |

**వ్యాఖ్యానము :-** ఏయే కోరికకు ఏయే దేవతను ఏ విధముగా యజింప వలయునో కృష్ణ యజుర్వేదమునందు మఱియు భాగవతం ద్వితీయ స్కంధములో వివరింపబడినది. ఎవరు ఏ దేవతను పూజించినా అతడు విరాట్‌పురుషునినే పూజించుచున్నాడు. ఆ దేవతా రూపమున విరాట్‌పురుషునిచే ఫలమును పొందుచున్నాడు.

**దీనికి ఉదాహరణగా :** శ్రీకృష్ణుడు నందాదులు చేయతలపెట్టిన ఇంద్రయాగమును మాన్పి విరాట్పురుషునిలో భాగమయిన గోవర్ధనగిరిగా తాను మారి ఆ గిరికి పూజచేయించెను.

**“...............................దా**
**నొక శైలాకృతి దాల్చి గోపకులతో నొండొండ పూజించి గో**
**పక దత్తాన్నము లాహరించె విభుఁడా ప్రత్యక్ష శైలాకృతిన్”**

(భాగవతము-దశమస్కంధము - 891)

...... ❖ ❖ ❖ ......

పుణ్యఫలితము

**అన్తవత్తు ఫలం తేషాం । తద్భవత్యల్పమేధసామ్ ।**
**దేవాన్ దేవయజో యాన్తి । మద్భక్తా యాన్తి మామపి ॥ 23**

అన్తవత్ – తు – ఫలమ్ – తేషామ్ – తత్ – భవతి – అల్ప మేధసామ్
దేవాన్ – దేవయజః – యాన్తి – మత్ – భక్తా – యాన్తి – మామ్ – అపి

| | | |
|---|---|---|
| అల్ప మేధసామ్+ | = | అల్ప మేధస్సు గలిగిన |
| తేషామ్+తత్ + ఫలమ్ | = | వారియొక్క కోరికల యొక్క ఆ ఫలితము |
| అన్తవత్+భవతి+తు | | అశాశ్వతము అగుచున్నది. |
| దేవయజః+దేవాన్ + యాన్తి | = | దేవతలను యజించువారు దేవతలను పొందుచున్నారు. |
| మత్ భక్తాః+అపి + మామ్+యాన్తి | = | నా భక్తులు అనగా ఆత్మను యజించువారు సర్వ కోరికలను అనుభవించి కూడ ఇక్కడ పూర్ణకాములై కూడా నన్ను అనగా ఆత్మస్థానమును పొందుచున్నారు. |

**వ్యాఖ్యానము :-** పుణ్య ఫలితము క్షీణించగనే పరలోక సుఖ భోగములు నశించిపోయి, వారు బ్రహ్మలోకమునుండి చ్యుతులై పునర్జన్మకు తిరిగి భూలోకమున జన్మించవలసి వచ్చును. కావున అవియు అశాశ్వతములగుచున్నవి. ఎందుకనగా ఇహలోక సుఖ భోగములను ఆరాధించి అవి పొందినను వాటిని వారు జీవించియున్నంత వఱకే అనుభవింతురు. కావున అవి అశాశ్వతములగుచున్నవి.

ఈ విషయమే కఠోపనిషత్ ఇలా చెప్పినది.

నచికేతుడు యమునితో ఆయుర్దాయము, పుత్ర పౌత్రులను, ఆవులను, ఏనుగులు, గుఱ్ఱములు, బంగారము, ధనరాసులు, విశాల సామ్రాజ్యము, అప్సరసలు– వీటిని కోరుకోమనగా నచికేతుడు యమునితో ఈ ఇహలోక సుఖభోగములు సర్వేంద్రియముల తేజస్సును హరించును. మఱియు అల్పాయుర్దాయముగల వారెవ్వరు వీటితో రమించును? అని అనెను.

అనగా ఇంద్రుణ్ణి పూజించువాడు ఇంద్రలోకమును, సూర్యుని పూజించువాడు సూర్యలోకమును యిలా ఎవరెవరు ఏఏ దేవతలను పూజించెదరో వారు ఆయా దేవతాలోకములను పొందుచున్నారు. అయితే ఇవిఅన్నీ చ్యుతి గలిగిన స్థానములు.

ప్రహ్లాదుడు శ్రీ నరసింహమూర్తిని ఏమియూ కోరలేదు. అయినను శ్రీ నరసింహ మూర్తి ప్రహ్లాదునితో ఇలా అనెను.

**సీ॥ .....................యసురేంద్ర భర్తవై**
**సాగి మన్వంతర సమయ మెల్ల**
**నిఖిల భోగంబులు నీవు భోగింపుము...**

*(భాగవతము - సప్తము స్కంధం-372)*

అనగా ఓ ప్రహ్లాదా! నీవు ఈ మన్వంతరకాలము మీ తండ్రి తర్వాత వీరికి రాజువై యుండి ఈ సకల రాజభోగములు అనుభవింపుము. ఆవిధముగా ప్రహ్లాదుడు సర్వభోగములను అనుభవించి ఆత్మస్థానమును చేరెను.

...... ❖ ❖ ❖ ......

ఆత్మ - విరాట్‌పురుషుడు

**అవ్యక్తం వ్యక్తిమాపన్నం । మన్యన్తే మామబుద్ధయః ।**
**పరం భావమజానన్తో । మమావ్యయమనుత్తమమ్ ॥ 24**

అవ్యక్తమ్ - వ్యక్తిమ్ - ఆపన్నమ్ - మన్యన్తే - మామ్ - అబుద్ధయః
పరమ్ - భావమ్ - అజానన్తః - మమ - అవ్యయమ్ - అనుత్తమమ్.

**నాహం ప్రకాశః సర్వస్య । యోగమాయాసమావృతః ।**
**మూఢోఽయం నాభిజానాతి । లోకో మామజమవ్యయమ్ ॥ 25**

న - అహమ్ - ప్రకాశః - సర్వస్య - యోగమాయా - సమావృతః
మూఢః - అయమ్-న-అభిజానాతి - లోకః -మామ్ -అజమ్ -అవ్యయమ్

**వేదాహం సమతీతాని । వర్తమానాని చార్జున ।**
**భవిష్యాణి చ భూతాని । మాం తు వేద న కశ్చన॥ 26**

వేద - అహమ్ - సమతీతాని - వర్తమానాని - చ - అర్జున
భవిష్యాణి -చ -భూతాని -మామ్ -తు- వేద- న- కశ్చన.

**ఆత్మగా**

| | | |
|---|---|---|
| అవ్యక్తమ్ | = | బాహ్య చక్షువులకు గోచరము కానిదియు |
| పరమ్ | = | ఉత్కృష్టమైనదియు, ప్రకృతికి పరమైనదియు |
| అవ్యయమ్+అనుత్తమమ్ | = | నాశన రహితమైనదియు ఉత్తమోత్తమైనట్టిదియు |
| +మమ+అజానన్తః+ అబుద్ధయః | | అగు నాయొక్క అనగా ఆత్మ స్వరూపము ను (లేక ఆదిపురుష రూపమును లేక సర్వస్థావరజంగమ రూపమయిన విరాట్ రూపమును) గ్రహించలేని అజ్ఞానులు |
| మామ్వ్యక్తిమ్+ ఆపన్నమ్+భావమ్+ మన్యన్తే | = | నన్ను ఏదో ఒక దేవతారూపునిగా భావము గలిగి తలంచుచున్నారు. |
| అహమ్+అజమ్+ అవ్యయమ్ | = | నేను ఆత్మస్వరూపమున పుట్టుకలేని వాడను, స్వయం భువుడను, శాశ్వతుడను |
| సర్వస్య+యోగమాయా+ సమావృతః+న+ప్రకాశః | = | అందఱికి యోగమాయచే కప్పబడిన వాడనై బాహ్యదృష్టికి కనిపించుట లేదు. |
| మూఢః + అయమ్+ | = | ఈ మూఢజనుడు నన్ను ఆత్మరూపమున |
| మామ్+న+అభిజానాతి | = | ఎఱుగడు |
| అర్జున | = | ఓ అర్జునా! |

| | | |
|---|---|---|
| అహమ్+సమతీతాని+ | = | నేను ఆత్మస్వరూపమున |
| వర్తమానాని + చ+ | = | గతించిన |
| భవిష్యాణి+భూతాని+ చ+వేద | = | వర్తమానమున మఱియు భవిష్యత్ కాలమునగల జీవరాసులను మఱియు నా అవతారములను ఎఱుగుదును |
| తు+కశ్చన+మామ్+ న+వేద | = | లయ కాలమున (సర్వము లయమగునప్పుడు) ఎవడును నన్ను అనగా ఆత్మను ఎఱుగడు |

**వ్యాఖ్యానము:-** ఆత్మస్వరూపమును భక్తులు తమ ఇష్ట దేవతగా తలచుచున్నారు. కొందఱు శివుడని, కొందఱు విష్ణువు అని, కొందఱు గణపతి అని, ఇలా ఒకొక్కరు ఒకొక్క రూపముగా భావించి కొలుచుచున్నారు. ఆ పై అజ్ఞానమున ఆవేశములకు లోనై సర్వము అతడేయని గ్రహింపక వాదులాడుకొనుచున్నారు.

శ్రీకృష్ణుడు జన్మించు సమయమున బ్రహ్మాదిదేవతలు ఇట్లనిరి–

ఆ॥ **మాయ చేత నెరుక మాలిన వారలు,**
**పెక్కు గతుల నిన్నుఁబేరు కొందు,**
**రెఱుఁగ నేర్చు విబుధు లేక చిత్తంబున,**
**నిఖిల మూర్తులెల్ల నీవ యండ్రు.** *(భాగవతము–దశమ స్కంధం–89)*

అనగా మాయచేత జ్ఞానశూన్యులైనవారలు, అనేక రూపనామములతో, వ్యక్తి భావనతో నిన్ను భిన్నునిగా పేర్కొనుచున్నారు. కాని జ్ఞానులు ఈ సర్వమూ నీవేయని ప్రకటించుచున్నారు.

వ్యక్తి భావన భక్తిలో దోషంకాదు. యశోద శ్రీకృష్ణుని వాత్సల్య భావమున పుత్రునిగా ప్రేమించి, లాలించి, పోషించినది. శ్రీకృష్ణుని ఈశ్వరుడని భావించినచో యశోద శ్రీకృష్ణునికి పాలుపట్టి, నిద్రపుచ్చి, స్నానం చేయించి ఆనందించగలదా! గోపబాలురు శ్రీకృష్ణునితో కలసి చల్దులారగించినారు. అలాగానిచో యజ్ఞపురుషుడైన ఈశ్వరునితో కలసి అంత సరదాగా చల్ది అన్నములు అందరూ కలసి తినగలరా! వ్యక్తి భావన దాటిన నందుడు, వసుదేవుడు, దేవకి –వీరు శ్రీకృష్ణుని బాల్యక్రీడలను

చూచి ఆనందించలేదు. శ్రీకృష్ణుడు –నందునితో నేను మధురలో నా తల్లి తండ్రులయిన వసుదేవుడు, దేవకిలవద్ద ఉంటాను. నీవు తిరిగి గోకులంకు వెళ్ళమని అనగా నందుడు విచారించలేదు. అవును అవును అందుకే శ్రీకృష్ణుడు మహానందుని యొక్క అంగన కుమారుడే.

మాయా స్వరూపమును గ్రహించక వ్యక్తి భావన పొంది, ఆవేశములకు లోనై వాదులాడుకొందురు. మాయా స్వరూపమును తెలుసుకొని భక్తి భావముతో ఆత్మను మఱియు వ్యక్తిభావనతో సాకారరూపమున సేవించువారు అని సాధకులు రెండు రకములు.

ఇదే విషయమును రామాయణములో బ్రహ్మ దేవతలతో సహా రావణ వధానంతరము రామునివద్దకు వచ్చి – "నిన్ను నీవు తప్ప ఇతరులు ఎఱుగరు" అని చెప్పెను.

...... ❖ ❖ ❖ ......

అజ్ఞానులు ఆత్మను దర్శింపలేక ఉన్నారు

**ఇచ్ఛాద్వేషసముత్థేన । ద్వన్ద్వమోహేన భారత ।**
**సర్వభూతాని సమ్మోహం । సర్గే యాన్తి పరంతప ॥ 27**

ఇచ్ఛా ద్వేష సముత్థేన – ద్వంద్వమోహేన – భారత
సర్వభూతాని – సమ్మోహమ్ – సర్గే – యాన్తి – పరంతప

**యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।**
**తే ద్వన్ద్వ మోహ నిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥ 28**

యేషామ్–తు–అన్తగతమ్ –పాపమ్ –జనానామ్ –పుణ్యకర్మణామ్
తే –ద్వంద్వ –మోహ –నిర్ముక్తాః –భజన్తే –మామ్– దృఢవ్రతాః

భారత = ఓ అర్జునా!
సర్గే = సృష్ట్యాదియందే

| | | |
|---|---|---|
| సర్వభూతాని | = | సర్వభూతములు అవిద్యా పంచక మిశ్రమంబున |
| ఇచ్ఛాద్వేష సముత్థేన+ | = | రాగ ద్వేషములు వలన పుట్టిన సుఖ దుఃఖములు, |
| ద్వంద్వమోహేన+ | = | మానావ మానములు మొదలయిన ద్వంద్వముల |
| సమ్మోహమ్+యాన్తి | | చేత మిక్కిలి అజ్ఞానమును పొందుచున్నవి |
| పరంతప | = | ఓ అర్జునా! |
| పుణ్యకర్మాణామ్ | = | పుణ్యకర్మలు కలిగిన |
| యేషామ్+జనానామ్ | = | ఏ జనులయొక్క పాపము అనగా కర్మవాసనలు |
| పాపమ్+అన్తగతమ్ | | నశించినవో మఱియు |
| తే+ద్వంద్వమోహనిర్ముక్తాః | = | తను ఇతరులు అనే అవిద్యా సంబంధమయిన |
| (సంతః) | | మోహము తొలగిపోయినవారలయి |
| దృఢవ్రతాః+మామ్+ | = | ధృఢవ్రతులయి నన్ను ఆత్మను భజించుచున్నారు |
| భజంతే+తు | | దేహత్యాగానంతరము నన్నే పొందుచున్నారు. |

**వ్యాఖ్యానము :-** అహం అను దేహాభిమాన బుద్ధిగల - మోహమును

అంగనా సంగమంబు అను బుద్ధిగల - మహామోహమును

క్రోధంబు అను బుద్ధిగల - అంధ తామిస్రంబును

అహమేవ మృతోఽస్మి అను బుద్ధిగల - తామిస్రంబును

నేను - మీరు అను - చిత్తవిభ్రమము అను

అవిద్యా పంచక మిశ్రమంబుగా సర్వభూతావళిని ప్రజలను బ్రహ్మదేవుడు పుట్టించెను. (భాగవతం - తృతీయస్కంధం - 721) అవిద్యా పంచకముతో కూడిన జీవుడు తన హృదయగుహలో గల ఆత్మను దర్శించలేకున్నాడు. అవిద్యను పెన వేసుకొని జీవుడు వచ్చుటచేత (రాగద్వేషములు) ఇచ్ఛాద్వేషములు, సుఖము దుః ఖములు, మానావమానములు, మేము మీరు అనే మతిభ్రమ గలుగుచున్నది. నిజమునకు జీవుడు ఈశ్వరుడు ఒక్కడే. ఒకే చెట్టుపై గల రెండు పక్షులు. మీరు, మేము అనే మతిభ్రమవలన సర్వత్రాగల విరాట్ రూపమును దర్శించలేకున్నాడు.

**జరామరణమోక్షాయ । మామాశ్రిత్య యతంతి యే ।**
**తే బ్రహ్మ తద్విదుః కృత్స్న । మధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥ 29**

జరామరణమోక్షాయ – మామ్ – ఆశ్రిత్య – యతన్తి – యే
తే – బ్రహ్మ – తత్ – విదుః – కృత్స్నమ్ – అధ్యాత్మమ్ – కర్మ –చ– అఖిలమ్

| | | |
|---|---|---|
| యే+ | = | ఎవరు పుట్టుక – ముసలితనము – మరణము |
| జరామరణమోక్షాయ | | అనే అవస్థలు గల దేహమునుండి విడివడి పునర్జన్మ లేకుండా మోక్షము కొఱకు |
| మామ్+ఆశ్రిత్య + | = | నన్ను అనగా ఆత్మను ఆశ్రయించి |
| యతన్తి+తే+చ | | నిరంతర సాధన చేయుచున్నారో వారు |
| కృత్స్నమ్ | = | సమస్తమైన |
| తత్+బ్రహ్మ | = | ఆత్మను |
| అఖిలమ్+అధ్యాత్మమ్ | = | అధ్యాత్మమును విపులముగా |
| కర్మ | = | సృష్టి, స్థితి, లయములనే కర్మలను తెలియుచున్నారో |

...... ❖ ❖ ❖ ......

**సాధిభూతాధిదైవం మాం । సాధియజ్ఞం చ యే విదుః ।**
**ప్రయాణ కాలేఽపి చ మాం । తే విదుర్యుక్తచేతసః ॥ 30**

సా–అధిభూతమ్–అధిదైవమ్–మామ్–సా–అధియజ్ఞమ్–చ–యే–విదుః
ప్రయాణ కాలే –అపి – చ – మామ్ – తే – విదుః – యుక్తచేతసః

| | | |
|---|---|---|
| యే+మామ్ | = | ఎవరు నన్ను |
| సా+అధిభూతమ్ | = | ఆ అధిభూతమును (దేహమును) |
| అధిదైవమ్+చ | = | అధిదైవమును (దేహిని) |
| సా+అధియజ్ఞమ్ | = | అధియజ్ఞమును (హృదయగత ఆత్మను) |
| విదుః | = | తెలియుదురో |

| | |
|---|---|
| చ+తే+ప్రయాణకాలే+ అపి+యుక్త చేతసః | = మఱియు వారు దేహత్యాగకాలమునందు నా యందు నియమింప బడిన చిత్తము గల వారలయి, (మనోబుద్ధులను ఏకముచేసి, ప్రాణమును బ్రహ్మరంధ్రము చేర్చి, బ్రహ్మ రంధ్రమును చీల్చి) |
| మామ్+విదుః | = నన్ను (ఆత్మను) తెలియుదురు అనగా ఆత్మస్థానమును పొందుదురు – ఆత్మ యగుదురు. |

**వ్యాఖ్యానము :-** కార్యవర్గంబును గారణసంఘంబు, నధికరించి చరించు నాత్మతత్త్వము అధ్యాత్మమనబడును (భాగవతము – ప్రథమస్కంధము – 56).

...... ❖ ❖ ❖ ......



ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము 32వ అధ్యాయము

## (అక్షరపరబ్రహ్మయోగము)

గత అధ్యాయములో చెప్పిన బ్రహ్మ, అధ్యాత్మమ్ - కర్మ - అధిభూతమ్ - అధిదైవమ్ - అధియజ్ఞమ్ మొదలైనవి తెలియవలయునని అనగా వాటి గుఱించి వివరింపుమని అర్జునుడు ప్రశ్నించుచున్నాడు

అర్జున ఉవాచ

**కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం । కిం కర్మ పురుషోత్తమ ।**
**అధిభూతం చ కిం ప్రోక్తమ్ । అధిదైవం కిముచ్యతే ॥ 1**

కిమ్ - తత్ - బ్రహ్మ - కిమ్ - అధ్యాత్మమ్ - కిమ్ - కర్మ - పురుషోత్తమ
అధిభూతమ్ - చ - కిమ్ - ప్రోక్తమ్ - అధిదైవమ్ - కిమ్ - ఉచ్యతే

**అధియజ్ఞః కథం కోఽత్ర । దేహేఽస్మిన్ మధుసూదన ।**
**ప్రయాణకాలే చ కథం । జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ 2**

అధియజ్ఞః - కథమ్ - కః - అత్ర - దేహే - అస్మిన్ - మధుసూదన
ప్రయాణకాలే - చ - కథమ్ - జ్ఞేయః - అసి - నియతాత్మభిః

| | | |
|---|---|---|
| పురుషోత్తమ | = | ఓ శ్రీకృష్ణా! |
| కిమ్ తత్ బ్రహ్మ | = | ఆ బ్రహ్మమనగా ఏమి? |
| కిమ్ + అధ్యాత్మమ్ | = | అధ్యాత్మము అనగా ఏమి? |
| కిమ్ + కర్మ | = | కర్మ అనగా ఏమి? |
| కిమ్+అధిభూతమ్+ ప్రోక్తమ్ | = | ఏది అధిభూతమని చెప్పబడును? |

| | | |
|---|---|---|
| చ | = | మఱియు |
| కిమ్+అధిదైవమ్+ఉచ్యతే | = | ఏది అధి దైవము అని చెప్పబడుచున్నది? |
| మధుసూదన | = | ఓ శ్రీకృష్ణా! |
| అస్మిన్+దేహే+కః+ అధియజ్ఞః | = | ఈ దేహమునందు ఎవడు అధి యజ్ఞుడు? |
| చ+కథమ్ | = | మఱియు అది ఎట్లుండును? |
| ప్రయాణకాలే+అత్ర+ | = | దేహత్యాగసమయమునందు ఎక్కడ |
| నియతాత్మభిః+కథమ్+ జ్ఞేయః + అసి | = | మనస్సును పరమాత్మయందు లగ్నము చేసి యోగులచే ఎట్లు తెలియ దగినవాడవు? |

...... ❖ ❖ ❖ ......

శ్రీ భగవానువాచ

**అక్షరం బ్రహ్మ పరమం । స్వభావోఽధ్యాత్మ ముచ్యతే ।**
**భూతభావోద్భవ కరో । విసర్గః కర్మ సంజ్ఞితః ॥ 3**

అక్షరమ్ – బ్రహ్మ – పరమమ్ – స్వభావః – అధ్యాత్మమ్ – ఉచ్యతే
భూతభావోద్భవకరః – విసర్గః – కర్మ సంజ్ఞితః

**అధిభూతం క్షరో భావః । పురుషశ్చాధిదైవతమ్ ।**
**అధియజ్ఞోఽహమేవాత్ర । దేహేదేహభృతాం వర ॥ 4**

అధిభూతమ్ – క్షరః – భావః – పురుషః – చ – అధిదైవతమ్
అధియజ్ఞః – అహమ్ – ఏవ – అత్ర – దేహే – దేహభృతామ్ – వర

ప్రయాణకాలమున ఆత్మను చేరుట ఎట్లు?

**అన్తకాలే చ మా మేవ । స్మరన్ముక్త్వా కలేవరమ్ ।**
**యః ప్రయాతి స మద్భావం । యాతి నాస్త్యత్ర సంశయః ॥ 5**

అన్తకాలే – చ – మామ్ – ఏవ – స్మరన్ – ముక్త్వా – కలేవరమ్

యః–ప్రయాతి–సః–మద్భావమ్–యాతి –న–అస్తి – అత్ర – సంశయః

**బ్రహ్మమనగా ఏమి అన్న ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు :**

పరమమ్+అక్షరమ్+ బ్రహ్మ = తమస్సుకు పరమై అక్షరమైనది బ్రహ్మ. (ఆత్మ గుఱించి చెప్పిన లక్షణములు అనేకచోట్ల చెప్పబడినవి.)

**"తత్త్వవిదులు జ్ఞానంబను పేర నద్వయంబైన యది తత్త్వంబని యెఱుంగుదురు. ఆ తత్త్వంబు నౌపనిషదులచేత బ్రహ్మమనియు, హైరణ్యగర్భుల చేతం బరమాత్మ యనియు, సాత్త్వతుల చేతం భగవంతుండనియు బలుకంబడు"**

(భాగవతం–ప్రథమ స్కంధం–58)

**అధ్యాత్మమనగా నేమి?**

స్వభావః+అధ్యాత్మమ్+ ఉచ్యతే = ఆత్మయొక్క పరిణామ స్వభావము అధ్యాత్మము "కార్యవర్గంబును కారణసంఘంబును అధికరించు చరించు ఆత్మతత్త్వము అధ్యాత్మమనబడును". (భాగవతము – ప్రథమస్కంధం – 56)

**కర్మ అనగానేమి? అన్న ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు :**

భూత భావ ఉద్భవ కరః+విసర్గః+కర్మ+ సంజ్ఞితః = విరాట్ పురుషుడు బ్రహ్మ, విష్ణువు శివుడుగా ప్రాణుల యొక్కయు సమస్త భావములయొక్కయు ఉత్పత్తిని, స్థితిని, లయములను చేయుచున్నట్టియు మఱియు కర్మబంధము కాని పని ఏది కలదో అది కర్మ అను సంజ్ఞ గలది అనగా కర్మ అని పిలువబడును.

దేహభృతామ్ వర = దేహధారులలో శ్రేష్ఠుడవైన ఓ అర్జునా!

**అధిభూతం అనగా నేమి? అన్న ప్రశ్నకు సమాధానము:**

| | | |
|---|---|---|
| క్షరః+భావః+ | = | నశించు స్వభావము గల ఈదేహము |
| అధిభూతమ్ | | అధిభూతము అని చెప్పబడును. |
| చ | = | మఱియు |

**అధిదైవము అనగా నేమి? అన్న ప్రశ్నకు సమాధానము:**

| | | |
|---|---|---|
| పురుషః+అధిదైవతమ్ | = | దేహములోగల దేహి అధిదైవము అని చెప్పబడును. |

**అధియజ్ఞము అనగా నేమి? అన్న ప్రశ్నకు సమాధానము:**

| | | |
|---|---|---|
| అత్ర+దేహే+అహమ్+ | = | ఇక్కడ ఈ దేహములో ఈ హృదయగుహలో గల |
| ఏవ+అధియజ్ఞః | | నేనే అధియజ్ఞుడను |
| యః+అన్తకాలే+మామ్+ | = | ఎవడు ప్రాణప్రయాణ సమయమునందు |
| ఏవ+స్మరన్+కలేవరమ్ | = | అనగా దేహత్యాగ సమయమునందు ఇతర |
| ముక్త్వా+ప్రయాతి | | చింతనలు లేకుండా నన్నే అనగా పరమాత్మనే స్మరించుచూ శరీరమును విడచి పయనించునో అనగా ఎవడు శరీరమును విడచునో |
| సః+చ+మద్భావమ్+ | = | అతడు ఆత్మను దర్శించి, ఆత్మస్థానమును చేరి |
| యాతి | | మఱియు నా స్వరూపమును అనగా ఆత్మస్వరూపమును పొందుచున్నాడు. అనగా ఆత్మయై విరాజిల్లుచున్నాడు. |
| అత్ర+సంశయః+న+ | = | ఈ విషయములో సంశయము లేదు. |
| అస్తి | | |

**వ్యాఖ్యానము:-** సృష్ట్యాది యందున్న ఆత్మ–హృదయగుహలో గల ఆత్మ ఒక్కటే. అయితే సృష్ట్యాది యందుగల ఆత్మ బృహత్. అందుండి అసంఖ్యాకమైన ఆత్మలు ప్రభవించి, ప్రతి ప్రాణి దేహములో ఉంటున్నవి. హృదయగుహలో గల ఆత్మపరిమాణములో చిన్నది. మిగిలిన లక్షణము లన్నియు రెండింటికి సమానమే.

**"యథా సుదీప్తాత్ పావకాత్ విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే సరూపాః"**

(ముండక ఉపనిషత్ 2-1-1)

బాగా మండుచున్న అగ్నినుంచి అగ్నివంటి వేలకొలది అగ్ని కణములు - ప్రభవించుచున్నవి.

**పునర్జన్మ:**

**కామాన్ యః కామయతే మన్యమానః స కామభిర్జాయతే తత్ర తత్ర ।**

**పర్యాప్త కామస్య కృతాత్మనస్తు ఇహైవ సర్వే ప్రవిలీయంతి కామాః ॥**

(ముండక ఉపనిషత్ 3-2-2)

...... ❖ ❖ ❖ ......

**యం యం వాపి స్మరన్ భావం । త్యజత్యన్తే కలేవరమ్ ।**

**తం తమేవైతి కౌన్తేయ । సదా తద్భావభావితః ॥ 6**

యమ్-యమ్-వా-అపి-స్మరన్-భావమ్-త్యజతి-అన్తే-కలేవరమ్

తమ్ - తమ్ - ఏవ - ఏతి - కౌన్తేయ - సదా - తత్ - భావ - భావితః

**తస్మాత్సర్వేషు కాలేషు । మా మనుస్మర యుధ్య చ ।**

**మయ్యర్పిత మనో బుద్ధిః । మామే వైష్యస్య సంశయమ్ ॥ 7**

తస్మాత్ - సర్వేషు - కాలేషు - మామ్ - అనుస్మర - యుధ్య - చ

మయి-అర్పిత-మనః-బుద్ధిః-మామ్-ఏవ-ఏష్యసి-అసంశయమ్

**అభ్యాస యోగ యుక్తేన । చేతసా నాన్యగామినా ।**

**పరమం పురుషం దివ్యం । యాతి పార్థాను చిన్తయన్ ॥ 8**

అభ్యాస యోగ యుక్తేన - చేతసా - న - అన్యగామినా

పరమమ్ - పురుషమ్ - దివ్యమ్ - యాతి - పార్థ - అనుచిన్తయన్

| | | |
|---|---|---|
| కౌన్తేయ | = | ఓ అర్జునా! ఎవడు |
| అన్తే + వా | = | అంత్యకాలమునందు అనగా ప్రాణప్రయాణ సమయమునందు |
| యమ్+యమ్+భావమ్+స్మరన్+కలేబరమ్+త్యజతి | = | ఏయే భావములను మనస్సులో స్మరించుచూ దేహమును వదలుచున్నాడో |
| తత్+భావ భావితః(సన్)తమ్+తమ్+ఏవ+అపి+సదా + ఏతి | = | అతడు ఆ భావములయొక్క అనుసారము పునర్జన్మను పొందుచున్నాడు. |

**పుణ్యకర్మానుష్ఠాన పద్ధతి :**

| | | |
|---|---|---|
| యుధ్య | = | యుద్ధము చేయుము. |

జాతిధర్మములను, ఆశ్రమ ధర్మములను పాటింపుచూ, ద్వంద్వాతీతుడవై నీ జాతిధర్మమయిన యుద్ధము చేయుము. సర్వావస్థలలో పరమాత్మను స్మరింపుము. ఆవిధమైన పుణ్యకర్మానుష్ఠానము చేసినచో దేహము వీడిన తర్వాత నన్నే పొందగలవు.

| | | |
|---|---|---|
| చ | = | మఱియు |

**భక్తిపద్ధతి :**

| | | |
|---|---|---|
| తస్మాత్+సర్వేషు+కాలేషు+మామ్+ఏవ అనుస్మర | = | అందువలన సర్వవేళలయందు అనగా నిరంతరము నన్నే (ఆత్మనే) స్మరింపుము. |

**యోగపద్ధతి :**

దేహత్యాగసమయమున

| | | |
|---|---|---|
| మయి+అర్పిత+మనోబుద్ధిః (సన్)+అసంశయమ్+మామ్+ఏష్యసి | = | నాయందు అనగా ఆత్మయందు అర్పింపబడిన మనోబుద్ధులు గలవాడవై, కూటస్థునుని క్షేత్రజ్ఞునితో కలపి దేహమును వీడినచో నన్నే సందేహము లేకుండా పొందగలవు. |

**యోగపద్ధతి :**

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| అభ్యాసయోగయుక్తేన | = | యోగాభ్యాసముచేతను |

**భక్తిపద్ధతి :**

| | | |
|---|---|---|
| న+అన్యగామినా+ | = | ఇతర విషయములపై ప్రసరించకుండా ఉన్నట్టి |
| చేతసా+దివ్యమ్+ | | మనస్సుచేతను దివ్యమైనట్టియుపరమైనట్టిదియు |
| పరమమ్+పురుషమ్+ | | అనగా ప్రకృతికి అవ్వలగలట్టియు పురుషుని- |
| అనుచిన్తయన్+యాతి | | ఆదిపురుషున్ని లేక బ్రహ్మను ధ్యానించుచూ, ఉన్నట్టివాడు దేహత్యాగానంతరము ఆ ఆత్మను పొందును అనగా పరబ్రహ్మను చేరుకొనును |

**వ్యాఖ్యానము:-"యం యం లోకం మనసా సంవిభాతి విశుద్ధ సత్త్వః కామయతే యాంశ్చకామాన్ తం తం లోకం జయతే తాంశ్చ కామాన్ తస్మాదాత్మజ్ఞం హ్యర్చయేత్ భూతి కామః"** (ముండకోపనిషత్ 3-1-10)

మరణ సమయమున అతని మనస్సులోని భావానుసారము పునర్జన్మకు వచ్చును. ఉదా: ఋషభుని పెద్ద కుమారుడు భరతుడు. భరతుడు చక్రవర్తి. ఇతని పేరుననే భారతదేశమని యీ దేశమునకు పేరు వచ్చినది. అతడు పులస్త్యాశ్రమమున తపస్సు చేస్తూ కాలకర్మవశమున అతడు మరణ సమయమున తను పెంచిన లేడిపిల్లను తలచుకుంటూ శరీరమును వీడి, మఱు జన్మలో ఆ లేడి కడుపున లేడిపిల్లగా జన్మించెను.

పూర్వజన్మ కర్మ వాసనలు నశించిన గాని లేదా కర్మబంధములు తొలగిన గాని, పరమాత్మను పొందలేరు. కావున 1. నిరంతర నామస్మరణ, 2. కూటస్థుని క్షేత్రజ్ఞునితో కలపుటవలన 3. సర్వకర్మలు పరమాత్మయందు ఉంచుటవలన, పూర్వజన్మ కర్మవాసనలు నశించును. కర్మబంధము తొలగును. మఱియు ఆగామి సంచితకర్మలు ఏర్పడవు. దేహి ప్రకృతిని వీడి, ఆనందమయుడగును. ఆతరువాత బ్రహ్మమందు కలియును. ఇందు సందేహములేదు.

ధ్యానములో సాకారముగా పరమపురుషుని ధ్యానించవచ్చును. లేదా నిరాకారముగా ఆత్మను ధ్యానించవచ్చును.

...... ❖ ❖ ❖ ......

ఆత్మ లక్షణము

**కవిం పురాణమనుశాసితారమ్ ।**
**అణోరణీయాం సమనుస్మరేద్యః ।**
**సర్వస్య ధాతారమచిన్త్యరూపమ్ ।**
**ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ । 9**

కవిమ్–పురాణమ్–అనుశాసితారమ్–అణోః–అణీయాంసమ్–అనుస్మరేత్ – యః సర్వస్య – ధాతారమ్ – అచిన్త్యరూపమ్ – ఆదిత్యవర్ణమ్ – తమసః– పరస్తాత్

పురాణమ్ = సృష్ట్యాదియందుగలది

**స్థానము:**

తమసః + పరస్తాత్ = తమస్సునకు అనగా ప్రకృతికి అవ్వలివాడును. ప్రకృతిని అంటక ప్రకృతికి పైన ఉన్నవాడును.

తమస్సు అనగా అజ్ఞానము అను అర్థమున రామునుని అనుసరించిన ప్రజలు తమసానది వద్ద నిద్రలో ఉండగా రాముడు సీతా లక్ష్మణ సహితుడై వెడలిపోయి నాడు అని రామాయణములో వర్ణింపబడినది.

**వర్ణము – రూపము:**

ఆదిత్య వర్ణమ్ = ఆదిత్య వర్ణుడు అనగా స్వయం ప్రకాశకుడు, జ్యోతి స్వరూపుడు

అచిన్త్యరూపమ్ = ఒక రూపమంటూ లేనివాడు.

ఏ రూపము కావాలనుకుంటే ఆ రూపమును ధరించువాడు. ఊహాతీతుడు. ఆత్మ నిరాకారమగుటవలన ఇట్టి రూపమని వక్కాణించలేము.

**లక్షణములు :**

కవిమ్ = సర్వజ్ఞుడును, సర్వజ్ఞత్వము కలవాడును.

అనుశాసితారమ్ = సర్వమును శాసించువాడును. సర్వ స్థావర జంగమములను శాసించువాడును, ఇతని భయమువలన వాయువు వీచుచున్నది. (అధియజ్ఞుడుగా) ఇతడు దేహములోగల ఇంద్రియములను, ప్రాణమును, అంతఃకరణ చతుష్టయమును శాసించును.

**విరాట్‌పురుషునిగా:**

సర్వస్య + ధాతారమ్ = సకల ప్రాణులను పోషించువాడును, మఱియు సమస్త రూపములను ధరించువాడును

**హృదయ గుహలో:**

అణోః + అణీయాంసమ్ = అణువుకంటే మిక్కలి సూక్ష్మమైనవాడును, ఇది అధియజ్ఞునకు సంబంధించిన లక్షణము.

యః+అనుస్మరేత్ = ఎవడు ఆత్మను స్మరించునో అతడు జీవన్ముక్తుడు. అతడు దేహత్యాగానంతరము ఆత్మయై విరాజిల్లును.

...... ❖ ❖ ❖ ......

దేహత్యాగ సమయమున పరమాత్మను ధ్యానించిన, భక్తిపద్ధతిలో
సాకారముగా ధ్యానించిన గలుగు ఫలితము చెప్పబడుచున్నది.

**ప్రయాణకాలే మనసాచలేన ।**
**భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।**
**భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ ।**
**స తం పరం పురుషముపైతి దివ్యమ్ ॥ 10**

ప్రయాణకాలే – మనసా – అచలేన – భక్త్యా–యుక్తః – యోగబలేన – చ–ఏవ – భ్రువోః–మధ్యే–ప్రాణమ్–ఆవేశ్య–సమ్యక్–సః–తమ్–పరమ్–పురుషమ్–ఉపైతి–దివ్యమ్

**జీవన్ముక్తుడైనవాడు :**

**యోగపద్ధతి :**

| | | |
|---|---|---|
| ప్రయాణకాలే | = | ప్రయాణకాలమునందు, అనగా దేహము విసర్జించు తలంపు జనించినప్పుడు యోగి దేశము, కాలములను పరిగణింపక |
| భ్రువోః + మధ్యే + ఏవ | = | భ్రూమధ్యము నందు నిలిపి |
| సమ్యక్+ఆవేశ్య | = | చక్కగా నిలిపి (అనగా నిశ్శ్వాసంబులు మాని–దృక్– కర్ణ – నాస–అన్య మార్గములు మూసి) ఆ తర్వాత బ్రహ్మరంధ్రము చేర్చి, బ్రహ్మ రంధ్రమును చీల్చి, |
| అచలేన+మనసా+ యోగబలేన+ప్రాణమ్ | = | చలింపని మనస్సుతో అనగా మనస్సును నిశ్చలము చేసి, ఆ మనస్సును బుద్ధితో కలిపి, వాటిని కూటస్థునితో కలిపి, కూటస్థుని క్షేత్రజ్ఞునితో కలిపి, యోగబలముతో ప్రాణమును (అంఘ్రి మూలమున మూలాధార చక్రంబు పీడించి ప్రాణంబు బిగియ |

| | | |
|---|---|---|
| | | బట్టి నాభితలము చేర్చి హృత్సరోజము మీద కెగయబట్టి ఉరమందు హత్తించి తాలు మూలమునకు తఱిమి అక్కడ నిలిపి) |
| తమ్+దివ్యమ్+ పరమ్+పురుషమ్+ ఉపైతి | = | ఆ దివ్యమైన పరమపురుషుని పొందును. అనగా స్వస్వరూపమును పొందును. (పర)బ్రహ్మ యగును. |
| చ | = | మఱియు దేహత్యాగ సమయమున భగవంతుడు తన యెదుట ఉన్నట్లు ఊహించి |

**భక్తిపద్ధతి :**

| | | |
|---|---|---|
| సః + భక్త్యా యుక్తః | = | భక్తితో భగవంతుని రూపమును, గుణములను, అతడు చేసిన పనులను పొగిడి, దేహమును వీడి, పరమాత్మతో ఏకీభూతుడై, ఆత్మయై విరాజిల్లును. |

**భక్తిపద్ధతి :** ఉదాహరణగా భాగవతం ప్రథమ స్కంధంబున భీష్ముని యిట్లు ఉదాహరించినాడు. భీష్ముడు కురుక్షేత్రమున శరతల్ప గతుడైయున్నాడు. పాండవులు, ఋషులు, శ్రీకృష్ణుడు వచ్చినారు. దేహము వదలవలయునని తలంపు గలిగిభీష్ముడు–

1. శ్రీకృష్ణుని గుఱించి అతడు చేసిన పనులను పొగడినాడు 2. చిత్తము మనీషాయత్తము చేసినాడు 3. దృగ్జాలంబున్ హరి మోముపై నిలిపినాడు 4. ఆలాపంబులు మానినాడు – కృష్ణుని హృదయంబున నిలిపికొని 5. ధ్యాన విశేషంబున బుద్ధిని సమర్పించినాడు అనగా బుద్ధినితెచ్చి క్షేత్రజ్ఞునితో కూర్చినాడు.6. నిశ్శ్వాసంబులు మానినాడు 7. నిరుపాధికంబయిన వాసుదేవ బ్రహ్మంబునందు అనగా ఆత్మలో కలిసినాడు.

...... ❖ ❖ ❖ ......

**యదక్షరం వేదవిదో వదన్తి ।**
**విశన్తి యద్యతయో వీతరాగాః ।**
**యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి ।**
**తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ 11**

యత్ - అక్షరమ్-వేదవిదః-వదన్తి-విశన్తి-యత్-యతయః-వీతరాగాః
యత్ - ఇచ్ఛన్తః - బ్రహ్మచర్యమ్ - చరన్తి - తత్ - తే-పదమ్ - సంగ్రహేణ - ప్రవక్ష్యే

**సర్వద్వారాణి సంయమ్య । మనో హృది నిరుధ్య చ ।**
**మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ । మాస్థితో యోగధారణామ్ ॥ 12**

సర్వద్వారాణి - సంయమ్య - మనః - హృది - నిరుధ్య - చ
మూర్ధ్ని - ఆధాయ - ఆత్మనః - ప్రాణమ్ - ఆస్థితః - యోగధారణామ్

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ । వ్యాహరన్ మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్దేహం । స యాతి పరమాం గతిమ్ ॥13**

ఓమ్ - ఇతి - ఏక - అక్షరమ్ - బ్రహ్మ - వ్యాహరన్ మామ్ - అనుస్మరన్
యః - ప్రయాతి - త్యజన్ - దేహమ్ - సః - యాతి - పరమామ్ - గతిమ్

**అనన్య చేతాస్సతతం । యో మాం స్మరతి నిత్యశః ।**
**తస్యాహం సులభః పార్థ । నిత్య యుక్తస్య యోగినః ॥ 14**

అనన్య చేతాః - సతతమ్ - యః - మామ్ - స్మరతి - నిత్యశః
తస్య - అహమ్ - సులభః - పార్థ - నిత్య యుక్తస్య - యోగినః

| | | |
|---|---|---|
| యత్+అక్షరమ్+ వేదవిదః+వదన్తి | = | ఏది నశింపనిది అని వేదజ్ఞులు చెప్పుచున్నారో, దేనిని చేరుటకు |
| యత్+ఇచ్ఛన్తః+ | = | దేనిని పొందగోరిన వారై బ్రహ్మచర్యము, ఇంద్రియ |

| | | |
|---|---|---|
| బ్రహ్మచర్యమ్+ చరన్తి | | నిగ్రహము, సత్య వాక్పరిపాలన, జితేంద్రియత్వం మొదలైనవి ఆచరించుచున్నారో |
| యత్ +వీతరాగాః + యతయః + విశన్తి | = | ఏ స్థానమున రాగ-ద్వేష రహితులయిన, ద్వంద్వాతీతులైన యతీశ్వరులు ప్రవేశించు చున్నారో |
| తత్ + పదమ్+ సంగ్రహేణ+తే+ప్రవక్ష్యే | = | ఆ స్థానమును - ఆత్మ స్థానమును పొందు విధానమును సంగ్రహముగా మఱియొకమారు నీకు ఇప్పుడు చెప్పుచున్నాను. |
| యః+యోగధారణామ్+ ఆస్థితః | = | ఎవడు అనగా శరీరమును విసర్జించు తలంపు గలిగిన యోగి దేశ, కాలములను గుఱించి పట్టించుకొనక యోగధారణమున ఉన్నవాడై |
| బ్రహ్మ+ఓమ్+ఇతి+ ఏక అక్షరమ్+వ్యాహరన్ | = | బ్రహ్మ శబ్దవాచ్యమయిన ఓమ్ అనే అక్షరమును ఉచ్ఛరించుచూ |
| ఆత్మనః+మనః+ సంయమ్య | = | తనయొక్క మనస్సును బుద్ధిచే నిగ్రహించి, బుద్ధిని కూటస్థునితో కలిపి ఆ కూటస్థుని |
| హృది+నిరుధ్య | = | హృదయమందుగల క్షేత్రజ్ఞునితో స్థిరమొనర్చి |
| చ | = | మఱియు |
| ప్రాణమ్+సర్వద్వారాణి+ మూర్ధ్ని+ఆధాయ | = | ప్రాణమును ఆధారమునుంచి భ్రూమధ్య స్థానమునకు చేర్చి దృక్, కర్ణ, నాస, ఆస్య మార్గములు కలిపి అనగా కన్నులు, చెవులు, ముక్కు, నోరులయందుగల సర్వద్వారములను మూసి బ్రహ్మరంధ్రమునందు ఉంచి |
| ప్రయాతి | = | బ్రహ్మరంధ్రము చించి ఎవడు దేహమును వీడి పయనించుచున్నాడో |

| | | |
|---|---|---|
| సః+పరమామ్+గతిమ్+ యాతి | = | అతడు ఉత్కృష్టమయిన ప్రాప్యస్థానమును అనగా బ్రహ్మపదమును పొందుచున్నాడు. |

**భక్తిమార్గము :**

| | | |
|---|---|---|
| మామ్+అనుస్మరన్+ దేహమ్+త్యజన్ | = | నన్ను అనగా ఈశ్వరుని అనన్యచిత్తముతో స్మరించుచూ దేహమును త్యజించుచున్నవాడై బ్రహ్మపదమును పొందుచున్నాడు. |

**భక్తుడు:**

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| యః+మామ్+ | = | ఎవడు |
| అనన్యచేతాః+సతతమ్+ స్మరతి | = | నన్ను అనగా ఈశ్వరునుని ఇతర విషయములను చింతింపని మనస్సు గలవాడై నిరంతరము స్మరించుచున్నాడో |
| తస్య+అహమ్+సులభః | = | అతనికి నేను సులభముగా పొందదగినవాడను |

**యోగపద్ధతి :**

| | | |
|---|---|---|
| నిత్యశః+నిత్యయుక్తస్య+ యోగినః | = | ఎల్లప్పుడూ కూటస్థుని క్షేత్రజ్ఞునితో కలిపిన వాడయిన యోగికి నేను సులభముగా పొందదగిన వాడను |

...... ❖ ❖ ❖ ......

ఆత్మ స్థానమును పొందినవాడు - తిరిగి ఎన్నటికి జన్మించడు
(జన్మరాహిత్యము)

**మాముపేత్య పునర్జన్మ । దుఃఖాలయమశాశ్వతమ్ ।**
**నాప్నువన్తి మహాత్మానః । సంసిద్ధిం పరమాం గతాః ॥ 15**

మామ్ – ఉపేత్య – పునర్జన్మ – దుఃఖాలయమ్ – అశాశ్వతమ్
న – ఆప్నువన్తి – మహాత్మానః – సంసిద్ధిమ్ – పరమామ్ – గతాః

**ఆ బ్రహ్మభువనాల్లోకాః । పునరావర్తి నోఽర్జున ।**
**మాముపేత్య తు కౌన్తేయ । పునర్జన్మ న విద్యతే ॥ 16**

ఆబ్రహ్మభువనాత్ – లోకాః – పునః – ఆవర్తినః – అర్జున
మామ్ – ఉపేత్య – తు – కౌన్తేయ – పునర్జన్మ – న – విద్యతే

| | | |
|---|---|---|
| పరమామ్+సంసిద్ధిమ్+ | = | జీవించి వుండగా గొప్ప సిద్ధిని పొందినట్టి |
| గతాః (సంతః)+ | | వారలైన జీవన్ముక్తులు అయిన |
| మహాత్మానః | | మహాత్ములు దేహ త్యాగానంతరము |
| మామ్+ఉపేత్య | = | నన్ను అనగా ఆత్మను పొంది, అనగా ఆత్మలో ఏకీభూతులై |
| దుఃఖ ఆలయమ్+ | = | సుఖదుఃఖములకు నిలయము అయినదియు |
| అశాశ్వతమ్+పునర్జన్మ+ | = | అశాశ్వతమైనదియు, క్షణ భంగురమయినదియు |
| న+ఆప్నువంతి | | అయిన పునర్జన్మను పొందరు. |
| కౌన్తేయ | = | ఓ అర్జునా! |
| ఆబ్రహ్మభువనాత్+ | = | బ్రహ్మలోకము పర్యంతముగల లోకములు |
| లోకాః+పునరావర్తినః | | మరల వచ్చెడి స్వభావముగలిగినవి. |
| అర్జున | = | ఓ అర్జునా! |

తు = దేహ పరిత్యాగానంతరము
మామ్+ఉపేత్య+ = నన్ను అనగా ఆత్మను పొంది పునర్జన్మ
పునర్జన్మ+న+విద్యతే పొందుట లేదు. వారికి పునర్జన్మ లేదు

**వ్యాఖ్యానము :-** ఈ శ్లోకమున మూడు తరగతుల వారిని గురించి చెప్పినారు:

మానవులలో పాపులు – పుణ్యాత్ములు అని రెండు వర్గములు.

**పాపులు:–** నరకమునకు వెళ్ళి నరకములో బాధలు అనుభవించి తిరిగి తిర్యక్ యోనులందు పుట్టుదురు.

**పుణ్యాత్ములు:–** వారి వారి పుణ్యఫలితముగా ఇంద్రలోకము చేరి అక్కడ సుఖభోగములు అనుభవించి పునర్జన్మకు వత్తురు. పుణ్యఫలితము కోరిన వారు తిరిగి జన్మింతురు.

పుణ్యఫలితము కోరని వారు తిరిగి జన్మింపరు, కల్పాంతమున అధికార పురుషులగుదురు. ఆత్మ స్థానము చేరిన వారు తిరిగి జన్మింపరు.

...... ❖ ❖ ❖ ......

కాలము - సృష్టి, లయము

**సహస్రయుగపర్యన్తమ్ । అహర్యద్బ్రహ్మణో విదుః ।**
**రాత్రిం యుగసహస్రాన్తాం । తేఽ హోరాత్రవిదో జనాః ॥ 17**

సహస్ర యుగ పర్యన్తమ్ – అహః – యత్ – బ్రహ్మణః – విదుః
రాత్రిమ్ – యుగ సహస్రాన్తామ్ – తే – అహోరాత్రవిదః – జనాః

**అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః । ప్రభవంత్యహరాగమే ।**
**రాత్ర్యాగమే ప్రలీయన్తే । తత్రైవా వ్యక్తసంజ్ఞకే ॥ 18**

అవ్యక్తాత్ – వ్యక్తయః – సర్వాః – ప్రభవన్తి – అహః – ఆగమే
రాత్రి – ఆగమే – ప్రలీయన్తే – తత్ర – ఏవ – అవ్యక్త – సంజ్ఞకే.

**భూతగ్రామః స ఏవాయం । భూత్వా భూత్వా ప్రలీయతే ।**
**రాత్ర్యాగమేऽవశః పార్థ । ప్రభవత్యహరాగమే ॥ 19**

భూతగ్రామః – సః – ఏవ – అయమ్ – భూత్వా భూత్వా – ప్రలీయతే
రాత్రి – ఆగమే – అవశః – పార్థ – ప్రభవతి – అహః – ఆగమే.

యత్+సహస్రయుగ- = ఏది వేయి యుగముల కాలమో, అనగా
పర్యన్తమ్+బ్రహ్మణః+ వేయి యుగముల కాలము (చతుర్ముఖ) బ్రహ్మకు
అహః పగలు అని తెలియుదురు. అటులనే
యుగ సహస్రాంతామ్+ = వేయి యుగముల కాలము రాత్రి అని
రాత్రిమ్ తెలియుదురు.

బ్రహ్మయొక్క పగటి కాలమున సృష్టి జరుగును. బ్రహ్మకు రాత్రి అవగానే ఈ సృష్టి లయమగును. తిరిగి బ్రహ్మకు పగటి కాలమున సృష్టి జరుగును. ఈ విధముగా

యే+విదుః = ఎవరు సృష్టి లయములను తెలియుదురో
తే + జనాః+ = ఆ జనులు అహోరాత్రములు తెలిసినవారు.
అహోరాత్ర విదః అనగా సృష్టి లయములను ఎఱిగినవారు.

**బ్రహ్మకు:**

రాత్రి+ఆగమే+తత్ర+ = రాత్రి కాలము ప్రారంభము కాగానే ఆ రాత్రియందు
అవ్యక్త+సంజ్ఞకే+ఏవ+ అవ్యక్తమను పేరుగల ప్రకృతి యందు ఈ స్థావర
ప్రలీయన్తే జంగమముల ఉపాధులు లయమగుచున్నవి. అటులనే ఆత్మ స్థానమును పొందని జీవులు. విరాట్పురుషుని యందు లీనమగుదురు.

మరల బ్రహ్మకు వేయి యుగములు గడచి

అహః+ఆగమే+ = పగలు ప్రారంభము కాగానే అవ్యక్తమైన ప్రకృతి
అవ్యక్తాత్+సర్వాః+ నుండి సర్వ స్థావర జంగమముల ఉపాధులు

| | | |
|---|---|---|
| వ్యక్తయః+ప్రభవన్తి | | వచ్చినవి. వ్యక్తములగును. ఆ ఉపాధులలో పురుషుడు దేహిగను, హృదయగత ఆత్మగను ప్రవేశించును. ఆ విధముగా సర్వ స్థావర జంగమములు ప్రభవించుచున్నవి. అనగా సృష్టి జరుగుచున్నది. రాత్రియందు ఈ సృష్టి లయమగు చున్నది. |
| పార్థ | = | ఓ అర్జునా! మరల |
| అహః+ఆగమే+ | = | బ్రహ్మకు పగలు కాగానే, లయమయిన |
| సః+ఏవ+అయమ్+ | | ఆ ప్రాణి సముదాయమే |
| భూతగ్రామః | | |
| అవశః (సన్)+ప్రభవతి+ | = | బంధవిముక్తి కానందున అవశులై పుట్టుచున్నవి |
| రాత్రి+ఆగమే+ప్రలీయతే | = | బ్రహ్మకు రాత్రి ప్రారంభము కాగానే –(ఆ ప్రకృతియందే) లీనమగుచున్నవి. ఆ విధముగా |
| భూత్వా భూత్వా | = | పుట్టి, చచ్చి – పుట్టి, చచ్చి –– తరుణోపాయము కానక ఈ జనన మరణ వలయములో తిరుగుచున్నవి. |

**వ్యాఖ్యానము:-** బ్రహ్మకు రాత్రి అవగానే ప్రకృతినుండి వచ్చినవి ప్రకృతియందు, పురుషుని నుండి వచ్చినవి పురుషునియందు లీనమగుచున్నవి. అటులనే తిరిగి బ్రహ్మకు పగలు అవగానే ప్రకృతినుంచి సర్వస్థావర జంగమముల ఉపాధులు, పురుషుని నుంచి దేహి, హృదయగత ఆత్మలు వచ్చుచున్నవి. చతుర్ముఖ బ్రహ్మయొక్క ఒక పగటి కాలము వేయి యుగములు. రాత్రి వేయి యుగములు. ఇలా రెండు వేల యుగములు గడచిన తర్వాత చతుర్ముఖ బ్రహ్మకు ఒక దినము అగును. అలా ఒక సంవత్సరము గడచి చతుర్ముఖ బ్రహ్మకు నూఱు సంవత్సరములు గడచిపోగానే చతుర్ముఖ బ్రహ్మకు ఆయువు తీరి అతడు కూడ లయమగును. కావున చతుర్ముఖ బ్రహ్మ శాశ్వతుడుకాడు. ఆ లోకము శాశ్వతముకాదు. లోకంబులు, లోకేశులు,

లోకస్థులు నశించిన తర్వాత కూడ శాశ్వతముగా ఉండువాడు పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మ లేక ఆత్మయొక్క స్థానము పరంధామము. అదే అచ్యుత స్థానము. బ్రహ్మరంధ్రము చించి, జీవన్ముక్తుడైన వాడు పొందుస్థానము. అచ్యుత స్థానము.

కాలము - పరబ్రహ్మకు కాలము కర్త కాదు. ఇతడు కాలాధీశుడు. కాని చతుర్ముఖ బ్రహ్మ కాలమునకు వశుడు. ఈ విషయమును చెప్పుటకు పరబ్రహ్మకు ప్రతీక అయిన విష్ణువునకు గడ్డములేకుండగను, చతుర్ముఖ బ్రహ్మకు తెల్లని గడ్డము ఉన్నట్లు చిత్రములో చిత్రించెదరు.

14 మంది మనువులు బ్రహ్మయొక్క పగటి కాలమున పాలింతురు. మనువు మారగనే, ఇంద్రుడు, దేవతలు, సప్త ఋషులు మారుదురు. ప్రస్థుతము సప్తమ మనువు అయిన వైవస్వత మనువు పాలన సాగుచున్నది. ఇతనికే శ్రాద్ధదేవుడనే మరో పేరుకలదు. పురంధరుడు అనేవాడు ఇప్పటి ఇంద్రుడు. ఆదిత్యులు, మరుత్తులు, అశ్వినులు, వసువులు, రుద్ర గణములు అనేవారు దేవతలు. గౌతమ-కశ్యప-అత్రి, విశ్వామిత్ర-జమదగ్ని-భారద్వాజ-వసిష్ఠుడు - అనేవారు సప్త ఋషులు. రాబోవు మనువు సూర్యసావర్ణి. అప్పుడు బలిచక్రవర్తి ఇంద్రుడు అగును. కాలవుండు-దీప్తిమంతుడు-పరశురాముడు-అశ్వత్థామ-కృపాచార్యులు-వ్యాసభగవానుడు-ఋష్యశృంగుడు - వీరు సప్త ఋషులు అయ్యెదరు.

...... ❖ ❖ ❖ ......

**పరస్తస్మాత్తు భావోఽన్యో । ఽవ్యక్తోఽవ్యక్తాత్ సనాతనః ।**
**యః స సర్వేషు భూతేషు । నశ్యత్సు న వినశ్యతి ॥ 20**

పరః - తస్మాత్ - తు - భావః - అన్యః - అవ్యక్తః - అవ్యక్తాత్ - సనాతనః
యః - సః - సర్వేషు - భూతేషు - నశ్యత్సు - న - వినశ్యతి

**అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః । తమాహుః పరమాం గతిమ్ ।**
**యం ప్రాప్య న నివర్తన్తే । తద్ధామ పరమం మమ ॥ 21**

అవ్యక్తః – అక్షరః – ఇతి – ఉక్తః – తమ్ – ఆహుః – పరమామ్ – గతిమ్
యమ్ – ప్రాప్య – న – నివర్తన్తే – తత్ – ధామ – పరమమ్ – మమ

| | | |
|---|---|---|
| తస్మాత్+యః | = | అందువలన ఎవడు |
| అవ్యక్తాత్+పరః+అన్యః+ | = | అవ్యక్తమైన ప్రకృతి కంటె పరమయినదియు |
| సనాతనః+అవ్యక్తః | | ప్రకృతికి భిన్నమయినదియు సనాతన మయినదియు అవ్యక్త మయినదియు అనగా బాహ్య చక్షువులకు గోచరము కానిదియు, |
| సర్వేషు+భూతేషు+ | = | సర్వ భూతములయందు అంతర్యామిగా |
| తు+భావః+సః+<br>నశ్యత్సు (సత్సు)+సః+<br>న+వినశ్యతి | = | చరించుచున్నదియు సమస్త భావముల పుట్టుకకు కారణమయినదియు అయిన ఆ ఆత్మ సమస్తమూ నశించుచున్ననూ నశింపదు. |
| అవ్యక్తః+<br>అక్షరః+ఇతి+ఉక్తః+<br>తమ్+పరమామ్+<br>గతిమ్+ఆహుః | = | అవ్యక్తము అక్షరము అని చెప్పబడును. ఆత్మ వసించు దానిని ఉత్కృష్ట స్థానముగా చెప్పుదురు |
| యమ్+ప్రాప్య+న+<br>నివర్తన్తే+తత్+మమ+<br>పరమమ్+ధామ | = | దేనిని పొంది తిరిగి జన్మింపరో అది–ఆస్థానము నా యొక్క పరమ పదము. అదే పరంధామము. అనగా నా యొక్క నివాస స్థానము. ఆత్మ స్థానము. |

ఆత్మ అవ్యక్తము. అక్షరము. ఆత్మస్థానము ఉత్కృష్టము. ఆత్మస్థానమును పొందిన తిరిగి జన్మింపరు.

...... ❖ ❖ ❖ ......

విరాట్పురుషుడు

**పురుషః స పరః పార్థ । భక్త్యా లభ్యస్త్వనన్యయా ।**
**య స్యాన్తఃస్థాని భూతాని । యేన సర్వమిదం తతమ్ ॥ 22**

పురుషః - సః - పరః - పార్థ - భక్త్యా - లభ్యః - తు - అనన్యయా
యస్య - అన్తః - స్థాని - భూతాని - యేన - సర్వమ్ - ఇదమ్ - తతమ్

పార్థ = ఓ అర్జునా!
భూతాని+యస్య+ = సర్వభూతములు పురుషునియొక్క లోపల ఉన్నవో
అన్తః+స్థాని అనగా ఎవడు హిరణ్యగర్భవాచ్యుడో
యేన+ఇదమ్+సర్వమ్+ = ఎవనిచేత ఈ సర్వము వ్యాపింపబడెనో
తతమ్
తు = ఎవనివలన కాలము, మార్గములు కలుగుచున్నవో
సః+పరః+పురుషః+ = ఆ పరమ పురుషుడు యోగముచేత
అనన్యయా+భక్త్యా+ అనన్య భక్తి చేత పొందదగినవాడు.
లభ్యః

**వ్యాఖ్యానము :-** ఈ స్థానమును పుణ్యకర్మానుష్ఠానముచేత పొందలేము. **"మూఢుండు శబ్దమయ వేదమార్గంబైన కర్మఫల బోధనప్రకారంబున వ్యర్థంబులైన స్వర్గాదినానాలోకసుఖంబుల నిచ్ఛగించుచు మాయామయమార్గంబున వాసనా-మూలంబున నిద్రించువాఁడు గలలు గను తెఱంగునం బరిభ్రమించుచు నిరవద్యసుఖలాభంబుం జెందఁడు"** *(భాగవతము ద్వితీయ స్కంధం-20).*

**"పుణ్యాతిరేకంబున బ్రహ్మలోకగతులైనవారు కల్పాంతరంబునం పుణ్యతారతమ్యంబుల నధికారవిశేషంబు నొందువార లగుదురు"***(భాగవతం ద్వితీయ స్కంధం-32).* **"ఏరికిం గర్మంబుల నట్టి గతి బొందఁశక్యంబు గాదు.** *(భాగవతం ద్వితీయ స్కంధం-30).*

అనగా కర్మలవలన ఆత్మస్వరూపము పొందుటకు శక్యముకాదు. నిష్కామ పుణ్యకర్మలవలన బ్రహ్మలోకమును చేరి, అచట స్థిరనివాసమై, అధికార విశేషముగా ఉందురు. తిరిగి జన్మపరంపరలకు రారు. మూఢుండు కామ్యకర్మల ననుసరించి బ్రహ్మలోకము చెంది, తిరిగి జననమరణ చక్రంలో చిక్కుకొనును.

...... ❖ ❖ ❖ ......

**యత్ర కాలే త్వనా వృత్తిమ్ । ఆవృత్తిం చైవ యోగినః ।**
**ప్రయాతా యాన్తి తం కాలం । వక్ష్యామి భరతర్షభ ॥ 23**

యత్ర - కాలే - తు - అనావృత్తిమ్ - ఆవృత్తిమ్ - చ - ఏవ - యోగినః
ప్రయాతాః - యాన్తి - తమ్ - కాలమ్ - వక్ష్యామి - భరతర్షభ

ఈ శ్లోకములు సంధిసమాసములతో ఉన్నవి

**అగ్నిర్జ్యోతిరహః శుక్లః । షణ్మాసా ఉత్తరాయణమ్ ।**
**తత్ర ప్రయాతా గచ్ఛన్తి । బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ 24**

అగ్నిః - జ్యోతిః - అహః - శుక్లః - షణ్మాసాః - ఉత్తరాయణమ్
తత్ర - ప్రయాతాః - గచ్ఛన్తి - బ్రహ్మ - బ్రహ్మవిదః - జనాః

**ధూమో రాత్రిస్తథా కృష్ణః । షణ్మాసా దక్షిణాయనమ్ ।**
**తత్ర చాంద్రమసం జ్యోతిః । యోగీ ప్రాప్య నివర్తతే ॥ 25**

ధూమః - రాత్రిః - తథా - కృష్ణః - షణ్మాసాః - దక్షిణాయనమ్
తత్ర - చాంద్రమసమ్ - జ్యోతిః - యోగీ - ప్రాప్య - నివర్తతే

**శుక్ల కృష్ణే గతీహ్యేతే । జగతః శాశ్వతే మతే ।**
**ఏకయా యాత్యనావృత్తిమ్ । అన్యయావర్తతే పునః ॥ 26**

శుక్ల - కృష్ణే - గతీ - హి - ఏతే - జగతః - శాశ్వతే - మతే
ఏకయా - యాతి - అనావృత్తిమ్ - అన్యయా - ఆవర్తతే - పునః

**కాలము:**

| | | |
|---|---|---|
| భరతర్షభ | = | ఓ అర్జునా! |
| తమ్+కాలమ్+కాలే | = | సూర్యచంద్రులవలన కలుగు ఆ కాలమును |
| కాలే | = | ఆ కాలమునందు గలుగు ఉత్తరాయణ, దక్షిణాయనములు, చంద్రునివలన గలుగు శుక్లపక్షము, కృష్ణపక్షము అటులనే సూర్యునివలన పగలు, చంద్రునివలన రాత్రి గలుగుచున్నవి అను విషయము తెలిసినదే. |

అధిభౌతికమయిన సూర్యునివలన

| | | |
|---|---|---|
| అహః+రాత్రిః | = | పగలు, రాత్రి |
| షణ్మాసాః+ఉత్తరాయణమ్ | = | ఆఱునెలలు పరిమితిగల ఉత్తరాయణము |
| తథా+షణ్మాసాః+ దక్షిణాయనమ్ | = | ఆఱునెలలు కాలముగల దక్షిణాయనము ఏర్పడుచున్నవి. |

అధిభౌతికమయిన చంద్రునివలన

| | | |
|---|---|---|
| శుక్లః+కృష్ణః+ శుక్లకృష్ణేగతీ | = | శుక్లపక్షము కృష్ణపక్షము ఆవిధముగా చంద్రునివలన శుక్లకృష్ణములు ఏర్పడుచున్నవి. |

**మార్గములు :**

| | | |
|---|---|---|
| యత్ర+ప్రయాతాః+ యోగినః+ఏవ+ అనావృత్తమ్+యాంతి | = | ఏ మార్గమునందు దేహత్యాగము చేసినట్టి యోగులు తిరిగిరాని గతిని పొందుచున్నారో |
| చ | = | మఱియు పుణ్యకర్మిష్ఠులు బ్రహ్మలోకమునందు వసియించుచున్నారో |
| ఆవృత్తిమ్ | = | బ్రహ్మలోకము చేరి ఈ భూలోకమునకు తిరిగి వచ్చుచున్నారో ఆ మార్గముల గుఱించి |

| | | |
|---|---|---|
| వక్ష్యామి | = | చెప్పెదను. శ్రద్ధగా వినుము. |

**1. యోగులు :**

| | | |
|---|---|---|
| యోగీ+అగ్నిః+జ్యోతిః+ జ్యోతిః+బ్రహ్మ+ప్రాప్య | = | యోగి అయినవాడు బ్రహ్మలోకంబునకు ఆకాశమార్గంబున బోవుచూ సుషుమ్నానాడి వెంట అగ్నియను దేవతను చేరి జ్యోతిర్మయంబైన దేహంబున జ్యోతిర్మార్గంబున పయనించి స్వయం జ్యోతి అయిన బ్రహ్మమును పొంది, బ్రహ్మయై విరాజిల్లును. ఇది జ్యోతిర్మార్గము. |

**2. పుణ్యకర్మలు చేసి పుణ్యఫలితము కోరనివారు :**

| | | |
|---|---|---|
| బ్రహ్మవిదః+జనాః+ తత్ర +ప్రయాతాః + గచ్ఛంతి | = | బ్రహ్మజ్ఞులయిన జనులు దేవయానముద్వారా వెళ్ళినవారై బ్రహ్మలోకమును పొందుచున్నారు. వారు భూలోకమున జన్మింపరు. అధికార పురుషులగుదురు. ఇది ఉత్తరాయణ మార్గము. |

**3. పుణ్యకర్మలు చేసి పుణ్యఫలితము కోరినవారు :**

| | | |
|---|---|---|
| చాంద్రమాసమ్+తత్ర + నివర్తతే | = | చంద్రయానము లేక పితృయానముద్వారా పయనించి అక్కడ అనగా బ్రహ్మలోకము చేరి, పుణ్యఫలితము అనుభవించి పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమునకు వత్తురు. ఇది దక్షిణాయన మార్గము. |

**4. పాపులు :**

| | | |
|---|---|---|
| ధూమః+ | = | చీకటిమార్గమున పయనించి నరకము చేరి, అక్కడ నరకబాధలు అనుభవించి తిరిగి భూలోకమునకు వత్తురు. ఇది ధూమ్ర మార్గము. |
| ఏతే+జగతః+శాశ్వతే+ మతే | = | ఈ నాలుగు మార్గములు జగత్తునకు అనగా ప్రాణులకు శాశ్వతములని భావించబడుచున్నవి. |

| | | |
|---|---|---|
| హి | = | యోగి జ్యోతిర్మయంబైన తేజంబున నిర్మలుండై జ్యోతిర్మార్గమున బ్రహ్మపదమును చేరి బ్రహ్మయగును. |
| ఏకయా+ | = | దేవయానముద్వారా పయనించువారు అధికార పురుషులగుదురు. |
| అనావృత్తిమ్+యాతి | = | పునర్జన్మకు రారు |
| అన్యయా+పునః+ఆవర్తతే | = | పితృయానముద్వారా పయనించువాడు మరల తిరిగి భూలోకమునకు వచ్చుచున్నాడు. జననమరణ వలయములో చిక్కుకొనుచున్నాడు. |

**వ్యాఖ్యానము :-** అధి భౌతికమైన సూర్యుని వలన "కాల భేదము" ఏర్పడు చున్నది. అనగా పగలు, రాత్రి, ఋతువులు, ఉత్తరాయణ, దక్షిణాయనములు ఏర్పడుచున్నవి. (జనవరి 14 నుంచి జులై 14 వఱకు ఉత్తరాయణము. ఆ తర్వాత జులై 14 నుంచి జనవరి 14 వఱకు దక్షిణాయనము. ఇది కాలమునకు సంబంధించి నది). వీటి గుఱించి పంచాంగము వివరించును. అధిదైవికమయిన సూర్యునివలన మార్గములు ఏర్పడుచున్నవి. కర్మానుష్ఠానమువలన దేహత్యాగానంతరము జీవుడు ప్రయాణించుటకు మార్గములు ఏర్పడినవి.

యోగి సుషుమ్నానాడివెంట నగ్నియను దేవతం జేరి జ్యోతిర్మయంబైన తేజంబున ఆత్మలో ఏకీభూతుడై ఆత్మయై విరాజిల్లును. అటులనే పుణ్యకర్మానుష్ఠానమువలన ఉత్తరాయణ మార్గము, దక్షిణాయన మార్గములు పొందబడుచున్నవి. కాలము, మార్గము ఒకటికావు.

**ఆసన్న మరణార్థియైన యతీశుండు కాలదేశములను గాచికొనఁడు**

(భాగవతం ద్వితీయ స్కంధం-27)

ఆదిత్యునివలన బ్రహ్మలోకమునకు చేరు మార్గములు ఏర్పడుచున్నవి. వాటిని జ్యోతిర్మార్గము, ఉత్తరాయణ మార్గము, దక్షిణాయన మార్గము అని అందురు. ఈ మార్గములకు పంచాంగములో చెప్పబడినవాటికి సంబంధములేదు. యోగి బ్రహ్మరంధ్రము చించి పయనించు యోగుల మార్గము జ్యోతిర్మార్గము. పుణ్యఫలితము కోరనివారు పయనించు మార్గము ఉత్తరాయణ మార్గము. పుణ్యఫలితము కోరిన వారు పయనించు మార్గము దక్షిణాయన మార్గము. వీరు ముగ్గురు బ్రహ్మలోకము

చేరుదురు. జ్యోతిర్మార్గమున పయనించువారు బ్రహ్మయై విరాజిల్లుదురు. ఉత్తరాయణ మార్గమున పయనించిన వారు కల్పాంతమున అధికార పురుషులగుదురు. ఉదా: బలిచక్రవర్తి. ఇతడు రాబోవు మనువు కాలములో ఇంద్రుడు అగును. పై రెండు మార్గములలో పయనించువారు భూలోకమున ఎన్నటికి జన్మింపరు. దక్షిణాయన మార్గమున పయనించువారు పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మింతురు.

వీటి గుఱించి భాగవతము ద్వితీయ స్కంధమున ఇట్లు వివరింపబడినది. బ్రహ్మరంధ్రము చీల్చి, జ్యోతిర్మార్గమున పయనించువారు బ్రహ్మమందు కలియును. ఇది సద్యోముక్తి. దేహత్యాగ కాలమున ఇంద్రియములతోడి సంగమంబు విడువని వాడు బ్రహ్మలోకము చేరి, అక్కడ వసియించి, బ్రహ్మతో సహా పరబ్రహ్మలో కలియును. ఇది క్రమ ముక్తి. పుణ్యఫలితము కోరనివారు, బ్రహ్మలోకము చేరి కల్పాంతరంబున పుణ్య తారతమ్యంబుల అధికార విశేషంబులొందువారు అగుదురు. పుణ్యఫలితము కోరిన వారు తిరిగి భూలోకమున పుణ్యక్షీణము అయిన తరువాత జన్మింతురు.

(పాపకర్మావలంబి కాశిలోగాని, హిమాలయాలలోగాని, లేదా పుణ్యప్రదేశములుగా చెప్పబడే ఏ ప్రదేశములోగాని పంచాంగంలో వ్రాయబడిన ఉత్తరాయణ కాలములో గాని మంచి తిథిలోగాని మరణించినా కూడా వాడు నరకమునకే చేరును. ఒక పుణ్యాత్ముడు అనగా నిష్కామకర్మపరుడు ఏ ప్రదేశములో అయినా రాత్రి అయినా, పగలు అయినా దక్షిణాయనముగా పంచాంగంలో వ్రాయబడిన కాలములో అయినా దుష్టతిథి అయినా బ్రహ్మలోకము చేరును. కామ్యకర్మపరుడు సూర్యకిరణముల ద్వారా బ్రహ్మలోకము చేరి అక్కడ సుఖభోగములు అనుభవించి పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమునకు వచ్చును. దీనిని పితృయానము లేక దక్షిణాయన మార్గము అందురు.)

ఉత్తరాయణ మార్గములో అగ్నిని అధిష్ఠానముగా చేసి సుషుమ్నా మార్గమున పయనించి ఆత్మస్థానమును చేరి ఆత్మలో ఏకీభూతమగుటను జ్యోతిర్మార్గము అని అందురు. ఈ మార్గము గుఱించి యింతకు ముందు వివరించి ఇప్పుడు పుణ్య కర్మానుష్ఠానం గుఱించి వివరించుచున్నాడు.

ఈ మార్గములను గుఱించి ఛాందోగ్యము, 5వ అధ్యాయము 10వ ఖండము 1,2,3 శ్లోకములలో చెప్పబడినది.

...... ❖ ❖ ❖ ......

యోగపద్ధతి - భక్తిపద్ధతి

**నైతే సృతీ పార్థ జానన్ । యోగీ ముహ్యతి కశ్చన ।**
**తస్మాత్ సర్వేషు కాలేషు । యోగయుక్తో భవార్జున ॥ 27**

న - ఏతే - సృతీ - పార్థ - జానన్ - యోగీ - ముహ్యతి - కశ్చన
తస్మాత్ - సర్వేషు - కాలేషు - యోగయుక్తః - భవ - అర్జున.

**వేదేషు యజ్ఞేషు తపః సుచైవ ।**
**దానేషు యత్పుణ్య ఫలం ప్రదిష్టమ్ ।**
**అత్యేతి తత్సర్వమిదం విదిత్వా ।**
**యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ ॥ 28**

వేదేషు-యజ్ఞేషు-తపః-సు-చ-ఏవ-దానేషు-యత్-పుణ్యఫలమ్-ప్రదిష్టమ్
అత్యేతి-తత్-సర్వమ్-ఇదమ్-విదిత్వా-యోగీ-పరమ్-స్థానమ్-ఉపైతి-చ-ఆద్యమ్

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| ఏతే+సృతీ+జానన్+ కశ్చన+యోగీ+ న+ముహ్యతి | = | ఈ నాలుగు మార్గములు తెలిసిన ఏ యోగియు అజ్ఞానమును పొందడు. |
| తస్మాత్+యోగయుక్తః+ భవ | = | అందువలన యోగ యుక్తుడవు అగుము. |

**భక్తిపద్ధతి :**

| | | |
|---|---|---|
| సర్వేషు + కాలేషు | = | సర్వకాలములయందు నన్నే అనగా ఆత్మనే స్మరింపుము. |
| అర్జున | = | ఓ అర్జునా! |

| | | |
|---|---|---|
| వేదేషు+యజ్ఞేషు+ దానేషు+చ + ఏవ | = | వేదములయందు అనగా స్వాధ్యాయముచేయుట యందు వస్తు వినియోగముతో చేయు ద్రవ్య యజ్ఞముల యందు దానములయందు మఱియు సర్వ పుణ్యకార్యములయందు |
| యత్+పుణ్యఫలమ్+ ప్రదిష్టమ్ | = | ఏ పుణ్యఫలము గలదని చెప్పబడినదో |
| తత్+సర్వమ్+ఇదమ్+ సు+తపః+విదిత్వా+ అత్యేతి | = | ఆ సర్వపుణ్యఫలము ఈ యోగమునందు తపస్సు నందు గలదని గ్రహించి ఆ పుణ్య ఫలమును అతిక్రమించుచున్నాడు. అనగా పరమాత్మను దర్శించి ఏ కోరికలు కోరుటలేదు. |
| చ | = | మఱియు, అతడు |
| యోగీ+ఆద్యమ్ + పరమ్+స్థానమ్+ఉపైతి | = | ఆ యోగి సనాతన మైనదియు, సృష్ట్యాది యందు గలదియు ఉత్కృష్ట మయినదియు అయిన ఆ బ్రహ్మ స్థానమును పొందుచున్నాడు. బ్రహ్మయై విరాజిల్లుచున్నాడు. |

...... ❖ ❖ ❖ ......

ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము - 33వ అధ్యాయము

## (రాజవిద్యా - రాజగుహ్యాయోగము)

శ్రీ భగవానువాచ

బ్రహ్మవిద్య

**ఇదం తు తే గుహ్యతమం । ప్రవక్ష్యామ్యనసూయవే ।**

**జ్ఞానం విజ్ఞానసహితం । యద్‌జ్ఞాత్వా మోక్షసేఽశుభాత్ ॥ 1**

ఇదమ్ - తు - తే - గుహ్యతమమ్ - ప్రవక్ష్యామి - అనసూయవే

జ్ఞానమ్ - విజ్ఞాన సహితమ్ - యత్ - జ్ఞాత్వా - మోక్షసే - అశుభాత్

**రాజవిద్యా రాజగుహ్యం । పవిత్రమిదముత్తమమ్ ।**

**ప్రత్యక్షావగమం ధర్మ్యం । సుసుఖం కర్తుమవ్యయమ్ ॥ 2**

రాజ విద్యా - రాజగుహ్యమ్ - పవిత్రమ్ - ఇదమ్ - ఉత్తమమ్

ప్రత్యక్షావగమమ్ - ధర్మ్యమ్ - సుసుఖమ్ - కర్తుమ్ - అవ్యయమ్

| | | |
|---|---|---|
| యత్+జ్ఞాత్వా+ | = | దేనిని తెలుసుకొని అశుభముల నుండి |
| అశుభాత్+మోక్షసే | | అనగా జననమరణ వలయము నుండి విడివడగలవో అట్టి |
| ఇదమ్+ | = | ఈ విజ్ఞాన సహితమైన జ్ఞానమును |
| విజ్ఞానసహితమ్+జ్ఞానమ్ | | అనగా బ్రహ్మవిద్యను |
| రాజవిద్యా | = | విద్యలలో శ్రేష్ఠమైనదియు |
| రాజగుహ్యమ్+ | | అతి రహస్యమైనదియు |

గుహ్యతమమ్+ఉత్తమమ్+= ఉత్తమమైనదియు పవిత్రమైనదియు
పవిత్రమ్+అవ్యయమ్ నాశనములేనిదియు
ఇదమ్+ధర్మ్యమ్+ = ఇది అపర పర ధర్మములతో కూడినదియు
ప్రత్యక్షావ గమమ్+ ప్రత్యక్ష సుఖబోధకము అయినదియు,
కర్తుమ్+సు సుఖమ్ ఆచరించుటకు మిక్కిలి సులభమైనదియు అయిన బ్రహ్మవిద్యను
అనసూయవే+తు = అసూయాది దుర్గుణములు లేనివాడవైన
తే = నీ కొఱకు
ప్రవక్ష్యామి = చెప్పుచున్నాను.

**వ్యాఖ్యానము:-** కొన్ని ఉపనిషత్‌లలో బ్రహ్మవిద్యను చెప్పవలసినదిగా శిష్యుని ప్రార్థన కలదు. దానిపై గురువు బ్రహ్మవిద్యను ఉపదేశించుట కలదు. కొన్ని ఉపనిషత్తులలో శిష్యుని ప్రార్థన ఉండకపోయినా గురువు శిష్య వాత్సల్యముచే బ్రహ్మవిద్య ఉపదేశించినట్లు కనబడును. ఇది ఈ కోవకు చెందినది.

బ్రహ్మవిద్యకు సంబంధించిన విషయములు వినుటకు, గ్రంథములు చదువుటకు - దైవీ సంపదలు గలిగిఉండుట ముఖ్య అర్హత. ఇట్టి అర్హత గలిగి వినవలసినదిగా వాల్మీకి మహర్షి తన రామాయణమున యిట్లు చెప్పినారు.

**"ధర్మ కామార్థ సహితం - శ్రోతవ్యమనసూయయా"** (బాలకాండ సర్గ 5, శ్లో. 4)

వాల్మీకి మహర్షి తన రామాయణములో చెప్పినట్లు ఈ శ్లోకములో కూడ "అనసూయవే" - అసూయరహితుడవైన నీకు చెప్పుచున్నాను అని కలదు. శిష్యుల అర్హతను దృష్టిలో ఉంచుకొని బ్రహ్మవిద్యను గురువులు బోధింతురు.

...... ❖ ❖ ❖ ......

**అశ్రద్దధానాః పురుషా । ధర్మస్యాస్య పరన్తప ।**
**అప్రాప్య మాం నివర్తన్తే । మృత్యుసంసారవర్త్మని ॥ 3**

అశ్రద్ధ ధానాః – పురుషాః – ధర్మస్య – అస్య – పరన్తప
అప్రాప్య – మామ్ – నివర్తన్తే – మృత్యు సంసార – వర్త్మని.

**ఈ బ్రహ్మవిద్యనందు**

| | | |
|---|---|---|
| పరన్తప | = | ఓ అర్జునా! |
| అస్య + ధర్మస్య+ | = | ఈ బ్రహ్మవిద్యలో చెప్పినవాటిని శ్రద్ధగా |
| అశ్రద్దధానాః+పురుషాః | | ఆచరింపని మానవులు నన్ను అనగా ఆత్మను |
| మామ్+అప్రాప్య | | పొందక (అనగా బ్రహ్మ స్థానమును పొంది బ్రహ్మయై విరాజిల్లక) |
| మృత్యుసంసార+వర్త్మని+ | = | మృత్యురూపమైన సంసార మార్గమునందు, |
| నివర్తంతే | | జనన మరణ వలయములో తిరుగుచున్నారు. |

**వ్యాఖ్యానము :-** బ్రహ్మవిద్యను తెలుసుకొని శ్రద్ధగా పాటించిన వారు అమృతత్త్వమును పొందు చున్నారు. బ్రహ్మవిద్యను తెలుసుకొని అశ్రద్ధగా పాటించువారు జనన మరణ పరంపరలలో తిరుగుచున్నారు.

...... ❖ ❖ ❖ ......

ఆత్మ - విరాట్‌పురుషుడు

**మయా తతమిదం సర్వం । జగదవ్యక్తమూర్తినా ।**
**మత్ స్థాని సర్వభూతాని । న చాహం తేష్వవస్థితః ॥ 4**

మయా – తతమ్ – ఇదమ్ – సర్వమ్ – జగత్ – అవ్యక్తమూర్తినా
మత్ – స్థాని – సర్వభూతాని – న – చ – అహమ్ – తేషు – అవస్థితః

**న చ మత్ స్థాని భూతాని । పశ్య మే యోగమైశ్వరమ్ ।**
**భూతభృన్న చ భూతస్థో । మమాత్మా భూత భావనః ॥ 5**

న – చ – మత్ – స్థాని – భూతాని – పశ్య – మే – యోగమ్ – ఐశ్వరమ్
భూతభృత్ – న – చ – భూతస్థః – మమ – ఆత్మా – భూత భావనః

**యథాకాశస్థితో నిత్యం । వాయుః స్సర్వత్రగో మహాన్ ।**
**తథా సర్వాణి భూతాని । మత్స్థానీత్యుపధారయ ॥ 6**

యథా – ఆకాశస్థితః – నిత్యమ్ – వాయుః – సర్వత్రగః – మహాన్
తథా – సర్వాణి – భూతాని – మత్ – స్థాని – ఇతి – ఉపధారయ.

**విరాట్పురుషునిగా**

**"యచ్చకించి జ్జగద్సర్వం దృశ్యతే శ్రూయతేపివా**
**అన్తర్బహిశ్చతత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః"** – శ్రుతి

మయా+ఇదమ్+జగత్+ = నా చేత అనగా విరాట్ పురుషునిచేత ఈ జగత్
సర్వమ్+తతమ్ సర్వము, స్థావర జంగమాత్మక మయిన సర్వ విశ్వము వ్యాపించబడియున్నది

సర్వభూతాని+మత్స్థాని = సర్వభూతములు అనగా ఇంద్రాది దేవతలు రాక్షసులు, మనుష్యులు, పశుపక్షి, మృగాదులు, మఱియు స్థావరములు, విరాట్ అన్నియును దేహమునందున్నవి.

చ = మఱియు నా దేహమునందు వసియించుచున్నవి, మఱల లయమగుచున్నవి. అటులనే నేను వాటిలో అంతరాత్మగా ఉన్నాను కానీ

**ఆత్మగా**

అవ్యక్తమూర్తినా+ = ఇంద్రియగోచరముగాని స్వరూపముగల
అహమ్+తేషు+ నేను అనగా ఆత్మగా ఆ సర్వభూతముల యందు
న+అవస్థితః మమేకమై లేను అనగా సాక్షీభూతుడను.

**ఆత్మగా**

| | | |
|---|---|---|
| భూతాని+మత్‌స్థాని+న | = | సర్వభూతములు నా యందు లేవు. అనగా ఆత్మలో జగత్తు లేదు |
| చ | = | మఱియు |
| మమ+ఆత్మా+ | = | నాయొక్క |
| భూతభృత్+భూతభావనః+ న | = | ఆత్మస్వరూపము ప్రాణులను భరించునదియును ప్రాణులను ఉత్పన్నమొనరించి వృద్ధిబొందించు నదియు కాదు |
| చ+భూతస్థః+న | = | మఱియు ప్రాణులతో మమేకమై ఉండునదియు కాదు |
| ఐశ్వరమ్+మే+ యోగమ్+పశ్య | = | ఈశ్వర సంబంధమైన నాయొక్క యోగమును అనగా చాతుర్యమును చూడుము |

**ఉదాహరణ రూపమున వివరించుచున్నాడు:**

| | | |
|---|---|---|
| యథా+సర్వత్రగః+ మహాన్+వాయుః | = | ఏవిధముగా సర్వత్రా సంచరించు గొప్ప వాయువు |
| నిత్యమ్+ఆకాశస్థితః | = | నిత్యము ఆకాశమునందు ఉన్నదో |
| తథా+సర్వాణి+భూతాని +మత్+స్థాని+ఇతి+ ఉపధారయ | = | ఆవిధముగా సర్వభూతములు నాయందున్నవని గ్రహించుము. |

**వ్యాఖ్యానము :-** విరాట్ – ఈ సర్వవిశ్వము విరాట్‌పురుష రూపమయిన నా చేత వ్యాపించబడి ఉన్నది. ఈ సర్వస్థావర జంగమములు రథచక్రపు నాభిలో రథచక్రపు ఆకులు అనుసరించినట్లు విరాట్‌దేహమునందున్నది.

ఆత్మ – అంతర్యామిగా సర్వభూతములలో ఉన్నాను. వాటితో మమేకమై లేను. సాక్షిగా ఉన్నాను.

విరాట్‌గా సర్వము నేనే. జగత్ సర్వము విరాట్‌యందున్నది. సృష్టిస్థితి లయములు విరాట్‌పురుషునివలన జరుగుచున్నది. కాని ఆత్మగా ఈ జగత్తు నాయందు లేదు. అటులనే సృష్టిస్థితి లయకారకుడను గాను. ఆత్మగా భూతములలో అంతర్యామిగా ఉన్నను, వాటితో మమేకమై ఉండను. ప్రాణులు చేయు పుణ్యపాప కర్మలతో ఆత్మగా సంబంధములేదు. ఆత్మ కర్తగాదు. భోక్తగాదు. నిరీక్షకుడు మాత్రమే. జీవునిగా కర్తయై కర్మఫలమును అనుభవించుచున్నాడు. అనగా భోక్త అగుచున్నాడు. జీవునిగా, అంతరాత్మగా, విరాట్‌పురుషునిగా ఉన్న నేను ఆత్మను. నేనే బ్రహ్మను. నేనే విరాట్ పురుషుడను. నేనే జీవునుని. అయినను. ఆత్మగా నా స్వరూప స్వభావములు వేఱు. అంతరాత్మగా నా స్వరూపస్వభావములు వేఱు. జీవునిగా నా స్వరూపస్వభావములు వేఱు. విరాట్ పురుషునిగా నా స్వరూప స్వభావములు వేఱు. పాలనుంచే పెరుగు, వెన్న, నెయ్యి వచ్చినా యివి వేఱువేఱు లక్షణములు గలిగి ఉన్నట్లు ఆత్మ విరాట్ జీవుడు. వేఱు వేఱు లక్షణములు గలిగియున్నవి.

**".....గగనంబునందుఁ బవనాశ్రిత మేఘ సమూహంబును, గాలి యందు బార్థివ ధూళి ధూసరత్వంబున నేరీతి నారేతి ద్రష్టయగు నాత్మయందు దృశ్యత్వంబు బుద్ధి మంతులు గాని వారిచేత నారోపింపంబడు ......"**

(భాగవతం -ప్రథమ స్కంధం-67)

ఆకాశమునందు ఉన్న వాయువు ఆకాశముతో మమేకము కానట్లు దేహములో గల ఆత్మ దేహముతో మమేకము కాకుండా ఉన్నది. అటులనే సర్వత్రా సంచరించువాయువు ధూళికణములతో కలసి మమేకమైనట్లు దేహి దేహముతో మమేకమై సంచరించుచున్నాడు.

ఆకాశమున మేఘము ఉన్నట్లు దేహములో ఆత్మ ఉన్నది. ధూళికణములు గాలిలో కలసి ఉన్నట్లు జీవుడు దేహముతో మమేకమై ఉండును. హృదయగత ఆత్మ ద్రష్ట. ఈ జగత్తు దృశ్యము. బుద్ధిహీనులు ఆత్మలో జగత్తు ఉన్నట్లు ఆరోపింతురు. అటులనే దేహమే ఆత్మ అనియు అందురు.

...... ❖ ❖ ❖ ......

ఆత్మ - విరాట్‌పురుషుడు

**సర్వ భూతాని కౌన్తేయ । ప్రకృతిం యాన్తి మామికామ్ ।**
**కల్పక్షయే పునస్తాని । కల్పాదౌ విసృజామ్యహమ్ ॥ 7**

సర్వ భూతాని – కౌన్తేయ – ప్రకృతిమ్ – యాన్తి – మామికామ్
కల్పక్షయే – పునః – తాని – కల్పాదౌ – విసృజామి – అహమ్

**ప్రకృతిం స్వామవష్టభ్య । విసృజామి పునః పునః ।**
**భూత గ్రామమిమం కృత్స్నమ్ । అవశం ప్రకృతేర్వశాత్ ॥ 8**

ప్రకృతిమ్ – స్వామ్ – అవష్టభ్య – విసృజామి – పునః పునః
భూత గ్రామమ్ – ఇమమ్ – కృత్స్నమ్ – అవశమ్ – ప్రకృతేః – వశాత్

**న చ మాం తాని కర్మాణి । నిబధ్నన్తి ధనంజయ ।**
**ఉదాసీనవదాసీనమ్ । అసక్తం తేషు కర్మసు ॥ 9**

న – చ – మామ్ – తాని – కర్మాణి – నిబధ్నన్తి – ధనంజయ
ఉదాసీనవత్ – ఆసీనమ్ – అసక్తమ్ – తేషు – కర్మసు

**మయాధ్యక్షేణ ప్రకృతిః । సూయతే సచరాచరమ్ ।**
**హేతునానేన కౌన్తేయ । జగద్విపరివర్తతే ॥ 10**

మయా – అధ్యక్షేణ – ప్రకృతిః – సూయతే – సచరాచరమ్
హేతునా – అనేన – కౌన్తేయ – జగత్ – విపరివర్తతే

| | | |
|---|---|---|
| కౌన్తేయ | = | అర్జునా! |
| సర్వ భూతాని+కల్పక్షయే | = | సర్వజీవ రాసులు ఉపాధులు |
| +మామికామ్+ప్రకృతిమ్ | = | కల్పాంతమునందు నాది అయిన – నాచే |
| +యాన్తి | | సృజియింపబడిన ప్రకృతిని పొందుచున్నవి అనగా లయమగుచున్నవి |

| | | |
|---|---|---|
| పునః+తాని+కల్పాదౌ+ అహమ్+విసృజామి | = | మరల ఆ సర్వ జీవరాసులను కల్ప ప్రారంభమున ప్రకృతిని అధిష్ఠించి నేను అనగా విరాట్ పురుషునిగా జీవరాసుల ఉపాధులను సృజియించుచున్నాను. |

**విరాట్ పురుషునిగా:**

| | | |
|---|---|---|
| ప్రకృతేః+వశాత్+ అవశమ్+ఇమమ్+ కృత్స్నమ్+భూతగ్రామమ్ | = | ప్రకృతికి అనగా గుణములకు వశమగుటవలన అస్వతంత్రమయిన ఈ సమస్తమయిన భూతసమూహమును - నేను |
| స్వామ్+ప్రకృతిమ్+ అవష్టభ్య+పునఃపునః+ విసృజామి | = | నాయొక్క ప్రకృతిని అధిష్ఠించి మరల మరల సృజియించుచున్నాను |
| ధనంజయ | = | ఓ అర్జునా! |
| తేషు+కర్మసు+చ+ అసక్తమ్+ఉదాసీనవత్+ ఆసీనమ్ | = | సృష్టి - స్థితి - లయములనే ఆకర్మలయందు ఆసక్తి లేనందువలన సాక్షీమాత్రునిగా ఉన్నట్టి |
| మామ్+తాని+కర్మాణి+ న+నిబధ్నన్తి | = | నన్ను ఆ సృష్టి - స్థితి -లయములనే కర్మలు. బంధించవు. |
| కౌన్తేయ | = | ఓ అర్జునా! |
| మయా+అధ్యక్షేణ+ | = | ప్రకృతిని అధిష్ఠించి ఉన్న నా చేత |
| ప్రకృతిః+స చరాచరమ్+ సూయతే | = | స్థావర జంగమముల ఉపాధులు సృజియింప బడుచున్నవి. అందు నేను దేహి రూపమున, ఆత్మ రూపమున అంతరాత్మగా చరించుచున్నాను. ప్రకృతి జడము. నేను చైతన్యమును. |
| అనేన+హేతునా+జగత్+ విపరివర్తతే | = | ఈ కారణమువలన జడము అయిన జగత్ వర్తించుచున్నది |

**వ్యాఖ్యానము:- ఆత్మ స్థానము పొందని వారు:** ఇంతకుముందు వివరించినట్లు యోగముచేగాని, సాంఖ్యముచే గాని, భక్తిచేగాని, కర్మానుష్ఠానముచేగాని నన్ను పొందినవారు ఎన్నటికీ తిరిగి జన్మించరు. అలా పొందనివారు తిరిగి సృష్టి కాలమున భూలోకమున జన్మించుచున్నారు.

కల్పాంతమున ఉపాధులు సర్వము ప్రకృతిలో లీనమగును. జీవాత్మలు విరాట్‌పురుషునిలో లీనమగును. ఆత్మ స్థానమును పొందినవారు తిరిగి జన్మింపరు.

జడమైన ప్రకృతిని అధిష్ఠించి దేహములను సృజియించి అందు చైతన్యరూపుడనైన దేహి, హృదయగత ఆత్మలుగా వసియించుచున్నాను.

ఈ జీవరాసుల ఉపాధులు నిర్మింపబడుచున్నవి. ఆ ఉపాధులలో దేహి - హృదయగత ఆత్మ రూపమున అంతరాత్మగా చరించుచున్నాను. ఆ విధముగనే వాటిని పోషించుచున్నాను. మహా కల్పాంతమున వాటిని లయము చేయు చున్నాను. ఆవిధముగా విరాట్‌పురుషునిగా – గుణములను ఆశ్రయించి సృష్టి, స్థితి, లయములను చేయుచున్నాను.

కర్మ యనగా నేది? అని అర్జునుడు అడుగ సృష్టి, స్థితిలయములు చేయుటను కర్మ అని అందురని గతసర్గలో చెప్పి యిప్పుడు సృష్టి స్థితి లయములకు కర్తృత్వ బాధ్యత లేనందున ఆ కర్మలు బంధకారణములు కావని వివరించు చున్నాడు. జీవులకు కూడా కర్మలు ఎలా బంధకారణములు కావో వివరింపబడినది.

ఆసక్తి లేక సాక్షీభూతుడుగా ఉన్నచో కర్మలు బంధకారణములు కావు. దీనికి ఉదాహరణగా విశ్వామిత్రుడు – మేనకతో సంసారము చేయుటవలన వారికి గలిగిన శకుంతల కథను చెప్పినారు. విశ్వామిత్రుడు తన కూతురయిన శకుంతలను వదలి వెళ్ళినట్లు కథగా వర్ణింపబడినది. ఇంద్రియములు –ఇంద్రియార్థములపై ప్రసరించినవి. తను కర్తను గానని విశ్వామిత్రుడు భావించినాడు.

ఉపాధులు, జీవులు, హృదయ గుహలో గల ఆత్మ ఈ మూడింటి చేత ప్రాణి వర్తించుచున్నది.



అసురసపందగలవారు ఆత్మతత్త్వమును గ్రహించలేరు

**అవజానన్తి మాం మూఢా । మానుషీం తనుమాశ్రితమ్ ।**
**పరం భావమజానన్తో । మమ భూతమహేశ్వరమ్ ॥ 11**

అవజానన్తి - మామ్ - మూఢాః - మానుషీమ్ - తనుమ్ - ఆశ్రితమ్
పరమ్ - భావమ్ - అజానన్తః - మమ - భూత - మహేశ్వరమ్

**మోఘాశా మోఘకర్మాణో । మోఘజ్ఞానా విచేతసః ।**
**రాక్షసీ మాసురీం చైవ । ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ 12**

మోఘాశాః - మోఘ కర్మాణః - మోఘ జ్ఞానాః - విచేతసః
రాక్షసీమ్ -ఆసురీమ్-చ -ఏవ -ప్రకృతిమ్ -మోహినీమ్ - శ్రితాః

| | | |
|---|---|---|
| మోఘాశాః+ | = | పునర్జన్మను గలిగించు ఇహలోకపరలోక |
| మోఘకర్మాణః+ | | సుఖాపేక్షలు అనే వ్యర్థమయిన ఆశలు |
| మోఘజ్ఞానాః+విచేతసః | | కలిగినవారును వ్యర్థమయిన కర్మలు చేయువారును వ్యర్థజ్ఞానము గలిగినవారును అగు అజ్ఞానులును |
| మోహినీమ్+ | = | మోహనరూపమైన రజోగుణ, తమోగుణ |
| రాక్షసీ+చ+ఆసురీమ్+ | | యుతులు ప్రకృతిని ఆశ్రయించినవారును |
| ప్రకృతీమ్+శ్రితాః+ఏవ | | |
| పరమ్+భావమ్+మమ+ | = | సర్వప్రాణుల నియామకుడయిన నా |
| భూతమహేశ్వరమ్+ | | పరమతత్త్వమును తెలియకున్నవారై |
| అజానన్తః | | |
| మూఢాః+మానుషీమ్+ | = | మూర్ఖులు |
| తనుమ్+ఆశ్రితమ్+ | = | అవతార పురుషునిగా, మానవశరీరమును |
| మామ్+అవజానన్తి | | ఆశ్రయించినవాడను అయిన నన్ను ఆత్మ స్వరూపముగా తెలియకున్నారు |

**వ్యాఖ్యానము :-** ప్రకృతికి అవ్వలివాడు పరమపురుషుడు. ప్రకృతితో కలసి గుణయుతుడై సంసారములో ఉండి, సంతానమును పొంది, భార్యా పిల్లలను పోషించుచూ, సంసార విషయములలో చరించుచూ, ప్రాపంచిక విషయ లంపటుడు జీవుడు. పండితుడు తామరాకుపై నీటిబొట్టువలె సంసారములో ఉండును. యోగి గూఢుడుగా ఉండును. "బాలోన్మత్త పిశాచవత్"గా ఉండుటవలన ప్రజలు యోగిని గుర్తింపలేరు. యోగికూడా తామరాకుపై నీటిబొట్టువలె సంసారములో ఉండును.

...... ❖ ❖ ❖ ......

సత్త్వగుణయుతులు ఆత్మను తెలియుదురు

**మహాత్మానస్తు మాం పార్థ । దైవీం ప్రకృతి మాశ్రితాః ।**
**భజన్త్య నన్య మనసో । జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ ॥ 13**

మహాత్మానః - తు - మామ్ - పార్థ - దైవీమ్ - ప్రకృతిమ్ - ఆశ్రితాః
భజంతి - అనన్య - మనసః - జ్ఞాత్వా - భూతాదిమ్ - అవ్యయమ్

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| మహాత్మానః+దైవీమ్+ ప్రకృతిమ్+ ఆశ్రితాః(సంతః) | = | మహాత్ములు అనగా సాంఖ్యులు ప్రకృతినిగాక దైవమును ఆశ్రయించిన వారలై ఆపై గుణరహితులై |
| భూతాదిమ్+అవ్యయమ్ +మామ్+జ్ఞాత్వా | = | సృష్ట్యాదియందు గల శాశ్వతుడునయిన నన్ను అనగా ఆత్మను గ్రహింతురు. అటులనే యోగులు నిశ్చల సమాధిలో గ్రహించి అనగా దర్శించెదరు. |
| అనన్య+మనసః(సంతః) +భజన్తి+తు | = | భక్తులు ఏకాగ్ర చిత్తముతో ఇతర చింతనలు లేక, నిర్మల మనస్సు గలిగినవారై, నన్నే ధ్యానించుచూ సేవించుచున్నారు. నిష్కామ కర్మానుష్ఠానపరులు ద్వంద్వాతీతులయిన వీరు జీవన్ముక్తులై - కర్మలు |

బంధముల నుంచి విడివడి-దేహ త్యాగానంతరము ఆత్మస్థానమును పొంది, ఆత్మయై విరాజిల్లుచున్నారు.

...... ❖ ❖ ❖ ......

సాధనలు చెప్పుచున్నాడు

**సతతం కీర్తయంతో మాం । యతంతశ్చ దృఢవ్రతాః ।**
**నమస్యంతశ్చ మాం భక్త్యా । నిత్యయుక్తా ఉపాసతే ॥ 14**

సతతమ్ - కీర్తయంతః - మామ్ - యతంతః - చ - దృఢ వ్రతాః
నమస్యంతః - చ - మామ్ - భక్త్యా - నిత్యయుక్తాః - ఉపాసతే

**జ్ఞానయజ్ఞేన చాప్యన్యే । యజన్తో మాముపాసతే ।**
**ఏక త్వేన పృథక్త్వేన । బహుధా విశ్వతోముఖమ్ ॥ 15**

జ్ఞాన యజ్ఞేన - చ - అపి - అన్యే - యజన్తః - మామ్ - ఉపాసతే
ఏకత్వేన - పృథక్త్వేన - బహుధా - విశ్వతః - ముఖమ్

**కర్మిష్ఠులు :**

దృఢవ్రతాః = అకుంఠిత దీక్షతో పుణ్యకర్మానుష్ఠానము చేయు వ్రతధారులు అనగా కర్మిష్ఠులు

చ = మఱియు

**యోగులు:**

నిత్యయుక్తాః+యతంతః = నిత్యము నిశ్చలసమాధిలో ఆత్మానుసంధానము కలిగి ఆత్మయై విరాజిల్లుటకు ప్రయత్నించుచూ

చ = మఱియు

**భక్తులు :**

| | | |
|---|---|---|
| సతతమ్+కీర్తయంతః+ నమస్యంతః+భక్త్యా+ మామ్+ఉపాసతే | = | నిరంతరము - నాయొక్క గుణకర్మలను, నన్ను కీర్తించుచున్న వారలయి, నా దివ్య మంగళ విగ్రహమునకు నమస్కరించుచున్న వారలై అనగా తను హృత్ భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందన, అర్చనల్ చేయుచూ, సజ్జనులై భక్తిచేతనన్ను అనగా ఈశ్వరుని ఉపాసించుచున్నారు. |

**కర్మిష్ఠులు :**

| | | |
|---|---|---|
| అన్యే+యజన్తః | = | కొందఱు అనగా కర్మిష్ఠులు వస్తు, ద్రవ్యములతో బాహ్యయజ్ఞముల ద్వారా యజ్ఞము చేయుచున్నవారై |
| చ | = | మఱియు కొందఱు |
| జ్ఞాన యజ్ఞేన + అపి + బహుధా+విశ్వతః+ ముఖమ్+మామ్+ ఏకత్వేన+పృథక్త్వేన+ ఉపాసతే | = | జ్ఞానయజ్ఞము చేత మఱియు తపస్సు, సాంఖ్యము భక్తి అనే వివిధ పద్ధతుల ద్వారా సహస్ర శీర్షాది పురుషుడనయిన నన్ను సృష్ట్యాదియందున్న ఆత్మ అనే భావముతోను మఱియు కొందఱు అతడే అనేక దేవతా రూపములు ధరించెనని, అనేక దేవతా భావముతో అనగా బ్రహ్మ, విష్ణు, శివ, అగ్ని, ఇంద్ర, ఈ విధముగా అనేక దేవతా రూపములుగా ఉపాసించుచున్నారు. |

**వ్యాఖ్యానము :-** ఆత్మ స్వరూపముగా కొందఱు యోగులు, పరమ పురుషునిగా కొందఱు భక్తులు, వివిధ దేవతా రూపములుగా కొందఱు కర్మిష్ఠులు పరమాత్మను ఉపాసించుచున్నారు. ఈ విధముగా కర్మిష్ఠులు, యోగులు, భక్తులు ఉపాసించుచున్నారు.

...... ❖ ❖ ❖ ......

ఆత్మ - విరాట్‌పురుషుడు

**అహం క్రతురహం యజ్ఞః । స్వధాహమహమౌషధమ్ ।**
**మంత్రోఽహమహమేవాజ్యమ్ । అహమగ్నిరహం హుతమ్ ॥ 16**

అహమ్–క్రతుః–అహమ్–యజ్ఞః–స్వధా–అహమ్–అహమ్–ఔషధమ్
మంత్రః–అహమ్–అహమ్–ఏవ–ఆజ్యమ్–అహమ్–అగ్నిః–అహమ్–హుతమ్

**పితాహమస్య జగతో । మాతా ధాతా పితామహః ।**
**వేద్యం పవిత్రమోంకార । ఋక్సామ యజురేవ చ ॥ 17**

పితా – అహమ్ – అస్య – జగతః – మాతా – ధాతా – పితామహః
వేద్యమ్ – పవిత్రమ్ – ఓంకారః – ఋక్ – సామ – యజుః – ఏవ – చ

**గతిర్భర్తా ప్రభుః సాక్షీ । నివాసః శరణం సుహృత్ ।**
**ప్రభవః ప్రలయః స్థానం । నిధానం బీజమవ్యయమ్ ॥ 18**

గతిః – భర్తా – ప్రభుః – సాక్షీ – నివాసః – శరణమ్ – సుహృత్
ప్రభవః – ప్రలయః – స్థానమ్ – నిధానమ్ – బీజమ్ – అవ్యయమ్

**తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।**
**అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున ॥ 19**

తపామి– అహమ్ – అహమ్ – వర్షమ్ – నిగృహ్ణామి – ఉత్సృజామి – చ
అమృతమ్ –చ – ఏవ – మృత్యుః – చ – సత్ – అసత్ – చ – అహమ్–అర్జున

విరాట్ పురుషునిగా ఈ సర్వమూ నేనే. నేను కానిది పరమాణువు లేదు.

అహమ్+అగ్నిః+ = నేను అగ్ని. అనగా అగ్ని స్వరూపుడను.

అహమ్+యజ్ఞః+ = హృదయగుహలో అగ్ని శిఖల మధ్యలోగల అగ్నిని

అహమ్+క్రతుః+ నేను. అనగా ఆత్మను. నేను యజ్ఞమును. నేను

| | |
|---|---|
| అహమ్ + ఆజ్యమ్+<br>అహమ్ + హుతమ్+<br>అహమ్ + స్వధా+<br>అహమ్ + మన్త్రః+ఏవ | క్రతువును. యజ్ఞములో హోమము చేయునప్పుడు స్రుక్కు, స్రువములతో అగ్నిలో వేయబడు ఆజ్యము నేను. యజ్ఞములో హుతమగు హోమసామాగ్రిని నేను. అనగా యజ్ఞమునకు కావలసిన - యజ్ఞములో వాడబడు సర్వము నేనే. అటులనే పితృదేవతలకు కవ్యమును యిచ్చుటకు అగ్నిలో వ్రేల్చబడుటకు మంత్ర పల్లవి అయిన "స్వధా" నేను వేదములలోని మంత్రము నేను |

యజ్ఞ విభాగమంతయు విరాట్ శరీరముగా భావించి, బ్రహ్మ మానసిక యజ్ఞము చేసెను. *(భాగవతము ద్వితీయ స్కంధం-94)*

| | | |
|---|---|---|
| అహమ్ + ఔషధమ్ | = | జన్మ కర్మ వ్యాధి విమోచనకు సేవింపబడు ఔషధము నేను. |

**విరాట్‌గా**

| | | |
|---|---|---|
| ఋక్+సామ+యజుః+<br>చ+అహమ్+ఓంకారః+<br>ఏవ | = | ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదము మఱియు అథర్వవేదము నేను అనగా వేదస్వరూపుడను నేను, ఓంకారమును నేను |
| అస్య+జగతః+<br>పితామహః+పితా+<br>మాతా+ధాతా | = | ఈ జగత్తునకు తాతను నేనే, తండ్రిని నేనే, తల్లిని నేనే, పోషించువాడను నేనే |

**ఆత్మగా:**

| | | |
|---|---|---|
| పవిత్రమ్+వేద్యమ్ | = | నిష్కళంకమైన పవిత్రము అయినవాడను తెలుసుకొనదగిన వాడను నేను |
| అవ్యయమ్+ప్రభుః+<br>శరణమ్+సుహృత్+<br>సాక్షీ+గతిః | = | అవ్యయుడను అనగా నాశనములేని వాడను. ప్రభువును శరణు ఇచ్చువాడను భక్త జనులకు ప్రియమిత్రుడను సాక్షీభూతుడను. జీవులకు పరమగతిని |

**విరాట్ పురుషునిగా:**

| | | |
|---|---|---|
| ప్రభవః + ప్రలయః+ భర్తా+బీజమ్+నివాసః+ స్థానమ్+నిధానమ్ | = | సృష్టి, స్థితి, లయములు చేయువాడను నేను. భరించువాడను నేను. సృష్టికారణమైన బీజమును నేను. అటులనే క్షేత్రము ప్రకృతి. సర్వ స్థావర జంగమములకు నివాసము నేను. ప్రాణికోటికి స్థానము నేను. జగత్తుకు ఆదికారకుడను నేను. |
| అర్జున | = | ఓ అర్జునా! |
| సత్+చ+అసత్+అహమ్ | = | సత్ మఱియు అసత్తు నేను |
| చ | = | మఱియు |
| అమృతమ్+చ+ మృత్యుః+ఏవ | = | అమృతము, మఱియు మృత్యువు నేను |
| అహమ్+వర్షమ్+ ఉత్సృజామి+చ+ నిగృహ్ణామి+చ | = | వర్షము కురుయించుచున్నాను అనగా పర్జన్య రూపుడను నేను. అటులనే వర్షమును నిరోధించుచున్నాను |
| అహమ్+తపామి | = | తపింపచేయువాడను నేను అనగా సూర్య స్వరూపుడను నేను |

**వ్యాఖ్యానము :-** ఊర్ణనాభి తన నోటినుంచి ఒక ద్రవ పదార్థమును తీసి, దానితో గూడు అల్లి, అందు విహరించి, తిరిగి లయముచేయునట్లు, నానుండి సృజియించిన ప్రకృతిచే ఉపాధులను సృజియించి, ఆ ఉపాధులలో విహరించి, తిరిగి ఆ ఉపాధులను లయము చేయు వాడను నేను.

పురుష ప్రకృతుల సంయుక్త రూపము విరాట్ పురుషుడు.

సర్వ జీవరాసులు విరాట్ పురుషునినుండియే జనియించినవి. విరాట్ పురుషునియందే వసించుచున్నవి. తిరిగి ఉపాధులు ప్రకృతియందు, దేహి – పురుషుని యందు లయమగుచున్నవి.

...... ❖ ❖ ❖ ......

పుణ్యకర్మల ఫలితము కోరిన వారు

**త్రై విద్యా మాం సోమపాః పూతపాపా ।**
**యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే ।**
**తే పుణ్యమాసాద్య సురేన్ద్రలోకమ్ ।**
**అశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్ ॥ 20**

త్రై విద్యాః-మామ్-సోమపాః-పూతపాపాః-యజ్ఞైః-ఇష్ట్వా-స్వర్గతిమ్-ప్రార్థయన్తే తే-పుణ్యమ్-ఆసాద్య-సురేన్ద్ర లోకమ్-అశ్నంతి-దివ్యాన్-దివి-దేవ-భోగాన్.

**తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం ।**
**క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి ।**
**ఏవం త్రయీధర్మమనుప్రపన్నా ।**
**గతాగతం కామకామా లభన్తే ॥ 21**

తే-తమ్-భుక్త్వా-స్వర్గలోకమ్-విశాలమ్-క్షీణే పుణ్యే-మర్త్యలోకమ్-విశంతి ఏవమ్ - త్రయీ - ధర్మమ్ - అనుప్రపన్నాః - గతాగతమ్ - కామకామాః-లభన్తే

| | | |
|---|---|---|
| త్రైవిద్యాః+యజ్ఞైః+ | = | వేదవేత్తలయిన ఎవరు |
| మామ్+ఇష్ట్వా | | యజ్ఞములద్వారా నన్ను యజించి, యజ్ఞాంతమున |
| సోమపాః+పూతపాపా+ | = | సోమపానము చేసినవారలై పాపరహితులై అనగా |
| స్వర్గతిమ్+ప్రార్థయంతే | | పుణ్యాత్ములయినవారు స్వర్గప్రాప్తిని కోరుచున్నారో |
| తే+పుణ్యమ్+ | = | ఆ పుణ్యాత్ములు పవిత్రమయిన ఇంద్రలోకము |
| సురేంద్రలోకమ్+ | | పొంది, స్వర్గమందు మానవలోకమున లభ్యపడని |
| అసాద్య+దివి+దివ్యాన్+ | | దేవభోగములను అనుభవించుచున్నారు |
| దేవభోగాన్+అశ్నంతి | | |

| | | |
|---|---|---|
| తే+తమ్+స్వర్గలోకమ్+ భుక్త్వా | = | పుణ్యఫలితము కోరిన వారు ఆ స్వర్గలోకమును పొంది దివ్యములయిన భోగ భాగ్యములను అనుభవించి |
| పుణ్యే+క్షీణే(సతి)+ విశాలమ్+మర్త్యలోకమ్+ విశన్తి | = | పుణ్యము క్షీణించుచుండగా ఈ విశాలమయిన భూలోకమును తిరిగి ప్రవేశింతురు. అనగా పునర్జన్మకు వత్తురు |
| ఏవమ్+త్రయీధర్మమ్+ | = | ఈ ప్రకారముగా |
| అనుప్రపన్నాః+ కామకామాః+ గతాగతమ్ | = | ధర్మార్థ కామములను ఆశ్రయించిన వారును ఇహలోక, పరలోక భోగాపేక్షపరులును స్వర్గలోకము చేరి అనగా తిరిగి భూలోకముచేరి రాకపోకలు |
| లభన్తే | = | పొందుచున్నారు. |

**వ్యాఖ్యానము :-** పుణ్య ఫలితము కోరినవారు సూర్యకిరణముల ద్వారా బ్రహ్మలోకముచేరి పుణ్యము క్షీణంచగనే తిరిగి భూలోకమున జన్మించుచున్నారని ముండక ఉపనిషత్‌లో చెప్పిన దానినే ఇట్లు ఇందు చెప్పబడినది.

...... ❖ ❖ ❖ ......

ఆవిధముగా పుణ్యఫలితమును కోరక, నిత్యము భగవంతుని ఆరాధించు భక్తులు

**అనన్యాశ్చిన్తయన్తో మాం । యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం । యోగక్షేమం వహామ్యహమ్ ॥ 22**

అనన్యాః - చిన్తయన్తః - మామ్ - యే - జనాః - పర్యుపాసతే
తేషామ్ - నిత్యాభియుక్తానామ్ - యోగక్షేమమ్ - వహామి - అహమ్

| | | |
|---|---|---|
| యే+జనాః+అనన్యాః+ చిన్తయన్తః+మామ్+ పర్యుపాసతే | = | ఏ భక్తులు ఇతర చింతనలు లేనివారు నన్ను భక్తితో శ్రద్ధాళువులై ఉపాసించుచున్నారో అటులనే యోగముతో |

| | | |
|---|---|---|
| నిత్యాభియుక్తానామ్+ | = | ఆత్మతో నిత్యానుసంధానము కలిగియున్నారో |
| తేషామ్+యోగక్షేమమ్+ | | వారియొక్క యోగక్షేమములను నేను |
| అహమ్+వహామి | | వహించుచున్నాను. |

**వ్యాఖ్యానము :-** దీనినే కథలుగా భాగవతము దశమ స్కంధములో ఇట్లు వివరింపబడినది. అఘాసురుడు అనే రాక్షసుడు కొండచిలువ రూపము ధరించి, గోపబాలురను మ్రింగుటకు వచ్చినాడు. గోపబాలురు ఆరాక్షసునిని చూచి, మనతో శ్రీకృష్ణుడుండగా మనకేల చింతయని, ఉత్సాహముతో ఒకరిచేతులు ఒకరు పట్టుకొని – ఆ కొండచిలువ నోటిలోనికి ఉత్సుకులై ప్రవేశించిరి. అప్పుడు శ్రీకృష్ణుడు కొండచిలువ నోటిలోనికి ప్రవేశించి, దానిని సంహరించి, గోపబాలురను రక్షించినారు. ఆ తర్వాత ఇంద్రుడు గోపకులు తనను పూజించలేదని ఆగ్రహించి ఏడు దినములు రాళ్ళవాన కురియింపగా, శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి ఎత్తి వారిని రక్షించినాడు. ఆవిధముగా అనేకమార్లు వారిని రక్షించినాడు.

...... ❖ ❖ ❖ ......

పూజ-పూజించువారు

**యేఽ పృన్య దేవతా భక్తా । యజంతే శ్రద్ధయాన్వితాః ।**
**తేఽ పి మామేవ కౌంతేయ । యజంత్యవిధిపూర్వకమ్ ॥ 23**

యే – అపి – అన్య – దేవతాః – భక్తాః – యజంతే – శ్రద్ధయా – అన్వితాః
తే – అపి – మామ్ – ఏవ – కౌంతేయ – యజంతి – అవిధిపూర్వకమ్

**అహం హి సర్వ యజ్ఞానాం । భోక్తా చ ప్రభురేవ చ ।**
**న తు మామభిజానన్తి । తత్త్వేనాతశ్చ్యవన్తి తే ॥ 24**

అహమ్ – హి – సర్వ యజ్ఞానామ్ – భోక్తా – చ – ప్రభుః – ఏవ – చ
న – తు – మామ్ – అభిజానన్తి – తత్త్వేన – అతః – చ్యవన్తి – తే

**యాన్తి దేవవ్రతా దేవాన్ । పితౄన్ యాన్తి పితృవ్రతాః ।**
**భూతాని యాన్తి భూతేజ్యా । యాన్తి మద్యాజినోఽపి మామ్ ॥25**

యాన్తి - దేవవ్రతాః - దేవాన్ - పితౄన్ - యాన్తి - పితృవ్రతాః
భూతాని-యాన్తి-భూతేజ్యాః-యాన్తి-మత్-యాజినః-అపి-మామ్

కౌన్తేయ = ఓ అర్జునా!

మామ్+అవిధిపూర్వకమ్ = నన్ను అనగా దేవతాశ్రేష్ఠుడును, జ్యేష్ఠుడను అయిన నన్ను యజించుట మాని, అనగా పెద్దవారికి అగ్రతాంబూలం యివ్వవలయును. అలా యివ్వటం మాని

యే+భక్తాః+ అన్యదేవతాః+ఏవ+ శ్రద్ధయా+అన్వితాః+ యజంతి+తే+అపి = ఏ భక్తులు ఇతర దేవతలను శ్రద్ధతో గూడినవారలై యజ్ఞములద్వారా యజించుచున్నారో వారు కూడా ఆఆ దేవతలను పొందుచున్నారు.

అహమ్+తు+చ+ ప్రభుః+హి = నేను - ఆత్మగా సృష్టికి పూర్వము స్వయంజ్యోతి స్వరూపునిగా ఉన్నవాడను మఱియు ప్రభువును సర్వనియామకుడను విరాట్‌పురుషునిగా సృష్టి, స్థితి, లయకారకుడను

చ = మఱియు

సర్వయజ్ఞానామ్+ భోక్తా + ఏవ = సర్వయజ్ఞములకు భోక్తను అనగా యజ్ఞభోక్తను

మామ్+తత్త్వేన + న + అభిజానన్తి = నన్ను మూర్ఖులు ఆత్మ తత్త్వముతో గ్రహించుటలేదు

| | | |
|---|---|---|
| అతః+తే+చ్యవన్తి | = | అందువలన అలా గ్రహించలేనివారు అమృతత్త్వమును పొందలేక బ్రహ్మలోకమునుండి పతనమగుదురు. జనన మరణ వలయములో తిరుగాడుదురు. |
| దేవవ్రతాః+దేవాన్+ యాన్తి | = | దేవవ్రతులు అనగా దేవతలను ఆరాధించువారు దేవతలను పొందుదురు. (అనగా ఎవరెవరు యేయే దేవతలను ఆరాధించుచున్నారో వారు ఆయా దేవతలను పొందుదురు.) |
| పితృవ్రతాః+పితౄన్+ యాన్తి | = | పితృదేవతలను ఆరాధించువారు పితృదేవతలను పొందుదురు. |
| భూతేజ్యాః+భూతాని+ అపి+యాన్తి | = | భూతములను ఆరాధించు వారు ఆయా భూతములను పొందుచున్నారు. అటులనే |
| మద్యాజినః+మామ్ + యాన్తి | = | నన్ను ఆరాధించువారు నన్ను అనగా ఆత్మను పొందుదురు |

**వ్యాఖ్యానము:-** బ్రాహ్మణులు అంగిరస సత్రయాగము చేయుచుండిరి. వారు శ్రీకృష్ణుని తత్త్వరీత్యా గ్రహించలేకపోయిరి. శ్రీకృష్ణుడు పంపగా గోప బాలురు, వారి వద్దకు వెళ్ళి అన్నము అడిగిరి. యజ్ఞసమాప్తి కానందున వారు అన్నము పెట్టలేదు. యజ్ఞభోక్త అయిన శ్రీకృష్ణుడు పంపగా తిరిగి గోపబాలురు ఆ బ్రాహ్మణ భార్యలను అన్నము అడిగిరి. శ్రీకృష్ణుని యజ్ఞ భోక్తగా గ్రహించిన ఆ బ్రాహ్మణ భార్యలు పూర్ణాహుతి కొఱకు వేచియుండక, అతనికి అన్నము నివేదించిన సర్వకర్మలు పూర్ణముగా ఆహుతి అగునని, కర్మబంధములు తొలగునని గ్రహించి, అన్నము తీసుకొని బయలుదేరి శ్రీకృష్ణునికి నివేదించిరి.

**కం॥ పరమేశ్వరార్పణంబుగఁ, బరజనులకు భిక్ష యిడినఁ బరమ పదమునం**
**బరఁగెద రఁట! తుది సాక్షాత్పరమేశుఁడు భిక్ష గొన్న ఫల మెట్టిదియో?**

*(భాగవతము - దశమస్కంధం-870)*

**చ॥ కటకట! మోసపోయితిమి; కాంతల పాటియు బుద్ధిలేదు; నేఁ**
**డిట హరిఁ గానఁబో నెఱుఁగ; మేము దురాత్ముల; మేము కల్మషో**
**ద్భటులము; విష్ణు దూరగుల ప్రాజ్ఞత లేల? తపంబులేల? ప**
**ర్యటనములేల? శీలములు యాగములున్ మఱియేల కాల్పనే?**

*(భాగవతము-దశమస్కంధం-872)*

అని చింతించినట్లు భాగవతమున వర్ణింపబడినది.

నన్ను యజించువారు నన్ను పొందుచున్నారు. దేవతలను యజించువారు దేవతలను పొందుచున్నారు.

ఎవరెవరు ఎవరెవరిని ఆరాధించుచున్నారో వారు ఆయా దేవతలను పొందుదురు.

...... ❖ ❖ ❖ ......

భక్తితో సమర్పించు - పూజా వస్తువులు

**పత్రం పుష్పం ఫలం తోయం । యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుపహృతమ్ । అశ్నామి ప్రయతాత్మనః ॥ 26**

పత్రమ్ – పుష్పమ్ – ఫలమ్ – తోయమ్ – యః – మే – భక్త్యా – ప్రయచ్ఛతి
తత్ – అహమ్ – భక్తి – ఉపహృతమ్ – అశ్నామి – ప్రయతాత్మనః

సాధనమార్గము ఏదయినా సర్వము భగవంతునికి సమర్పించవలయును

**యత్కరోషి యదశ్నాసి । యజ్జుహోషి దదాసి యత్ ।**
**యత్తపస్యసి కౌన్తేయ । తత్కురుష్వ మదర్పణమ్ ॥ 27**

యత్ – కరోషి – యత్ – అశ్నాసి – యత్ – జుహోషి – దదాసి – యత్
యత్ – తపస్యసి – కౌన్తేయ – తత్ – కురుష్వ – మదర్పణమ్

యః+భక్త్యా+తోయమ్+ = ఏ భక్తుడు భక్తిచేత అనగా సత్త్వగుణము
పత్రమ్+పుష్పమ్ గలిగిజలమును అనగా జలముచే అభిషేకము

| | | |
|---|---|---|
| | | చేయుచున్నాడో సహజముగా ప్రకృతిలో లభించే తులసీదళములు, మారేడుపత్రి మొదలయినవాటి పూవులు అనగా సుగంధభరితమయిన పువ్వులచేత పూజించి |
| మే+ఫలమ్+అహమ్+ అశ్నామి | = | నాకు ఫలమును అనగా కొబ్బరికాయ, అరటిపండ్లు మొదలయిన తినే పండ్లను సమర్పించుచున్నారో, వాటిని నేను ఆరగించుచున్నాను |
| ప్రయతాత్మనః+భక్తి+తత్ ఉపహృతమ్ | = | సజ్జనుడైన వానిచే భక్తిపూర్వకముగా సమర్పింపబడిన వాటిని స్వీకరించుచున్నాను |

వేదములో చెప్పిన వాటిని స్వీకరించి, పూజా విధానము షోడశ ఉపచారములతో తయారు చేసిరి.

| | | |
|---|---|---|
| కౌంతేయ+యత్+ అశ్నాసి | = | ఓ అర్జునా! నీవు దేనిని భుజించుచున్నావో |

**కర్మానుష్ఠానముగా:**

| | | |
|---|---|---|
| యత్ + జుహోషి+ యత్+దదాసి | = | యజ్ఞములో దేనిని హోమము చేయుచున్నవో దేనిని దానము చేయుచున్నావో |

**భక్తిపరముగా:**

| | | |
|---|---|---|
| యత్ + కరోషి | = | ఇంద్రియములద్వారా ఏయే కర్మలను చేయు చున్నావో |

**యోగపరముగా:**

| | | |
|---|---|---|
| యత్ + తపస్యసి+ మదర్పణమ్+కురుష్వ | = | దేనికొఱకు తపస్సు చేయుచున్నావో వాటిని నాకు నీవు అర్పింపుము |

ఇంద్రియముల ద్వారా చేయబడు కర్మలు భగవంతునికి సమర్పించవలయును అన్న దానికి ఉదాహరణగా అంబరీషోపాఖ్యానముగ – భాగవతము నవమ స్కంధము 82వ పద్యములో చెప్పబడినది.

...... ❖ ❖ ❖ ......

ఆత్మను పొందుట

**శుభాశుభఫలైరేవం । మోక్ష్యసే కర్మబన్ధనైః ।**
**సన్న్యాస యోగ యుక్తాత్మా । విముక్తోమాముపైష్యసి ॥ 28**

శుభా శుభ ఫలైః - ఏవమ్ - మోక్ష్యసే - కర్మబన్ధనైః
సన్న్యాస యోగ యుక్తాత్మా - విముక్తః - మామ్ - ఉపైష్యసి

**సమోఽహం సర్వభూతేషు । న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।**
**యే భజన్తి తు మాం భక్త్యా । మయి తే తేషు చాప్యహమ్ ॥ 29**

సమః - అహమ్ - సర్వభూతేషు - న - మే - ద్వేష్య - అస్తి - న - ప్రియ
యే-భజన్తి-తు-మామ్-భక్త్యా-మయి-తే-తేషు-చ-అపి-అహమ్

**అపి చేత్ సుదురాచారో । భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ స మన్తవ్యః । సమ్యగ్వ్యవసితో హి సః ॥ 30**

అపి - చేత్ - సు - దురాచారః - భజతే - మామ్ - అనన్యభాక్
సాధుః - ఏవ - సః - మన్తవ్యః - సమ్యక్ - వ్యవసితః - హి - సః

| | | |
|---|---|---|
| ఏవమ్+సన్న్యాసయోగ-<br>యుక్తాత్మా+<br>శుభాశుభఫలైః+<br>కర్మబంధనైః+మోక్షసే | = | ఈ ప్రకారముగా ఆత్మానుసంధానముగల జ్ఞానులు (సాంఖ్యులు) వలె ఉన్న శుభాశుభముల రూపమయిన కర్మబంధములచేత విడువబడగలవు |
| విముక్తః+మామ్+<br>ఉపైష్యసి | = | కర్మబంధములనుండి ముక్తుడవై నన్ను అనగా ఆత్మను పొందగలవు |
| అహమ్+సమః+మే+<br>ద్వేష్యః+న+అస్తి+<br>ప్రియః+న | = | నేను, ఆత్మగా సర్వభూతములకు సముడను నాకు శత్రువు లేడు. అటులనే ప్రియుడు అనగా ఇష్టమయిన వాడును లేడు |

| | | |
|---|---|---|
| సర్వభూతేషు+తు+ యే +భక్త్యా +మామ్+ భజంతి | = | సర్వప్రాణులలో వారి హృదయ గుహలో, స్వయంజ్యోతి స్వరూపమున కలను. కావున ఎవరు భక్తితో నన్ను భజియించెదరో అనగా సేవించుచున్నారో |
| తు+మయి+చ+ అహమ్+అపి+తేషు | = | వారు నా యందు మఱియు నేను కూడ వారియందు అనగా ఆ భక్తులయందు ఉందును. |
| సు దురాచారః+ | = | మిక్కిలి దురాచారపరుడు |
| చేత్+అపి+అనన్యభాక్+ హి+మామ్+భజతే | = | అయినప్పటికి కూడ అతడు అనన్యభక్తితో అరిషడ్వర్గములను జయించి, ద్వంద్వాతీతుడై - సమదృష్టి గలిగి నన్ను భజించినట్లయిన |
| సః+సాధుః +ఏవ + మంతవ్యః +సః+ సమ్యక్+వ్యవసితః | = | అతడు సాధుపురుషుడు గానే తెలియదగినవాడు అతడు లెస్సగా నా యందు ఉన్నవాడే. అతడు నన్ను పొందును |

**వ్యాఖ్యానము :-** దీనికి ఉదాహరణగా అనేక భక్తుల కథలు భాగవతమున చెప్పబడినవి.

ఆ॥ **తనువు మనువు విడిచి, తనయులఁ జుట్టాల, నాలి విడిచి, సంపదాళి విడిచి**
**నన్నె కాని యన్య మెన్నఁడు నెఱుఁగని, వారి విడువ నెట్టివారి నైన.**

*(భాగవతం - నవమ స్కంధం - 121)*

అనగా శరీరధర్మములను విడిచి, ఈషణత్రయములైన ధనేషణ, దారేషణ, పుత్రేషణలను విడిచి, పరమాత్మను తప్ప ఇతర విషయములను ఎఱుగని భక్తులను నేను విడిచిపెట్టను.

ఆ॥ **నాకు మేలుఁగోరు నాభక్తుఁ డగువాఁడు భక్తజనుల కేన పరమగతియు;**
**భక్తుఁడెందుఁ జనినఁ బఱతెంతు వెనువెంట, గోవు వెంటఁ దగులు కోడెభంగి.**

*(భాగవతం - నవమ స్కంధం - 119)*

ఆవువెంట వెళ్ళు లేగదూడవలె భక్తుని అనుసరించెదను.

వేదము చెప్పినట్లు చేయుట ధర్మము. వేదవిరుద్ధమయినది అధర్మము లేక పాపము. పాపాత్ములు వేఱు, దురాచారుడు వేఱు. ఈవిధముగా ఆచారములు ఉండును. కులమును బట్టి, దేశ, కాలముల బట్టి ఆచారములు మారుచుండును. ఆచారములు కాలమును బట్టి, దేశమును బట్టి, జాతిని బట్టి పరిస్థితులను బట్టి ఉండును. ఒక ప్రాంతములోని ఆచారము యింకొంక ప్రాంతము వారికి దురాచారముగా ఉండవచ్చును.

ద్వాపరయుగమునకు ముందు యుగములలో దురాచారముగా పరిగణింపబడిన రాక్షస వివాహము, ద్వాపర యుగము చివరి నాటికి క్షత్రియులలో సదాచారముగా పరిగణింపబడినది. అటులనే పరాశర మహర్షిచే సత్యవతి కన్యగా ఉన్న కాలములో వ్యాసభగవానుని కనెను. కన్యగా ఉన్న కాలమున సంతానము కన్నను, ఆమెను ఎవరూ తప్పుపట్టలేదు. కాని సూర్య భగవానునిచే కన్యగా ఉన్న కాలమున కుంతీదేవి, కర్ణుని కని, లోకనిందకు భయపడినది.

అజామీళుడు బ్రాహ్మణుడు. ఇతడు ఒక శూద్రస్త్రీతో కాపురము చేయుటవలన దురాచారిగా నిందింపబడినాడు. అతడు చివరి నిముషంలో నారాయణ స్మరణ చేసి యమపాశములనుండి విడివడి, గంగాద్వారమున యోగమార్గమున దేహంబును వీడినాడు.

...... ❖ ❖ ❖ ......

అనన్యభక్తితో పూజించు చాతుర్వర్ణములలోని స్త్రీ, పురుషులెవరైనా
పరమాత్మను సేవించి, పరమాత్మను పొందుదురు

**క్షిప్రం భవతి ధర్మాత్మా । శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।**
**కౌన్తేయ ప్రతిజానీహి । న మే భక్తః ప్రణశ్యతి ॥ 31**

క్షిప్రమ్ - భవతి - ధర్మాత్మా - శశ్వత్ - శాన్తిమ్ - నిగచ్ఛతి
కౌన్తేయ - ప్రతిజానీహి - న - మే - భక్తః - ప్రణశ్యతి

**మామ్ హి పార్థ వ్యపాశ్రిత్య । యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యస్తథా శూద్రాః । తేఽపి యాన్తి పరాం గతిమ్ ॥ 32**

మామ్ – హి – పార్థ – వ్యపాశ్రిత్య – యే – అపి – స్యుః – పాపయోనయః
స్త్రియః – వైశ్యః – తథా – శూద్రాః – తే – అపి – యాన్తి – పరామ్–గతిమ్

**కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా । భక్తా రాజర్షయ స్తథా ।**
**అనిత్యమసుఖం లోకమ్ । ఇమం ప్రాప్య భజస్వ మామ్ ॥ 33**

కిమ్ – పునః – బ్రాహ్మణాః – పుణ్యాః – భక్తాః – రాజర్షయః – తథా
అనిత్యమ్ – అసుఖమ్ – లోకమ్ – ఇమమ్ – ప్రాప్య – భజస్వ – మామ్

**మన్మనా భవ మద్భక్తో । మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి యుక్త్వైవమ్ । ఆత్మానం మత్పరాయణః ॥ 34**

మత్ – మనాః – భవ – మత్ – భక్తః – మద్యాజీ – మామ్ – నమస్కురు
మామ్ – ఏవ – ఏష్యసి – యుక్త్వా – ఏవమ్ – ఆత్మానమ్ – మత్పరాయణః

| | | |
|---|---|---|
| కౌన్తేయ | = | ఓ అర్జునా! |
| క్షిప్రమ్+ధర్మాత్మా + భవతి | = | వెంటనే అతడు శీఘ్రముగా ధర్మాత్ముడు అగుచున్నాడు |
| శశ్వత్+శాన్తిమ్+ నిగచ్ఛతి | = | శాశ్వతమైన శాంతిని పొందుచున్నాడు. |
| మే+భక్తః+న+ ప్రణశ్యతి+ప్రతిజానీహి | = | నా యొక్క భక్తుడు ఎన్నటికీ నశింపడు అని నీవు తెలుసుకొనుము. |
| పార్థ | = | ఓ అర్జునా! |
| వైశ్యః+శూద్రాః+అపి+ తథా+స్త్రియః+అపి+ యే+హి | = | వైశ్యులు శూద్రులు అటులనే స్త్రీలు కూడా ఎవరైనను ద్వంద్వాతీతులై, అరిషడ్వర్గములు లేనివారైనచో |

| | | |
|---|---|---|
| తే+పాపయోనయః+ స్యుః+మామ్+ వ్యపాశ్రిత్య+పరాం+ గతిమ్+యాంతి | = | వారందఱు పూర్వ జన్మ కర్మానుసారము పశు, పక్షి, మృగాదులుగాను, స్థావరములైన చెట్లుగాను, జన్మించినవారు, నికృష్టజన్మలుగల వారు కూడ అటువంటివారు నన్ను అనగా ఆత్మను ఆశ్రయించి, శరణుకోరి పరమగతిని పొందుదురు. అనగా నృగు మహారాజు మఱుజన్మలో ఊసరవెల్లిగా పుట్టెను. నలకూబరులు మద్దిచెట్లుగానూ పుట్టిరి. |
| పుణ్యాః+భక్తాః+ బ్రాహ్మణాః | = | పుణ్యాత్ములయిన వారు భక్తులు బ్రాహ్మణులు |
| తథా+రాజర్షయః+ కిమ్ + పునః | = | అట్లే రాజర్షులు నన్నే ఆశ్రయించి నన్నే పొందుదురు. అని చెప్పనేల? |
| అసుఖమ్+అనిత్యమ్+ | = | నిత్య సుఖము లేనిదియు |
| ఇమమ్+లోకమ్+ ప్రాప్య+మామ్+భజస్వ | = | అనిత్యమయినది శాశ్వతము కానిదియునైన ఈ లోకమును పొందిన నీవు నిష్కామముగా నన్ను భజియింపుము |

**కర్మానుష్ఠానము:**

| | | |
|---|---|---|
| మద్యాజీ+భవ | = | నా గుఱించి, యజ్ఞములు చేయువాడవు అగుము |

**యోగము:**

| | | |
|---|---|---|
| మన్మనాః+ఆత్మానమ్+ యుక్త్వా | = | నాయందు మనస్సుగల వాడవు అగుము జీవాత్మను హృదయగత ఆత్మయందు నిలిపినవాడవు అగుము |

**భక్తి:**

| | | |
|---|---|---|
| మత్ భక్తః+మామ్+ నమస్+కురు+ఏవమ్+ మత్పరాయణః(సన్)+ మామ్+ఏవ+ఏష్యసి | = | నా భక్తుడవు కమ్ము నాకు నమస్కారము చేయుము ఈ విధముగా మత్పరాయణుడవై దేహ త్యాగానంతరము నన్నే పొందగలవు |

...... ❖ ❖ ❖ ......

ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము 34వ అధ్యాయము

## (విభూతియోగము)

శ్రీభగవాన్ ఉవాచ

ఆత్మ గుఱించి

**భూయ ఏవ మహాబాహో । శ్రుణు మే పరమం వచః ।**

**యత్తేఽహం ప్రీయమాణాయ । వక్ష్యామి హితకామ్యయా ॥1**

భూయః - ఏవ - మహాబాహో - శ్రుణు - మే - పరమమ్ - వచః

యత్ - తే - అహమ్ - ప్రీయమాణాయ - వక్ష్యామి - హితకామ్యయా

**న మే విదుః సురగణాః । ప్రభవం న మహర్షయః ।**

**అహమాదిర్హి దేవానాం । మహర్షీణాం చ సర్వశః ॥ 2**

న - మే - విదుః - సురగణాః - ప్రభవమ్ - న - మహర్షయః

అహమ్ - ఆదిః - హి - దేవానామ్ - మహర్షీణామ్ - చ - సర్వశః

మహాబాహో+ = ఓ అర్జునా! సంతోషపడుచున్న నీకు
ప్రీయమాణాయ+తే+ హితము చేయు తలంపుతో
హితకామ్యయా

అహమ్+యత్+ = నేను ఏ శ్రేష్ఠములైన వచనములను
పరమమ్+వచః+ గతములో వివరించిన వాటినే మరల మరల
భూయః+ఏవ+వక్ష్యామి చెప్పుచున్నానో ఆ

మే+శ్రుణు = నా యొక్క ఆ మాటలను శ్రద్ధగా వినుము అనగా

| | | |
|---|---|---|
| అహమ్+ఆదిః+హి | = | నేను ఆత్మగా ఆదిపురుషుడు, విరాట్‌పురుషునిగా సృష్ట్యాదియందుగలవాడను. సృష్ట్యాదియందు నేను తప్ప ఇతరమేదియు లేదు. **("ఆత్మ వా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించన మిషత్"** – అని ఐతరేయ ఉపనిషత్‌లో (1-1) చెప్పిన దానిని ఇట్లు చెప్పుచున్నాడు. అటులనే 14 లోకములు, ఈ సర్వస్థావర జంగమములు లయమయిన తరువాత నేను ఒక్కడిని మాత్రమే ఉందును. అందువలన |
| దేవానామ్+చ+ మహర్షీణామ్+సర్వశః | = | దేవతలకును మఱియు మహర్షులకును మఱియు అందఱకంటే ముందువాడను. |
| మే+ప్రభవమ్+ | = | నా యొక్క ఆవిర్భావము గుఱించి |
| సురగణాః+న+విదుః+ మహర్షయః | = | దేవతలు ఎఱుగరు. మహర్షులు |
| న | = | ఎఱుగరు. |

**వ్యాఖ్యానము:-** ఆత్మ గుఱించి, ఆదిపురుషుని గుఱించి, విరాట్‌పురుషుని గుఱించి, మరల చెప్పుచున్నాను వినుము. సర్వస్థావర జంగమములు, విరాట్ పురుషునుని నుంచే సర్వ కర్మలు, సర్వ భావములు వచ్చినవని, సర్వము అతడే అనియు వివరించితిని. ఉపాధులలో దేహి, హృదయగత ఆత్మగా విరాట్ పురుషుడు వసియించి ఉన్నాడు. ఈ సర్వము అతడే. అతడు కానిది పరమాణువుకూడా లేదు. అయినను అతనినుంచి వచ్చిన వివిధ దేవతలను, విశిష్టములయిన వాటిని చెప్పుచున్నాను వినుము.

ఆత్మ అనాది. ఆదిపురుషుడు, విరాట్‌పురుషుల ఆవిర్భావమును ఎవరును ఎఱుగరు. కాని సాధనవలన ఆత్మను దర్శింతురు. ఆత్మయై విరాజిల్లుదురు.

...... ❖ ❖ ❖ ......

ఆత్మను దర్శించిన గలుగు ప్రయోజనము. ఆత్మను దర్శించినవారు సర్వపాపములనుండి విడివడుచున్నారు.

**యో మామజమనాదిం చ । వేత్తి లోకమహేశ్వరమ్ ।**
**అసమ్మూఢః స మర్త్యేషు । సర్వపాపైః ప్రముచ్యతే ॥ 3**

యః – మామ్ – అజమ్ – అనాదిమ్ – చ – వేత్తి – లోక మహేశ్వరమ్
అసమ్మూఢః – సః – మర్త్యేషు – సర్వపాపైః – ప్రముచ్యతే

| | | |
|---|---|---|
| యః+మామ్+అజమ్+ | = | ఎవడు నన్ను అనగా ఆత్మను పుట్టుకలేని వానిగను |
| అనాదిమ్+చ+ | | సృష్ట్యాదియందు గలవానిగను మఱియు |
| లోకమహేశ్వరమ్+వేత్తి+ | | లోక నియామకుడిగను స్వానుభవములో గ్రహించునో అట్టి |
| అసమ్మూఢః+సః+ | = | జ్ఞాని, మాయారహితుడైన అతడు మానవులలో |
| మర్త్యేషు+సర్వపాపైః+ | | సర్వపాపములనుంచి అనగా సర్వకర్మ బంధముల |
| ప్రముచ్యతే | | నుండి, జన్మ పరంపరల నుండి విడువబడుచున్నాడు. |

**వ్యాఖ్యానము:-** ఆత్మను స్వానుభవములో దర్శించి ఆత్మస్థానమును చేరినవాడు జన్మ పరంపరలనుంచి విడివడి, అమృతుడు అగుచున్నాడు.

ఆ ఆదిపురుషుడు ప్రకృతిని సృజియించి, ప్రకృతితో కూడి, విరాట్పురుషుడైనాడు. ప్రకృతి గుణయుతము. కావున రజోగుణయుతుడై బ్రహ్మగా పిలువబడి సృష్టి చేయుచున్నాడు. సత్త్వగుణయుతుడై విష్ణువుగా స్థితిని గల్పించుచున్నాడు. తమోగుణ యుతుడై రుద్రునిగా పిలువబడి, లయము చేయుచున్నాడు. ముల్లోకములు లయము అయిన తరువాత, మరల ఒక్కడుగా విరాట్పురుషునిగా షోడశ కళాసహితు డగుచు, జలరాశి మధ్యంబున విరాజిల్లుచున్నాడు.

**సీ. మహదహంకార తన్మాత్ర సంయుక్తుఁడై చారు షోడశ కళాసహితుఁడగుచు**
**బంచ మహాభూతభాసితుండై శుద్ధ సత్త్వుఁడై సర్వాతిశాయి యగుచు**
**జరణోరు భుజ ముఖ శ్రవణాక్షి నాసా శిరములు నానాసహస్రములు వెలుఁగ**
**నంబర కేయూర హారకుండల కిరీటాదులు పెక్కువే లమరుచుండఁ**

**తే. బురుష రూపంబు ధరియించి పరు డనంతుఁ, డఖిల భువనైక వర్తన యత్నమమర**
**మానితోదార జలరాశి మధ్యముననుం, యోగనిద్రా విలాసియై యొప్పుచుండు.**

(భాగవతము - ప్రథమ స్కంధము - 62)

విరాట్‌పురుషుడు బ్రహ్మాగా చేసిన సృష్టిని ప్రారంభ సృష్టి అని అందురు. చతుర్ముఖ బ్రహ్మచేసిన సృష్టిని అనంతర సృష్టి అని అందురు. విరాట్‌పురుషునివలన సర్వ స్థావరములు, జంగమములు, సర్వ భావములు జనియించినవి. సర్వ భావములు కలిగినవని ఈ విధముగా చెప్పుచున్నాడు.

...... ❖ ❖ ❖ ......

విరాట్‌పురుషుడు

**బుద్ధిర్ జ్ఞానమసమ్మోహః । క్షమా సత్యం దమః శమః ।**
**సుఖం దుఃఖం భవోఽ భావో । భయం చా భయమేవ చ ॥ 4**

బుద్ధిః - జ్ఞానమ్ - అసమ్మోహః - క్షమా - సత్యమ్ - దమః - శమః
సుఖమ్- దుఃఖమ్- భవః - అభావః - భయమ్ - చ - అభయమ్ - ఏవ - చ

**అహింసా సమతా తుష్టిః । తపో దానం యశోఽ యశః ।**
**భవంతి భావా భూతానాం । మత్త ఏవ పృథగ్విధాః ॥ 5**

అహింసా - సమతా - తుష్టిః - తపః - దానమ్ - యశః - అయశః ।
భవంతి - భావాః - భూతానామ్ - మత్తః - ఏవ - పృథగ్విధాః

**సృష్టికి సంబంధించి:**

భవః+అభావః+ఏవ = సృష్టి, స్థితి, లయములు

**ద్వందములు:**

భయః + అభయమ్+ = భయము, అభయము (ధైర్యము),
సుఖమ్+దుఃఖమ్+ సుఖము, దుఃఖము, కీర్తి , అపకీర్తి
యశః + అయశః

**సత్త్వగుణమునకు సంబంధించినవి:**

క్షమా+అహింసా+ = క్షమ అనగా ఓర్పు, అహింస, సంతోషము,
తుష్టిః+సమతాసత్యమ్+ సమభావము, సత్యము చెప్పుట
చ

**సత్త్వగుణమువలన చేయబడు కార్యములు:**

తపః+దానమ్+ = తపస్సు దానముచేయుట
అసమ్మోహః+చ మోహరాహిత్యము, మోహము లేకుండుట
దమః+శమః బాహ్యేంద్రియ నిగ్రహము గలిగి ఉండుట
అంతరేంద్రియ నిగ్రహము గలిగి ఉండుట

**దేహిలో:**

జ్ఞానమ్+బుద్ధిః = జ్ఞానము బుద్ధి ఈ విధముగా ప్రాణికోటియొక్క
ఏవమ్+భూతానామ్+ తమోగుణ, రజోగుణ, సత్త్వగుణములవలన
పృథగ్విధా + భావాః+ జనియించిన సమస్తమయిన భావములు
మత్తః + ఏవ+భవంతి నా నుండియే, (విరాట్‌పురుషుని నుండియే)
సృజియింపబడుచున్నవి.

...... ❖ ❖ ❖ ......

విరాట్‌పురుషునివలన జనియించినవారు. అతని దేహమునందు వసియించుచున్నారు. తిరిగి అందే లయమగుచున్నారు.

**మహర్షయః సప్త పూర్వే । చత్వారో మనవస్తథా ।**
**మద్భావా మానసా జాతా । యేషాం లోక ఇమాః ప్రజాః ॥ 6**

మహర్షయః – సప్త – పూర్వే – చత్వారః – మనవః – తథా
మద్భావాః – మానసాః–జాతాః – యేషామ్ – లోకాః – ఇమాః – ప్రజాః

| | | |
|---|---|---|
| యేషామ్+మద్భావాః+ | = | నా మనో సంకల్పమువలన అయోనిజ సృష్టిగా |
| మానసాః+పూర్వే+ | | సృష్టికి పూర్వము అనగా ప్రారంభ సృష్టిలో |
| మనవః+సప్త+ | | 14 మంది మనువులు, సప్త ఋషులు, |
| మహర్షయః+చత్వారః+ | | సనకసనందనాదులు నలుగురు |
| తథా+లోకాః+ఇమాః+ | = | అటులనే సమస్త దేవతలు, రాక్షసులు, అసురులు, |
| ప్రజాః+జాతాః | | యక్ష, గరుడ, గంధర్వాదులు, సర్వస్థావర జంగమములు 14 లోకములు ఈ ప్రజలు పుట్టిరి. |

**వ్యాఖ్యానము :-** వీరందఱూ రథ చక్రపు నాభిలో రథచక్రపు ఆకులు అమరియున్నట్లు, సృష్టిలో విరాట్‌పురుషుని దేహములో ఉందురు. విరాట్‌వలన దేవతలు, రాక్షసులు, యక్ష, గరుడ, గంధర్వాదులు, 14మంది మనువులు, సప్తఋషులు, సనకసనందనాదులు, ఈ ప్రజలు మఱియు సమస్త భావములు అనగా సర్వ స్థావర జంగమములు సృజియింపబడినవి. అవి విరాట్‌నందు వసియించుచున్నవి. ఆత్మ స్థానమునకు చేరని వారు లయకాలమున లయమై సృష్టి ప్రారంభమున తిరిగి జన్మించుచున్నారు.

...... ❖ ❖ ❖ ......

విభూతులు

**ఏతాం విభూతిం యోగం చ । మమ యో వేత్తి తత్త్వతః ।**
**సోఽవికంపేన యోగేన । యుజ్యతే నాత్ర సంశయః ॥ 7**

ఏతామ్ – విభూతిమ్ – యోగమ్ – చ – మమ – యః – వేత్తి – తత్త్వతః
సః – అవికంపేన – యోగేన – యుజ్యతే – న – అత్ర – సంశయః

| | | |
|---|---|---|
| యః+మమ+ఏతామ్+ విభూతిమ్ | = | ఎవడు నా యొక్క ఆవిర్భావమును అలా ఆత్మగా ఆవిర్భవించిన నేను, ఆదిపురుషునిగా, విరాట్‌పురుషునిగా ప్రభవించుట. విరాట్‌పురుషుని వలన జరిగిన ప్రారంభ సృష్టిలో సర్వ స్థావర జంగమములు, సర్వ లోకములు, సర్వ భావములు సృజియింపబడుట, విరాట్‌పురుషుడు గానిది పరమాణువుకూడా లేదని ఈ సర్వము అతడే అని విశిష్టములైన ఈ విభూతిని గూర్చి |
| తత్త్వతః+వేత్తి +చ | = | తత్త్వరీత్యా గ్రహించునో మఱియు |
| యోగమ్+సః+ | = | యోగమును అభ్యసించుచున్నాడో |
| అవికంపేన+యోగేన+ యుజ్యతే+అత్ర+న+ సంశయః | = | అతడు చలింపని యోగముచే, నిశ్చల సమాధిచే హృదయగత ఆత్మను దర్శించి, దేహత్యాగానంతరము సృష్ట్యాదియందుగల ఆత్మతో, ఏకీభూతుడగుచున్నాడు. ఈ విషయములో సంశయము లేదు. |

**వ్యాఖ్యానము :-** ఈ సర్వము విరాట్‌పురుషుడే. అయితే ఈ సర్వములోగల విశిష్టములైనవాటిని విభూతులుగా వ్యాసభగవానుడు వర్గీకరించినాడు. ఆత్మ గుఱించి ఆది పురుషుని గుఱించి, విరాట్‌పురుషుని గుఱించి, అవతార పురుషుని గుఱించి, జీవ పురుషుని గుఱించి తెలుసుకొని సాధన చేసి గుణ రహితుడై ద్వంద్వాతీతుడై, జీవన్ముక్తుడై

నిశ్చల సమాధిలో హృదయగత ఆత్మను దర్శించి, దేహ త్యాగానంతరము ఆత్మతో ఏకీభూతుడై ఆత్మయై విరాజిల్లును.

...... ❖ ❖ ❖ ......

విరాట్‌పురుషుడు - అంతరాత్మగా

**అహం సర్వస్య ప్రభవో । మత్తః సర్వం ప్రవర్తతే ।**
**ఇతి మత్వా భజన్తే మాం । బుధా భావసమన్వితాః ॥ 8**

అహమ్ – సర్వస్య – ప్రభవః – మత్తః – సర్వమ్ – ప్రవర్తతే
ఇతి – మత్వా – భజన్తే – మామ్ – బుధాః – భావ సమన్వితాః

అహమ్+సర్వస్య+ప్రభవః= నేను – ఆత్మ స్వరూపుడను–ఆదిపురుషుడను.

మత్తః+సర్వమ్+ప్రవర్తతే విరాట్‌పురుషునిగా స్థావర జంగమాత్మకమయిన సర్వవిశ్వమునకు, సర్వ భావములకు, సమస్తము యొక్క ఉత్పత్తికి కారణమైనవాడను. అనగా సృష్టి, స్థితి, లయ కారకుడను. అంతరాత్మగా జగత్తులో ఉన్న నావలననే జడమయిన ఈ సర్వజగత్తు ప్రవర్తించుచున్నది.

అయస్కాంత సన్నిధానమున ఇనుము చరించునట్లు, హృదయగత ఆత్మ ప్రకాశమున దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధులు పనిచేయుచున్నవి.

ఇతి + మత్వా+ = అని గ్రహించి

భావసమన్వితాః(సంతః)+= తమ సర్వభావములు నాయందు ఉంచిన
బుధాః+మామ్+ బుధులు నన్ను అనగా ఆత్మను భజయించుచున్నారు,
భజంతే సేవించుచున్నారు. బుధులు– ఒకరి కొకరు నా లీలా విశేషములను, గుణకీర్తన వర్ణములు వినిపించెదరు. దీనిని రాబోవు శ్లోకములో చెప్పుచున్నాడు.

భక్తులు

**మచ్చిత్తా మద్గతప్రాణా । బోధయంతః పరస్పరమ్ ।**
**కథయంతశ్చ మాం నిత్యం । తుష్యంతి చ రమంతి చ ॥ 9**

మచ్చిత్తాః – మద్గతప్రాణాః – బోధయంతః – పరస్పరమ్
కథయంతః – చ – మామ్ – నిత్యమ్ – తుష్యంతి – చ – రమంతి – చ

**తేషాం సతతయుక్తానాం । భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం । యేన మాముపయాన్తి తే ॥ 10**

తేషామ్ – సతత యుక్తానామ్ – భజతామ్ – ప్రీతిపూర్వకమ్
దదామి – బుద్ధియోగమ్ – తమ్ – యేన – మామ్ – ఉపయాన్తి – తే

**తేషామేవానుకంపార్థమ్ । అహమజ్ఞానజం తమః ।**
**నాశయామ్యాత్మ భావస్థో । జ్ఞానదీపేన భాస్వతా ॥ 11**

తేషామ్ – ఏవ – అనుకంపార్థమ్ – అహమ్ – అజ్ఞానజమ్ – తమః
నాశయామి – ఆత్మ భావస్థః – జ్ఞానదీపేన – భాస్వతా

| | | |
|---|---|---|
| మద్గత ప్రాణాః+ | = | నా యందు వారి మనోబుద్ధి, చిత్త, ప్రాణములను |
| మచ్చిత్తాః+పరస్పరమ్+ | | ఉంచిన వారలయి, భక్తులు ఒకరికొకరు నా గుఱించి |
| బోధయంతః + చ+ | | తమకు తెలిసినది బోధించు కొనుచూ, మఱియు |
| కథయంతః+చ | | నా యొక్క లీలావతారములను, గుణములను, కర్మలను, కథలుగా చెప్పుకొనుచూ మఱియు |
| మామ్ + నిత్యమ్+ | = | నన్ను నిత్యము నిరంతరము స్మరించుచూ |
| తుష్యంతి+చ+రమంతి | | సంతోషించుచున్నారు మఱియు నాయందే అనగా ఆత్మయందే రమించుచున్నారు. ఆత్మరతి, ఆత్మక్రీడ కలిగి ఆనందమును అనుభవించుచున్నారు. |

భాగవతములో గోపబాలురు గోపికలను ఉదాహరణగా చెప్పబడిరి.

| | | |
|---|---|---|
| సతత యుక్తానామ్+ | = | ఎల్లప్పుడూ నాయందే చిత్తమునుంచి నిరంతర |
| ప్రీతి పూర్వకమ్+భజతామ్ | | నామస్మరణ చేయువారలకు ప్రీతిపూర్వకముగా |
| +తేషామ్ | | నన్ను సేవించువారలయిన వారలకు అనగా నా భక్తులకు |
| యేన+తే+మామ్+ | = | ఏ సాధన ద్వారా సాంఖ్యముద్వారా వారు |
| ఉపయాంతి+తమ్+ | | నన్ను పొందుదురో అట్టి **సాంఖ్యయోగము**ను, |
| బుద్ధియోగమ్+దదామి | | ప్రసాదించుచున్నాను |
| అహమ్+అనుకంపార్థమ్ | = | నేను – ఆత్మ స్వరూపమున గుణరహితుడ నయినను వారలను అనుగ్రహించుట కొఱకు దయ అనే గుణమును స్వీకరించి వారి యొక్క హృదయగుహాలో |
| ఆత్మ భావస్థః+భాస్వతా+ | = | ఆత్మస్వరూపమున ఉన్న నేను |
| జ్ఞాన దీపేన+తేషామ్ | | స్వయముగా ప్రకాశించుచున్న |
| అజ్ఞానజమ్+తమః+ఏవ | | జ్ఞానమనే దీపముచే అజ్ఞానముచేత గలిగినవారి యొక్క తమస్సును అనగా మోహమును |
| నాశయామి | = | నశింపచేయుచున్నాను. |

...... ❖ ❖ ❖ ......

అర్జున ఉవాచ

**పరం బ్రహ్మ పరం ధామ । పవిత్రం పరమం భవాన్ ।**
**పురుషం శాశ్వతం దివ్యమ్ । ఆదిదేవమజం విభుమ్ ॥ 12**

పరమ్ బ్రహ్మ – పరమ్ ధామ – పవిత్రమ్ – పరమమ్ – భవాన్
పురుషమ్ – శాశ్వతమ్ – దివ్యమ్ – ఆదిదేవమ్ – అజమ్ – విభుమ్

**ఆహుస్త్వామ్ ఋషయః సర్వే । దేవర్షిర్నారదస్తథా ।**
**అసితో దేవలో వ్యాసః । స్వయం చైవ బ్రవీషి మే ॥ 13**

ఆహుః – త్వామ్ – ఋషయః – సర్వే – దేవర్షిః – నారద – తథా
అసితః – దేవలః – వ్యాసః – స్వయమ్ – చ – ఏవ – బ్రవీషి – మే

**సర్వమేతద్ ఋతం మన్యే । యన్మాం వదసి కేశవ ।**
**న హి తే భగవన్ వ్యక్తిం । విదుర్దేవా న దానవాః ॥ 14**

సర్వమ్ – ఏతత్ – ఋతమ్ – మన్యే – యత్ – మామ్ – వదసి – కేశవ
న – హి – తే – భగవన్ – వ్యక్తిమ్ – విదుః – దేవాః – న – దానవాః

**స్వయమేవాత్మనాత్మానం । వేత్థ త్వం పురుషోత్తమ ।**
**భూత భావన భూతేశ । దేవదేవ జగత్పతే ॥ 15**

స్వయమ్ – ఏవ – ఆత్మనా – ఆత్మానమ్ – వేత్థ – త్వమ్ – పురుషోత్తమ
భూత భావన – భూతేశ – దేవదేవ – జగత్పతే

**వక్తుమర్హస్య శేషేణ । దివ్యా హ్యాత్మ విభూతయః ।**
**యాభిర్విభూతిభిర్లోకాన్ । ఇమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16**

వక్తుమ్ – అర్హసి – అశేషేణ – దివ్యాః – హి – ఆత్మ విభూతయః
యాభిః – విభూతిభిః – లోకాన్ – ఇమాన్ – త్వమ్ – వ్యాప్య – తిష్ఠతి

**కథం విద్యామహం యోగిన్ । త్వాం సదా పరిచిన్తయన్ ।**
**కేషు కేషు చ భావేషు । చిన్త్యోఽసి భగవన్మయా ॥ 17**

కథమ్ – విద్యామ్ – అహమ్ – యోగిన్ – త్వామ్ – సదా – పరిచిన్తయన్
కేషు – కేషు – చ – భావేషు – చిన్త్యః – అసి – భగవన్ – మయా

**విస్తరేణాత్మనో యోగం । విభూతిం చ జనార్దన ।**
**భూయః కథయ తృప్తిర్హి । శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥ 18**

విస్తరేణ – ఆత్మనః – యోగమ్ – విభూతిమ్ – చ – జనార్దన
భూయః – కథయ – తృప్తిః – హి – శృణ్వతః – న – అస్తి – మే – అమృతమ్

| | | |
|---|---|---|
| భవాన్ | = | నీవు |
| పరమ్+బ్రహ్మ+ | = | పరబ్రహ్మవు అని పరంధాముడవు అని |
| పరమ్ధామ+పవిత్రమ్+ | | పవిత్రుడవు అని ప్రకృతికి అవ్వలి వాడవు అని |
| పరమమ్+పురుషమ్+ | | పురములనే ఉపాధులందు వసియించువాడవు అని |
| శాశ్వతమ్+దివ్యమ్+ | | శాశ్వతుడవు అని, తేజోరూపుడవని |
| ఆదిదేవమ్+అజమ్+ | | ఆది దేవుడవు అని, స్వయంభుడవు అని, |
| విభుమ్ | | పుట్టుకలేనివాడవు అని, విభుడవు అని, |
| త్వామ్+దేవర్షిః+ | = | నిన్ను–(ఆత్మగా బ్రహ్మగా విరాట్ పురుషునిగా |
| నారదః+తథా+దేవలః+ | | అధిదైవముగా అధియజ్ఞునిగా) దేవర్షియగు |
| అసితః+వ్యాసః+సర్వే+ | | నారద మహర్షి అట్లే వేదకాలమందలి ఋషులు |
| ఋషయః+ఆహుః | | అయిన దేవలుడనే ఋషి అసితుడనే ఋషి ఇప్పటి వ్యాసభగవానుడు ఋషులు అందఱూ చెప్పుదురు. |
| చ+స్వయమ్+ఏవ+ | = | మఱియు నీవే స్వయముగా నీ గుఱించి |
| మే+బ్రవీషి | | నాకు చెప్పుము. |
| కేశవ | = | ఓ శ్రీకృష్ణా! |
| యత్+మామ్+వదసి+ | = | దేనిని నాకు చెప్పుచున్నావో ఇది అంతయు సత్యమని |
| ఏతత్+సర్వమ్+ | | నేను తలంచుచున్నాను |
| ఋతమ్+మన్యే | | |

| | | |
|---|---|---|
| భగవన్ | = | ఓ శ్రీకృష్ణా! |
| తే+హి+వ్యక్తిమ్+ | | నీయొక్క ఆత్మ, ఆది పురుష, విరాట్పురుష, |
| దానవాః+చ+న+ | | అంతర్యామిత్వ రూపములను, నీ మాయను |
| విదుః+దేవాః+న | | అజ్ఞానముతో కూడియున్న దానవులు ఎఱుంగరు గ్రహించలేరు. ఆత్మయొక్క ఆవిర్భావమును బ్రహాదిదేవతలు కూడా తెలియలేరు. |
| పురుషోత్తమ+దేవదేవ+ | = | ఓ పురుషోత్తమా! (ఆదిపురుషుడా) |
| భూత భావన+భూతేశ+ | | ఓ దేవదేవుడా! ఓ సృష్టి, స్థితి, లయ కారకా! |
| జగత్పతే+స్వయమ్+ | | ఓ సర్వప్రాణి నియామకుడా! ఓ జగత్పతీ! |
| ఏవ+వేత్థ | | (విరాట్పురుషుడా) నీ గుఱించి నీవే ఎఱుగుదువు. |
| త్వమ్+ఆత్మనా+ | = | నిన్ను యోగులు నిశ్చల సమాధిచే |
| ఆత్మానమ్ | | క్షేత్రజ్ఞుడవైన నిన్ను దర్శింతురు |
| ఇమాన్+లోకాన్+ | = | ఈ పదునాలుగు లోకములను వ్యాపించి, సర్వ |
| వ్యాప్య+హి+తిష్ఠసి | | స్థావర జంగమాత్మకముగను మఱియు వాటిలో అంతర్లీనముగా ఉన్నావు. |
| దివ్యాః+ఆత్మవిభూతయః+ | = | ఈ సర్వ స్థావర జంగమరూపములలో నీ యొక్క |
| యాభిః+విభూతిభిః+ | | దివ్యములయిన రూపములను మఱియు ఏ ఉత్కృష్ట |
| అశేషేణ+వక్తుమ్+త్వమ్+ | | రూపములచే నీవు వ్యక్తుడవు అయితివో వాటిని |
| అర్హసి | | సంపూర్ణముగా చెప్పుటకు నీవు అర్హుడవు. |
| భగవన్ | = | ఓ శ్రీకృష్ణా! సర్వము నీవే అయినను |
| మయా+కథమ్+ | | నా చేత ఎట్లు ధ్యానింపదగినవాడవు అగుచున్నావు? |
| చింత్యః+అసి | | (1వ ప్రశ్న. ఏ రూపంబున ధ్యానించవలయును) |
| అహమ్+త్వామ్+ | = | నేను చరాచరజగత్తు సర్వము నీవే అయినప్పుడు |
| కథమ్+విద్యామ్ | | ఈ సృష్టిలో నిన్ను ఎట్లు తెలుసుకొందును? (ఇది 2వ ప్రశ్న. అధిదైవికములలో ఎలా |

| | | |
|---|---|---|
| | | తెలుసుకొనవలయును? అధిభౌతికములలో ఎలా తెలుసుకొనవలయును?) |
| కేషుకేషుభావేషు+ యోగిన్+సదా+ పరిచిన్తయన్ | = | సర్వభావములు విరాట్‌పురుషుని వలననే గలిగినప్పుడు ఏయే భావముల యందు నీవు గలవని గ్రహించుట? (ఇది 3వ ప్రశ్న) |
| | | ఓ శ్రీకృష్ణా! ఎల్లప్పుడు ధ్యానము చేయుచూ నిన్ను దర్శించినచో గలుగు ఫలమేమి? (ఇది 4వ ప్రశ్న) |
| జనార్ధన | = | ఓ శ్రీకృష్ణా ! |
| ఆత్మనః+యోగమ్+ చ+విభూతిమ్+ శృణ్వతః+హి+మే+ తృప్తిః+న+అస్తి | = | నా వలన మీ యొక్క యోగమహిమను గూర్చి మఱియు విభూతుల గుఱించి వినుచున్నప్పటికి నాకు, తృప్తి కలుగుటలేదు. కావున |
| అమృతమ్+భూయః+ విస్తరేణ+కథయ | = | అమృతమైన వాటిని మరల విపులముగా వర్ణించి చెప్పుము. |

**వ్యాఖ్యానము :-** కేవలము గుణరహితులు మాత్రమే ఆత్మస్వరూపమును గ్రహించగలరు. ఇతరులు గ్రహించలేరు అని చెప్పుటకు కథా పరంగా రజోగుణయుతుడైన బ్రహ్మ శ్రీకృష్ణుని పరతత్త్వమును గ్రహించలేక, బ్రహ్మ గోవులను, గోపబాలురను దాచగా, శ్రీకృష్ణుడే గోవులు, వాటి దూడలు, గోపబాలురు, ఇలా సర్వము తనే అయినాడు. (చతుర్ముఖ బ్రహ్మకు ఒక్కడుగా ఉన్నవాడు-సర్వము ఎలా అవుతాడో చేసి చూపించినాడు) బ్రహ్మ ఆ విశ్వరూప సందర్శమునకు ఆశ్చర్యచకితుడు అయినట్లు భాగవతము దశమస్కంధములో కథగా వర్ణింపబడినది.

ఆత్మగా సృష్ట్యాదియందు ఒక్కడివి. ఆ తర్వాత నీవే హిరణ్మయ కోశమును సృజియించుకొని, అందు వసియించి, ఆదిపురుషుడవు అయితివి. ప్రకృతిని సృజియించి, ప్రకృతితో కూడి, అనగా ప్రకృతి పురుష సంయుక్త రూపముగా విరాట్‌పురుషుడవై, గుణయుతుడవై, సృష్టి, స్థితి, లయములు చేయుచున్నావు. జగత్తులో ఆత్మరూపమున

అంతర్యామిగా చరించుచున్నావు. దేహిగా, హృదయగత ఆత్మగా, నిన్నునీవు విభజించుకొని, ఉపాధులలో వసియించుచున్నావు. విరాట్ రూపమున సర్వ జీవరాసుల రూపమున వ్యక్తుడవు, అంతర్యామి రూపమున అవ్యక్తుడవు. విరాట్పురుషుడవయిన నీవు సర్వజీవరాసుల రూపముగా అవతరించినను అందు ఉత్కృష్టమయిన వాటిని అనగా విరాట్పురుషునిగా– అనగా ఈ పదునాలుగు లోకములు నీ దేహము. దేవ, దానవ, మానవ, పశు, పక్ష్యాది, సర్వ స్థావర, జంగమ రూపములు, సర్వ భావములు నీవు. నీవు గానిది పరమాణువుకూడా లేదు. ఈ బ్రహ్మాండమునకు ఆవల గల అలోకంబున ఉండు నీవు. విరాట్పురుషునిగా అవతరించి, అపై సర్వ స్థావర జంగమ రూపములుగా అవతరించితివి. ఈ సర్వంబును నీవు. ఈ సర్వస్థావరజంగమ రూపములలో– నీవు స్వయముగా ధరించిన దివ్యములైన రూపములు, మఱియు సమస్త స్థావర జంగమములలో ఉత్కృష్ట రూపములచే, నీ విభూతిని ఎట్లు గ్రహించగలమో వాటిని నాకు వివరింపుము. కొన్ని అవతారములు విరాట్పురుషుడు స్వయముగా ధరియించి, అయోనిజగా ఆవిర్భవించినాడు. ఉదా: మత్స్యావతారము, కూర్మావతారము మొ॥ అటులనే మిథున ధర్మ సృష్టిలో ప్రజాపతులకు, సూర్యవంశమున, యదువంశమున, ఇతరులయందు జన్మించి, ఘనకార్యములు ఆచరించి, ఆత్మ విభూతులుగా కీర్తింప బడినాడు. ఇతరములైన పశు, పక్షి, మృగాదులలో, స్థావరములలో ఉత్కృష్టము లయినవి, పరమేశ్వరుని విభూతులుగా గుర్తించవలయును. కొన్ని అవతారములలో తత్త్వమును ప్రభోదించినాడు. ఇదియే ధర్మ సంస్థాపన. కొన్ని అవతారములలో ఇతరులకు మార్గదర్శకునిగా యోగమును, కర్మానుష్ఠానమును ఆచరించి, ఆదర్శప్రాయుడు అయినాడు.

**అర్జునుని ప్రశ్నలు :**

1. అధిదైవిక, అధిభౌతిక రూపములలో నిన్ను ఎట్లు గ్రహించుట? 2. ఏ రూపమున నిన్ను ధ్యానించవలయును? 3. ఏ భావములతో నిన్ను గుర్తించి అర్చించవలయును? 4. నిన్ను దర్శించిన గలుగు ఫలమేమి?

అవతార విశేషములను కథాపరముగా గాక తత్త్వరీత్యా గ్రహించవలయును. ఉదా: సర్వము విరాట్పురుషుడే అని ఒక మొసలిని, ఒక సింహమును ఇంటిలో

ఉంచుకొని పూజించుతామా? అలా వాటిని ఇంటికి తెస్తే ఏమవుతుంది? కావున అవతారములను, విజ్ఞానముతో గ్రహించవలయును. నాగుల చవితికి పుట్టలో పాలు పోసి, నాగదేవతకు మ్రొక్కవచ్చు, కాని ఆ నాగుపామును పూజించుటకు ఇంటికి తెస్తే ఏమవుతుంది? దీనిని గ్రహించుటయే ప్రజ్ఞానము.

...... ❖ ❖ ❖ ......

శ్రీ భగవాన్ ఉవాచ

విరాట్పురుషునియొక్క విభూతులు

**హన్త తే కథయిష్యామి । దివ్యా హ్యాత్మ విభూతయః ।**
**ప్రాధాన్యతః కురు శ్రేష్ఠ । నాస్త్యంతో విస్తరస్య మే ॥ 19**

హన్త – తే – కథయిష్యామి – దివ్యాః – హి – ఆత్మ విభూతయః
ప్రాధాన్యతః – కురుశ్రేష్ఠ – న – అస్తి – అన్తః – విస్తరస్య – మే

**అహమాత్మా గుడాకేశ । సర్వ భూతాశయ స్థితః ।**
**అహమాదిశ్చ మధ్యం చ । భూతానామంత ఏవ చ ॥ 20**

అహమ్ – ఆత్మా – గుడాకేశ – సర్వ భూతాశయస్థితః
అహమ్ – ఆదిః–చ–మధ్యమ్–చ–భూతానామ్ – అంతః – ఏవ –చ

**ఆదిత్యానామహం విష్ణుః । జ్యోతిషాం రవిరంశుమాన్ ।**
**మరీచిర్మరుతామస్మి । నక్షత్రాణామహం శశీ ॥ 21**

ఆదిత్యానామ్ – అహమ్ – విష్ణుః – జ్యోతిషామ్ – రవిః – అంశుమాన్
మరీచిః – మరుతామ్ – అస్మి – నక్షత్రాణామ్ – అహమ్ – శశీ

**వేదానాం సామవేదోఽస్మి । దేవానామస్మి వాసవః ।**
**ఇన్ద్రియాణాం మనశ్చాస్మి । భూతానామస్మి చేతనా ॥ 22**

వేదానామ్ – సామవేదః – అస్మి – దేవానామ్ – అస్మి – వాసవః
ఇన్ద్రియాణామ్ – మనః – చ – అస్మి – భూతానామ్ – అస్మి – చేతనా

**రుద్రాణాం శంకరశ్చాస్మి । విత్తేశో యక్షరక్షసామ్ ।**
**వసూనాం పావకశ్చాస్మి । మేరుశ్శిఖరిణా మహమ్ ॥ 23**

రుద్రాణామ్ – శంకరః – చ – అస్మి – విత్తేశః – యక్షరక్షసామ్
వసూనామ్ – పావకః – చ – అస్మి – మేరుః – శిఖరిణామ్ – అహమ్

**పురోధసాం చ ముఖ్యం మాం । విద్ధి పార్థ బృహస్పతిమ్ ।**
**సేనానీనామహం స్కన్దః । సరసామస్మి సాగరః ॥ 24**

పురోధసామ్ – చ – ముఖ్యమ్ – మామ్ – విద్ధి – పార్థ – బృహస్పతిమ్
సేనానీనామ్ – అహమ్ – స్కన్దః – సరసామ్ – అస్మి – సాగరః

**మహర్షీణాం భృగురహం । గిరామస్మ్యేకమక్షరమ్ ।**
**యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి । స్థావరాణాం హిమాలయః ॥25**

మహర్షీణామ్ – భృగుః – అహమ్ – గిరామ్ – అస్మి – ఏకమ్ – అక్షరమ్
యజ్ఞానామ్ – జపయజ్ఞః – అస్మి – స్థావరాణామ్ – హిమాలయః

**అశ్వత్థః సర్వ వృక్షాణాం । దేవర్షీణాం చ నారదః ।**
**గన్ధర్వాణాం చిత్రరథః । సిద్ధానాం కపిలో మునిః ॥ 26**

అశ్వత్థః – సర్వ వృక్షాణామ్ – దేవర్షీణామ్ – చ – నారదః
గన్ధర్వాణామ్ – చిత్రరథః – సిద్ధానామ్ – కపిలః – మునిః

**ఉచ్చైః శ్రవసమశ్వానాం । విద్ధి మామమృతోద్భవమ్ ।**
**ఐరావతం గజేంద్రాణాం । నరాణాం చ నరాధిపమ్ ॥ 27**

ఉచ్చైశ్రవసమ్ – అశ్వానామ్ – విద్ధి – మామ్ – అమృతోద్భవమ్
ఐరావతమ్ – గజేంద్రాణామ్ – నరాణామ్ – చ – నరాధిపమ్

**ఆయుధానామహం వజ్రం । ధేనూనామస్మి కామధుక్ ।**
**ప్రజనశ్చాస్మి కందర్పః । సర్పాణామస్మి వాసుకిః ॥ 28**

ఆయుధానామ్ – అహమ్ – వజ్రమ్ – ధేనూనామ్ – అస్మి – కామధుక్
ప్రజనః – చ – అస్మి – కందర్పః – సర్పాణామ్ – అస్మి – వాసుకిః

**అనంతశ్చాస్మి నాగానాం । వరుణో యాదసామహమ్ ।**
**పితౄణామర్యమా చాస్మ । యమః సంయమతామహమ్ ॥29**

అనంతః–చ–అస్మి–నాగానామ్–వరుణః–యాదసామ్–అహమ్
పితౄణామ్–అర్యమా–చ–అస్మి–యమః–సంయమతామ్–అహమ్

**ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం । కాలః కలయతామహమ్ ।**
**మృగాణాం చ మృగేంద్రోఽహం । వైనతేయశ్చ పక్షిణామ్ ॥30**

ప్రహ్లాదః – చ – అస్మి – దైత్యానామ్ – కాలః – కలయతామ్ – అహమ్
మృగాణామ్ – చ – మృగేంద్రః – అహమ్ – వైనతేయః – చ – పక్షిణామ్

**పవనః పవతామస్మి । రామః శస్త్ర భృతామహమ్ ।**
**ఝషాణాం మకరశ్చాస్మి । స్రోతసామస్మి జాహ్నవీ ॥ 31**

పవనః – పవతామ్ – అస్మి – రామః – చ – శస్త్ర భృతామ్ – అహమ్
ఝషాణామ్ – మకరః – చ – అస్మి – స్రోతసామ్ – అస్మి – జాహ్నవీ

**సర్గాణామాదిరంతశ్చ । మధ్యం చైవాహమర్జున ।**
**అధ్యాత్మవిద్యా విద్యానాం । వాదః ప్రవదతామహమ్ ॥ 32**

సర్గాణామ్–ఆదిః–అంతః–చ–మధ్యమ్–చ–ఏవ–అహమ్–అర్జున
అధ్యాత్మ విద్యా – విద్యానామ్ – వాదః–ప్రవదతామ్ – అహమ్

**అక్షరాణామకారోస్మి । ద్వంద్వః సామాసికస్య చ ।**
**అహమేవాక్షయః కాలో । ధాతాహం విశ్వతోముఖః ॥ 33**

అక్షరాణామ్ – అకారః – అస్మి – ద్వంద్వః – సామాసికస్య – చ
అహమ్ – ఏవ – అక్షయః – కాలః – ధాతా – అహమ్ – విశ్వతః – ముఖః

**మృత్యుః సర్వహరశ్చాహమ్ । ఉద్భవశ్చ భవిష్యతామ్ ।**
**కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం । స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥ 34**

మృత్యుః – సర్వ హారః – చ – అహమ్ – ఉద్భవః – చ – భవిష్యతామ్
కీర్తిః – శ్రీః – వాక్ – చ – నారీణామ్ – స్మృతిః – మేధా – ధృతిః – క్షమా

**బృహత్సామ తథా సామ్నాం । గాయత్రీ ఛందసామహమ్**
**మాసానాం మార్గశీర్షోఽహమ్। ఋతూనాం కుసుమాకరః॥35**

బృహత్ సామ – తథా – సామ్నామ్ – గాయత్రీ – ఛందసామ్ – అహమ్
మాసానామ్ – మార్గశీర్షః – అహమ్ – ఋతూనామ్ – కుసుమాకరః

**ద్యూతం ఛలయతామస్మి । తేజస్తే జస్వినామహమ్ ।**
**జయోఽస్మి వ్యవసాయోఽస్మి । సత్త్వం సత్త్వవతామహమ్ ॥ 36**

ద్యూతమ్ – ఛలయతామ్ – అస్మి – తేజః – తేజస్వినామ్ – అహమ్
జయః – అస్మి – వ్యవసాయః – అస్మి – సత్త్వమ్ – సత్త్వవతామ్ – అహమ్

**వృష్ణీనాం వాసుదేవోఽస్మి । పాండవానాం ధనంజయః ।**
**మునీనామప్యహం వ్యాసః । కవీనాముశనా కవిః ॥ 37**

వృష్ణీనామ్ - వాసుదేవః - అస్మి - పాణ్డవానామ్ - ధనంజయః
మునీనామ్ - అపి - అహమ్ - వ్యాసః - కవీనామ్ - ఉశనా - కవిః

**దణ్డో దమయతామస్మి । నీతిరస్మి జిగీషతామ్ ।**
**మౌనం చైవాస్మి గుహ్యానాం । జ్ఞానం జ్ఞానవతామహమ్ ॥ 38**

దండః - దమయతామ్ - అస్మి - నీతిః - అస్మి - జిగీషతామ్
మౌనమ్-చ-ఏవ-అస్మి-గుహ్యానామ్ - జ్ఞానమ్ - జ్ఞానవతామ్-అహమ్

**యచ్చాపి సర్వభూతానాం । బీజం తదహమర్జున ।**
**న తదస్తి వినా యత్ స్యాత్ । మయా భూతం చరాచరమ్ ॥39**

యత్ - చ - అపి - సర్వభూతానామ్ - బీజమ్ - తత్ - అహమ్ - అర్జున
న - తత్ - అస్తి - వినా - యత్ - స్యాత్ - మయా - భూతమ్ - చరాచరమ్

| | | |
|---|---|---|
| కురు శ్రేష్ఠ+హన్త | = | ఓ అర్జునా! నీవు అడిగిన దానికి సమాధానము చెప్ప ఆరంభించుచున్నాను వినుము |
| హి+విస్తరస్య+ | = | ఆత్మస్వరూపమున అవ్యక్తుడను, జగత్తులో |
| అన్తః+న+అస్తి | | అంతర్యామిగను, దేహములో హృదయ గుహలో స్వయం జ్యోతిగా, అణువులో అణువుగా ఉందును. అనంతములు అయిన నా అవతారములకు భూతకాలములోను, వర్తమాన కాలములోను, భవిష్యత్ కాలములోను గల సర్వ స్థావర జంగమములు, విరాట్‌పురుషునిగా నేను అగుట వలన, నా అవతారములకు అంతము లేదు. అవి అనంతములు. అందువలన |

| | | |
|---|---|---|
| మే+దివ్యాః+ | = | నా యొక్క అనగా విరాట్ పురుషుని యొక్క |
| ఆత్మ విభూతయః+ | = | దివ్యములయిన దేవతా సంబంధములైనవాటిని |
| ప్రాధాన్యతః+తే+ | | మఱియు జగత్తులో నా విభూతులలో ముఖ్యమైన |
| కథ యిష్యామి | | వాటిని నీ కొఱకు చెప్పెదను శ్రద్ధగా వినుము. |
| గుడాకేశ | = | ఓ అర్జునా! |

**అంతరాత్మ :**

| | | |
|---|---|---|
| అహమ్+ | = | నేను దేహములో హృదయగుహలోగల స్వయంజ్యోతి |
| సర్వభూతాశయ స్థితః+ | | స్వరూపుడనై, అణువులో అణువు అంత |
| ఆత్మా+చ | | పరిమాణమునగల ఆత్మను నేను. అంతర్యామిని నేను. మఱియు విరాట్‌పురుషునిగా |
| భూతానామ్+ఆదిః+ | = | సర్వస్థావర జంగమములు, పుట్టుటకు ముందు |
| చ+మధ్యమ్+చ+అంతః+ | | (భూతకాలం) అవి పుట్టిన తర్వాత (వర్తమాన |
| అహమ్+ఏవ | | కాలం) అవి అన్నీ లయము అయిన తర్వాత (భవిష్యత్ కాలములో) ఉండు విరాట్‌పురుషుడు నేనే అనగా విరాట్ పురుషుడను నేనే. |

దేవతా సంబంధమైన వాటిలో– **(అధిదైవికము)**

| | | |
|---|---|---|
| ఆదిత్యానామ్+విష్ణుః+ | = | ద్వాదశ ఆదిత్యులలో (కశ్యప ప్రజాపతికి అదితికి |
| అహమ్+మరుతామ్+ | | జన్మించిన వారిలో) విష్ణువు నేను. సప్త మరుత్తులలో |
| మరీచిః+నక్షత్రాణామ్+ | | మరీచిని నేను. నక్షత్రములలో చంద్రుడను నేను |
| శశీ+అహమ్ | | |
| జ్యోతిషామ్+ | = | స్వయం ప్రకాశముగలిగి వెలుగునిచ్చు వాటిలో |
| అంశుమాన్+రవిః+ | | కిరణములుగల సూర్యుడను అయి ఉన్నాను. |
| అస్మి | | |

...... ❖ ❖ ❖ ......

దేవానామ్+ = దేవతలలో ఇంద్రుడను నేను మఱియు
వాసవః+అస్మి+చ

**ప్రాణులలో:**

భూతానామ్+చ+ = ప్రాణులలో చైతన్య స్వరూపమయిన
చేతనా+అస్మి ప్రాణము నేను

**దేహములో:**

ఇన్ద్రియాణామ్+ = జ్ఞానేంద్రియములలో మనస్సు నేను
మనః + అస్మి

**వేదములు:**

వేదానామ్+ = వేదములలో సామవేదము నేను
సామవేదః+అస్మి

రుద్రాణామ్+ = ఏకాదశ రుద్రులలో శంకరుడును నేను
శంకరః+అస్మి

వసూనామ్+పావకః+ = అష్టవసువులలో పావకుడను నేను
అస్మి

చ = మఱియు

యక్షరక్షసామ్+విత్తేశః = యక్షలు, రాక్షసులలో కుబేరుడను నేను

చ = మఱియు

**స్థావరములు అయిన పర్వత శిఖరములలో:**

శిఖరిణామ్+మేరుః = శిఖరములలో మేరువు శిఖరము

అహమ్ = నేను

పార్థ = ఓ అర్జునా!

మామ్+సేనానీనామ్+ = నన్ను సేనాపతులలో కుమారస్వామిని నేను
స్కన్దః

| | | |
|---|---|---|
| పురోధసామ్+ముఖ్యమ్+ బృహస్పతిమ్+విద్ధి | = | పురోహితులలో ముఖ్యుడు అయిన బృహస్పతిని అని తెలియుము |
| చ | = | మఱియు |

**స్థావరములలో:**

| | | |
|---|---|---|
| అహమ్+సరసామ్+ సాగరః+అస్మి | = | నేను సరస్సులలో సాగరమును |

**మహర్షులలో:**

| | | |
|---|---|---|
| మహర్షీణామ్+భృగుః+ అహమ్ | = | మహర్షులలో భృగుమహర్షి నేను |

**పుణ్య కర్మానుష్ఠానములో:**

| | | |
|---|---|---|
| యజ్ఞానామ్+ జపయజ్ఞః+అస్మి | = | యజ్ఞములలో జపయజ్ఞము–నేను |

**ఓంకారము :**

| | | |
|---|---|---|
| గిరామ్+ఏకమ్ + అక్షరమ్+అస్మి | = | వాక్కులలో, శబ్దములలో ఏకాక్షరమైన ఓంకారమును నేను |

**స్థావరములలో:**

| | | |
|---|---|---|
| స్థావరాణామ్+ హిమాలయః | = | స్థావరములలో అనగా పర్వత శ్రేణులలో హిమాలయము నేను |

**ఋషులలో:**

| | | |
|---|---|---|
| దేవర్షీణామ్+నారదః | = | దేవ ఋషులలో నారదుడను నేను |
| చ | = | మఱియు |

**సిద్ధులలో :**

| | | |
|---|---|---|
| సిద్ధానామ్+ కపిలః+మునిః | = | సిద్ధులలో దేవహూతి కర్దములకు జన్మించిన సాంఖ్యయోగమును చెప్పిన కపిలమహర్షిని నేను మఱియు |

**గంధర్వులలో :**

గన్ధర్వాణామ్+చిత్రరథః = గంధర్వులలో చిత్రరథుడను నేను మఱియు

**స్థావరములలో అనగా వృక్షములలో:**

| | |
|---|---|
| సర్వవృక్షాణామ్+అశ్వత్థః = | సర్వ వృక్షములలో అశ్వత్థ వృక్షము (రావిచెట్టును)- నేను. (రావిచెట్టునకే బోధివృక్షము అని పేరు) |
| అశ్వానామ్+గజేన్ద్రాణామ్ = మామ్+అమృతోద్భవమ్+ ఐరావతమ్+ ఉచ్చైఃశ్రవసమ్+విద్ధి+చ | గుఱ్ఱములు, ఏనుగులలో నన్ను పాలసముద్రమథన సమయమున అమృతమునకు ముందు ఉద్భవించిన ఐరావతము అను ఇంద్రుని వాహనమైన ఏనుగుగా, ఉచ్చైశ్రవసము అను గుఱ్ఱముగా గ్రహించుము. మఱియు |
| ధేనూనామ్+కామధుక్+ = అస్మి | ఆవులలో పాలసముద్రము నుండి జనియించిన కామధేనువును నేను |

**మానవులలో:**

| | |
|---|---|
| నరాణామ్+నరాధిపమ్ = | నరులలో రాజును నేను. |
| సర్పాణామ్+వాసుకిః+ = అస్మి | సర్పములలో అమృత మథన సమయమున మందర పర్వతమునకు కవ్వపు త్రాడుగా ఉంచిన వాసుకిని నేను. |
| ప్రజనః+కందర్పః+ = అస్మి | సంతానోత్పత్తికి కారణమైన - సృష్టి కారణమైన మన్మథుడను నేను |

**ప్రాణరహితము అయిన ఆయుధములలో:**

| | |
|---|---|
| ఆయుధానామ్+వజ్రమ్+= అహమ్ | ఆయుధములలో వజ్రాయుధమును నేను |
| యాదసామ్+వరుణః = అహమ్+అస్మి+చ | జల జంతువులకు నివాసమయిన జలాధి దేవతలలో వరుణుడను నేను మఱియు |

| | | |
|---|---|---|
| పితౄణామ్+ | = | పితృ దేవతలలో అర్యముడను నేను |
| అర్యమా + అస్మి | | మఱియు |
| సంయమతామ్+ | = | శాసించు వారిలో అనగా ధర్మమును |
| యమః+అహమ్+చ | | శాసించువారిలో యమధర్మరాజును నేను మఱియు |

**నాగులలో :**

| | | |
|---|---|---|
| నాగానామ్+అనన్తః | = | అనేక శిరస్సులుగల నాగులలో అనంతుడను నేను (ఆదిశేషువు) |

పాల సముద్రములో ఆదిశేషువుపై శ్రీమన్నారాయణుడు యోగ నిద్రలో పవళించి ఉండును.

**దైత్యులలో:**

| | | |
|---|---|---|
| దైత్యానామ్+ | = | దైత్యులలో ప్రహ్లాదుడను నేను మఱియు |
| ప్రహ్లాదః + అస్మి+చ | | |

**గణించువాటిలో కాలము :**

| | | |
|---|---|---|
| కలయతామ్+కాలః+చ | = | గణించు వాటిలో కాలము నేను మఱియు |

**పక్షులలో :**

| | | |
|---|---|---|
| పక్షిణామ్+వైనతేయః+ | = | పక్షులలో వినతా పుత్రుడనయిన |
| అహమ్+చ | | గరుత్మంతుడను నేను మఱియు |

**అధి భౌతికములలో:**

| | | |
|---|---|---|
| మృగాణామ్+ | = | అడవి మృగములలో సింహము నేను |
| మృగేంద్రః+అహమ్ | | |
| పవతామ్+పననః+అస్మి | = | గమనస్వభావముగల వారిలో వాయువును నేను |
| శస్త్ర భృతామ్+రామః+ | = | శస్త్రధారులలో ఇక్ష్వాకు వంశములో దశరథ |
| అహమ్+చ | | తనయుడనైన రాముడు నేను మఱియు |

**నదులలో:**

| | | |
|---|---|---|
| స్రోతసామ్+జాహ్నవీ+ | = | నదులలో గంగానదిని నేను మఱియు |
| చ | | |

**అధిభౌతికము అయిన జలచరములలో:**

| | | |
|---|---|---|
| ఝషాణామ్+ | = | జలచరములలో మొసలి-నేను |
| మకరః+అస్మి | | |
| అర్జున | = | ఓ అర్జునా! |

**విరాట్ పురుషుడు:**

| | | |
|---|---|---|
| సర్గాణామ్+ | = | సృష్టిలో, ప్రతికల్పములోని సృష్టిలో |
| ఆదిః+మధ్యమ్+అన్తః+ | | ఆదిమధ్యాంతములు నేనే మఱియు |
| అహమ్+ఏవ+చ | | |

**విద్యలలో :**

| | | |
|---|---|---|
| విద్యానామ్+ | = | విద్యలలో అధ్యాత్మ విద్య అనగా బ్రహ్మవిద్యను |
| అధ్యాత్మవిద్యా+చ | | నేను మఱియు |

**పూర్వపక్షము సిద్ధాంతములలో :**

| | | |
|---|---|---|
| ప్రవదతామ్+వాదః+ | = | వాద వివాదములలో వాదము అనగా పూర్వపక్షము |
| అహమ్ | | సిద్ధాంతము నేను. |

**ఆత్మస్వరూపమున:**

| | | |
|---|---|---|
| అహమ్+ఏవ+అక్షయః+ | = | నేనే శాశ్వతుడను (జగత్ అశాశ్వతము |
| కాలః | | ఆత్మ శాశ్వతము.) కాలస్వరూపుడను (జీవులకు సుఖదుఃఖములు, జనన మరణములు కాలరూపమున గలుగ చేయుచున్నాను.) |

**విరాట్ పురుషునిగ:**

| | | |
|---|---|---|
| ధాతా+విశ్వతః ముఖః+ అహమ్ | = | పోషించువాడను. అనగా సృష్టి చేయువాడను, పోషించువాడను, లయము చేయువాడను నేను. విశ్వతో ముఖుడ నయిన విరాట్పురుషుడను నేను |

**భాషకు సంబంధించి :**

| | | |
|---|---|---|
| అక్షరాణామ్+అకారః+ అస్మి+చ+సామాసికస్య+ ద్వంద్వః+అస్మి | = | అ నుంచి, హ వఱకు గల అక్షరములలో 'అ' అను అక్షరము-నేను. (అజంతములైన భాషలలో – 'అ' అను అక్షరము హల్లులతో కలసి పలుకబడును.) మఱియు సమాసములలో ద్వంద్వసమాసము నేను |

**హరించువాటిలో :**

| | | |
|---|---|---|
| సర్వహరః+మృత్యుః+ అహమ్ | = | (సర్వము హరించు వానిలో) సర్వ ప్రాణులను చంపునట్టి మృత్యువు నేను |

**విరాట్పురుషునిగ :**

| | | |
|---|---|---|
| భవిష్యతామ్+ఉద్భవః+ చ | = | భవిష్యత్ కాలములో సృష్టిచేయువాడను నేను మఱియు |

అనగా భూతకాలములోని సర్వ స్థావర జంగమములు నేను. వర్తమాన కాలములోని సర్వస్థావర జంగమములు నేను. భవిష్యత్ కాలములోని సర్వస్థావర జంగమములు కూడ నేనే అయి ఉందును.

**స్త్రీలలో :**

| | | |
|---|---|---|
| నారీణామ్+కీర్తిః+ శ్రీః+చ+వాక్ | = | స్త్రీలలో – దక్షప్రజాపతి కుమార్తెలయిన కీర్తి అను ఆమె, శ్రీ అను ఆమె నేను. మఱియు వాక్కు అనగా వాగ్దేవిని నేను |

**భావములలో:**

| | | |
|---|---|---|
| స్మృతిః+మేధా+ ధృతిః+క్షమా | = | జ్ఞాపకశక్తి, తెలివితేటలు ధైర్యము, ఓర్పు నేను |

**కాలము:**

| | | |
|---|---|---|
| ఋతూనామ్+ కుసుమాకరః | = | ఋతువులలో వసంత ఋతువును నేను. (చైత్ర–వైశాఖమాసములు వసంత ఋతువు) |
| మాసానామ్+మార్గశీర్షః అహమ్ | = | మాసములలో మార్గశీర్షమాసము (ఋతువులుగా చెప్పినదానికి, మాసములుగా చెప్పినదానితోగల భేదము గమనించవలయును) నేను |
| తథా | = | అటులనే |

**సామములలో :**

| | | |
|---|---|---|
| సామ్నామ్+బృహత్సామ | = | సామములలో (రథంతర సామము, వైరూప సామము, బృహత్ సామములలో) బృహత్ సామము నేను |

**ఛందస్సులలో :**

| | | |
|---|---|---|
| ఛందసామ్+గాయత్రీ+ అహమ్ | = | ఛందస్సులలో (ఉష్ణిక–త్రిష్టుప్ –అనుష్టుప్– జగతీ –పంక్తి – బృహతీ – గాయత్రీ) గాయత్రీ ఛందస్సు నేను |

**గుణములు:**

| | | |
|---|---|---|
| సత్త్వవతామ్+సత్త్వమ్+ అహమ్ | = | సత్త్వాది భావములలో సత్త్వ భావము అనగా సత్త్వగుణము నేను (బలవంతులలోని బలము నేను) |
| తేజస్వినామ్+తేజః+ అహమ్ | = | తేజోవంతులలోని తేజము నేను |

**జయాపజయములలో:**

| | | |
|---|---|---|
| జయః + అస్మి | = | జయము నేను |

**వృత్తులలో :**

| | | |
|---|---|---|
| వ్యవసాయః + అస్మి | = | వ్యవసాయము నేను |

**చెడ్డవాటిలో:**

| | | |
|---|---|---|
| ఛలయతామ్+ద్యూతమ్+ అహమ్ | = | వంచకులలో జూదము నేను |

**కవులలో :**

| | | |
|---|---|---|
| కవీనామ్+ఉశనా+ కవిః | = | కవులలో శుక్రాచార్యుడను నేను. దేవతల గురువు బృహస్పతిని నేను, అటులనే రాక్షసుల గురువు శుక్రాచార్యుడను నేను. |

**వర్తమానములో, వృష్ణి వంశజులలో:**

| | | |
|---|---|---|
| వృష్ణీనామ్+వాసుదేవః+ అస్మి | = | యాదవులలో ఒక తెగ అయిన వృష్ణి వంశజులలో వాసుదేవుడను నామాంతరముగల కృష్ణుడను నేను |

**చంద్రవంశములో:**

| | | |
|---|---|---|
| పాండవానామ్+అపి+ ధనంజయః | = | పాండవులలో కూడ ధనంజయుడను నామాంతరముగల అర్జునుడను నేను. |

ఇక్కడ పాండవులలో నీవు అని సర్వనామము చెప్పక వ్యక్తి వాచకమైన ధనంజయుడను అని చెప్పబడినది.

**మునులలో :**

| | | |
|---|---|---|
| మునీనామ్+వ్యాసః+ అహమ్ | = | మునులలో వ్యాసభగవానుడు నేను |

**జ్ఞానవంతులలో :**

| | | |
|---|---|---|
| జ్ఞానవతామ్+జ్ఞానమ్+ ఏవ+అహమ్ | = | జ్ఞానవంతులలో జ్ఞానము నేను |
| దమయతామ్+దండః+ అస్మి | = | దండించువారిలో ప్రజలను దండించువారిలో అనగా రాజులలో రాజదండము దుష్టులను శిక్షించు దండము నేను |
| జిగీషితామ్ | = | అటులనే జయమును పొందగోరు వారిలో జయమును నేను. |

**నీతి–అవినీతులలో:**

| | | |
|---|---|---|
| నీతిః+అస్మి | = | నీతిని నేను |

**రహస్యములలో :**

| | | |
|---|---|---|
| గుహ్యానామ్ | = | రహస్యములలో అతిరహస్యము నేను |

**యోగసాధనలలో :**

| | | |
|---|---|---|
| చ+మౌనం+అస్మి | = | మఱియు మౌనము నేను. అనగా మనస్సు మూగబోయిన స్థితిని నేను. |
| అర్జున+సర్వభూతానామ్+ బీజమ్+అహమ్ | = | ఓ అర్జునా! సృష్టి విషయములో సర్వభూతములకు బీజము నేను అటులనే |
| యత్+తత్+అపి+చ | = | దేనివలన ఉపాధులు కల్పింపబడునో ఆ క్షేత్రము నేను. క్షేత్రము అయిన ప్రకృతిని నేను. బీజము అయిన పురుషుడను నేను. అనగా క్షేత్రము నేనే, బీజము నేనే. ప్రకృతి నేనే, పురుషుడు నేనే. అందువలన, |
| చరాచరమ్+భూతమ్+ యత్+తత్ | = | సర్వ స్థావర జంగమములు, విరాట్‌పురుషునిగా నేనే. ఏది బాహ్యచక్షువులకు గోచరమో 'యత్ |

| | | |
|---|---|---|
| | | కించత్ దృశ్యతే – శ్రూయతే అపి' – ఏది కన్నులకు కనబడుచున్నదో అనగా రూపము, ఏది చెవులకు వినబడుచున్నదో అనగా సర్వ శబ్దములు నేను |
| మయా+వినా+స్యాత్+ న+అస్తి | = | ఆత్మస్వరూపమున అంతర్యామిగా నేను లేకుండా ఈ విశ్వము ఎట్లు స్థితి కలిగివుండును. అనగా అంతర్యామియైన ఆత్మ లేనిచో ఈ విశ్వము మఱియు దేహము నశించును. |

**వ్యాఖ్యానము:-** ప్రకృతికి పరుడై, ఒక్కడై, ఉన్న ఆత్మ ప్రకృతిలో అనగా సృష్టిలో, అవతరించి భిన్నమూర్తులయినది. సర్వస్థావర జంగమ రూపములు అతడే. దేవ,రాక్షస, మానవ, పశు పక్ష్యాది రూపములు, నదులు, కొండలు మొదలయిన స్థావరములు అతడే. అతడే విరాట్ పురుషుడు. అందువలన అతని అవతారములు అనంతములు.

ఈ ద్వాదశ ఆదిత్యులలో మత భేదము కలదు.

| **భారతము** | **భాగవతం** | **అమరకోశము** |
|---|---|---|
| ధాత | ధాత | ధాత |
| మిత్రుడు | మిత్రుడు | మిత్రుడు |
| అర్యముడు | అర్యముడు | అర్యముడు |
| శుక్రుడు | శుక్రుడు | శుక్రుడు |
| వరుణుడు | వరుణుడు | వరుణుడు |
| అంశుమంతుడు | – | అంశుమంతుడు |
| భాగుడు | భాగుడు | భాగుడు |
| వివస్వంతుడు | వివస్వంతుడు | వివస్వంతుడు |
| పూషుడు | పూషుడు | పూషుడు |
| త్వష్ట | త్వష్ట | త్వష్ట |
| సవిత | సవిత | |
| విష్ణువు | – | విష్ణువు |
| – | విధాత | – |
| – | ఉరుక్రముడు | – |
| – | – | ఇంద్రుడు |

**ఏకాదశరుద్రులు :**

| భారతం | భాగవతం | అమరకోశము |
|---|---|---|
| మృగవ్యాధ | మన్యువు | అజుడు |
| శర్వ | మనువు | – |
| నిరృతి | మహాకాలుడు | – |
| అజుడు | మహాశివుడు | త్వష్ట |
| ఏకపాదుడు | – | ఏకపాదుడు |
| – | ఋతధ్వజుడు | – |
| అహిర్బుధ్య | – | అహిర్బుధ్న్యుడు |
| పినాకి | కాలుడు | శంభుడు |
| దహనేశ్వర | వామదేవుడు | త్ర్యంబకుడు |
| కపారి | ధృతవ్రతుడు | అపరాజితుడు |
| స్థాణువు | – | ఈశానుడు |
| – | రుద్రుడు | రుద్రుడు |
| భవుడు | భవుడు | – |
| – | – | త్రిభువనుడు |
| – | – | హరుడు |
| – | అమనేత్రుడు | – |

నరులలో రాజును అని చెప్పిన విషయమును సరిగా గ్రహించక పృథుచక్రవర్తి తండ్రి అయిన వేనుడు అనువాడు. సర్వ దేవతాస్వరూపుడు రాజు కావున. నన్నే పూజింపుడని ప్రజలకు చెప్పెను. దీని అర్థము బ్రాహ్మణులు వివరించినను వినక నశించిపోయినాడు.

దధీచి దేవతల మాటపై దేహ త్యాగముచేయగా, అతని వెన్నెముకతో వజ్రాయుధము తయారయినది. ఇంద్రుడు ఈ ఆయుధముచే వృత్రాసురుని సంహరించినట్లు కథ గలదు.

| | | |
|---|---|---|
| ఇంద్రుడు | - | జీవుడు, |
| వృత్రాసురుడు | - | జన్మపరంపరలు, |
| వెన్నెముక | - | బ్రహ్మదండి, సుషుమ్నా మార్గము, ఆకాశ మార్గము. |

ఈ మార్గమున పయనించిన వాడే అహంకార ఆవరణను దాటి, మహత్‌ను దర్శించి, ప్రకృతిని వీడి, ఆనందమయుండై బ్రహ్మమందు కలియును.

...... ❖ ❖ ❖ ......

ముగింపు

**నాంతోఽస్తి మమ దివ్యానాం । విభూతీనాం పరన్తప ।**
**ఏష తూద్దేశతః ప్రోక్తో । విభూతేర్విస్తరో మయా ॥ 40**

న - అంతః - అస్తి - మమ - దివ్యానామ్ - విభూతీనామ్ - పరన్తప
ఏషః - తు - ఉద్దేశతః - ప్రోక్తః - విభూతేః - విస్తరః - మయా

**యద్యద్విభూతి మత్సత్త్వం । శ్రీ మదూర్జితమేవ వా ।**
**తత్తదేవావగచ్ఛ త్వం । మమ తేజోఽంశ సమ్భవమ్ ॥ 41**

యత్-యత్- విభూతిమత్-సత్త్వమ్- శ్రీ మత్ - ఊర్జితమ్ - ఏవ - వా
తత్ - తత్ - ఏవ - అవగచ్ఛ - త్వమ్- మమ - తేజః అంశ సంభవమ్

**అథవా బహునైతేన । కిం జ్ఞాతేన తవార్జున ।**
**విష్టభ్యాహ మిదం కృత్స్నమ్ । ఏకాంశేన స్థితో జగత్ ॥ 42**

అథ వా - బహునా - ఏతేన - కిమ్ - జ్ఞాతేన - తవ - అర్జున
విష్టభ్య - అహమ్ - ఇదమ్ - కృత్స్నమ్ - ఏకాంశేన - స్థితః - జగత్

| | | |
|---|---|---|
| పరన్తప | = | ఓ అర్జునా! ఇంతవఱకు |
| మయా+విభూతేః+ | = | నాచేత అవతారములయొక్క ఈ విస్తారము |
| ఏషః+విస్తరః+ | | సంక్షిప్తముగా చెప్పబడినది |
| ఉద్దేశతః+ప్రోక్తః | | |

| | | |
|---|---|---|
| మమ+తు+దివ్యానామ్+ | = | నాయొక్క భూత, భవిష్యత్, వర్తమాన |
| విభూతీనామ్+అంతః+ న+అస్తి | = | కాలములలో బ్రహ్మయొక్క ప్రతి పగటి కాలములో ధరియించిన దివ్యములైన, దేవతా సంబంధము లైన, శ్రేష్ఠములైన వాటికి అంతము లేదు. సర్వజీవరాసులు నేనే కావున నా అవతారములకు అంతము లేదు |

**అర్జునా ఈ విశ్వమంతా --**

| | | |
|---|---|---|
| యత్+యత్+ఊర్జితమ్+ సత్త్వమ్+ఏవ+వా శ్రీమత్+విభూతిమత్ | = | ఏవేవి శక్తి, బలము కలవి లేక శుభకరము, కీర్తివంతము అయినవో |
| తత్+తత్+త్వమ్+ మమ+ తేజఃఅంశసంభవమ్+ ఏవ+అవగచ్ఛ | = | వాటిని నీవు నాయొక్క తేజోభాగ సంభవమయిన వానినిగా గ్రహింపుము |
| అర్జున | = | ఓ అర్జునా! |
| ఇదమ్+జగత్+ కృత్స్నమ్+అహమ్+ ఏకాంశేన+విష్టభ్య+ స్థితః | = | ఈ జగత్తు సర్వము నేను. నా నాలుగు అంశలలో ఒక్క అంశతోనే ధరించి ఉన్నాను |

"పాదోస్య విశ్వా భూతాని – త్రిపాదూర్ధ్వ ఉత్తై పురుషః" (శ్రుతి) అనగా ఈ సృష్టి అంతా పరమపురుషునిలోని ఒక భాగము. మిగిలిన మూడు భాగములతో పరమపురుషుడు తమస్సుకు ఆవల ఉండును.

| | | |
|---|---|---|
| అథ+ఏతేన+బహునా+ జ్ఞాతేన+తవ+వా+కిమ్ | = | ఆ తర్వాత ఈ విధముగా అవతార విశేషములు ఎక్కువగా గ్రహించుటవలన నీకు ప్రజ్ఞానం బ్రహ్మ అనగా సర్వమూ అతడే అని సర్వము అతడు కాడనే |

విషయము తెలియును ఇంతకు మించిన ప్రయోజనము ఏమి ఉన్నది? అనగా సర్వమూ అతడే అని సర్వము అతడు కాదని గ్రహించుటయే దీని ప్రయోజనము.

**సమస్తంబుఁ గాకయు నయ్యు నుండు వస్తు వెఱుఁగంగఁదగు భాగవతము నందు** అని ఆత్మ గుఱించి, విరాట్‌పురుషుని గుఱించి చెప్పబడినది.

(భాగవతము-ప్రథమస్కంధం-36)

1. **నాచేత ఎట్లు ధ్యానింపదగినవాడవు అగుచున్నావు?**
2. **చరాచరజగత్తు అంతా విరాట్ పురుషుడయినప్పుడు ఈ సృష్టిలో అతని విభూతులు ఎట్లు తెలుసుకొందును?**
3. **సర్వభావములు విరాట్‌పురుషునివలన గలిగినప్పుడు ఏయే భావములందు నీవుగలవని గ్రహించుట?**
4. **ఆత్మగా ఎల్లప్పుడు ధ్యానము చేయుచూ నిన్ను గ్రహించినచో గలుగు ఫలితమేమి?**

ఈ ప్రశ్నలకు ఈ అధ్యాయములో సూటిగా సమాధానము చెప్పబడలేదు. అయిననూ సంధిసమాస రూపమున సమాధానము గ్రహించవలసివుండును. 1వ ప్రశ్నకు సమాధానముగా ఐతరేయ ఉపనిషత్తులో చెప్పినట్లు ఆత్మరూపమున, ఆదిపురుషుని రూపమున పరమాత్మను ధ్యానించవలయును. 2వ ప్రశ్నకు సమాధానముగా అధిదైవికములలో, అధిభౌతికములలోగల శ్రేష్ఠమైనవి విరాట్‌యొక్క విభూతులుగా గ్రహించవలయును. 3వ ప్రశ్నకు సమాధానముగా సర్వభావములు విరాట్‌వలన కలిగిననూ సత్త్వగుణభావములు విభూతులుగా గ్రహించవలయును. 4వ ప్రశ్నకు సమాధానముగా జన్మరాహిత్యమే ఫలమని గ్రహించవలయును. అధిభౌతిక రూపములయిన సింహము, మొసలి మొ॥ విరాట్‌యొక్క విభూతులుగా గ్రహించవలయునే తప్ప ఇంటిలోనికి తెచ్చుకొని పూజింపరాదు.

...... ❖ ❖ ❖ ......

ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము 35వ అధ్యాయము

## (విశ్వరూపసందర్శన యోగము)

ఈ అధ్యాయములో గతములో శాస్త్రపాఠముగా విరాడ్రూపమును చెప్పినదానికి స్వానుభవములో దర్శించుటకు జ్ఞాననేత్రమును శ్రీకృష్ణుడు ప్రసాదించినాడు. విరాట్పురుషుడు ఈ సర్వమును (సృష్టి) సృజియించెను. ఆ రూపము మనోహరము. ఈ సర్వవిశ్వమును (స్థితి) తన దేహమున ధరించెను. అదియూ మనోహరమే. కాలరూపమున (లయము) సర్వమునూ లయము చేయుచున్నాడు. ఈ రూపము సామాన్యులకు భయమును కలిగించును. ఆవిధముగా విరాట్ గుటించిన సృష్టి,స్థితి,లయముల రూపములలో లయరూపమైన కాలునిరూపము ఇందు చెప్పబడినది. అటులనే అర్జునుడు యుద్ధములో ఎవరు జయించెదరు అన్న ప్రశ్నకు సమాధానము చెప్పబడినది.

అర్జున ఉవాచ

అర్జునుడు చెప్పుచున్నాడు

**మదనుగ్రహాయ పరమం । గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్ ।**

**యత్త్వయోక్తం వచస్తేన । మోహోఽయం విగతోమమ ॥ 1**

మదనుగ్రహాయ- పరమమ్- గుహ్యమ్- అధ్యాత్మసంజ్ఞితమ్

యత్-త్వయా-ఉక్తమ్-వచః-తేన- మోహః-అయమ్-విగతః-మమ

**భవాప్యయౌ హి భూతానాం । శ్రుతౌ విస్తరశోమయా ।**

**త్వత్తః కమలపత్రాక్ష । మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥ 2**

భవాప్యయౌ - హి - భూతానామ్ - శ్రుతౌ - విస్తరశః - మయా

త్వత్తః - కమలపత్రాక్ష - మాహాత్మ్యమ్ - అపి - చ - అవ్యయమ్

**ఏవమేతద్యథాత్థ త్వమ్ । ఆత్మానం పరమేశ్వర ।**
**ద్రష్టుమిచ్ఛామి తే రూపమ్ । ఐశ్వరం పురుషోత్తమ ॥ 3**

ఏవమ్ - ఏతత్ - యథా - అత్థ - త్వమ్ - ఆత్మానమ్ - పరమేశ్వర
ద్రష్టుమ్ - ఇచ్ఛామి - తే - రూపమ్ - ఐశ్వరమ్ - పురుషోత్తమ

**మన్యసే యది తచ్ఛక్యం । మయా ద్రష్టుమితి ప్రభో ।**
**యోగేశ్వర తతో మే త్వం । దర్శయాత్మానమవ్యయమ్ ॥ 4**

మన్యసే - యది - తత్ - శక్యమ్ - మయా - ద్రష్టుమ్ - ఇతి - ప్రభో
యోగేశ్వర - తతః - మే - త్వమ్ - దర్శయ - ఆత్మానమ్ - అవ్యయమ్

| | | |
|---|---|---|
| మదనుగ్రహాయ+ | = | నన్ను అనుగ్రహించుట కొఱకు మిక్కిలి |
| పరమమ్+గుహ్యమ్+ | | రహస్యమయిన ఈ అధ్యాత్మ విషయములు |
| అయమ్+అధ్యాత్మ-సంజ్ఞితమ్ | | అనగా ఆత్మతత్త్వముగా |
| యత్ వచః+ఉక్తమ్+ | = | ఏ వాక్యములు అనగా ఏ విషయములు |
| తేన+మమ+ | | చెప్పబడినవో ఆ మాటలచే నా యొక్క |
| మోహః+విగతః | | మోహము తొలగిపోయినట్లుగా ఉన్నది. |

శాస్త్ర విషయములు విన్నంత మాత్రమున మోహము తొలగదు. సాధనవలన జ్ఞానము కలిగినగాని మోహము పోదు. లేదా భగవంతుడే స్వయముగా మోహమును తొలగించవలయును. భీష్మపర్వంలో ఇరావంతుడు అలంబసునిచే చనిపోయెనని భీముడు చెప్పగా ఇరావంతుడు పడిపోయిన ప్రదేశమునకు వెళ్ళి అర్జునుడు దుఃఖములో మునిగిపోయినాడు.

| | | |
|---|---|---|
| కమలపత్రాక్ష+త్వత్తః+ | = | ఓ శ్రీకృష్ణా! నీ వలన శాశ్వతమయిన ఆత్మయొక్క |
| అవ్యయమ్+ | = | మాహాత్మ్యము విరాట్‌పురుషుని గుఱించి వింటిని |

| | | |
|---|---|---|
| మాహాత్మ్యమ్+హి+చ | | మఱియు విరాట్‌పురుషునిచే చేయబడిన |
| భూతానామ్+ | = | సర్వప్రాణులయొక్క సృష్టి స్థితి లయములు |
| భవాప్యయౌ+అపి+ | | విస్తారముగా నా చేత వినబడినవి. |
| విస్తరశః+మయా+శ్రుతౌ | | |

విరాట్ స్వరూపమును, బాహ్య చక్షువులచే గాక జ్ఞాన నేత్రముచే, భగవత్ కృపచే సాధకుడు దర్శించగలడు. అప్పుడు శాస్త్ర పాఠము అనుభవమునకు వచ్చి సర్వసంశయములు తొలగును.

| | | |
|---|---|---|
| పరమేశ్వర | = | ఓ శ్రీకృష్ణా! |
| త్వమ్+ఆత్మానమ్+ | | మీరు మీ గుఱించి అనగా ఆత్మ గుఱించి, విరాట్ |
| యథా+అత్థ | | పురుషుని గుఱించి ఏవిధముగా చెప్పియుంటిరో, ఇది అంతయు సత్యమే |
| పురుషోత్తమ | = | ఓ శ్రీకృష్ణా! |
| ఏవమ్+తే+ఏతత్+ | = | నీవు ఏవిధముగా చెప్పితివో ఆ విధముగనే |
| ఐశ్వరమ్+రూపమ్+ | | నీ యొక్క ఈ విరాట్ రూపమును |
| ద్రష్టుమ్+ఇచ్ఛామి | | చూచుటకు కోరుచున్నాను. |
| ప్రభో | = | శ్రీకృష్ణా! |
| అవ్యయమ్+తత్ + | = | శాశ్వతమైన విరాట్‌పురుష రూపమును నా చేత |
| మయా+ద్రష్టుమ్+ | | చూచుటకు సాధ్యపడును అని మీరు |
| శక్యమ్+ఇతి+మన్యసే+ | | భావించితిరేని |
| యది | | |
| యోగేశ్వర+తతః+మే+ | = | ఓ శ్రీకృష్ణా! అప్పుడు నాకు మీరు మీ యొక్క |
| త్వమ్+ఆత్మానమ్+ | | విరాట్‌రూపమును చూపించుము అని అర్జునుడు |
| దర్శయ | | ప్రార్థించినాడు |

...... ❖ ❖ ❖ ......

శ్లోకం 5 నుంచి 8 వఱకు శ్రీకృష్ణుడు అర్జునునితో
విరాట్ స్వరూపమును చూడుము అని చెప్పను.

శ్రీ భగవానువాచ :

**పశ్య మే పార్థ రూపాణి । శతశోఽథ సహస్రశః ।**
**నానా విధాని దివ్యాని । నానావర్ణా కృతీని చ ॥ 5**

పశ్య – మే – పార్థ – రూపాణి – శతశః – అథ – సహస్రశః
నానా విధాని – దివ్యాని – నానా వర్ణా కృతీని – చ

**పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రాన్ । అశ్వినౌ మరుతస్తథా ।**
**బహూన్యదృష్టపూర్వాణి । పశ్యాశ్చర్యాణి భారత ॥ 6**

పశ్య – ఆదిత్యాన్ – వసూన్ – రుద్రాన్ – అశ్వినౌ – మరుతః – తథా
బహూని – అదృష్ట పూర్వాణి – పశ్య – ఆశ్చర్యాణి – భారత

**ఇహైకస్థం జగత్కృత్స్నం । పశ్యాద్య సచరాచరమ్ ।**
**మమ దేహే గుడాకేశ । యచ్చాన్య ద్రష్టు మిచ్ఛసి ॥ 7**

ఇహ – ఏకస్థమ్ – జగత్ – కృత్స్నమ్ – పశ్య – అద్య – సచరాచరమ్
మమ – దేహే – గుడాకేశ – యత్ – చ – అన్యత్ – ద్రష్టుమ్ – ఇచ్ఛసి

**న తు మాం శక్యసే ద్రష్టుమ్ । అనేనైవ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥ 8**

న – తు – మామ్ – శక్యసే – ద్రష్టుమ్ – అనేన – ఏవ – స్వచక్షుషా
దివ్యమ్ – దదామి – తే – చక్షుః – పశ్య – మే – యోగమ్ – ఐశ్వరమ్

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| మే+ | = | నా యొక్క దివ్యములైన దేవతారూపములను, |
| దివ్యాని+చ+ | | మఱియు బాహ్యదృష్టిచే చూడబడు అనేక |
| నానావిధాని+అథ+ | | విధములను, అనేక వర్ణములు, అనేక రూపములు |
| నానావర్ణాకృతీని+ | | కలిగిన అనంతమైన స్థావరజంగమరూపములను |
| శతశః+సహస్రశః+ | | చూడుము |
| రూపాణి+పశ్య | | |
| భారత | = | ఓ అర్జునా! |
| బహూని+ఆశ్చర్యాణి+ | = | అనేకములను ఆశ్చర్యమును గలిగించునవియు |
| అదృష్ట పూర్వాణి+ | = | ఇంతకు పూర్వము చూడనివియు దేవతా |
| ఆదిత్యాన్+రుద్రాన్+ | = | రూపములు అయిన ద్వాదశ ఆదిత్యులను, |
| తథా+వసూన్+మరుతః+ | = | ఏకాదశ రుద్రులను, అష్టవసువులను, |
| అశ్వినౌ+పశ్య | | సప్త మరుత్తులను అశ్వినీ దేవతలను అట్లే చూడుము. |
| గుడాకేశ | = | ఓ అర్జునా! |
| అద్య+సచరాచరమ్+ | = | ఇప్పుడు సమస్తమైన ఈ స్థావర జంగమాత్మకమైన |
| కృత్స్నమ్+జగత్+చ | | జగత్తును (బ్రహ్మాండములో బాహ్యదృష్టితో నీవు |
| యత్+అన్యత్+ | | చూచినవి) మఱియు ఏవి ఇంతకు పూర్వము |
| ద్రష్టుమ్+ఇచ్ఛసి | | చూడనివి, చూడాలని కోరుచున్నావో ఆ దేవతా |
| | | రూపములను, వాటి నన్నింటిని |
| ఏకస్థమ్+మమ+దేహే+ | = | ఒకే చోట అనగా నాయొక్క ఈ విరాట్ |
| ఇహ+పశ్య+ | | దేహమునందు ఇక్కడ చూడుము. |

ఇట్టి విరాట్ రూపమును శ్రీకృష్ణుడు యశోదకు, రాయబార సమయమున ధృతరాష్ట్రాదులకు చూపెను.

| | | |
|---|---|---|
| అనేన+స్వచక్షుషా+ఏవ | = | ఈ నీ బాహ్యనేత్రములచే నన్ను అనగా |
| మామ్+ద్రష్టుమ్+ | | విరాట్‌రూపమును చూచుటకు సమర్థుడవు కావు. |
| న+శక్యసే+ | | కావున |
| దివ్యమ్+చక్షుః+ | = | దివ్యదృష్టిని అనగా జ్ఞాననేత్రమును నీకు |
| తే+దదామి | | ప్రసాదించుచున్నాను. |
| మే+ఐశ్వరమ్+ | = | నా యొక్క దివ్యమైన యోగమహిమను |
| యోగమ్+పశ్య+తు | | దివ్యనేత్రములతో చూడుము |

**వ్యాఖ్యానము:-** అధిభౌతికములయిన సర్వ స్థావర జంగమములను చూచుటకు బాహ్యనేత్రములు చాలును, కాని అవి విరాట్‌పురుషుని దేహమునందు ఉన్నవని, అనగా రథచక్రపు నాభిలో రథ చక్రపు ఆకులు అమరియున్నట్లు ఉన్నవని గ్రహించుట ప్రజ్ఞ. వీటిని ప్రజ్ఞా నేత్రముతో చూడవలయును. ఇదియే ప్రజ్ఞానం బ్రహ్మ. సర్వము విరాట్‌స్వరూపముగా భావించుటయే ప్రజ్ఞ. అధిదైవికమైన దేవతా రూపమును చూచుటకు తపస్సు కావలయును. ప్రజ్ఞా నేత్రము లేక జ్ఞాన నేత్రముతో ఈ దేవతా రూపములను చూడగలము.

సద్గురువు శిష్యునకు శాస్త్రపాఠమును బోధించి, దాని అనుభవ పాఠమును కూడా బోధించును. ద్రష్ట – జీవుడు. దృశ్యము నానా స్థావర జంగమాత్మకము. ఈ స్థావర జంగమములు బాహ్య దృష్టికి గోచరించును. వీటిలో వైవిధ్యమున్నది. ఆవులో సౌమ్యత, పులిలో క్రౌర్యము, పాములో విషము కక్కేగుణము (పగ), ఇలా భిన్నత్వము గోచరిస్తుంది. వీటి రూపములు వేఱు, నామములు వేఱు. గుణములు వేఱు. భావములు వేఱు. ఏనుగుయొక్క రూపము వేఱు. ఎలుకయొక్క రూపము వేఱు. మానవుల రూపము వేఱు, మర్కటముయొక్క రూపము వేఱు. ఈ విధముగా నామ, రూప, గుణములలో భేదమున్నది. ఇలా నానాత్త్వము గోచరించుచున్నది. అటువంటి నామ–రూప–గుణాత్మకమయిన ఈవిశ్వమును, విరాట్‌పురుషునిగా దర్శించవలయుననగా ఈ భిన్నత్వము పోవలయునన్న అంతఃకరణము నశించవలయును.

సాధకుడు ఇంద్రియములను, చిత్తమును గెలువవలయును. అరిషడ్వర్గములను జయించవలయును. (అప్పుడే ద్రష్ట ఒక్కడే మిగిలి దృశ్యము నశించుతుంది. దీనికి జ్ఞాననేత్రము కావాలి). అప్పుడు జ్ఞాననేత్రముతో ఈ విశ్వమును విరాట్ పురుషునిగా దర్శించగలము. దీనినే ప్రజ్ఞానం బ్రహ్మ అని అందురు. మొదట తమోగుణము, రజోగుణము నశించవలయును. సత్త్వగుణము గలిగి యుండవలయును. కావున నిశ్చల సమాధిలో తన హృదయ గుహలో గల ఆత్మను దర్శించవలయును. ఇట్టి నిశ్చల సమాధిని పొందక అద్వైతాను సంధానముచేసిన ఉభయ భ్రష్టుడగును అన్నది నారదమహర్షి భావన.

విశ్వమును బాహ్యచక్షువులతో దర్శించిన భిన్నత్వము గోచరించును. ప్రజ్ఞానం బ్రహ్మగా చెప్పబడే ఈ సర్వమును ప్రజ్ఞానేత్రముతోనే దర్శించవలయును. **"యెందాఁక జీవుండు స్వతంత్రుం డయిన యీశ్వరుండు గాకుండు నంతదడవు నంగన యిది, పురుషుండ నే ననియెడి బుద్ధి మానుట కర్తవ్యంబు గాదు, బ్రహ్మచారి యతిగృహస్థులందెవ్వఁడైనఁ జిత్తంబు పరిపక్వంబుగాక యద్వైతానుసంధానంబు సేసిన మూఢుండగుం"**(భాగవతము - సప్తమస్కంధం - 423 అనగా ఆత్మస్వరూపుడైనవాడే అద్వైతభావనకు అర్హుడు. అలా ఆత్మస్వరూపుడు కాని స్థాయిలో అద్వైతానుసంధానము చేసినవాడు మూర్ఖుడు.)

ఈ జ్ఞాన నేత్రమునే ఉపనయనముగా వ్యవహరించిరి. ఈ ఉప-నయనము ద్వారా విరాట్‌దేహముగా చెప్పబడే గాయత్రిని, ఆ దేహములోగల పురుషుడయిన ఆదిత్యునిగా చెప్పబడే ఆత్మను దర్శించవలయును. అప్పుడు బ్రాహ్మణత్వము సిద్ధించును. అలా బ్రాహ్మణత్వము పొందిన బ్రహ్మర్షులు పూజనీయులు.

...... ❖ ❖ ❖ ......

సంజయ ఉవాచ

**ఏవ ముక్త్వా తతో రాజన్ । మహాయోగేశ్వరో హరిః ।**
**దర్శయామాస పార్థాయ । పరమం రూపమైశ్వరమ్ ॥ 9**

ఏవమ్ – ఉక్త్వా – తతః – రాజన్ – మహాయోగేశ్వరః – హరిః
దర్శయామాస – పార్థాయ – పరమమ్ – రూపమ్ – ఐశ్వరమ్

**అనేక వక్త్రనయనమ్ । అనేకాద్భుతదర్శనమ్ ।**
**అనేకదివ్యా భరణం । దివ్యానేకోద్యతాయుధమ్ ॥ 10**

అనేకవక్త్రనయనమ్ – అనేక – అద్భుత – దర్శనమ్
అనేకదివ్యాభరణమ్ – దివ్య – అనేక – ఉద్యత – ఆయుధమ్

**దివ్యమాల్యామ్బరధరం । దివ్య గన్ధాను లేపనమ్ ।**
**సర్వాశ్చర్యమయం దేవ । మనన్తం విశ్వతోముఖమ్ ॥ 11**

దివ్య మాల్యామ్బర ధరమ్ – దివ్య గన్ధానులేపనమ్
సర్వాశ్చర్యమయమ్ – దేవమ్ – అనన్తమ్ – విశ్వతో – ముఖమ్

**దివి సూర్యసహస్రస్య । భవేద్యుగపదుత్థితా ।**
**యది భాస్సదృశీ సా స్యాత్ । భాసస్తస్య మహాత్మనః ॥ 12**

దివి – సూర్య సహస్రస్య – భవేత్ – యుగపత్ – ఉత్థితా
యది – భాః – సదృశీ – సా – స్యాత్ – భాసః – తస్య – మహాత్మనః

**తత్రైకస్థం జగత్ కృత్స్నం । ప్రవిభక్తమనేకధా ।**
**అపశ్యద్దేవ దేవస్య । శరీరే పాణ్డవస్తదా ॥ 13**

తత్ర – ఏకస్థమ్ – జగత్ – కృత్స్నమ్ – ప్రవిభక్తమ్ –అనేకధా
అపశ్యత్ – దేవ దేవస్య – శరీరే – పాండవః – తదా

**తతః స విస్మయావిష్టో । హృష్టరోమా ధనంజయః ।**
**ప్రణమ్య శిరసా దేవం । కృతాంజలిరభాషత ॥ 14**

తతః - సః - విస్మయాః - ఆవిష్టః - హృష్టరోమా - ధనంజయః
ప్రణమ్య - శిరసా - దేవమ్ - కృతాంజలిః - అభాషత

రాజన్ = ఓ ధృతరాష్ట్ర మహారాజా!

మహాయోగేశ్వరః+ = మహాయోగేశ్వరుడయిన శ్రీకృష్ణుడు ఈ విధముగా
హరిః+ఏవమ్+ఉక్త్వా+ పలికి అటు పిమ్మట
తతః

పార్థాయ+పరమమ్+ = అర్జునుని కొఱకు జ్ఞాననేత్రమును ప్రసాదించి
ఐశ్వరమ్+రూపమ్+ దివ్యమయిన ఈశ్వరసంబంధమైన రూపమును
దర్శయామాస అనగా విరాట్ రూపమును చూపెను.

అర్జునుడు ఆ విరాట్ రూపమును చూచుచున్నాడు.

అనేక దివ్య+ఆభరణమ్+ = అనేకములైన అనగా వివిధములైన దివ్య
అనేక+దివ్య+ఉద్యత+ ఆభరణములు కలదియు, వివిధములైనవి
ఆయుధమ్+ ఎత్తబడినవి అయిన అనేక దివ్యములైన
అనేక అద్భుత దర్శనమ్+ ఆయుధములు ధరించినదియు పెక్కు అద్భుత
అనేక వక్త్రనయనమ్ దృశ్యములను కలిగి యున్నదియు, అసంఖ్యాకమైన
ముఖములు, నేత్రములు కలదియు,

అనన్తమ్+ = ఆది-మధ్య-అంతము రహితమైనదియు, దివ్య
సర్వ ఆశ్చర్యమయమ్+ తేజస్సుతో ప్రకాశించుచున్నదియు, చూపరులకు
దివ్య గన్ధాను లేపనమ్+ మిక్కిలి ఆశ్చర్యమును గలుగ చేయునదియు, దివ్య
దివ్య మాల్యామ్బరధరమ్+ పరిమళముతో కూడిన గంధమును పైపూతగా
పూసుకొన్నదియు, దివ్య పరిమళముతో కూడిన
మాలలు, దివ్య వస్త్రములు ధరించినదియు

| | | |
|---|---|---|
| విశ్వతః ముఖమ్ | = | అసంఖ్యాకములయిన ముఖములు కలదియు, |
| యది+యుగపత్+<br>సూర్య సహస్రస్య+<br>భాః+దివి+ఉత్థితా+<br>భవేత్ | = | ఒకవేళ ఒక్కసారి వేలకొలది సూర్యుల యొక్క కాంతి ఆకాశమునందు ఉదయించినచో |
| సా+తస్య+మహాత్మనః+<br>భాసః+సదృశీ+స్యాత్ | = | కన్నులు మిఱుమిట్లుగొలుపు ఆకాంతి ఆ విరాట్‌పురుషుని యొక్క కాంతికి సమానమైనది అగును. అనగా ఆ విరాట్‌రూపము అత్యంత తేజోవంతమైనది అని అర్థము. |
| తదా+దేవ దేవస్య+<br>తత్ర+శరీరే+<br>అనేకధా+ప్రవిభక్తమ్ | = | అప్పుడు విరాట్‌పురుషుని యొక్క ఆ శరీరము నందు, విరాట్ విగ్రహమునందు<br>అనేక విధములుగా చక్కగా విభజింపబడిన |
| కృత్స్నమ్+జగత్+<br>ఏకస్థమ్+పాండవః+<br>అపశ్యత్ | = | ఈ సమస్త జగత్తును ఒకేచోట ఉన్నట్లుగా అర్జునుడు చూచెను. |

పదునాలుగు లోకములు విడివిడిగా దేవతలు, యక్ష, రాక్షసులు, ఋషులు, మానవులు, పశు, పక్షి, మృగాదులు, జలచరములు, స్థావరములయిన కొండలు, పర్వతములు, వృక్షములు, సముద్రములు, నదులు మొదలైనవి అన్నివేటికవి స్పష్టముగా కనబడెను.

| | | |
|---|---|---|
| తతః+హృష్టరోమా+<br>విస్మయాః+ఆవిష్టః (సన్)+<br>సః+ధనంజయః | = | ఆ విధముగా విరాట్‌పురుషునియందు సర్వమును చూచిన పిమ్మట పులకితగాత్రుడై (సంతోషముచే రోమములు నిక్కబొడచిన వాడయిన) ఆశ్చర్యముతో కూడినవాడు అయిన ఆ అర్జునుడు |
| శిరసా+ప్రణమ్య+<br>దేవమ్+కృతాంజలిః+<br>అభాషత | = | శిరస్సుచే ప్రణామముచేసి, అనగా శిరస్సువంచి నమస్కరించి ఆ విరాట్‌పురుషునికి చేతులు జోడించి, అనగా అంజలి ఘటించినవాడై ఇట్లు పలికెను |

...... ❖ ❖ ❖ ......

అర్జున ఉవాచ

అర్జునుడు తను విరాట్‌పురుషునియందు దర్శించినవి చెప్పుచున్నాడు

**పశ్యామి దేవాంస్తవ దేవ దేహే ।**
**సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్ ।**
**బ్రహ్మాణమీశం కమలాసనస్థమ్ ।**
**ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥ 15**

పశ్యామి–దేవాన్–తవ–దేవ దేహే–సర్వాన్–తథా–భూత విశేష–సంఘాన్
బ్రహ్మాణమ్–ఈశమ్–కమలాసనస్థమ్–ఋషీన్–చ–సర్వాన్–ఉరగాన్–చ–దివ్యాన్

**అనేక బాహూదర వక్త్ర నేత్రం ।**
**పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్ ।**
**నాన్తం న మధ్యం న పునస్తవాదిం ।**
**పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥ 16**

అనేక–బాహూ–ఉదర–వక్త్ర–నేత్రమ్–పశ్యామి–త్వామ్–సర్వతః–అనన్తరూపమ్
న–అన్తమ్–న–మధ్యమ్–న–పునః–తవ–ఆదిమ్–పశ్యామి–విశ్వేశ్వర–విశ్వరూప

**కిరీటినం గదినం చక్రిణం చ**
**తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్ ।**
**పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా**
**దీప్తానలార్క ద్యుతిమప్రమేయమ్ ॥ 17**

కిరీటినమ్–గదినమ్–చక్రిణమ్–చ–తేజోరాశిమ్–సర్వతః–దీప్తిమన్తమ్
పశ్యామి–త్వామ్–దుర్నిరీక్ష్యమ్–సమంతాత్–దీప్తానల–అర్క–ద్యుతిమ్–అప్రమేయమ్

**త్వమక్షరం పరమం వేదితవ్యం**
**త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**త్వమవ్యయః శాశ్వత ధర్మ గోప్తా ।**
**సనాతనస్త్వం పురుషో మతో మే ॥ 18**

త్వమ్–అక్షరమ్–పరమమ్–వేదితవ్యమ్–త్వమ్–అస్య–విశ్వస్య–పరమ్–నిధానమ్
త్వమ్–అవ్యయః–శాశ్వత–ధర్మగోప్తా–సనాతనః–త్వమ్–పురుషః–మతః–మే

**అనాదిమధ్యాన్తమనన్తవీర్యమ్**
**అనన్త బాహుం శశిసూర్యనేత్రమ్ ।**
**పశ్యామి త్వాం దీప్త హుతాశ వక్త్రం ।**
**స్వ తేజసా విశ్వమిదం తపన్తమ్ ॥ 19**

అనాదిమధ్యాంతమ్–అనంతవీర్యమ్–అనంత బాహుమ్–శశి సూర్య నేత్రమ్
పశ్యామి–త్వామ్–దీప్త హుతాశన వక్త్రమ్–స్వ తేజసా–విశ్వమ్–ఇదమ్–తపంతమ్

**ద్యావాపృథివ్యో రిదమన్తరం హి ।**
**వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।**
**దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం**
**లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥ 20**

ద్యావాపృథివ్యోః–ఇదమ్–అంతరమ్–హి–వ్యాప్తమ్–త్వయా–ఏకేన–దిశః–చ–సర్వాః
దృష్ట్వా–అద్భుతమ్–రూపమ్–ఉగ్రమ్–తవ–ఇదమ్–లోకత్రయమ్–ప్రవ్యథితమ్–మహాత్మన్

**అమీ హి త్వాం సురసంఘా విశన్తి ।**
**కేచిద్భీతాః ప్రాంజలయో గృణన్తి ।**

**స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధ సంఘాః**

**స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభి ॥ 21**

అమీ–హి–త్వామ్–సురసంఘాః–విశన్తి–కేచిత్–భీతాః–ప్రాంజలయః–గృణన్తి
స్వస్తి–ఇతి–ఉక్త్వా–మహర్షిసిద్ధ సంఘాః–స్తువన్తి–త్వామ్–స్తుతిభిః–పుష్కలాభిః

**రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా ।**

**విశ్వేశ్వినౌ మరుతశ్చోష్మ పాశ్చ ।**

**గన్ధర్వ యక్షాసుర సిద్ధ సంఘా**

**వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥ 22**

రుద్ర ఆదిత్యాః–వసవః–యే–చ–సాధ్యాః–విశ్వే–అశ్వినౌ–మరుతః చ–ఊష్మపాః–చ
గన్ధర్వ యక్షాసుర సిద్ధ సంఘాః–వీక్షన్తే–త్వామ్–విస్మితాః–చ–ఏవ–సర్వే

**రూపం మహత్తే బహు వక్త్ర నేత్రం**

**మహాబాహో బహు బాహూరుపాదమ్ ।**

**బహూదరం బహుదంష్ట్రా కరాళం**

**దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాహమ్ ॥ 23**

రూపమ్–మహత్–తే–బహు వక్త్ర నేత్రమ్–మహాబాహో–బహు బహు ఉరుపాదమ్
బహుఉదరమ్–బహుదంష్ట్రా కరాళమ్–దృష్ట్వా–లోకాః–ప్రవ్యథితాః–తథా–అహమ్

**నభః స్పృశం దీప్తమనేకవర్ణం**

**వ్యాత్తాననం దీప్త విశాల నేత్రమ్ ।**

**దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా**

**ధృతిం న విన్దామి శమం చ విష్ణో ॥ 24**

నభః–స్పృశమ్–దీప్తమ్–అనేక–వర్ణమ్–వ్యాత్త–ఆననమ్–దీప్త–విశాల–నేత్రమ్
దృష్ట్వా–హి–త్వామ్–ప్రవ్యథిత–అంతరాత్మా–ధృతిమ్–న–విన్దామి–శమమ్–చ విష్ణో

**దంష్ట్రా కరాళాని చ తే ముఖాని**
**దృష్ట్వైవ కాలనలసన్నిభాని ।**
**దిశో న జానే న లభే చ శర్మ**
**ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 25**

దంష్ట్రాకరాళాని – చ – తే – ముఖాని – దృష్ట్వా ఏవ – కాలనల – సన్నిభాని
దిశః – న – జానే –చ– లభే –చ– శర్మ – ప్రసీద – దేవేశ – జగన్నివాస

**అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః**
**స్సర్వే సహైవావనిపాలసంఘైః ।**
**భీష్మో ద్రోణః సూతపుత్రస్తథాసౌ**
**సహాస్మదీయైరపి యోధముఖ్యైః ॥ 26**

అమీ–చ–త్వామ్–ధృతరాష్ట్రస్య–పుత్రాః–సర్వే–సహ–ఏవ–అవనిపాలసంఘైః
భీష్మః–ద్రోణః–సూత పుత్రః–తథా–అసౌ–సహ–అస్మదీయైః–అపి– యోధ ముఖ్యైః

**వక్త్రాణి తే త్వరమాణా విశన్తి**
**దంష్ట్రా కరాళాని భయానకాని ।**
**కేచిద్విలగ్నా దశనాన్తరేషు**
**సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాంగైః ॥ 27**

వక్త్రాణి–తే–త్వరమాణాః–విశన్తి–దంష్ట్రా కరాళాని–భయానకాని
కేచిత్–విలగ్నాః–దశనాన్తరేషు–సందృశ్యన్తే–చూర్ణితైః–ఉత్తమాంగైః

**యథా నదీనాం బహవోఽ౽ంబువేగా**

**స్సముద్ర మేవాభి ముఖా ద్రవన్తి ।**

**తథా తవామీ నరలోక వీరా**

**విశన్తి వక్త్రాణ్యభి విజ్వలన్తి ॥ 28**

యథా–నదీనామ్–బహవః–అంబువేగాః–సముద్రమ్–ఏవ–అభిముఖాః–ద్రవన్తి

తథా–తవ–అమీ–నరలోక వీరాః–విశన్తి–వక్త్రాణి–అభివిజ్వలన్తి

**యథా ప్రదీప్తం జ్వలనం పతంగా ।**

**విశన్తి నాశాయ సమృద్ధ వేగాః ।**

**తథైవ నాశాయ విశన్తి లోకాః ।**

**తవాపి వక్త్రాణి సమృద్ధ వేగాః ॥ 29**

యథా ప్రదీప్తమ్–జ్వలనమ్–పతంగాః–విశన్తి–నాశాయ–సమృద్ధ వేగాః

తథా–ఏవ–నాశాయ–విశన్తి–లోకాః–తవ–అపి–వక్త్రాణి–సమృద్ధ వేగాః

**లేలిహ్యసే గ్రసమానః సమన్తాల్లో–**

**కాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః ।**

**తేజోఽభిరాపూర్య జగత్సమగ్రం ।**

**భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో ॥ 30**

లేలిహ్యసే–గ్రసమానః–సమన్తాత్–ల్లోకాన్–సమగ్రాన్–వదనైః–జ్వలద్భిః

తేజోభిః–అపూర్వ–జగత్–సమగ్రమ్–భాసః–తవ–ఉగ్రాః–ప్రతపన్తి–విష్ణో.

**ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో**

**నమోఽస్తు తే దేవవర ప్రసీద ।**

**విజ్ఞాతుమిచ్ఛామి భవన్త మాద్యం**
**న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥ 31**

ఆఖ్యాహి–మే–కః–భవాన్–ఉగ్రరూపః–నమః–అస్తూ–తే–దేవవర–ప్రసీద
విజ్ఞాతుమ్–ఇచ్ఛామి–భవన్తమ్–ఆద్యమ్–న–హి–ప్రజానామి–తవ–ప్రవృత్తిమ్

దేవ = ఓ పరమేశ్వరా!

తవ+దేహే+ = నీ యొక్క దేహమునందు

కమలాసనస్థమ్+ బ్రహ్మాణమ్+ఈశమ్ కమలమునందు ఆసీనుడైయున్న బ్రహ్మను, మఱియు విష్ణువును శివుని అనగా – సృష్టి, స్థితి, లయ కారకులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను

దివ్యాన్+సర్వాన్+దేవాన్ = తేజోవంతములై దివ్య శరీర ధారులైన, ఇంద్రాది
చ+సర్వాన్+ఋషీన్+చ+ సర్వ దేవతలను మఱియు సర్వ ఋషులను మఱియు
భూతవిశేష+సంఘాన్ వివిధ విశేష భూతములైన, దైత్య, దానవ అసుర యక్ష రక్ష గరుడ, గంధర్వ, అప్సరసాదులను,

తథా+ఉరగాన్+పశ్యామి = అటులనే దివ్య సర్పములను చూచుచున్నాను.

విశ్వేశ్వర + విశ్వరూప = ఓ విశ్వేశ్వరా! ఓ విశ్వరూపా!

తవ = నీ యొక్క అనగా విరాట్ రూపము యొక్క

న+ఆదిమ్+న+మధ్యమ్ = ఆదిని, మధ్యమును, అంతమును చూడలేకున్నాను
న+అన్తమ్+పశ్యామి

పునః+త్వామ్+సర్వతః+ = అనగా నీవు ఆది మధ్యాంతరహితుడవు అని అర్థము.
అనేక బాహూ+ఉదరవక్త్ర మరల మిమ్ములను అంతటను జీవరూపమున
నేత్రమ్+అనన్తరూపమ్+ అసంఖ్యాకమయిన బాహువులు ఉదరములు
పశ్యామి (పొట్టలు), ముఖములు నేత్రములు గల అనంత రూపునిగా చూచుచున్నాను.

**విష్ణు దేవతా రూపమున**

| | | |
|---|---|---|
| సర్వతః+తేజోరాశిమ్+ | = | సర్వత్రా – అంతటా వ్యాపించిన తేజోవంతమైన |
| దుర్నిరీక్ష్యమ్+ | | వానిగను తేరి చూడలేనివానిగను |
| దీప్తిమంతమ్+ | | ప్రకాశించుచున్న వానిగను అప్రమేయునిగను |
| అప్రమేయమ్+ | | దశదిశల అంతటా సర్వహృదయాంతరాళములలో |
| సమంతాత్+దీప్త+ | | ప్రకాశించుచున్న అగ్ని, సూర్యులవంటి కాంతిగల |
| అనల+అర్కద్యుతిమ్ | | వానిగను |
| కిరీటినమ్+చ+ | = | కిరీటము గలవానిగను గద గలవానిగను |
| గదినమ్+చక్రిణమ్ | | సుదర్శన చక్రము గలవానిగను నిన్ను–విష్ణువుగా |
| త్వామ్+పశ్యామి | | చూచుచున్నాను. |
| త్వమ్+వేదితవ్యమ్+ | = | ఓ పరమేశ్వరా! నీవు తెలుసుకొనదగిన |
| పరమమ్+అక్షరమ్ | | ఉత్కృష్టమయిన అక్షర స్వరూపుడవు. |
| త్వమ్+అవ్యయః+ | = | నీవు |
| సనాతనః+పురుషః+ | = | అవ్యయుడవు ఆది పురుషుడవు. నీవు |
| త్వమ్+అస్య+విశ్వస్య+ | | ఈ విశ్వము యొక్క గొప్ప ఆధారుడవు |
| పరమ్+నిధానమ్ | | |
| త్వమ్+శాశ్వతధర్మగోప్తా | = | నీవు శాశ్వత ధర్మరక్షకుడవు అని నాయొక్క |
| +మే+మతః | | అభిప్రాయము |
| త్వమ్+ | = | నిన్ను దేవతా రూపమున అనాది పురుషుడవు |
| అనాది మధ్య అంతమ్+ | | అనియు, ఆది–మధ్య–అంతము |
| అనంత వీర్యమ్+ | | లేనివాడవనియును, గొప్ప వీర్యవంతునిగను, |
| శశి సూర్య నేత్రమ్+ | | అనంత బలశాలివిగా చంద్రుడు, సూర్యుడు |
| దీప్త హుతాశ వక్త్రమ్ | | కన్నులుగా గలవానిగను, ప్రకాశించుచున్న అగ్నివంటి ముఖము గలవానిగను, అగ్ని స్వరూపునిగను |

| | | |
|---|---|---|
| ఇదమ్+విశ్వమ్ + స్వతేజసా+తపంతమ్ | = | ఈ విశ్వమును నీ తేజస్సుచే తపింప చేయుచున్న వానిగను అనగా సూర్యునిగను చూచుచున్నాను. |

**కిం తద్విష్ణో ర్బలమాహుః కాదీప్తిః** (శ్రుతి) –

ఆ సర్వవ్యాపకుడయిన విష్ణువు యొక్క బలము ఏమని చెప్పుచున్నారు?

జవాబు – అనంతవీర్యమ్

**కా–దీప్తిః–**ఎంత ప్రకాశము గలిగి ఉన్నాడు?

సూర్యునిగా స్వతేజస్సుతో అనగా స్వకీయ కాంతిచే ఈవిశ్వమును వెలుగొందచేయుచున్నాడు. తపింప చేయుచున్నాడు.

| | | |
|---|---|---|
| అనంత బాహుమ్+ పశ్యామి | = | సృష్టిలోని సర్వ జీవరాసులు మీరే అగుటవలన అసంఖ్యాకమయిన బాహువులు గలవానిగను, సర్వ జీవరాసుల రూపముగను చూచుచున్నాను |

**ఏకో యద్ధార యద్దేవః? రెజతీ, రోదశి, ఉభే** (శ్రుతి):

తాను ఒక్కడయ్యూ ఎవరు ఈ భూమిని ఆకాశముల రెండింటిని ఎట్లు ధరించుచున్నాడు? దానినే ఇట్లు చెప్పుచున్నారు.

| | | |
|---|---|---|
| మహాత్మన్+ఇదమ్+ ద్యావా పృథివ్యోః+ ఏకేన+త్వయా | = | ఓ శ్రీ కృష్ణా! విరాట్ రూపమున ఈ భూమి, ఆకాశముల రెండింటిని ఒక్కరైన మీ చేతనే ధరియింపబడుచున్నది. |

**యచ్చ కించి జ్జగదస్సర్వం దృశ్యతే శ్రూయతే పివా ।**

**అన్తర్బహిశ్చతత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ।।**(శ్రుతి) దీనినే ఇట్లు చెప్పుచున్నాడు:

| | | |
|---|---|---|
| అన్తరమ్+సర్వాః+ దిశః+హి+ వ్యాప్తమ్ (వ్యాప్తాః) | = | భూమి, దివి, అంతరిక్షము సర్వదిక్కులు అనగా సర్వదిశలు బ్రహ్మాండము యొక్క లోపల, బయట మీ చేతనే వ్యాపింపబడియున్నవి |
| చ+తవ+ఉగ్రమ్+ అద్భుతమ్+ రూపమ్ | = | మఱియు మీ యొక్క ఉగ్రమైనదియు, అద్భుతమైనదియు అయిన దుష్టసంహార రూపమును |

దృష్ట్వా+ఇదమ్+ లోకత్రయమ్+ ప్రవ్యథితమ్ = చూచి–రుద్ర రూపమును చూచి, లోకము నందలి దుర్మార్గులు మూడు లోకములు మిక్కిలి భయపడుచున్నారు.

ఈ లోక సంహార రూపమును చూచిన దుర్మార్గులు, పాప వర్తనులు నీవు దండింతువని :

కేచిత్+భీతాః+త్వామ్+ విశంతి+హి = కొందఱు (విరాట్ స్వరూపము లయరూపమను చూచిన) భయపడిన వారలై గజగజ వణుకు చున్నారు. మఱియు ఆ దుర్మార్గులు, ఆత్మస్థానమును పొందని జీవులందఱు విరాట్‌పురుషునివైన నీలో ప్రవేశించుచున్నారు. అనగా నశించిపోవుచున్నారు. వారు కల్పారంభమున మరల పుట్టుచున్నారు.

త్వామ్+అమీ+ సురసంఘాః+ మహర్షి సిద్ధసంఘాః+ ప్రాంజలయః = నిన్ను ఆది పురుషునిగా దర్శించిన ఈ దేవతలు మహర్షులు, సిద్ధులు అంజలి ఘటించిన వారలై

పుష్కలాభిః+స్తుతిభిః+ స్వస్తి+ఉక్త్వా+స్తువంతి+ గృణన్తి = సంపూర్ణములయిన స్తోత్రములచే వేదమంత్రములచే స్వస్తి వాక్యములు పలికి స్తోత్రము చేయుచున్నారు కొందఱు అనగా భక్తులు నీ నామ గుణములను కీర్తించుచున్నారు, స్తుతించుచున్నారు

రుద్ర ఆదిత్యాః+వసవః+ మరుతః+చ+అశ్వినౌ+ = ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు సప్త మరుత్తులు, మఱియు అశ్వినీ దేవతలు విశ్వేదేవతలు

చ+ఊష్మపాః+చ+ సాధ్యాః+గన్ధర్వ+ = మఱియు పితృదేవతలు మఱియు సాధ్యులు గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు,

| | | |
|---|---|---|
| యక్ష+అసుర+ | | మొదలైనవారు మఱియు ఋషులు |
| సిద్ధ సంఘాః+చ | | |
| యే+సర్వే+ఏవ+ | = | పుణ్య పురుషులు ఎవరెవరు గలరో వారందఱూ |
| త్వామ్+విస్మితాః(సంతః)+ | | మిమ్ములను సంభ్రమాశ్చర్యములకు లోనైనవారై |
| వీక్షన్తే | | దర్శించుచున్నారు |
| మహాబాహో | = | ఓ శ్రీకృష్ణా! విరాట్‌రూపమున |
| బహువక్త్రనేత్రమ్ | = | అనేక ముఖములు, నేత్రములు గలదియు |
| బహు బాహుఉరుపాదమ్ | = | అనేకములైన బాహువులు, తొడలు, పాదములు గలదియు |
| బహుఉదరమ్ | = | అనేకములైన ఉదరములు (కడుపులు-పొట్టలు) గలదియు |
| బహు దంష్ట్రా కరాళమ్ | = | భయంకరములైన అనేక కోరలు గలదియు అయిన |
| తే+మహత్+రూపమ్+ | = | నీ యొక్క గొప్ప రూపమును చూచి ఆత్మదర్శనము |
| దృష్ట్వా | | చేయని |
| లోకాః+ప్రవ్యధితాః+ | = | (సర్వలోకములు) సర్వప్రజలు మిక్కిలి భయపడు |
| తథా+అహమ్ | | చున్నారు అట్లే నేను కూడ భయపడుచున్నాను |

శాంత రూపమును చూచిన ఆనందము, ఉగ్రరూపమును చూచిన భయము గలగును. విరాట్‌రూపము త్రిగుణయుతమైనది అగుటవలన ఆశ్చర్యము, ఆనందము, భయము గలుగును.

| | | |
|---|---|---|
| విష్ణో | = | విరాట్ రూపమున సర్వవ్యాపకుడవైన ఓ శ్రీకృష్ణా! |
| నభః స్పృశమ్ | = | ఆకాశమును అంటుచున్నదియు |
| దీప్తమ్ | = | ప్రకాశించుచున్నదియు |

| | | |
|---|---|---|
| అనేక వర్ణమ్+వ్యాత్త+ ఆననమ్+ | = | అనేక వర్ణములు గలిగి ప్రాణుల సంహారమునకు తెఱిచిన నోరు మండుచున్న |
| దీప్త విశాల నేత్రమ్+హి | | విశాల నేత్రములు ఆయుధములు గలిగి యున్నదియు అయిన |
| త్వామ్+దృష్ట్వా+ ప్రవ్యధిత+అంతరాత్మా | = | నిన్ను చూచి భయపడిన అంతరాత్మ గల నేను |
| ధృతిమ్+చ+శమమ్+ న+విందామి | = | ధైర్యమును మఱియు శాంతిని పొందలేకయున్నాను |

సంహార రూపమును చూచిన ఎవరును ధైర్యమును శాంతిని పొందలేరు. ఈ విషయమునే హిరణ్యకశిపుని సంహారమునకై ధరించిన నరసింహ రూపమును చూచి, బ్రహ్మాది దేవతలు భయపడినట్లు వర్ణింపబడినది. అయితే జ్ఞాని అయిన ప్రహ్లాదుడు ఆరూపమును చూచి భయపడలేదు.

| | | |
|---|---|---|
| దేవేశ | = | ఓ దేవేశ! శ్రీకృష్ణా! |
| తే+కాలఅనిలసన్నిభాని+ ముఖాని+చ+ దంష్ట్రా కరాళాని+చ+ ఏవ+దృష్ట్వా | = | నీ యొక్క సృష్టి సంహార కాలమునగల ప్రళయాగ్ని తో పోల్చదగు నీ ముఖములను నోటిలోగల భయంకర కోఱలను చూచి |
| దిశః+న+జానే చ+శర్మ+న+లభే | = | దిక్కులను తెలియక ఉన్నాను మఱియు భయమువలన సుఖమును పొందలేక ఉన్నాను. కావున నా యందు దయయుంచి |
| జగన్నివాస+ప్రసీద | = | శ్రీకృష్ణా! ప్రసన్నుడవగుము |

స్థితి కాలమున ప్రసన్న రూపము, లయకాలమున ఉగ్రరూపముగల నీవు ప్రసన్నుడవగుము. నరసింహావతారమున బ్రహ్మాది దేవతలు ఈ విధముగనే ప్రార్థించిరి.

విరాట్ రూపము యొక్క లయరూపమున సర్వులు నశించెదరు. ఈ విషయమునే ఇట్లు చెప్పబడుచున్నది.

| | | |
|---|---|---|
| అమీ+ధృతరాష్ట్రస్య+<br>సర్వే+పుత్రాః+అసౌ+<br>భీష్మః+ద్రోణః+<br>సూత పుత్రః+చ+<br>అవనిపాలసంఘైః+సహ | = | ఈ ధృతరాష్ట్రుని యొక్క నూఱుమంది పుత్రులు ఈ భీష్ముడు, ద్రోణుడు, సూతపుత్రుడైన కర్ణుడు మొదలగు రాజులందఱు సైన్యములతో సహా |
| తథా+అస్మదీయైః+<br>యోధముఖ్యైః+సహ+<br>ఏవ+అపి+త్వామ్ | = | అట్లే మన పక్షము వారు అయిన యోధముఖ్యులు సైన్యము కూడ నీలో లయస్వరూపమయిన నీలో ప్రవేశించు చున్నారు. |
| తే+భయానకాని+<br>దంష్ట్రా కరాళాని+<br>వక్త్రాణి+<br>త్వరమాణాః(సంతః)+<br>విశన్తి | = | నీ యొక్క భయము గలిగించు భీషణమయిన కోఱలుగల నోళ్ళలో కాలప్రవాహమున త్వరపడుచున్న వారలై అగ్నిలో పడు మిడుతలవలె ప్రవేశించుచున్నారు |
| కేచిత్+దశనాన్తరేషు+<br>విలగ్నాః(సంతః)+<br>చూర్ణితైః+ఉత్తమాంగైః+<br>సంధృశ్యంతే | = | కొందఱు కోఱల సంధులయందు చిక్కుకొన్న వారలై నలిపివేయబడిన శిరస్సులతో కనబడుచున్నారు |

కౌరవ, పాండవ సేనలోని సర్వులు నీ కోఱలలో చిక్కుకొని నశింపబడుచున్నట్లు కనబడుచున్నారు.

| | | |
|---|---|---|
| యథా+బహవః+<br>నదీనామ్+అంబువేగాః+<br>అభిముఖాః+ద్రవన్తి +<br>సముద్రమ్+ఏవ+తథా | = | ఏ విధముగా అనేకములైన ప్రవహించుచున్న నదుల యొక్క జలములు జలప్రవాహ వేగముచే సముద్రమునకు అభిముఖముగా ప్రవహించి సముద్రములోనే కలియుచున్నవో, అలా కలసి ఆనదులు వాటి వాటి నామ రూపములు కోల్పోయి సముద్రముగానే పిలువబడుచున్నవో ఆ విధముగా జీవులు, పరబ్రహ్మను పొంది పరబ్రహ్మగా పిలువబడుచున్నారు |

కొందఱు అగ్నిలో పడు మిడతలవలె పడి నశించుచున్నారు. ఇట్టివారు తిరిగి కల్పారంభమున తిరిగి సృజియింపబడుదురు.

| | | |
|---|---|---|
| అమీ+నరలోక వీరాః+ | = | ఈ మానవ వీరులు మీ యొక్క |
| తవ+అభివిజ్వలన్తి+ | | బాగా ప్రజ్వలించుచున్న నోళ్ళ యందు |
| వక్త్రాణి+విశంతి | | పడుచున్నారు. పడినశించుచున్నారు. |

లయము, వినాశము అని కలయిక రెండు విధములు. నదులు సముద్రములో కలియు విధము లయము. ఈ విధముగా కలసినవారు బ్రహ్మత్వము పొందుదురు. అగ్నిలో మిడతలు పడు విధము వినాశము. వీరు నశించెదరు.

| | | |
|---|---|---|
| యథా+ప్రదీప్తమ్+ | = | ఏ విధముగా బాగామండుచున్న అగ్నిని మిక్కిలి |
| జ్వలనమ్+సమృద్ధవేగాః | | వేగము గలిగినవై పక్షులు, మిడతలు తమ |
| పతంగాః+నాశాయ+ | | నాశముకొఱకు ప్రవేశించుచున్నవో |
| విశంతి | | |
| తథా+ఏవ + | = | ఆ విధముగా మిక్కిలి వేగము గలవారలై |
| సమృద్ధ వేగాః(సంతః)+ | | జనులు కూడా నాశము కొఱకు మీ యొక్క |
| లోకాః+అపి+నాశాయ+ | | నోళ్ళను ప్రవేశించుచున్నారు. |
| తవ+వక్త్రాణి+విశంతి | | |
| విష్ణో | = | సర్వవ్యాపకుడవైన ఓ శ్రీకృష్ణా! |
| తేజోభిః+జ్వలద్భిః+ | = | తేజోవంతమై మండుచున్న నోళ్ళచేత సమస్త |
| వదనైః+సమగ్రాన్+ | | జనులను మ్రింగుచున్నవాడవై అంతటను |
| లోకాన్+గ్రసమానః+ | | ఆస్వాదించుచున్నావు. అనగా కాలస్వరూపమున |
| సమంతాత్+లేలిహ్యసే | | కాలుడవై సర్వము లయము చేయుచున్నావు |
| తవ+ఉగ్రాః+భాసః+ | = | నీ యొక్క భయంకరములైన కాంతులు |
| సమగ్రమ్+జగత్+ | | సర్వ విశ్వమును వ్యాపించి తపింప చేయుచున్నవి. |
| అపూర్వ+ప్రతపన్తి | | |

**అర్జునుని ప్రశ్న :**

| | | |
|---|---|---|
| ఉగ్రరూపః+భవాన్+ కః+మే+ఆఖ్యాహి | = | ఉగ్రరూపమునగల మీరు ఎవరు? నాకు చెప్పుము |
| తే+నమః+అస్తు+ దేవవర+ప్రసీద | = | మీకు నమస్కారము. ఓ దేవశ్రేష్ఠుడా! నా కొఱకు ప్రసన్నుడవగుము |
| తవ+ప్రవృత్తిమ్+ న+ప్రజానామి+హి | = | మీ యొక్క ప్రవృత్తిని గ్రహించలేకున్నాను |
| ఆద్యమ్+భవంతమ్+ విజ్ఞాతుమ్+ఇచ్ఛామి | = | సృష్ట్యాదియందున్నవాడవయిన నిన్ను తెలుసుకొనుటకు కోరుచున్నాను. |

ఆత్మ రూపమున నిర్గుణుడవు. విరాట్ రూపమున గుణయుతుడవు. ఆత్మ రూపమున ఒక్కడవు. విరాట్ రూపమున భిన్నుడవు. సృష్టి, స్థితి లయకారకుడవు. జీవాత్మరూపమున భిన్నుడవు. జీవుల హృదయగుహలో అణువులో అణువువు. కావున నిన్ను గ్రహించలేకయున్నాను.

...... ❖ ❖ ❖ ......

శ్రీ భగవానువాచ

కాలము - కాలపురుషుడు

**కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో**
**లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః ।**
**ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే**
**యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥ 32**

కాలః–అస్మి –లోకక్షయకృత్ –ప్రవృద్ధః –లోకాన్ –సమాహర్తుమ్ –ఇహ–ప్రవృత్తః
ఋతే –అపి–త్వామ్ –న–భవిష్యంతి–సర్వే–యే –అవస్థితాః–ప్రత్యనీకేషు–యోధాః

మనము జయించెదమా? లేక వారు జయించెదరా?
అన్న అర్జునుని ప్రశ్నకు సమాధానము చెప్పబడుతున్నది

**తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ ।**

**జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।**

**మయైవైతే నిహతాః పూర్వమేవ ।**

**నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ 33**

తస్మాత్–త్వమ్–ఉత్తిష్ఠ–యశః–లభస్వ–జిత్వా–శత్రూన్–భుంక్ష్వ–రాజ్యమ్–సమృద్ధమ్
మయా–ఏవ–ఏతే–నిహతాః–పూర్వమ్–ఏవ–నిమిత్తమాత్రమ్–భవ–సవ్యసాచిన్

**ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ**

**కర్ణం తథాన్యానపి యోధవీరాన్ ।**

**మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా ।**

**యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥ 34**

ద్రోణమ్–చ–భీష్మమ్–చ–జయద్రథమ్–చ–కర్ణమ్–తథా–అన్యాన్–అపి–యోధవీరాన్
మయా–హతాన్–త్వమ్–జహి–మా–వ్యథిష్ఠాః–యుధ్యస్వ–జేతాసి–రణే–సపత్నాన్

లోకక్షయకృత్+ప్రవృద్ధః+= సర్వ లోకములను నశింపచేయుటకు
కాలః+అస్మి+ విజృంభించిన కాలమును
ఇహ+లోకాన్+ ఇప్పుడు లోకములను ప్రజలను చంపుటకొఱకు
సమాహర్తుమ్+ప్రవృత్తః ఉద్యోగించిన కాలపురుషుడను
ప్రత్యనీకేషు+యే+ = శత్రు పక్షములయందు ఏ వీరులు కలరో
యోధాః+అవస్థితాః

| | | |
|---|---|---|
| (తే)సర్వే+త్వామ్+ ఋతే+అపి+న+ భవిష్యంతి | | (వారు) అందఱున్నూ నీవు యుద్ధము చేయకున్నను మిగిలి యుండరు. |

**కథాభాగము:**

| | | |
|---|---|---|
| తస్మాత్+త్వమ్+ ఉత్తిష్ఠ+యశః+లభస్వ+ శత్రూన్+జిత్వా+ సమృద్ధమ్+రాజ్యమ్+ భుంక్ష్వ | = | అందువలన నీవు (యుద్ధము చేయుటకై) లెమ్ము కీర్తిని పొందుము శత్రువులను జయించి సర్వసంపదలతో తులతూగుచున్న రాజ్యమును అనుభవింపుము |
| ఏతే+పూర్వమ్+ఏవ+ మయా+ఏవ+నిహతాః+ సవ్యసాచిన్+నిమిత్త+ మాత్రమ్+భవ | = | వీరందఱును ఇంతకు ముందే నా చేతనే చంపబడిరి ఓ సవ్యసాచీ ! అర్జునా! నీవు నిమిత్త మాత్రుడవు కమ్ము |
| మయా+హతాన్+ ద్రోణమ్+చ+భీష్మమ్+ చ+జయద్రథమ్+చ+ కర్ణమ్+తథా+అన్యాన్+ యోధవీరాన్+అపి+ త్వమ్+జహి | = | నా చేత చంపబడిన ద్రోణుని, భీష్ముని సైంధవుని, కర్ణుని అట్లే తదితరులైన యుద్ధవీరులను గూడ నీవు జయించుము |
| మా+వ్యథిష్ఠాః+రణే+ సపత్నాన్+జేతాసి+ యుధ్యస్వ | = | భయపడవలదు యుద్ధమునందు శత్రువీరులను తప్పక జయించగలవు (కనుక) యుద్ధము చేయుము. |

సంజయ ఉవాచ

**ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య**
**కృతాంజలిర్వేపమానః కిరీటీ ।**
**నమస్కృత్వా భూయఏవాహ కృష్ణం**
**సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥ 35**

ఏతత్–శ్రుత్వా–వచనమ్–కేశవస్య–కృతాంజలిః–వేపమానః–కిరీటీ
నమస్కృత్వాః–భూయః–ఏవ–ఆహ–కృష్ణమ్–సగద్గదమ్–భీతభీతః–ప్రణమ్య

| | | |
|---|---|---|
| వేపమానః+కిరీటీ+ | = | విరాట్‌యొక్క లయస్వరూపమును చూచి |
| కేశవస్య+ఏతత్+ | | వణకుచున్న అర్జునుడు శ్రీకృష్ణునియొక్క |
| వచనమ్+శ్రుత్వా | | ఈ వాక్యమును విని |
| కృతాంజలిః+ | = | అంజలి ఘటించిన వాడై నమస్కరించి |
| నమస్కృత్వా+ | | భయపడుచున్నవాడై మరల ప్రణామము చేసి |
| భీతభీతః (సన్)+ | | గద్గద స్వరముతో శ్రీ కృష్ణునిగూర్చి ఇట్లు పలికెను |
| భూయః+ఏవ+ప్రణమ్య+ | | |
| సగద్గదమ్+కృష్ణమ్+ | | |
| ఆహ | | |

...... ❖ ❖ ❖ ......

అర్జున ఉవాచ

**స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా**
**జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।**
**రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి**
**సర్వే నమస్యన్తి చ సిద్ధ సంఘాః ॥ 36**

స్థానే – హృషీకేశ – తవ –ప్రకీర్త్యా – జగత్ – ప్రహృష్యతి – అనురజ్యతే – చ
రక్షాంసి – భీతాని – దిశః – ద్రవన్తి – సర్వే – నమస్యన్తి – చ – సిద్ధ సంఘాః

**కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్**
**గరీయసే బ్రహ్మణోప్యాది కర్త్రే ।**
**అనన్త దేవేశ జగన్నివాస**
**త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥ 37**

కస్మాత్–చ–తే–న–నమేరన్–మహాత్మన్–గరీయసే–బ్రహ్మణః–అపి–ఆదికర్త్రే
అనన్త–దేవేశ–జగన్నివాస–త్వమ్–అక్షరమ్–సత్–అసత్–తత్ పరమ్–యత్

**త్వమాది దేవః పురుషః పురాణః**
**త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**వేత్తాసి వేద్యం చ పరం చ ధామ ।**
**త్వయా తతం విశ్వమనన్త రూప ॥ 38**

త్వమ్–ఆదిదేవః–పురుషః–పురాణః–త్వమ్–అస్య–విశ్వస్య–పరమ్–నిధానమ్
వేత్తా–అసి–వేద్యమ్–చ–పరమ్–చ–ధామ–త్వయా–తతమ్–విశ్వమ్–అనన్త రూప

**వాయుర్యమోఽగ్నిర్వరుణః శశాంకః**
**ప్రజాపతి స్త్వం ప్రపితా మహశ్చ ।**
**నమో నమస్తేఽస్తు సహస్ర కృత్వః**
**పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥ 39**

వాయుః–యమః–అగ్నిః–వరుణః–శశాంకః–ప్రజాపతిః–త్వమ్–ప్రపితామహః–చ
నమః–నమః–తే–అస్తు–సహస్ర కృత్వః–పునః–చ–భూయః–అపి–నమః–నమః–తే॥

**నమః పురస్తాదథ పృష్ఠతస్తే**

**నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।**

**అనన్త వీర్యామిత విక్రమస్త్వం**

**సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః॥ 40**

నమః-పురస్తాత్-అథ-పృష్ఠతః-తే-నమః-అస్తు-తే-సర్వతః-ఏవ-సర్వ
అనన్తవీర్య-అమిత విక్రమః-త్వమ్-సర్వమ్-సమాప్నోషి-తతః-అసి-సర్వః

**సఖేతి మత్వా ప్రసభం యదుక్తం**

**హేకృష్ణ! హేయాదవ! హేసఖేతి! ।**

**అజానతా మహిమానం తవేదం**

**మయా ప్రమాదాత్ ప్రణయేన వాపి ॥ 41**

సఖా-ఇతి-మత్వా-ప్రసభమ్-యత్-ఉక్తమ్-హేకృష్ణ-హేయాదవ-హే సఖే-ఇతి
అజానతా-మహిమానమ్-తవ-ఇదమ్-మయా-ప్రమాదాత్-ప్రణయేన-వా-అపి

**యచ్చాపహాసార్థమసత్కృతోఽసి ।**

**విహారశయ్యాసన భోజనేషు ।**

**ఏకోఽథ వాప్యచ్యుత తత్సమక్షం**

**తత్ క్షామయే త్వామహమప్రమేయమ్ ॥ 42**

యత్-చ-అపహాసార్థమ్-అసత్కృతః-అసి-విహార శయ్యాసనభోజనేషు-ఏకః
అథ-వా-అసి-అచ్యుత-తత్-సమక్షమ్-తత్-క్షామయే-త్వామ్-అహమ్-అప్రమేయమ్

**పితాఽసి లోకస్య చరాచరస్య**
**త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।**
**న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో**
**లోక త్రయేఽప్య ప్రతిమప్రభావ ॥ 43**

పితా–అసి –లోకస్య –చరాచరస్య–త్వమ్ –అస్య –పూజ్యః–చ–గురుః –గరీయాన్ న–త్వత్–సమః–అస్తు–అభ్యధికః–కుతః–అన్యః–లోకత్రయే–అపి–అప్రతిమ ప్రభావ

**తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం**
**ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।**
**పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ।**
**ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥ 44**

తస్మాత్–ప్రణమ్య–ప్రణిధాయ–కాయమ్–ప్రసాదయే–త్వామ్–అహమ్–ఈశమ్–ఈడ్యమ్ పితా–ఇవ–పుత్రస్య–సఖా–ఇవ–సఖ్యుః–ప్రియః–ప్రియాయాః–అర్హసి–దేవ–సోఢుమ్

**అదృష్ట పూర్వం హృషితోఽస్మి దృష్ట్వా**
**భయేన చ ప్రవ్యథితం మనో మే ।**
**తదేవ మే దర్శయ దేవరూపం**
**ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 45**

అదృష్ట పూర్వమ్–హృషితః–అస్మి–దృష్ట్వా–భయేన–చ–ప్రవ్యథితమ్–మనః–మే తత్–ఏవ–మే–దర్శయ–దేవ–రూపమ్–ప్రసీద–దేవేశ–జగన్నివాస

**కిరీటినం గదినం చక్రహస్తమ్**
**ఇచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।**
**తేనైవ రూపేణ చతుర్భుజేన ।**
**సహస్ర బాహో! భవ విశ్వమూర్తే ॥ 46**

కిరీటినమ్–గదినమ్–చక్రహస్తమ్–ఇచ్ఛామి–త్వామ్–ద్రష్టుమ్–అహమ్–తథా–ఏవ తేన–ఏవ–రూపేణ–చతుర్భుజేన–సహస్రబాహో–భవ–విశ్వమూర్తే

హృషీకేశ = ఓ శ్రీ కృష్ణా!

తవ+జగత్+ప్రహృష్యతి = నీ యొక్క మనోహర రూపమును చూచి (స్థితి రూపమైన విష్ణురూపమును చూచి) సర్వ జగత్తు సంతోషించుచున్నది

చ+సర్వే+సిద్ధసంఘాః+ నమస్యన్తి = మఱియు సర్వదేవతలు, ఋషులు, సిద్ధులు సర్వదేవ గణములు నమస్కరించుచున్నారు

ప్రకీర్త్యా+అనురజ్యతే+ స్థానే+చ = భక్త జనులు నీ కీర్తనచేత పులకితులగుచున్నారు జగత్తు అనురాగము పొందుచున్నది. ఇలా జగత్తు సంతోషించుట, అనురాగము పొందుట, భక్తులు పులకితులగుట అనునది తగియున్నది

భీతాని+ రక్షాంసి+ దిశః+ద్రవన్తి = భయంకరమైన నీ రూపము చూచి భయపడిన రాక్షసులు నలుదిక్కులకును పరుగెత్తుచున్నారు

మహాత్మన్ = ఓ శ్రీ కృష్ణా!

బ్రహ్మణః+అపి+ = చతుర్ముఖ బ్రహ్మకుకూడ సృష్టికర్తవు

ఆదికర్త్రే+గరీయసే+తే+ కస్మాత్+న+నమేరన్ = శ్రేష్ఠుడవైన నీకు ప్రజలు ఎందువలన నమస్కరింపకుందురు. అనగా నీకు సర్వులు నమస్కరింతురు

| | | |
|---|---|---|
| జగన్నివాస | = | ఓ జగన్నివాసుడా |
| దేవేశ+అనంత+ | | దేవదేవుడా! అంతము లేనివాడా! |
| యత్+సత్+చ+ | | ఏది సత్ స్వరూపమో అసత్ స్వరూపమో |
| అసత్+అపి+పరమ్+ | | ఆ సత్, అసత్‌లనే రెండింటికి పరమయినవాడవు |
| తత్+త్వమ్ | | నీవు |
| అనన్త రూప | = | ఓ శ్రీ కృష్ణా! |
| త్వమ్+ఆదిదేవః+ | = | నీవు |
| పురాణః పురుషః+ | = | ఆది పురుషుడవు, పురుషోత్తముడవు |
| త్వమ్ | | పురాణ పురుషుడవు. నీవు |
| అస్య+విశ్వస్య+ | = | ఈ విశ్వము యొక్క గొప్ప ఆధార భూతుడవు |
| పరమ్+నిధానమ్+ | | సర్వము తెలిసిన వాడవు మఱియు |
| వేత్తా+చ+వేద్యమ్ అసి+ | | తెలియదగిన వాడవు పరంధాముడవు మఱియు |
| పరమ్+చ+ధామ | | విరాట్‌పురుషునిగా |
| త్వయా+విశ్వమ్+తతః | = | నీ చేత ఈ సర్వజగత్తువ్యాపించబడెను |
| త్వమ్ | = | నీవు విరాట్ రూపమున అధిదైవికముగా |
| వాయుః+యమః+ | = | వాయువువు, యముడవు, అగ్నివి, వరుణుడవు |
| అగ్నిః+వరుణః+శశాంకః+ | | చంద్రుడవు, ప్రజాపతివి (బ్రహ్మవు), |
| ప్రజాపతిః+చ+ | | మూలపురుషుడవు (రామాయణం యుద్ధకాండలో |
| ప్రపితామహః | | బ్రహ్మదేవుడు రాముడిని ఈవిధముగనే స్తుతించెను) |
| తే+సహస్ర కృత్వః+ | = | నీకు వేలకొలది మార్లు నమస్కారము నీకు |
| నమః+నమః+అస్తు+ | | మరల మరల కూడ నమస్కారములు. |
| తే+పునః+చ+భూయః+ | | |
| అపి+నమః+నమః | | |

| | | |
|---|---|---|
| సర్వః+పురస్తాత్+నమః+ | = | సర్వస్వరూపుడవగు ఓ శ్రీకృష్ణా! నా ముందుగల |
| అథ+పృష్ఠతః+తే+ | | నీకు నమస్కారము ఆ తర్వాత వెనుకగల నీకు |
| నమః+సర్వతః+ఏవ+ | | నమస్కారము సర్వదిక్కుల గల నీకు నమస్కారము |
| తే+అస్తు | | |
| అనంతవీర్య+ | = | అనంతమైన వీర్యము గలవాడా! నీవు |
| అమితవిక్రమః+త్వమ్+ | | సర్వ స్థావరజంగములు సమస్త జగత్తును |
| సర్వమ్+సమాప్నోషి+ | | వ్యాపించియున్నావు. |
| తతః+సర్వః+అసి | | |
| హేకృష్ణ | = | ఓ శ్రీ కృష్ణా! |
| తవ+ఇదమ్+ | | నీ యొక్క ఈ మహిమను తెలియనట్టి |
| మహిమానమ్+అజానతా + | | నా చేత |
| మయా | | |
| ప్రమాదాత్+వా+ | = | అజ్ఞానమువలన లేదా ప్రేమతో |
| ప్రణయేన+అపి+ | | స్నేహితుడవు అని తలచి అనుకోకుండా |
| సఖా+ఇతి+మత్వా+ | | ఓ యాదవా! ఓ స్నేహితుడా! అని |
| ప్రసభమ్+హేయాదవ+ | | |
| హే సఖే+ఇతి | | |
| యత్+ఉక్తమ్ | = | ఏది పలుకబడినదో దానిని క్షమింపుము. |
| అచ్యుత | = | ఓ శ్రీ కృష్ణా! |
| అప్రమేయమ్+ | = | అప్రమేయుడవయిన నిన్ను నేను |
| త్వామ్+అహమ్+ | | విహారములందు పడుకునే సమయములందు |
| విహారశయ్యాసనభోజనేషు | | కూర్చున్న సమయమున, భోజనము చేయు |
| +చ | | సమయమున, మఱియు |

| | | |
|---|---|---|
| ఏకః+అథ+వా+ | = | ఒంటరిగా ఉన్నప్పుడుగాని లేదా |
| తత్+సమక్షమ్+అపి | | పలువురి సమక్షమునందు ఉన్నప్పుడు కూడా |
| యత్+అపహాసార్థమ్+ | = | ఏ వాక్యమును అపహాస్యము కొఱకు |
| అసత్కృతః+అసి+ | | పలుకుటచే నీవు తిరస్కరింపబడని వాడవు |
| తత్+క్షామయే | | అయినచో ఆ తెలియక చేసిన తప్పును క్షమింపమని వేడుకొనుచున్నాను. |
| అప్రతిమ ప్రభావ | = | సాటిలేని ప్రభావముగల ఓ శ్రీ కృష్ణా! |
| త్వమ్+అస్య+ | = | నీవు ఈ స్థావర జంగమ విశ్వమునకు |
| చరాచరస్య+లోకస్య+ | | తండ్రివంటి వాడవు. పూజనీయుడవు |
| పితా+చ+పూజ్యః+ | | శ్రేష్ఠుడైన గురువు అనగా జగద్గురువువు. |
| గరీయాన్+గురుః+అస్తు | | |
| లోకత్రయే+అపి+సమః+ | = | మూడు లోకములయందు కూడ-నీతో |
| న+అస్తు+త్వత్+అన్యః+ | | సమానుడు లేడు. అటువంటప్పుడు |
| అభి అధికః+కుతః(అస్తు) | | నీ కంటె యింకొకడు గొప్పవాడు ఎవడున్నాడు |
| తస్మాత్+దేవ+పుత్రస్య+ | = | అందువలన -నిన్ను పరిహాసముగా పలికిన |
| పితా+ఇవ+సఖ్యుః+ | | పలుకులను ఓ శ్రీ కృష్ణా! కుమారుని యొక్క |
| సఖా+ ఇవ | | మాటలను తండ్రివలె, స్నేహితుని యొక్క మాటలను స్నేహితునివలె, |
| ప్రియాయాః+ప్రియః+ | = | కోపముతోనున్న ప్రియురాలి మాటలను |
| సోఢుమ్+అర్హసి | | ప్రియునివలె నామాటలను సహించుటకు తగుదువు. అనగా తప్పులను క్షమింపుము |
| అహమ్+కాయమ్+ | = | నేను సాష్టాంగ నమస్కారము చేసి జగత్ |
| ప్రణిధాయ+ప్రణమ్య+ | | నియామకుడవయిన, స్తుతింపదగిన వాడవయిన |
| ఈశమ్+ఈడ్యమ్ | | |

| | | |
|---|---|---|
| త్వామ్+ప్రసాదయే | = | నిన్ను అనుగ్రహింప వేడుకొనుచున్నాను |
| జగన్నివాస | = | ఓ శ్రీ కృష్ణా! |
| దేవేశ+మే+మనః+ అదృష్ట పూర్వమ్+దృష్ట్వా | = | ఓ దేవేశ! నా యొక్క మనస్సు ఇంతకు పూర్వము ఎన్నడు చూడని ఇట్టి విరాట్ రూపమును చూచి |
| హృషితః+అస్మి+చ+ ప్రవ్యథితమ్ | = | ఆనందంతో ఉప్పొంగిన వాడను అయితిని మఱియు నా మనస్సు భయముచే మిక్కిలి పీడింపబడినది. |
| దేవ+మే+తత్+ రూపమ్+ఏవ+దర్శయ+ ప్రసీద | = | ఓ శ్రీ కృష్ణా! నాకు ఆ పూర్వపు రూపమునే చూపుము. మఱియు నన్ను అనుగ్రహింపుము. |
| విశ్వమూర్తే | = | ఓ శ్రీ కృష్ణా |
| సహస్రబాహో+తథా+ | | అనంత బాహువులు గల పరమాత్మా! |
| ఏవ+కిరీటినమ్+ | | పూర్వమువలె తలపై కిరీటమును |
| చక్రహస్తమ్+ | | కుడిచేతిలో సుదర్శన చక్రమును |
| గదినమ్+ఏవ | | ఎడమచేతిలో గదను ధరించి |
| తేన+చతుర్భుజేన+ రూపేణ+భవ+త్వామ్+ అహమ్+ద్రష్టుమ్+ ఇచ్ఛామి | = | ఆ చతుర్భుజములతో ఒప్పారు రూపముతో నాకు తెలిసిన శ్రీ కృష్ణరూపధారివి కమ్ము నిన్ను నేను ఆ విధముగా చూచుటకు కోరుచున్నాను |

...... ❖ ❖ ❖ ......

శ్రీ భగవానువాచ

**మయా ప్రసన్నేన తవార్జునేదం**
**రూపం పరం దర్శిత మాత్మయోగాత్ ।**

**తేజోమయం విశ్వమనన్త మాద్యం**

**యన్మే త్వదన్యేవ న దృష్ట పూర్వమ్ ॥ 47**

మయా–ప్రసన్నేన–తవ–అర్జున–ఇదమ్–రూపమ్–పరమ్–దర్శితమ్

ఆత్మయోగాత్–తేజోమయమ్–విశ్వమ్–అనన్తమ్–ఆద్యమ్–యత్

మే–త్వదన్యేవ–న–దృష్టపూర్వమ్

**న వేద యజ్ఞా ధ్యయనైర్న దానైః।**

**న చ క్రియాభిర్న తపోభి రుగ్రైః ।**

**ఏవం రూపః శక్య అహం నృలోకే ।**

**ద్రష్టుం త్వదన్యేన కురు ప్రవీర ॥ 48**

న–వేద–యజ్ఞాధ్యయనైః–న–దానైః–న–చ–క్రియాభిః–న–తపోభిః–ఉగ్రైః

ఏవమ్–రూపమ్–శక్యః–అహమ్–నృలోకే–ద్రష్టుమ్–త్వతః–అన్యేన–కురుప్రవీర

**మా తే వ్యథా మా చ విమూఢ భావో**

**దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్ ।**

**వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం ।**

**తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥ 49**

మా–తే–వ్యథా–మా–చ–విమూఢభావః–దృష్ట్వా–రూపమ్–ఘోరమ్–

ఈదృక్–మమ–ఇదమ్–వ్యపేతభీః–ప్రీతమనాః–పునః–త్వమ్–తత్–ఏవ–మే

రూపమ్–ఇదమ్–ప్రపశ్య

అర్జున+మే+యత్+ = ఓ అర్జునా! నా యొక్క ఏ రూపము

తేజోమయమ్+విశ్వమ్+ = తేజోమయమైనదో, విశ్వరూపమైనదో

అనంతమ్+ఆద్యమ్+ అనంతమైనది అయినదో సృష్ట్యాదియందున్నదో

ఇదమ్+పరమ్+రూపమ్ ఆ ఈ ఉత్కృష్టమయిన రూపమును

| | | |
|---|---|---|
| మయా+ఆత్మయోగాత్+ | = | నా చేత, నా మహిమ వలన నీ యొక్క పూర్వజన్మ |
| తవ+ప్రసన్నేన+ | | సంస్కారమువలన, నేను ప్రసన్నుడనగుటచేత |
| దర్శితమ్+త్వత్+ | | ఈ విశ్వరూపము చూపింపబడెను. ఈ రూపము |
| అన్యేన+పూర్వమ్+ | | ఇంతవఱకు నీకు గల యోగ్యతలు లేని ఇతరులకు |
| న+దృష్ట | | పూర్వము చూపబడలేదు |
| కురుప్రవీర | = | ఓ అర్జునా! కామ్యకర్మపరులు చేయు |
| యజ్ఞ+అధ్యయనైః+ | = | యజ్ఞముల చేత, వేద అధ్యయనముల చేత |
| న+వేద+దానైః+న | | విరాట్ రూపమువలన తెలియలేరు దానముల చేత |
| చ+క్రియాభిః+న | | విరాట్ రూపమును తెలియలేరు. మఱియు |
| | | పుణ్య కర్మానుష్ఠానములచేత విరాట్ రూపమును |
| | | తెలియలేరు |
| ఉగ్రైః+తపోభిః+న | = | రజోగుణయుతమైన ఉగ్రతపస్సు చేత విరాట్ |
| | | రూపమును తెలియలేరు |
| నృలోకే+త్వతః+అన్యేన+ | = | భూలోకమునందు వీర, శౌర్య, బలపరాక్రములనే |
| ఏవమ్+రూపమ్+ | | ఇతర పద్ధతులచే ఇట్టి విరాట్ రూపమును |
| ద్రష్టుమ్+న+శక్యః | | చూచుటకు శక్యముకాదు. అనగా బాహ్య |
| | | చక్షువులచే, ఏ సాధన పద్ధతి చేత దర్శింపలేరు. |
| | | నీ యోగ్యతనుబట్టి నీకు దర్శనీయమైనది |
| ఈదృక్+ఘోరమ్+ | = | ఇట్టి భయంకరమైన నా యొక్క ఈ లోక |
| మమ+ఇదమ్+రూపమ్+ | | సంహారమైన రూపమును చూచి వ్యథ చెందకుము. |
| దృష్ట్వా+మా+వ్యథా | | భయపడకుము |
| చ+మా+విమూఢభావః | = | మఱియు అజ్ఞాన భావమును పొందకుము |
| తే+పునః+త్వమ్+ | = | నీవు మఱల నీకు భయము గలిగించనిదియు |
| వ్యపేతభీః+ప్రీతమనాః+ | | మనస్సుకు ఆనందము గలిగించునదియు అగు |
| తత్+మే+ఇదమ్+ | | ఆ నా యొక్క చతుర్భుజములుగల |
| రూపమ్+ఏవ+ప్రపశ్య | | ఈ శ్రీ కృష్ణ రూపమునే చూడుము |

...... ❖ ❖ ❖ ......

సంజయ ఉవాచ

**ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా**
**స్వకం రూపం దర్శయామాస భూయః ।**
**ఆశ్వాసయామాస చ భీతమేనం**
**భూత్వా పునః సౌమ్య వపుర్మహాత్మా ॥ 50**

ఇతి–అర్జునమ్–వాసుదేవః–తథా–ఉక్త్వా–స్వకమ్–రూపమ్–దర్శయామాస–భూయః
ఆశ్వాసయామాస–చ–భీతమ్–ఏనమ్–భూత్వా–పునః–సౌమ్య–వపుః–మహాత్మా

| | | |
|---|---|---|
| వాసుదేవః+అర్జునమ్+ | = | శ్రీ కృష్ణుడు అర్జునునితో |
| తథా+ఉక్త్వా | | ఆ విధముగా పలికి |
| భూయః+స్వకమ్+ | = | మఱల రూపమును (శ్రీ కృష్ణ రూపమును) |
| రూపమ్+దర్శయామాస+ | | స్వకీయమైన పూర్వరూపమును చూపెను |
| చ | | మఱియు |
| మహాత్మా+సౌమ్యవపుః+ | = | శ్రీకృష్ణుడు శాంతస్వరూపము గలవాడై |
| భూత్వా | | |
| భీతమ్+ఏనమ్+పునః+ | = | భయపడిన అర్జునుని మఱల ఓదార్చెను |
| ఆశ్వాసయామాస+ఇతి | | |

...... ❖ ❖ ❖ ......

అర్జున ఉవాచ:

**దృష్ట్వేదం మానుషం రూపం । తవ సౌమ్యం జనార్దన ।**
**ఇదానీమస్మి సంవృత్తః । సచేతాః ప్రకృతిం గతః ॥ 51**

దృష్ట్వా – ఇదమ్ – మానుషమ్ – రూపమ్ – తవ – సౌమ్యమ్ – జనార్దన
ఇదానీమ్ – అస్మి – సంవృత్తః – సచేతాః – ప్రకృతిమ్ – గతః

| | | |
|---|---|---|
| జనార్ధన | = | ఓ శ్రీకృష్ణా! |
| ఇదానీమ్+తవ+ఇదమ్+ సౌమ్యమ్+మానుషమ్+ రూపమ్+దృష్ట్వా | = | ఇప్పుడు నేను నీ యొక్క ఈ సుకుమారమైన సౌమ్యమైన మానవ రూపమును చూచి |
| సచేతాః+సంవృత్తః+ ప్రకృతిమ్+గతః+అస్మి | = | (చైతన్యముతో కూడిన వాడను) చిత్తప్రశాంతత గలవాడను భయరహితుడనైనవాడను, స్వస్థత బొందినవాడను, విరాట్స్వరూపమును దర్శించని కాలమున గల నా పూర్వ స్వభావమును పొందిన వాడనైతిని |

...... ❖ ❖ ❖ ......

శ్రీ భగవానువాచ

**సుదుర్దర్శమిదం రూపం । దృష్ట వానసి యన్మమ ।**
**దేవా అప్యస్య రూపస్య । నిత్యం దర్శనకాంక్షిణః ॥ 52**

సుదుర్దర్శమ్ - ఇదమ్ - రూపమ్ - దృష్టవాన్ - అసి - యత్ - మమ
దేవాః - అపి - అస్య - రూపస్య - నిత్యమ్ - దర్శన - కాంక్షిణః

**నాహం వేదైర్న తపసా । న దానేన న చేజ్యయా ।**
**శక్య ఏవం విధో ద్రష్టుమ్ । దృష్ట వానసి మాం యథా ॥ 53**

న - అహమ్ - వేదైః - న - తపసా - న - దానేన - న -చ- ఇజ్యయా
శక్యః - ఏవమ్ - విధః - ద్రష్టుమ్ - దృష్టవాన్ - అసి - మామ్ - యథా

**భక్త్యా త్వనన్యయా శక్య । అహమేవం విధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన । ప్రవేష్టుం చ పరన్తప ॥ 54**

భక్త్యా - తు - అనన్యయా - శక్యః - అహమ్ - ఏవమ్ - విధః - అర్జున
జ్ఞాతుమ్ - ద్రష్టుమ్ - చ - తత్త్వేన - ప్రవేష్టుమ్ - చ - పరన్తప

**మత్కర్మకృన్మత్పరమో । మద్భక్తః సంగ వర్జితః ।**
**నిర్వైరస్సర్వభూతేషు । యస్స మామేతి పాణ్డవ ॥ 55**

మత్కర్మకృత్ – మత్పరమః – మద్భక్తః – సంగ వర్జితః
నిర్వైరః – సర్వ భూతేషు – యః – సః – మామ్ – ఏతి – పాణ్డవ

| | | |
|---|---|---|
| యత్+మమ+ఇదమ్+ | = | ఏ నా యొక్క ఈ చూడశక్యముగాని రూపమును |
| సుదుర్దర్శమ్+రూపమ్+ | | అనగా విరాట్‌రూపమును చూచినవాడవైతివో |
| దృష్టవాన్+అసి | | |
| అస్య+రూపస్య+దర్శన+ | = | అట్టి రూపము యొక్క నీ దర్శనము దేవతలు |
| దేవాః+అపి+నిత్యమ్+ | | కూడ నిత్యము చూడగోరుదురు |
| కాంక్షిణః | | |
| యథా+మామ్+ | = | ఏ విధముగా |
| దృష్టవాన్+అసి+ | = | నన్ను |
| ఏవమ్+విధః+అహమ్+ | = | చూచినవాడవైతివో ఈవిధమైన రూపము |
| వేదైః+ద్రష్టుమ్+న(శక్యః) | | ధరించిన నేను వేదాధ్యయనముచేత చూచుటకు శక్యము కాను |
| తపసా+న (శక్యః)+ | = | రజోగుణముతోకూడిన తపస్సుచేతను శక్యముకాను |
| దానేన+న+ఇజ్యయా+ | | దానముల చేతను శక్యముకాను, యజ్ఞముల చేతను |
| న+శక్యః | | శక్యము కాను |
| అర్జున+పరంతప | = | ఓ అర్జునా! |
| అనన్యయా+భక్త్యా+చ+ | = | అనన్య భక్తి చేత మఱియు నిశ్చలసమాధి |
| తు | | యోగము చేత దర్శనీయుడను |
| ఏవమ్+విధః+అహమ్+ | = | ఈ రూపము ధరించిన నేను |
| తత్త్వేన+జ్ఞాతుమ్+చ+ | | తత్త్వరీత్యా జ్ఞానచక్షువులచే గ్రహించుటకు |
| ద్రష్టుమ్+శక్యః+పరన్తప+ | | చూచుటకు శక్యమైనవాడను సత్పురుషులు నాలో |

| | | |
|---|---|---|
| ప్రవేష్టుమ్ | | అనగా ఆత్మలో ప్రవేశించుటకు శక్యము |
| పాండవ | = | ఓ అర్జునా! |
| మత్కర్మకృత్+మత్పరమః | = | నా గుఱించి పుణ్యకర్మ చేయువాడును, నేనే ఉత్తమ గతియని భావించినవాడును |
| సంగవర్జితః | = | సంసార తాపత్రయములను వదలిన వాడును |
| సర్వ భూతేషు+నిర్వైరః+ | = | సర్వ భూతముల యందు సమభావనగలవాడును |
| మద్భక్తః | | వైరము లేనివాడును మద్భక్తుడును అయినవాడు |
| యః+సః+మామ్+ | = | ఎవడో అతడు నన్ను పొందుచున్నాడు |
| ఏతి | | |

...... ❖ ❖ ❖ ......



# భీష్మ పర్వము 36వ అధ్యాయము

## (భక్తియోగము)

అర్జున ఉవాచ

భక్తులు, యోగులలో ఎవరు శ్రేష్ఠులు?

**ఏవం సతతయుక్తా యే । భక్తాస్త్వాం పర్యుపాసతే ।**

**యే చాప్యక్షరమవ్యక్తం । తేషాం కే యోగవిత్తమాః ॥ 1**

ఏవమ్ – సతతయుక్తాః – యే – భక్తాః – త్వామ్ – పర్యుపాసతే

యే – చ – అపి– అక్షరమ్ – అవ్యక్తమ్ –తేషామ్ –కే –యోగవిత్తమాః

| | | |
|---|---|---|
| ఏవమ్+సతతయుక్తాః+ యే+భక్తాః+త్వామ్+ పర్యుపాసతే | = | ఈ విధముగా ఏ భక్తులు నిన్ను సాకారరూపమున ఉపాసించుచున్నారో |
| యే+అవ్యక్తమ్+చ+ అక్షరమ్+అపి | = | ఎవరు అవ్యక్తమైనదియు, అక్షరమైనదియు అయిన ఆత్మను యోగపద్ధతిలో ఉపాసించు చున్నారో |
| తేషామ్+కే + యోగవిత్తమాః | = | వారిరువురిలో ఎవరు యోగశ్రేష్ఠులు? |

...... ❖ ❖ ❖ ......

శ్రీ భగవానువాచ

**మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।**

**శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః ॥ 2**

మయి – ఆవేశ్య – మనః – యే – మామ్ – నిత్యయుక్తాః – ఉపాసతే,
శ్రద్ధయా – పరయా – ఉపేతాః – తే – మే – యుక్తతమాః – మతాః

**యే త్వక్షర మనిర్దేశ్య । మవ్యక్తం పర్యుపాసతే, ।**
**సర్వత్రగమ చిన్త్యం । కూటస్థమచలం ధ్రువమ్ ॥ 3**

యే – తు – అక్షరమ్ – అనిర్దేశ్యమ్ – అవ్యక్తమ్ – పర్యుపాసతే
సర్వత్రగమ్ – అచింత్యమ్ – చ – కూటస్థమ్ – అచలమ్ – ధ్రువమ్.

**సంనియమ్యేన్ద్రియ గ్రామం । సర్వత్ర సమబుద్ధయః ।**
**తే ప్రాప్నువన్తి మామేవ । సర్వభూతహితే రతాః ॥ 4**

సంనియమ్య – ఇంద్రియ గ్రామమ్ – సర్వత్ర – సమబుద్ధయః
తే – ప్రాప్నువన్తి – మామ్ – ఏవ – సర్వభూత హితే – రతాః

**క్లేశోఽధికతరస్తేషామ్ । అవ్యక్తాసక్తచేతసామ్ ।**
**అవ్యక్తా హి గతిర్దుఃఖం । దేహవద్భిరవాప్యతే ॥ 5**

క్లేశః– అధిక తరః – తేషామ్ – అవ్యక్తాసక్త–చేతసామ్
అవ్యక్తా – హి – గతిః – దుఃఖమ్ – దేహవద్భిః – అవాప్యతే

**యేతు సర్వాణి కర్మాణి । మయి సన్న్యస్య మత్పరాః ।**
**అనన్యేనైవ యోగేన । మాం ధ్యాయన్త ఉపాసతే ॥ 6**

యే – తు – సర్వాణి – కర్మాణి – మయి – సన్న్యస్య – మత్పరాః
అనన్యేన – ఏవ – యోగేన – మామ్ – ధ్యాయన్తః – ఉపాసతే.

**తేషామహం సముద్ధర్తా । మృత్యు సంసార సాగరాత్ ।**
**భవామి నచిరాత్పార్థ । మయ్యావేశితచేతసామ్ ॥ 7**

తేషామ్ – అహమ్ – సముద్ధర్తా – మృత్యు సంసార సాగరాత్
భవామి – నచిరాత్ – పార్థ – మయి – ఆవేశిత – చేతసామ్.

**మయ్యేవ మన ఆధత్స్వ । మయి బుద్ధిం నివేశయ ।**
**నివసిష్యసి మయ్యేవ । అత ఊర్ధ్వం న సంశయః ॥ 8**

మయి – ఏవ – మనః – ఆధత్స్వ – మయి – బుద్ధిమ్ – నివేశయ,
నివసిష్యసి – మయి – ఏవ – అతః – ఊర్ధ్వమ్ – న – సంశయః

**అథ చిత్తం సమాధాతుం । న శక్నోషి మయి స్థిరమ్ ।**
**అభ్యాసయోగేన తతో । మామిచ్ఛాప్తుం ధనంజయ ॥ 9**

అథ – చిత్తమ్ – సమాధాతుమ్ – న – శక్నోషి – మయి – స్థిరమ్,
అభ్యాస యోగేన – తతః – మామ్ – ఇచ్ఛ – ఆప్తుమ్ – ధనంజయ

**అభ్యాసేప్యసమర్థోఽసి । మత్కర్మపరమో భవ ।**
**మదర్థమపి కర్మాణి । కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥ 10**

అభ్యాసే – అసి – అసమర్థః – అసి – మత్కర్మ – పరమః – భవ,
మదర్థమ్ – అపి – కర్మాణి – కుర్వన్ – సిద్ధిమ్ – అవాప్స్యసి.

**అథైతదప్యశక్తోఽసి । కర్తుం మద్యోగమాశ్రితః ।**
**సర్వ కర్మ ఫలత్యాగం । తతః కురు యతాత్మవాన్ ॥ 11**

అథ–ఏతత్ – అపి – అశక్తః – అసి – కర్తుమ్ – మత్‌యోగమ్ – ఆశ్రితః
సర్వకర్మఫలత్యాగమ్ – తతః – కురు – యతాత్మవాన్

**శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ । జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।**
**ధ్యానాత్కర్మ ఫలత్యాగః । త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్ ॥ 12**

శ్రేయః – హి – జ్ఞానమ్ – అభ్యాసాత్ – జ్ఞానాత్– ధ్యానమ్ విశిష్యతే, ధ్యానాత్ – కర్మ ఫలత్యాగః – త్యాగాత్ – శాన్తిః – అనన్తరమ్.

| | | |
|---|---|---|
| యే+మయి+ | = | ఎవరు నా యందు మనస్సును ఉంచి |
| మనః+ఆవేశ్య+మామ్ | | నన్ను |
| శ్రద్ధయా+పరయా+ | = | మిక్కిలి శ్రద్ధతో కూడినవారై నిత్యము |
| ఉపేతాః+నిత్యయుక్తాః+ | | ఉపాసించుచున్నారో వారు ఉత్తములని, |
| ఉపాసతే+తే+ | | శ్రేష్ఠులని నా అభిప్రాయము |
| యుక్తతమాః+మే+మతాః | | |
| యే+తు+ | = | ఎవరు యోగపద్ధతిలో ఇంద్రియముల |
| ఇంద్రియగ్రామమ్+ | | సమూహమును, ప్రాణమును నిగ్రహించి |
| సన్నియమ్య | | |
| సర్వత్ర+సమబుద్ధయః+ | = | సర్వప్రాణులయందు సమబుద్ధి గలిగియున్నవారలై |
| సర్వభూతహితే+రతాః | | సర్వభూతములకు హితము చేయుటయందు ఆసక్తిగలవారలై |
| అనిర్దేశ్యమ్ | = | ఇట్టి ఇట్టి రూపము గలదని నిర్ణయము లేనిదియు అనగా ఏ రూపము కావాలనుకుంటే ఆ రూపమును ధరించగలదియు |
| అవ్యక్తమ్ | = | బాహ్యచక్షువులకు గోచరము కానిదియు |
| సర్వత్రగమ్ | = | సర్వత్రా వ్యాపించియున్నదియు |
| అచింత్యమ్+చ | = | మనోబుద్ధులచే చింతింప శక్యము గానిదియు |
| అచలమ్ | = | చలింపనదియు అనగా దేశకాలాతీతమై నిశ్చలముగా ఉండునదియు |
| ధ్రువమ్+ | = | నిత్యమైనదియు, శాశ్వతమైనదియు |

| | | |
|---|---|---|
| కూటస్థమ్+ పర్యుపాసతే+తే మామ్+ఏవ+ప్రాప్నువంతి | = | దేహములో జీవరూపమున ఉన్నదియు అయిన ఆత్మను ఉపాసించుచున్నారో, వారు అనగా అట్టి యోగులు నన్నే అనగా ఆత్మనే పొందుచున్నారు. |
| తేషామ్+అవ్యక్త+ఆసక్త+ చేతసామ్+క్లేశఃఅధికతరః | = | ఆ అవ్యక్తమయిన ఆత్మయందాసక్తమయిన చిత్తముగల వారలకు కష్టము మిక్కిలి ఎక్కువ |
| దేహవద్భిః+హి+ అవ్యక్తా+గతిః+ దుఃఖమ్+అవాప్యతే | = | దేహాభిమానముగల వారిచేత అరిషడ్వర్గములను ఇంద్రియాదులు నిగ్రహింపలేని వారిచేత ఓంకారోపాసన ద్వారా ఆత్మను చేరు విధానము |
| | = | అతి ప్రయాసతో పొందబడుచున్నది. దీనికి ఉదాహరణగా రామాయణములో శతానందుడు విశ్వామిత్రుని కథను, అతడు బ్రహ్మర్షి అయిన విధానమును వర్ణించును. |
| పార్థ | = | ఓ అర్జునా! |
| మత్పరాః+యే+సర్వాణి+ కర్మాణి+మయి+సన్న్యస్య | = | నన్నే పరమగతిగా తలంచినవారలయి ఎవరు సర్వకర్మలను నా యందు సమర్పించి |
| తు+మామ్+ఉపాసతే | = | భక్తిచేతగాని నన్ను ఉపాసించుచున్నారో |
| అనన్యేన+ఏవ+ యోగేన+ధ్యాయంతః | = | ఆత్మను తప్ప యితరమయిన దేనిని చింతింపని యోగముచేత ధ్యానించుచున్నారో |
| మయి+ ఆవేశిత చేతసామ్+ తేషామ్ | = | నా యందు ఉంచబడిన చిత్తము గలిగిన వారలకు |
| అహమ్+ మృత్యుసంసారసాగరాత్+ నచిరాత్+సముద్ధర్తా+భవామి | = | నేను మృత్యురూపమయిన సంసారసాగరమునుండి శీఘ్రముగా ఉద్ధరించువాడను అగుచున్నాను |

| | | |
|---|---|---|
| మయ + ఏవ<br>మనః+ఆధత్స్వ | = | నా యందే నీ మనస్సును<br>స్థిరముగా ఉంచుము |
| మయి+బుద్ధిమ్+నివేశయ | = | నాయందు బుద్ధిని ఉంచుము |
| అతః+ఊర్ధ్వమ్+మయి+<br>ఏవ+నివసిష్యసి+<br>న + సంశయః | = | అటు పిమ్మట నా యందే నివసించగలవు<br>యీ విషయములో ఎట్టి సంశయమును లేదు. |
| ధనంజయ | = | ఓ అర్జునా! |
| అథ+మయ+చిత్తమ్+<br>స్థిరమ్+సమాధాతుమ్+<br>న+శక్నోషి | = | అటు పిమ్మట నా యందు చిత్తమును<br>స్థిరముగా ఉంచుటకు సమర్థుడవు కానిచో |
| తతః+అభ్యాసయోగేన+<br>మామ్+ఆప్తుమ్+ఇచ్ఛ | = | ఆ తర్వాత అభ్యాసముచే చిత్తమును స్థిరముగా<br>ఉంచుటకు ప్రయత్నించి నన్ను పొందుటకు<br>కోరుము |
| అభ్యాసే+అపి+<br>అసమర్థః+అసి+<br>మత్కర్మః+పరమః+భవ | = | అలా కూడా అభ్యాసము చేయుటకు<br>అసమర్థుడవైనచో, నా కంటె యితరము లేదని<br>నా సంబంధమైన పుణ్యకర్మాచరణ చేయుము |
| మదర్థమ్+కర్మాణి+<br>కుర్వన్+అపి+సిద్ధిమ్+<br>అవాప్స్యసి | = | నా కొఱకై పుణ్యకర్మలను చేయుచున్నవాడవు<br>అయ్యును, సిద్ధిని అనగా ఆత్మస్థానమును<br>పొందగలవు |
| యతాత్మవాన్+<br>మద్యోగమ్+<br>ఆశ్రితః (సన్) | = | నియమింపబడిన చిత్తము గలవాడవై యోగమును<br>ఆశ్రయించినవాడవై యోగమును చేయుము |
| అథ+ఏతత్+అపి+<br>కర్తుమ్+అశక్తః+అసి | = | ఆ తర్వాత ఈ యోగసాధనను కూడ చేయుటకు<br>అసమర్థుడవు అయితివేని |

| | | |
|---|---|---|
| తతః+ సర్వకర్మఫలత్యాగమ్+ కురు | = | పిమ్మట అనగా ఆవిధముగా పుణ్యకర్మలు చేసిన పిమ్మట సర్వకర్మఫలత్యాగమును చేయుము |

యోగమును అభ్యాసము చేయుము. దానికి కూడ అసమర్థుడవయినచో పుణ్యకర్మలు చేయుము.

| | | |
|---|---|---|
| కర్మఫలత్యాగః+శ్రేయః | = | పుణ్యకర్మలు చేసి ఆ కర్మఫలత్యాగము శ్రేష్ఠమైనది |
| త్యాగాత్+హి | = | కర్మఫలత్యాగముకంటె యోగమును అభ్యసించుట శ్రేష్ఠమైనది |
| అభ్యాసాత్+ధ్యానమ్ | = | యోగమును అభ్యసించుటకంటె యోగములో ధ్యానము శ్రేష్ఠమైనది |
| ధ్యానాత్+జ్ఞానమ్ | = | ధ్యానముకంటె జ్ఞానము శ్రేష్ఠమైనది |
| జ్ఞానాత్+శాన్తిః+ విశిష్యతే+అనన్తరమ్ | = | జ్ఞానము వలన శాంతిని గలిగియుండుట శ్రేష్ఠమయినది. శాంతిని పొందిన పిమ్మట దేహమును వీడి ఆత్మయై విరాజిల్లుట శ్రేష్ఠమయినది |

...... ❖ ❖ ❖ ......

సాధనకు ఉండవలసిన లక్షణములు

**అద్వేష్టా సర్వభూతానాం । మైత్రః కరుణ ఏవ చ ।**
**నిర్మమో నిరహంకారః । సమదుఃఖ సుఖః క్షమీ ॥ 13**

అద్వేష్టా – సర్వ భూతానామ్ – మైత్రః – కరుణః – ఏవ – చ
నిర్మమః – నిరహంకారః – సమ దుఃఖ సుఖః – క్షమీ

**సంతుష్ట స్సతతం యోగీ । యతాత్మా దృఢ నిశ్చయః ।**
**మయ్యర్పిత మనోబుద్ధిః । యో మద్భక్తస్సమే ప్రియః ॥ 14**

సంతుష్టః – సతతమ్ – యోగీ – యతాత్మా – దృఢ నిశ్చయః,
మయి – అర్పిత–మనోబుద్ధిః – యః – మద్భక్తః – సః – మే – ప్రియః

**యస్మాన్నోద్విజతే లోకో । లోకాన్నోద్విజతే చ యః ।**
**హర్షామర్షభయోద్వేగైః । ముక్తోయస్స చ మే ప్రియః ॥ 15**

యస్మాత్ –న– ఉద్విజతే – లోకః – లోకాత్ –న– ఉద్విజతే –చ– యః
హర్షామర్షభయోద్వేగైః – ముక్తః – యః – సః – చ – మే – ప్రియః

**అనపేక్షశ్శుచిర్దక్షః । ఉదాసీనో గతవ్యథః ।**
**సర్వారమ్భ పరిత్యాగీ । యో మద్భక్తస్స మే ప్రియః ॥ 16**

అనపేక్షః–శుచిః – దక్షః – ఉదాసీనః – గతవ్యథః,
సర్వారమ్భ పరిత్యాగీ – యః – మత్భక్తః – సః – మే – ప్రియః.

**యో న హృష్యతి న ద్వేష్టి । న శోచతి న కాంక్షతి ।**
**శుభాశుభ పరిత్యాగీ । భక్తిమాన్ యస్స మే ప్రియః ॥ 17**

యః – న – హృష్యతి – న – ద్వేష్టి – న – శోచతి – న – కాంక్షతి,
శుభ అశుభ పరిత్యాగీ – భక్తిమాన్ – యః – సః – మే – ప్రియః

**సమశ్శత్రౌ చ మిత్రే చ । తథా మానావమానయోః ।**
**శీతోష్ణ సుఖ దుఃఖేషు । సమ స్సంగ వివర్జితః ॥ 18**

సమః – శత్రౌ –చ– మిత్రే –చ– తథా – మానావమానయోః,
శీతోష్ణ సుఖ దుఃఖేషు – సమః – సంగ వివర్జితః.

**తుల్య నిందా స్తుతి ర్మౌనీ । సంతుష్టో యేన కేనచిత్।**
**అనికేతః స్థిరమతిః । భక్తిమాన్ మే ప్రియో నరః ॥ 19**

తుల్య నిందా స్తుతిః – మౌనీ – సంతుష్టః – యేన – కేనచిత్,
అనికేతః – స్థిర మతిః – భక్తి మాన్ – మే – ప్రియః – నరః.

**యేతు ధర్మ్యామృత మిదం । యథోక్తం పర్యుపాసతే ।**
**శ్రద్ధధానా మత్పరమా । భక్తస్తేఽ తీవ మే ప్రియాః ॥ 20**

యే–తు – ధర్మ్యామృతమ్ – ఇదమ్ – యథా – ఉక్తమ్ – పర్యుపాసతే
శ్రద్ధధానాః – మత్పరమాః – భక్తాః – తే – అతీవ – మే – ప్రియాః.

| | | |
|---|---|---|
| సర్వభూతానామ్ | = | సమస్తప్రాణులకు |
| అద్వేష్టా | = | ద్వేషి గానివాడును |
| మైత్రః | = | సర్వ భూతములకు మిత్రుడును |
| . కరుణః + ఏవ | = | సర్వ భూతములయందు కరుణ గలవాడు |
| . నిర్మమః + చ | = | మమకారము లేనివాడు మఱియు |
| . నిరహంకారః | = | అహంకారము లేనివాడు |
| . సమ దుఃఖ సుఖమ్+ క్షమీ | = | సుఖమునందు దుఃఖము నందు సమభావన గలవాడు, క్షమ గలవాడును |
| . సతతమ్+సంతుష్టః | = | ఎల్లప్పుడును సంతోషమును బొందినవాడును, అనగా నిత్యసంతోషుడును |
| . దృఢ నిశ్చయః | = | దృఢనిశ్చయము గలిగినవాడును |
| యతాత్మా+యోగీ | = | ఆత్మనిగ్రహముగల యోగియును |
| మయి+అర్పిత+ మనోబుద్ధిః | = | నా యందు ఉంచబడిన మనస్సు, బుద్ధి గలవాడును |
| యః+సః+మత్+ భక్తః+మే+ప్రియః | = | ఎవడో వాడు నా భక్తుడు, వాడు నాకు యిష్టుడు |

| | | |
|---|---|---|
| యస్మాత్+లోకః+న+ ఉద్విజతే+చ | = | ఎవని వలన లోకము భయమును పొందదో |
| లోకాత్+న+ఉద్విజతే+చ | = | ఎవడు లోకముల వలన భయపడడో |
| యః+హర్ష అమర్ష భయ+చ+ ఉద్వేగైః ముక్తః+సః+ మే+ప్రియః | = | ఎవడు సంతోషము క్రోధము, భయము ఉద్వేగము అను వానితో విడువడి ఉన్నాడో అట్టివాడు నాకు ప్రియుడు. ఇష్టుడు. |
| అనపేక్షః+శుచిః+ దక్షః+ఉదాసీనః+ గతవ్యథః+ సర్వారమ్భ పరిత్యాగీ | = | ఆపేక్ష లేనివాడును పవిత్రుడును సమర్థుడును పక్షపాతరహితుడును వ్యథా భరిత హృదయుడు కానివాడును, సర్వ కార్యముల ఆరంభమును పరిత్యజించిన వాడును. |
| యః+సః+మద్భక్తః+ మే+ప్రియః | = | ఎవడో వాడు నా భక్తుడు వాడు నాకు ఇష్టుడు |
| యః | = | ఎవడు |
| న+హృష్యతి | = | జయము గలిగినప్పుడు సంతోషముతో ఉప్పొంగిపోడో |
| న+ద్వేష్టి | = | తనకు హాని గలిగించిన యితరులను ఎవడు ద్వేషింపడో కీడును, మేలును ఈశ్వరుని వలననే గలుగునని గ్రహించిన వాడు నహృష్యతి, నద్వేష్టి |
| న + శోచతి | = | ఎవడు నష్టము కష్టము గలిగినప్పుడు శోకమును పొందడో |
| న + కాంక్షతి | = | ఏదీ కావాలని కోరడో అనగా ఎవడు కోరికలు లేనివాడో |
| శుభాశుభ పరిత్యాగీ | = | శుభములు, అశుభములను పరిత్యజించినవాడు |
| యః+సః+మే+ప్రియః | = | ఎవడో అట్టివాడు నాకు ఇష్టుడు. |

| | | |
|---|---|---|
| శత్రౌ+చ+మిత్రే+సమః | = | శత్రువునందును మఱియు స్నేహితుని యందును సమభావన గలవాడును |
| తథా+మానావమానయోః | = | అటులనే గౌరవము, అగౌరవములందు సమ భావనగలవాడును |
| చ | = | మఱియు |
| శీతోష్ణ సుఖ దుఃఖేషు+ సమః | = | శీతము, ఉష్ణములందు, సుఖదుఃఖములందు సమభావన గలవాడును |
| సంగ వివర్జితః+ తుల్య నిందా స్తుతిః+ మౌనీ+యేన+కేనచిత్+ సంతుష్టః | = | సంగరహితుడును, నిందాస్తుతులందు సమభావన గలవాడు, ఇంద్రియ జయము గలవాడు, (వాక్ నియమము గలవాడును) ఏమాత్రము దొరికిన దానితోనైనను సంతృప్తిని బొందువాడును అనగా ప్రాప్తంబైన లేశంబుతో తృప్తి బొందువాడును |
| అనికేతః+స్థిరమతిః+ భక్తిమాన్+నరః+ మే + ప్రియః | = | గృహము, సంసార తాపత్రయము లేనివాడు స్థిరమయిన బుద్ధి గలవాడును భక్తి గలవాడును. నాకు ఇష్టుడు |
| యే+తు మత్పరమాః(సంతః)+ ఇదమ్+ధర్మ్యామృతమ్+ శ్రద్ధదానాః+యథా+ ఉక్తమ్ | = | ఎవరు నేనే పరమగతిగలవారలయి ఈ ధర్మ్యామృతమును శ్రద్ధావంతులై ఏవిధముగా నాచే చెప్పబడినదో దానిని ఆచరించుచూ |
| భక్తాః+పర్యుపాసతే+ తే+మే+అతీవ+ప్రియాః | = | భక్తులు నన్ను ఉపాసించుచున్నారో ఆ మానవులు నాకు మిక్కిలి ఇష్టులు |

**వ్యాఖ్యానము :- ఉండకూడని లక్షణములు: (తమోగుణ, రజోగుణములు)**

1. ద్వేషము, 2. మమకారము, 3. అహంకారము, 4. లోకమునకు ఉపద్రవము గలిగించుట, 5. లోకము వలన భయమును పొందుట, 6. క్రోధము, 7. భయము

8.ఉద్వేగము, 9.కోరికలు, 10.మనో మాలిన్యము, 11.వ్యధ, 12. సర్వకార్య ఆరంభత్వము, 13.శోకము, 14. ఇంద్రియార్థ సంగమము, 15.సంసార తాపత్రయము, 16. సంతోషముతో ఉప్పొంగుట.

**ఉండవలసినవి (సత్త్వగుణము) :**

1.మైత్రి, 2.కరుణ, 3.జాలి, 4.దయ, 5.ప్రేమ, 6. క్షమ, 7.నిత్య సంతోషము, 8.ఆత్మనిగ్రహము, 9.దృఢ నిశ్చయము, 10.పరమాత్మ యందు మనో బుద్ధులలో ఉంచుట, 11.కార్యనిర్వహణ దక్షత, 12.ఉదాసీనత, 13.ఇంద్రియ జయము, 14.మనో నిశ్చలత,

**ద్వంద్వాతీతస్థితి - సమభావన యుండవలయును (ఇవే గుణరహితము)**

1. సుఖదుఃఖముల యందు; 2. శుభాశుభములందు; 3. శత్రుమిత్రులయందు; 4. గౌరవము అగౌరవములందు; 5. నిందాస్తుతుల యందు; 6. శీతోష్ణముల యందు సమభావన కలిగి ఉండవలయును. దీనినే గుణ రహిత స్థితి అని అందురు. ఇదే జ్ఞానము. ఇతడే జీవన్ముక్తుడు. ఇతడే విదేహుడు. ప్రకృతివలన గలిగిన గుణములను వదలినవారు. వీరు ఆనందమయులు. వీరు ఆత్మయై విరాజిల్లుదురు.

సమ శత్రౌ చ మిత్రే చ అని చెప్పినాడు గదా అని రాజ్యపాలన చేయుచున్న రాజు అసమర్థుడుగా ఉండరాదు. దక్షుడై ఉండవలయును. దీనికి భాష్యముగా రామాయణములో జనకుని వృత్తాంతములో చెప్పబడినది. సీతను వివాహము చేసుకొనగోరి వచ్చిన రాజులు శివధనుస్సును ఎక్కుపెట్టలేక పోయిరి. అంత వారు మిథిలానగరమును ముట్టడించిరి. జనకుడు దేవతలు యిచ్చిన చతురంగబలములతో వారి నందఱిని ఓడించెను. కొంతకాలమునకు సాంకాస్య నగరమునుండి వీర్యవంతుడగు సుధన్వుడను రాజు మిథిలపై దండయాత్రకు వచ్చెను. యుద్ధరంగమున జనకుడు సుధన్వుని సంహరించి జనకుడు తన తమ్ముడయిన కుశధ్వజుని సాంకాస్య నగరమునకు పట్టాభిషిక్తుని గావించెను. సమ శత్రౌ చ మిత్రే చ అని చెప్పినది బ్రాహ్మణుడికి, మోక్షార్థికి అంతేతప్ప క్షత్రియునకు కాదు.

...... ❖ ❖ ❖ ......

## భీష్మ పర్వము 37వ అధ్యాయము క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము నుండి 42వ అధ్యాయము మోక్షసన్న్యాసయోగము వఱకు

# సమీక్ష

37వ అధ్యాయములో 34 శ్లోకములు, 38వ అధ్యాయములో 27 శ్లోకములు, 39వ అధ్యాయములో 20 శ్లోకములు, 40వ అధ్యాయములో 24 శ్లోకములు, 41వ అధ్యాయములో 28 శ్లోకములు, 42వ అధ్యాయములో 78 శ్లోకములు గలవు.

**కథాభాగము :**

అర్జునా! యుద్ధము చేయనని అహంకారముతో నీవు పలికిననూ, నీ స్వభావము నీచే యుద్ధము చేయించును. నీ స్వభావము ననుసరించి నీవు యుద్ధము చేయుదువు. కావున నీవు ఏవిధముగా చేయవలయునని భావించితే ఆవిధముగా చేయుము. జయము పాండవులదే.

**అర్జునుడి ప్రశ్నలు :**

**కథాభాగమునకు సంబంధించి లేవు.**

**ఆధ్యాత్మ భాగమునకు సంబంధించి**

**1) శాస్త్రము ననుసరించి చేయువారి శ్రద్ధయు, శాస్త్రవిధిని పాటించని వారియొక్క శ్రద్ధయు ఎటువంటిది?**

**2) మూడు గుణములనూ అధిగమించిన వాని లక్షణములు ఏమిటి? అతని ఆచారమేమి? ఎట్లు ఈ మూడు గుణములను అతడు అతిక్రమించును?**

**3) సన్న్యాసము, త్యాగములలోగల భేదమేమి?**

**ఆత్మ :**

**37వ అధ్యాయము :** అనాది, అవ్యయమ్, ఏకః, ఉపద్రష్ట, సాక్షి, పరమ్, అసక్తః , నిర్గుణః. స్వయంప్రకాశకుడు, సర్వయోగులకు మూలము. తమస్సుకు పరమైనవాడు, దూరస్థుడు, దగ్గరగా ఉన్నవాడు, సత్ కాదు, అసత్ కాదు, అవిభక్తుడు. సర్వేంద్రియ వివర్జితుడు అయినా సర్వవిషయములను గ్రహించును. ఇంద్రియములద్వారా గ్రహింప వీలులేనివాడు, కర్మలు చేయడు. కర్మఫలితమును గ్రహింపడు. పరమేశ్వరుడు, నాశరహితుడు.

**38వ అధ్యాయము :** అవ్యయమ్, పరమ్, బ్రహ్మణః, అమృతః, శాశ్వతః, ధర్మః, ఐకాంతికః, సుఖః, ఆశ్రయః.

**39వ అధ్యాయము :** అవ్యయః, పురుషః, ఆధ్యః, శాశ్వతః. ఆత్మ తేజస్సు సూర్యచంద్ర అగ్న్యాదియందుగల తేజస్సు అతడే. ఆత్మస్థానము, ఆత్మస్థానమును సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, అగ్ని, ప్రకాశింపచేయలేవు. ఆత్మ స్వయంప్రకాశకుడు. సర్వజగత్తును సూర్యుడు ప్రకాశింపచేయునట్లు ఆత్మ సర్వమును ప్రకాశింపచేయును. జ్ఞానులు జ్ఞాననేత్రముచే ఆత్మను దర్శింతురు. ఆత్మను దర్శించినవాడు మృత్యువును దాటును. సాకారముగా పురుషోత్తముడు. ఇతడు క్షరపురుషుడు, అక్షర పురుషులకంటె గొప్పవాడు.

**40-42వ అధ్యాయము :** చెప్పలేదు.

**అంతరాత్మ :**

**37వ అధ్యాయము :** సర్వవ్యాపకుడు. ప్రాణుల హృదయగుహలో ఉండును. సాక్షి. కర్మలను చేయడు. ఒక సూర్యుడు సమస్త జగత్తును ప్రకాశింపచేయునట్లు ఆత్మ ఒక్కటయ్యు సమస్తమును ప్రకాశింపచేయును. క్షేత్రజ్ఞుడు. సర్వక్షేత్రములందు కలడు. సర్వక్షేత్రముల గుఱించి తెలిసినవాడు. క్షేత్రజ్ఞునివలన దేహేంద్రియ మనోబుద్ధులు, దేహము, పనిచేయుచున్నవి.

**39వ అధ్యాయము :** అక్షరుడు. సాక్షి. అరూపుడు. సూక్ష్ముడు.

**విరాట్ :**

**37వ అధ్యాయము :** ఈ ప్రకృతిని ఆవరించి ఉండును. సర్వస్థావర జంగమములను సృజియించినవాడు, ధరించినవాడు, లయము చేయువాడు, భర్తా. భిన్నుడు, విభక్తుడు, సర్వజీవులు యితడే అగుటవలన అనేక శిరస్సులు, చెవులు, కన్నులు, ముఖము, చేతులు, పాదములు మొదలైన జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు గలవాడు. సర్వత్రా గల విరాట్‌పురుషుని దర్శించినవాడు పరమపదమును పొందును.

**38వ అధ్యాయము :** ప్రకృతి క్షేత్రము, యోని, తల్లి. పురుషుడు బీజము, వీర్యము, తండ్రి. సర్వమూ విరాట్‌వలన కలుగుచున్నవి.

**39వ అధ్యాయము :** స్మృతి, జ్ఞానము మొదలైన సర్వభావములు విరాట్‌వలననే కలుగుచున్నవి.

**42వ అధ్యాయము :** కర్మ. ఈశ్వరుడు సర్వభూతములను కలుపుచూ విడదీయుచూ జీవులను సుఖదుఃఖములందు త్రిప్పుచుండును.

**ప్రకృతి :**

**37వ అధ్యాయము :** కార్యాకారణములు ప్రకృతివి. ప్రకృతివలన దేహము, గుణములు గలిగి గుణములవలన కర్మలు జరుగుచున్నవి.

**దైవీసంపద** అనగా సత్త్వగుణము. సత్త్వగుణమునకు దైవీసంపద అని వ్యాసభగవానుడు పేరుపెట్టినాడు. ఆచార్యోపాసన, ఆర్జవము, అహింస, క్షాంతి, శౌచము, స్థైర్యము, పెద్దలను సేవించుట. అమానత్వము, అనహంకారము, అదంభిత్వము (దంభము లేకుండుట), మమత లేకుండుట, ఇష్టాయిష్టములు లేకుండుట, ప్రాపంచిక విషయములందు ఆసక్తి లేకుండుట, ధనేషణ, దారేషణ, పుత్రేషణ అనే ఈషణత్రయములు లేకుండుట.

**38వ అధ్యాయము :** ప్రకృతివలన గుణములు కలిగినవి. సత్త్వగుణము నిర్మలమైనది. బుద్ధిని ప్రకాశింపచేయునది. జ్ఞానమును కలుగచేయునది. స్వర్గాది సుఖములను కలుగచేయునది. ఈ గుణమువలన మనస్సు నిర్మలముగా ఉండును. సుఖాపేక్ష దేహిని బంధించుచున్నది. దేహత్యాగ సమయమున సత్త్వగుణము ఉన్న ఊర్ధ్వలోకప్రాప్తి, ఉత్తమ లోకములు కలుగును. తిరిగి భూలోకమున జన్మింపరు.

**40వ అధ్యాయము :** అభయము, శౌచము, సత్త్వసంశుద్ధి, జ్ఞానయోగ, వ్యవస్థిత, ఆర్జవము, దయ, మార్దవము, హ్రీ, తేజస్సు, క్షమ, ధృతి, త్యాగము, సత్యము, అపైశునము (చాడీలు చెప్పకుండుట), అహింస, బాహ్యేంద్రియ నిగ్రహము, అద్రోహము, న అతిమానిత (గొప్పవాడిననే భావన లేకుండుట), అక్రోధము (అరిషడ్వర్గములు లేకుండుట), అలోలుపత్వము (జిహ్వాచాపల్యము లేకుండుట), అచాపలం (స్థిరబుద్ధి) కలిగియుండుట. స్వాధ్యాయము, యజ్ఞము, దానము, తపస్సు మొదలైన పుణ్యకర్మలు వేదవిహితముగా చేయుచూ పుణ్యఫలితమును కోరరు. కావున వీరు భూలోకమున తిరిగి జన్మింపరు.

**అసురసంపద** అనగా రజోగుణము, తమోగుణము. తమోగుణము, రజోగుణములకు వ్యాసభగవానుడు అసురసంపద అని పేరుపెట్టినాడు.

**రజోగుణము:** (38వ అధ్యాయము) రాగాత్మకము. తృష్ణతో కూడియున్నది. పుణ్యకర్మాసక్తి కలిగించును. కోరికలు కలిగించును. గుణములు వృద్ధియగును. ఇహలోక, పరలోక సుఖాపేక్షవలన దేహి బద్ధుడగుచున్నాడు. దేహత్యాగ సమయమున ఈ గుణమువలన బ్రహ్మలోకప్రాప్తి పొందియూ పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున మానవునిగా జన్మించును.

(40వ అధ్యాయము) శాస్త్రవిధిని అనుసరించి పుణ్యకర్మలు చేసి పుణ్యఫలితమును కోరుదురు. పుణ్యలోకము చేరి పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మించెదరు.

**తమోగుణము =** (38వ అధ్యాయము) మోహము, మదము, మాత్సర్యములు ఇవి తమోగుణ లక్షణములు. తమోగుణము కలవారు సత్యమును గ్రహించలేరు. అజ్ఞానము, మరపు, ఏమఱుపాటు, ఆలస్యము, నిద్ర, మొండిపట్టుదల, మోహము కలిగియుందురు. మంచి, చెడుల జ్ఞానము ఉండదు. పాపకర్మలు చేయుదురు. వీరికి దుఃఖము ఫలము. మోహముచే ఈ గుణము దేహిని బంధించుచున్నది. దేహత్యాగ కాలమున ఈ గుణము గలవారు అధోలోకమును పొంది (నరకమును పొంది) తిరిగి భూలోకమున నీచజన్మలు ఎత్తుదురు.

(40వ అధ్యాయము) మోహము, మదము, అహంకారము, పౌరుషము, దంభము, దర్పము, మత్సరము, అభిమానము, అసూయ, అజ్ఞానము, చిత్తవిభ్రాంతి, ఇవి తమోగుణ లక్షణములు. ఈ గుణము గలవారిలో శౌచము ఉండదు. సదాచారము ఉండదు. సత్యము ఉండదు. వేదవ్రతములు చేయరు. ఉగ్రకర్మలు చేయుచూ ప్రజలను నశింపచేయుదురు. ఈ శత్రువును చంపితిని, ఇతర శత్రువులను కూడా చంపుదునని గర్వముతో విఱ్ఱవీగుదురు. అన్యాయముగా ధనము సంపాదింతురు. సంసార తాపత్రయములలో మునిగి తేలుచుందురు. దేవుడు లేడని, ప్రకృతివలన సృష్టి కలిగినదని వాదింతురు. శాస్త్రవిధిని అనుసరించి పుణ్యకర్మలు చేయరు. పాపపు పనులు చేయుదురు. దంభము, దర్పము కలిగి పుణ్యకర్మలు చేయుదురు. సుఖభోగములందు ఆశాపాశబద్ధులై అసురయోనులందు పుట్టుచున్నారు. శాస్త్రవిధిని పాటింపనందున పుణ్యకర్మలు చేసిననూ పుణ్యఫలితమును పొందరు. వీరు నేనే

బలవంతుడనని, భోగవంతుడనని, సుఖవంతుడనని, సిద్ధుడనని, ఈశ్వరుడనని, గొప్ప ధనవంతుడనని, గొప్ప పరివారము కలవాడనని, నాతో సమానుడు ఎవడునూ లేడని విఱ్ఱవీగుదురు. ఇప్పటికి ఇంత ధనము సంపాదించితిని. మరికొంత ధనము సంపాదించగలను అని భావింతురు.

**గుణరహితుడు :** (37వ అధ్యాయము) ఆత్మస్థానమును పొంది ఆత్మయై విరాజిల్లును. వైరాగ్యము, ప్రాపంచిక విషయములందు అనాసక్తి కలిగియుండును. బంధరహితుడై యుండును. శత్రుమిత్రులయందు సమభావన కలిగివుండును. ఆత్మానుసంధానము కలిగియుండును. (38వ అధ్యా.)సుఖదుఃఖములకు ఉప్పొంగిపోడు, కృంగిపోడు. కర్మలకు గుణములు తప్ప తను కర్తను కానని తలంచును. శాంతము కలిగివుండును. సర్వారంభపరిత్యాగి (ఏ పనియూ చేయడు). న ద్వేష్టి, న కాంక్షతి, ద్వంద్వములందు అనగా ప్రియాప్రియములందు, నిందాస్తుతులందు, మానావమానములందు, శత్రుమిత్రులయందు, సమభావన కలిగియుందురు. గుణరహితుడు ఆత్మను పొంది, ఆత్మయై విరాజిల్లును. (39వ అధ్యా.) గుణరహితులైనవారు ఆత్మభావన కలిగి ఏకాంతమున ఉండి, అరిషడ్వర్గములను వదలి, ద్వంద్వాతీతులై ఆత్మపథమును అన్వేషించి, ఆత్మయై విరాజిల్లుదురు. (38వ అధ్యాయము) ద్వంద్వములను వదలి, శాంతి కలిగి ఉందురు. దేహత్యాగానంతరము ఆత్మస్థానము చేరి ఆత్మయై విరాజిల్లుదురు.

**జీవుడు / దేహి :**

**37వ అధ్యాయము :** గుణములతో కలసి కర్మలు చేసి, కర్మఫలితమును అనుభవించును. ఆ కర్మఫలితమువలన ఉచ్ఛ, నీచ, ఊర్ధ్వ, అధోలోకములు పొంది తిరిగి జన్మకు వచ్చుచున్నాడు. ఇంద్రియములద్వారా యింద్రియార్థములను అనుభవించును.

**39వ అధ్యాయము :** మనస్సు ఇంద్రియములచే ఇంద్రియార్థములను గ్రహించును. తద్వారా జీవుడు సుఖదుఃఖములను పొందుచున్నాడు. దేహత్యాగ కాలమున వాయువు పూలవాసనను గ్రహించి, వెడలునట్లు దేహి తను చేసిన పాపపుణ్యములను గ్రహించి దేహమునుండి వెడలును. ఇతర లోకములలో పాపపుణ్యములను అనుభవించి తిరిగి పునర్జన్మకు వచ్చును. నూతన శరీరమును ధరియించును. దేహి అరూపుడు. సూక్ష్ముడు. కావున దేహి శరీరమునుండి వెడలునపుడు

ఎవ్వరునూ అతనిని దర్శించలేరు. దేహి జాగ్రదావస్థలో వైశ్వానరునిగా ప్రాణముద్వారా ఆహారమును, నీటిని స్వీకరించి సమానవాయువుద్వారా వాటిని పచనము చేసి శరీరభాగములకు సమానముగా పంచి అపానవాయువుద్వారా మలమూత్రములను విసర్జించును.

**42వ అధ్యాయము :** జీవుడు అస్వతంత్రుడు. తిరుగుడు యంత్రమును ఆశ్రయించిన తిరుగుడుపక్షివలె జంత్రగాని చేతి బొమ్మవలె తిరుగును.

**క్షేత్రము/దేహము :**

**37వ అధ్యాయము :** ఈ శరీరము క్షేత్రము. దేనినుండి ఉత్పన్నమయినది? ప్రకృతినుండి ఉత్పన్నమయినది. ఎటువంటిది? పరిణామము గలది. జన్మ-జరా-మృత్యువు గలది. వ్యాధులు గలది. ఎట్టి వికారములు గలది? రాగము, ద్వేషములు గలిగి, సుఖదుఃఖములను అనుభవించును. స్థూలశరీరము నశించును. సూక్ష్మశరీరము నశింపదు.

**క్షేత్రజ్ఞుడు :**

**37వ అధ్యాయము :** సర్వక్షేత్రములందు గలదు. సర్వక్షేత్రములను తెలిసినవాడు. క్షేత్రజ్ఞునివలన ప్రాణి చరించుచున్నది.

**జ్ఞానము :**

**37వ అధ్యాయము :** క్షేత్ర క్షేత్రజ్ఞుల గురించి తెలియుట జ్ఞానము. క్షేత్ర క్షేత్రజ్ఞుల గురించి, ప్రకృతిపురుషుల గురించి తెలిసినవాడు తిరిగి జన్మింపడు.

**జ్ఞేయము :**

**37వ అధ్యాయము :** దేనిని తెలుసుకొని అమృతత్త్వమును పొందుదురో ఆ ఆత్మయే జ్ఞేయము.

**వృక్షములు :**

**39వ అధ్యాయము :**

| **ఈశ్వరవృక్షము** | **జీవుని సంసార వృక్షము** |
|---|---|
| మూలము ఊర్ధ్వమున కలదు | మూలము క్రింద కలదు |
| శాఖలు క్రిందకు వ్యాపించి యున్నవి | శాఖలు పైకి, క్రిందకు నలువైపులా వ్యాపించియున్నవి |
| ఆకులు ఛందస్సులు | – |
| చిగుళ్ళు– | చిగుళ్ళు విషయములు |
| గుణములు – | గుణములచే వృద్ధిపొందును. |
| ఆదిమధ్యఅంతము లేదు | ఆదిమధ్యాంతము కలదు. |
| ఇది శాశ్వతము | ఇది అశాశ్వతము |
| – | విజ్ఞాన, వైరాగ్యములచే దీనిని ఛేదించవలయును |
| దీనిని స్వానుభవములో ఎఱిగినవాడు వేదవిత్. | – |

**సాధనలు :**

ఆహారము – మితాహారము తీసుకొనవలయును. విషయములు – ప్రాపంచిక విషయములందు విషయాసక్తి ఉండరాదు. కర్మ – పాపకర్మలు చేయకుండా ఉండవలయును. గుణములు – రాగము, ద్వేషము ఉండరాదు. పరమాత్మ తప్ప ఇతర విషయముల గుఱించి ఆలోచించరాదు. (న శోచతి) కోరికలు ఉండరాదు. (న కాంక్షతి)

దంభము, దర్పము, అహంకారము, మమత, అనురాగము, అరిషడ్వర్గములు మొదలైనవి ఉండరాదు. వైరాగ్యము కలిగియుండవలయును. సర్వభూతములయందు సమభావన కలిగి ఉండి ద్వంద్వాతీతుడై ఉండవలయును. విగతస్పృహ అనగా ఎఱుక లేకుండా ఉండవలయును. విశుద్ధబుద్ధి అనగా బ్రహ్మభావన కలిగి యుండవలయును. జితాత్మా, ప్రసన్నాత్మా అయి ఆత్మను ఆశ్రయించి ఉండవలయును. అపరిగ్రహమును తప్పనిసరిగా పాటించవలయును. ధర్మమును పాటించి ప్రకృతిని

పరిత్యజించి శాంతత్వము కలిగి ఉండవలయును. ఇతనినే జీవన్ముక్తుడు, స్థితప్రజ్ఞుడు అని అందురు. ఇతడు దేహత్యాగానంతరము ఆత్మస్థానము పొంది ఆత్మయై విరాజిల్లును.

**కర్మ:** (37వ అధ్యా) పుణ్యకర్మలు చేసి ఆ కర్మఫలితును కోరకుండా ఉన్నవాడు. ఆత్మను దర్శింతురు. (42వ అధ్యా) పుణ్యకర్మలు చేసి, పుణ్యాకర్మ ఫలితము కోరకుండా ఉందురు.

**యోగము :** (37వ అధ్యా) వివిక్తదేశము (ఏకాంతము)లో ఉండి నిశ్చలసమాధిలో హృదయగత ఆత్మను దర్శింతురు. (42వ అధ్యా) ధ్యానయోగము అవలంబించి, ఏకాంత ప్రదేశమున ఉండి, అపరిగ్రహమును పాటించుచూ, ఇంద్రియార్థములను నిగ్రహించి, ధృతి కలిగి మనోబుద్ధులను నిగ్రహించి, కూటస్థునితో క్షేత్రజ్ఞుని కలుపుదురు.

**భక్తి :** (37వ అధ్యా) ఇతర విషయములను చింతింపక, నిరంతరము భగవంతుని భక్తిచేత, ఉపాసించి ఆత్మను దర్శింతురు. (42వ అధ్యా) నిరంతర నామస్మరణ చేయుదురు. సర్వభావములు పరమాత్మకు సమర్పించి, పరమాత్మను శరణుకోరి ఉందురు. ఈశ్వరభక్తి కలిగి పరమపురుషుని ఆశ్రయించి, పరమాత్మకు నమస్కరించుచూ, భక్తి కలిగియుందురు.

**సాంఖ్యము :** (37వ అధ్యా) దేహి, దేహవిచారణ చేసి ఆత్మతత్త్వమును గ్రహించి ఆత్మను దర్శింతురు.

**కర్మబద్ధుడు కాడు :** కర్మకు తను కర్తను గానని తెలిసినవాడు కర్మబద్ధుడు కాడు.

**క్షేత్రక్షేత్రజ్ఞుల గుఱించి :** ప్రకృతి పురుషులను గ్రహించినవాడు తిరిగి జన్మింపడు. అనగా త్రిగుణములను వీడి, తను ఆత్మస్వరూపుడునని గ్రహించవలయును. సర్వత్రా విరాట్‌ను దర్శించినవాడు పరమపదమును పొందును. ఆత్మను దర్శించినవాడు మృత్యువును దాటును.

**జాతి ధర్మములు :** చాతుర్వర్ణములవారికి వారివారి స్వభావమునుబట్టి కర్మలు విధింపబడినవి. తమ జాతి ధర్మములను ఆచరించుటయే శ్రేయస్సు. తమ జాతి ధర్మములలో దోషములు ఉన్ననూ వారి జాతిధర్మములనే ఆచరించవలయును. ఇతర జాతిధర్మములు ఆచరించరాదు.

**బ్రాహ్మణుడు :** స్వభావము : ఆర్జవము (ఋజుప్రవర్తన), శౌచము, శమము, దమము, క్షాంతి, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము ఇవి బ్రాహ్మణునియొక్క స్వభావములు. కర్మల గుఱించి ఇందు చెప్పలేదుగాని, వేదములు చదువుట, చదివించుట, యజ్ఞములు చేయుట, చేయించుట, దానమిచ్చుట, పుచ్చుకొనుటలు బ్రాహ్మణుడి కర్మలుగా చెప్పబడినవి.

**క్షత్రియుడు :** శౌర్యము, తేజస్సు, ధైర్యము, యుద్ధనిపుణత, ఈశ్వరభక్తి ఇవి స్వభావములు. బ్రాహ్మణజాతికి చెప్పిన వాటిలో దానము పుచ్చుకొనకుండుట తప్ప మిగిలినవి ఇతనికి కర్మలుగా చెప్పబడినవి.

**వైశ్యుడు :** ధనము మిక్కిలి సంపాదించాలనే భావన, ఎంత సంపాదించినా తృప్తి లేకపోవుట ఇతని స్వభావము. కృషి, గోరక్షణ, వాణిజ్యములు కర్మలుగా చెప్పబడినవి.

**శూద్రుడు :** స్వభావము ఇందు చెప్పలేదు. సేవ కర్మగా చెప్పబడినది.

పుణ్యకర్మకు దైవము, అధిష్ఠానము (కాలము), కర్తా (యజమాని), కరణము, చేష్టా అను ఈ ఐదు కారణములు. పుణ్యకర్మలు పునీతము చేయును. పుణ్యకర్మలైన యజ్ఞము, దానము, తపస్సు, మొదలైనవి తప్పకుండా చేయవలయును. పుణ్యకర్మలు చేయనివానికి ఇహలోక, పరలోకములు లేవు. అగ్ని పొగచేత కప్పబడినట్లు సర్వకర్మలు దోషముతో కూడివున్నవి. కర్మ శుభాశుభ మిశ్రమము. పరిజ్ఞాతా, జ్ఞేయము, జ్ఞానము ఇవి **కర్మచోదకములు.** కర్తా, కర్మా, కరణము కర్మసంగ్రహము. ఆ గుణములవలన చేయబడు కర్మలు.

**సత్త్వగుణము :**

**ఆహారము :** ఆయుర్వృద్ధి, బలము, ఆరోగ్యము కలిగించునవి, రసయుక్తము, స్నిగ్ధములైనవి ఇష్టము. **శ్రద్ధ :** దేవతలను యజింతురు. పుణ్యఫలితమును కోరరు. **యజ్ఞము :** ఫలితమును కోరక శాస్త్రవిధిని అనుసరించి యజ్ఞమును విధివిహితముగా చేయుదురు. **దానము :** దేశ, కాల, పాత్రలను అనుసరించి ప్రత్యుపకారము కోరక, దానము చేయుదురు. **తపస్సు :** ఋజుప్రవర్తన, శౌచము, అహింస, బ్రహ్మచర్యము, దేవ, ద్విజ, గురు, పెద్దలను పూజించుట ఇవి శారీరక తపస్సుగా చెప్పబడును. స్వాధ్యాయము, సత్యము, ప్రియము, హితము, ఉద్వేగము లేకుండా సంభాషణ ఇవి

వాచిక తపస్సు క్రింద చెప్పబడును. చిత్తశుద్ధి, మౌనము, భావసంశుద్ధి, నిర్మలత్వము, కోరిక లేకుండా శాశ్వతముగా పుణ్యకార్యక్రమములు చేయుటను మానసిక తపస్సుగా చెప్పబడును. **జ్ఞానము :** సర్వమూ పరబ్రహ్మగా దర్శింతురు. **కర్తా :** ఉత్సాహముతో అరిషడ్వర్గములు లేక ఫలము కోరదు. **కర్మ:** సంగరహితమై, రాగద్వేషరహితమై, అహంకార మమకారములు లేక కర్తృత్వభావన లేకుండా చేయబడు కర్మ సత్త్వగుణము క్రింద వర్గీకరింపబడును. **బుద్ధి :** బంధమోక్షములు తెలిసిన బుద్ధి సత్త్వబుద్ధి. **ధృతి:** ఇంద్రియనిగ్రహము కలిగియుందురు. **సుఖము:** నిరంతర సుఖము కలిగి చివరకు అమృతత్త్వమును కలిగించునది సత్త్వగుణయుత సుఖము.

**రజోగుణము :**

**ఆహారము :** చేదు, పులుపు, కారము, ఉప్పు, రుచులు, అటులనే మిక్కిలి వేడి పదార్థములు, దాహమును కలిగించునవి, తిన్న తర్వాత రోగము, దుఃఖము, శోకము మిగుల్చునవి వీరికి ఇష్టము. **శ్రద్ధ :** దేవతలను ఆరాధింతురు. ఇహలోక పరలోక సంబంధమైన కోరికలు కోరుదురు. **యజ్ఞము :** ఫలము కోరి శాస్త్రవిధిని అనుసరించి విధివిహితముగా చేయుదురు. **దానము :** ఫలము కోరి దానము చేయుదురు. **తపస్సు :** సత్కారము, గౌరవము పొందుటకు చేయుదురు. **జ్ఞానము :** ఉపాధిని బట్టి దేహిని, అటులనే దేహమునందుగల ఆత్మను వేర్వేరుగా చూచుట. **కర్తా :** ఫలమును కోరుదురు. **కర్మ:** కోరికలతో కూడి కర్మ చేయబడును. **బుద్ధి :** కార్యాకార్యములు, భయాభయములు తెలిసిన బుద్ధి. **ధృతి :** ధర్మార్థకామములు పాటించుచూ, పరలోక, ఇహలోక ఫలాపేక్ష గల ధృతి. **సుఖము:** ఇంద్రియములద్వారా పొందు సుఖము.

**తమోగుణము :**

**ఆహారము :** రసహీనములైనవి, వండి చాలాసేపు అయినవి, పాచిపోయినవి, సద్దివి, ఆరోగ్యరీతా తినకూడని పదార్థము వీరికి ఇష్టము. **శ్రద్ధ :** యక్ష, రాక్షస, భూత, ప్రేతగణములను ఆరాధింతురు. ఇతరులకు వినాశమును కలిగింతురు**యజ్ఞము :** శాస్త్రవిధిని పాటింపక, దంభముతో శ్రద్ధ లేకుండా చేయుదురు. **దానము:** మనః క్లేశము కలిగి నిర్లక్ష్యముగా, సత్కారహీనముగా దానము చేయుదురు. **తపస్సు:** శరీరమునందలి దేహిని, హృదయగత ఆత్మను కష్టపెట్టుచూ శరీరములోని

ఇంద్రియములను మిక్కిలి కష్టపెట్టుచూ ఇతరులయొక్క వినాశమునకై ఉగ్రముగా తపస్సు చేయుదురు. దంభముతో కూడి మొండిపట్టుదల కలిగి అశాస్త్రీయముగా ఇతరులకు హాని చేయుటకు తపస్సు చేయుదురు. **జ్ఞానము :** విపరీతజ్ఞానము. **కర్తా :** సోమరి, అశుచి, మూర్ఖుడు, మొండిపట్టుదల, నిరంతరమూ ఇహలోక చింత, హింసాత్మకుడు. **కర్మ:** ఇతరులకు హింస చేయు సంకల్పముతో మిక్కిలి శ్రమతో, పౌరుషముతో కూడిన కర్మ. **బుద్ధి :** అజ్ఞానమువలన ధర్మాధర్మములను, కర్తవ్యాకర్తవ్యములను గ్రహించని బుద్ధి. **ధృతి :** మదము, విషాదము, శోకము, భయము, దుర్మదము గల ధృతి. **సుఖము:** నిద్ర, ఆలస్యము, మోహము కలిగి ప్రారంభంలో సుఖముగా ఉండి చివరకు దుఃఖములు కలిగించునది.

**ఓమ్ :** వేద ప్రారంభమున, యజ్ఞప్రారంభమున, దానము చేయునపుడు, తపస్సు చేయునపుడు ఫలాపేక్ష లేకుండా ఓం అని ఉచ్చరించి చేయుదురు. **సత్:** సద్భావము, సాధుభావము, ప్రశస్తకర్మలయందు సత్ అని ఉచ్చరించి చేయుదురు. **అసత్ :** అశ్రద్ధ, విధిరహితము, అశాస్త్రీయముగా చేయబడు యజ్ఞము, దానము, తపస్సు అసత్ అని చెప్పబడును.

**ముగింపు :** ధృతరాష్ట్ర మహారాజా! వ్యాసభగవానుని అనుగ్రహమున ఈవిధముగా కథాభాగముగాను, ఆధ్యాత్మిక విభాగముగాను జరిగిన శ్రీకృష్ణార్జునుల సంవాదమును వింటిని. విశ్వరూపమును దర్శించి ఆనందించుచున్నాను. శ్రీకృష్ణార్జునులున్న చోట శ్రీ, విజయము, భూతి, నీతి, ధ్రువముగా ఉండును అని నా అభిప్రాయము.

**వ్యాసభగవానుడు సమానార్థకములుగా వాడిన పదములు :** దేహమునకు క్షేత్రమనియు, హృదయగత ఆత్మకు క్షేత్రజ్ఞుడనియు, అసురసంపదగా రజోగుణము, తమోగుణములను, దైవీసంపదగా సత్త్వగుణమును చెప్పినాడు.



ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము 37వ అధ్యాయము

## (క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము)

ధృతరాష్ట్ర ఉవాచ

కర్మయోగేన యోగినాం అని చెప్పినదానికి 34వ అధ్యాయము వఱకు చెప్పి ఇప్పుడు జ్ఞానయోగేన సాంఖ్యానాం అని చెప్పిన విధానమును చెప్పుచున్నాడు. ఈ సాంఖ్యయోగ సాధకులను పరమహంసలు అని అందురు. హంసావతారమున భగవంతుడు నారదాదులకు జ్ఞానమును వివరించినాడు. దీనినే ఇప్పుడు చెప్పుచున్నాడు.

క్షేత్రము దాని వికారములను గ్రహించి తను దేహము కాదని ఆత్మ స్వరూపుడని భావించి, సాంఖ్యులు జ్ఞానము, వికారములకు లోనుగాక, ప్రకృతి పురుషులను గ్రహించి, కేవలము జ్ఞానముతో ఉందురు.

ఈ పరమహంసలు యోగాభ్యాసము, కర్మానుష్ఠానము యివి యేమియు చేయక కేవలము జ్ఞానమును ఆశ్రయించి గుణరహితులై ఉందురు.

జ్ఞానులను ఉద్దేశించి సాంఖ్యయోగము 35వ అధ్యాయమునుండి నుండి 40వ అధ్యాయము వఱకు చెప్పబడినది. ఈ 37వ అధ్యాయములో 34 శ్లోకములు గలవు.

శ్రీ భగవానువాచ

క్షేత్రము - క్షేత్రజ్ఞుడు

**ఇదం శరీరం కౌన్తేయ । క్షేత్రమిత్యభిధీయతే ।**

**ఏతద్యో వేత్తి తం ప్రాహుః । క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ 1**

ఇదమ్ – శరీరమ్ – కౌన్తేయ – క్షేత్రమ్ – ఇతి – అభిధీయతే,

ఏతత్ – యః – వేత్తి – తమ్ – ప్రాహుః – క్షేత్రజ్ఞః – ఇతి – తద్విదః.

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి । సర్వక్షేత్రేషు భారత ।**
**క్షేత్ర క్షేత్రజ్ఞయోః జ్ఞానం । యత్తద్ జ్ఞానం మతం మమ ॥ 2**

క్షేత్రజ్ఞమ్ - చ - అపి - మామ్ - విద్ధి - సర్వక్షేత్రేషు - భారత,
క్షేత్ర క్షేత్రజ్ఞయోః - జ్ఞానమ్ - యత్ - తత్ - జ్ఞానమ్ - మతమ్ - మమ.

**తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ । యద్వికారి యతశ్చయత్ ।**
**స చ యో యత్ప్రభావశ్చ । తత్సమాసేన మే శృణు ॥ 3**

తత్-క్షేత్రమ్-యత్-చ-యాదృక్-చ-యత్-వికారి-యతః-చ-యత్,
సః-చ-యః-యత్ప్రభావః-చ-తత్-సమాసేన-మే-శృణు.

**ఋషిభిర్బహుధా గీతం । ఛన్దోభిర్వివిధైః పృథక్ ।**
**బ్రహ్మ సూత్ర పదైశ్చైవ । హేతు మద్భిర్వినిశ్చితైః ॥ 4**

ఋషిభిః - బహుధా - గీతమ్ - ఛన్దోబిః - వివిధైః - పృథక్,
బ్రహ్మ సూత్ర పదైః - చ - ఏవ - హేతుమద్భిః - వినిశ్చితైః.

**మహాభూతాన్యహంకారో । బుద్ధిరవ్యక్తమేవ చ ।**
**ఇన్ద్రియాణి దశైకం చ । పంచచేన్ద్రియగోచరాః ॥ 5**

మహాభూతాని - అహంకారః - బుద్ధిః - అవ్యక్తమ్ - ఏవ - చ,
ఇన్ద్రియాణి - దశ - ఏకమ్ - చ - పంచ - చ - ఇన్ద్రియ గోచరాః.

**ఇచ్ఛా ద్వేషస్సుఖం దుఃఖం । సంఘాత శ్చేతనా ధృతిః ।**
**ఏతత్ క్షేత్రం సమాసేన । సవికార ముదాహృతమ్ ॥ 6**

ఇచ్ఛా ద్వేషః - సుఖమ్ - దుఃఖమ్ - సంఘాతః - చేతనా - ధృతిః,
ఏతత్ - క్షేత్రమ్ - సమాసేన - సవికారమ్ - ఉదాహృతమ్.

| | |
|---|---|
| కౌన్తేయ | = ఓ అర్జునా! |
| ఇదమ్ శరీరమ్+<br>క్షేత్రమ్+ఇతి+<br>అభిధీయతే | = ఈ శరీరము క్షేత్రము అని చెప్పబడుచున్నది. ప్రకృతి క్షేత్రము, విరాట్‌పురుషుడు బీజము. |
| ఏతత్+యః+వేత్తి<br>తమ్+క్షేత్రజ్ఞః+ఇతి<br>తత్+విదః+ప్రాహుః | = ఈ శరీరమును ఎవడు తెలియుచున్నాడో వాని క్షేత్రజ్ఞుడని జ్ఞానులు చెప్పుదురు. (శరీరము క్షేత్రము అని, హృదయగత ఆత్మ క్షేత్రజ్ఞుడని చెప్పుదురు.) |
| భారత! | = ఓ అర్జునా! |
| సర్వక్షేత్రేషు+మామ్+<br>క్షేత్రజ్ఞమ్+అపి+విద్ధి | = సర్వభూతములయందునుగల క్షేత్రజ్ఞునిగ నన్ను తెలియుము |
| క్షేత్ర క్షేత్రజ్ఞయోః+<br>జ్ఞానమ్+యత్+<br>జ్ఞానమ్+మమ+<br>మతమ్ | = క్షేత్రము, క్షేత్రజ్ఞులయొక్క తెలియుట ఏది గలదో అది జ్ఞానము అని నా యొక్క అభిప్రాయము |
| తత్+క్షేత్రమ్+యత్+ | = ఆ క్షేత్రము ఏదియో |
| చ+యాదృక్+చ+యత్+ | = ఎటువంటిదో అనగా ఎట్టి ధర్మములు గలదో |
| వికారి+యత్+చ+యత్ | = ఎటువంటి మార్పులు గలదో దేని నుండి శరీరము ఉత్పన్నమైనదో, తిరిగి దేనియందు లయమగునో |
| చ | = మఱియు |
| సః+యః+యత్+<br>ప్రభావ+చ+తత్+<br>సమాసేన+మే+శృణు | = ఆ క్షేత్రజ్ఞుడు యెవడో ఎట్టి ప్రభావము కలవాడో వాటిని క్లుప్తముగ నా వలన వినుము. |
| పృథక్+చ | = క్షేత్రము గుఱించి, క్షేత్రజ్ఞుని గుఱించి వేఱువేఱుగా |
| ఋషిభిః | = ఋషులచేత |

| | | |
|---|---|---|
| బహుధా+గీతమ్ | = | అనేకసార్లు చెప్పబడినది |
| వివిధైః+ఛన్దోభి | = | పలువిధములుగా అనగా ఒకటికి పదిమాఱులు వేదములు, ఉపనిషత్‌లు మొదలైనవాటిచే చెప్పబడినది |
| హేతుమద్భిః | = | యుక్తయుక్తములయిన |
| వినిశ్చితైః | = | బాగుగా నిర్ణయింపబడిన |
| బ్రహ్మసూత్రపదైః+ఏవ | = | బ్రహ్మసూత్రములచేత చెప్పబడినది. |
| అవ్యక్తమ్+చ | = | మూలప్రకృతి మఱియు మహత్ |
| అహంకారః+చ | = | అహంకారము మఱియు త్రివిధములుగా అయిన అహంకారము వలన |
| బుద్ధిః+చ | = | బుద్ధి, చిత్తము, అహంకారము మఱియు పంచప్రాణములు |
| మహాభూతాని+చ | = | ఆకాశాది పంచభూతములు మఱియు |
| దశ+ఇంద్రియాణి+ ఏకమ్+చ | = | దశేంద్రియములు, మనస్సు |
| పంచ+ ఇంద్రియగోచరాః+ఏవ | = | శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే ఐదు ఇంద్రియార్థములు వీటి |
| సంఘాతః | = | సముదాయముతో శరీరము ఏర్పడినది |
| ఇచ్ఛా+ధృతిః+ద్వేషః+ చేతనా+సుఖమ్+ దుఃఖమ్ | = | కోరిక, ధైర్యము, ద్వేషము, తెలివి సుఖము, దుఃఖము మొదలైన |
| ఏతత్+సవికారమ్+ క్షేత్రమ్+సమాసేన+ ఉదాహృతమ్ | = | ఈ వికారముతో కూడిన శరీరము సంగ్రహముగా చెప్పబడినది |

...... ❖ ❖ ❖ ......

సద్గుణములు గలిగి ఉండుటయే జ్ఞానము

**అమానిత్వ మదమ్భిత్వం । అహింసా క్షాన్తిరార్జవం ।**
**ఆచార్యోపాసనం శౌచం । స్థైర్యమాత్మవినిగ్రహః ॥ 7**

అమానిత్వమ్ – అదంభిత్వమ్ – అహింసా – క్షాంతిః – ఆర్జవమ్,
ఆచార్యోపాసనమ్ – శౌచమ్ – స్థైర్యమ్ – ఆత్మవినిగ్రహః.

**ఇన్ద్రియార్థేషు వైరాగ్య । మనహంకార ఏవ చ ।**
**జన్మ మృత్యు జరా వ్యాధి । దుఃఖ దోషాను దర్శనమ్ ॥ 8**

ఇన్ద్రియార్థేషు – వైరాగ్యమ్ – అనహంకారః – ఏవ – చ,
జన్మ మృత్యు జరా వ్యాధి – దుఃఖ దోషానుదర్శనమ్.

**అసక్తిరనభిష్వంగః । పుత్ర దార గృహాదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు ॥ 9**

అసక్తిః – అనభిష్వంగః – పుత్ర దార గృహాదిషు,
నిత్యమ్ – చ – సమచిత్తత్వమ్ – ఇష్టానిష్టోపపత్తిషు.

**మయి చానన్య యోగేన । భక్తిరవ్యభిచారిణీ ।**
**వివిక్తదేశసేవిత్వ । మరతిర్జనసంసది ॥ 10**

మయి – చ – అనన్య యోగేన – భక్తిః – అవ్యభిచారిణీ,
వివిక్త దేశ – సేవిత్వమ్ – అరతిః – జనసంసది.

**అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం । తత్త్వ జ్ఞానార్థ దర్శనం ।**
**ఏతత్ జ్ఞానమితి ప్రోక్త । మజ్ఞానం యదతోఽన్యథా ॥ 11**

అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వమ్ – తత్త్వజ్ఞానార్థ దర్శనమ్,
ఏతత్ – జ్ఞానమ్ – ఇతి – ప్రోక్తమ్ – అజ్ఞానమ్ – యత్ – అతః – అన్యథా.

**జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి । యద్ జ్ఞాత్వామృతమశ్నుతే ।**
**అనాది మత్పరం బ్రహ్మ । న సత్తన్నాసదుచ్యతే ॥ 12**

జ్ఞేయమ్-యత్-తత్-ప్రవక్ష్యామి-యత్-జ్ఞాత్వా-అమృతమ్-అశ్నుతే,
అనాదిమత్ పరమ్-బ్రహ్మ-న సత్-తత్-న అసత్-ఉచ్యతే.

| | | |
|---|---|---|
| అమానిత్వమ్+<br>అదంభిత్వమ్+<br>అహింసా+క్షాంతిః+<br>ఆర్జవమ్ | = | తన్ను తాను గొప్పవాడినని పొగడుకొనకుండుట, ఆత్మస్తుతి, పరనింద లేకుండుట, డాంభికము లేకుండుట, అహింస, (క్షాంతి) ఓర్పు గలిగియుండుట, ఇంచుక మాయలేక ఋజుత్వము గలిగియుండుట |
| ఆచార్యోపాసనమ్+<br>శౌచమ్+స్థైర్యమ్+<br>ఆత్మవినిగ్రహః | = | స్వగురు సేవ, అంతరింద్రియ నిగ్రహము గలిగి మనోమాలిన్యము లేకుండుట, గాంభీర్యము గలిగియుండుట అనగా కానున్నది కాకమానదు అని ధైర్యము అవలంభించుట చిత్తచాంచల్యము లేక ఆత్మను నిగ్రహించుట |
| ఇన్ద్రియార్థేషు+వైరాగ్యమ్<br>అనహంకారః+ఏవ+చ | = | జ్ఞానేంద్రియములు యింద్రియార్థములపై ప్రసరించకుండా వైరాగ్యము గలిగియుండుట అహంకారము లేకుండుట |
| జన్మ మృత్యు జరా వ్యాధి<br>+దుఃఖ దోషాను+<br>దర్శనమ్ | = | పుట్టుక, ముసలితనము, మరణము, సుఖము, దుఃఖము, వ్యాధి మొదలయిన దోషములను పదేపదే ఆలోచించుట |
| పుత్రదార గృహాదిషు+<br>ఆసక్తిః అనభిష్వంగః | = | పుత్రులు, భార్య, గృహములయందు ధన ధాన్యములు, భోగ, భాగ్యములందు ఆసక్తి లేకుండుట, సంసారముతో తగులము లేకుండుట |
| చ | = | మఱియు |

ఇష్ట అనిష్ట ఉపపత్తిషు = ఇష్టము, అనిష్టములందు
నిత్యమ్+సమ చిత్తత్వమ్ = నిత్యము సమభావనగలిగి యుండుట సమ చిత్తము గలిగియుండుట

**భక్తి :**

మయి+అనన్య యోగేన+ = నా యందు అనగా పరమాత్మయందు ఇతర
అవ్యభిచారిణీ+భక్తిః+చ విషయములు వైపు పోని చిత్తముతో యితర చింతనలు, కోరికలు లేక భక్తి కలిగి వుండుట మఱియు

**యోగము :**

జన సంసది+అరతిః+ = జన సమూహముతో కలిసి తిరుగుట యందు
వివిక్తదేశ+సేవిత్వమ్ ప్రీతి లేక ఒంటరిగా ఏకాంత వాసమున ఉండుట.
అధ్యాత్మజ్ఞాననిత్యత్వమ్+ = సృష్టి, స్థితి, లయ కారకుడయిన అధ్యాత్మ గుఱించి
తత్త్వజ్ఞానార్థ దర్శనమ్+ నిత్యము ఆలోచించుట తత్త్వము యొక్క గొప్ప
ఏతత్+జ్ఞానమ్+ఇతి ప్రయోజనమును గమనించుట మొదలైనవి యేవి పైన చెప్పబడినవో అదియే జ్ఞానము అని చెప్పబడును.
యత్+అతః+అన్యథా = ఏది దీనికంటె అన్యమో అది
అజ్ఞానమ్+ప్రోక్తమ్ = అజ్ఞానము అని చెప్పబడును.
జ్ఞేయమ్+యత్+యత్+ = ఏది తెలియదగినదో, దేనిని
జ్ఞాత్వా+అమృతమ్+ తెలుసుకొన్నచో అమృతత్త్వమును
అశ్నుతే+తత్ పొందగలమో దానిని పరబ్రహ్మమని అందురు.
అనాదిమత్+ = ఆది లేనిదియు అనగా ఆదిమధ్యాంతములు
పరమ్+బ్రహ్మ+ లేనిది పరబ్రహ్మమని చెప్పబడును. అది సత్తు కాదు,
న+సత్+తత్+ అది అసత్తుయు కాదు అనియు
న+అసత్+ఉచ్యతే చెప్పబడుచున్నది

...... ❖ ❖ ❖ ......

విరాట్పురుషుడు ఈ ప్రకృతిని అంతటా ఆవరించి ఉన్నాడు. అతడే సర్వత్రా వ్యాపించి సర్వజీవరాసుల రూపమున అనేక శిరస్సులు, చెవులు, కన్నులు, ముఖములు, చేతులు, పాదములతో ఒప్పారుచున్నాడు.

**సర్వతః పాణి పాదం తత్ । సర్వతోஉక్షి శిరోముఖం ।**
**సర్వతశ్రుతిమల్లోకే । సర్వమావృత్య తిష్ఠతి ॥ 13**

సర్వతః-పాణిపాదమ్-తత్-సర్వతః-అక్షిశిరోముఖమ్ ।
సర్వతః-శ్రుతిమత్-లోకే-సర్వమ్-ఆవృత్య-తిష్ఠతి ॥

| | | |
|---|---|---|
| తత్+లోకే+సర్వతః+ పాణి+పాదమ్ | = | అది అనగా విరాట్పురుషుడు లోకమునందు అంతటను సర్వ జీవరాసి రూపమున ఉండుటచే అనేక చేతులు, పాదములు, |
| సర్వతః+అక్షి+శిరో+ ముఖమ్ | = | అంతటను కన్నులు, శిరస్సులు, ముఖములు |
| సర్వతః+శ్రుతిమత్+ సర్వమ్+ఆవృత్య+తిష్ఠతి | = | అంతటను చెవులు గలిగి అంతటా ఆవరించి ఉన్నాడు. |

...... ❖ ❖ ❖ ......

**సర్వేంద్రియగుణాభాసం । సర్వేన్ద్రియవివర్జితం ।**
**అసక్తం సర్వభృచ్చైవ । నిర్గుణం గుణభోక్తృ చ ॥ 14**

సర్వేన్ద్రియ గుణాభాసమ్ - సర్వేన్ద్రియ వివర్జితమ్,
అసక్తమ్-సర్వభృత్ - చ - ఏవ - నిర్గుణమ్ - గుణభోక్తృ - చ.

ఆత్మ

**బహిరన్తశ్చ భూతానా । మచరం చరమేవ చ ।**
**సూక్ష్మత్వాత్త దవిజ్ఞేయం । దూరస్థం చాన్తికే చ తత్ ॥ 15**

బహిః-అన్తః-చ-భూతానామ్-అచరమ్-చరమ్-ఏవ-చ,
సూక్ష్మత్వాత్-తత్-అవిజ్ఞేయమ్-దూరస్థమ్-చ-అన్తికే-చ-తత్.

**అవిభక్తం చ భూతేషు । విభక్తమివ చ స్థితం ।**
**భూతభర్తృ చ తద్ జ్ఞేయం । గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ 16**

అవిభక్తమ్-చ-భూతేషు-విభక్తమ్-ఇవ-చ-స్థితమ్
భూతభర్తృ-చ-తత్-జ్ఞేయమ్-గ్రసిష్ణు-ప్రభవిష్ణు-చ.

**జ్యోతిషామపి తజ్జ్యోతి । స్తమసః పరముచ్యతే ।**
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం । హృది సర్వస్య విష్ఠితమ్ ॥ 17**

జ్యోతిషామ్ - అపి - తత్ - జ్యోతిః - తమసః - పరమ్ - ఉచ్యతే,
జ్ఞానమ్ - జ్ఞేయమ్ - జ్ఞానగమ్యమ్ - హృది - సర్వస్య - విష్ఠితమ్.

**ఇతి క్షేత్రం తథా జ్ఞానం । జ్ఞేయం చోక్తం సమాసతః ।**
**మద్భక్త ఏతద్విజ్ఞాయ । మద్భావాయోప పద్యతే ॥ 18**

ఇతి-క్షేత్రమ్-తథా-జ్ఞానమ్-జ్ఞేయమ్-చ-ఉక్తమ్-సమాసతః
మద్భక్తః-ఏతత్-విజ్ఞాయ-మద్భావాయ-ఉపపద్యతే.

| | | |
|---|---|---|
| తమ్ | = | ఆ ఆత్మ |
| సర్వేన్ద్రియ వివర్జితమ్ | = | ఇంద్రియాదులు లేనిది |
| నిర్గుణమ్ + చ | = | గుణరహితమైనది |
| అసక్తమ్ | = | కర్మాసక్తి లేనిది. సాక్షి |

**హృదయగత ఆత్మ:**

| | | |
|---|---|---|
| సర్వేన్ద్రియ గుణాభాసమ్ | = | దేహములో హృదయగుహలో ఉండి సర్వేంద్రియ ములను, గుణములను ప్రకాశింపచేయునది |

**విరాట్‌గ :**

| | | |
|---|---|---|
| సర్వభృత్+ఏవ | = | సమస్త చరాచరములను భరించునది |
| చ | = | మఱియు |

**జీవునిగ :**

| | | |
|---|---|---|
| గుణభోక్తృ | = | జీవునిగ శరీరమునందుండి గుణములద్వారా కర్మలు చేయుచూ, కర్మఫలితమును అనుభవించునది |

**ఆత్మ :**

| | | |
|---|---|---|
| తత్+దూరస్థమ్+చ+ అన్తికే | = | అది అజ్ఞానులకు దూరమున గలదు. జ్ఞానులకు దగ్గరలో కలదు. |
| తత్+అవిజ్ఞేయమ్ | = | ఆ ఆత్మ దేహేంద్రియ మనోబుద్ధులచే తెలియబడనిది |
| భూతానామ్+బహిః+ చ+అంతః | = | సర్వభూతములలో వెలుపల, లోపల సర్వత్రా గలది |

**విరాట్:**

| | | |
|---|---|---|
| చరమ్+చ+అచరమ్+ ఏవ | = | స్థావరములు జంగమములు అతడే. |

**హృదయగత ఆత్మ:**

| | | |
|---|---|---|
| సూక్ష్మత్వాత్ | = | హృదయగత ఆత్మ, సూక్ష్మముకంటె సూక్ష్మము |
| తత్+భూతేషు+ అవిభక్తమ్+చ+ విభక్తమ్+ఇవ+స్థితమ్ | = | సర్వత్రా వ్యాపించిన ఆత్మ. సర్వభూతములందు అవిభక్తమైన గంగానదిలో పూర్తిగా మునిగియున్న విభక్తమైన కడవలలోని గంగాజలమువలె ఉన్నది |

**విరాట్:**

| | | |
|---|---|---|
| ప్రభవిష్ణు + చ | = | చరాచరములను సృష్టి కారకమైనది |
| భూతభర్తృ+చ | = | స్థితికారకమైనది |
| గ్రసిష్ణు | = | లయకారకమైనది |

**ఆత్మ :**

| | | |
|---|---|---|
| తత్+జ్యోతిషామ్+అపి+ | = | ఆత్మ వెలుగులన్నింటికి వెలుగు |
| తమసః+పరమ్ | = | తమస్సుకు ఆవల ఉన్నది |

**అంతరాత్మ :**

| | | |
|---|---|---|
| సర్వస్య+హృది+విష్ఠితమ్ | = | సర్వప్రాణులయొక్క హృదయగుహయందు జ్యోతిరూపమున కలదు |

**ఆత్మ :**

| | | |
|---|---|---|
| జ్ఞేయమ్ | = | ఆత్మయే తెలియదగినది |
| జ్ఞానగమ్యమ్ | = | జ్ఞానముచే చేరదలచిన గమ్యము అదే. (పరాయణమ్) |
| జ్ఞానమ్ | = | జ్ఞానముచే పొందబడునది అని |
| ఉచ్యతే | = | చెప్పబడుచున్నది |
| క్షేత్రమ్+ఇతి+తథా+ జ్ఞానమ్+జ్ఞేయమ్+ సమాసతః+ఉక్తమ్ | = | ఇది క్షేత్రమని, ఇదిశరీరముయొక్క లక్షణములు అని ఆ విధముగా క్షేత్రము, క్షేత్రజ్ఞులను తెలియుట అనగా ఆత్మను తెలుసుకొనవలయును. ఇది జ్ఞేయమని అనగా ఆత్మను తెలుసుకొనవలయును అని సంక్షిప్తముగా చెప్పబడినది |
| మద్భక్తః+ఏతత్+ విజ్ఞాయ+మద్భావాయ+ ఉపపద్యతే | = | నా భక్తుడు దీనిని తెలిసికొని నా స్వరూపమును పొందుటకు తగియున్నాడు అనగా నన్నే బొందును. |

...... ❖ ❖ ❖ ......

ప్రకృతి - పురుషుడు - జీవుడు

**ప్రకృతిం పురుషం చైవ । విద్ధ్యనాదీ ఉభావపి ।**

**వికారాంశ్చ గుణాంశ్చైవ । విద్ధి ప్రకృతి సమ్భవాన్ ॥ 19**

ప్రకృతిమ్ – పురుషమ్ – చ – ఏవ – విద్ధి – అనాదీ – ఉభౌ – అపి,

వికారాన్ – చ – గుణాన్ – చ – ఏవ – విద్ధి – ప్రకృతి – సంభవాన్.

**కార్య కారణ కర్తృత్వే । హేతుః ప్రకృతిరుచ్యతే ।**

**పురుష స్సుఖదుఃఖానాం । భోక్తృత్వే హేతురుచ్యతే ॥ 20**

కార్య కారణ – కర్తృత్వే – హేతుః – ప్రకృతిః – ఉచ్యతే,

పురుషః – సుఖ దుఃఖానామ్ – భోక్తృత్వే – హేతుః – ఉచ్యతే.

**పురుషః ప్రకృతిస్థో హి । భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్ ।**

**కారణం గుణసంగోఽస్య । సదసద్యోనిజన్మసు ॥ 21**

పురుషః– ప్రకృతిస్థః – హి – భుంక్తే – ప్రకృతిజాన్ – గుణాన్,

కారణమ్ – గుణసంగః – అస్య – సదసద్యోనిజన్మసు.

| | | |
|---|---|---|
| ప్రకృతిమ్+చ+<br>పురుషమ్+ఉభౌ+<br>ఏవ+అనాదీ+విద్ధి | = | ప్రకృతిని మఱియు పురుషుని ఈ రెండును కూడ అనాదివని గ్రహించుము |
| వికారాన్+చ+<br>గుణాన్+చ+ఏవ<br>ప్రకృతి+సంభవాన్+<br>విద్ధి | = | మూలప్రకృతియు, మహత్, అహంకారములును పంచతన్మాత్రలు అను ఎనిమిదియు ప్రకృతి గుణములు. కర్మేంద్రియములు 5, జ్ఞానేంద్రియములు 5, మనస్సు, పంచభూతములు అను పదునాఱును వికారములు ప్రకృతి నుంచి గలిగినవని గ్రహించుము. |

| | | |
|---|---|---|
| కార్యకారణకర్తృత్వే ప్రకృతిః+హేతుః+ ఉచ్యతే | = | కార్యమునకు, కారణమునకు, కర్తృత్వమునకు ప్రకృతి కారణమని చెప్పబడుచున్నది |
| సుఖదుఃఖానామ్+ భోక్తృత్వే+పురుషః+ హేతుః+ఉచ్యతే | = | సుఖదుఃఖములను అనుభవించుటకు జీవుడు కారణమని చెప్పబడుచున్నాడు |
| ప్రకృతిస్థః | = | ప్రకృతియందున్నవాడై |
| పురుషః+హి+ ప్రకృతిజాన్+గుణాన్+ భుంక్తే | = | జీవపురుషుడు కర్మలకు తను కర్తనని భావించి ప్రకృతివలన గలిగిన గుణములనుబట్టి కర్మలు చేయుచూ వాటి ఫలితమును అనుభవించు చున్నాడు |
| అస్య+గుణసంగః+ సత్‌అసత్‌యోనిజన్మసు+ కారణమ్ | = | ఈ జీవపురుషునికి గుణసంగమువలన చేయబడు కర్మలు ఉత్తమ, అధమ జన్మలయందు జన్మించుటకు హేతువు అగుచున్నది. |

...... ❖ ❖ ❖ ......

హృదయగత ఆత్మ

**ఉపద్రష్టానుమన్తా చ । భర్తా భోక్తా మహేశ్వరః ।**
**పరమాత్మేతి చాప్యుక్తో । దేహేఽస్మిన్ పురుషః పరః ॥ 22**

ఉపద్రష్టా - అనుమంతా - చ - భర్తా - భోక్తా - మహేశ్వరః,
పరమాత్మా-ఇతి-చ-అపి-ఉక్తః-దేహే-అస్మిన్-పురుషః - పరః

| | | |
|---|---|---|
| మహేశ్వరః | = | సర్వనియామకుడు |
| పరమాత్మా+ఇతి | = | పరమాత్మ |
| పురుషః | = | హృదయగత ఆత్మ |

అస్మిన్+దేహే(సత్)+అపి = ఈ శరీరమందు ఉన్నప్పటికిని
పరః = ఈ శరీరమునకు వేఱు అయినవాడు
ఉపద్రష్టాః+చ = సాక్షి
అనుమన్తా+చ = సమ్మతిని ఇచ్చువాడు
భర్తా = భరించువాడు
భోక్తా+ఉక్తః = జీవరూపమున సుఖదుఃఖములను అనుభవించు వాడు అని చెప్పబడెను

...... ❖ ❖ ❖ ......

ప్రకృతి - పురుషులు

**య ఏవం వేత్తి పురుషం । ప్రకృతిం చ గుణైస్సహ ।**
**సర్వథా వర్తమానోఽపి । న స భూయోఽభిజాయతే ॥ 23**

యః - ఏవమ్ - వేత్తి - పురుషమ్ - ప్రకృతిమ్ -చ- గుణైః - సహ
సర్వథా - వర్తమానః - అపి - న - సః - భూయః - అభిజాయతే.

యః+ఏవమ్+ గుణైః+సహ+ ప్రకృతిమ్+చ పురుషమ్+వేత్తి = ఎవడు ఈ ప్రకారముగా గుణములతో కూడిన ప్రకృతిని మఱియు గుణరహితుడైన పురుషుని తెలుసుకొనునో

సః+సర్వథా+ వర్తమానః+అపి+ భూయః+న+ అభిజాయతే = ఆ ఆత్మ జ్ఞాని ఇంద్రియములతో సర్వపనులు చేసిననూ కూడ మఱల పుట్టడు, అతనికి పునర్జన్మ లేదు, బ్రహ్మమే అగును.

...... ❖ ❖ ❖ ......

వివిధ సాధన పద్ధతులు

**ధ్యానే నాత్మని పశ్యన్తి । కేచిదాత్మానమాత్మనా ।**
**అన్యే సాంఖ్యేన యోగేన । కర్మయోగేన చాపరే ॥ 24**

ధ్యానేన - ఆత్మని - పశ్యన్తి - కేచిత్ - ఆత్మానమ్ - ఆత్మనా
అన్యే - సాంఖ్యేన - యోగేన - కర్మయోగేన - చ - అపరే

**అన్యే త్వేవ మజానన్తః । శ్రుత్వాన్యేభ్య ఉపాసతే ।**
**తేపి చాతితరన్త్యేవ । మృత్యుం శ్రుతి పరాయణాః ॥ 25**

అన్యే - తు - ఏవమ్ - అజానంతః - శ్రుత్వా-అన్యేభ్యః-ఉపాసతే
తే - అపి - చ - అతితరంతి - ఏవ - మృత్యుమ్- శ్రుతి పరాయణాః

కేచిత్+కర్మయోగేన+చ = కొందఱు నిష్కామకర్మానుష్ఠానము ద్వారా మఱియు
అపరే+ఆత్మనా+ఆత్మని+ = కొందఱు జీవాత్మచేత హృదయగత ఆత్మను
ధ్యానేన+పశ్యన్తి ధ్యానయోగముద్వారా దర్శింతురు
అన్యే+చ+సాంఖ్యేన+ = మఱికొందఱు భక్తిద్వారా, కొందఱు
యోగేన+ఆత్మానమ్ సాంఖ్యయోగము ద్వారా ఆత్మను చేరి ఆత్మయై విరాజిల్లుదురు

పూర్వము నాచే రెండు నిష్ఠలు చెప్పబడినవి అని చెప్పి కర్మయోగము అనగా పుణ్యకర్మ, యోగము, భక్తిద్వారా ఆత్మను పొందుదురని చెప్పి యిప్పుడు సాంఖ్యయోగముద్వారా ఆత్మను పొందుదురని చెప్పబడినది. ఆవిధముగా రెండు నిష్ఠలు చెప్పబడినవి.

అన్యే+తు+ఏవమ్+ = మఱికొందఱు ఈవిధముగా వేదములు
అజానంతః+అన్యేభ్యః+ అధ్యయనము చేసి పరమాత్మను
శ్రుత్వా+ఉపాసతే గ్రహించనివారలై ఇతరులయిన పెద్దలవలన విని ఉపాసన చేయుచున్నారు
శ్రుతి పరాయణాః+ఏవ+= ఆవిధముగా విని సాధన చేయుచున్న వారు కూడా
తే+అపి+మృత్యుమ్ మృత్యువును దాటుచున్నారు అనగా
అతితరంతి అమృతత్త్వమును పొందుచున్నారు.

క్షేత్రము - క్షేత్రజ్ఞుడు

**యావత్సంజాయతే కించిత్ । సత్త్వం స్థావర జంగమమ్ ।**
**క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగాత్ । తద్విద్ధి భరతర్షభ ॥ 26**

యావత్ - సంజాయతే - కించిత్ - సత్త్వమ్ - స్థావర జంగమమ్
క్షేత్ర క్షేత్రజ్ఞ - సంయోగాత్ - తత్ - విద్ధి - భరతర్షభ

భరతర్షభ = ఓ అర్జునా!
స్థావరజంగమమ్ = చరాచరాత్మకమయిన ఈ సర్వ
సత్త్వమ్ = జగత్తు మఱియు
యావత్+కించిత్ = జగత్తులో ఏదేది
సంజాయతే = పుట్టుచున్నదో
తత్ = అది
క్షేత్రక్షేత్రజ్ఞ+సంయోగాత్ = క్షేత్ర క్షేత్రజ్ఞుల కలయికచేత ఏర్పడినది
విద్ధి = తెలియుము

**సమం సర్వేషు భూతేషు । తిష్ఠన్తం పరమేశ్వరం ।**
**వినశ్యత్స్వ వినశ్యన్తం । యః పశ్యతి స పశ్యతి ॥ 27**

సమమ్ - సర్వేషు - భూతేషు - తిష్ఠన్తమ్ - పరమేశ్వరమ్
వినశ్యత్సు _ అవినశ్యన్తమ్ - యః - పశ్యతి - సః - పశ్యతి

**సమం పశ్యన్ హి సర్వత్ర । సమవస్థితమీశ్వరం ।**
**న హినస్త్యాత్మనాత్మానం । తతో యాతి పరాం గతిమ్ ॥ 28**

సమమ్ - పశ్యన్ - హి - సర్వత్ర - సమవస్థితమ్ - ఈశ్వరమ్
న-హినస్తి-ఆత్మనా-ఆత్మానమ్ - తతః - యాతి - పరామ్-గతిమ్

**ప్రకృత్యైవ చ కర్మాణి । క్రియమాణాని సర్వశః ।**
**యః పశ్యతి తథాత్మాన । మకర్తారం స పశ్యతి ॥ 29**

ప్రకృత్యా – ఏవ – చ – కర్మాణి – క్రియమాణాని – సర్వశః,
యః – పశ్యతి – తథా – ఆత్మానమ్ – అకర్తారమ్ – సః – పశ్యతి.

**యదా భూతపృథగ్భావమ్ । ఏకస్థమనుపశ్యతి ।**
**తత ఏవ చ విస్తారం । బ్రహ్మ సమ్పద్యతే తదా ॥ 30**

యదా – భూత పృథగ్భావమ్ – ఏకస్థమ్ – అనుపశ్యతి
తతః – ఏవ – చ – విస్తారమ్ – బ్రహ్మ – సమ్పద్యతే – తదా

**ఆత్మ :**

| | | |
|---|---|---|
| సర్వేషు+భూతేషు+ సమమ్+తిష్ఠన్తమ్ | = | సమస్త భూతముల యందు ఉన్నట్టిదియు శత్రు మిత్రత్వములు లేక సర్వభూతముల యందు సమభావన గలిగిన |
| పరమేశ్వరమ్ | = | ఈశ్వరుని, త్రిగుణరహితుడై |
| వివశ్యత్సు+అవినశ్యంతమ్ | = | సర్వలోకములు నశించినను నశింపనివానిని |
| యః+పశ్యతి+సః+ పశ్యతి | = | ఎవడు దర్శించునో వాడు దర్శించినవాడు మిగిలిన వాళ్ళు గ్రుడ్డివాళ్ళు |
| సర్వత్ర+సముపస్థితమ్+ ఈశ్వరమ్+పశ్యన్ | = | సర్వత్రా ఉన్నట్టి ఈశ్వరుని దర్శించుచున్న వాడును |
| సమమ్+హి+ఆత్మనా+ ఆత్మానమ్+న+హినస్తి | = | తనయందు అఖిలభూతములయందు ఆత్మను దర్శించినవాడును, శత్రుమిత్రాదులందు సమభావన గలవాడును, యోగసాధనచే కూటస్థునిచేత హృదయగత ఆత్మను దర్శించినవాడును, తనని నాశనమొందించుకొనడు |

| | | |
|---|---|---|
| తతః+పరామ్+<br>గతిమ్+యాతి | = | అటుపిమ్మట ఉత్కృష్టమైన గతిని<br>పొందుచున్నాడు |
| చ+యః+ప్రకృత్యా+<br>ఏవ+సర్వశః+కర్మాణి+<br>క్రియమాణాని | = | మఱియు ఎవడు ప్రకృతిచేత గలిగిన<br>గుణములతో జీవుడు సర్వకర్మలు<br>చేయబడుచున్నవని గ్రహించుచున్నాడో |
| తథా+ఆత్మానమ్+<br>అకర్తారమ్+పశ్యతి+<br>సః+పశ్యతి | = | అటులనే తను కర్తను కానని<br>చూచునో అతడు ఆత్మను దర్శించును |
| యదా+భూతపృథక్-<br>భావమ్+ఏకస్థమ్+చ+<br>తతః+ఏవ+విస్తారమ్+<br>అనుపశ్యతి | = | ఎప్పుడు ఈ నామ రూపములతో వివిధములుగా<br>భాసిల్లుచున్న యీ జగత్‌ను విరాట్‌యందు<br>ఉన్నదానినిగను మఱియు బీజమగు విరాట్ నుండే<br>యీ జగత్ శాఖోపశాఖలుగా విస్తరిల్లినది అనియు<br>చూచుచున్నాడో |
| తదా+బ్రహ్మ+సంపద్యతే | = | అప్పుడు అతడు ఆత్మను పొందుచున్నాడు. |

...... ❖ ❖ ❖ ......

ఆత్మ-హృదయగత ఆత్మ

**అనాదిత్వాన్నిర్గుణత్వా । త్పరమాత్మాయ మవ్యయః ।**
**శరీరస్థోఽపి కౌన్తేయ । న కరోతి న లిప్యతే ॥ 31**

అనాదిత్వాత్ - నిర్గుణత్వాత్ - పరమాత్మా - అయమ్ - అవ్యయః
శరీరస్థః - అపి - కౌన్తేయ - న - కరోతి - న - లిప్యతే

**యథా సర్వగతం సౌక్ష్మ్యా । దాకాశం నోపలిప్యతే ।**
**సర్వత్రావస్థితో దేహే । తథాత్మా నోపలిప్యతే ॥ 32**

యథా – సర్వగతమ్ – సౌక్ష్మ్యాత్ – ఆకాశమ్ – న – ఉపలిప్యతే
సర్వత్ర – అవస్థితః – దేహే – తథా – ఆత్మా – న – ఉపలిప్యతే

**యథా ప్రకాశయత్యేకః । కృత్స్నం లోకమిమం రవిః ।**
**క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం । ప్రకాశయతి భారత ॥ 33**

యథా–ప్రకాశయతి–ఏకః–కృత్స్నమ్–లోకమ్–ఇమమ్–రవిః
క్షేత్రమ్–క్షేత్రీ–తథా–కృత్స్నమ్–ప్రకాశయతి–భారత

కౌంతేయ = ఓ అర్జునా!

**ఆత్మ :**

అనాదిత్వాత్+ = అనాది అయియుండుట వలన, నిర్గుణుడు
నిర్గుణత్వాత్+అవ్యయః+ అయియుండుట వలన నాశరహితుడైన
అయమ్+పరమాత్మ ఈ పరమాత్మ

**హృదయగత ఆత్మ :**

శరీరస్థః+అపి+న+ = శరీరమందున్నప్పటికిని ఏమియు చేయనివాడే.
కరోతి+న+లిప్యతే అతనికి కర్మలు అంటవు. అతడు సాక్షి

**హృదయగత ఆత్మ :**

యథా+సర్వగతమ్+ = ఏవిధముగా సర్వవ్యాపి అయిన
ఆకాశమ్+సౌక్ష్మ్యాత్+ ఆకాశము సూక్ష్మమగుటవలన
న+ఉపలిప్యతే+ వస్తువులతో అంటబడదో

తథా+ఆత్మా+ = ఆ ప్రకారముగా హృదయగత ఆత్మ
దేహే+సర్వత్ర+ దేహమునందు హృదయాకాశమునందు
అవస్థితః+న+ సర్వత్ర ఉన్నదైనప్పటికిని దేహముతో అంటబడదు.
ఉపలిప్యతే అనగా దేహమునకు విలక్షణముగా ఉండును.

భారత = ఓ అర్జునా!

యథా+ఏకః+రవిః+ = ఏ విధముగా ఒక సూర్యుడు సమస్తమైన
కృత్స్నమ్+ఇమమ్+ ఈ లోకమును ప్రకాశింప చేయుచున్నాడో
లోకమ్+ప్రకాశయతి

తథా+క్షేత్రీ+కృత్స్నమ్+ = ఆ విధముగా క్షేత్రజ్ఞుడు అనగా హృదయగత
క్షేత్రమ్+ప్రకాశయతి ఆత్మ సమస్త శరీరమును ప్రకాశింపచేయుచున్నాడు.

...... ❖ ❖ ❖ ......

ఆత్మను పొందుదురు

**క్షేత్ర క్షేత్రజ్ఞయోరేవ । మన్తరం జ్ఞాన చక్షుషా ।**
**భూత ప్రకృతిమోక్షశ్చ । యే విదుర్యాన్తి తే పరమ్ ॥ 34**

క్షేత్ర క్షేత్రజ్ఞయోః - ఏవమ్ - అంతరమ్ - జ్ఞాన చక్షుషా
భూత ప్రకృతి మోక్షమ్ - చ - యే - విదుః - యాంతి - తే - పరమ్

యే+జ్ఞానచక్షుషా+ = ఎవరు జ్ఞాననేత్రముతో ఈవిధముగా
ఏవమ్+క్షేత్రక్షేత్రజ్ఞయోః+క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క భేదమును మఱియు
అన్తరమ్+చ+ గుణరహితులై జీవుల బంధమోక్షములను
భూతప్రకృతి మోక్షమ్+ గ్రహించెదరో
విదుః

తే+పరమ్+ = వారు పరమాత్మను పొందుదురు
యాంతి

...... ❖ ❖ ❖ ......

ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము 38వ అధ్యాయము

## (గుణత్రయవిభాగయోగము)

శ్రీ భగవానువాచ

జ్ఞానము

**పరం భూయః ప్రవక్ష్యామి । జ్ఞానానాం జ్ఞానముత్తమం ।**
**యద్జ్ఞాత్వా మునయస్సర్వే । పరాం సిద్ధిమితో గతాః ॥ 1**

పరమ్ - భూయః - ప్రవక్ష్యామి - జ్ఞానానామ్ - జ్ఞానమ్ - ఉత్తమమ్
యత్-జ్ఞాత్వా - మునయః - సర్వే - పరామ్ - సిద్ధిమ్ - ఇతః - గతాః

**ఇదం జ్ఞానముపాశ్రిత్య । మమ సాధర్మ్యమాగతాః ।**
**సర్గేఽపి నోపజాయన్తే । ప్రళయే న వ్యథన్తి చ ॥ 2**

ఇదమ్ - జ్ఞానమ్ - ఉపాశ్రిత్య - మమ - సాధర్మ్యమ్ - ఆగతాః
సర్గే - అపి - న - ఉపజాయన్తే - ప్రళయే - న - వ్యథంతి - చ

యత్+ఉత్తమమ్+ = ఏ ఉత్తమమయిన జ్ఞానమును తెలిసికొని
జ్ఞానమ్+జ్ఞాత్వా+ జితేంద్రియులు అందఱూ ఈ సంసార సాగరమును
సర్వే+మునయః+ఇతః+ దాటి పరమ పద ప్రాప్తిని పొందిరో, అట్టి
పరామ్+సిద్ధిమ్+గతాః

పరమ్+జ్ఞానానామ్+ = ఉత్కృష్టమైన జ్ఞానము యొక్క పరమావధిని
భూయః+ప్రవక్ష్యామి+ మఱల నీకు చెప్పుచున్నాను.

ఇదమ్ = ఈ

| | | |
|---|---|---|
| జ్ఞానమ్+ఉపాశ్రిత్య | = | జ్ఞానమును ఆశ్రయించి |
| మమ+సాధర్మ్యమ్+ ఆగతాః | = | నా యొక్క స్వరూపమును పొందినవారై |
| సర్గే+అపి+ న+ఉపజాయన్తే+చ | = | సృష్టి కాలమున తిరిగి జన్మించరు మఱియు |
| ప్రళయే+న+వ్యథంతి | = | ప్రళయకాలమున నశించరు |

...... ❖ ❖ ❖ ......

ప్రకృతి - పురుషులు సమిష్టి అయిన విరాట్ పురుషుడు

**మమ యోనిర్మహద్బ్రహ్మ । తస్మిన్ గర్భం దధామ్యహం ।**
**సమ్భవ స్సర్వభూతానాం । తతో భవతి భారత ॥ 3**

మమ-యోనిః-మహత్-బ్రహ్మ-తస్మిన్-గర్భమ్-దధామి-అహమ్
సంభవః-సర్వభూతానామ్-తతః-భవతి-భారత

**సర్వయోనిషు కౌన్తేయ । మూర్తయః స్సమ్భవన్తి యాః ।**
**తాసాం బ్రహ్మ మహద్యోనిః । అహం బీజప్రదః పితా ॥ 4**

సర్వయోనిషు - కౌన్తేయ - మూర్తయః -సమ్భవంతి - యాః
తాసామ్-బ్రహ్మ-మహత్ - యోనిః - అహమ్ - బీజప్రదః - పితా

| | | |
|---|---|---|
| భారత+ మహత్+బ్రహ్మ+ మమ+యోనిః | = | ఓ అర్జునా! నేను పురుషుడను, బీజమును. ప్రకృతి సంభవమయిన మహత్, మహత్ వలన గలిగిన అహంకారము ఇవి నా యొక్క సర్వభూత ఉత్పత్తి స్థానము |
| తస్మిన్+అహమ్ | = | ఆ మహత్ బ్రహ్మమునందు నేను |

| | | |
|---|---|---|
| గర్భమ్+దధామి | = | బీజమును (వీర్యమును) ఉంచుచున్నాను. అప్పుడు అది గర్భమును ధరించి ఆ మహత్ ప్రసవించగా |
| తతః+సర్వభూతానామ్+ సమ్భవః+ భవతి | = | అటుపిమ్మట ఆ బ్రహ్మాండమునుండి సర్వభూతముల యొక్క ఉత్పత్తి గలుగుచున్నది అండము ఏర్పడుచున్నది. |
| కౌన్తేయ | = | ఓ అర్జునా! |
| సర్వయోనిషు+ యాః+మూర్తయః+ సంభవన్తి+తాసామ్+ మహత్+బ్రహ్మ+యోనిః | = | దేవ, మనుష్య మొదలయిన వారియందు ఏవేవి ఉపాధులు గలుగుచున్నవో వాటికి మహత్ బ్రహ్మ తల్లి వంటిది |
| అహమ్+బీజప్రదః+ పితాః | = | నేను బీజప్రదుడయిన తండ్రిని |

మహత్ బ్రహ్మ వలన ఉపాధులు మాత్రమే గలుగుచున్నవి. మండుచున్న పెద్ద అగ్నినుండి అగ్నికణములు వచ్చినట్లు ఆత్మనుండి హృదయగత ఆత్మ వచ్చుచున్నది. పూర్వజన్మ కర్మానుసారము జీవుడు దేహములో ప్రవేశించుచున్నాడు.

...... ❖ ❖ ❖ ......

**సత్త్వం రజస్తమ ఇతి । గుణాః ప్రకృతి సమ్భవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో । దేహే దేహిన మవ్యయమ్ ॥ 5**

సత్త్వమ్ – రజః – తమః – ఇతి – గుణాః – ప్రకృతి – సమ్భవాః
నిబధ్నన్తి – మహాబాహో – దేహే – దేహినమ్ – అవ్యయమ్

| | | |
|---|---|---|
| మహాబాహో | = | ఓ అర్జునా! |
| ప్రకృతి+సంభవాః | = | ప్రకృతినుండి జనియించిన |
| సత్త్వమ్+రజః | = | సత్త్వగుణము, రజోగుణము |

| | | |
|---|---|---|
| తమః+ఇతి+గుణాః | = | తమోగుణము అనే యీ మూడు గుణములు |
| అవ్యయమ్+దేహినమ్+ దేహే+నిబధ్నన్తి | = | నాశన రహితుడయిన దేహిని దేహము నందు బంధించుచున్నవి |

త్రిగుణములను పాశములని అందురు. ఇవే యమ పాశములు. అమ్మవారి చేతిలో గల పాశములు.

...... ❖ ❖ ❖ ......

త్రిగుణములు

**తత్ర సత్త్వం నిర్మలత్వాత్ । ప్రకాశక మనామయం ।**
**సుఖ సంగేన బధ్నాతి । జ్ఞాన సంగేన చానఘ ॥ 6**

తత్ర - సత్త్వమ్ - నిర్మలత్వాత్ - ప్రకాశకమ్ - అనామయమ్
సుఖ సంగేన - బధ్నాతి - జ్ఞాన సంగేన - చ - అనఘ

రజోగుణము - రాగాత్మకం

**రజో రాగాత్మకం విద్ధి । తృష్ణా సంగ సముద్భవం ।**
**తన్నిబధ్నాతి కౌన్తేయ । కర్మ సంగేన దేహినమ్ ॥ 7**

రజః - రాగాత్మకమ్ - విద్ధి - తృష్ణా సంగ - సముద్భవమ్
తత్ - నిబధ్నాతి - కౌన్తేయ - కర్మ-సంగేన - దేహినమ్

**తమస్త్వజ్ఞానజం విద్ధి । మోహనం సర్వదేహినామ్ ।**
**ప్రమాదాలస్యనిద్రాభిః । తన్నిబధ్నాతి భారత ॥ 8**

తమః - తు - అజ్ఞానజమ్ - విద్ధి - మోహనమ్ - సర్వదేహినామ్
ప్రమాద - ఆలస్య నిద్రాభిః - తత్ - నిబధ్నాతి - భారత

**సత్త్వం సుఖే సంజయతి । రజః కర్మణి భారత ।**
**జ్ఞానమావృత్య తు తమః । ప్రమాదే సంజయత్యుత ॥ 9**

సత్త్వమ్ - సుఖే - సంజయతి -రజః - కర్మణి - భారత
జ్ఞానమ్ - ఆవృత్య - తు - తమః - ప్రమాదే - సంజయతి-ఉత

**రజస్తమశ్చాభిభూయ । సత్త్వం భవతి భారత ।**
**రజః సత్త్వం తమశ్చైవ । తమః సత్త్వం రజస్తథా ॥ 10**

రజః - తమః - చ - అభిభూయ - సత్త్వమ్ - భవతి - భారత
రజః-సత్త్వమ్ - తమః - చ - ఏవ - తమః - సత్త్వమ్ - రజః - తథా

ఈ గుణములకు ఒక్కొక్కసారి హాని వృద్ధులు గలవు

**సర్వద్వారేషు దేహేఽస్మిన్ । ప్రకాశ ఉపజాయతే ।**
**జ్ఞానం యదా తదా విద్యాత్ । వివృద్ధం సత్త్వమిత్యుత ॥ 11**

సర్వ ద్వారేషు - దేహే -అస్మిన్ - ప్రకాశః - ఉపజాయతే
జ్ఞానమ్-యదా-తదా-విద్యాత్ - వివృద్ధమ్ - సత్త్వమ్ - ఇతి - ఉత.

**లోభః ప్రవృత్తిరారమ్భః । కర్మణామశమః స్పృహా ।**
**రజస్యేతాని జాయన్తే । వివృద్ధే భరతర్షభ ॥ 12**

లోభః - ప్రవృత్తిః - ఆరమ్భః - కర్మణామ్ - అశమః - స్పృహా
రజసి - ఏతాని - జాయన్తే - వివృద్ధే - భరతర్షభ

**అప్రకాశోఽప్రవృత్తిశ్చ । ప్రమాదో మోహ ఏవ చ ।**
**తమస్యేతాని జాయన్తే । వివృద్ధే కురునన్దన ॥ 13**

అప్రకాశః - అప్రవృత్తిః - చ - ప్రమాదః - మోహః - ఏవ - చ
తమసి - ఏతాని - జాయన్తే - వివృద్ధే - కురునందన

| | | |
|---|---|---|
| అనఘ | = | ఓ అర్జునా! |
| తత్ర+సత్త్వమ్+<br>నిర్మలత్వాత్+<br>ప్రకాశకమ్ | = | ఆ మూడు గుణములలో సత్త్వగుణము<br>స్వచ్ఛమైనది అగుటవలన<br>జ్ఞానమును గలుగచేయునది |
| అనామయమ్+<br>సుఖ+సంగేన+చ+<br>జ్ఞాన+సంగేన+<br>బధ్నాతి | = | ప్రమాదము లేనిది. ఆ సత్త్వగుణము<br>సుఖాసక్తి చేత సుఖము పొందాలనే కోరికతో<br>మఱియు జ్ఞాన సముపార్జన అనే కోరిక చేత దేహిని<br>బంధించుచున్నది |
| కౌన్తేయ | = | ఓ అర్జునా! |
| తృష్ణా సంగ-<br>సముద్భవమ్+రజః | = | తృష్ణ అనగా లేని వస్తువును కోరుట, సంగం అనగా<br>ఉన్న వస్తువుల యందు ప్రీతి. ఈ రెండింటివలన<br>పుట్టిన రజోగుణము |
| రాగాత్మకమ్ | = | అనురాగ మమకారములు గలుగ చేయు దానినిగా |
| విద్ధి | = | రాగాత్మకమైన దానినిగా తెలియుము |
| తత్+దేహినమ్+<br>కర్మ+సంగేన+నిబధ్నాతి | = | ఆ రజోగుణము జీవునిని పుణ్యకర్మముల యందలి<br>ఆసక్తి చేత అనగా పుణ్యఫలితము కోరుటవలన<br>బంధించుచున్నది రజోగుణము జీవుని<br>బంధించుచున్నది. |
| భారత | = | ఓ అర్జునా! |
| తతః+తమః+<br>అజ్ఞానజమ్+విద్ధి | = | తమోగుణము అజ్ఞానము వలన గలుగుచున్నదని<br>గ్రహించుము |
| సర్వదేహినామ్ | = | సర్వజీవులకును |

| | |
|---|---|
| మోహనమ్+తత్ | = మోహమును గలుగచేయు ఆ తమోగుణము |
| ప్రమాద+ఆలస్య | = ప్రమాదము, ఆలస్యము |
| నిద్రాభిః+తు+ నిబధ్నాతి | = నిద్రలచే జీవుని బంధించుచున్నది. |
| భారత | = ఓ అర్జునా! |
| సత్త్వమ్+సుఖే+ సంజయతి | = సత్త్వగుణమువలన సుఖము కలుగుచున్నది |
| రజః+కర్మణి | = రజోగుణము కర్మలయందు ఆసక్తిని కలిగించి, పుణ్యకర్మలయందు దేహిని ప్రవర్తింపచేయుచున్నది |
| ఉత | = మఱియు |
| తమః+జ్ఞానమ్+ఆవృత్య+ ప్రమాదే+తు+సంజయతి | = తమోగుణము జ్ఞానమును కప్పివేసి ఏమఱుపాటు, మోహము, మదము, మాత్సర్యములందు ఆలస్యము, నిద్రయందు ప్రవర్తిల్లుచున్నది. |
| భారత | = ఓ అర్జునా! |
| సత్త్వమ్+తమః+చ+ రజః+అభిభూయ | = సత్త్వగుణము తమోగుణము, రజోగుణములను అణచి ప్రవర్తిల్లుచున్నది |
| రజః+ | = రజోగుణము |
| తమః+చ+సత్త్వమ్ | = తమోగుణము, సత్త్వగుణములను అణచి ప్రవర్తిల్లుచున్నవి |
| తథా+తమ+ఏవ+ రజః+సత్త్వమ్+భవతి | = అటులనే తమోగుణము రజోగుణము, సత్త్వగుణములను అణచి ప్రవర్తిల్లుచున్నవి |

మూడు గుణములు ఏకకాలమునందు ప్రవర్తిల్లవు. ఏదో ఒక గుణము మాత్రమే ప్రవర్తిల్లును.

| | | |
|---|---|---|
| యదా | = | ఎప్పుడు |
| అస్మిన్+దేహే | = | ఈ దేహము నందు |
| సర్వద్వారేషు | = | సర్వద్వారములలో అనగా జ్ఞానేంద్రియములలో |
| ప్రకాశః+జ్ఞానమ్ | = | తేజో రూపమయిన జ్ఞానము |
| ఉపజాయతే | = | కలుగుచున్నదో |
| తదా | = | అప్పుడు |
| సత్త్వమ్+ఉత+ వివృద్ధమ్+ఇతి+విద్యాత్ | = | సత్త్వగుణము వృద్ధి చెందినదని తెలుసుకొనవలయును. సత్త్వగుణము వృద్ధి చెందినప్పుడు మనస్సు నిర్మలముగా ఉండును. |
| భరతర్షభ | = | ఓ అర్జునా! |
| రజసి+వివృద్ధే+ లోభః అశమః+స్పృహా+ కర్మణామ్+ఆరంభః+ ఏతాని+ప్రవృత్తిః+జాయన్తే | = | రజోగుణము అభివృద్ధి అగుచుండగా లోభము, అశాంతి, కామ, క్రోధాదులు స్పృహా (ఇచ్ఛ) పుణ్యకర్మలయొక్క ఆరంభము మొదలయిన రజోగుణమునకు సంబంధించిన ఈ కామక్రోధాదులకు ప్రవృత్తి గలుగుచున్నది |
| కురునందన | = | ఓ అర్జునా! |
| తమసి+వివృద్ధే | = | తమోగుణము అభివృద్ధి గలుగుచుండగా |
| అప్రకాశః | = | అవివేకము (వివేకహీనత) |
| అప్రవృత్తి+చ+ ప్రమాదః | = | నిద్ర, ఆలస్యము, మఱియు పుణ్య కర్మలయందు విముఖత, ఏమఱుపాటు |
| మోహః+ఏవ+చ | = | మోహము, మదము |
| ఏతాని+జాయన్తే | = | ఈ తమోగుణము లక్షణములు గలుగుచున్నవి |
| వివృద్ధే | = | వృద్ధి పొందుచున్నవి. |

...... ❖ ❖ ❖ ......

దేహత్యాగ సమయమున గల గుణములవలన పునర్జన్మ

**యదా సత్త్వే ప్రవృద్ధే తు । ప్రలయం యాతి దేహభృత్ ।**
**తదోత్తమవిదాం లోకాన్ । అమలాన్ ప్రతిపద్యతే ॥ 14**

యదా - సత్త్వే - ప్రవృద్ధే - తు - ప్రలయమ్ - యాతి - దేహభృత్
తదా - ఉత్తమ విదామ్ - లోకాన్ - అమలాన్ - ప్రతిపద్యతే

**రజసి ప్రలయం గత్వా । కర్మ సంగిషు జాయతే ।**
**తథా ప్రలీనస్తమపి । మూఢయోనిషు జాయతే ॥ 15**

రజసి - ప్రలయమ్ - గత్వా - కర్మ సంగిషు - జాయతే
తథా - ప్రలీనః - తమసి - మూఢ యోనిషు - జాయతే

**కర్మణః సుకృత స్యాహుః । సాత్త్వికం నిర్మలం ఫలం ।**
**రజసస్తు ఫలం దుఃఖ । మజ్ఞానం తమసః ఫలమ్ ॥ 16**

కర్మణః - సుకృతస్య - ఆహుః - సాత్త్వికమ్ - నిర్మలమ్ - ఫలమ్,
రజసః - తు - ఫలమ్ - దుఃఖమ్ - అజ్ఞానమ్ - తమసః - ఫలమ్.

**సత్త్వాత్సంజాయతే జ్ఞానం । రజసో లోభ ఏవ చ ।**
**ప్రమాద మోహౌ తమసో । భవతోఽజ్ఞాన మేవ చ ॥ 17**

సత్త్వాత్ - సంజాయతే - జ్ఞానమ్ - రజసః - లోభః - ఏవ - చ
ప్రమాద మోహౌ - తమసః - భవతః - అజ్ఞానమ్ - ఏవ - చ

దేహభృత్+యదా + = దేహి ఎప్పుడు
సత్త్వే+తు+ప్రవృద్ధే(సతి)+ సత్త్వగుణము వృద్ధి పొందుచుండగా
ప్రలయమ్+యాతి దేహమును వీడి పయనించుచున్నాడో

| | | |
|---|---|---|
| తదా+అమలాన్+ ఉత్తమవిదామ్+లోకాన్+ ప్రతిపద్యతే | = | అప్పుడు స్వచ్ఛములైన ఉత్తమ జ్ఞానము గలవారు పొందు పుణ్యలోకములను పొందుచున్నాడు. తిరిగి జన్మింపడు |
| రజసి (ప్రవృద్ధేసతి)+ ప్రలయమ్+గత్వా+ కర్మ సంగిషు+జాయతే | = | రజోగుణము అభివృద్ధిని పొందుచుండగా మరణమును పొందినవాడు పుణ్యకర్మాసక్తులగు వారి యింట పుట్టుచున్నాడు |
| తథా | = | అటులనే |
| తమసి (ప్రవృద్ధేసతి)+ ప్రలీనః+మూఢయోనిషు+ జాయతే | = | తమోగుణము అభివృద్ధి పొందుచుండగా మరణించినవాడు నీచ జన్మములందు పుట్టుచున్నాడు. |
| సుకృతస్య+కర్మణః+ నిర్మలమ్+సాత్త్వికమ్+ ఫలమ్ | = | సుకృత కర్మమునకు జ్ఞానము నిర్మల ఫలితము అనియు |
| రజసః+తు+ఫలమ్+ దుఃఖమ్ | = | రజోకర్మల యొక్క ఫలము దుఃఖమనియు |
| తమసః+ఫలమ్+ అజ్ఞానమ్+ఆహుః | = | తమో కర్మయొక్క ఫలము అజ్ఞానమనియు చెప్పుదురు. |
| సత్త్వాత్+జ్ఞానమ్+ సంజాయతే | = | సత్త్వగుణము వలన జ్ఞానము గలుగుచున్నది |
| రజసః+లోభః+చ+ ఏవ | = | రజోగుణము వలన కామ, క్రోధ, లోభములు గలుగుచున్నవి |
| తమసః | = | తమోగుణము వలన |
| ప్రమాద మోహౌ+చ అజ్ఞానమ్+ఏవ+భవతః | = | ప్రమాదము, మదము, మాత్సర్యములు, ఆలస్యము, నిద్ర అజ్ఞానము గలుగుచున్నవి. |

...... ❖ ❖ ❖ ......

**ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా । మధ్యే తిష్ఠన్తి రాజసాః ।**
**జఘన్యగుణవృత్తిస్థా । అధోగచ్ఛన్తి తామసాః ॥ 18**

ఊర్ధ్వమ్ - గచ్ఛంతి - సత్త్వస్థాః - మధ్యే - తిష్ఠన్తి-రాజసాః
జఘన్య గుణ వృత్తిస్థాః - అధః - గచ్ఛంతి - తామసాః

| | | |
|---|---|---|
| సత్త్వస్థాః+ఊర్ధ్వమ్+ గచ్ఛన్తి | = | మరణ కాలమున సత్త్వ గుణమునందున్న వారు ఊర్ధ్వ లోకములకు వెళ్ళుదురు. |
| రాజసాః+మధ్యే తిష్ఠన్తి | = | మరణ కాలమున రజోగుణము నందున్నవారు అనగా పుణ్యఫలితము కోరినవారు పుణ్యలోకములకు చేరుదురు. పుణ్యము క్షీణించగనే తిరిగిమనుష్య లోకమున జన్మించెదరు. |
| జఘన్యగుణ వృత్తిస్థాః+ తామసాః+అధః+గచ్ఛన్తి | = | నీచ ప్రవృత్తులగు తమోగుణమందున్నవారు చీకటి లోకములకు, అధో లోకములకు అనగా నరకమునకు వెళ్ళుదురు. |

...... ❖ ❖ ❖ ......

**నాన్యం గుణేభ్యః కర్తారం । యదా ద్రష్టానుపశ్యతి ।**
**గుణేభ్యశ్చ పరం వేత్తి । మద్భావం సోఽధి గచ్ఛతి ॥ 19**

న అన్యమ్ - గుణేభ్యః - కర్తారమ్ - యదా - ద్రష్టా - అనుపశ్యతి
గుణేభ్యః - చ - పరమ్ - వేత్తి - మద్భావమ్ - సః - అధిగచ్ఛతి

| | | |
|---|---|---|
| యదా+ద్రష్టా | = | ఎప్పుడు జీవుడు తను ద్రష్ట అనియు, ప్రకృతి దృశ్యమనియు గ్రహించి |
| గుణేభ్యః+అన్యమ్+ కర్తారమ్+న+అనుపశ్యతి | = | సర్వపుణ్యపాపకర్మలకు గుణములకంటె వేఱొకటి కర్త కాదు అని చూచునో తనని |
| గుణేభ్యః+చ+పరమ్+ వేత్తి+సః+మద్భావమ్+ అధిగచ్ఛతి | = | గుణములకంటె వేఱైనవానినిగా తనను తెలియుచున్నాడో అతడు నా స్వరూపమును పొందుచున్నాడు అనగా బ్రహ్మయగుచున్నాడు |

**గుణానేతానతీత్య త్రీన్ । దేహీ దేహసముద్భవాన్ ।**

**జన్మ మృత్యు జరా దుఃఖైః । విముక్తోఽమృతమశ్నుతే ॥ 20**

గుణాన్ – ఏతాన్ – అతీత్య – త్రీన్ – దేహీ – దేహసముద్భవాన్

జన్మ మృత్యు జరా దుఃఖైః – విముక్తః – అమృతమ్ – అశ్నుతే

దేహీ+దేహసముద్భవాన్+= జీవుడు దేహోత్పత్తికి కారణమయిన ప్రకృతిని

ఏతాన్+త్రీన్+గుణాన్+ ఈ మూడు గుణములను దాటి

అతీత్య (ప్రకృతిని బాసి ఆనందమయుండై)

జన్మమృత్యుజరాదుఃఖైః+ = జన్మ, ముసలితనము, మృత్యువు, దుఃఖముల చేత

విముక్తః (సన్)+ విడువబడినవాడై అమృతత్త్వమును

అమృతమ్+అశ్నుతే పొందును.

...... ❖ ❖ ❖ ......

అర్జున ఉవాచ

**కైర్లింగైః త్రీన్ గుణానేతాన్ । అతీతో భవతి ప్రభో! ।**

**కిమాచారః కథం చైతాన్ । త్రీన్ గుణానతి వర్తతే ॥ 21**

కైః – లింగైః – త్రీన్ – గుణాన్ – ఏతాన్ – అతీతః – భవతి – ప్రభో

కిమాచారః – కథమ్ – చ – ఏతాన్ – త్రీన్ – గుణాన్ – అతి వర్తతే

**ప్రశ్నలు :**

ప్రభో = శ్రీకృష్ణా!

ఏతాన్+త్రీన్+గుణాన్+ = ఈ మూడు గుణములు దాటినవాడు, అనగా

అతీతః+కైః+లింగైః+ గుణరహితుడు ఏ లక్షణములతో ఉండును?

భవతి+కిమ్+ఆచారః+చ ఎట్టి ఆచారము గలవాడు?

ఏతాన్+త్రీన్+గుణాన్+ = ఈ మూడు గుణములను ఎట్లు

కథమ్+అతి వర్తతే అతిక్రమించుచున్నాడు?

...... ❖ ❖ ❖ ......

శ్రీ భగవానువాచ

**ప్రకాశం చ ప్రవృత్తిం చ । మోహమేవ చ పాణ్డవ ।**
**న ద్వేష్టి సంప్రవృత్తాని । న నివృత్తాని కాంక్షతి ॥ 22**

ప్రకాశమ్ – చ – ప్రవృత్తిమ్ – చ – మోహమ్ – ఏవ – చ – పాండవ
న – ద్వేష్టి – సంప్రవృత్తాని – న – నివృత్తాని – కాంక్షతి

**ఉదాసీన వదాసీనో । గుణైర్యో న విచాల్యతే ।**
**గుణావర్తన్త ఇత్యేవ । యోఽవతిష్ఠతి నేంగతే ॥ 23**

ఉదాసీనవత్ – ఆసీనః – గుణైః – యః – న – విచాల్యతే
గుణాః – వర్తంతే – ఇతి – ఏవ – యః – అవతిష్ఠతి – న – ఇంగతే

**సమ దుఃఖ సుఖః స్వస్థః । సమ లోష్టాశ్మ కాంచనః ।**
**తుల్య ప్రియాప్రియో ధీరః । తుల్య నిందాత్మ సంస్తుతిః ॥ 24**

సమదుఃఖసుఖః – స్వస్థః – సమ లోష్టాశ్మ కాంచనః
తుల్య – ప్రియాప్రియః–ధీరః–తుల్య–నిందాత్మ–సంస్తుతిః

**మానావమానయోస్తుల్యః । తుల్యో మిత్రారిపక్షయోః ।**
**సర్వారమ్భపరిత్యాగీ । గుణాతీతః స ఉచ్యతే ॥ 25**

మానావమానయోః – తుల్యః – తుల్యః – మిత్రారిపక్షయోః
సర్వారమ్భ పరిత్యాగీ – గుణాతీతః – సః – ఉచ్యతే

**మాం చ యోఽవ్యభిచారేణ । భక్తియోగేన సేవతే ।**
**స గుణాన్ సమతీత్యైతాన్ । బ్రహ్మ భూయాయ కల్పతే ॥ 26**

మామ్ – చ – యః – అవ్యభిచారేణ – భక్తియోగేన – సేవతే
సః – గుణాన్ – సమతీత్య – ఏతాన్ – బ్రహ్మభూయాయ – కల్పతే

**బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమ్ । అమృతస్యావ్యయస్య చ ।**
**శాశ్వతస్య చ ధర్మస్య । సుఖస్యైకాన్తికస్యచ ॥ 27**

బ్రహ్మణః – హి – ప్రతిష్ఠా – అహమ్ – అమృతస్య – అవ్యయస్య – చ
శాశ్వతస్య – చ – ధర్మస్య – సుఖస్య – ఐకాంతికస్య – చ

| | | |
|---|---|---|
| పాండవ | = | ఓ అర్జునా! |
| ప్రకాశమ్+చ+ ప్రవృత్తిమ్+చ+ మోహమ్+ఏవ+చ+ న+ద్వేష్టి+న+కాంక్షతి | = | సత్త్వగుణమును రజోగుణమును మఱియు తమోగుణమును వీడినవాడు ఎవరినీ ద్వేషింపడు ఏదీ కోరడు |
| సమ్ ప్రవృత్తాని+ నివృత్తాని | = | కాలవశమున గలిగిన సంపదాదులకు ఆనందపడడు, కాలవశమున తొలగిపోయిన సంపదాదులకు దుఃఖించడు. |
| యః+ఉదాసీనవత్+ ఆసీనః+గుణైః+ఏవ+ న+విచాల్యతే | = | ఎవడు ఉదాసీనునివలె ఆసీనుడయి గుణముల చేత చలింపచేయబడడో |
| యః+గుణాః+వర్తంతే+ ఇతి+అవతిష్ఠతి+ న + ఇంగతే | = | ఎవడు గుణములు ప్రవర్తించుచున్నవని తెలిసికొని ఉండునో అతడు సుఖదుఃఖములకు చలింపడో, |
| సుఖః+దుఃఖః+సమ | = | సుఖ దుఃఖములను సమముగా భావించువాడును, |
| స్వస్థః | = | స్వస్థుడును |
| సమ లోష్టాశ్మ కాంచన | = | మట్టి గడ్డను, ఱాతిని, బంగారము సమముగా చూచువాడును |
| తుల్య ప్రియాప్రియః | = | ప్రియము, అప్రియములను సమముగా చూచువాడును |

| | | |
|---|---|---|
| ధీరః+తుల్యనిందా+ | = | ఇహలోక పరలోక సుఖాపేక్ష లేని ధీరుడును, |
| ఆత్మ సంస్తుతిః+ | | నిందాస్తుతులందు సమభావన గలవాడును. |
| మానావమానయోః+ | | మానావమానములందు సమభావన గలవాడును |
| తుల్యః | | |
| మిత్రారిపక్షయోః+ | = | మిత్రులయెడ, శత్రువులయెడ సమముగా |
| తుల్యః | | నుండువాడును |
| సర్వారంభ పరిత్యాగీ+సః | = | సర్వకర్మలు వదలినవాడును లేదా |
| | | కర్తృత్వాభిమానము లేనివాడును ఎవడో అట్టివాడు |
| గుణాతీతః+ఉచ్యతే+చ | = | గుణాతీతుడు అని చెప్పబడుచున్నాడు. మఱియు |
| యః+ఏతాన్+గుణాన్+ | = | ఎవడు ఈ త్రిగుణములను దాటి |
| సమతీత్య+ | | యితర చింతనలు లేక నిశ్చల భక్తితో |
| అవ్యభిచారేణ+భక్తియోగేన | | నన్ను సేవించుచున్నాడో |
| మామ్+సేవతే | | |
| సః+బ్రహ్మ భూయాయ+ | = | అట్టివాడు బ్రహ్మత్వమును పొందుటకు |
| కల్పతే | | తగియున్నాడు. అనగా అతడు బ్రహ్మమే. |

**ఆత్మ :**

| | | |
|---|---|---|
| అహమ్+అమృతస్య+చ | = | నేను అమృతస్వరూపము అయినదియు, |
| అవ్యయస్య+ | | నాశనము కానిదియు, శాశ్వతము |
| శాశ్వతస్య+చ+ | | అయినదియు, మఱియు ధర్మ స్వరూపము |
| ధర్మస్య+ఐకాన్తికస్య+ | | అయినదియు, రెండవది లేనిదియు, సుఖము |
| సుఖస్య+చ | | గలిగించినదియు అయిన ఆత్మస్వరూపుడను |

**విరాట్ :**

| | | |
|---|---|---|
| బ్రహ్మణః+హి+ప్రతిష్ఠా | = | విరాట్పురుషుడు సర్వవిశ్వమునకు ఆధారుడు. |
| | | సృష్టిస్థితిలయకారకుడు. |

...... ❖ ❖ ❖ ......

ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము 39వ అధ్యాయము

## (పురుషోత్తమప్రాప్తి యోగము)

శ్రీభగవానువాచ

ఈశ్వరవృక్షం - సంసారవృక్షం

**ఊర్ధ్వమూల మధశ్శాఖం । అశ్వత్థం ప్రాహురవ్యయం ।**
**ఛందాంసి యస్యపర్ణాని । యస్తం వేద స వేదవిత్ ॥ 1**

ఊర్ధ్వమూలమ్ - అధః - శాఖమ్ - అశ్వత్థమ్ - ప్రాహుః - అవ్యయమ్
ఛందాంసి - యస్య - పర్ణాని -యః - తమ్ - వేద - సః - వేదవిత్

**అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా । గుణప్రవృద్ధా విషయ ప్రవాలాః।**
**అధశ్చమూలా న్యనుసన్తతాని । కర్మానుబన్ధీని మనుష్యలోకే ॥ 2**

అధః-చ-ఊర్ధ్వమ్-ప్రసృతాః-తస్య-శాఖాః-గుణ ప్రవృద్ధాః- విషయ ప్రవాలాః
అధః-చ-మూలాని-అనుసంతతాని-కర్మానుబంధీని-మనుష్యలోకే

**న రూప మస్యేహ తథోపలభ్యతే । నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।**
**అశ్వత్థమేనం సువిరూఢమూలం । అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా ॥ 3**

న-రూపమ్-అస్య-ఇహ-తథా-ఉపలభ్యతే-న-అంతః-న-చ-ఆదిః-న-చ
సంప్రతిష్ఠా-అశ్వత్థమ్-ఏనమ్-సువిరూఢమూలమ్-అసంగ శస్త్రేణ-దృఢేన-ఛిత్వా

**తతః పదం తత్పరిమార్గితవ్యం ।యస్మిన్ గతా న నివర్తంతి భూయః ।**
**తమేవ చాద్యం పురుషం ప్రపద్యే । యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥4**

తతః-పదమ్-తత్-పరిమార్గితవ్యమ్-యస్మిన్-గతాః-న-నివర్తంతి-భూయః
తమ్-ఏవ-చ-ఆద్యమ్-పురుషమ్-ప్రపద్యే-యతః-ప్రవృత్తిః-ప్రసృతా-పురాణీ

| | |
|---|---|
| ఊర్ధ్వమూలమ్+ అథఃశాఖమ్+అవ్యయమ్+ ప్రాహుః | = మూలముపైన గలదియు, శాఖలు క్రిందకు కలదియును నాశము లేనిదిగను బ్రహ్మమనే వృక్షమును చెప్పుదురు |
| యస్య+పర్ణాని+ ఛందాంసి | = దీని యొక్క ఆకులు వేదములు |
| యః+తమ్+వేద+ సః+వేదవిత్ | = ఎవడు దానిని స్వానుభవంతో తెలుసుకొని, దర్శించునో వాడు వేదము తెలిసినవాడు |
| అథ | = ఆ తర్వాత |
| అశ్వత్థమ్+మూలాని+ మనుష్యలోకే+చ | = నశించుస్వభావముగల సంసారవృక్షముయొక్క మూలము భూలోకమునందు మఱియు |
| అథః | = ఆ తర్వాత |
| గుణప్రవృద్ధాః | = గుణములచే వృద్ధిపొందినదై |
| విషయప్రవాలాః | = శబ్దాది విషయములనే చిగుళ్ళు కలిగినదై |
| కర్మానుబంధీని | = కర్మఫలముతో సంబంధము గలదియై |
| తస్య+శాఖాః+ప్రసృతాః | = దానియొక్క శాఖలు వ్యాపించి వున్నవియై |
| అథః+చ+ఊర్ధ్వమ్+ అనుసంతతాని+చ+ సంప్రతిష్ఠా | = క్రిందకు (నరకమునకు) మఱియు పైన ఊర్ధ్వ లోకమునకు అనగా పుణ్యలోకములకు బాగుగా విస్తరించివున్నవి |
| అస్య+రూపమ్+ఇహ+ న+ఉపలభ్యతే | = ఈ ఈశ్వరవృక్షముయొక్క రూపము ఈ లోకమున తెలియబడకున్నది |
| తథా+న+ఆది+చ+న+ అన్తః+చ+న+ | = ఆవిధముగనే ఆది, మధ్యము, అంతము తెలియకున్నది |
| సువిరూఢమూలమ్+ ఏనమ్+అశ్వత్థమ్+దృఢేన +అసంగశస్త్రేణ+ఛిత్వా | = గట్టిగా నాటుకొనియున్న ఈ సంసారవృక్షమును వైరాగ్యమనే దృఢమైన ఆయుధముచే ఛేదించి |

| | |
|---|---|
| తతః | = పిమ్మట |
| యస్మిన్+గతాః+ భూయః+న+నివర్తంతి | = ఏ పదమును చేరిన మరల తిరిగి జన్మింపరో |
| తమ్+ఏవ+ఆద్యమ్+చ+ పురుషమ్+ప్రపద్యే | = అతనిని అనగా ఆత్మను సృష్టికి ఆది, మధ్య, అంతములు లేని పురుషుని శరణు కోరవలయును |
| యతః+ప్రస్పృతా+ పురాణీ+ప్రవృత్తిః+ తత్+పదమ్+ పరిమార్గితవ్యమ్ | = ఎందుండి యీ సంసార వృక్షము వ్యాపించి యున్నదో పురాతనమైన ఈ సంసారవృక్షము యొక్క ప్రవృత్తిని అన్వేషింపవలయును మఱియు ఆ బ్రహ్మపదమును అన్వేషింపవలయును |

**వ్యాఖ్యానము :-**

**సీ. ప్రకృతియొక్కటి పాదు, ఫలములు సుఖదుఃఖములు రెండు, గుణములు మూఁడు వేళ్ళు । తగు రసంబులు నాల్గు ధర్మార్థముఖరంబు, లెఱిఁగెడి విధము లై దింద్రియంబు । లాఱు స్వభావంబు లా శోకమోహాదు లూర్మలు, దాతువు లొక్కయేడు । పైపొర లెనిమిది ప్రంగలు, భూతంబు లైదు బుద్ధియు మనోఽహంకృతులును ॥**

**తే. రంధ్రములు దొమ్మిదియుఁ గోటరములు । ప్రాణ పత్త్రదశకంబు, జీవేశ పక్షియుగముఁ । గలుగు సంసార వృక్షంబు గలుగఁజేయఁ । గావ నడఁగింప రాజ వొక్కరుఁడ వీవ** (భాగవతము - దశమస్కంధము-పూర్వభాగము-91)

అనగా ఈ సంసారవృక్షమునకు ప్రకృతి అన్నది మూలము. సుఖదుఃఖములు అనేవి ఫలములు. సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము అనే మూడు గుణములు దీనికి వ్రేళ్ళు. ధర్మము, అర్థము, కామము, మోక్షము అనే నాలుగు పురుషార్థములు దీనియొక్క రసములు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే అనే ఐదు ఇంద్రియార్థములు గ్రహించు విధములు; (కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యములనే ఆఱు అరిషడ్వర్గములు) జననము - మరణము, ఆకలిదప్పికలు, శోకమోహము అనునవి వృక్షానికిగల ఆఱు ఊర్మలు. చర్మము, రక్తము, మాంసము, మేధస్సు, అస్థి, మజ్జ, శుక్లము అనే ఏడు ధాతువులు ఈ వృక్షానికిగల ఏడు పొరలు. ఇంకొక పద్ధతిలో

రోమములు, చర్మము, మాంసము, ఎముకలు, స్నాయువులు, మజ్జ, ప్రాణములు ఈ ఏడు ధాతువులని చెప్పుదురు. పంచభూతములు, బుద్ధి, మనస్సు, అహంకారము అనే ఎనిమిది ఆ వృక్షానికి శాఖలు. కన్నులు, చెవులు, ముక్కు, నోరు, మలమూత్రములనే తొమ్మిది రంధ్రములు ఆ వృక్షానికిగల తొమ్మిది రంధ్రములు. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనే పంచప్రాణములు, నాగము, కూర్మము, క్రుకరము, దేవదత్తము, ధనంజయము అనే ఐదు ఉపప్రాణములు మొత్తము పది ప్రాణములు ఆకులు. ఈ వృక్షముపై జీవుడు, ఈశ్వరుడు అనే రెండు పక్షులు నివసిస్తుంటాయి. ఇటువంటి సంసారవృక్షానికి సృష్టి, స్థితి, లయములకు ఈశ్వరుడే ప్రభువు.

...... ❖ ❖ ❖ ......

**నిర్మాన మోహా జితసంగ దోషా ।**
**అధ్యాత్మ నిత్యా వినివృత్త కామాః ।**
**ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖ సంజ్ఞైః ।**
**గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్ ॥ 5**

నిర్మానమోహాః–జితసంగ దోషాః–అధ్యాత్మ నిత్యాః–వినివృత్త కామాః,
ద్వంద్వైః–విముక్తాః–సుఖదుఃఖసంజ్ఞైః–గచ్ఛంతి–అమూఢాః–పదమ్–అవ్యయమ్–తత్

| | | |
|---|---|---|
| నిర్మాన మోహాః | = | మోహము, అభిమానము లేనివారును |
| జితసంగదోషాః | = | సంగ దోషమును జయించినవారును |
| వినివృత్త కామాః | = | కోరికలు లేనివారును |
| సుఖదుఃఖ సంజ్ఞైః | = | సుఖ దుఃఖములు, మానావమానములు |
| ద్వంద్వైః+విముక్తాః | = | నిందాస్తుతులు మొదలయిన ద్వంద్వముల నుంచి విడివడినవారును |
| నిత్యాః+అధ్యాత్మ+ | = | సర్వవేళల నన్ను స్మరించి అధ్యాత్మ తత్త్వం ఎఱిగిన |

| | | |
|---|---|---|
| అమూఢాః+తత్+ | = | జ్ఞానులు ఆ నాశరహితమయిన (పరమ) పదమును |
| అవ్యయమ్+పదమ్+ | | అనగా ఆత్మను పొందుచున్నారు. |
| గచ్ఛన్తి | | |

...... ❖ ❖ ❖ ......

**న తద్భాసయతే సూర్యో । న శశాంకోన పావకః ।**
**యద్గత్వా న నివర్తంతే । తద్ధామ పరమం మమ ॥ 6**

న - తత్ - భాసయతే - సూర్యః - న - శశాంకః - న - పావకః
యత్ - గత్వా - న - నివర్తంతే - తత్ - ధామ - పరమమ్ - మమ

| | | |
|---|---|---|
| తత్ | = | ఆ బ్రహ్మ పదమును |
| సూర్యః+న+(భాసయతే) | = | సూర్యుడు ప్రకాశింపచేయజాలడు |
| శశాంకః+న | = | చంద్రుడు ప్రకాశింపచేయజాలడు |
| పావకః+న+భాసయతే | = | అగ్ని ప్రకాశింపచేయజాలడు |
| యత్+గత్వా+న+ | = | దేనిని చేరిన మరల తిరిగిరారో అది |
| నివర్తంతే+తత్+మమ+ | | నా యొక్క విశిష్టమైన స్థానము |
| పరమమ్+ధామ | | |

**వ్యాఖ్యానము:-** ఇదే విషయమును ముండక ఉపనిషత్, ద్వితీయ ముండకమ్, ద్వితీయ ఖండమ్ - 10లోను, అటులనే కఠోపనిషత్ పంచమవల్లి-15లోను చెప్పబడినది.

**న తత్ర సూర్యోభాతి న చంద్ర తారకం। నేమా విద్యుతో భాన్తి కుతోఽ యమగ్నిః । తమేవ భాన్త మనుభాతి సర్వం । తస్య భాసా సర్వమిదం విభాతి ॥** - అనగా ఆత్మ ఉన్న స్థానములో సూర్యుడుగాని, చంద్రుడుగాని, నక్షత్రములు గాని, మెరుపులు గాని ఉండవు. అవే లేనప్పుడు అగ్ని మాత్రం ఎట్లు ప్రకాశించును. ఈ ఆత్మయే స్వయంప్రకాశము. అదియే ఈ సర్వప్రపంచమును ప్రకాశింపచేయును.

...... ❖ ❖ ❖ ......

జీవుడు/దేహి పరమాత్మయొక్క అంశ

**మమైవాంశో జీవలోకే । జీవభూతః సనాతనః ।**

**మనః షష్ఠానీంద్రియాణి । ప్రకృతి స్థాని కర్షతి ॥ 7**

మమ– ఏవ – అంశః – జీవలోకే – జీవభూతః – సనాతనః

మనః షష్ఠాని – ఇంద్రియాణి – ప్రకృతి స్థాని – కర్షతి

దేహత్యాగానంతరము జీవుడు/దేహి

**శరీరం యదవాప్నోతి । యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।**

**గృహీత్వైతాని సంయాతి । వాయుర్గన్ధా నివాశయాత్ ॥ 8**

శరీరమ్–యత్–అవాప్నోతి–యత్–చ–అపి–ఉత్క్రామతి–ఈశ్వరః

గృహీత్వా–ఏతాని–సంయాతి–వాయుః–గంధాన్–ఇవ–ఆశయాత్

**శ్రోత్రం చక్షుః స్పర్శనం చ । రసనం ఘ్రాణమేవ చ ।**

**అధిష్ఠాయ మనశ్చాయం । విషయానుపసేవతే ॥ 9**

శ్రోత్రమ్ – చక్షుః – స్పర్శనమ్ – చ – రసనమ్ – ఘ్రాణమ్ – ఏవ – చ

అధిష్ఠాయ – మనః – చ – అయమ్ – విషయాన్ – ఉపసేవతే

**ఉత్క్రామన్తం స్థితం వాపి । భుంజానం వా గుణాన్వితం ।**

**విమూఢా నానుపశ్యన్తి । పశ్యన్తి జ్ఞాన చక్షుషః ॥ 10**

ఉత్క్రామన్తమ్ – స్థితమ్ – వా – అపి – భుంజానమ్ – వా – గుణాన్వితమ్

విమూఢాః – న – అనుపశ్యన్తి – పశ్యన్తి – జ్ఞాన – చక్షుషః

**యతన్తో యోగినశ్చైనం । పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।**

**యతన్తోఽప్య కృతాత్మానో । నైనం పశ్యంత్యచేతసః ॥ 11**

యతంతః – యోగినః – చ – ఏనమ్ – పశ్యంతి – ఆత్మని – అవస్థితమ్

యతంతః – అపి – అకృతాత్మానః – న – ఏనమ్ – పశ్యంతి – అచేతసః

| | | |
|---|---|---|
| జీవలోకే | = | సర్వప్రాణుల దేహములో ఉన్న |
| సనాతనః+జీవభూతః | = | అనాది అయిన జీవుడు |
| మమ+అంశః+ఏవ | = | నా యొక్క అంశయే. అనగా జీవుడు పరమాత్మ యొక్క అంశ |

ఆదిపురుషుడు తనకుతానుగా కాలము, జీవుడు, ప్రకృతి, స్వభావము, కర్మగా విభజించుకొనినాడు. కావున జీవుడు ఆదిపురుషునిలోని ఒక అంశ. ఇది ఒక వాదన. ఇంకోవాదనలో జీవుడు ఈశ్వరునియొక్క ప్రతిబింబము.

| | | |
|---|---|---|
| యత్+ఈశ్వరః+ శరీరమ్+ఉత్క్రామతి+ ఆశయాత్+వాయుః గంధాన్+ఇవ+ఏతాని+ గృహీత్వా+సంయాతి | = | ఎప్పుడు ఈశ్వరాంశ అయిన జీవుడు దేహమును వీడి వెడలుచున్నాడో అప్పుడు వాయువు పూల వాసనలను తీసుకొని వెడలునట్లు ఈ పాపపుణ్యములను తీసుకొని వెడలుచున్నాడు |
| యత్+అవాప్నోతి | = | పాప పుణ్యములను ఎప్పుడైతే అనుభవించి ఆ అనుభవము పూర్తి కాగానే పునర్జన్మను పొందుచున్నాడు |
| అయమ్+శ్రోతమ్+ స్పర్శనమ్+చక్షుః+ రసనమ్+చ+ఘ్రాణమ్+ ఏవ+చ | = | ఈ జీవాత్మ చెవి, చర్మము, కన్నులు, నాలుక, మఱియు ముక్కు అనే ఈ జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను |
| మనః+చ+అధిష్ఠాయ+ విషయాన్+ఉపసేవతే | = | మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారములను అధిష్ఠించి, జీవుడు విషయములను అనుభవించుచున్నాడు. |
| ప్రకృతిస్థాని+మనః+ | = | దేహమందుగల |
| షష్ఠాని+ఇంద్రియాణి+ కర్షతి | = | జ్ఞానేంద్రియములు మనస్సును ఆకర్షించుచున్నది |

స్థితమ్+గుణాన్వితమ్+వా= శరీరమందున్నవాడును, గుణములతో
భుంజానమ్+వా+ గూడిన వాడును, సుఖ దుఃఖములను
ఉత్క్రామన్తమ్+అపి+ అనుభవించువాడును లేదా పాపపుణ్యయుతమైన
విమూఢాః+న+ కర్మానుష్టానము చేసి మరణానంతరం ఇతర
అనుపశ్యంతి లోకములకు వెళ్ళుచున్న వాడును అగు ఈ జీవుని
మూఢులు దర్శించలేరు

జ్ఞాన చక్షుషః+పశ్యన్తి = జ్ఞానులు, జ్ఞాన నేత్రములతో జీవుని చూచుచున్నారు

యతన్తః+యోగినః+చ = ఆత్మ దర్శనమునకై ప్రయత్నించుచున్న వారలై
జితేంద్రియులు అయిన యోగులు, భక్తులు

ఆత్మని+అవస్థితమ్ = తన హృదయమునందు స్థితమైయున్న ఆత్మను
దర్శించెదరు.

ఏనమ్+హ్యాని+ = ఈ ఆత్మతత్త్వమును ప్రయత్నించుచున్న
యతంతః+అపి+ వారలైనను ధీరులు కాని వారు సాధ్యము
అకృతాత్మానః+ చిక్కే వఱకు ప్రయత్నించనివారు చిత్తశుద్ధి
అచేతసః+ఏనమ్+ లేనివారు ఈ ఆత్మను దర్శించలేరు.
న+పశ్యన్తి

...... ❖ ❖ ❖ ......

**యదాదిత్యగతం తేజో । జగద్భాసయతేఽ ఖిలం ।**
**యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ । తత్తేజో విద్ధి మామకమ్ ॥ 12**

యత్-ఆదిత్య గతమ్ - తేజః - జగత్ - భాసయతే - అఖిలమ్
యత్-చంద్రమసి-యత్-చ-అగ్నౌ-తత్-తేజః-విద్ధి-మామకమ్

ఆదిత్యగతమ్+యత్+ = సూర్యునియందు ఏ తేజస్సు
తేజః+అఖిలమ్+జగత్+ = ఈ అఖిలజగత్తును ప్రకాశింపచేయుచున్నదో
భాసయతే

చంద్రమసి+యత్+చ = చంద్రునియందు ఏ తేజస్సు కలదో మఱియు
అగ్నౌ+యత్ = అగ్నియందు ఏ తేజస్సు కలదో
తత్+తేజః+మామకామ్+= ఆ తేజస్సు నాదియని గ్రహించుము
విద్ధి

...... ❖ ❖ ❖ ......

విరాట్పురుషుడు

**గామావిశ్య చ భూతాని । ధారయామ్యహమోజసా ।**
**పుష్ణామి చౌషధీః సర్వాః । సోమో భూత్వా రసాత్మకః ॥ 13**

గామ్ - ఆవిశ్య - చ - భూతాని - ధారయామి - అహమ్ - ఓజసా
పుష్ణామి - చ - ఓషధీః - సర్వాః - సోమః - భూత్వా - రసాత్మకః

**అహం వైశ్వానరో భూత్వా । ప్రాణినాం దేహ మాశ్రితః ।**
**ప్రాణాపాన సమాయుక్తః । పచామ్యన్నం చతుర్విధమ్ ॥ 14**

అహమ్ - వైశ్వానరః - భూత్వా - ప్రాణినామ్ - దేహమ్ - ఆశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః - పచామి - అన్నమ్ - చతుర్విధమ్

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో ।**
**మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనం చ ।**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో ।**
**వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్ ॥ 15**

సర్వస్య-చ-అహమ్-హృది-సన్నివిష్టః-మత్తః-స్మృతిః- జ్ఞానమ్ - అపోహనమ్ - చ-వేదైః-చ-సర్వైః-అహమ్-ఏవ-వేద్యః- వేదాన్తకృత్ - వేదవిత్ - ఏవ - చ - అహమ్.

| | | |
|---|---|---|
| అహమ్+గామ్+ఆవిశ్య+ | = | నేను విరాట్‌రూపమున భూమిని నా తేజస్సుచే ఆవేశించి |
| చ | = | మఱియు |
| ఓజసో+భూతాని+ ధారయామి | = | ఓజస్సుచే సర్వప్రాణులను ధరించు చున్నాను, భరించుచున్నాను. |
| చ | = | మఱియు |
| రసాత్మకః+సోమః+ | = | రసాత్మకుడయిన చంద్రుడును అయి |
| భూత్వా+సర్వాః+ఓషధీః+ పుష్ణామి | | సర్వ ఓషధులను, పోషించుచున్నాను |
| అహమ్ | = | నేను |
| చతుర్విధమ్ | = | జాగ్రదావస్థలో వైశ్వానరునిగా, స్వప్నావస్థలో తైజసునిగా, సుషుప్తియందు ప్రాజ్ఞునిగా, హృదయగుహలో ఆత్మగా – ఈవిధములుగా నాలుగు భాగములుగా ఉన్నాను. ఆవిధముగా |
| ప్రాణినామ్+దేహమ్+ | = | సర్వప్రాణుల యొక్క దేహమును |
| వైశ్వానరః+ఆశ్రితః+ భూత్వా | | జాగ్రదావస్థలో వైశ్వానరుడుగా ఆశ్రయించిన వాడనై ఉండి |
| అన్నమ్ | = | ఆహారమును |
| ప్రాణ+అపాన+ | = | ప్రాణము, అపానము, సమానము అను |
| సమాయుక్తః+పచామి | | ప్రాణములతో కూడినవాడనై ప్రాణరూపమున అన్నమును భుజించి, సమాన వాయువుగా ఆ ఆహారమును పచనము చేసి, శరీర భాగములకు సమానముగా పంచుచున్నాను. ఆ ఆహారములోని చెత్తను అపాన రూపమున విసర్జించుచున్నాను. |

సర్వ ప్రాణుల ఆహారము ఒకేవిధముగా ఉండదు. అన్ని ప్రాణులు ఒకే విధమయిన ఆహారమును స్వీకరించవు. పులి ఆహారము, సూక్ష్మజీవుల ఆహారము పక్షుల ఆహారము వేఱు వేఱు.

అయితే ఆహారమును ఏదో ఒక రూపములో సర్వప్రాణులు స్వీకరించచుచున్నవి. జాగ్రదావస్థలో జీవుడు వైశ్వానరుడనే పేరు గలిగియుండును.

ఈ వైశ్వానరుడు ప్రాణవాయువు వలన 1) ఆహారమును స్వీకరించును. 2) సమాన వాయువు వలన ఆహారమును పచనము చేయును. 3) ఆహారము తినుట వలన గలిగిన శక్తిని శరీరములోని అన్ని అవయవములకు సమానముగా పంచును. 4) అపానవాయువు వలన మల విసర్జన జరుగును. ఇది వైశ్వానరుడు చేసే చతుర్విధములయిన పనులు

ఈ క్రియలు జాగ్రదావస్థలోనే జరుగును. స్వప్న సుషుప్తి అవస్థలలో ఈ క్రియలు జరగవు. ప్రశ్నోపనిషత్‌లో ప్రాణములు అవి చేయు పనులు చెప్పబడినవి.

| | | |
|---|---|---|
| అహమ్+సర్వస్య+<br>చ+హృది+సన్నివిష్టః | = | నేను సర్వప్రాణుల దేహములయందు జీవరూపమున, హృదయ గుహలో ఆత్మరూపమున రెండు రూపములుగా ఉన్నాను. |
| మత్తః+స్మృతిః+<br>జ్ఞానమ్+చ+<br>అపోహనమ్ | = | నా వలన అనగా విరాట్‌వలన సర్వభావములు స్మృతి (జ్ఞాపకశక్తి) జ్ఞానము, ఊహించుట, మఱుపు, అజ్ఞానము, అహంభావము, గర్వము, యిలా సర్వభావములు గలుగుచున్నవి. |
| సర్వైః+వేదైః+చ+ | = | సర్వవేదములు, యజ్ఞములు, పుణ్యకర్మల చేత |
| అహమ్+ఏవ+వేద్యః | = | నేనే తెలియదగినవాడను |
| అహమ్+వేదాన్తకృత్+<br>వేదవిత్+ఏవ+చ | = | నేను వేదాంతకర్తను మఱియు వేదములను తెలిసినవాడను |

...... ❖ ❖ ❖ ......

పరమపురుషుడు - హృదయగత ఆత్మ - జీవపురుషుడు

**ద్వావిమౌ పురుషౌ లోకే । క్షరశ్చాక్షర ఏవ చ ।**
**క్షరస్సర్వాణి భూతాని । కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ 16**

ద్వౌ – ఇమౌ – పురుషౌ – లోకే – క్షరః – చ – అక్షరః – ఏవ – చ,
క్షరః – సర్వాణి – భూతాని – కూటస్థః – అక్షరః – ఉచ్యతే.

**ఉత్తమః పురుషస్త్వన్యః । పరమాత్మేత్యుదాహృతః ।**
**యో లోకత్రయమావిశ్య । బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥ 17**

ఉత్తమః – పురుషః – తు – అన్యః – పరమాత్మా – ఇతి – ఉదాహృతః
యః – లోకత్రయమ్ – ఆవిశ్య – బిభర్తి – అవ్యయః – ఈశ్వరః.

**యస్మాత్క్షరమతీతోఽహమ్ । అక్షరాదపి చోత్తమః ।**
**అతోఽస్మి లోకే వేదే చ । ప్రథితః పురుషోత్తమః ॥ 18**

యస్మాత్ – క్షరమ్ – అతీతః – అహమ్ – అక్షరాత్ – అపి – చ – ఉత్తమః
అతః – అస్మి – లోకే – వేదే – చ – ప్రథితః – పురుషోత్తమః.

లోకే+క్షరః+చ+అక్షరః+ = లోకమునందు క్షరుడు మఱియు అక్షరుడని
ఏవ+ద్వౌ+ఇమౌ+పురుషౌ ఈ ఇద్దరు పురుషులు కలరు

సర్వాణి+భూతాని+చ+ = సర్వభూతములలో దేహమునందు కూటస్థుడైన
కూటస్థః+క్షరః జీవుడు క్షరుడని

అక్షరః+ఉచ్యతే = హృదయగత ఆత్మ అక్షరుడని చెప్పబడుచున్నాడు

యః+లోకత్రయమ్+ = ఎవడు ఈ మూడు లోకములలో గల చరాచర
ఆవిశ్య+బిభర్తి జగత్తులో అంతర్యామి రూపమున ప్రవేశించి ఈ సర్వ ప్రాణుల దేహమును భరించుచున్నాడో అతనికంటె ఇంకొకడు

అవ్యయః+ఈశ్వరః+ = అవ్యయుడును, ఈశ్వరుడును, పురుషోత్తముడును
అన్యః+ఉత్తమః+ పరమాత్మ అని ఉదహరించబడుచున్నాడు.
పురుషః+పరమాత్మా+
ఇతి+ఉదాహృతః

యస్మాత్+అహమ్+ = ఏ కారణమున నేను క్షరపురుషుణ్ణి, అతిక్రమించిన
క్షరమ్+అతీతః+చ+ వాడను మఱియు అక్షరునికంటెను కూడా
అక్షరాత్+అపి+ఉత్తమః ఉత్తముడను అయితినో
అతః+లోకే+చ+ = ఆ కారణమువలన ఈ లోకమునందు మఱియు
వేదే+ప్రథితః+ వేదములయందు ప్రసిద్ధుడనై పురుషోత్తముడను
పురుషోత్తమః+అస్మి అయి ఉన్నాను

...... ❖ ❖ ❖ ......

**యో మామేవమసమ్మూఢో । జానాతి పురుషోత్తమమ్ ।**
**స సర్వవిద్భజతి మాం । సర్వభావేన భారత ॥ 19**

యః - మామ్ - ఏవమ్ - అసమ్మూఢః - జానాతి - పురుషోత్తమమ్,
సః - సర్వవిత్ - భజతి - మామ్ - సర్వభావేన - భారత

భారత = ఓ అర్జునా!
యః+అసమ్మూఢః(సన్)+= ఎవడు జ్ఞానియై ఈ విధముగా నన్ను
ఏవమ్+మామ్+ పురుషోత్తమునిగా ఎఱుంగునో
పురుషోత్తమమ్+జానాతి
సః = వాడు (ఏది తెలిసిన యీ సర్వము తెలియునో)
సర్వవిత్ = సర్వము తెలిసినవాడు అతడు
సర్వభావేన = సర్వభావములతో
మామ్ = నన్ను
భజతి = సేవించును

దీనినే గోపికలు – పతి పుత్రాదిక వాంఛలన్ సలిపి సంభావించు టన్యాయమే? అని శ్రీకృష్ణునితో పలికిరి – *(భాగవతము – దశమస్కంధం – 988)*

...... ❖ ❖ ❖ ......

**ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయానఘ ।**
**ఏతద్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ । కృతకృత్యశ్చ భారత ॥ 20**

ఇతి – గుహ్యతమమ్ – శాస్త్రమ్ – ఇదమ్ – ఉక్తమ్ – మయా – అనఘ
ఏతత్ – బుద్ధ్వా – బుద్ధిమాన్ – స్యాత్ – కృతకృత్యః – చ – భారత

| | | |
|---|---|---|
| అనఘ | = | ఓ అర్జునా! |
| ఇదమ్+గుహ్యతమమ్+ శాస్త్రమ్ | = | ఈ అతి రహస్యమైన శాస్త్రమును |
| ఉక్తమ్+ఇతి | = | నీకిప్పుడు బోధింపబడెను. ఈ ప్రకారముగా |
| బారత | = | ఓ అర్జునా! |
| ఏతత్+బుద్ధ్వా | = | దేనిని గ్రహించి |
| బుద్ధిమాన్ + చ | = | సంసార తాపత్రయములలో చిక్కుకొనని బుద్ధిమంతుడు |
| కృతకృత్యః+స్యాత్ | = | కృతకృత్యుడు అగును |

...... ❖ ❖ ❖ ......

ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము 40వ అధ్యాయము

## (దైవాసురసంపద్విభాగ యోగము)

భగవానువాచ

దైవీసంపద

**అభయం సత్త్వసంశుద్ధిః । జ్ఞానయోగవ్యవస్థితిః,**
**దానం దమశ్చ యజ్ఞశ్చ । స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥ 1**

అభయమ్ – సత్త్వసంశుద్ధిః – జ్ఞానయోగ – వ్యవస్థితిః
దానమ్ – దమః – చ – యజ్ఞః – చ – స్వాధ్యాయః – తపః – ఆర్జవమ్

**అహింసా సత్యమక్రోధః । త్యాగశ్శాన్తిరపైశునం ।**
**దయా భూతేష్వలోలుప్త్వం । మార్దవం హ్రీరచాపలమ్ ॥ 2**

అహింసా – సత్యమ్ – అక్రోధః – త్యాగః – శాంతిః – అపైశునమ్
దయా – భూతేషు – అలోలుప్త్వమ్ – మార్దవమ్ – హ్రీః – అచాపలమ్

**తేజః క్షమాధృతిశ్శౌచ । మద్రోహో నాతిమానితా ।**
**భవన్తి సమ్పదం దైవీ । మభిజాతస్య భారత ॥ 3**

తేజః – క్షమా – ధృతిః – శౌచమ్ – అద్రోహః – న – అతిమానితా
భవంతి – సంపదమ్ – దైవీమ్ – అభిజాతస్య – భారత

| | | |
|---|---|---|
| భారత | = | ఓ అర్జునా! |
| అభయమ్ | = | భయం లేకుండా ఉండుట. భయం లేకుండా అశాశ్వతమయిన దేహం నశించును. ఆత్మ |

నశింపదు. “ఏను మృతుండనవుదునని యింత భయంబు మనంబులోపలన్ మానుము. ఇది శుకబ్రహ్మ పరీక్షితునకు యిచ్చిన చివరి సందేశము అలా

సత్త్వ సంశుద్ధిః = మనో మాలిన్యములు పోయి దేహము పునీతముగ ఉండుట. (పూతన పాలను శ్రీకృష్ణుడు త్రాగగానే ఆమెకు సత్త్వ పరిశుద్ధి గలిగినది. “పొగలు పొగలు కాలు మగువ దేహంబున అగరు పరిమళము” వాసనలు వచ్చినవి. అది సత్త్వసంశుద్ధి.

జ్ఞానయోగ వ్యవస్థిత = జ్ఞానము గలిగి వుండుట.

ఈ సిరిసంపదలు చంచలమని తనువు అశాశ్వతమనే భావన కలిగియుండుట. ఉదా: సాలెవాడు శ్రీకృష్ణునికి బట్టలు ఇచ్చినాడు. అంత కృష్ణుడు అతనిని వరము కోరుకోమనెను.

“నీ పాద కమల సేవయు నీ పాదార్చకుల తోడి నెయ్యమును నితాంతాపార భూత దయ” (భాగవతం-దశమస్కంధం-1270) కావాలని కోరినాడు. అది జ్ఞానయోగము.

దానమ్ = దానము

దానము గుఱించి తైత్తిరీయోపనిషత్ శీక్షావల్లీ11వ అనువాకములో ఇట్లు చెప్పబడినది. **సంవిదాదేయం** అనగా పాత్రనెఱిగి దానమీయవలెను. **శ్రద్ధయాదేయం** శ్రద్ధతో దానమీయవలెను. **శ్రియాదేయం** ఉన్నంతలో ఎక్కువగా దానమీయవలెను. **హ్రియాదేయం** వినయముతో దానమీయవలెను. **భియాదేయం** కరుణతో దానమీయవలెను.

వచ్చిన వాడు శ్రీ మహావిష్ణువని, దానమిచ్చిన తన సర్వసంపదలు పోవునని ఎఱిగి బలిచక్రవర్తి మూడు పాదములు విష్ణువునకు దానం యిచ్చినాడు.

| | | |
|---|---|---|
| దమః+చ | = | బాహ్యేంద్రియ నిగ్రహమును, మఱియు |
| యజ్ఞః | = | యజ్ఞము |
| స్వాధ్యాయః | = | వేదాధ్యయనము చేసి వేదములలోని సారాంశమును గ్రహించుట. |

తైత్తిరీయోపనిషత్ శీక్షావల్లీ 9వ అనువాకములో స్వాధ్యాయము గుఱించి**ఋతం చ స్వాధ్యాయ ప్రవచనేచ** అని ... **ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ** అని చెప్పబడినది.

| | | |
|---|---|---|
| తపః + చ | = | తపస్సు |
| ఆర్జవమ్ | = | ఋజు ప్రవర్తన |
| అహింసా | = | అహింసా స్వరూప మెఱుంగుట (ధర్యవ్యాధుడు భారతములో అహింస గుఱించి చెప్పెను) |
| సత్యమ్ | = | సత్యవాక్య పరిపాలన (సత్యము ఎప్పుడు చెప్పగూడనిదో కూడా తెలుసుకోవలయును) |
| అక్రోధః | = | క్రోధము లేకుండుట, క్రోధము అవసరమైనప్పుడు ఉండాలి. |
| త్యాగః | = | త్యాగము (కర్మఫలత్యాగము) |
| శాంతిః | = | శాంతి, గుణత్రయములు నశించిన వానియొక్క శాంతి |
| అపైశునమ్ | = | చాడీలు చెప్పకుండుట హాస్య సంభాషణలు లేకుండుట, పరుష వాక్కు లేకుండుట మొదలయిన వాక్ నియమములు. |
| భూతేషు+దయా | = | సర్వ ప్రాణుల యందు దయగలిగి ఉండుట |
| అలోలుప్త్వమ్ | = | విషయలోలత్వం లేకుండుట |
| మార్దవమ్ | = | మాటలలో మృదుత్వము |
| హ్రీః | = | అకార్యములు చేయుటలో సిగ్గుపడుట |

తమోగుణయుతులకు దానం యిచ్చేటప్పుడు అహంకారము గలుగుతుంది. కాని సత్త్వగుణయుతులకు అహంకారము కలుగదు. తన సర్వస్వం దానం యిచ్చి రంతిదేవుడు 48 రోజులు ఉపవాసాలున్నాడు. ఒక దినము మంచి భోజనం దొరికింది. భుజించుటకు సిద్ధపడుచుండగా యాచకులు వచ్చిరి. దానిని వారికిచ్చెను. ఆ తర్వాత ఒక చండాలుడు వచ్చినాడు. అంత రంతిదేవుడు సిగ్గుపడుతూ, తినటానికి ఏమీ యివ్వలేను. కొన్ని మధురాంబువులు (మంచినీళ్ళు) ఉన్నవని పోయును. అది సిగ్గు. అలా సిగ్గుపడుతూ దానం ఇవ్వవలయును. ఇది సత్త్వగుణయుతుల లక్షణము.

అచాపలమ్ = చపలత్వము లేకుండుట.

మంచిపనులు చేయుటయందు స్థిరబుద్ధి గలిగియుండుట

తేజః = తేజము గలిగియుండుట

క్షమా+ధృతి+శౌచమ్+ అద్రోహః = ఓర్పు, ధృతి (ధైర్యము), బాహ్యశుద్ధి, అంతఃశుద్ధి (రజోగుణము, తమోగుణము లేకుండుట), ద్రోహ చింతన లేకుండుట

అభిజాతస్య+న+ అతిమానితా = పుట్టుక యొక్క స్థితి వలన తను అగ్రపూజ్యుడను అనే భావన లేకుండుట, కులమదము లేకుండుట అనగా అష్ట మదములు లేకుండుట అను

దైవీమ్+సంపదమ్+భవన్తి= ఈ సుగుణములు దైవీ సంపద అగుచున్నవి.

...... ❖ ❖ ❖ ......

అసురసంపద

**దంభో దర్పో౽భిమానశ్చ । క్రోధః పారుష్యమేవచ ।**
**అజ్ఞానం చాభిజాతస్య । పార్థ సంపదమాసురీమ్ ॥ 4**

దంభః – దర్పః – అభిమానః – చ – క్రోధః – పారుష్యమ్ – ఏవ – చ అజ్ఞానమ్ – చ – అభిజాతస్య – పార్థ – సంపదమ్ – ఆసురీమ్

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| క్రోధః+దర్పః+ పారుష్యమ్+దంభః+ అభిమానః+చ+ అజ్ఞానమ్+ఏవ | = | క్రోధము, దర్పము (మదము) పౌరుషము మఱియు మోహము, మాత్సర్యము, దంబము అభిమానము మఱియు అజ్ఞానము మొదలయినవి అనగా రజోగుణము, తమోగుణమువలన గలుగు అష్టమదములు |
| ఆసురీమ్ + సంపదమ్+ అభిజాతస్య+(భవన్తి) | = | అసురసంపదలో పుట్టినవానికి గలుగుచున్నవి |

...... ❖ ❖ ❖ ......

దైవీసంపద - అసుర సంపదవలన గలుగు ఫలితములు

**దైవీ సంపద్విమోక్షాయ । నిబంధాయాసురీ మతా।**
**మా శుచ స్సంపదం దైవీ । మభిజాతోఽసి పాండవ ॥ 5**

దైవీ – సంపత్ – విమోక్షాయ – నిబంధాయ – ఆసురీ – మతా
మా – శుచః – సంపదమ్ – దైవీమ్ – అభిజాతః – అసి – పాండవ

| | | |
|---|---|---|
| పాండవ | = | ఓ అర్జునా! |
| ఆసురీ+నిబంధాయ | = | అసురసంపద బంధముకొఱకు |
| దైవీసంపదమ్+ విమోక్షాయ+మతా | = | దైవీసంపద బంధరాహిత్యము కొఱకు అని నా అభిప్రాయము |
| మా+శుచః | = | యుద్ధములో పౌరుషము, క్రోధము ఉన్నాయి కదా అటువంటప్పుడు నేను అసురసంపదకు చెందినవాడనా అని దుఃఖింపకుము. నీవు |
| దైవీసంపదమ్+ అభిజాతః+అసి | = | దైవీసంపదయందు జన్మించినవాడవు |

**ద్వౌ భూత సర్గౌ లోకేఽస్మిన్ । దైవ ఆసుర ఏవ చ ।**
**దైవో విస్తరశః ప్రోక్తః । ఆసురం పార్థ మే శృణు ॥ 6**

ద్వౌ – భూత సర్గౌ – లోకే – అస్మిన్ – దైవః – ఆసురః – ఏవ – చ,
దైవః – విస్తరశః – ప్రోక్తః – ఆసురమ్ – పార్థ – మే – శృణు.

పార్థ = ఓ అర్జునా!
అస్మిన్+లోకే+దైవః+ ఆసురః+ఏవ+చ+ద్వౌ+ భూతసర్గౌ = ఈ లోకము నందు దైవ, అసుర సంపదలనే రెండు సంపదలు సృష్టిలో పైన చెప్పబడిన ప్రాణులలో గలవు.
దైవః+విస్తరశః+ ప్రోక్తః+ = దైవ సంపద గుఱించి విపులముగా చెప్పబడెను. ఇప్పుడు
ఆసురమ్+మే+శృణు = అసుర సంపద గుఱించి చెప్పుచున్న నా మాటలను వినుము

...... ❖ ❖ ❖ ......

**ప్రవృత్తించ నివృత్తిం చ । జనా న విదురాసురాః ।**
**న శౌచం నాపి చాచారో । న సత్యం తేషు విద్యతే ॥ 7**

ప్రవృత్తిమ్ – చ – నివృత్తిమ్ – చ – జనాః – న – విదుః – ఆసురాః
న – శౌచమ్ – న – అపి – చ – ఆచారః –న– సత్యమ్–తేషు–విద్యతే

**అసత్యమప్రతిష్ఠం తే । జగదాహురనీశ్వరమ్ ।**
**అపరస్పర సంభూతం । కిమన్యత్కామహైతుకమ్ ॥ 8**

అసత్యమ్ – అప్రతిష్ఠమ్ – తే – జగత్ – ఆహుః – అనీశ్వరమ్
అపరస్పర సంభూతమ్ – కిమ్ – అన్యత్ – కామ – హైతుకమ్

**ఏతాం దృష్టి మవష్టభ్య । నష్టాత్మానోఽల్పబుద్ధయః ।**
**ప్రభవంత్యుగ్రకర్మాణః । క్షయాయ జగతోఽహితాః ॥ 9**

ఏతామ్ - దృష్టిమ్ - అవష్టభ్య - నష్టాత్మానః - అల్ప బుద్ధయః
ప్రభవంతి - ఉగ్రకర్మాణః - క్షయాయ - జగతః - అహితాః

**కామమాశ్రిత్య దుష్పూరం । దంభమానమదాన్వితాః ।**
**మోహాద్గృహీత్వా సద్గ్రాహాన్ । ప్రవర్తంతేఽశుచివ్రతాః ॥ 10**

కామమ్ - ఆశ్రిత్య - దుష్పూరమ్ - దంభమాన మదాన్వితాః
మోహాత్ - గృహీత్వా - అసద్గ్రాహాన్ - ప్రవర్తంతే - అశుచి వ్రతాః

**చింతామపరిమేయాం చ । ప్రలయాంతాముపాశ్రితాః ।**
**కామోపభోగపరమాః । ఏతావదితి నిశ్చితాః ॥ 11**

చింతామ్ - అపరిమేయామ్ - చ - ప్రలయాంతామ్ - ఉపాశ్రితాః
కామోపభోగ పరమాః । ఏతావత్ - ఇతి - నిశ్చితాః

**ఆశాపాశశతైర్బద్ధాః । కామక్రోధపరాయణాః ।**
**ఈహంతే కామభోగార్థమ్ । అన్యాయేనార్థ సంచయాన్ ॥12**

ఆశాపాశ శతైః - బద్ధాః - కామ క్రోధ పరాయణాః
ఈహంతే - కామ భోగార్థమ్ - అన్యాయేన - అర్థ సంచయాన్

| | | |
|---|---|---|
| ఆసురాః+జనాః ప్రవృత్తిమ్+చ+ నివృత్తిమ్+చ+న+విదుః | = | అసుర సంపదగల జనులు ప్రవృత్తి, నివృత్తిమార్గములను ఎఱుంగరు |
| తేషు+న+శౌచమ్+న+ విద్యతే+ | = | వారు శౌచమును పాటించనందున వారియందు అంతఃకరణశుద్ధి ఉండదు. |

| | | |
|---|---|---|
| న+ఆచారః+చ+<br>న+సత్యమ్+అపి | = | పెద్దలు అనుసరించు ఆచారమును కూడ పాటించరు. సత్యమును పాటింపరు. |
| తే | = | వారు |
| జగత్+అసత్యమ్ | = | జగత్తు బ్రహ్మవలన గలుగలేదనియు |
| అప్రతిష్ఠమ్ | = | విరాట్‌లో ఈ జగత్తు ప్రతిష్ఠింపబడలేదనియు |
| అనీశ్వరమ్ | = | ఈశ్వరుడు లేడనియు |
| కామహైతుకమ్+<br>అపరస్పరసంభూతాన్+<br>అన్యత్+కిమ్+ఆహుః | = | కామము కారణముగ స్త్రీ, పురుషుల సంపర్కము వలన తప్ప యింకొకటి సృష్టికి హేతువు ఏది ఉన్నదని చెప్పెదరు |

వీరు నిరీశ్వర వాదులు.

| | | |
|---|---|---|
| ఏతామ్+దృష్టిమ్+అవష్టభ్య | = | ఇలాంటి ఆలోచన అవలంబించి |
| అల్పబుద్ధయః | = | అల్పబుద్ధులు |
| నష్టాత్మానః | = | నష్టాత్ములై |
| ఉగ్రకర్మాణః | = | ఉగ్రకర్ములు గలవారలై |
| అహితాః | = | లోకకంటకులు అయిన వీరు |
| జగతః | = | లోకముయొక్క |
| క్షయాయ | = | వినాశమునకు |
| ప్రభవంతి | = | పుట్టుచున్నారు. |
| దుష్పూరమ్+కామమ్ | = | పూరింప శక్యము గాని కామమును |
| ఆశ్రిత్య | = | ఆశ్రయించి |
| దంభ మాన+మదాన్వితాః | = | దంభము, అభిమానము, మదములతో గూడినవారలై |
| మోహాత్+అసద్గ్రాహాన్ | = | అవివేకము వలన, మోహము వలన, శాస్త్ర సమ్మతము గాని విషయములను |

గృహీత్వా = గ్రహించి పుణ్యకర్మానుష్ఠానముగా

అశుచి వ్రతాః = వేదము చెప్పని వ్రతముల యందు, యజ్ఞములందు

ప్రవర్తంతే = ప్రవర్తించుచున్నారు.

కలియుగములో పుణ్యకర్మలు ఆడంబరముతో, అవైదికముతో గలిగివున్నవి.

అపరిమేయామ్ = అంతులేనివియు

ప్రలయాంతామ్ = చనిపోయే వరకు ఉండునవియు అగు

చింతామ్ = కోరికలను

ఉపాశ్రితాః+చ = ఆశ్రయించిన వారలై

కామోపభోగపరమాః = కామోపభోగములే పరమావధిగా కలవారలై

ఏతావత్+ఇతి+ నిశ్చితాః వాటినే నిశ్చయించినవారలై

ఆశాపాశశతైః+బద్ధాః = అనేక ఆశాపాశములచే బద్ధులైన వారలై

కామ క్రోధ పరాయణాః = కామ క్రోధములు గలిగినవారలై

కామభోగార్థమ్ = వారి కోరికలు అనుభవించుటకు

అన్యాయేన+ అర్థ సంచయాన్+ ఈహంతే = అన్యాయము చేతనైనా సరే ధనమును సంపాదింప కోరుచున్నారు. (నేడు మనము ఈ విధానమును చూచుచున్నాము.)

...... ❖ ❖ ❖ ......

**ఇదమద్య మయా లబ్ధ । మిమం ప్రాప్స్యే మనోరథం ।**
**ఇదమస్తీదమపి మే । భవిష్యతి పునర్ధనమ్ ॥ 13**

ఇదమ్ – అద్య – మయా – లబ్ధమ్ – ఇమమ్ – ప్రాప్స్యే – మనోరథం
ఇదమ్ – అస్తి – ఇదమ్ – అపి – మే – భవిష్యతి – పునః – ధనమ్

**అసౌ మయా హతశ్శత్రు । ర్హనిష్యేచాపరానపి ।**
**ఈశ్వరోఽహమహం భోగీ । సిద్ధోఽహం బలవాన్ సుఖీ ॥14**

అసౌ - మయా - హతః - శత్రుః -హనిష్యే - చ - అపరాన్ - అపి,
ఈశ్వరః - అహమ్ - అహమ్ - భోగీ - సిద్ధః - అహమ్ - బలవాన్ - సుఖీ.

**ఆఢ్యోఽభిజనవానస్మి । కోఽన్యోఽస్తి సదృశో మయా ।**
**యక్ష్యే దాస్యామి మోదిష్య । ఇత్య జ్ఞానవిమోహితాః ॥ 15**

ఆఢ్యః - అభిజనవాన్ - అస్మి - కః - అన్యః - అస్తి - సదృశః - మయా,
యక్ష్యే - దాస్యామి - మోదిష్యే - ఇతి - అజ్ఞాన - విమోహితాః.

**అనేక చిత్త విభ్రాంతాః । మోహజాలసమావృతాః ।**
**ప్రసక్తాః కామభోగేషు । పతంతి నరకేఽశుచౌ ॥ 16**

అనేక చిత్త విభ్రాంతాః - మోహ జాల సమావృతాః,
ప్రసక్తాః - కామ భోగేషు - పతంతి - నరకే - అశుచౌ.

| | | |
|---|---|---|
| అద్య+ఇదమ్ | = | ఇప్పుడు ఈ ధనము |
| మయా+లబ్ధమ్ | = | నా చేత పొందబడినది |
| ఇమమ్+మనోరథమ్ | = | ఈ ధనముచే నా కోరికలను |
| ప్రాప్స్యే | = | పొందగలను |
| మే+ఇదమ్+అస్తి | = | నాకు యింత ధనము ఉంది |
| ఇదమ్+ధనమ్+ | = | నాకు యింత ధనము |
| పునః+అపి+భవిష్యతి | | మరల భవిష్యత్తులో రాగలదు |
| మయా+అసౌ+శత్రుః+ హతః | = | నా చేత ఈ శత్రువు చంపబడినాడు |
| అపరాన్+అపి+హనిష్యే | = | ఇక మిగిలిన శత్రువులను కూడ చంపగలను |

| | | |
|---|---|---|
| అహమ్+ఈశ్వరః | = | నేనే భగవంతుడను నన్ను పూజించండి |
| అహమ్+భోగీ+సుఖీ | = | నేనే భోగవంతుడను, సుఖవంతుడను |
| అహమ్+సిద్ధః+బలవాన్ | = | నేనే సిద్ధుడను నేనే బలవంతుడను |
| ఆఢ్యః+అభిజనవాన్+<br>అస్మి+మయా+సదృశః+<br>అన్యః+కః+అస్తి | = | మొనగాడిని, గొప్ప ధనము గలవాడను గొప్ప వంశమున పుట్టినవాడను అయితిని నాతో సమానుడు ఇంకొకడు ఎవడున్నాడు? |
| యక్ష్యే | = | నేను జన్మించిన కులము ప్రకారము అర్హత ఉన్నా లేకపోయినా ధనమున్నది గావున యజ్ఞము చేసెదను |
| దాస్యామి | = | పాత్రుడా, అపాత్రుడా అని చూడక దానము యిచ్చెదను |
| మోదిష్యే+ఇతి+<br>అజ్ఞాన+విమోహితాః | = | ఇష్టము వచ్చినట్లు త్రాగి తందనాలు ఆడి ఆనందము అనుభవించెదను అని అజ్ఞానముతో అసుర సంపదచే విమోహితులైన వారలై |
| అనేక+చిత్త+విభ్రాంతాః | = | అనేక చిత్త చాంచల్యము గలిగినవారలై |
| మోహజాల సమావృతాః | = | మోహము అనే వలలో బాగా చిక్కుకొన్నవారలై |
| కామభోగేషు+ప్రసక్తాః | = | కామభోగములందు ప్రవృత్తిని గలిగినవారలై |
| అశుచౌ+నరకే | = | అపవిత్రులయి చివరికి నరకము నందు |
| పతంతి | = | పడుచున్నారు |

...... ❖ ❖ ❖ ......

**ఆత్మ సంభావితాః స్తబ్ధా । ధన మానమదాన్వితాః ।**
**యజంతే నామ యజ్ఞైస్తే । దంభేనావిధి పూర్వకమ్ ॥ 17**

ఆత్మ సంభావితాః - స్తబ్ధాః । ధన మాన మదాన్వితాః
యజంతే - నామ - యజ్ఞైః - తే - దంభేన - అవిధి పూర్వకమ్

**అహంకారం బలం దర్పం । కామం క్రోధం చ సంశ్రితాః ।**
**మామాత్మ పరదేహేషు । ప్రద్విషంతోఽభ్యసూయకాః ॥ 18**

అహంకారమ్ – బలమ్ – దర్పమ్ – కామమ్ – క్రోధమ్ –చ– సంశ్రితాః
మామ్ – ఆత్మ పరదేహేషు – ప్రద్విషంతః – అభ్యసూయకాః

**తానహం ద్విషతః క్రూరాన్ । సంసారేషు నరాధమాన్ ।**
**క్షిపామ్యజస్రమశుభాన్ । ఆసురీష్వేవ యోనిషు ॥ 19**

తాన్ – అహమ్ – ద్విషతః – క్రూరాన్ – సంసారేషు – నరాధమాన్
క్షిపామి – అజస్రమ్ – అశుభాన్ – ఆసురీషు – ఏవ – యోనిషు

**ఆసురీం యోనిమాపన్నా । మూఢా జన్మని జన్మని ।**
**మామప్రాప్యైవ కౌంతేయ । తతో యాంత్యధమాం గతిమ్ ॥ 20**

ఆసురీమ్ – యోనిమ్ – ఆపన్నాః – మూఢాః – జన్మని – జన్మని
మామ్ – అప్రాప్య – ఏవ – కౌంతేయ – తతః – యాంతి–అధమామ్‌గతిమ్

| | | |
|---|---|---|
| తే | = | అసుర సంపద గలవారు |
| ధన మాన మదాన్వితాః | = | ధనము, కండబలము గలిగి మదించిన వారలై |
| ఆత్మ సంభావితాః+ | = | తమని తాము గొప్పవారమని భావించిన వారలై |
| స్తబ్ధాః+దంభేన | | మూఢులై ఢాంబికముగా |
| అవిధి పూర్వకమ్+ | = | వేద విహితము అయిన పద్ధతిగాక, |
| నామయజ్ఞైః+యజంతే | | వేదవిరుద్ధముగా నామ మాత్రపు యజ్ఞములచేత యజ్ఞములు చేయుచున్నారు |
| అహంకారమ్+బలమ్+ | = | అహంకారము, మమకారము, బలము |
| దర్పమ్+కామమ్+ | | దర్పము, కామము క్రోధము, లోభ, |
| క్రోధమ్+చ+సంశ్రితాః | | మద మాత్సర్యములతో కూడినవారై |

| | | |
|---|---|---|
| ఆత్మ పరదేహేషు+ | = | తన యందు యితరుల యందుగల నన్ను |
| మామ్+ప్రద్విషంతః+ | | మిగుల ద్వేషించుచున్నవారలై అసూయపరులై, |
| అభ్యసూయకాః | | ఒకరినొకరు మెచ్చక నిందించుచుందురు. |
| అహమ్+ద్విషతః+ | = | కర్మఫలప్రదాతనైన నేను |
| క్రూరాన్+అశుభాన్ | | నన్ను ద్వేషించువారిని, నాస్తికులను, క్రూరులను పాపాత్ములను |
| తాన్+నరాధమాన్+ | = | ఆ నరాధములను ఎల్లప్పుడు/నిరంతరము |
| అజస్రమ్+సంసారేషు+ | | సంసారమందు అసుర సంబంధమైన |
| ఆసురీషు+యోనిషు+ | | జన్మము లందే ఉంచుచున్నాను |
| ఏవ+క్షిపామి | | |
| కౌంతేయ | = | ఓ అర్జునా! |
| ఆసురీమ్+యోనిమ్+ | = | అలా వారు ఆసురీ యోనియందు |
| ఆపన్నాః+మూఢాః | | పుట్టినవారై మూఢులై |
| జన్మని+జన్మని+మామ్+ | = | ఎన్ని వేల జన్మలెత్తినా నన్ను పొందక |
| అప్రాప్య | | |
| తతః+అధమామ్+ | = | అటు పిమ్మట  అధోగతినే పొందుచున్నారు |
| గతిమ్+ఏవ+యాంతి | | |

...... ❖ ❖ ❖ ......

**త్రివిధం నరకస్యేదం । ద్వారం నాశనమాత్మనః ।**
**కామః క్రోధస్తథాలోభః । తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥ 21**

త్రివిధమ్ – నరకస్య – ఇదమ్ – ద్వారమ్ – నాశనమ్ – ఆత్మనః
కామః–క్రోధః–తథా–లోభః – తస్మాత్ – ఏతత్ – త్రయమ్ – త్యజేత్

**ఏతైర్విముక్తః కౌంతేయ । తమోద్వారైః త్రిభిర్నరః ।**
**ఆచరత్యాత్మనః శ్రేయః । తతో యాతి పరాం గతిమ్ ॥ 22**

ఏతైః – విముక్తః – కౌంతేయ – తమోద్వారైః – త్రిభిః – నరః,
ఆచరతి – ఆత్మనః – శ్రేయః – తతః – యాతి – పరామ్ – గతిమ్.

తమోగుణ సంబంధమైన మోహ, మద, మాత్సర్యములు అను మూడును మఱియు రజోగుణ సంబంధములైన

| | | |
|---|---|---|
| కామః+క్రోధః+లోభః+ ఇదమ్+త్రివిధమ్+ నరకస్య+ద్వారమ్+ ఆత్మనః+నాశనమ్ | = | కామము, క్రోధము, లోభము అను ఈ మూడును నరకమునకు ద్వారము వంటివి తనకు నాశనకారములైనవి |
| తస్మాత్+తథా+ఏతత్+ త్రయమ్+త్యజేత్ | = | అందువలన ఆవిధముగా తమోగుణ సంబంధమైన మూడింటిని, రజోగుణ సంబంధమైన మూడింటిని విడువవలయును |
| కౌంతేయ | = | ఓ అర్జునా! |
| ఏతైః+త్రిభిః+తమోద్వారైః +విముక్తః+నరః | = | ఆవిధముగా తమోగుణమునకు సంబంధించిన మూడింటిచేత, రజోగుణమునకు సంబంధించిన ఈ మూడింటిచేత విముక్తుడైన నరుడు |
| ఆత్మనః+శ్రేయః+ ఆచరతి+తతః+ పరాంగతిమ్+యాతి | = | తన యొక్క మేలును ఒనగూర్చు కొనుచున్నాడు. అటుపిమ్మట పరమపదమును పొందుచున్నాడు. |

...... ❖ ❖ ❖ ......

**యశ్శాస్త్రవిధిముత్సృజ్య । వర్తతే కామకారతః ।**
**న స సిద్ధి మవాప్నోతి । న సుఖం న పరాం గతిమ్ ॥ 23**

యః - శాస్త్ర విధిమ్ - ఉత్సృజ్య - వర్తతే - కామ కారతః
న-సః - సిద్ధిమ్ - అవాప్నోతి - న - సుఖమ్ - న - పరామ్ - గతిమ్

| | | |
|---|---|---|
| యః+కామ కారతః+ శాస్త్రవిధిమ్+ఉత్సృజ్య+ వర్తతే | = | ఎవడు తన యిష్టము వచ్చినట్లు శాస్త్రవిధిని విడచిపెట్టి అనగా శాస్త్రమును అతిక్రమించి ప్రవర్తించుచున్నాడో |
| సః+న+సిద్ధిమ్+ అవాప్నోతి | = | వాడు ఆ పుణ్య ఫలితమును, సిద్ధిని పొందదు |
| న+సుఖమ్+న+ పరాంగతిమ్ | = | స్వర్గలోక సుఖమును పొందదు పరమపదమును పొందదు. త్రిశంకునివలె ఉభయభ్రష్టుడగును. |

...... ❖ ❖ ❖ ......

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే । కార్యాకార్యవ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం । కర్మకర్తుమిహార్హసి ॥ 24**

తస్మాత్ - శాస్త్రమ్ - ప్రమాణమ్ - తే - కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా - శాస్త్ర విధానోక్తమ్ - కర్మ - కర్తుమ్ - ఇహ - అర్హసి

| | | |
|---|---|---|
| తస్మాత్+తే+ కార్యకార్య వ్యవస్థితౌ+ శాస్త్రమ్+ప్రమాణమ్ | = | అందువలన నీవు ఏది చేయాలి, ఏది చేయకూడదు అని నిర్ణయించునపుడు, కర్తవ్య అకర్తవ్య నిర్ణయమునందు వేదము ప్రమాణముగా ఉన్నది |
| శాస్త్ర విధానోక్తమ్+ జ్ఞాత్వా+ఇహ+ కర్మకర్తుమ్+అర్హసి | = | శాస్త్రములలో చెప్పబడిన విధానమును తెలిసికొని ఈ ప్రపంచమున పుణ్యకర్మలు చేయుటకు తగుదువు |

...... ❖ ❖ ❖ ......

ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము 41వ అధ్యాయము

## (శ్రద్ధాత్రయవిభాగ యోగము)

అర్జున ఉవాచ

**యే శాస్త్రవిధిముత్సృజ్య । యజంతే శ్రద్ధయాన్వితాః ।**
**తేషాం నిష్ఠా తు కా కృష్ణ । సత్త్వమాహో రజస్తమః ॥ 1**

యే - శాస్త్ర విధిమ్ - ఉత్సృజ్య - యజంతే శ్రద్ధయా - అన్వితాః
తేషామ్- నిష్ఠా - తు - కా - కృష్ణ -సత్త్వమ్ - ఆహో - రజః - తమః

అహో+కృష్ణ = ఓ శ్రీకృష్ణా!

యే+శ్రద్ధయా+అన్వితాః+= ఎవరు శ్రద్ధతో గూడినవారై

యజంతే+తేషామ్+ యజ్ఞములు చేయుచున్నారో

నిష్ఠా వారియొక్క నిష్ఠ ఎట్టిది?

శాస్త్రవిధిమ్+ఉత్సృజ్య = వేదమునందు చెప్పిన విధానమును వదలి

కా+సత్త్వమ్+రజః+తమః యజ్ఞమును చేయుచున్నారో వారి నిష్ఠ ఎట్టిది? వారల నిష్ఠలు సాత్వికమా? రాజసమా? తామసమా?

...... ❖ ❖ ❖ ......

శ్రీ భగవానువాచ

శ్రద్ధ

**త్రివిధా భవతి శ్రద్ధా । దేహినాం సా స్వభావజా ।**

**స్వాత్త్వికీ రాజసీ చైవ । తామసీ చేతి తాం శృణు ॥ 2**

త్రివిధా – భవతి – శ్రద్ధా – దేహినామ్ – సా – స్వభావజా

స్వాత్త్వికీ – రాజసీ – చ – ఏవ – తామసీ – చ – ఇతి – తామ్ – శృణు

**సత్త్వానురూపా సర్వస్య । శ్రద్ధా భవతి భారత ।**

**శ్రద్ధామయోఽయం పురుషో । యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః ॥ 3**

సత్త్వానురూపా – సర్వస్య – శ్రద్ధా – భవతి – భారత

శ్రద్ధామయః – అయమ్– పురుషః – యః – యత్–శ్రద్ధః – సః – ఏవ – సః

దేహినామ్ = మానవుల యొక్క

స్వభావజా = పుట్టుకతో వచ్చిన స్వభావమువలన గలిగిన

సా+శ్రద్ధా = ఆ శ్రద్ధ మూడు విధములు

త్రివిధా+భవతి+ = సాత్త్విక శ్రద్ధ, రాజసిక
సాత్త్వికీ+చ+రాజసీ+చ+ శ్రద్ధ, తామసిక శ్రద్ధ అని మూడువిధములుగా
తామసీ+ఏవ+ఇతి+ శ్రద్ధ గురించి చెప్పుచున్నాను వినుము
తామ్+శృణు

భారత = ఓ అర్జునా!

సర్వస్య+శ్రద్ధ+ = సర్వమానవులయొక్క శ్రద్ధ వారి వారి
సత్త్వానురూపా+భవతి సంస్కారమునకు తగినట్లు గలుగుచున్నది

అయమ్+పురుషః+ = ఈ ఏదో ఒక శ్రద్ధను గలిగినవాడు ఎవడు పుట్టుకతో
శ్రద్ధామయః+యః+ సాత్త్విక, రాజసిక, తామసిక శ్రద్ధలలో, ఎట్టి శ్రద్ధ
యత్+శ్రద్ధః+సః గలవాడో అతడు

సః + ఏవ = అట్టి శ్రద్ధగలవాడు అగును.

...... ❖ ❖ ❖ ......

పూజ

**యజంతే సాత్త్వికా దేవాన్ । యక్ష రక్షాంసి రాజసాః ।**
**ప్రేతాన్ భూత గణాంశ్చాన్యే । యజంతే తామసా జనాః ॥ 4**

యజంతే–సాత్త్వికాః–దేవాన్–యక్ష–రక్షాంసి–రాజసాః
ప్రేతాన్–భూత గణాన్–చ–అన్యే–యజంతే–తామసాః–జనాః

సాత్త్వికాః = సాత్త్వికులు నిష్కామముగా
దేవాన్+యజంతే = దేవతలను వేదవిహితముగా పూజింతురు
రాజసాః = రజోగుణ యుతులు దేవతలను కోరికలతో పూజింతురు
అన్యే+తామసాః+జనాః = యింకొకరు అనగా తామసులయిన జనులు
యక్ష రక్షాంసి = యక్షులను, రాక్షసులను
ప్రేతాన్+చ+భూతగణాన్ = భూత, ప్రేత గణములను
యజంతే = పూజింతురు

...... ❖ ❖ ❖ ......

తపస్సు

**అశాస్త్ర విహితం ఘోరం । తప్యంతే యే తపో జనాః ।**
**దంభాహంకార సంయుక్తాః । కామ రాగ బలాన్వితాః ॥ 5**

అశాస్త్ర విహితమ్ – ఘోరమ్ – తప్యంతే – యే – తపః – జనాః
దంభ – అహంకార – సంయుక్తాః – కామ – రాగ – బలాన్వితాః

**కర్శయంతః శరీరస్థం । భూత గ్రామమచేతసః ।**
**మాం చైవాంతశ్శరీరస్థం । తాన్ విద్ధ్యాసుర నిశ్చయాన్ ॥ 6**

కర్శయంతః – శరీరస్థమ్ – భూత గ్రామమ్ – అచేతసః
మామ్–చ– ఏవ– అంతః – శరీరస్థమ్–తాన్ – విద్ధి – ఆసుర – నిశ్చయాన్

యే జనాః = ఏ జనులు

అచేతసః+శరీరస్థమ్+ భూతగ్రామమ్+చ+ కర్శయంతః = ఏ మూర్ఖులు యితరులను పీడింప తలంపుగలిగి శరీరమందున్న జీవుని, ఇంద్రియములను కృశింపచేయుచున్నారో,

దంభాకారసంయుక్తాః+ కామరాగబలాన్వితాః = దంబము, అహంకారముతో గూడిన వారును కామము, క్రోధము, రాగము, ద్వేషము గలిగిన బలయుతులును

అంతః+శరీరస్థమ్+ మామ్ = దేహములో హృదయగుహలో సాక్షీభూతునిగా ఉన్న నన్ను

అశాస్త్రవిహితమ్+ ఘోరమ్+తపః = వేదసమ్మతము గానిదియు ఘోరమైనదియు అయిన తపస్సు చేయుచూ

తప్యంతే = తపింపచేయుచున్నారో

తాన్+ఏవ+ ఆసుర నిశ్చయాన్+విద్ధి = వారిని అసురసంపద గలవారినిగా తెలియుము. (రాక్షసుల తపస్సు ఈ కోవకు చెందును)

**ఆహారస్త్వపి సర్వస్య । త్రివిధో భవతి ప్రియః ।**
**యజ్ఞ స్తపస్తథా దానం । తేషాం భేదమిమం శృణు ॥ 7**

ఆహారః – తు – అపి – సర్వస్య – త్రివిధః – భవతి – ప్రియః
యజ్ఞః – తపః – తథా – దానమ్ – తేషామ్ – భేదమ్ – ఇమమ్ – శృణు

సర్వస్య+ఆహారః+అపి+ యజ్ఞః+దానమ్+తు+ తథా+తపః = అందరికి ఆహారము యజ్ఞము, దానము, ఇష్టాపూర్తములు అట్లే తపస్సు

త్రివిధః+ప్రియః+భవతి = మూడు విధములుగ ఇష్టముగా ఉండును

తేషామ్+ఇమమ్+ భేదమ్+శృణు = వాటి యొక్క ఈ భేదములను వినుము

ఆహారము

**ఆయుస్సత్త్వబలారోగ్య । సుఖప్రీతివివర్ధనాః ।**

**రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా । ఆహారాస్సాత్త్విక ప్రియాః ॥ 8**

ఆయుఃసత్త్వబలఆరోగ్య సుఖప్రీతివివర్ధనాః

రస్యాః – స్నిగ్ధాః – స్థిరాః – హృద్యాః – ఆహారాః – సాత్త్విక ప్రియాః

**కట్వమ్లలవణాత్యుష్ణ । తీక్ష్ణరూక్ష విదాహినః ।**

**ఆహారా రాజసస్యేష్టా । దుఃఖ శోకామయ ప్రదాః ॥ 9**

కటుఆమ్లలవణఅత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః

ఆహారాః – రాజసస్య – ఇష్టాః – దుఃఖశోకామయ ప్రదాః

**యాతయామం గతరసం । పూతి పర్యుషితం చ యత్ ।**

**ఉచ్ఛిష్టమపి చామేధ్యం । భోజనం తామస ప్రియమ్ ॥ 10**

యాతయామమ్ – గత రసమ్– పూతి – పర్యుషితమ్ –చ– యత్

ఉచ్ఛిష్టమ్– అపి– చ– అమేధ్యమ్– భోజనమ్– తామస– ప్రియమ్

| | | |
|---|---|---|
| ఆయుఃసత్త్వ+<br>బలఆరోగ్య+<br>సుఖ ప్రీతివివర్ధనాః | = | ఆయుస్సు, సత్త్వము, బలము, ఆరోగ్యము, శరీరమునకు సుఖము, ప్రీతి, బాగుగా వృద్ధి పొందించునవియు |
| రస్యాః+స్నిగ్ధాః+స్థిరాః+<br>హృద్యాః+ఆహారాః | = | రసము గలవియు స్నిగ్ధము లైనవియు (చమురు గలవి) త్వరగా జీర్ణముగాక చాలాసేపు ఉండునవియు, కంటికి యింపై, మనోహరములై తాజాగా ఉన్నవియైన ఆహారము |
| సాత్త్విక ప్రియాః | = | సత్త్వగుణము గలవారికి యిష్టములైనవి. |

| | | |
|---|---|---|
| కటు+ఆమ్లలవణ+ అత్యుష్ణతీక్ష్ణరూక్ష విదాహినః | = | చేదుగాను, (కాకరకాయ లాంటివి) పులుపుగాను, ఉప్పుగాను, మిక్కిలి వేడిగాను, కారముగాను, చమురు లేనివి, ఎండిపోయినవియు, మాడినవి కఠినమైనవి, మిగుల దాహము గలుగ చేయునవి యును |
| దుఃఖశోకామయప్రదాః+ ఆహారాః | = | అట్టి ఆహారము తీసుకొనుట వలన జబ్బు చేసి శరీరమునకు బాధను రోగమును గలుగ చేయునవియు అయిన ఆహారము |
| రాజసస్య+ఇష్టాః | = | రజోగుణము గలవారికి ఇష్టములై యున్నవి. |
| యాతయామమ్ | = | బాగా చల్లారినవి అనగా నిన్నటివి, మొన్నటివి |
| గతరసమ్ | = | ఎండిపోయినది, రసవిహీనమైనవి |
| పూతి+చ+పర్యుషితమ్+ చ | = | పాసిపోయినవి, దుర్గంధముగలవి, గతరాత్రి వండినది అనగా చద్ది అన్నము |
| ఉచ్ఛిష్టమ్+చ | = | ఒకరు తినగా మిగిలినది |
| అమేధ్యమ్+అపి | = | నిషిద్ధ ఆహారము |
| భోజనమ్+యత్ | = | ఆహారము ఏదిగలదో అది |
| తామసప్రియమ్ | = | తామసులకు యిష్టము |

...... ❖ ❖ ❖ ......

యజ్ఞము

**అఫలాకాంక్షిభిర్యజ్ఞో । విధిదృష్టో య ఇజ్యతే ।**
**యష్టవ్యమేవేతి మనః । సమాధాయ స సాత్త్వికః ॥ 11**

అఫలాకాంక్షిభిః – యజ్ఞః – విధిదృష్టః – యః – ఇజ్యతే
యష్టవ్యమ్ – ఏవ – ఇతి – మనః – సమాధాయ – సః – సాత్త్వికః

**అభిసంధాయ తు ఫలం । దంభార్థ మపి చైవ యత్ ।**

**ఇజ్యతే భరత శ్రేష్ఠ । తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥ 12**

అభిసంధాయ - తు - ఫలమ్ - దంభార్థమ్ -అపి- చ- ఏవ - యత్

ఇజ్యతే - భరత శ్రేష్ఠ - తమ్ - యజ్ఞమ్ - విద్ధి - రాజసమ్

**విధిహీనమసృష్టాన్నం । మంత్రహీనమదక్షిణమ్ ।**

**శ్రద్ధా విరహితం యజ్ఞం । తామసం పరిచక్షతే ॥ 13**

విధిహీనమ్ - అసృష్టాన్నమ్ - మంత్రహీనమ్ - అదక్షిణమ్

శ్రద్ధా - విరహితమ్ - యజ్ఞమ్ - తామసమ్ - పరిచక్షతే

| | | |
|---|---|---|
| భరతశ్రేష్ఠ! | = | ఓ అర్జునా! |
| యః+యజ్ఞః+<br>అఫలాకాంక్షిభిః+ఇజ్యతే | = | ఏ యజ్ఞము విధివిహితముగా ఫలాపేక్ష లేనివారి చేత చేయబడుచున్నదో |
| సః+సాత్త్వికః | = | ఆ యజ్ఞము సత్త్వగుణప్రధానమైనది. (ఉదా: విశ్వామిత్రమహర్షి సిద్ధాశ్రమమున చేసిన దశరాత్ర యజ్ఞము) |
| యష్టవ్యమ్+మనః+<br>సమాధాయ+ఫలమ్+అపి<br>అభిసంధాయ+విధిదృష్టః+<br>ఇతి+ఇజ్యతే | = | తన కోరిక సిద్ధించుటకు ఈ యజ్ఞము చేయవలయు నని యజ్ఞకర్త తన మనస్సున నిశ్చయము చేసికొని ఆ ఫలము కోరి వేదవిహితముగా చేయబడునో |
| తమ్+యజ్ఞమ్+<br>రాజసమ్+విద్ధి | = | ఆ యజ్ఞము రజోగుణయుతమైన దానినిగా తెలియుము. |

ఉదా: దశరథమహారాజు చేసిన అశ్వమేథయాగము. ఈ యాగములో లభించిన పాయసముయొక్క పాత్ర బంగారముది. మూత మాత్రము వెండిది. ఈ యాగములో ఎక్కువభాగము సత్త్వగుణము, కొంతభాగము రజోగుణము ఉన్నదని చెప్పుటకు ఆవిధముగా పాత్రను, మూతను చెప్పినారు.

| | | |
|---|---|---|
| యత్+తు+దంభార్థమ్+ ఏవ+చ+విధిహీనమ్+ మంత్రహీనమ్+అదక్షిణమ్ | = | ఏది తనకు యజ్ఞార్హత లేకపోయిననూ, ఆడంబరము కొఱకు మఱియు వేదవిధిని పాటింపక వేదములలో చెప్పని యజ్ఞమును సమర్థులైన ఋత్విక్కులు లేకుండా మంత్రహీన మైనదియు, ఋత్విజులకు తగినంత దక్షిణ ఇవ్వనిదియు |
| శ్రద్ధావిరహితమ్+ అసృష్టాన్నమ్+యజ్ఞమ్+ తామసమ్+పరిచక్షతే | = | శ్రద్ధ లేనిదియును, అన్నదానమునకు చెప్పబడిన లక్షణములు లేనిదియును అయిన యజ్ఞము తామసమైనదానినిగా చెప్పుదురు |

...... ❖ ❖ ❖ ......

ఈ అధ్యాయములో చెప్పిన 5,6 శ్లోకములకు ఇవి కలిపి చదువవలయును.

తపస్సు శారీరక తపస్సు

**దేవద్విజగురుప్రాజ్ఞ । పూజనం శౌచమార్జవమ్ ।**
**బ్రహ్మచర్యమహింసా చ । శారీరం తప ఉచ్యతే ॥ 14**

దేవద్విజగురుప్రాజ్ఞపూజనమ్ - శౌచమ్ - ఆర్జవమ్
బ్రహ్మచర్యమ్ - అహింసా - చ - శారీరమ్ - తపః - ఉచ్యతే

వాచిక తపస్సు

**అనుద్వేగకరం వాక్యం । సత్యం ప్రియహితం చ యత్ ।**
**స్వాధ్యాయాభ్యసనం చైవ । వాఙ్మయం తప ఉచ్యతే ॥ 15**

అనుద్వేగకరమ్ - వాక్యమ్ - సత్యమ్ - ప్రియహితమ్ - చ - యత్
స్వాధ్యాయాభ్యసనమ్ - చ - ఏవ - వాఙ్మయమ్ - తపః - ఉచ్యతే

మానస తపస్సు

**మనః ప్రసాదః సౌమ్యత్వం । మౌనమాత్మవినిగ్రహః ।**
**భావసంశుద్ధిరిత్యేత । తపో మానసముచ్యతే ॥ 16**

మనః – ప్రసాదః – సౌమ్యత్వమ్ – మౌనమ్ – ఆత్మ వినిగ్రహః
భావసంశుద్ధిః – ఇతి – ఏతత్ – తపః – మానసమ్ – ఉచ్యతే

సాత్త్విక తపస్సు

**శ్రద్ధయా పరయాతప్తం । తపస్తత్ త్రివిధం నరైః ।**
**అఫలాకాంక్షిభిర్యుక్తైః । స్సాత్త్వికం పరిచక్షతే ॥ 17**

శ్రద్ధయా – పరయా – తప్తమ్ – తపః – తత్ – త్రివిధమ్ – నరైః
అఫలాకాంక్షిభిః – యుక్తైః – సాత్త్వికమ్ – పరిచక్షతే

రాజసిక తపస్సు

**సత్కారమానపూజార్థం । తపో దంభేన చైవయత్ ।**
**క్రియతే తదిహ ప్రోక్తం । రాజసం చలమధ్రువమ్ ॥ 18**

సత్కారమానపూజార్థమ్ – తపః – దంభేన – చ – ఏవ – యత్
క్రియతే – తత్ – ఇహ – ప్రోక్తమ్ – రాజసమ్ – చలమ్–అధ్రువమ్

తామసిక తపస్సు

**మూఢగ్రాహేణాత్మనో య । త్పీడయా క్రియతే తపః ।**
**పరస్యోత్సాదనార్థం వా । తత్తామసముదాహృతమ్ ॥ 19**

మూఢగ్రాహేణ – ఆత్మనః – యత్ – పీడయా – క్రియతే – తపః
పరస్య – ఉత్సాదనార్థమ్ – వా – తత్ – తామసమ్ – ఉదాహృతమ్

| | | |
|---|---|---|
| దేవద్విజగురుప్రాజ్ఞ పూజనమ్ | = | దేవతలను, బ్రాహ్మణులను, గురువులను పెద్దలను పూజించుటయు |
| శౌచమ్ | = | బాహ్య అంతర శుద్ధి గలిగి ఉండుటయు |
| ఆర్జవమ్ | = | ఋజు ప్రవర్తన గలిగి ఉండుటయు |
| బ్రహ్మ చర్యమ్+చ | = | బ్రహ్మచర్య వ్రతము గలిగియుండుటయు |
| అహింసా | = | అహింస మనోవాక్కాయములచే హింస లేమియు |
| శారీరమ్+తపః+ ఉచ్యతే | = | శరీర సంబంధమయిన తపస్సు అని చెప్పబడును |
| అనుద్వేగకరమ్+వాక్యమ్ | = | ఉద్వేగముతో కూడనిదియు, (అనగా శాంత సంభాషణ కోపము గలిగినప్పుడు మాట ఉద్వేగముగా వచ్చును. కావున కోపము లేకుండా మాట పలకవలయును.) |
| సత్యమ్ | = | సత్యమైనదియు |
| ప్రియహితమ్+చ | = | ప్రియము, హితము అయినదియు |
| స్వాధ్యాయ అభ్యసనమ్+ ఏవ+చ | = | వేదాభ్యాసము, పురాణేతిహాసములు చదువుటయు |
| యత్+తపః | = | ఏది తపస్సో అది |
| వాఙ్మయమ్+ఉచ్యతే | = | వాచిక తపస్సు అని చెప్పబడును. |
| మనః+ప్రసాదః | = | మనస్సు ప్రశాంతముగా నుంచుట |
| సౌమ్యత్వమ్ | = | సౌమ్యభావనతో యుండుట |
| మౌనమ్ | = | మనస్సును యితర విషయములపై పోనీక వాక్ నియమములు గలిగి మనస్సును నిర్మలముగా ఉంచుట |

| | | |
|---|---|---|
| ఆత్మవినిగ్రహః | = | ఆత్మను నిగ్రహించుట |
| భావసంశుద్ధిః | = | ఇంచుక మాయ లేకుండా మంచి భావములు గలిగివుండుట |
| ఏతత్+ఇతి+మానసమ్+ తపః+ఉచ్యతే | = | అనునవి మానస తపస్సు అని చెప్పబడును. |
| అఫలాకాంక్షిభిః+యుక్తైః | = | ఫలాపేక్ష రహితులైన శ్రద్ధాయుక్తులైన |
| నరైః | = | జనులచేత |
| పరయా+శ్రద్ధయా | = | అత్యంతశ్రద్ధతో |
| త్రివిధమ్+తప్తమ్ | = | శారీరక, వాచిక, మనస్సులచే తపింపచేయబడునది |
| సాత్త్వికమ్+పరిచక్షతే | = | సాత్త్విక తపస్సు అని చెప్పబడుచున్నది |
| సత్కార మానపూజార్థమ్ | = | ఇతరులచే గౌరవింపబడాలనే భావనతోనూ |
| దంభేన+చ+ఏవ | = | డంభముతో |
| యత్+తపః+క్రియతే తత్+ఇహ+ చలమ్+అధ్రువమ్+ రాజసమ్+ప్రోక్తమ్ | = | ఏ తపస్సు చేయబడునో అది అస్థిరము, అధ్రువము అయిన ఫలితముల నిచ్చునది రాజస తపస్సు అని చెప్పబడినది. |
| మూఢ గ్రాహేణ+ ఆత్మనః+పీడయా+వా+ పరస్య+ఉత్సాదనార్థమ్+ యత్+క్రియతే+తపః | = | మూర్ఖపు పట్టుదలతో తన శరీరమునకు యిబ్బందిని లేక యితరుల యొక్క వినాశనమునకు చేయబడుచున్నట్టి, యే తపస్సు గలదో |
| తత్+తామసమ్+ ఉదాహృతమ్ | = | అది తామస తపస్సు అని చెప్పబడినది. |



దానము

**దాతవ్యమితి యద్దానం । దీయతేஉనుపకారిణే ।**
**దేశే కాలే చ పాత్రే చ । తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥ 20**

దాతవ్యమ్ - ఇతి - యత్ - దానమ్- దీయతే - అనుపకారిణే,
దేశే-కాలే - చ - పాత్రే - చ - తత్ - దానమ్-సాత్త్వికమ్ - స్మృతమ్.

**యత్తు ప్రత్యుపకారార్థం । ఫలముద్దిశ్య వా పునః ।**
**దీయతే చ పరిక్లిష్టం । తద్దానం రాజసం స్మృతమ్ ॥ 21**

యత్ - తు - ప్రత్యుపకారార్థమ్ - ఫలమ్ - ఉద్దిశ్య - వా - పునః,
దీయతే - చ - పరిక్లిష్టమ్ - తత్ - దానమ్ - రాజసమ్ - స్మృతమ్.

**అదేశకాలే యద్దానమ్ । అపాత్రేభ్యశ్చ దీయతే ।**
**అసత్కృత మవజ్ఞాతం । తత్తామసముదాహృతమ్ ॥ 22**

అదేశకాలే - యత్ - దానమ్ - అపాత్రేభ్యః - చ - దీయతే,
అసత్కృతమ్ - అవజ్ఞాతమ్ - తత్ - తామసమ్ - ఉదాహృతమ్.

అనుపకారిణే = ప్రత్యుపకారము కోరక
దేశే+కాలే+చ+పాత్రే+చ = దేశము, కాలము అర్హత గుర్తించి వీరికి యీ
దాతవ్యమ్+ఇతి = దానము యివ్వవలయునని భావించి పాత్రులకు
యత్+దానమ్+దీయతే = ఏ దానము యివ్వబడుచున్నదో
తత్+దానమ్ = ఆ దానము
సాత్త్వికమ్+స్మృతమ్ = సాత్త్వికదానమని తలంపబడుచున్నది.
పునః+ప్రత్యుపకారార్థమ్+వా = దానము పుచ్చుకొనిన వాని నుంచి మరల ప్రత్యుపకారము కోరి గాని

| | | |
|---|---|---|
| ఫలమ్+ఉద్ధిశ్య+చ | = | దాన ఫలితము కోరిగాని |
| పరిక్లిష్టమ్+తు | = | మనస్సుతో బాధపడుతూ గాని |
| యత్+దీయతే | = | ఏది దానముగా యివ్వబడుచున్నదో |
| తత్+దానమ్+రాజసమ్+ స్మృతమ్ | = | ఆ దానము రాజస దానమని భావింపబడును. |
| అపాత్రేభ్యః | = | అపాత్రుని కొఱకు |
| అదేశ కాలే | = | దేశ కాలమును గమనించక |
| అసత్కృతమ్+చ | = | దానవిధిని పాటించక |
| అవజ్ఞాతమ్ | = | అమర్యాదగా |
| యత్+దానమ్+దీయతే | = | యివ్వబడుచున్నదో |
| తత్+తామసమ్+ ఉదాహృతమ్ | = | అది తామస దానమని చెప్పబడును. |

బలిచక్రవర్తి ఇచ్చిన దానము సాత్త్వికదానము. రామాయణము – బాలకాండలో అశ్వమేథయాగ సందర్భమున అన్నదానము, రామాదుల వివాహ సందర్భమున గోదానము మొదలైన దానముల గుఱించి వివరింపబడినది.

...... ❖ ❖ ❖ ......

**ఓం తత్సదితినిర్దేశో । బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।**
**బ్రాహ్మణాస్తేన వేదాశ్చ । యజ్ఞాశ్చ విహితాః పురా ॥ 23**

ఓం – తత్ – సత్ – ఇతి – నిర్దేశః – బ్రహ్మణః – త్రివిధః – స్మృతః
బ్రాహ్మణాః – తేన – వేదాః – చ – యజ్ఞాః – చ – విహితాః – పురా

**తస్మాదోమిత్యుదాహృత్య । యజ్ఞదానతపఃక్రియాః ।**
**ప్రవర్తంతే విధానోక్తాః । సతతం బ్రహ్మవాదినామ్ ॥ 24**

తస్మాత్ – ఓమ్ – ఇతి – ఉదాహృత్య – యజ్ఞ, దాన, తపః, క్రియాః
ప్రవర్తంతే – విధానోక్తాః – సతతమ్ – బ్రహ్మవాదినామ్

ఓం తత్+సత్+ఇతి+ = ఓం తత్ సత్ అని మూడు విధములుగా
త్రివిధః+బ్రహ్మణ+నిర్దేశః+ పరబ్రహ్మగురించి నిర్దేశింపబడినది
స్మృతః
తేన+పురాః+చ = ఓంకారము చేతనే సృష్ట్యాది యందు వేదములు,
బ్రహ్మణాః+వేదాః+చ వేదములలో చెప్పబడిన విధి విధానములతో
విహితాః యజ్ఞము చేయుట నిర్దేశింపబడినవి అనగా వేద
అధ్యయనమునకు ముందు ఓం అని పలుకుదురు
తస్మాత్ = అందువలన
విధానోక్తాః+ = వేదోక్తములైన వాటిని తెలిసిన బ్రహ్మవాదులయొక్క
బ్రహ్మవాదినామ్+ యజ్ఞము, దానము, తపస్సు మొదలైన పుణ్య
యజ్ఞదానతపఃక్రియాః+ కర్మలు ఎల్లప్పుడూ
సతత్ = ఎల్లప్పుడూ
ఓమ్+ఇతి+ఉదాహృత్య+ = ఓం అని పలికి ప్రారంభింపబడుచున్నవి.
ప్రవర్తన్తే

...... ❖ ❖ ❖ ......

తత్

**తదిత్యనభిసంధాయ । ఫలం యజ్ఞ తపః క్రియాః ।**
**దానక్రియాశ్చ వివిధాః । క్రియంతే మోక్ష కాంక్షిభిః ॥ 25**

తత్ - ఇతి - అనభి సంధాయ - ఫలమ్ - యజ్ఞ తపః క్రియాః,
దాన క్రియాః-చ-వివిధాః-క్రియంతే- మోక్షకాంక్షిభిః.

| | |
|---|---|
| మోక్ష కాంక్షిభిః+ఫలమ్+ = | మోక్షమును కోరేవారి చేత ఫలమును కోరక |
| అనభి సంధాయ+ | వివిధ పుణ్య కర్మానుష్ఠానములు |
| వివిధాః+ | యజ్ఞ, తపఃక్రియలు |
| యజ్ఞతపఃక్రియాః+చ+ | దానములు తత్ అని ఉచ్చరించి |
| దానక్రియాః+తత్+ | చేయబడుచున్నవి. |
| ఇతి+క్రియంతే | |

...... ❖ ❖ ❖ ......

**సద్భావే సాధుభావే చ । సదిత్యేతత్ప్రయుజ్యతే ।**
**ప్రశస్తే కర్మణి తథా । సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥ 26**

సద్భావే - సాధు భావే - చ - సత్ - ఇతి - ఏతత్ - ప్రయుజ్యతే
ప్రశస్తే - కర్మణి - తథా - సత్ - శబ్దః - పార్థ - యుజ్యతే

**యజ్ఞే తపసి దానే చ । స్థితిస్సదితి చోచ్యతే**
**కర్మచైవ తదర్థీయం । సదిత్యేవాభిధీయతే ॥ 27**

యజ్ఞే - తపసి - దానే - చ - స్థితిః - సత్ - ఇతి - చ- ఉచ్యతే
కర్మ - చ - ఏవ - తదర్థీయమ్ - సత్ - ఇతి-ఏవ-అభిధీయతే

| | |
|---|---|
| పార్థ = | ఓ అర్జునా! |
| సద్భావే+చ+సాధుభావే+ = | సద్భావము సాధుభావములందు సత్ అనేది |
| సత్+ఇతి+ఏతత్+ | వాడబడుచున్నది |
| ప్రయుజ్యతే | |

| | | |
|---|---|---|
| తథా+ప్రశస్తే+కర్మణి+ సత్+శబ్దః+యుజ్యతే | = | అటులనే పుణ్య కర్మానుష్ఠానములలో ఉత్తమమైన యజ్ఞ, దాన, తపస్సు మొదలయిన వేదోక్త కర్మల యందు సత్ శబ్దము వాడబడుచున్నది. |
| యజ్ఞే+తపసి+చ+ దానే+చ+స్థితిః+ఏవ+ సత్+ఇతి+ఉచ్యతే | = | యజ్ఞమునందు, తపస్సునందు, దానమునందు అనగా పుణ్యకర్మల స్థితి సత్ అని చెప్పబడుచున్నది. |
| తదర్థీయమ్+కర్మ+చ సత్+ఇతి+ఏవ+ అభిధీయతే | = | యజ్ఞములో మధ్య మధ్యలో ఉపాంగములు ఉండును. ఆ ఉపాంగములకు సంబంధించిన కర్మ కూడ సత్ అనియు చెప్పబడుచున్నది. |

...... ❖ ❖ ❖ ......

**అశ్రద్ధయా హుతం దత్తం । తపస్తప్తం కృతం చ యత్ ।**
**అసదిత్యుచ్యతే పార్థ । న చ తత్ప్రేత్య నో ఇహ ॥ 28**

అశ్రద్ధయా - హుతమ్-దత్తమ్ - తపః-తప్తమ్-కృతమ్ -చ- యత్
అసత్ - ఇతి - ఉచ్యతే-పార్థ-న-చ- తత్ - ప్రేత్య - నో - ఇహ

| | | |
|---|---|---|
| పార్థ! | = | ఓ అర్జునా! |
| అశ్రద్ధయా+కృతమ్+ దత్తమ్+హుతమ్+చ+ తపః+తప్తమ్ | = | అశ్రద్ధతో చేయబడిన పుణ్య కర్మానుష్ఠానము, ఇవ్వబడిన దానము అగ్నిలో హుతము చేసిన ద్రవ్యము, చేయబడిన తపస్సు |
| యత్+తత్+అసత్+ ఇతి+ఉచ్యతే+న+ప్రేత్య+ చ+నో+ఇహ | = | ఏవి కలవో అవి అసత్ అని చెప్పబడును, ఆ అసత్ కర్మానుష్టానము వలన పరలోక ప్రయోజనములకు గాని ఇహలోక ప్రయోజనముగాని ఉండదు |

పుణ్య ఫలితము గలుగదు. అసత్ వాటి వలన ధనము కాలము శ్రమ వ్యర్థమగుట తప్ప యిహలోక, పరలోక ప్రయోజనము చేకూరదు.

...... ❖ ❖ ❖ ......

ఓం శ్రీగురుభ్యో నమః

# భీష్మ పర్వము 42వ అధ్యాయము

## (మోక్షసన్న్యాసయోగము)

**సన్న్యాసస్య మహాబాహో । తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।**
**త్యాగస్య చ హృషీకేశ । పృథక్కేశినిషూదన ॥ 1**

సన్న్యాసస్య - మహాబాహో - తత్త్వమ్ - ఇచ్ఛామి - వేదితుమ్,
త్యాగస్య - చ - హృషీకేశ - పృథక్ - కేశినిషూదన

| | | |
|---|---|---|
| మహాబాహో+ | | |
| హృషీకేశ+కేశినిఘూదన | = | ఓ శ్రీకృష్ణా! |
| సన్న్యాసస్య+చ | = | సన్న్యాసము యొక్కయు అనగా సాంఖ్యము |
| త్యాగస్య+తత్త్వమ్+ | | యొక్కయు త్యాగము యొక్కయు అనగా |
| పృథక్+వేదితుమ్+ | | పుణ్యకర్మఫలత్యాగములలో గల తేడాను |
| ఇచ్ఛామి | | తెలిసికొన కోరుచున్నాను |

...... ❖ ❖ ❖ ......

శ్రీ భగవానువాచ

**కామ్యానామ్ కర్మణాం న్యాసం । సన్న్యాసం కవయో విదుః ।**
**సర్వకర్మ ఫలత్యాగం । ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥ 2**

కామ్యానామ్ - కర్మణామ్ - న్యాసమ్ -సన్న్యాసమ్ - కవయః- విదుః
సర్వ కర్మ ఫలత్యాగమ్ - ప్రాహుః - త్యాగమ్ - విచక్షణాః

**త్యాజ్యం దోషవదిత్యేకే । కర్మప్రాహుర్మనీషిణః ।**

**యజ్ఞ దాన తపఃకర్మ । న త్యాజ్య మితి చాపరే ॥ 3**

త్యాజ్యమ్ - దోషవత్ - ఇతి - ఏకే - కర్మ- ప్రాహుః- మనీషిణః

యజ్ఞ దాన తపః కర్మ - న - త్యాజ్యమ్ - ఇతి - చ - అపరే

| | | |
|---|---|---|
| విచక్షణాః+కవయః | = | విచక్షణ కలిగిన జ్ఞానులు అనగా సాంఖ్యులు |
| యజ్ఞ+దాన+తపః+కర్మ<br>న+త్యాజ్యమ్+ఇతి | = | యజ్ఞము, దానము తపస్సాది కర్మలను<br>వదలరాదని, అనుష్ఠించవలయునని చెప్పుదురు |
| ఏకే+అపరే | = | మరి కొందఱు |
| కామ్యానామ్+<br>కర్మణామ్+న్యాసమ్+<br>సన్న్యాసమ్+విదుః | = | కామ్యములైన కర్మలను చేయకుండుటను<br>సన్న్యాసమని తెలియుదురు |
| మనీషిణః+కర్మ+చ<br>దోషవత్+ఇతి+ప్రాహుః | = | కొందఱు బుద్ధిమంతులు కామ్యకర్మలను<br>దోషములైన పనులవలె విడిచిపెట్టవలెనని<br>చెప్పుదురు |
| సర్వకర్మ ఫలత్యాగమ్+<br>త్యాగమ్+ప్రాహుః | = | సర్వకర్మల ఫలత్యాగమును త్యాగము అని<br>చెప్పుదురు |

**వ్యాఖ్యానము :-** పుణ్యకర్మలను అనుష్ఠించవలయును. కామ్యకర్మలను చేయకుండుటను సన్న్యాసము అనియు పుణ్యకర్మల ఫలితమును కోరకుండుటను త్యాగము అనియు చెప్పుదురు.

...... ❖ ❖ ❖ ......

త్యాగము

**నిశ్చయం శృణు మే తత్ర । త్యాగే భరతసత్తమ ।**
**త్యాగో హి పురుష వ్యాఘ్ర । త్రివిధః సంప్రకీర్తితః ॥ 4**

నిశ్చయమ్ – శృణు – మే – తత్ర – త్యాగే – భరత సత్తమ
త్యాగః – హి – పురుష వ్యాఘ్ర – త్రివిధః – సంప్రకీర్తితః.

| | | |
|---|---|---|
| భరత సత్తమ | = | ఓ అర్జునా! |
| త్యాగే+తత్ర+మే+ నిశ్చయమ్+శృణు | = | త్యాగ విషయమున నా అభిప్రాయమును వినుము |
| పురుష వ్యాఘ్ర+ త్యాగః+త్రివిధః+హి+ సంప్రకీర్తితః | = | ఓ అర్జునా! గుణములను బట్టి త్యాగము మూడు విధములని చెప్పబడియున్నది. (ఈ శ్లోకమునకు 7 నుండి 12 శ్లోకములు జతచేసి చదువ వలయును.) |

...... ❖ ❖ ❖ ......

**యజ్ఞదానతపఃకర్మ । న త్యాజ్యం కార్యమేవ తత్ ।**
**యజ్ఞో దానం తపశ్చైవ । పావనాని మనీషిణామ్ ॥ 5**

యజ్ఞ దాన తపః – కర్మ – న – త్యాజ్యమ్ – కార్యమ్ – ఏవ – తత్,
యజ్ఞః – దానమ్ – తపః – చ – ఏవ – పావనాని – మనీషిణామ్.

**ఏతాన్యపి తు కర్మాణి । సంగం త్యక్త్వా ఫలాని చ ।**
**కర్తవ్యానీతి మే పార్థ । నిశ్చితం మతముత్తమమ్ ॥ 6**

ఏతాని – అపి – తు – కర్మాణి – సంగమ్ – త్యక్త్వా – ఫలాని – చ,
కర్తవ్యాని – ఇతి – మే – పార్థ – నిశ్చితమ్ – మతమ్ – ఉత్తమమ్.

| | |
|---|---|
| యజ్ఞ దాన తపః+కర్మ | = యజ్ఞము, దానము, తపస్సు అను పుణ్యకర్మలు |
| న+త్యాజ్యమ్+తత్+ | విడిచి పెట్టరాదు అవి తప్పక చేయవలయును |
| కార్యమ్+ఏవ+ | యజ్ఞము, దానము, తపస్సు సాధ్యాయము |
| యజ్ఞః+దానమ్+తపః+ | మొదలైన పుణ్యకర్మలు మనుష్యులను పవిత్రులను |
| చ+ఏవ+మనీషిణామ్+ | చేయును |
| పావనాని | |
| పార్థ | = ఓ అర్జునా! |
| ఏతాని+అపి+తు+ | = అయితే యీ పుణ్యకర్మలను, |
| కర్మాణి+ఫలాని+ | ఫలాపేక్షను విడచి మఱియు |
| సంగమ్+త్యక్త్వా+చ | |
| కర్తవ్యాని+ఇతి+మే+ | = ఇవి చేయుట కర్తవ్యమని భావించి చేయుట |
| ఉత్తమమ్+నిశ్చితమ్+ | నా యొక్క ఉత్తమమైన, నిశ్చితమైన అభిప్రాయము |
| మతమ్ | |

**వ్యాఖ్యానము:-** పుణ్యకర్మలు తప్పక చేయవలెను. ఇవి మనుష్యులను పవిత్రము చేయును. పుణ్యకర్మలు చేసి ఆ పుణ్యకర్మల ఫలితమును కోరరాదు.

...... ❖ ❖ ❖ ......

**నియతస్య తు సన్న్యాసః । కర్మణో నోపపద్యతే ।**
**మోహాత్తస్య పరిత్యాగ । స్తామసః పరికీర్తితః ॥ 7**

నియతస్య – తు – సన్న్యాసః – కర్మణః – న – ఉపపద్యతే
మోహాత్ – తస్య – పరిత్యాగః – తామసః – పరికీర్తితః

**దుఃఖ మిత్యేవ యత్కర్మ । కాయక్లేశభయాత్త్యజేత్ ।**
**స కృత్వా రాజసం త్యాగం । నైవ త్యాగఫలం లభేత్ ॥ 8**

దుఃఖమ్– ఇతి – ఏవ – యత్ – కర్మ – కాయ క్లేశభయాత్ – త్యజేత్
సః– కృత్వా – రాజసమ్ – త్యాగమ్ – న – ఏవ – త్యాగఫలమ్– లభేత్

**కార్యమిత్యేవ యత్కర్మ । నియతం క్రియతేఽర్జున ।**

**సంగం త్యక్త్వా ఫలం చైవ । స త్యాగస్సాత్త్వికో మతః ॥ 9**

కార్యమ్ – ఇతి – ఏవ – యత్ – కర్మ – నియతమ్ – క్రియతే – అర్జున
సంగమ్–త్యక్త్వా–ఫలమ్– చ– ఏవ– సః– త్యాగః– సాత్త్వికః– మతః

**న ద్వేష్ట్య కుశలం కర్మ । కుశలే నానుషజ్జతే ।**

**త్యాగీసత్త్వసమావిష్టో । మేధావీ ఛిన్నసంశయః ॥ 10**

న – ద్వేష్టి – అకుశలమ్ – కర్మ – కుశలే – న – అనుషజ్జతే
త్యాగీ – సత్త్వసమావిష్టః – మేధావీ – ఛిన్నసంశయః.

**న హి దేహభృతా శక్యం । త్యక్తుం కర్మాణ్య శేషతః ।**

**యస్తు కర్మఫలత్యాగీ । స త్యాగీత్యభిధీయతే ॥ 11**

న – హి – దేహభృతా – శక్యమ్ – త్యక్తుమ్ – కర్మాణి – అశేషతః,
యః – తు – కర్మఫలత్యాగీ – సః – త్యాగీ – ఇతి– అభిధీయతే.

**అనిష్టమిష్టం మిశ్రం చ । త్రివిధం కర్మణః ఫలం ।**

**భవత్యత్యాగినాం ప్రేత్య । న తు సన్న్యాసినాం క్వచిత్ ॥ 12**

అనిష్టమ్ – ఇష్టమ్ – మిశ్రమ్ – చ – త్రివిధమ్ – కర్మణః – ఫలమ్,
భవతి – అత్యాగినామ్ – ప్రేత్య – న – తు – సన్న్యాసినామ్ – క్వచిత్.

అశేషతః+కర్మాణి+ త్యక్తుమ్+దేహభృతా+ న+శక్యమ్+హి = దేహనిర్వహణకు సంబంధించిన కర్మలను పూర్తిగా విడచిపెట్టుటకు మానవునికి శక్యముగాదు. దేహ నిర్వహణకు సంబంధించిన కర్మ చేయకుండా ఎవడును ఉండజాలడని కర్మయోగము 5లో చెప్పిన దానినే మఱల ఈవిధముగా చెప్పబడినది.

| | | |
|---|---|---|
| నియతస్య+తు+ కర్మణః+సన్న్యాసః+ న+ఉపపద్యతే | = | యజ్ఞము, దానము, తపస్సు, స్వాధ్యాయనము మొదలైన నియత పుణ్యకర్మలను సన్న్యాసము అను పేరుతో పుణ్యకర్మలను మానుట తగదు |
| తస్య+మోహాత్+ పరిత్యాగః+తామసః+ పరికీర్తితః | = | వాటిని అజ్ఞానము వలన చేయకుండుటను తామసత్యాగమని చెప్పబడును. |
| యత్+కర్మ+ కాయక్లేశ భయాత్+ దుఃఖమ్+ఇతి+ఏవ+ త్యజేత్ | = | ఏ పుణ్యకర్మ చేయవలయునని తెలిసియు శరీరమునకు యిబ్బంది కలుగునని ధననష్టము అగుననే భయము వలన కష్టమును గలిగించునని భావించి యజ్ఞాది పుణ్యకర్మలను చేయక విడచిపెట్టునో అది తామసత్యాగము |
| సః+రాజసమ్+త్యాగమ్+ కృత్వా+ఏవ+ త్యాగఫలమ్+న+లభేత్ | = | ఫలితమును కోరి పుణ్యకర్మలు చేసిన పుణ్యకర్మల ఫలితమును వదలనివాడు రాజసత్యాగిగా చెప్పబడును. అతడు ఆత్మస్థానమును పొందడు |
| అర్జున | = | ఓ అర్జునా! |
| కార్యమ్+ఇతి+ఏవ | = | ఇది తప్పనిసరిగా చేయవలసిన పుణ్యకర్మ అని |
| యత్+కర్మ+నియతమ్+ ఫలమ్+సంగమ్+ త్యక్త్వా+క్రియతే+చ | = | యజ్ఞము, దానము, తపస్సు అను ఏ కర్మ శాస్త్రవిధి ననుసరించి ఫలాపేక్షను విడచి చేయబడుచున్నవో |
| సః+త్యాగః+ఏవ+ సాత్త్వికః+మతః | = | అట్టి త్యాగము సాత్త్విక త్యాగమని నా అభిప్రాయము |
| సత్త్వసమావిష్టః+ ఛిన్నసంశయః+మేధావీ+ త్యాగీ+అకుశలమ్+కర్మ+ న+ద్వేష్టి | = | సత్త్వగుణముతో కూడుకొన్నవాడును సంశయరహితుడును మేధావి అయినవాడును సాత్త్విక త్యాగియు సుఖకరముగాని కర్మను ద్వేషింపడు |

| | | |
|---|---|---|
| కుశలే+న+అనుషజ్జతే | = | సుఖకరమైన పుణ్యకర్మయందు ఆసక్తుడు కాడు అనగా పుణ్యఫలితము కోరడు. |
| యః+కర్మఫలత్యాగీ+తు సః+త్యాగీ+ఇతి+ అభిధీయతే | = | ఎవడు దేహనిర్వహణ కర్మలను ఆచరించుచూ పుణ్యకర్మఫలమును త్యాగము చేయునో అట్టివాడు సాత్త్వికత్యాగి అని చెప్పబడుచున్నాడు |
| అత్యాగినామ్+అనిష్టమ్+ | = | పుణ్యకర్మఫలత్యాగము చేయనివారలకు |
| ఇష్టమ్+చ+మిశ్రమ్+ త్రివిధమ్+కర్మణః+ ఫలమ్+భవతి+ప్రేత్య+ తు | = | అనిష్టములైన, ఇష్టములైన, ఇష్టాయిష్టమిశ్రమమైన కర్మల యొక్క మూడు ఫలితములు గలుగుచున్నవి. చనిపోయిన తర్వాత అనిష్టములైన నరకాదులు యిష్టములైన స్వర్గాదులు మిశ్రమములైన భూలోకజన్మ గలుగుచున్నవి. |
| న+సన్న్యాసినామ్+ క్వచిత్ | = | కామ్యకర్మలు చేయనివానికి ఒకప్పుడును ఇటువంటి ఫలితము గలుగదు. అనగా జన్మ రాహిత్యము కలుగదు. అతడు జన్మపరంపరలలో చిక్కుకొనును. |

**వ్యాఖ్యానము:-** దేహనిర్వహణకు సంబంధించిన కర్మలు చేయకుండా ఎవడునూ ఉండజాలడు. పుణ్యకర్మలు చేసి, వాటి ఫలితమును వదలుట సాత్త్వికత్యాగము. పుణ్యఫలితమును వదలకుండుట రాజసత్యాగము. శారీరక ఇబ్బంది, కష్టము, ధననష్టము అగునని భావించి అజ్ఞానముచే పుణ్యకర్మలను వదలుట తామసిక త్యాగము. వీరికి ఇహలోక, పరలోకములలో సుఖముండదు. మఱియు జన్మపరంపరలలో చిక్కుకొందురు.

...... ❖ ❖ ❖ ......

కర్మలకు కారణము

**పంచైతాని మహాబాహో । కారణాని నిబోధ మే ।**

**సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని । సిద్ధయే సర్వకర్మణామ్ ॥ 13**

పంచ - ఏతాని - మహాబాహో - కారణాని - నిబోధ - మే

సాంఖ్యే - కృతాంతే - ప్రోక్తాని - సిద్ధయే - సర్వకర్మణామ్

**అధిష్ఠానం తథా కర్తా । కరణం చ పృథగ్విధమ్ ।**

**వివిధాశ్చ పృథక్చేష్టా । దైవం చైవాత్ర పంచమమ్ ॥ 14**

అధిష్ఠానమ్ - తథా - కర్తా - కరణమ్ - చ - పృథగ్విధమ్

వివిధాః-చ- పృథక్ - చేష్టాః - దైవమ్ - చ - ఏవ - అత్ర - పంచమమ్

**శరీరవ్యాఙ్మనోభిర్యత్ । కర్మ ప్రారభతే నరః ।**

**న్యాయ్యం వా విపరీతం వా । పంచైతే తస్య హేతవః ॥ 15**

శరీర వాక్ మనోభిః - యత్ - కర్మ - ప్రారభతే - నరః

న్యాయ్యమ్-వా - విపరీతమ్ - వా -పంచ - ఏతే - తస్య - హేతవః

**తత్రైవం సతి కర్తార । మాత్మానం కేవలం తు యః ।**

**పశ్యత్య కృత బుద్ధిత్వాత్ । న స పశ్యతి దుర్మతిః ॥ 16**

తత్ర- ఏవమ్- సతి- కర్తారమ్- ఆత్మానమ్- కేవలమ్- తు- యః

పశ్యతి - అకృతబుద్ధిత్వాత్ - న - సః - పశ్యతి - దుర్మతిః

**యస్య నాహంకృతో భావో । బుద్ధిర్యస్య న లిప్యతే ।**

**హత్వాపి స ఇమాన్ లోకాన్ । న హంతి న నిబధ్యతే ॥ 17**

యస్య - న - అహమ్ కృతః - భావః - బుద్ధిః - యస్య - న - లిప్యతే

హత్వా- అపి- సః- ఇమాన్- లోకాన్- న-హంతి - న - నిబధ్యతే

| | | |
|---|---|---|
| మహాబాహో | = | అర్జునా! |
| సర్వకర్మణామ్+ కృతాంతే+సిద్ధయే+ సాంఖ్యే+ప్రోక్తాని+ ఏతాని+పంచ+ కారణాని+మే+నిబోధ | = | సర్వ పుణ్యకర్మల యొక్క సిద్ధి గలుగుటకు అనగా ఫలితము పొందుటకు సాంఖ్యమునందు చెప్పబడిన యీ ఐదు కారణములను చెప్పుచున్నాను. వాటిని నా వలన గ్రహింపుము |
| నరః | = | మానవుడు |
| శరీరవాక్మనోభిః+ న్యాయ్యమ్+వా+విపరీతమ్+ వా+యత్+కర్మ+ప్రారభతే | = | శరీరము, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు మనస్సులచేత న్యాయమైనదిగాని, అన్యాయమైనది గాని ఏ కర్మను అనగా పుణ్యకర్మ లేదా పాపకర్మ ప్రారంభించుచున్నాడో |
| తస్య | = | ఆ కర్మకు |
| అత్ర | = | ఇక్కడ, ఈ లోకంలో |
| అధిష్ఠానమ్ | = | "అధి తిష్ఠంతి అత్ర ఇతి అధిష్ఠానమ్ - ష్ఠా గతి నివృత్తౌ" దీనియందు ఉందురు. అనగా పూర్వజన్మ కర్మవాసనలు గలిగిన స్వభావము (1) |
| తథా+కర్తా | = | కర్త అనగా ఆ కార్యమును చేయువాడు (2) |
| పృథగ్విధమ్+కరణమ్+ చ | = | అనేక సాధనములు (క్రియతే అనేనేతి కరణమ్- దీనిచేత చేయబడును. అనగా శరీరము, ఇంద్రియాదులచే కర్మ చేయబడును. కావున శరీరము, ఇంద్రియాదులు కరణములు). (3) |
| పృథక్+వివిధాః+చేష్టాః | = | కార్యసాఫల్యమునకు చేయు వివిధపనులు (4) |
| దైవమ్ | = | కాలము (5) |
| ఏతే+పంచ+హేతవః | = | ఈ ఐదు కారణములు |

తత్ర+ఏవమ్(సతి)+ = ఈ కర్మలయందు ఈ ఐదు కారణములై
యః+అకృత బుద్ధిత్వాత్+ ఉండగా ఎవడు జ్ఞానవిహీనుడై కేవలము తనే
కేవలమ్+ఆత్మానమ్+ కర్తను అని తలంచునో
కర్తారమ్+తు

సః+దుర్మతిః+న+ = అట్టి దుర్బుద్ధి గలవాడు సత్యమును చూడలేక
పశ్యతి ఉన్నాడు. అనగా యథార్థమును గ్రహించలేక
ఉన్నాడు

యస్య+ = ఎవనికి నేను యిది చేస్తున్నాను అనే కర్తృత్వ
అహం కృతః భావన, బుద్ధి లేదో ఎవనియొక్క బుద్ధి కర్మ
న+భావః+యస్య+ ఫలితమునందు అంటదో
బుద్ధిః+న+లిప్యతే

సః+ఇమాన్+లోకాన్+ = అట్టివాడు ఎవరినైనా ఒకవేళ ఈ జీవులన్నింటిని
హత్వా+అపి+న+ చంపినను హంతకుడు కాడు, కర్మలచే కట్టుబడడు.
న+హంతి+న+నిబధ్యతే

...... ❖ ❖ ❖ ......

జ్ఞానము - జ్ఞేయము - పరిజ్ఞాత

**జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా । త్రివిధా కర్మచోదనా ।**
**కరణం కర్మ కర్తేతి । త్రివిధః కర్మ సంగ్రహః ॥ 18**

జ్ఞానమ్ – జ్ఞేయమ్ – పరిజ్ఞాతా – త్రివిధా – కర్మచోదనా
కరణమ్ – కర్మ – కర్తా – ఇతి – త్రివిధః – కర్మ సంగ్రహః

జ్ఞానమ్+జ్ఞేయమ్+ = జ్ఞానము, జ్ఞేయము (తెలియదగినది) జ్ఞాత
పరిజ్ఞాతా+కర్మచోదనా+ (తెలుసుకొనువాడు) అని కర్మ ప్రేరకములు
త్రివిధా మూడు విధములు

| | | |
|---|---|---|
| కర్మ+కర్తా+కరణమ్+ ఇతి+కర్మసంగ్రహః+ త్రివిధః | = | కర్మ, కర్తా, కరణము అని కర్మ సంగ్రహము అని కరణము మూడు విధములు |

...... ❖ ❖ ❖ ......

జ్ఞానము - కర్మ - కర్త

**జ్ఞానం కర్మ చ కర్తా చ । త్రిధైవ గుణభేదతః ।**
**ప్రోచ్యతే గుణ సంఖ్యానే । యథావచ్ఛృణు తాన్యపి ॥ 19**

జ్ఞానమ్ – కర్మ – చ – కర్తా – చ – త్రిధా – ఏవ – గుణ భేదతః,
ప్రోచ్యతే – గుణ సంఖ్యానే – యథావత్ – శృణు – తాని – అపి.

| | | |
|---|---|---|
| గుణసంఖ్యానే+ గుణ భేదతః+జ్ఞానమ్+ కర్మ+చ+కర్తా+చ+ త్రిధా+ఏవ+ప్రోచ్యతే | = | పైన చెప్పిన జ్ఞానము, కరణములలో సాంఖ్యము నందు త్రిగుణముల భేదముననుసరించి జ్ఞానము, కర్మ, కర్తా యివి మూడు విధములుగ చెప్పబడుచున్నవి |
| తాని+అపి+యధావత్+ శృణు | = | ఆ విధానమును కూడ సాంఖ్య పద్ధతి ప్రకారము చెప్పబడిన వాటిని వినుము. |

...... ❖ ❖ ❖ ......

జ్ఞానము

**సర్వభూతేషు యేనైకం । భావమవ్యయమీక్షతే ।**
**అవిభక్తం విభక్తేషు । తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ 20**

సర్వభూతేషు – యేన – ఏకమ్ – భావమ్ – అవ్యయమ్ – ఈక్షతే
అవిభక్తమ్ – విభక్తేషు – తత్ – జ్ఞానమ్ – విద్ధి – సాత్త్వికమ్

**పృథక్త్వేన తు యద్జ్ఞానం । నానాభావాన్ పృథగ్విధాన్ ।**
**వేత్తి సర్వేషు భూతేషు । తద్జ్ఞానం విద్ధి రాజసమ్ ॥ 21**

పృథక్త్వేన - తు - యత్ - జ్ఞానమ్ - నానాభావాన్ - పృథక్విధాన్
వేత్తి - సర్వేషు - భూతేషు - తత్జ్ఞానమ్ - విద్ధి - రాజసమ్

**యత్తు కృత్స్నవదేకస్మిన్ । కార్యే సక్తమహైతుకమ్ ।**
**అతత్త్వార్థవదల్పం చ । తత్తామసముదాహృతమ్ ॥ 22**

యత్ - తు - కృత్స్నవత్ - ఏకస్మిన్- కార్యే- సక్తమ్- అహైతుకమ్
అతత్త్వార్థవత్ - అల్పమ్ - చ- తత్- తామసమ్-ఉదాహృతమ్

ఏకమ్+అవిభక్తమ్+ = ఒకటిగా నాశన రహితమై అవిభక్తముగా నున్న
అవ్యయమ్+ ఆత్మతత్త్వము సర్వభూతములందు విభక్తమైనట్లుగా
సర్వభూతేషు+విభక్తేషు దృశ్యమాన ప్రపంచమున కనిపించుచున్నదని
యేన+భావమ్+ఈక్షతే+ = ఏ జ్ఞానము చేత సర్వత్రా ఆత్మను దర్శించునో
తత్+జ్ఞానమ్+ ఆ జ్ఞానము సాత్త్విక జ్ఞానమని ఎఱుంగుము
సాత్త్వికమ్+విద్ధి

సర్వేషు+భూతేషు+ = సర్వ భూతములందు ఆత్మతత్త్వము
నానాభావాన్+ వివిధ భావములను అనేక విధములుగను
పృథక్విధాన్+తు+ వేఱు వేఱు విధములతో ప్రవర్తించుచున్నదని
పృథక్+తేన+వేత్తి+ గ్రహించిన ఏ జ్ఞానము కలదో, ఆ జ్ఞానము
యత్+జ్ఞానమ్+ రాజస జ్ఞానమని గ్రహించుము
తత్+జ్ఞానమ్+
రాజసమ్+విద్ధి

అహైతుకమ్+ఏకస్మిన్+ = హేతువు లేకుండా ఒక పని చేయుచున్నప్పుడు
కార్యే+కృత్స్నవత్+ ఆ కార్యభారము సమస్తమును తనే వహించునట్లు

| | | |
|---|---|---|
| సక్తమ్+తు | = | ఆ కార్యమునందు ఆసక్తి గలిగి తనే కర్తనని |
| అ తత్త్వార్థవత్+ అల్పమ్+చ+యత్+ తత్+తామసమ్+ ఉదాహృతమ్ | = | తత్త్వజ్ఞానము లేక మిడిమిడి జ్ఞానము గలిగిన ఏ జ్ఞానము అయితే ఉన్నదో ఆ జ్ఞానము తామస జ్ఞానమని చెప్పబడినది. |

**వ్యాఖ్యానము:-** ఆత్మతత్త్వము ఒకటే. గంగానది ఒకటే. కడవలు వేఱు వేఱు. ఆ కడవలలోగల గంగా జలము ఒకటే. జీవాత్మతత్త్వము ఉపాధిననుసరించి ప్రవర్తించును. ఆత్మతత్త్వము ఒకటే ఉపాధి బేధము తప్ప ఆత్మ బేధము కాదు. కావున సర్వ ఉపాధులలో గల ఆత్మను దర్శించుట సాత్త్వికజ్ఞానము. కేవలము ఉపాధులను దర్శించి భిన్నదృష్టి గలిగి ఆత్మను దర్శించలేక పోవుట రాజసికజ్ఞానము తను కర్తనని భావించుట తామసిక జ్ఞానము.

...... ❖ ❖ ❖ ......

కర్మ

**నియతం సంగరహిత । మరాగ ద్వేషతః కృతమ్ ।**
**అఫల ప్రేప్సునా కర్మ । యత్తత్సాత్త్వికముచ్యతే ॥ 23**

నియతమ్ - సంగరహితమ్ - అరాగద్వేషతః - కృతమ్
అఫల ప్రేప్సునా - కర్మ - యత్ - తత్ - సాత్త్వికమ్ - ఉచ్యతే

**యత్తు కామేప్సునా కర్మ । సాహంకారేణ వా పునః ।**
**క్రియతే బహులాయాసం । తద్రాజసముదాహృతమ్ ॥ 24**

యత్ - తు - కామేప్సునా - కర్మ - సాహంకారేణ - వా - పునః
క్రియతే - బహులాయాసమ్ - తత్ - రాజసమ్ - ఉదాహృతమ్

**అనుబంధం క్షయం హింసా । మనవేక్ష్య చ పౌరుషం ।**
**మోహాదారభ్యతే కర్మ । యత్తత్తామసముచ్యతే ॥ 25**

అనుబంధమ్ – క్షయమ్ – హింసామ్ – అనవేక్ష్య – చ – పౌరుషమ్
మోహాత్ – ఆరభ్యతే – కర్మ – యత్ – తత్ – తామసమ్ – ఉచ్యతే

| | | |
|---|---|---|
| సంగ రహితమ్+ అరాగ ద్వేషతః+ నియతమ్+కర్మ+ అఫల ప్రేప్సునా యత్+కృతమ్+తత్+ సాత్త్వికమ్+ఉచ్యతే | = | ఆసక్తి లేకుండా రాగద్వేషము లేకుండా అతనికి విధింపబడిన కర్మ (అనగా జాతిధర్మములు, ఆశ్రమ ధర్మములు) ఫలాపేక్ష కోరని వాని చేత ఏది చేయబడినదో అది సాత్త్విక కర్మ అని చెప్పబడినది |
| కామేప్సునా+ బహులాయాసమ్+ యత్+కర్మ+తు+ క్రియతే+తత్+ రాజసమ్+ఉదాహృతమ్ | = | ఫలాపేక్ష కోరినవాని చేత అధిక ప్రయాసతో కూడినదియు అగు ఏ కర్మము చేయబడుచున్నదో అది, ఆ కర్మ రాజసమని చెప్పబడినది |
| సాహంకారేణ+పునః+ పౌరుషమ్+హింసామ్+ వా+క్షయమ్+ అనుబంధమ్+ అనవేక్ష్య+చ | = | అహంకారముతో, మఱియు పౌరుషమును హింసను, నాశనమును, ముందు జరగబోవు కార్యమును ముందు వెనుకలు పర్యవసానము ఆలోచింపక |
| మోహాత్+యత్+కర్మ+ ఆరభ్యతే+తత్+ తామసమ్+ఉచ్యతే | = | అజ్ఞానము వలన ఏ కర్మ ప్రారంభింపబడుచున్నదో అది తామస కర్మ అని చెప్పబడినది. |

**వ్యాఖ్యానము :-** ఫలాపేక్ష లేని పుణ్యకర్మ సాత్త్విక కర్మ అనియు, ఫలాపేక్ష గలిగి అధిక ప్రయాసతో చేయబడు పుణ్యకర్మ రాజసిక కర్మ అనియు, ఫలితా ఫలితములను గ్రహింపక పౌరుషముతో, అహంకారముతో పరుల నాశనమునకు ఉద్దేశించి చేయబడు కర్మ తామసికము అని చెప్పబడును.

...... ❖ ❖ ❖ ......

కర్త

**ముక్తసంగోఽనహంవాదీ । ధృత్యుత్సాహసమన్వితః ।**
**సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః । కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ 26**

ముక్త సంగః – అనహమ్ వాదీ – ధృత్యుత్సాహ సమన్వితః
సిద్ధ్య సిద్ధ్యోః – నిర్వికారః – కర్తా – సాత్త్వికః – ఉచ్యతే

**రాగీ కర్మఫల ప్రేప్సుః । లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।**
**హర్ష శోకాన్వితః కర్తా । రాజసః పరికీర్తితః ॥ 27**

రాగీ – కర్మఫల ప్రేప్సుః – లుబ్ధః – హింసాత్మకః – అశుచిః
హర్షశోకాన్వితః – కర్తా – రాజసః – పరికీర్తితః

**అయుక్తః ప్రాకృతః స్తబ్ధః । శఠో నైష్కృతికోఽలసః ।**
**విషాదీ దీర్ఘ సూత్రీ చ । కర్తా తామస ఉచ్యతే ॥ 28**

అయుక్తః – ప్రాకృతః – స్తబ్ధః – శఠః – నైష్కృతికః – అలసః
విషాదీ – దీర్ఘ సూత్రీ – చ – కర్తా – తామసః – ఉచ్యతే

ముక్త సంగః = సంగ రహితుడును

అనహమ్ వాదీ = నేను కర్తను అని భావన లేనివాడు

ధృతిఉత్సాహసమన్వితః = ధృతి, ఉత్సాహముతో కూడినవాడును (ఉత్సాహము ప్రభు మంత్రశక్తి యుతమై ఉండాలి.)

| | | |
|---|---|---|
| సిద్ధ్యసిద్ధ్యోః+నిర్వికారః+ కర్తా+సాత్త్వికః+ఉచ్యతే+ | = | సిద్ధి, సిద్ధి పొందకపోవుట అనే రెండింటియందు నిర్వికారుడు, ఉదాసీనుడు అయిన కర్త సాత్వికుడు అని చెప్పబడును. |
| రాగీ+కర్మఫల ప్రేప్సుః+ కర్తా+రాజసః+పరికీర్తితః | = | అనురాగము గలిగినవాడు కర్మఫలితమును కోరినవాడును (ఆశ్రయించిన వాడును) కర్త రాజస కర్తయని చెప్పబడియున్నాడు. |
| లుబ్ధః+హింసాత్మకః+ అశుచిః+హర్షశోకాన్వితః+ అయుక్తః | = | లుబ్ధుడును హింసాత్మకుడును బాహ్య అభ్యంతర శుచి లేనివాడు హర్షము, శోకముతో కూడినవాడు అయిన జ్ఞానము లేనివాడును |
| ప్రాకృతః+స్తబ్ధః+ శఠః+నైష్కృతికః | = | అజ్ఞానియు మొద్దువాడును మొండివాడును ఇతరుల కార్యములు పాడు చేయువాడును |
| అలసః+విషాదీ+చ+ దీర్ఘసూత్రీ+కర్తా+ తామసః+ఉచ్యతే | = | బద్ధకస్థుడును, దుఃఖపరుడును పనిని సాగదీసి పూర్తి చేయువాడును అయిన కర్త తామస కర్తయని చెప్పబడును. |

**వ్యాఖ్యానము:-** త్రిగుణరహితుడు, ద్వంద్వాతీతుడు పుణ్యఫలితము కోరనివాడు సాత్త్వికకర్త. పుణ్యకర్మ ఫలితమును కోరినవాడు రాజసిక కర్త. లుబ్ధుడు, హింసాపరుడు, అపవిత్రుడు, జ్ఞానవిహీనుడు అయినవాడు తామసికకర్త.

...... ❖ ❖ ❖ ......

బుద్ధి

**బుద్ధేర్భేదం ధృతేశ్చైవ । గుణత స్త్రివిధం శృణు ।**
**ప్రోచ్యమానమశేషేణ । పృథక్త్వేన ధనంజయ ॥ 29**

బుద్ధేః - భేదమ్ - ధృతేః - చ - ఏవ- గుణతః - త్రివిధమ్ - శృణు
ప్రోచ్యమానమ్ - అశేషేణ - పృథక్త్వేన - ధనంజయ

**ప్రవృత్తిం చ నివృత్తిం చ । కార్యాకార్యే భయాభయే ।**

**బన్ధం మోక్షం చ యా వేత్తి । బుద్ధిః సా పార్థ సాత్త్వికీ ॥ 30**

ప్రవృత్తిమ్- చ - నివృత్తిమ్- చ- కార్యాకార్యే - భయాభయే

బంధమ్- మోక్షమ్- చ- యా- వేత్తి- బుద్ధిః- సా- పార్థ- సాత్త్వికీ

**యయా ధర్మమధర్మం చ । కార్యం చాకార్యమేవ చ ।**

**అయథావత్ ప్రజానాతి । బుద్ధిః సా పార్థ రాజసీ ॥ 31**

యయా- ధర్మమ్- అధర్మమ్- చ - కార్యమ్ - అకార్యమ్ - ఏవ- చ

అయథావత్ - ప్రజానాతి - బుద్ధిః - సా - పార్థ - రాజసీ

**అధర్మం ధర్మమితి యా । మన్యతే తమసావృతా ।**

**సర్వార్థాన్ విపరీతాంశ్చ । బుద్ధిః సా పార్థ తామసీ ॥ 32**

అధర్మమ్ - ధర్మమ్ - ఇతి - యా - మన్యతే - తమసా - ఆవృతా

సర్వార్థాన్ - విపరీతాన్ - చ - బుద్ధిః - సా - పార్థ - తామసీ

| | | |
|---|---|---|
| ధనంజయ | = | ఓ అర్జునా! |
| గుణతః+ఏవ+ అశేషేణ+పృథక్త్వేన+ ప్రోచ్యమానమ్ | = | గుణములననుసరించి సంపూర్ణముగాను విడివిడిగను చెప్పబడుచున్నదానిని వినుము. |
| బుద్ధేః+చ+ధృతేః+ | = | బుద్ధి యొక్కయు, ధైర్యము యొక్కయు |
| త్రివిధమ్+భేదమ్+శృణు | = | మూడు బేధములును వినుము. |
| పార్థ | = | ఓ అర్జునా! |
| యా+బుద్ధిః ప్రవృత్తిమ్+చ+నివృత్తిమ్ +చ+కార్యా కార్యే+ భయాభయే+బంధమ్+ చ+మోక్షమ్+వేత్తి | = | ఏ బుద్ధి ప్రవృత్తి మార్గము నివృత్తి మార్గములను చేయకూడని కర్మలు, చేయదగిన కర్మలు, భయము అభయమును బంధమును మోక్షమును తెలుసుకొనునో |

| | | |
|---|---|---|
| సా +సాత్త్వికీ | = | ఆ బుద్ధి సాత్త్విక బుద్ధి అని చెప్పబడును. |
| పార్థ | = | ఓ అర్జునా! ప్రవృత్తికర్మలయందుగల |
| యయా+ధర్మమ్+<br>అధర్మమ్+కార్యమ్+చ+<br>అకార్యమ్+<br>ఏవ+అయథావత్+<br>ప్రజానాతి | = | ఏ బుద్ధి చేత ధర్మము, అధర్మము<br>ఇది చేయతగినది, యిది చేయకూడదు<br>అని గ్రహించక తద్విరుద్ధముగా విపరీతముగా<br>తెలుసుకొనుచున్నాడో |
| సా+బుద్ధిః+రాజసీ | = | ఆ బుద్ధి రాజసబుద్ధి అని గ్రహించుము. |
| పార్థ | = | ఓ అర్జునా! |
| తమసా+ఆవృతా+<br>యా+బుద్ధిః+అధర్మమ్+<br>ధర్మమ్+ఇతి+<br>సర్వార్థాన్+చ+<br>విపరీతాన్+మన్యతే | = | అజ్ఞానముతో కూడుకొన్నదై ఏ బుద్ధి<br>అధర్మమును ధర్మము అని<br>సర్వ విషయములను ఇట్లే యదార్థమునకు<br>విపరీతముగా తలంచుచున్నారో |
| సా+బుద్ధిః+తామసీ | = | ఆ బుద్ధి తామస బుద్ధి అని చెప్పబడును. |

**వ్యాఖ్యానము :-** ప్రవృత్తి, నివృత్తుల రెండింటినీ గ్రహించు బుద్ధి సాత్త్వికబుద్ధి. కేవలము ప్రవృత్తికర్మలగుఱించి తెలిసిన బుద్ధి రాజసము. విపరీతబుద్ధి తామసికము.

...... ❖ ❖ ❖ ......

ధైర్యము

**ధృత్యా యయా ధారయతే । మనః ప్రాణేన్ద్రియా క్రియాః ।**
**యోగేనావ్యభిచారిణ్యా । ధృతి స్సా పార్థ సాత్త్వికీ ॥ 33**

ధృత్యా - యయా - ధారయతే - మనఃప్రాణేన్ద్రియ - క్రియాః,
యోగేన - అవ్యభిచారిణ్యా - ధృతిః - సా - పార్థ - సాత్త్వికీ.

**యయా తు ధర్మ కామార్థాన్ । ధృత్యా ధారయతేఽర్జున ।**
**ప్రసంగేన ఫలాకాంక్షీ । ధృతిస్సా పార్థ రాజసీ ॥ 34**

యయా - తు - ధర్మ కామార్థాన్ - ధృత్యా - ధారయతే - అర్జున
ప్రసంగేన - ఫలాకాంక్షీ - ధృతిః - సా - పార్థ - రాజసీ

**యయా స్వప్నం భయం శోకం । విషాదం మదమేవ చ ।**
**న విముంచతి దుర్మేధా । ధృతిస్సా పార్థ తామసీ ॥ 35**

యయా- స్వప్నమ్- భయమ్- శోకమ్- విషాదమ్- మదమ్- ఏవ- చ
న- విముంచతి- దుర్మేధాః- ధృతిః- సా- పార్థ- తామసీ

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| యయా+ధృత్యా+మనః-ప్రాణఇన్ద్రియక్రియాః+యోగేన+అవ్యభిచారిణ్యా+ధారయతే+సా+ధృతిః+సాత్త్వికీ | = | ఏ ధైర్యముచే మనోప్రాణ ఇంద్రియ క్రియలను ఇతర విషయములను చింతించకుండా యోగముచే నిగ్రహింపబడుచున్నదో ఆ ధృతి సాత్త్వికము |
| పార్థ | = | ఓ పార్థా! |
| యయా+ధృత్యా+ధర్మ కామార్థాన్+తు+ప్రసంగేన+ఫలకాంక్షీ+ధారయతే | | ఏ ధైర్యము చేత ధర్మ అర్థ కామములను మిగుల ఆసక్తితో ఫలాపేక్ష గలవాడై అనుష్ఠించుచున్నాడో |
| సా+ధృతిః+రాజసీ | = | అట్టి ధృతి రాజసమైనది. |
| పార్థ | = | ఓ అర్జునా! |
| యయా+స్వప్నమ్+ | = | ఏ ధృతి చేత తన మనస్సులోని భావములకు ప్రతీక |

| | |
|---|---|
| భయమ్+శోకమ్+ | అయిన స్వప్నము, భయము, శోకము, విషాదము |
| విషాదమ్+మదమ్+ | మదము మొదలైనవాటిని దుర్బుద్ధి గలవాడు |
| ఏవ+చ+దుర్మేదాః+ | వదలక పట్టుకొనునో |
| న+విముంచతి | |
| సా+ధృతిః+తామసీ | = ఆ ధృతి తామసమైనది |

...... ❖ ❖ ❖ ......

సుఖము

**సుఖం త్విదానీం త్రివిధం । శృణు మే భరతర్షభ ।**
**అభ్యాసాద్రమతే యత్ర । దుఃఖాన్తం చ నిగచ్ఛతి ॥ 36**

సుఖమ్ - తు - ఇదానీమ్ - త్రివిధమ్ - శృణు - మే - భరతర్షభ
అభ్యాసాత్ - రమతే - యత్ర - దుఃఖాంతమ్ - చ - నిగచ్ఛతి.

**యత్తదగ్రే విషమివ । పరిణామేఽమృతోపమమ్ ।**
**తత్సుఖం సాత్త్వికం ప్రోక్త । మాత్మబుద్ధి ప్రసాదజమ్ ॥ 37**

యత్ - తత్ - అగ్రే - విషమ్ - ఇవ - పరిణామే - అమృతోపమమ్
తత్ - సుఖమ్ - సాత్త్వికమ్ - ప్రోక్తమ్ - ఆత్మబుద్ధి - ప్రసాదజమ్.

**విషయేన్ద్రియ సంయోగా । ద్యత్తదగ్రేఽమృతోపమం ।**
**పరిణామే విషమివ । తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ 38**

విషయేన్ద్రియ సంయోగాత్- యత్ - తత్- అగ్రే- అమృతోపమమ్,
పరిణామే- విషమ్- ఇవ- తత్- సుఖమ్- రాజసమ్- స్మృతమ్.

**యదగ్రే చానుబన్ధే చ । సుఖం మోహనమాత్మనః ।**
**నిద్రాలస్య ప్రమాదోత్థం । తత్తామసముదాహృతమ్ ॥ 39**

యత్- అగ్రే- చ- అనుబంధే- చ- సుఖమ్- మోహనమ్- ఆత్మనః,
నిద్ర- ఆలస్యప్రమాదోత్థమ్- తత్- తామసమ్- ఉదాహృతమ్.

| | | |
|---|---|---|
| భరతర్షభ | = | ఓ అర్జునా! |
| ఇదానీమ్+సుఖమ్+తు+ మే+శృణు | = | ఇప్పుడు సుఖమును గుఱించి చెప్పుచున్న నా మాటలను వినుము |
| యత్ర+దుఃఖాంతమ్+చ | = | దేనియందు |
| నిగచ్ఛతి+అభ్యాసాత్+ రమతే+త్రివిధమ్ | = | దుఃఖమును పూర్తిగా వదలుచున్నాడో అనగా దుఃఖ నాశనమును పొందుచున్నారో మఱియు దైనందిన అభ్యాసము వలన ఆనందము పొందుచున్నాడో అట్టి సుఖము మూడు విధములు |
| యత్+అగ్రే+ ఆత్మబుద్ధి+ప్రసాదజమ్+ విషమ్+ఇవ | = | ఏది ప్రారంభములో తన నిర్మలమైన బుద్ధి వలన కఠినముగాను విషమువలె ఉండునో |
| తత్+పరిణామే+ అమృతోపమమ్+ తత+సుఖమ్ | = | అదే ఆ తర్వాత కాలక్రమమున హాయిగా అమృతముతో సమానముగానూ ఉండునో అట్టి సుఖము |
| సాత్త్వికమ్+ప్రోక్తమ్ | = | సాత్త్విక సుఖమని చెప్పబడును. |
| యత్+అగ్రే+ విషయేన్ద్రియసంయోగాత్ అమృతోపమమ్+ పరిణామే+తత్+ విషమ్+ఇవ | = | ఏది ప్రారంభములో విషయేంద్రియ సంయోగము వలన అమృత సమానముగా ఉండి కాలక్రమమున విషమువలె ఉండునో |
| తత్+సుఖమ్+ రాజసమ్+స్మృతమ్ | = | ఆ సుఖము రాజస సుఖము అని చెప్పబడును. |

| | | |
|---|---|---|
| యత్+అగ్రే+ఆత్మనః+<br>చ+మోహనమ్+<br>అనుబన్దే+చ+<br>నిద్ర ఆలస్య ప్రమాద+<br>ఉత్థమ్+చ | = | ఏది ప్రారంభములో తన అజ్ఞానముయొక్క అనుబంధము వలన నిద్ర, ఆలస్యము, ప్రమాదము, ప్రమత్తత, అను వాటివలన పుట్టినదో |
| సుఖమ్+తత్+<br>తామసమ్+ఉదాహృతమ్ | = | అట్టి సుఖము తామస సుఖమని చెప్పబడినది. |

...... ❖ ❖ ❖ ......

త్రిగుణములు

**న తదస్తి పృథివ్యాం వా। దివి దేవేషు వా పునః ।**
**సత్త్వం ప్రకృతి జైర్ముక్తం । యదేభిః స్యాత్త్రిభిర్గుణైః ॥ 40**

న- తత్- అస్తి- పృథివ్యామ్- వా- దివి- దేవేషు- వా- పునః
సత్త్వమ్- ప్రకృతిజైః- ముక్తమ్- యత్- ఏభిః- స్యాత్- త్రిభిః- గుణైః

| | | |
|---|---|---|
| ప్రకృతిజైః+ఏభిః+<br>త్రిభిః+గుణైః+ముక్తమ్+<br>సత్త్వమ్+యత్+స్యాత్ | = | ప్రకృతివలన జన్మించిన ఈ మూడు గుణముల చేత విడువబడిన ప్రాణి ఏదో |
| తత్+పృథివ్యామ్+వా+<br>పునః దివి+దేవేషు+వా+<br>న+అస్తి | = | అది భూలోకమునందు గాని లేదా దేవలోకమునందు గాని, దేవతలయందు గాని లేదా మానవులందుగాని, గగనచర జలచరము లందు గాని లేదు అనగా సర్వప్రాణులు గుణయుతులే |

...... ❖ ❖ ❖ ......

చతుర్వర్ణములకు గుణము బట్టి కర్మలు (జాతిధర్మములు) విభజింపబడినవి

**బ్రాహ్మణక్షత్రియ విశాం । శూద్రాణాం చ పరంతప ।**
**కర్మాణి ప్రవిభక్తాని । స్వభావప్రభవైర్గుణైః ॥ 41**

బ్రాహ్మణ– క్షత్రియ– విశామ్– శూద్రాణామ్– చ – పరంతప
కర్మాణి– ప్రవిభక్తాని– స్వభావప్రభవైః– గుణైః

బ్రాహ్మణ వర్ణము యొక్క స్వభావము-కర్మ

**శమో దమస్తపశ్శౌచం । క్షాన్తి రార్జవమేవ చ ।**
**జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం । బ్రహ్మకర్మస్వభావజమ్ ॥ 42**

శమః– దమః – తపః – శ్శౌచమ్ – క్షాంతిః – ఆర్జవమ్ – ఏవ – చ
జ్ఞానమ్– విజ్ఞానమ్ – ఆస్తిక్యమ్ – బ్రహ్మకర్మ–స్వభావజమ్

**శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం । యుద్ధే చాప్యపలాయనమ్ ।**
**దానమీశ్వరభావశ్చ । క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥ 43**

శౌర్యమ్– తేజః– ధృతిః– దాక్ష్యమ్– యుద్ధే– చ–అపి–అపలాయనమ్
దానమ్ – ఈశ్వర భావః – చ – క్షాత్రమ్– కర్మ–స్వభావజమ్

**కృషి గౌరక్ష్య వాణిజ్యం । వైశ్య కర్మ స్వభావజం ।**
**పరిచర్యాత్మకం కర్మ । శూద్ర స్యాపి స్వభావజమ్ ॥ 44**

కృషి – గౌరక్ష్య – వాణిజ్యమ్ – వైశ్య–కర్మ – స్వభావజమ్
పరిచర్యాత్మకమ్ – కర్మ – శూద్రస్య – అపి – స్వభావజమ్

| | | |
|---|---|---|
| పరంతప | = | ఓ అర్జునా! |
| స్వభావప్రభవైః+ గుణైః | = | వారి వారి స్వభావము వలన బుట్టిన గుణములను బట్టి |
| బ్రాహ్మణ+క్షత్రియ విశామ్+చ+ శూద్రాణామ్+కర్మాణి+ ప్రవిభక్తాని | = | బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య మఱియు శూద్రుల కర్మలు విభజింపబడినవి. |
| శమః+దమః+తపః+ క్షాంతిః+శౌచమ్+ జ్ఞానమ్ | = | శమము, దమము, తపస్సు, ఓర్పు, శుచిత్వము, జ్ఞానము, |
| విజ్ఞానమ్+ఆస్తిక్యమ్ | = | విజ్ఞానము, దైవమునందు నమ్మకము |
| ఆర్జవమ్+ఏవ+చ | = | ఋజు ప్రవర్తన, మొదలైనవి బ్రాహ్మణ |
| స్వభావజమ్ | = | స్వభావము - ఈ స్వభావము వలన షట్కర్మలు |
| బ్రహ్మ కర్మ | = | అనగా వేదాధ్యయనము, వేదములు చదివించుట, యజ్ఞములు చేయుట, యజ్ఞములు చేయించుట, దానము ఇచ్చుట, దానము పుచ్చుకొనుటలు బ్రాహ్మణ కర్మగా చెప్పబడినవి |
| తేజః+ధృతి+ ఈశ్వర భావః+చ+ శౌర్యమ్+దాక్ష్యమ్+ యుద్ధే+చ+అపలాయనమ్+ స్వభావజమ్ | = | తేజము, ధైర్యము, ఈశ్వర భావము, శౌర్యము, సామర్థ్యము, యుద్ధము నందు వెనుతిరుగకుండుట అనునవి క్షత్రియ స్వభావము. |
| దానమ్+అపి+క్షాత్రమ్+ కర్మ | = | దానము పుచ్చుకొనకుండుట తప్ప మిగిలిన 5ను క్షత్రియకర్మగా చెప్పబడుచున్నవి. వేదాధ్యయనము, వేదములు చదివించుట, యజ్ఞములు చేయుట, |

| | | |
|---|---|---|
| | | యజ్ఞములు చేయించుట, దానము ఇచ్చుట ఇవి క్షత్రియకర్మ. |
| స్వభావజమ్+కృషి+ గౌరక్ష్య+వాణిజ్యమ్+ వైశ్య+కర్మ | = | వైశ్యస్వభావము వలన పుట్టిన వ్యవసాయము, గోవులను పెంచుట, వ్యాపారము వైశ్య జాతి కర్మలుగా చెప్పబడుచున్నవి |
| స్వభావజమ్+ పరిచర్యాత్మకమ్+అపి శూద్రస్య+కర్మ | = | శూద్రస్వభావము వలన పుట్టిన సేవ శూద్రజాతి కర్మగా చెప్పబడుచున్నవి. |

**వ్యాఖ్యానము :-** 42, 43 శ్లోకములలో బ్రాహ్మణ, క్షత్రియ స్వభావములు చెప్పబడినవి. అయితే వారి కర్మలు చెప్పబడలేదు. అటులనే 44వ శ్లోకములో వైశ్య, శూద్రుల స్వభావము చెప్పలేదు. వారి కర్మలు మాత్రమే చెప్పబడినవి. కావున, వీటిని అధ్యయనము చేయుటకు భాగవతము – సప్తమస్కంధము చదువవలసివుండును. కర్మయోగము 8వ శ్లోకములో – **నియతమ్ కురు కర్మత్వమ్** అని చెప్పినదానికి ఈ శ్లోకము విపుల వ్యాఖ్యానము.

భాగవతము – సప్తమస్కంధము – 412లో బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము, మృదుస్వభావము, శుచిత్వము, తపము, దయ, సత్యము, జ్ఞానము, క్షమ, అవిభక్తి, సంతోషము ఇవి బ్రాహ్మణుల స్వభావములుగా చెప్పబడినవి. అటులనే 413లో శౌర్యము, దానము, ఆత్మనిగ్రహము, అనుగ్రహము, దానము, ధర్మనిష్ఠ, అర్థసంపాదన, తేజము, బుధసేవాకాంక్ష, ఆచార్య సేవ, అచ్యుతారాధన, సత్కార్యము, సంరక్షణ, సంతోషము ఇవి క్షత్రియుల లక్షణములుగా చెప్పబడినవి. అటులనే 414లో ధర్మము, అర్థము, కామముల గుఱించిన వాంఛలు, దేవతలను, బ్రాహ్మణులను సేవించుట, గురువులను సేవించుట, గర్వము లేకుండుట, నిర్మలత్వము, సంతృప్తి ఇవి వైశ్యులయొక్క లక్షణములుగా చెప్పబడినవి. దొంగతనము లేకుండా ఉండుట, శుచి, శుభ్రత కలిగియుండుట, కపటము లేకుండా సేవ చేయుట, మంత్రము చెప్పకుండా పుణ్యకార్యములు చేయుట, పండితులను ఆదరించుట, న్యాయంగా జీవించుట, గోవుల రక్షణ ఇవి శూద్రునియొక్క లక్షణములు.

**కర్మలు :** బ్రాహ్మణులకు యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహంబులు విహితకర్మలు. రాజులకు యజనాది కర్మములైదును, ప్రజాపాలనంబును కర్మంబులు. క్షత్రియులు దానమును స్వీకరించరాదు. అటులనే బ్రాహ్మణుల వద్దనుండి పన్నులు వసూలు చేయరాదు. వైశ్యులకు కృషి, వాణిజ్య, గోరక్షణాది కర్మములు చెప్పబడినవి. అటులనే బ్రాహ్మణ కులమును అనుసరించి సేవించుటయు చెప్పబడినవి. శూద్రునకు మిగిలిన మూడు వర్ణములయొక్క సేవ కర్మగా చెప్పబడినది. జాతిధర్మములు పాటించవలయును కాని, కులాచారవృత్తులైన దొంగతనము, హింస మొదలైనవి వర్జించవలయును.

...... ❖ ❖ ❖ ......

**స్వే స్వే కర్మణ్యభిరతః । సంసిద్ధిం లభతే నరః ।**
**స్వకర్మనిరతః సిద్ధిం । యథా విన్దతి తచ్ఛృణు ॥ 45**

స్వే స్వే - కర్మణి - అభిరతః - సంసిద్ధిమ్ - లభతే - నరః
స్వకర్మ నిరతః - సిద్ధిమ్ - యథా - విందతి - తత్ - శృణు

**యతః ప్రవృత్తిర్భూతానాం । యేన సర్వమిదం తతమ్ ।**
**స్వకర్మణా తమభ్యర్చ్య । సిద్ధిం విన్దతి మానవః ॥ 46**

యతః- ప్రవృత్తిః- భూతానామ్- యేన- సర్వమ్- ఇదమ్- తతమ్
స్వకర్మణా- తమ్ - అభ్యర్చ్య- సిద్ధిమ్ - విన్దతి - మానవః

**శ్రేయాన్ స్వధర్మో విగుణః । పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।**
**స్వభావనియతం కర్మ । కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 47**

శ్రేయాన్ - స్వధర్మః - విగుణః - పరధర్మాత్ - స్వనుష్ఠితాత్
స్వభావ - నియతమ్ - కర్మ - కుర్వన్ - న - ఆప్నోతి - కిల్బిషమ్

**సహజం కర్మ కౌన్తేయ । సదోషమపి న త్యజేత్ ।**
**సర్వారమ్భా హి దోషేణ । ధూమేనాగ్నిరివావృతాః ॥ 48**

సహజమ్ – కర్మ – కౌన్తేయ – సదోషమ్ – అపి – న – త్యజేత్,
సర్వారంభాః – హి – దోషేణ – ధూమేన – అగ్నిః – ఇవ – ఆవృతాః.

| | | |
|---|---|---|
| స్వే స్వే+కర్మణి+ అభిరతః+నరః+ సంసిద్ధిమ్+లభతే | = | వారి వారి జాతి ధర్మములు, ఆశ్రమధర్మములు పాటించుటయందు ఆసక్తిగల మనుజుడు సిద్ధిని పొందుచున్నాడు. |
| స్వకర్మ+నిరతః | = | తన జాతి ధర్మములయందాసక్తి గలవాడు అనగా జాతి, ఆశ్రమధర్మములను పాటించువాడు |
| యథా+సిద్ధిమ్+ విందతి+తత్+శృణు | = | ఏ విధముగా సిద్ధిని పొందుచున్నాడో ఆ విధానమును వినుము |
| స్వకర్మణా | = | వారి వారి జాతిధర్మములలో చెప్పినట్లు జాతి, ఆశ్రమధర్మములను పాటించి త్రిగుణములను వదలి |
| యతః+భూతానామ్+ ప్రవృత్తిః | = | ఏ పరమాత్మ ఈ ప్రాణుల యొక్క ప్రవృత్తిని గలుగచేయుచున్నాడో |
| యేన+ఇదమ్+ సర్వమ్+తతమ్ | = | ఎవని చేత ఈ సర్వము వ్యాపించబడియున్నదో |
| తమ్+అభ్యర్చ్య+ మానవః+సిద్ధిమ్+ విందతి | = | అతనిని అర్చించి మానవులు సిద్ధిని పొందుచున్నారు |
| స్వ అనుష్ఠితాత్+ పరధర్మాత్+విగుణః+ స్వధర్మః+శ్రేయాన్ | = | బాగుగా ఆచరింపబడిన ఇతర జాతిధర్మములకంటె విశిష్ఠ గుణము లేనిది అయినను తన జాతి ధర్మము, అనుష్ఠించుట శ్రేయస్సు |

| | | |
|---|---|---|
| స్వభావ నియతమ్ కర్మ+కుర్వన్+ కిల్బిషమ్+న+ఆప్నోతి | = | తన జాతికి చెప్పబడిన కర్మలను చేయుచున్న యెడల పాపము పొందడు |
| కౌన్తేయ | = | ఓ అర్జునా! |
| సర్వారంభాః+ ధూమేన+అగ్నిః+ఇవ+ దోషేణ+ఆవృతాః | = | సమస్త కర్మలు అనగా సమస్త జాతి ఆశ్రమ కర్మలు పొగచేత, అగ్ని కప్పబడినట్లు దోషముల చేత కూడుకొని యున్నవి. కావున |
| సహజమ్+కర్మ+ సదోషమ్+అపి+హి న+త్యజేత్ | = | తన జాతి ధర్మము దోషపూరితమైనను వదలరాదు. ఆ జాతి ధర్మమునే అనుష్ఠించ వలయును. |

...... ❖ ❖ ❖ ......

**అసక్త బుద్ధి స్సర్వత్ర । జితాత్మా విగత స్పృహః ।**
**నైష్కర్మ్య సిద్ధిం పరమాం । సన్న్యాసేనాధి గచ్ఛతి ॥ 49**

అసక్తబుద్ధిః - సర్వత్ర - జితాత్మా - విగతస్పృహః
నైష్కర్మ్య - సిద్ధిమ్ - పరమామ్ - సన్న్యాసేన - అధిగచ్ఛతి

| | | |
|---|---|---|
| అసక్త బుద్ధిః+జితాత్మా+ విగత స్పృహః+ సన్న్యాసేన+సర్వత్ర | = | ఆసక్తిలేని బుద్ధి గలవాడను ఆత్మనిగ్రహము కలవాడు సుఖదుఃఖాది ద్వంద్వములందు దేహధ్యాస లేని వాడు సర్వకర్మల ఫలత్యాగమును చేసినవాడు సర్వత్ర పరమాత్మను దర్శించినవాడు |
| పరమామ్+నైష్కర్మ్య+ సిద్ధిమ్+అధి గచ్ఛతి | = | గొప్పదైన నిష్కామ కర్మానుష్ఠానపరుడు ఆత్మస్థానమును పొందుచున్నాడు. |

...... ❖ ❖ ❖ ......

ఆత్మస్థానమును పొందువాని లక్షణములు

**సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ । తథా ప్నోతి నిబోధ మే ।**
**సమాసేనైవ కౌన్తేయ । నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ 50**

సిద్ధిమ్- ప్రాప్తః- యథా- బ్రహ్మ- తథా- అప్నోతి- నిబోధ- మే
సమాసేన- ఏవ- కౌన్తేయ- నిష్ఠా- జ్ఞానస్య- యా- పరా

**బుద్ధ్యా విశుద్ధయా యుక్తో । ధృత్యాత్మానం నియమ్య చ ।**
**శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా । రాగద్వేషౌ వ్యుదస్య చ ॥ 51**

బుద్ధ్యా - విశుద్ధయా - యుక్తః - ధృత్వా - ఆత్మానమ్ - నియమ్య- చ
శబ్దాదీన్ - విషయాన్ - త్యక్త్వా - రాగ - ద్వేషౌ - వ్యుదస్య - చ

**వివిక్తసేవీ లఘ్వాశీ । యతవాక్కాయమానసః ।**
**ధ్యానయోగపరోనిత్యం । వైరాగ్యం సముపాశ్రితః ॥ 52**

వివిక్త సేవీ - లఘ్వాశీ - యత వాక్కాయ - మానసః
ధ్యాన యోగ పరః - నిత్యమ్- వైరాగ్యమ్- సముపాశ్రితః

**అహఙ్కారం బలం దర్పం । కామం క్రోధం పరిగ్రహం ।**
**విముచ్య నిర్మమశ్శాన్తో । బ్రహ్మ భూయాయ కల్పతే ॥ 53**

అహంకారమ్- బలమ్- దర్పమ్- కామమ్- క్రోధమ్- పరిగ్రహమ్
విముచ్య - నిర్మమః - శాంతః - బ్రహ్మ భూయాయ - కల్పతే

**బ్రహ్మభూతః ప్రసన్నాత్మా । న శోచతి, న కాంక్షతి ।**
**సమస్సర్వేషు భూతేషు । మద్భక్తిం లభతే పరామ్ ॥ 54**

బ్రహ్మభూతః - ప్రసన్నాత్మా - న - శోచతి - న - కాంక్షతి
సమః - సర్వేషు - భూతేషు - మత్ భక్తిమ్ - లభతే - పరామ్

**భక్త్యా మామభిజానాతి । యావాయశ్చాస్మి తత్త్వతః ।**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా । విశతే తదనన్తరమ్ ॥ 55**

భక్త్యా- మామ్- అభిజానాతి- యావాన్- యః- చ- అస్మి- తత్త్వతః
తతః - మామ్ - తత్త్వతః - జ్ఞాత్వా - విశతే - తదనంతరమ్.

**సర్వకర్మాణ్యపి సదా । కుర్వాణో మద్వ్యపాశ్రయః ।**
**మత్ప్రసాదాదవాప్నోతి । శాశ్వతం పదమవ్యయమ్ ॥ 56**

సర్వ కర్మాణి - అపి - సదా - కుర్వాణః - మద్వ్యపాశ్రయః
మత్ ప్రసాదాత్ - అవాప్నోతి - శాశ్వతమ్ - పదమ్ - అవ్యయమ్

| | | |
|---|---|---|
| కౌన్తేయ | = | ఓ అర్జునా! |
| సిద్ధిమ్+ప్రాప్తః+యథా+ బ్రహ్మ+ఆప్నోతి | = | సిద్ధిని పొంది ఏ విధముగా బ్రహ్మను, బ్రహ్మస్థానమును పొందుచున్నాడో |
| తథా+జ్ఞానస్య+యా+ పరా+నిష్ఠా+సమాసేన+ ఏవ+మే+నిబోధ | = | ఆ విధముగా ఏది గొప్ప జ్ఞాన నిష్ఠ కలదో దానిని సంక్షిప్తముగా నా వలన వినుము. |
| విశుద్ధయా+బుద్ధ్యా+ యుక్తః+ఆత్మానమ్+ ధృత్యా+నియమ్య+చ | = | పరిశుద్ధమైన బుద్ధితో కూడినవాడై తనను తాను ధృతితో నియమించుకొన్నవాడై అనగా ద్వంద్వములకు విచలితుడుగాకుండా ఉన్నవాడై |
| శబ్దాదీన్+విషయాన్+ త్యక్త్వా+చ+రాగద్వేషౌ వ్యుదస్య | = | శబ్దాది విషయములను విడచి మఱియు రాగ ద్వేషములను విడచిపెట్టినవాడై |
| వివిక్త సేవీ | = | ఏకాంతమందు ఉన్నవాడై |
| లఘ్వాశీ | = | మితమైన ఆహారమును తీసికొనుచున్నవాడై |
| యత వాక్కాయ మానసః | = | మనోవాక్కాయములను నియమించినవాడై |

నిత్యమ్+ధ్యానయోగపరః = నిత్యము ధ్యానయోగము చేయుచూ ఉన్నవాడై

వైరాగ్యమ్+సముపాశ్రితః = వైరాగ్యమును ఆశ్రయించినవాడై

అహంకారమ్+బలమ్+ = అహంకారము, బలము, దర్పము, కామము
దర్పమ్+కామమ్+ క్రోధము అపాత్రులనుండి ధన కనక వస్తు
క్రోధమ్+పరిగ్రహమ్+ వాహనాదుల దానము పరిత్యజించినవాడై
విముచ్య

నిర్మమః+శాంతః+ = భార్యాపుత్రాదులందు మమకారములేక
బ్రహ్మభూయాయ+ శాంతుడైనవాడు బ్రహ్మను పొందుటకు
కల్పతే తగియున్నాడు

బ్రహ్మభూతః+ = బ్రాహ్మీస్థితియందున్నవాడును
ప్రసన్నాత్మా+న+శోచతి+ ప్రసన్నమనస్కుడై ఉన్నవాడు దేని గుఱించి
న+కాంక్షతి ఆలోచించడు ఏదీ కావాలని కోరడు

సర్వేషు భూతేషు+ = సర్వభూతములయందు రాగము, ద్వేషము లేక
సమః+పరామ్+ సముడుగా ఉన్నవాడైనవాడు ఉత్కృష్టమైన
మద్భక్తిమ్+లభతే నా భక్తిని పొందుచున్నాడు

మామ్+తత్త్వతః+ = అతడు నన్ను తత్త్వరీత్యా అనగా తత్త్వంతో కూడిన
భక్త్యా+యావాన్+ భక్తి చేత ఎంతటివాడనో యెట్టివాడనో
యః+చ+అస్మి+ గ్రహించుచున్నాడు.
అభిజానాతి

తతః+మామ్+తత్త్వతః+ = అటు పిమ్మట నన్ను తత్త్వరీత్యా
జ్ఞాత్వా+తదనన్తరమ్+ గ్రహించి జీవన్ముక్తుడై అటు పిమ్మట నా యందు
విశతే ప్రవేశించుచున్నాడు

సర్వ కర్మాణి+సదా+ = దేహనిర్వహణకు సంబంధించిన సర్వకర్మలను
కుర్వాణః+అపి+ నిత్యము చేయుచున్నప్పటికి నన్నే ఆశ్రయించి
మద్వ్యపాశ్రయః+ నా యనుగ్రహమున శాశ్వతము, అవ్యయము

| | |
|---|---|
| మత్ప్రసాదాత్+ | అయిన స్థానమును పొందుచున్నాడు. |
| శాశ్వతమ్+అవ్యయమ్+ | |
| పదమ్+అవాప్నోతి | |

...... ❖ ❖ ❖ ......

**చేతసా సర్వ కర్మాణి । మయి సన్న్యస్య మత్పరః ।**

**బుద్ధియోగ ముపాశ్రిత్య । మచ్చిత్త స్సతతం భవ ॥ 57**

చేతసా - సర్వ కర్మాణి - మయి - సన్న్యస్య - మత్పరః,

బుద్ధియోగమ్ - ఉపాశ్రిత్య - మచ్చిత్తః - సతతమ్ - భవ.

**మచ్చిత్తస్సర్వదుర్గాణి । మత్ప్రసాదాత్తరిష్యసి ।**

**అథ చేత్త్వమహంకారాత్ । న శ్రోష్యసి వినంక్ష్యసి ॥ 58**

మచ్చిత్తః - సర్వ దుర్గాణి - మత్ ప్రసాదాత్ - తరిష్యసి

అథ - చేత్ - త్వమ్ - అహంకారాత్ - న - శ్రోష్యసి - వినంక్ష్యసి

| | |
|---|---|
| చేతసా+బుద్ధియోగమ్+ = | వివేకముతో, సాంఖ్యపద్ధతిలో సర్వకర్మలను |
| సర్వకర్మాణి+సన్న్యస్య | సన్న్యసించినవాడవు అగుము. |

**భక్తిపద్ధతిలో :**

| | |
|---|---|
| సతతమ్+ఉపాశ్రిత్య+ = | ఎల్లప్పుడూ నన్నే స్మరించుచూ నన్నే పరమగతిగా |
| మత్పరః+మచ్చిత్తః+ | నమ్మి నా యందు చిత్తమునుంచి సమస్తకర్మలను |
| మయి+భవ | నా యందు సమర్పించినవాడవు అగుము. |
| మచ్చిత్తః+మత్ప్రసాదాత్+= | నా యందు చిత్తము నుంచిన యెడల |
| సర్వ దుర్గాణి+తరిష్యసి | నా అనుగ్రహము వలన సమస్త ఆటంకములను దాటగలవు |
| అథ+త్వమ్+ = | అట్లు గాక నీవు అహంకారము వలన |
| అహంకారాత్+ | నా మాటను వినకపోయినచో జనన మరణ |
| న+శ్రోష్యసి+చేత్+ | వలయములో చిక్కుకొని నశించిపోయెదవు |
| వినంక్ష్యసి | |

కథాపరంగా:

**యదహంకార మాశ్రిత్య । న యోత్స్య ఇతి మన్యసే ।**

**మిథ్యైష వ్యవసాయస్తే । ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥ 59**

యత్ - అహంకారమ్ - ఆశ్రిత్య - న - యోత్స్యే - ఇతి - మన్యసే

మిథ్యా - ఏషః - వ్యవసాయః - తే - ప్రకృతిః - త్వామ్- నియోక్ష్యతి

**స్వభావజేన కౌన్తేయ । నిబద్ధ స్స్వేన కర్మణా ।**

**కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ । కరిష్యస్యవశోఽపి తత్ ॥ 60**

స్వభావజేన- కౌంతేయ- నిబద్ధః- స్వేన- కర్మణా

కర్తుమ్- న- ఇచ్ఛసి- యత్- మోహాత్- కరిష్యసి- అవశః- అపి- తత్

| | | |
|---|---|---|
| యత్+అహంకారమ్+ | = | ఒకవేళ అహంకారమును ఆశ్రయించి |
| ఆశ్రిత్య+న+యోత్స్యే+ | | యుద్ధము చేయను అని తలంచితివేని |
| ఇతి+మన్యసే | | |
| తే+ఏషః+వ్యవసాయః+ | = | నీ యొక్క ఈ ప్రయత్నము |
| మిథ్యా | | వ్యర్థమైనది అగును |
| త్వామ్+ప్రకృతిః+ | = | నిన్ను నీ క్షత్రియ జాతి స్వభావము |
| నియోక్ష్యతి | | యుద్ధము నందు నియోగించును. |
| కౌంతేయ | = | ఓ అర్జునా! |
| స్వభావజేన | = | క్షత్రియధర్మ స్వభావము చేతను నీ యొక్క |
| స్వేన+కర్మణా+నిబద్ధః | | కర్మచేతను బద్ధుడవై |
| మోహాత్+యత్+ | = | అజ్ఞానము వలన యుద్ధమును |
| కర్తుమ్+న+ఇచ్ఛసి+అపి | | చేయుటకు యిచ్ఛగించను అని అన్నప్పటికి |
| తత్+అవశః+ | = | ఆ యుద్ధమున అవశుడవై, పరాధీనుడవై, ప్రకృతికి |
| కరిష్యసి | | అధీనుడవై యుద్ధము చేయుదువు |

...... ❖ ❖ ❖ ......

జీవుడు అస్వతంత్రుడు

**ఈశ్వర స్సర్వ భూతానాం । హృద్దేశేఽ ర్జున తిష్ఠతి ।**

**భ్రామయన్ సర్వభూతాని । యన్త్రారూఢాని మాయయా ॥61**

ఈశ్వరః – సర్వ భూతానామ్ – హృద్దేశే – అర్జున – తిష్ఠతి

భ్రామయన్ – సర్వ భూతాని – యంత్రారూఢాని – మాయయా

**తమేవ శరణం గచ్ఛ । సర్వభావేన భారత!**

**తత్ప్రసాదాత్పరాం శాన్తిం । స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥62**

తమ్ – ఏవ – శరణమ్ – గచ్ఛ – సర్వ భావేన – భారత

తత్ ప్రసాదాత్ – పరామ్ – శాంతిమ్ – స్థానమ్ – ప్రాప్స్యసి – శాశ్వతమ్

| | | |
|---|---|---|
| అర్జున | = | ఓ అర్జునా! |
| యన్త్రారూఢాని | = | తిరుగుడు యంత్రమును ఆశ్రయించిన పక్షి తిరుగునట్లు |
| ఈశ్వరః+మాయయా+ | = | ఈశ్వరుడు స్వకీయమైన మాయచేత |
| సర్వభూతాని+ | | సర్వప్రాణులను త్రిప్పుచూ సర్వప్రాణుల |
| భ్రామయన్+ | | హృదయమునందు ఉన్నాడు |
| స్వభూతానామ్+ | | |
| హృద్దేశే+తిష్ఠతి | | |
| భారత | = | ఓ అర్జునా! |
| సర్వభావేన+తమ్+ఏవ+ | = | నీవు అస్వతంత్రుడవని తలచి సర్వ భావములతో |
| శరణమ్+గచ్ఛ | | ఆ ఈశ్వరునే శరణు పొందుము |
| తత్+ప్రసాదాత్+ | = | ఆ ఈశ్వరానుగ్రహము వలన ఉత్కృష్టమైనదియు |
| పరామ్+శాంతిమ్+ | | పరమశాంతిని, శాశ్వతమైనదియు అగు |
| శాశ్వతమ్+స్థానమ్+ | | పరమపదమును బ్రహ్మస్థానమును |
| ప్రాప్స్యసి | | పొందగలవు |

...... ❖ ❖ ❖ ......

జ్ఞానము

**ఇతి తే జ్ఞానమాఖ్యాతం । గుహ్యాద్గుహ్యతరం మయా ।**
**విమృశ్యైతదశేషేణ । యథేచ్ఛసి తథా కురు ॥ 63**

ఇతి- తే - జ్ఞానమ్- ఆఖ్యాతమ్ - గుహ్యాత్- గుహ్యతరమ్- మయా
విమృశ్య- ఏతత్- అశేషేణ- యథా- ఇచ్ఛసి- తథా- కురు

**సర్వగుహ్యతమం భూయః । శృణు మే పరమం వచః ।**
**ఇష్టోఽసి మే దృఢమితి । తతో వక్ష్యామి తే హితమ్ ॥ 64**

సర్వ గుహ్య తమమ్- భూయః- శృణు- మే- పరమమ్ - వచః
ఇష్టః- అసి- మే- దృఢమ్- ఇతి- తతః- వక్ష్యామి- తే- హితమ్

**మన్మనా భవ మద్భక్తో । మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి సత్యం తే । ప్రతిజానే ప్రియోఽసి మే ॥ 65**

మన్మనాః- భవ- మద్భక్తః- మద్యాజీ- మామ్- నమస్కురు
మామ్- ఏవ- ఏష్యసి- సత్యమ్- తే- ప్రతిజానే- ప్రియః- అసి- మే

**సర్వ ధర్మాన్ పరిత్యజ్య । మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో । మోక్షయిష్యామి మా శుచః ॥66**

సర్వధర్మాన్ - పరిత్యజ్య- మామ్- ఏకమ్- శరణమ్- వ్రజ
అహమ్- త్వా - సర్వపాపేభ్యః- మోక్షయిష్యామి- మా - శుచః

తే+మయా+ = నీకు నా చేత రహస్యములలోకెల్ల మిక్కిలి
గుహ్యాత్+గుహ్యతరమ్+ రహస్యమైన జ్ఞానము చెప్పబడినది
జ్ఞానమ్+ఆఖ్యాతమ్+ఇతి

| | | |
|---|---|---|
| ఏతత్+అశేషేణ+ | = | దీనిని బాగుగా మననము చేసి, |
| విమృశ్య+యథా+ | | ఏ విధముగా చేయాలనుకుంటే - ఏ పద్ధతిని |
| ఇచ్ఛసి+తథా+కురు | | అనుష్ఠించవలయు నని భావింతువో ఆ విధముగా చేయుము |
| పరమమ్+ | = | ఉత్కృష్ట మైనదియు, రహస్యములలోకెల్ల మిక్కిలి |
| సర్వ గుహ్యతమమ్+ | | రహస్యమైనదియు అగు నా యొక్క వచనమును |
| మే+వచః+భూయః+ శృణు | | మఱియొకసారి వినుము |
| మే+ధృఢమ్+ఇష్టః+అసి | = | నాకు నీవు మిక్కిలి యిష్టుడవు |
| తతః+తే+హితమ్+ | | అందువలన నీ హితమును గుఱించి |
| వక్ష్యామి+ఇతి | | మఱియొకసారి చెప్పుచున్నాను వినుము. |
| మే+ప్రియః+అసి+ | = | నాకు నీవు మిక్కిలి ఇష్టుడవని మఱల నీకు |
| సత్యమ్+ప్రతిజానే+తే | | సత్యమును చెప్పుచున్నాను |

**కర్మయోగము :**

| | | |
|---|---|---|
| మద్యాజీ | = | నా గుఱించి యజ్ఞము చేయుము |

**భక్తి :**

| | | |
|---|---|---|
| మన్మనాః+భవ+ | = | నాకు నమస్కరించుము. నా భక్తుడవగుము. |
| మద్భక్తః+మామ్+ నమస్కురు | | నాయందు నీ మనస్సు యుంచుము |
| మామ్+ఏవ+ఏష్యసి | = | ఆవిధముగా చేసిన నన్నే పొందగలవు. |
| సర్వధర్మాన్ | = | సమస్త ధర్మములను ఆచరించి |
| పరిత్యజ్య+మామ్+ | = | ప్రకృతిని పరిత్యజించి నన్ను ఒక్కనినే |
| ఏకమ్+శరణమ్+వ్రజ | = | శరణు కోరుము |
| అహమ్+త్వా | = | నేను నిన్ను |

సర్వ పాపేభ్యః = సర్వపాపముల నుంచి అనగా జననమరణ వలయమునుండి

మోక్షయిష్యామి = విడిపించెదను బంధ విముక్తి చేసెదను.

మా+శుచః = సంసారబంధ విముక్తికై ఆలోచింపకుము

...... ❖ ❖ ❖......

గీత ఎవరికి చెప్పాలి

**ఇదం తే నా తపస్కాయ । నాభక్తాయ కదాచన ।**

**న చాశుశ్రూషవే వాచ్యం । న చ మాం యోఽభ్యసూయతి ॥ 67**

ఇదమ్ - తే - న - అతపస్కాయ - అభక్తాయ - కదాచన

న- చ- అశుశ్రూషవే- వాచ్యమ్- న- చ- మామ్- అభ్య సూయతి

**య ఇమం పరమం గుహ్యం । మద్భక్తేష్వభిధాస్యతి ।**

**భక్తిం మయి పరాం కృత్వా । మామేవైష్యత్య సంశయః ॥ 68**

యః- ఇమమ్- పరమమ్- గుహ్యమ్- మద్భక్తేషు- అభిధాస్యతి

భక్తిమ్- మయి- పరామ్- కృత్వా- మామ్- ఏవ- ఏష్యతి- అసంశయః

**న చ తస్మా న్మనుష్యేషు । కశ్చిన్మే ప్రియకృత్తమః ।**

**భవితా న చ మే తస్మా । దన్యః ప్రియతరో భువి ॥ 69**

న - చ - తస్మాత్- మనుష్యేషు- కశ్చిత్-మే- ప్రియకృత్తమః

భవితా- న- చ - మే - తస్మాత్- అన్యః - ప్రియతరః - భువి

**అధ్యేష్యతే చ య ఇమం । ధర్మ్యం సంవాదమావయోః ।**

**జ్ఞానయజ్ఞేన తేనాహ । మిష్టస్స్యామితి మే మతిః ॥ 70**

అధ్యేష్యతే- చ- య- ఇమమ్- ధర్మ్యమ్- సంవాదమ్- మావయోః

జ్ఞాన యజ్ఞేన- తేన- అహమ్-ఇష్టః-స్యామ్-ఇతి

**శ్రద్ధవా ననసూయశ్చ । శృణుయాదపి యో నరః ।**
**సోపిముక్త శ్శుభాన్లోకా । న్ప్రాప్నుయా త్పుణ్య కర్మణామ్ ॥71**

శ్రద్ధావాన్- అనసూయః- చ- శృణుయాత్- అపి- యః-నరః
సః- అపి- ముక్తః- శుభాన్- లోకాన్- ప్రాప్నుయాత్- పుణ్యకర్మణామ్

తే+ఇదమ్+కదాచన+ = నీకు చెప్పిన ఈ బ్రహ్మవిద్యను ఎన్నడును
న+అతపస్కాయ+ తపస్సు చేయనివానికి భక్తుడు గానివానికి
న+అభక్తాయ+చ+ గురుశుశ్రూష చేయనివానికి ఎవడు నన్ను
న+అశుశ్రూషతే+చ+ నిందించునో అట్టివానికి చెప్పరాదు
యః+మామ్+
అభ్యసూయతి+న+
వాచ్యమ్

చ = మఱియు

యః+ఇమమ్+ = ఎవడు తను ఆచరించి, ఈ అతి రహస్యమైన
పరమమ్+గుహ్యమ్+ బ్రహ్మవిద్యను నా భక్తులకు, తపస్సు
మత్భక్తేష+అభిదాస్యతి చేయువానికి, గురుశుశ్రూష చేయువానికి
ఈ బ్రహ్మవిద్యను ఆచరించవలయుననే భావన
గలవానికి, ఉపదేశించునో అతడు

మే+ప్రియకృత్తమః+న = నాకు ప్రియము నొనర్చువాడు
తస్మాత్+మే+భువి+ అందువలన నాకు ఈ లోకములో
మనుష్యేషు+కశ్చిత్+ మనుష్యులందు అట్టి ఇష్టుడు
అన్యః+ప్రియతరః+ యింకొకడు ఉండబోడు
న+భవితా

తస్మాత్ = అందువలన అర్హులకు దీనిని ఉపదేశించ వలయును

| | | |
|---|---|---|
| మయి+పరామ్+<br>భక్తిమ్+కృత్వా+<br>మామ్+ఏవ+ఏష్యతి+<br>అసంశయః | = | నాయందు భక్తి గలిగియున్నవారు<br>నన్నే పొందుదురు. ఇందు సందేహములేదు. |
| మే+మతిః | = | నా అభిప్రాయము ప్రకారము |
| ధర్మ్యమ్+ఆవయోః+<br>ఇమమ్+సంవాదమ్ | = | ధర్మ సంబంధమైన, తత్త్వసంబంధమైన మన<br>యిద్దఱి ఈ సంభాషణము |
| యః+అధ్యేష్యతే+చ+<br>తేన+జ్ఞానయజ్ఞేన+<br>అహమ్+ఇష్టః+స్యామ్+<br>ఇతి | = | ఎవడు అధ్యయనము చేసి ఆచరించునో<br>వాని జ్ఞానయజ్ఞముచేత<br>నేను సంతృప్తి పొందినవాడిని అగుదును. |
| యః+నరః+<br>శ్రద్ధావాన్+చ+<br>అనసూయః+అపి | = | ఎవడు తపస్సు, భక్తి, గురు శుశ్రూష చేయువాడై<br>శ్రద్ధావంతుడై అసూయలేనివాడై సంసార<br>తాపత్రయములను వదలి |
| శృణుయాత్ | = | అతని గురువు వలన దీనిని విని ఆచరించునో |
| సః+అపి+ముక్తః+<br>పుణ్యకర్మణామ్ | = | వాడు కూడ బంధవిముక్తుడై<br>పుణ్యకర్మలయొక్క ఫలత్యాగము వలన |
| శుభాన్+లోకాన్+<br>ప్రాప్నుయాత్ | = | పుణ్యలోకములను<br>పొందును. |

...... ❖ ❖ ❖ ......

**కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ । త్వయైకాగ్రేణ చేతసా ।**
**కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ ॥ 72**

కచ్చిత్- ఏతత్- శ్రుతమ్- పార్థ- త్వయా- ఏకాగ్రేణ- చేతసా
కచ్చిత్- అజ్ఞానసమ్మోహః- ప్రణష్టః- తే- ధనంజయ

| | | |
|---|---|---|
| పార్థ | = | ఓ అర్జునా! |
| ఏతత్+త్వయా+ | = | ఇది నీ చేత ఏకాగ్రచిత్తముతో |
| ఏకాగ్రేణ+చేతసా+ | | వినబడినది గదా |
| శ్రుతమ్+కచ్చిత్ | | |
| ధనంజయ | = | ఓ అర్జునా! |
| తే+అజ్ఞాన+సమ్మోహః+ | = | నీ యొక్క అజ్ఞాన జనిత మోహము |
| కచ్చిత్+ప్రణష్ట | | ఏ కొంచెమైనా నశించినదా |

అర్జున ఉవాచ

**నష్టో మోహః స్మృతిర్లబ్ధా । త్వత్ప్రసాదాన్మయాచ్యుత ।**
**స్థితోస్మి గతసన్దేహః । కరిష్యే వచనం తవ ॥ 73**

నష్టః-మోహః-స్మృతి-ఃలబ్ధ్వా-త్వత్-ప్రసాదాత్-మయా-అచ్యుత
స్థితః-అస్మి-గతసందేహః-కరిష్యే-వచనమ్-తవ

| | | |
|---|---|---|
| అచ్యుత | = | ఓ శ్రీకృష్ణా! |
| త్వత్+ప్రసాదాత్+ | = | నీ అనుగ్రహమున నా యొక్క అజ్ఞానము |
| మయా+మోహః+నష్టః+ | | నశించినది జ్ఞానము పొందబడినది |
| స ్మృతిః+లబ్ధా | | |
| గత సందేహః+ | = | సందేహము తొలగి జ్ఞానస్థితిని పొందితిని |
| స్థితః+అస్మి | | |
| తవ+వచనమ్+ | = | మీ యొక్క ఆజ్ఞను పాటించగలను. |
| కరిష్యే | | |

...... ❖ ❖ ❖ ......

సంజయ ఉవాచ

**ఇత్యహం వాసుదేవస్య । పార్థస్య చ మహాత్మనః ।**
**సంవాద మిమ మశ్రౌష । మద్భుతం రోమ హర్షణమ్ ॥ 74**

ఇతి–అహమ్–వాసుదేవస్య–పార్థస్య–చ–మహాత్మనః
సంవాదమ్–ఇమమ్–అశ్రౌషమ్–అద్భుతమ్–రోమహర్షణమ్

**వ్యాస ప్రసాదా చ్ఛ్రుతవా । నేతద్గుహ్య మహం పరం ।**
**యోగం యోగేశ్వరాత్కృష్ణా । త్సాక్షాత్కథయత స్స్వయమ్ ॥75**

వ్యాసప్రసాదాత్–శ్రుతవాన్–ఏతత్–గుహ్యమ్–అహమ్–పరమ్
యోగమ్–యోగేశ్వరాత్–కృష్ణాత్–సాక్షాత్–కథయతః–స్వయమ్

**రాజన్ సంస్మృత్య సంస్మృత్య । సంవాద మిమ మద్భుతం ।**
**కేశవార్జునయోః పుణ్యం । హృష్యామి చ ముహుర్ముహుః ॥ 76**

రాజన్–సంస్మృత్య– సంస్మృత్య–సంవాదమ్–ఇమమ్–అద్భుతమ్
కేశవార్జునయోః–పుణ్యమ్–హృష్యామి–చ–ముహుర్ముహుః

**తచ్చ సంస్మృత్య సంస్మృత్య । రూపమత్యద్భుతం హరేః ।**
**విస్మయో మే మహాన్ రాజన్ । హృష్యామి చ పునఃపునః ॥ 77**

తత్–చ– సంస్మృత్య– సంస్మృత్య– రూపమ్–అతి అద్భుతమ్–హరేః
విస్మయః– మే– మహాన్– రాజన్ – హృష్యామి– చ– పునఃపునః

**యత్ర యోగేశ్వరః కృష్ణో । యత్ర పార్థో ధనుర్ధరః ।**
**తత్ర శ్రీర్విజయో భూతిః । ధ్రువా నీతిర్మతిర్మమ ॥ 78**

యత్ర – యోగేశ్వరః – కృష్ణః – యత్ర – పార్థః – ధనుర్ధరః
తత్ర – శ్రీః – విజయః – భూతిః – ధ్రువా – నీతిః – మతిః–మమ

| | | |
|---|---|---|
| ఇమమ్+అద్భుతమ్+ రోమహర్షణమ్ | = | ఈ అద్భుతమైనదియు, సంతోషముచే గగుర్పాటు గలుగచేయునదియు అయిన |
| మహాత్మనః+వాసుదేవస్య+ పార్థస్య+చ+సంవాదమ్ | = | మహాత్ముడగు శ్రీకృష్ణునకు-అర్జునునకు జరిగిన సంగ్రామము మఱియు జీవనసంగ్రామములోని సంభాషణము |
| అహమ్+అశ్రౌషమ్+ఇతి | = | నేను చక్కగా శ్రద్ధగా వింటిని |
| ఏతత్+గుహ్యమ్+ పరమ్+యోగమ్ | = | ఈ అతి రహస్యమైన గొప్ప యోగశాస్త్రమును |
| సాక్షాత్+యోగేశ్వరాత్+ కృష్ణాత్+కథయతః | = | ప్రత్యక్షముగా యోగీశ్వరుడయిన కృష్ణుని వలన అర్జునునకు చెప్పుచున్న బ్రహ్మవిద్యను |
| స్వయమ్+ వ్యాసప్రసాదాత్+ శ్రుతవాన్ | = | స్వయముగా వ్యాసభగవానుని అనుగ్రహము వలన వింటిని. |
| రాజన్ | = | ఓ ధృతరాష్ట్ర మహారాజా! |
| కేశవార్జునయోః+ ఇమమ్+పుణ్యమ్+ అద్భుతమ్+సంవాదమ్ | = | శ్రీకృష్ణార్జునుల యొక్క పుణ్యమైనదియును అద్భుతమైనదియు అగు సంభాషణను |
| సంస్మృత్య+సంస్మృత్య ముహుఃర్ముహుః+ హృష్యామి | = | తలచి, తలచి మాటిమాటికి ఆనందించుచున్నాను |
| రాజన్ | = | ధృతరాష్ట్ర మహారాజా! |
| హరేః+తత్+పునః+పునః సంస్మృత్య+సంస్మృత్య | = | శ్రీకృష్ణునియొక్క మాటలను మరల మరల తలచి తలచి |

| | | |
|---|---|---|
| చ | = | మఱియు |
| అతి+అద్భుతమ్+చ రూపమ్+మే+విస్మయః+ చ+మహాన్+హృష్యామి | = | ఆయన అద్భుతరూపమును దర్శించి నాకు విస్మయము కలిగినది మఱియు మిక్కిలి ఆనందమును పొందుచున్నాను. |
| యత్ర+యోగేశ్వరః+ కృష్ణః | = | ఎక్కడ యోగేశ్వరుడైన కృష్ణుడు |
| యత్ర+పార్థః+ధనుర్ధరః | = | ఎక్కడ ధనుర్ధారుడైన అర్జునుడు ఉండునో |
| తత్ర | = | అక్కడ |
| శ్రీః+విజయః+భూతిః+ నీతిః+ధ్రువా+మతిర్మమ | = | శ్రీ, విజయము, ఐశ్వర్యము, నీతి మొదలైనవి ధ్రువముగా ఉండునని నాయొక్క అభిప్రాయము అని సంజయుడు ధృతరాష్ట్రునితో పలికెను. |

**కథావిభాగము:-** శ్రీకృష్ణుని ఈ ఉపదేశానంతరము ధర్మరాజు సోదరసహితుడై కాలినడకన భీష్మ, ద్రోణ, కృపాచార్య, శల్యుల వద్దకు వెళ్ళి వారల ఆశీర్వచనములు పొంది మొదటి దినము యుద్ధమును ప్రారంభించెను.

...... ❖ ❖ ❖ ......

# గీతామాహాత్మ్యము

**(భీష్మపర్వము - 43వ అధ్యాయము)**

**గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రసంగ్రహైః ।**

**యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్ వినిఃసృతా ॥ 1**

సాక్షాత్తుగా శ్రీకృష్ణునియొక్క ముఖపద్మములనుండి వెలువడినది. ఈ గీతను చక్కగా కీర్తించవలయును. ఈ గీత ఉండగా ఇక ఇతర శాస్త్రములతో పనిలేదు.

**సర్వశాస్త్రమయీ గీతా సర్వదేవమయో హరిః ।**

**సర్వతీర్థమయీ గంగా సర్వవేదమయో మనుః ॥ 2**

సర్వవేదములు, సర్వశాస్త్రములూ ఈ గీతలో ఉన్నవి. సర్వదేవతలు విరాట్‌లో ఉన్నారు. అన్ని తీర్థములు గంగలో కలవు. దీనిని ఆచరించవలయును.

**గీతా గంగా చ గాయత్రీ గోవిందేతి హృది స్థితే ।**

**చతుర్గకారసంయుక్తే పునర్జన్మ న విద్యతే ॥ 3**

గీత, గంగ, గాయత్రీ, గోవిందుడు అను నాలుగు 'గ'కారములను హృదయములో నిలిపినవానికి జన్మరాహిత్యము కలుగును.

**షట్‌శతాని సవింశాని శ్లోకానాం ప్రాహ కేశవః ।**

**అర్జునః సప్తపంచాశత్ సప్తషష్టిం తు సంజయః ॥ 4**

**ధృతరాష్ట్రః శ్లోకమేకం గీతాయా మానముచ్యతే ।**

ఈ గీతలో 620 శ్లోకములు శ్రీకృష్ణుడు చెప్పెను. అర్జునుడు 57 శ్లోకములు చెప్పెను. 67 శ్లోకములు సంజయుడు చెప్పెను. ధృతరాష్ట్రుడు ఒక శ్లోకమును చెప్పెను. (745 శ్లోకములు వచ్చును. కాని గీతలో 699 శ్లోకములు ఉన్నవి).

**భారతామృతసర్వస్య గీతాయా మథితస్య చ ।**

**సారముద్ధృత్య కృష్ణేన అర్జునస్య ముఖే హుతమ్ ॥ 5**

భారతమనే సముద్రమును మథించి, గీత అనే అమృతమును తీసి, శ్రీకృష్ణుడు అర్జునుని ముఖములో ఉంచినాడు.

...... ❖ ❖ ❖ ......

# అనుబంధములైన వేదవాక్యములు

శాస్త్రపాఠము : సృష్ట్యాదియందుగల ఆత్మ–ఆదిపురుషుడు–విరాట్పురుషుడు;

**ఆత్మ**

**పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చా ప్యధోముఖమ్ । అధో నిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యా ముపరి తిష్ఠతి । జ్వాల మాలా కులం భాతి విశ్వ స్యాయతనం మహత్ । సంతతగ్ం సిరాభిస్తు లంబత్యాకోశ సంనిభమ్ । తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్సర్వం ప్రతిష్ఠితమ్ । తస్య మధ్యే మహా నగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః । సోఽగ్రభుగ్వి భజన్తిష్ఠ న్నాహార మజరః కవిః । తిర్యగూర్ధ్వ మధ శ్శాయీ రశ్మయస్తస్య సన్తతా । సన్తాపయతి స్వం దేహ మాపాద తల మస్తగః । తస్య మధ్యే వహ్ని శిఖా అణీ యోర్ధ్వా వ్యవస్థితః । నీల తోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేన భాస్వరా । నీవార శూక వత్తన్వీ పీతాభా స్వ త్యణూపమా । తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః । స బ్రహ్మ సశివ స్సహరి స్సేన్ద్రసోఽక్షరః పరమ స్స్వరాట్।** (తైత్తిరీయ ఆరణ్యకము – 10వ ప్రపాఠకము–11వ అనువాకము)

ఆత్మస్థానము – అధోముఖముగా ఉన్న తామరమొగ్గలగల హృదయ కోశములో హృదయగత ఆత్మ గలదు. ఈ స్థానము కంఠస్థానమునకు దిగువ, నాభికి పైన కలదు. అందులో అగ్ని ప్రతిష్ఠితమై యున్నది: ప్రకాశము – హృదయకోశములో జ్వాలాసమూహము ఉన్నది. అగ్నిజ్వాలల మధ్యలో ఊర్ధ్వముఖముగా ప్రకాశించుచున్నది. ఈ అగ్ని శరీరమంతా వ్యాపించియున్నది– పరిమాణము : నీవారసూక పరిమాణమున ఉన్నది. అనగా సూక్ష్మాతిసూక్ష్మము. ఇతడే బ్రహ్మ, విష్ణువు, శివుడు, ఇంద్రుడు, అక్షరుడు.

**న తత్ర సూర్యోభాతి న చంద్ర తారకం । నేమా విద్యుతో భాన్తి కుతోఽయ మగ్నిః । తమేవ భాన్త మనుభాతి సర్వం । తస్య భాసా సర్వమిదం విభాతి।** (కఠోపనిషత్తు, పంచమవల్లి 15/ముండకోపనిషత్ – ద్వితీయ ముండకం – ద్వితీయఖండం – 10) ఆత్మస్థానమును సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు ప్రకాశింపచేయజాలవు. అగ్నికూడ ప్రకాశింపచేయజాలదు. ఆత్మ

స్వయంప్రకాశము. కర్మేంద్రియములచేగాని, జ్ఞానేంద్రియములచే గాని, మనస్సుచే గాని ఆత్మను గ్రహింపలేము. (ముండకోపనిషత్ – తృతీయ ముండకం – ప్రథమఖండం – 8) జ్ఞానముచేత, తపస్సుచేత, నిష్కామ పుణ్యకర్మానుష్ఠాన పరుడు నిర్మల మనస్సుచే నిరంతరము ఆత్మను ధ్యానించినవాడు ఆత్మను దర్శించును (ముండకోపనిషత్ – తృతీయముండకం – ప్రథమఖండం – 8) ఆత్మను దర్శించిన పుణ్యపాపములను వదలించుకొని నిర్మలుడై ఆత్మను పొందును (ముండకోపనిషత్ – తృతీయ ముండకం – ప్రథమ ఖండం – 3)

## ఆదిపురుషుడు

**స పర్యగా చ్ఛుక్రం మకాయ మవ్రణ । మస్నావిరగ్ం శుద్ధ మపాప విద్ధమ్ । కవిర్మనీషీ పరిభూః స్వయంభూ । ర్యథా తథ్యతోఽర్థాన్ వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః ॥** (ఈశోపనిషత్ – 8)

పురుషుడు దశదిశలకు వెళ్లును. ఇతనికి మనవలె శరీరములేదు. శరీరములో నరములు, వ్రణములు లేనివాడు. నిష్కళంకుడు. సర్వులకు ఎవరెవరు ఏయే పనులు చేయవలయునో వాటిని విధించును.

## విరాట్పురుషుడు

విరాట్పురుషుని నుండి అగ్ని, ప్రాణము, ఆదిత్యుడు, దిశలు, ఓషధులు, చంద్రుడు, మృత్యువు, జలము కలిగినవి. అవి మానవశరీరములో ముఖమునందు, ముక్కునందు, కన్నులయందు, చెవులయందు, చర్మమునందు, మనస్సునందు, అపానమునందు, శిశ్నమునందు ప్రవేశించినవి – (ఐతరేయ ఉపనిషత్ – ప్రథమాధ్యాయము – ప్రథమఖండము – ద్వితీయఖండము) విరాట్పురుషునివలన ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అనే పంచభూతములు, సర్వదేవగణములు, మానవులు, ఆవులు, గుఱ్ఱములు, ఏనుగులు అనగా సర్వజంతువులు, మృగములు, కంటికి కనిపించని సూక్ష్మజీవులు, గ్రుడ్డునుండి, గర్భమునుండి చెమటవలన భూమినుండి పుట్టిన జీవరాశులు, గాలిలో ఎగురు పక్షులు, జలచరములు, స్థావరములు అనగా సర్వస్థావర జంగమములు కలిగినవి. అటులనే ప్రాణము, మనస్సు, ఆలోచన,

మఱియు మతి, ధృతి, భావస్వాతంత్ర్యము, సంకల్పము, నిలకడ, కామము, స్మృతి, మేధస్సు, అజ్ఞానము, విజ్ఞానము, ప్రజ్ఞానము, సుజ్ఞానము మొదలైన సర్వభావములు, గుణములు కలిగినవి. (ఐతరేయ ఉపనిషత్ – తృతీయాధ్యాయము) విరాట్పురుషుడిని తెలిసినవాడు అనగా ఈ సర్వము బ్రహ్మస్వరూపమని తెలిసినవాడు పుణ్యలోకమును దాటి అమృతత్త్వమును పొందును. ఆత్మయై విరాజిల్లును. (ఐతరేయ ఉపనిషత్ – తృతీయాధ్యాయము)

సృష్టిలో – అంతరాత్మ, జీవుడు, దేహము.

హృదయగత ఆత్మ – అణోఅణీయాన్ (కఠోపనిషత్ – ద్వితీయవల్లి – 20) హృదయగుహలో గల ఆత్మ సూక్ష్మము. హృదయగుహలోగల ఆత్మ వలన ప్రాణము, మనస్సు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు అనగా దేహము పనిచేయుచున్నది. (కేనోపనిషత్ – ప్రథమఖండం – 1). సాక్షి (ముండకోపనిషత్ – తృతీయ ముండకం – ప్రథమఖండం – 1) నిర్మలమనస్సుతో నిరంతరము ధ్యానించినవాడు గుణరహితుడు, హృదయగత ఆత్మను దర్శింతురు. (ముండకోపనిషత్ – తృతీయ ముండకం – ప్రథమఖండం – 8).

జీవుడు – దేవతలకొఱకు విరాట్పురుషుడు మానవదేహమును సృజించి తెచ్చెను. దేవతలు ఇది బాగున్నదని పలికిరి. అంతా విరాట్పురుషుడు దేవతలను మానవదేహంలో ప్రవేశింపుడు అని పలికెను. కావున సృష్టిలో మానవుడు శ్రేష్ఠుడు. మానవదేహంలోనే దేవతలు ఉందురు. జాగ్రదావస్థలో పరమేశ్వరుని మాయచే అన్నపానములను, స్త్రీ సంభోగమును అటులనే అనేక భోగములను పొందుచున్నాడు. సుఖదుఃఖములను పొందుచున్నాడు. స్వప్నావస్థలో స్వకీయ మాయచే సుఖదుఃఖములను పొందుచున్నాడు. సుషుప్త్యావస్థలో సుఖములను పొందుచున్నాడు. మరల జన్మాంతర కర్మయోగంవలన జాగ్రదావస్థకు వచ్చుచున్నాడు. (కైవల్యోపనిషత్ – 12–14). ఈశ్వరుడు, జీవుడు అను రెండు పక్షులు దేహమనే వృక్షమును ఆశ్రయించి యున్నవి. జీవుడు కర్మఫలమును తినుచున్నాడు. ఈశ్వరుడు సాక్షిగా ఉన్నాడు. (ముండకోపనిషత్ – తృతీయ ముండకం – ప్రథమఖండం – 1). దేహత్యాగ కాలమున మానవులు ఏయే కోరికలు మనస్సులో ఉండునో ఆ కోరికల ప్రకారము వారికి పునర్జన్మ

కలుగుచున్నది. ఏ లోకమును కోరునో ఆ లోకములను అతడు పొందుచున్నాడు. అందువలన బ్రహ్మను ధ్యానించిన బ్రహ్మలోకము చేరి బ్రహ్మనుపొందును. (ముండకోపనిషత్ – తృతీయముండకం – ప్రథమఖండం – 10). శ్రేయోమార్గము, ప్రేయోమార్గము అను రెండు మార్గములు కలవు. ధీరుడు శ్రేయోమార్గమును, బుద్ధిహీనుడు యోగక్షేమములకై ప్రేయోమార్గమును ఎన్నుకొనును. (కఠోపనిషత్ – ద్వితీయవల్లి – 2). ఆత్మలోకము చేరి ఆత్మయై విరాజిల్లుట శ్రేయోమార్గము. ఇహలోక, పరలోక సుఖమును కోరుట ప్రేయోమార్గము.

## దేహము

అపరాప్రకృతివలన దేహము వచ్చినది. (ప్రశ్నోపనిషత్ – చతుర్థ ప్రశ్న–8)

## సాధనలు

1. అగ్నిహోత్రము : **యస్యాగ్నిహోత్ర మదర్శ మపౌర్ణమాస। మచాతుర్మాస్య మనాగ్రాయణ మతిథివర్జితం చ। ఆహుత మవైశ్వదేవ మవిధినా హుత। మా సప్తమాంస్తస్య లోకాన్ హినస్తి।** (ముండకోపనిషత్ – ప్రథమ ముండకం – 3)

అగ్నిహోత్రమును సకాలంలో విధివిధానముతో అమావాస్యనాడు చేయవలసిన కర్మ చేయుచూ, పౌర్ణమినాడు కర్మ చేయుచూ, చాతుర్మాస్యములో చేయవలసిన కర్మ చేయుచూ మొదటిసారి పంట వచ్చినప్పుడు చేయవలసిన కర్మ చేయుచూ, వైశ్వదేవము చేయుచూ, అతిథిని ఆదరించుచూ, విధివిహితముగా అగ్నిహోత్రమును చేయవలయును. అలా చేయనిచో అగ్నిహోత్రము అతనియొక్క అటు ఏడు తరములను, ఇటు ఏడు తరములను నాశనము చేయును.

నచికేతాగ్నిని చేసినవాడు జీవన్ముక్తుడై దేహత్యాగానంతరము బ్రహ్మలోకము పొంది సుఖించును. (కఠోపనిషత్ – ప్రథమవల్లి – 18).

**సత్యం వద ధర్మం చర స్వాధ్యాయాన్మా ప్రమదః । మాతృదేవోభవ । పితృదేవోభవ। ఆచార్య దేవోభవ। అతిథి దేవోభవ।** సత్యమును పలుకవలయును, ధర్మమును ఆచరించవలయును, వేదాధ్యయనమును చేయవలయును, తల్లిని గౌరవించవలయును, తండ్రిని గౌరవించవలయును, గురువును పూజించ వలయును, అతిథిని గౌరవించవలయును. దానమును శ్రద్ధయాదేయం, శ్రియాదేయం అనగా శ్రద్ధగా చేయవలయును.

## 'ఓం'కారం

**ధనుర్ గృహీ త్వౌపనిసదం మహాస్త్రం । శరం హ్యుపాసా నిశితం సంధయీత । ఆయమ్య తద్భావ గతేన చేతసా । లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి ॥** (ముండకోపనిషత్ – ద్వితీయ ముండకం – ద్వితీయఖండం – 3).

**ప్రణవో ధనుః శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్యముచ్యతే । అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్ తన్మయో భవేత్ ॥** (ముండకోపనిషత్ – ద్వితీయ ముండకం – ద్వితీయఖండం – 4).

ఓ స్నేహితుడా! ధనుస్సును చేబూని, వాడియైన బాణమును ధనుస్సుకు సంధించి, ఆకర్ణాంతం వింటినారిని లాగి లక్ష్యమును ఛేదించవలయును. సర్వ ఉపనిషత్తులయందు ఓంకారము చెప్పబడినది. అరిషడ్వర్గములను జయించి, శుద్ధసత్త్వగుణము కలిగి నిరంతర ఉపాసనచే ఆత్మ అనే లక్ష్యమును కొట్టవలయునని గ్రహించుము.

ఓంకారము ధనుస్సు, జీవాత్మ బాణము. బ్రహ్మము లక్ష్యము. కావున ధనుర్బాణములను గ్రహించి లక్ష్యమును ఛేదించునట్లు జీవాత్మ ఓంకారమును జపించుచూ, లక్ష్యమైన బ్రహ్మమునందు బాణము నాటుకొనునట్లు చేయవలయును.

## గురువులు

**అవిద్యాయాం బహుధా వర్తమానా । వయం కృతార్థా ఇత్యభిమన్యంతి బాలాః । యత్కర్మిణో న ప్రవేదయంతి రాగాత్ । తేనాతురాః క్షీణలోకాశ్చ్యవన్తే ॥**
బాలురవంటి జ్ఞానశూన్యులైన గురువులు అవిద్యలో ఉంటూ, అనేక పుణ్యకర్మలు చేసి, బ్రహ్మలోకమును పొంది, కృతార్థులమైతిమి అని తలంచెదరు. కానీ పుణ్యము క్షీణించగనే వారు తిరిగి భూలోకమున జన్మింతురు. కావున ఇట్టి గురువులను ఆశ్రయించరాదు.

..... ❖ ❖ ❖ .....

## సింహావలోకనము

వేదములో ఒకే విషయము, ఒకేచోట చెప్పబడదు. కావున వేదములో చెప్పిన విషయములను క్రోడీకరించి అనగా ఒకచోటకు చేర్చి వాటిని ఒక క్రమపద్ధతిలో వుంచి చదివిన విషయము చక్కగా అర్థమగును. వేదములకు విపుల వ్యాఖ్యానములు రామాయణ, భారత, భాగవతములు. కావున భారతాంతర్గత భీష్మపర్వంలో 25వ అధ్యాయము నుండి 42వ అధ్యాయము వఱకు చెప్పినవాటిని కూడా వేదపద్ధతిలో చదివిన విషయము చక్కగా అర్థమగును.

ఏది తెలిసిన ఈ సర్వమూ తెలియునో అది**బ్రహ్మవిద్య** బ్రహ్మవిద్య రహస్యమైనది. ఉత్తమమైనది. పురాతనమైనది. పవిత్రమైనది. నాశము లేనిది. ధర్మయుతమైనది. ఆచరించుటకు సులభమైనది. విద్యల్లోకెల్లా శ్రేష్ఠమైనది. పరవిద్య, అపరవిద్యల సమ్మేళనమైనది. బ్రహ్మవిద్యను తెలుసుకొని ఆచరించిన మానవుడు అమృతుడగును. అశుభములగు జన్మ పరంపరలనుండి విడివడును. ఈ బ్రహ్మవిద్యను సద్గుణములు గలవానికి, ఆత్మస్థానము పొందవలయుననే కోరిక గలవానికి, ఆచరించువానికి చెప్పవలయును. కొన్ని వేలమందిలో ఒకడు మాత్రమే దీనికి అర్హుడు. అసూయాది దుర్గుణములు కలవానికి, ఇహలోక, పరలోక సుఖాపేక్షపరునకు, సంసార తాపత్రయములందు మునిగి తేలుతున్నవానికి, అశ్రద్ధగలవానికి ఈ బ్రహ్మవిద్యను చెప్పరాదు.

బ్రహ్మవిద్య శాస్త్రపాఠముగా, ఆచరణపాఠముగా బోధింతురు.

**1) శాస్త్రపాఠము :** ఇందు పురుషుని గుఱించి అనగా ఆత్మ, అంతరాత్మ, ఆదిపురుషుడు, విరాట్పురుషుడు, అవతారపురుషుడు, జీవపురుషుల గుఱించి చెప్పబడును. అటులనే ప్రకృతిగుఱించి అనగా మాయ, పరాప్రకృతి, అపరాప్రకృతి, అపరాప్రకృతి వలన కలిగిన దేహము, దేహలక్షణములు, ఇంద్రియాదులు మఱియు ప్రకృతివలన కలిగిన త్రిగుణముల గుఱించి చెప్పబడును.

**2) ఆచరణ పాఠము :** దీనినే సాధన అని అందురు. ఇందు పుణ్యకర్మానుష్ఠానము, యోగము, భక్తి అనే కర్మయోగము, అటులనే సాంఖ్యము, బుద్ధియోగము, నైష్కర్మ్యము,

కర్మసన్న్యాసములుగా పిలువబడే జ్ఞానయోగము గురించి, గుణవంతుని లక్షణములు, శాంతిని పొందు విధానము, గుణరహితుడై దేహత్యాగానంతరము ఆత్మయై విరాజిల్లు విధానము చెప్పబడును.

## శాస్త్రపాఠము

**కిం తద్బ్రహ్మ?** ఆత్మయొక్క లక్షణములు ఏమిటి?

**ఆత్మలక్షణములు :** సృష్ట్యాదియందు ఒక్కడు. ఆత్మయొక్క ఆవిర్భావమును దేవతలుకానీ, ఋషులు కానీ తెలియరు. పుట్టుక లేనివాడు. అనగా పుట్టుక, పెరుగుదల లేనివాడు. స్థాణువు. అనాది. సనాతనుడు. నిత్యుడు. శాశ్వతుడు. అక్షరుడు. అమృతుడు. పవిత్రుడు. కవి. సర్వజ్ఞుడు. అవ్యయుడు. నిర్గుణుడు. సాక్షి. బృహత్. సర్వభూతములకు సముడు. అజ్ఞానులకు దూరస్థుడు. జ్ఞానులకు దగ్గరివాడు. సర్వగతుడు. సర్వవ్యాపి. అవిభక్తుడు. ప్రకృతికి, తమస్సుకు పరుడు. ఆత్మస్థానమును సూర్యచంద్ర నక్షత్రములు ప్రకాశింపచేయలేవు. అగ్ని ప్రకాశింపచేయజాలదు. ఆత్మ సూర్యునివలె స్వయంప్రకాశము. సర్వమునకు మూలము. జగత్తుకు ఆధారము. లోకములకు ప్రభువు. సర్వేంద్రియ వివర్జితుడు అయినా సర్వవిషయములను గ్రహించును. జీవులకు పరమగతి. యజ్ఞములందు ప్రతిష్ఠితుడు. యజ్ఞతపస్సాది పుణ్యకర్మలకు భోక్త. జీవులకు ఆశ్రితుడు. శరణు ఇచ్చువాడు. ఆత్మను ఎవరునూ చంపజాలరు. పంచభూతములు ఏమియూ చేయజాలవు. ఆత్మకు పుట్టుక, పెరుగుదల అనే వికారములు లేవు. ఆత్మ గురించి ఉపన్యసించినవానికి, విన్నవానికి తెలియదు. శ్రద్ధాభక్తి, ధ్యానయోగముల ద్వారా ఆత్మను గ్రహించవలయును. ఆత్మను దర్శించినవాడు ఆత్మయై విరాజిల్లును. ఆత్మనే ఉపాసించవలయును. ఆత్మనే సాధనద్వారా తెలియవలయును. ఆత్మయే జ్ఞేయము. నదులు సముద్రములో కలిసి సముద్రమని పిలువబడునట్లు సత్పురుషుడు ఆత్మలో ఏకీభూతుడై ఆత్మయని పిలువబడుచున్నాడు. ఆత్మలో కలియనివారు మిడతలు అగ్నిలోపడి నశించునట్లు నశించిపోవుచున్నారు.

**ఆదిపురుషుడు :** ఆత్మ నిరాకారము. ఆదిపురుషుడు సాకారము. ఆత్మ తనంతతానుగా హిరణ్మయకోశమును నిర్మించుకొని, అందు వసియించి ఆదిపురుషుడైనాడు. కావున నిరాకారముగా ఆత్మగురించి చెప్పిన లక్షణములు

ఆదిపురుషునకు వర్తించును. కావున ఆదిపురుషుడు స్వయంప్రకాశకుడు. అనాది. సనాతనుడు. పురుషోత్తముడు. క్షర, అక్షర పురుషులకంటే గొప్పవాడు. అక్షరుడు. సర్వమునూ శాసించువాడు. జగత్ప్రభువు. యజ్ఞపురుషుడు. యజ్ఞభోక్త.

**కః అధియజ్ఞః?** అధియజ్ఞుడు ఎవడు?

సర్వస్థావర జంగములలో అంతరాత్మగా, హృదయగత ఆత్మగా ఉండువాడు అధియజ్ఞుడు. అధియజ్ఞుడు స్థితికారకుడు. చైతన్యస్వరూపుడు. హృదయగత ఆత్మగా ప్రాణుల హృదయగుహలో ఉండును. చైతన్యస్వరూపుడైన క్షేత్రజ్ఞునివలన జడమైన దేహము పనిచేయుచున్నది. ఇతడు అక్షరుడు. అరూపుడు. సూక్ష్ముడు. సాక్షి. సర్వక్షేత్రములందు కలడు. సర్వక్షేత్రముల గుఱించి తెలిసినవాడు. ఒక సూర్యుడు సమస్త జగత్తును ప్రకాశింప చేయునట్లు హృదయగత ఆత్మ సర్వక్షేత్రమును ప్రకాశింప చేయుచున్నాడు.

**కిం అధ్యాత్మమ్? కిం కర్మ?** అధ్యాత్మమనగా నేమి? విరాట్పురుషుని కర్మ ఎట్టిది?

కార్యాకార్యములను అధికరించి చరించు ఆత్మతత్త్వము అధ్యాత్మము. ఆత్మ స్వకీయమాయచే విరాట్పురుషునిగా ఆవిర్భవించుచున్నాడు.

**విరాట్పురుషుడు :** విరాట్పురుషుడు ప్రకృతి - పురుషుల సమిష్టిరూపము. ఇతడు షోడశ కళాసహితుడు. ధాత, విశ్వతోముఖుడు, భూతేషుడు, జగత్పతి, త్రికాలములందలి విషయములు తెలియును. ఇతని నాలుగు అంశలలో ఒక అంశచేతనే సర్వమును వ్యాపించియున్నాడు. దేవతలకంటే, ఋషులకంటే ముందువాడు. గుణయుతుడు. రజోగుణమును ఆశ్రయించి బ్రహ్మగా సృష్టి చేయుచున్నాడు. సత్త్వగుణము నాశ్రయించి విష్ణువుగా స్థితిని చేయుచున్నాడు. తమోగుణమును ఆశ్రయించి శివునిగా లయము చేయుచున్నాడు. ఆవిధముగా సృష్టి, స్థితి, లయములను చేయుచున్నాడు. ప్రకృతిని ఆవరించియుండును. విరాట్ పురుషుని కర్మ ప్రకృతిని అధిష్ఠించి సృష్టి, స్థితి, లయములనే కర్మలు చేయుచున్నాడు. జీవులను సుఖదుః ఖములందు త్రిప్పుచున్నాడు. ఈ కర్మలయందు ఆసక్తి లేనందున ఈ కర్మలు విరాట్పురుషునకు బంధకారణములు కావు.

**సృష్టి :** విరాట్పురుషుని అధ్యక్షతన అపరాప్రకృతి జీవులయొక్క సర్వ ఉపాధులను సృజియించుచున్నది. పురుషుడు జీవరూపమున, హృదయగత ఆత్మరూపమున దేహములో వసియించుచున్నాడు. ఆవిధముగా ప్రాణి చరించుచున్నది. సర్వజీవులను గుణకర్మవిభాగముచే చాతుర్వర్ణములుగా సృజియించుచున్నాడు. పంటను ఉదాహరణగా తీసుకొని క్షేత్రము ప్రకృతి యనియు, బీజము పురుషుడనియు ఆవిధముగా పంటవలె సర్వ జీవరాశులు గుణకర్మలుగా వచ్చుచున్నవని వివరింపబడినవి. అటులనే స్త్రీ, పురుష సంయోగమువలన వచ్చిన సృష్టిగా, ప్రకృతి యోని యనియు, అందు పురుషుడు తన వీర్యమునుంచగా సృష్టి వచ్చినదనియు వివరింపబడినది. ఆవిధముగా ప్రకృతి తల్లి. పురుషుడు తండ్రి. విరాట్పురుషుడు త్రిమూర్తులుగా అనగా బ్రహ్మవిష్ణుమహేశ్వరులుగా ఆవిర్భవించెను. విరాట్పురుషుని నుండి సర్వదేవతలు, సర్వదేవతాగణములు, దైత్యులు, దానవులు, రాక్షసులు, పితృదేవతలు, ఋషులు, సర్వవేదములు, సామములు, ఛందస్సులు, అధ్యాత్మవిద్య, సర్వభాషలు, సర్వభావములు, సర్వమానవులు, సర్వ మృగ, పక్షి, జంతువులు, సర్వస్థావరములు అనగా ఈ సృష్టియంతయూ కలిగినది. ఈ సర్వమూ విరాట్పురుషుడే. అతడు కానిది పరమాణువు కూడా లేదు.

**స్థితి :** సృష్టించిన ఈ సర్వమూ రథచక్రపు నాభిలో రథచక్రపు ఆకులు అమరియున్నట్లు విరాట్పురుషుని దేహమున ఈ సర్వమూ ఉన్నవి. దీనినే విశ్వరూపసందర్శనమున అర్జునుడు శ్రీకృష్ణునియొక్క విరాట్‌దేహమున చూచినట్లు వర్ణింపబడినది. ఆవిధముగా అతడు ఈ సర్వమునూ ధరించుచున్నాడు. కావున అతడు భర్త.

**లయము :** సృష్టించిన ఈ సర్వమునూ లయకారకునిగా లయకాలమున కాలరూపమున, లయము చేయుచున్నాడు.

**కాలము :** బ్రహ్మకు వేయి యుగములు పగలు. వేయి యుగములు రాత్రి. పగటికాలమున సృష్టి జరుగుచున్నది. రాత్రి కాలమున లయమగుచున్నది.

విరాట్పురుషునకు రెండు రూపములు కలవు. ఒక రూపము అధిదైవకము. ఇది సర్వదేవతారూపము. దీనిని బాహ్యచక్షువులచే దర్శింపలేము. దీనిని జ్ఞాననేత్రముతో

చూడవలయును. ఈవిధముగా అధిదైవిక రూపమును దర్శించినవాడు పరమపదమును పొందును. ఇతడు సర్వదేవతారూపమున సూర్యునిగా తపింపచేయుచున్నాడు. పర్జన్యునిగా వర్షమును కురియించుచున్నాడు. ఆవిధముగా ఒక్కొక్క దేవతారూపమున ఒక్కోపని చేయుచున్నాడు.

**అధిభౌతికరూపము :** ఇందు విశిష్టరూపము లేదా అవతారపురుషులు మఱియు సామాన్య జీవరూపము అని రెండు విధములు. అవతారపురుషుడు విశిష్ట జీవుడు. ధర్మసంస్థాపనకు, అధర్మము ఎక్కువైనపు దుష్టులను శిక్షించుటకు అవతారపురుషుడు ఆవిర్భవించుచున్నాడు. ఈ అవతారములలో చెప్పిన సాధన రహస్యములను గ్రహించి ఆచరించిన జీవన్ముక్తుడై దేహత్యాగానంతరము ఆత్మయగును. ఇదియే అవతార పురుషుల కథలయొక్క ప్రయోజనము.

**జీవపురుషుడు :** సర్వజీవరాశులు ఇతడే అగుటవలన విరాట్పురుషుని అవతారములు అసంఖ్యాకములు. ఇతడు జీవరూపమున భిన్నుడు. కావున జీవులలో భిన్నత్వము కలదు. సర్వజీవులు ఇతడే యగుటవలన అసంఖ్యాకములైన శిరస్సులు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు కలవాడు. జీవపురుషుడుగా విరాట్ గుణయుతుడు. ప్రకృతికి లోబడినవాడు.

**ఈ సర్వమూ విరాట్పురుషుడు అయినప్పుడు విరాట్పురుషుని విభూతులు గ్రహించుట ఎట్లు?**

ఐశ్వర్యయుక్తములైనవి, కాంతి గలవి, శక్తిగలవి అనగా విశిష్టతగలవన్నియూ విరాట్పురుషుని విభూతులుగా గ్రహించవలయును.

**సర్వభావములు విరాట్ నుండి వచ్చినపుడు ఏయే భావములు విరాట్పురుషుని విభూతులుగా గ్రహించవలయును?**

దైవీసంపదగల భావములు అనగా సత్త్వగుణము, జ్ఞానము, పౌరుషము, తేజస్సు, స్మృతి, మేధ, ధృతి, క్షమ మొదలైనవి విరాట్పురుషునియొక్క విభూతులుగా గ్రహించవలయును.

**కిం అధిదైవం?**

జీవుడు అధిదైవము. ఇతడు శాశ్వతుడు. అరూపుడు. సూక్ష్ముడు. బాహ్యచక్షువులకు గోచరము కాదు. అస్త్రశస్త్రములచే చంపబడడు. జీవునికి దేహధ్యాస కలుగగానే తను - ఇతరులు; నేను-నాది; ద్వంద్వభావన కలుగును. కార్పణ్యదోషము వలన స్వజనమునందు మోహము అధికముగా ఉండును. ఇతడు అస్వతంత్రుడు. కర్మాధీనుడు. ఇంద్రియములద్వారా ఇంద్రియార్థములను మనస్సుచే గ్రహించి, సుఖదుఃఖములను పొందుచున్నాడు. గుణములవలన కర్మలు చేయుచూ తను వాటికి కర్తను అని భావించి కర్మబద్ధుడై కర్మఫలితమును పొందుచున్నాడు. జాగ్రదావస్థలో మఱియు స్వప్నావస్థలో సుఖదుఃఖములను పొందుచున్నాడు. (సుషుప్త్యావస్థ గుఱించి ఇందు చెప్పలేదు.) దేహమును వీడుట అనే అవస్థ గుఱించి చెప్పుచూ ఈశ్వరాజ్ఞచే ఈ శరీరమును వదలి జీవుడు తన కర్మానుసారము నూతన శరీరమును పొందుచున్నాడు. వాయువు పూలవాసనను గ్రహించి వెడలునట్లు జీవుడు పుణ్యపాపములను గ్రహించి దేహమునుండి వెడలుచున్నాడు. ఉచ్చ, నీచ, అధమజన్మలు కర్మానుసారము పొందుచున్నాడు. జీవునికి జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యావస్థ, దేహమును వీడుట అనే అవస్థలు కలవు. జాగ్రదావస్థలో వైశ్వానరునిగా ప్రాణవాయువు ద్వారా ఆహారమును గ్రహించి సమానవాయువు ద్వారా ఆహారమును పచనము చేసి, అందలి సారమును శరీరావయవములకు సమానముగా పంచి, అపానవాయువు ద్వారా మలమూత్రములను విసర్జించుచున్నాడు.

**జీవులలోని రకములు :** I) **అవతార పురుషులు** - వీరు ధర్మసంస్థాపనకు ఒక కార్యార్థము అవతరింతురు.

సామాన్య జీవులు - వీరు కర్మానుసారము పుట్టుదురు.

II) **కర్మలననుసరించి:** 1) వ్యర్థజీవి - పుణ్యపాపకర్మలు చేయక సంసారజీవితమును గడుపుచూ వ్యర్థముగా కాలమును గడుపుదురు. వీరు నరకమున బడుదురు. 2) పాపాత్ములు - పుణ్యకర్మలు వేదవిహితముగా చేయకుండా, మఱియు పాపపుపనులు చేయుచూ ఉందురు. వారు నరకమున పడుదురు. 3) పుణ్యాత్ములు- 1. కామ్యకర్మపరులు - వేదవిహితముగా పుణ్యకర్మలు చేసి, పుణ్యఫలితము కోరి

దేహత్యాగానంతరము బ్రహ్మలోకము చేరి, పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మింతురు. 2. నిష్కామకర్మ పరులు – వేదవిహితముగా పుణ్యకర్మలు చేసి పుణ్యఫలితము కోరక దేహత్యాగానంతరము బ్రహ్మలోకము చేరి శాశ్వతముగా అక్కడ వసియించెదరు. వీరు భూలోకమున జన్మింపరు.

III) **మూర్ఖుడు – జ్ఞాని :** 1) మూర్ఖుడు (అజ్ఞాని) – అశ్రద్ధ గలవాడు, సంశయాత్ముడు అయిన వీడు గుణములద్వారా చేయబడు కర్మలకు తను కర్తనని భావించి, కర్మబద్ధుడై ఆ కర్మల ఫలితమును అనుభవించుచున్నాడు. భోక్త యగుచున్నాడు. ఆత్మస్థానమును చేరక నశించిపోవుచున్నాడు. పాపపుణ్యములను అనుభవించుచున్నాడు. 2) జ్ఞాని – ప్రకృతి – పురుషులను, క్షేత్రము–క్షేత్రజ్ఞుని గ్రహించుటయే జ్ఞానము. ఇట్టి జ్ఞానము కలవాడు జ్ఞాని. గుణములవలన కర్మ జరుగుచున్నదని, తను కర్మకు కర్తను కానని తలంచును. పుణ్యకర్మలు చేసి, వాటి ఫలితమును కోరడు. కావున కర్మబద్ధుడు కాడు. బంధవిముక్తుడై, ఆత్మస్థానము చేరి ఆత్మయై విరాజిల్లును. జ్ఞాని కూడా పుణ్యకర్మలు శ్రద్ధగా, వేదవిహితముగా చేయవలయును. అజ్ఞానులకు బుద్ధిభేదము కలిగించరాదు.

IV) **పుణ్యకర్మానుష్ఠానపరులలో కామ్యకర్మపరుడు – నిష్కామకర్మపరుడు:** కామ్యకర్మపరుడు పుణ్యకర్మలు వేదోక్తముగా, శ్రద్ధగా ఆచరించి, ఫలితమును కోరి కర్మబద్ధుడై బ్రహ్మలోకమును చేరియు పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మించుచున్నాడు. నిష్కామకర్మపరుడు పుణ్యకర్మలను వేదోక్తముగాను, శ్రద్ధగాను ఆచరించి పుణ్యఫలితము కోరక బ్రహ్మలోకము చేరును. ఇతడు భూలోకమున తిరిగి జన్మించడు.

V) **యోగపద్ధతి :** ఇందు యోగారూఢుడు, యోగభ్రష్టుడు అని రెండు రకములు. సర్వభూతములయందు ఆత్మను దర్శించి యోగారూఢుడై ఆత్మస్థానము చేరి ఆత్మయై విరాజిల్లును. యోగభ్రష్టుడు తిరిగి జన్మించి యోగమును పూర్తిచేసి, యోగారూఢుడై ఆత్మస్థానమును చేరును.

VI) **భక్తిపద్ధతి :** ఆర్తుడు, అర్థార్థీ, జిజ్ఞాసువు, జ్ఞాని అని నాలుగు రకములు. ఇందు జ్ఞాని శ్రేష్ఠుడు.

VII) **సాంఖ్యపద్ధతి :** జ్ఞాని.

జీవులకు పూర్వజన్మకర్మవలన కాలానుసారము సుఖదుఃఖములు కలుగుచున్నవి.

**జీవులు పయనించు మార్గములు :** 1) పాపులు ధూమ్రమార్గమున పయనించి, నరకమున పడుదురు. 2) పుణ్యఫలితము కోరినవారు దక్షిణాయన మార్గముగా చెప్పబడే పితృయానము, లేక చంద్రయానము ద్వారా పయనించి పుణ్యలోకము చేరి పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మింతురు. 3) పుణ్యఫలితము కోరనివారు ఉత్తరాయణ మార్గమున పయనించి బ్రహ్మలోకము చేరి అచ్చట వసియింతురు. భూలోకమున తిరిగి జన్మించరు. 4) యోగులు జ్యోతిర్మార్గమున పయనించి ఆత్మలో ఏకీభూతులై, ఆత్మయై విరాజిల్లుదురు.

**అపరం భవతః జన్మ వివస్వతః జన్మ పరం త్వం ఆదౌ ప్రోక్తవాన్ ఇతి కథమ్ విజానీయాం?**

శ్రీకృష్ణునిగా నీ జన్మ ఇప్పటిది. సూర్యునియొక్క జన్మ గతములోనిది. అటువంటప్పుడు నీవు సూర్యునకు చెప్పితివన్న ఎట్లు పొసగును?

అనగా ఈ ప్రశ్నద్వారా జీవేశ్వరులకు కల భేదము చెప్పబడుచున్నది. ఈశ్వరునికి గడచిన అన్నిజన్మల జ్ఞానము ఉండును. హృదయగత ఆత్మగా అనేక జన్మలు గతించినవి. జీవునికి గతజన్మల జ్ఞానము ఉండదు. ఆత్మస్థానము చేరి, ఆత్మయై విరాజిల్లనందున జీవునకు అనేక జన్మలు గతించినవి.

...... ❖ ❖ ❖ ......

మాయ, ప్రకృతుల గురించి శాస్త్రపాఠము చెప్పుచున్నాడు.

**మాయ:** పరమేశ్వరుని మాయ దాటశక్యముకానిది. పరమేశ్వరుని శరణు పొందినవారు మాయను దాటుదురు.

**ప్రకృతి :** కార్యాకారణములు ప్రకృతివి. పరాప్రకృతి, అపరాప్రకృతి అని ప్రకృతి రెండు విధములు. విరాట్పురుషుని దేహము పరాప్రకృతికి సంబంధించినది. ఈ దేహమువలననే సర్వస్థావర జంగమములు జనియించి, అందు వసియించి ప్రకృతిలో లయమగుచున్నవి. ప్రకృతివలన దేహము, గుణములు కలిగినవి. ఈ

గుణములు సర్వజీవరాశులను మోహింపచేయుచున్నవి. కావున ఈ ప్రకృతియే మోహిని. గుణములవలన దేహముతో కర్మలు జరుగుచున్నవి.

జీవుల దేహము అపరాప్రకృతికి సంబంధించినది. ఈ దేహము ప్రకృతి, మహత్, అహంకారము, పంచభూతములైన ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి అనే వాటిచే ఏర్పడుచున్నది. ఆవిధముగా ఈ దేహము అష్ట ఆవరణలచే ఆవరింపబడియున్నది. జీవుడు ఒక్కొక్క ఆవరణను దాటి ప్రకృతిని పరిత్యజించిన (సీతాపరిత్యాగము చేసిన) జీవుడు ఈశ్వరుడగును.

**కిం అధిభూతం?** దేహము అధిభూతము. దేహము అపరాప్రకృతివలన కలిగినది. దేహమునకు పుట్టుక, బాల్యము, యౌవనము, ముసలితనము, అనే అవస్థలు మఱియు ఆకలిదప్పికలు, సుఖదుఃఖములు, వ్యాధులు, మృత్యువు అనే షడూర్ములు కలది. జీవుడు దేహముతో మమేకమై రాగద్వేషములు కలిగి ఇంద్రియార్థములతో సుఖదుఃఖములను అనుభవించుచున్నాడు. ఈ దేహమునకు నవద్వారములు కలవు. దేహము ఈ దిగువ నుదహరించిన వాటి సమిష్టి.

దేహములో **1) కర్మేంద్రియములు -5.** ఇవి మనస్సు చెప్పిన పనిని చేయును. **2) జ్ఞానేంద్రియములు - 5.** జ్ఞానేంద్రియములు వాటివాటి ఇంద్రియార్థములపై ప్రసరించును. బలవంతముగా నిగ్రహించినను అవి వాటి ఇంద్రియార్థములపై ప్రసరించి మనస్సును బలవంతముగా లొంగదీసికొనును. జీవుని నిగ్రహమును హరించుచున్నవి. **3) ఇంద్రియార్థములు -5.** బుధుడు ఇంద్రియార్థములతో రమింపడు. **4) ప్రాణములు - 5.** శరీరము నశించిపోకుండా ఈ ప్రాణములు ఉంచుచున్నవి. అటులనే ఆహారమును గ్రహించి, అన్నసారము గ్రహించి మిగిలిన చెత్తను విసర్జించుచున్నవి. **5) అంతఃకరణ చతుష్టయము - 4.** చిత్తము, అహంకారము, మనస్సు, బుద్ధి అనునవి అంతఃకరణ చతుష్టయములు. (ఈ గ్రంథములో చిత్తాహంకారము గుఱించి వివరించలేదు.) మనస్సు - మనస్సు ఇంద్రియార్థములలో సంచరించి జీవునియొక్క ప్రజ్ఞను నశింపచేసి, తుఫానుగాలి సముద్రములో ఓడను ముంచివేయునట్లు జీవునిని సంసారసాగరములో ముంచివేయుచున్నది. మనస్సులో సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము అనే త్రిగుణములు ఉండును.

తమోగుణము, రజోగుణము ద్వారా అరిషడ్వర్గములు కలుగుచున్నవి. సత్త్వగుణ ప్రధానమైన మనస్సులో కామముగాని, కోరికలుగాని ఉండవు.

**చంచలత్వాత్ ఏతస్య స్థితిం అహం న పశ్యామి?**

మనస్సు చంచలస్వభావము గలది. అందువలన మనస్సు నిశ్చలముగా ఉండు స్థితిని నేను కనుగొనలేకున్నాను అన్న ప్రశ్నకు సమాధానముగా అభ్యాస వైరాగ్యముల ద్వారా మనస్సును నిశ్చలముగా ఉంచవచ్చునని చెప్పబడినది.

**బుద్ధి :** అస్థిరబుద్ధి, స్థిరబుద్ధి అని బుద్ధి రెండు విధములు.

**అస్థిరబుద్ధి :** 1) దేహధ్యాసవలన, విషయములను ధ్యానించుటవలన, విషయములందు జీవునికి ఆసక్తి కలుగును. ఆసక్తి వలన కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యములనే అరిషడ్వర్గములు కలుగుచున్నవి. వీటివలన బుద్ధినాశము కలుగుచున్నది. బుద్ధినాశము వలన జీవుడు నశించిపోవుచున్నాడు. 2) ఇంద్రియనిగ్రహము లేనివానికి బుద్ధి స్థిరముగా ఉండదు. స్థిరబుద్ధి లేనివానికి శాంతి ఉండదు.

**స్థిరబుద్ధి :** 1) దేహధ్యాస లేకుండా దేహము నిత్యము కాదని తలంచి, మరణభయము లేకుండా లోకవ్యవహారములందు ఆసక్తి లేకుండా, ఉద్వేగము లేకుండా అరిషడ్వర్గములు, రాగద్వేషములు లేకుండా ద్వంద్వములందు అనగా శత్రుమిత్రాదుల యందు, శుభాశుభములందు, సుఖదుఃఖములయందు సమభావన కలిగి, ద్వంద్వాతీతుడైనవాని బుద్ధి స్థిరబుద్ధి. 2) ఇంద్రియములను నిగ్రహించి, వాటిని స్వాధీనపరచుకొని ఇంద్రియార్థములపై ప్రసరించకుండా చేసినవాడు స్థిరబుద్ధి. ఇతడు ఆత్మానుసంధానము చేసి శాంతిని పొందును.

దేహమును వ్యష్టిలో స్థూలశరీరము, సూక్ష్మశరీరము అని రెండు విధములుగా చెప్పుదురు. ఈ రెండు శరీరములు 7 ఆవరణలు, 19 ముఖములు కలిగి ఉన్నవి. అయిననూ స్థూలశరీరము కంటే సూక్ష్మశరీరము గొప్పది.

**స్థూలశరీరము :** స్థూలశరీరము నశించును. కావున స్థూలశరీరమును కౌరవులుగా చెప్పిరి. ఇందు ఏడుగురు ప్రముఖులు కలరు. వీరినే కౌరవులలోని ఏడుగురు సేనాప్రముఖులుగా చెప్పబడిరి. స్థూలశరీరము కాలి బూడిదగును. కావున కౌరవసేనా

ప్రముఖులకు మహారథులు అనే పదప్రయోగము చేయలేదు. స్థూలశరీరమునకు జలతత్త్వము ముఖ్యము. కావున కౌరవసేనకు గంగాతనయుడైన భీష్ముడు ముఖ్యుడు. స్థూలశరీరమునే కౌరవుల **మానుష వ్యూహము**గా చెప్పిరి. మానవుల శక్తి సామర్థ్యములపై యుద్ధవిజయము ఆధారపడి ఉండును.

**సూక్ష్మశరీరము :** సూక్ష్మశరీరము నశింపదు. దీనిని సాధనచే మనమే నశింపచేయవలయును. సూక్ష్మశరీరమును పాండవులుగా చిత్రీకరింపబడిరి. సూక్ష్మశరీరములోని 17 మంది ముఖ్యులను పాండవపక్షమున గల 17 మంది ప్రముఖులుగా పేర్కొనబడిరి. వీరందఱూ మహారథులు అని చెప్పినారు. సూక్ష్మశరీరమునకు వాయుతత్త్వము అనగా మనస్సు ముఖ్యము. కావున వాయు కుమారుడైన భీముడు ముఖ్యుడు. సూక్ష్మశరీరమునకే **అచలవ్యూహము** అని పేరు. వీరు పాండవులు యుద్ధవిజయమునకై పరమాత్మపై ఆధారపడి ఉండిరి.

**దేహములో దేనికంటే ఏది శ్రేష్ఠము?** దేహములో కర్మేంద్రియముల కంటే జ్ఞానేంద్రియములు, వాటికంటే ఇంద్రియార్థములు, వాటికంటే మనస్సు, మనస్సుకంటే బుద్ధి, బుద్ధికంటే మహత్తు, మహత్తుకంటే ప్రకృతి, ప్రకృతికంటే ఆత్మ శ్రేష్ఠము. ఆత్మకంటే శ్రేష్ఠమైనది ఇంకొకటిలేదు.

**ధర్మక్షేత్రము – కురుక్షేత్రము :** దేహములోని ఇంద్రియములకు, ప్రాణములకు అంతఃకరణచతుష్టయమునకు అనగా వీటన్నింటికీ ఒక్కొక్కదానికి ఒక్కొక్క ధర్మము కలదు. కావున ఇది ధర్మక్షేత్రము. ఈ దేహముతో దేహి కర్మలు చేయుటవలన ఇది కురుక్షేత్రమైనది.

**అయం పురుషః కేన బలాత్ నియోజిత ఇవ కేన ప్రయుక్తః పాపం చరతి?**

అనగా జీవుడు ఎవరిచే బలవంతముగా నియోగింపబడినట్లు పాపమును చేయుచున్నాడు? దీనికి సమాధానముగా మనస్సులోగల తమోగుణము, రజోగుణము వలన కలిగిన అరిషడ్వర్గములవలన, విషయాసక్తుడు అగుటవలన, అస్థిరబుద్ధి కలిగి పాపమును చేయుచున్నాడు అని సమాధానము చెప్పబడినది. ఉదా: రావణుడు కామమువలన సీతను అపహరించి పాపము చేసి నశించిపోయినాడు. దుర్యోధనుడు లోభమువలన పాండవుల రాజ్యమును అపహరించి పాపము చేసి నశించిపోయినాడు.

కామము గురించి: కామము ఎంత అనుభవించినా జీవునికి తృప్తి కలుగుటలేదు. ఇది పూరింపశక్యము కానిది. కామము మహాపాపకారణము. కామముచే జ్ఞానము కప్పబడియున్నది. ఈ కామము జ్ఞానవిజ్ఞానములను నశింపచేయును. కావున జ్ఞానికి ఈ కామము నిత్యవైరిగా గ్రహించవలయును. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఇవి కామమునకు అధిష్ఠానములు.

...... ❖ ❖ ❖ ......

**గుణములు** : ప్రకృతివలన త్రిగుణములు కలిగినవి.

**దైవీసంపద/సత్త్వగుణము :** సత్త్వసంశుద్ధి, భావసంశుద్ధి, శౌచము, బాహ్యేంద్రియ నిగ్రహము, సత్యము, ప్రియము, హితము అయిన వాక్కు ఉద్వేగము లేకుండా సంభాషణ, మౌనము, దయ, మార్దవము, హ్రీ (అకార్యములు చేయుటకు సిగ్గుపడుట), క్షాంతి, క్షమ, త్యాగము, ధృతి, తేజస్సు, జ్ఞానయోగమునందు ఉండుట, ఆర్జవము (మాయ లేకుండా ఋజుప్రవర్తన కలిగియుండుట), స్థైర్యము, అహింస, చిత్తశుద్ధి, నిర్మలత్వము, ఇవి సత్త్వగుణమునకు సంబంధించినవి. సంగరాహిత్యము, ప్రాపంచిక విషయములందు ఆసక్తి లేకుండుట, అపైశునము (చాడీలు చెప్పకుండుట), అద్రోహము, అరిషడ్వర్గములు లేకుండుట, అమానిత్వము (తను గొప్పవాడిననే భావన లేకుండుట), అదంభిత్వము (దంభము లేకుండుట), అచాపలము (చపలత్వము లేకుండుట), అలోలుపత్వము (లోలత్వము లేకుండుట), మమతాహంకారములు లేకుండుట, ఇష్టాయిష్టములు లేకుండుట, ఈషణత్రయములైన ధనేషణ, దారేషణ, పుత్రేషణలు లేకుండుట, రాగద్వేషములు లేకుండుటలు దైవీసంపదగా చెప్పబడును. దైవీసంపద గలవారు దీక్షాసమయమున బ్రహ్మచర్యము, దేవ, ద్విజ, గురు, పెద్దలను సేవించుట, వేదాధ్యయనము, యజ్ఞము, తపస్సు, దానము మొదలైన పుణ్యకర్మలు చేసి, పుణ్యకర్మ ఫలితములు కోరరు. కర్తృత్వభావన లేక కర్మలు చేయుదురు. వీరికి ఆయుర్వృద్ధి, బలము, ఆరోగ్యముగల ఆహారము ఇష్టము.

సత్త్వగుణము యొక్క గొప్పతనము. మనస్సు నిర్మలముగా ఉండును. నిరంతర సుఖము కలుగచేయును. బుద్ధిని ప్రకాశింపచేసి జ్ఞానమును కలుగచేయును. నిర్మలమైనది. సత్త్వగుణము గలవారు సర్వత్రా బ్రహ్మను దర్శింతురు. సత్త్వగుణయుతులు

దేహత్యాగ సమయమున ఊర్ధ్వలోకప్రాప్తి కలిగి పునరావృత్తిరహిత లోకములను పొందుదురు. సత్త్వగుణము సుఖాపేక్ష వలన దేహిని బంధించుచున్నది. అనగా ఆత్మగా విరాజిల్లుటలేదు. ఇతడు తిరిగి భూలోకమున జన్మింపడు.

**రజోగుణము :** కామక్రోధములు రజోగుణమునకు సంబంధించినవి. రజోగుణము రాగాత్మకము. తృష్ణతో కూడియుండును. పుణ్యకర్మాసక్తిని కలిగించును. ఈ గుణమువలన యజ్ఞయాగాది పుణ్యకర్మలు, దానములు వేదవిహితముగాను, శ్రద్ధగాను చేసి ఇహలోక, పరలోక సుఖములను కోరుదురు. ఇంద్రియములద్వారా సుఖమును పొందుదురు. వేదవిహితముగా యజ్ఞములందు దేవతలను పూజింతురు. ఫలము కోరి దానము చేయుదురు. సత్కారము, గౌరవము పొందుటకు తపస్సు చేయుదురు. కార్యములు, అకార్యము తెలియుదురు. ఉపాధినిబట్టి దేహిని చూతురు. ఈ గుణముగలవారికి చేదు, పులుపు, కారము, ఉప్పు, మొదలైన రుచులు మఱియు మిక్కిలి వేడిపదార్థములు, దాహము కలిగించునవి అగు ఆహారము ఇష్టము. ఇహలోక, పరలోక సుఖాపేక్షవలన ఈ గుణముగల దేహి బద్ధుడగుచున్నాడు. దేహత్యాగ సమయమున ఈ గుణమువలన బ్రహ్మలోకము పొంది, పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మించుచున్నాడు.

**తమోగుణము :** మోహము, మదము, మాత్సర్యములు తమోగుణ లక్షణములు.

అసత్యము, విపరీతజ్ఞానము, నిద్ర, ఆలస్యము, సోమరితనము, అశుచి, మూర్ఖపు పట్టుదల, అజ్ఞానము, మరపు, ఏమఱుపాటు, అహంకారము, పౌరుషము, దంభము, దర్పము, అభిమానము, అసూయ, చిత్తభ్రాంతి ఇవి తమోగుణ లక్షణములు. ఈ గుణము గలవారు సుఖభోగములందు మునిగి తేలుచూ, ఆశాపాశబద్ధులై ఉందురు. వీరు శౌచమును పాటింపరు. వీరిలో సదాచారము, మంచిచెడుల జ్ఞానము, ఉండదు. విషాదము, శోకము, భయము, దుర్మదము కలిగియుందురు. వీరు వేదవ్రతములను చేయరు. వేదవిధిని అనుసరించి పుణ్యకర్మలను చేయరు. అనగా దంభము, దర్పము, అశ్రద్ధగా పుణ్యకర్మలు చేయుదురు. నిర్లక్ష్యముగా దానము చేయుదురు. యక్ష, రాక్షస, భూత, ప్రేతగణములను పూజింతురు. అన్యాయముగా ధనము సంపాదింతురు. పాపకర్మలు చేయుదురు. సంసారతాపత్రయములలో మునిగితేలుదురు. నిరంతరము

ఇహలోక చింతనతో జీవితమును గడుపుచూ దేవుడు లేడు అనియు, ప్రకృతి వలన అనగా స్త్రీపురుషులవలన సృష్టి కలిగినదనియూ వాదింతురు. శరీరమును మిక్కిలి కష్టపెడుతూ తపస్సు చేసి ఇతరులకు వినాశమును కలిగింతురు. ధర్మాధర్మములను, కర్తవ్యాకర్తవ్యములను గ్రహించరు. రసవిహీనములైనవి, వండి చాలాసేపు అయినవి, ఆరోగ్యరీత్యా తినకూడని పదార్థములు వీరికి ఇష్టము. ఈ తమోగుణము మోహముచే దేహిని బంధించుచున్నవి. ప్రారంభంలో సుఖముగా ఉన్ననూ చివరకు దుఃఖమును కలిగించును. దేహత్యాగ సమయమున తమోగుణముగలవారు నరకమును పొంది తిరిగి భూలోకమున అసురయోనులయందు, నీచజన్మలయందు పుట్టుచున్నారు.

ఈ రజోగుణము, తమోగుణములనే యమపాశములుగా లేదా అమ్మవారి చేతిలోని పాశములుగా వర్ణింతురు.

...... ❖ ❖ ❖ ......

**ఆచరణపాఠము :** సాధన పద్ధతులపై ప్రశ్నలు.

**1) కర్మణం బుద్ధి జ్యాయసీ చేత్ కిం కర్మణి మాం నియోజయసి**
**యేన అహం శ్రేయః ఆప్నుయాం తత్ ఏకం వద?**

అనగా జ్ఞానయోగము కర్మయోగము కంటే శ్రేష్ఠమైనది అయినచో నన్ను కర్మయోగమునందు ఏల నియమించుచున్నావు? జ్ఞానయోగము, కర్మయోగములనే రెండింటిలో ఏది శ్రేయస్సును కలుగజేయునో ఆ ఒక్కదానినే చెప్పుము?

**సమాధానము :** పూర్వము పరమాత్మచే కర్మణ్యులకు కర్మానుష్ఠానము, యోగము, భక్తి అనే కర్మయోగము; సాంఖ్యులకు బుద్ధియోగము, నైష్కర్మ్యము, కర్మసన్న్యాసము అనే జ్ఞానయోగము చెప్పబడినది. ఈ రెండునూ ఆత్మస్థానము చేరుటకు శ్రేయస్సును కలుగుజేయునవి. అందువలన ఈ రెండునూ శ్రేష్ఠములే. ఈ రెండింటిలో సాధకునికి ఏది ఆచరణసులభమో దానిని ఆచరించవలయును.

**2) కర్మయోగములలో ఒకటైన యోగము మఱియు జ్ఞానయోగములలో ఏది శ్రేయస్సును కలుగజేయును?**

**కర్మణాం సన్న్యాసమ్ పునః యోగం శంససి ఏతయోః యత్**
**శ్రేయః తత్ ఏకం సునిశ్చితం బ్రూహి**

జ్ఞానయోగము గొప్పదని ప్రశంసించుచూ మరల కర్మయోగములోని యోగమును ప్రశంసించుచున్నావు. ఈ రెండింటిలో ఏది శ్రేయస్సును కలుగజేయునో ఆ ఒక్కదానినే చెప్పుము?

**సమాధానము :** సాంఖ్యమున కలుగు ప్రయోజనము, యోగమువలన కలుగు ప్రయోజనము ఒక్కటే యగుటవలన ఈ రెండునూ శ్రేష్ఠములే. ఈ రెండింటివలన సాధకుడు ఆత్మస్థానము చేరుటవలన ఈ రెండూ శ్రేష్ఠములే.

**3) యోగము - భక్తి**

ఆత్మరూపమున నిరాకారముగా ఉపాసించు యోగులు సాకారరూపమున పురుషోత్తముని ఉపాసించు భక్తులు అనగా యోగులు, భక్తులలో ఎవరు శ్రేష్ఠులు.

**సమాధానము :** యోగముచేగాని, భక్తిచేగాని ద్వంద్వాతీతస్థితిని పొంది గుణరహితులైనవారు శ్రేష్ఠులు. కావున యోగులు, భక్తులు ఇరువురూ శ్రేష్ఠులే.

**4) సన్న్యాసము - త్యాగము**

సన్న్యాసము, త్యాగములలోగల భేదమేమి?

**సమాధానము :** కామ్యకర్మలు వదలుట సన్న్యాసము. సన్న్యాసులు పుణ్యకర్మలు చేయవలయును. పుణ్యకర్మలు చేసి పుణ్యఫలితమును కోరకుండుట త్యాగము.

**5) ఏ రూపమున ధ్యానించవలయును?**

**సమాధానము :** నిరాకారముగా ఆత్మను, సాకారరూపమున పురుషోత్తమునిని ధ్యానించవలయును.

**6) దేవతలను, మఱియు ఆత్మను, పురుషోత్తమునుని ధ్యానించిన కలుగు ఫలమేమి?**

**సమాధానము :** ఎవరెవరు ఏయే దేవతలను ధ్యానించుచున్నారో వారు ఆ దేవతలను పొందుచున్నారు. ఆత్మనుగాని, లేదా పురుషోత్తమునిగాని ధ్యానించినవారు ఆత్మయై/బ్రహ్మయై విరాజిల్లుదురు. వీరికి పునర్జన్మ ఉండదు. అమృతులగుదురు.

## కర్మ

ఇహలోకమునకు సంబంధించిన కర్మలు :

1) దేహనిర్వహణ కర్మలు : కాలకృత్యములు, స్నానము, ఆహారము, నిద్ర, గాలి పీల్చుట, వదలుట మొదలైనవి దేహనిర్వహణ కర్మలు. ఇవి చేయకుండా ఎవడునూ ఉండజాలడు.

2) ధనసంపాదన కర్మలు : వృత్తివ్యాపారాదులు ధనము సంపాదించు కర్మలు. ధనమును సంపాదించి స్వజనమును, బంధువులను పోషించవలయును. వారియెడల గల విధులు, బాధ్యతలు నెరవేర్చవలయును. అయితే ఈ కర్మలు కర్మబంధమును కలిగించును.

3) జాతిధర్మములు : చాతుర్వర్ణములు అనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు వారివారి స్వభావమునుబట్టి కర్మలు విధింపబడినవి. కావున ప్రతివారూ తమ తమ జాతిధర్మములను పాటింపవలయును. తమ జాతి ధర్మములు ఆచరించుట శ్రేయస్సును కలుగజేయును. తమ జాతిధర్మములలో దోషములున్ననూ తమ జాతిధర్మములను పాటింపవలయును. ఇతర జాతివారి ధర్మములు పాటింపరాదు. (జాతి ధర్మములలో దొంగతనము మొదలైన పాపపు పనులున్నచో వాటిని చేయరాదని భాగవతము సప్తమస్కంధములో వివరింపబడినది.) బ్రాహ్మణాదివర్ణములవారి స్వభావమును బట్టి వారికి కర్మలు విధింపబడినవి. కలియుగ ప్రభావము వలన జాతిధర్మములు అపభ్రంశము చెందినవి.

4) ఆశ్రమ ధర్మములు : వేదము, పురాణములలో బ్రహ్మచర్యము, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసము అనే నాలుగు ఆశ్రమ ధర్మములు చెప్పబడినవి. ఈ ఆశ్రమ ధర్మముల గుఱించి విపులముగా భాగవతము సప్తమస్కంధములో చెప్పబడినది. కలియుగ లక్షణములుగా ఈ నాలుగు ఆశ్రమ ధర్మములు అపభ్రంశము చెందినవి. కలియుగములో ఈ నాలుగు ఆశ్రమములుగాక మఠాధిపత్యమనే క్రొత్త ఆశ్రమము ఏర్పడినది.

5) పరలోకమునకు సంబంధించిన కర్మలు :

కర్మ–వికర్మ–అకర్మ

**కర్మ :** వేదవిహితముగా, శ్రద్ధగా చేయబడు కర్మను కర్మ అని అందురు.

**వికర్మ :** వేదములో చెప్పినదానికంటే ఎక్కువగా చేయుట అనగా కర్మబాహుళ్యమును వికర్మ అని యందురు.

**అకర్మ :** వేదములో చెప్పబడినట్లుగాక జాతిధర్మముల ప్రకారము విధింపబడని యజ్ఞయాగాది క్రతువులు, దానధర్మములు చేయుట అకర్మ అని చెప్పబడును. ఈ అపభ్రంశమునే అకర్మ అని యందురు. కలియుగములో కృష్ణయజుర్వేదములో చెప్పని యజ్ఞములు, అనర్హులైన యజమాని, ఋత్విక్కులచే చేయబడు కర్మలు అకర్మక్రింద వర్గీకరింపబడును. కలియుగ ప్రభావము వలన అకర్మ వ్యాప్తిలో ఉన్నది. అకర్మ పాపమును కలిగించును. అకర్మ చేయువారు నరకమున బడుదురు.

పుణ్యకర్మలు – పాపకర్మలు :

పుణ్యకర్మలు : స్వాధ్యాయము, యజ్ఞము, తపస్సు, యోగము, భక్తి, సాంఖ్యము, దానము ఇవి పుణ్యకర్మలు. ఈ పుణ్యకర్మలు శాస్త్రవిహితముగా చేయవలయును. శ్రద్ధగా చేయవలయును. ఇవి మానవుని పునీతము చేయును. యజ్ఞములద్వారా దేవతలను యజించిన దేవతలు యజమానియొక్క కోరికలను తీర్చెదరు. ఇహలోక, పరలోక సుఖములను, పుత్రపౌత్రాదులను, ధనకనకవస్తు వాహనాదులను ప్రసాదింతురు. ద్రవ్య యజ్ఞములోని సర్వమూ బ్రహ్మమే. కారేరీ యజ్ఞమువలన వర్షము కలుగును. వర్షములు వలన పంటలు పండి, ప్రాణులకు ఆహారము కలుగుచున్నది. ఆహారమువలన వీర్యము కలుగుచున్నది. వీర్యము వలన మిథున ధర్మసృష్టిలో అనగా స్త్రీ, పురుషుల కలయికవలన ఏ జాతికి చెందినవి ఆ జాతిలో పుట్టుచున్నవి. ఆత్మస్థానము పొందని మానవులు పుట్టి, చచ్చి మరల పుట్టుచున్నారు. ఈవిధముగా జననమరణచక్రము ప్రవర్ధిల్లుచున్నది.

పాపకర్మలు : ధూషణ, పరుషవాక్కు, నింద, చాడీలు చెప్పుట, కొంటె మాటలు, అసత్యము, హింస, వధ, అపాత్రులకు దానమిచ్చుట, అపాత్రులనుండి ధనమును దానముగా పుచ్చుకొనుట, పాపస్థలములైన జూదశాలలు, పానశాలలు,

వేశ్యావాటికలకు వెళ్ళి జూదము, సారాయి, వేశ్యా స్త్రీసంభోగము మొదలైనవి చేయుట, పరాయి స్త్రీని బలాత్కరించి అత్యాచారము చేయుట మొదలైనవి పాపకర్మలు.

యజ్ఞమును చేసి యజ్ఞశిష్టాన్నమును భుజించినవారు శ్రేష్ఠులు. తమ ఉదరపోషణ కొఱకు వండుకొని తినువారు పాపులు. ద్రవ్యయజ్ఞముకంటే జ్ఞానయజ్ఞము శ్రేష్ఠము.

**గుణమునుబట్టి చేయబడు పుణ్యకర్మలు :**

**వేదముననుసరించి చేయు వారి శ్రద్ధయు, శాస్త్రవిధిని పాటింపనివారి శ్రద్ధయు ఎటువంటిది?**

వేదముననుసరించి చేయువాని శ్రద్ధ సాత్త్వికము. శాస్త్రవిధిని పాటింపనివాని శ్రద్ధ తామసికము. ఆవిధముగా పుణ్యకర్మలలో యజ్ఞము, దానము, తపస్సు, జ్ఞానము, కర్త, కర్మ, బుద్ధి, ధృతి, సుఖము, ఆహారము, గుఱించి సాత్త్విక, రాజసిక, తామసికులు చేయు విధివిధానము చెప్పబడినది. దీనినిబట్టి మనము ఏ గుణములకు సంబంధించినవారమో గ్రహించవలసి వుండును.

**పుణ్యకర్మలకు కారణము :** 1) దైవము 2) అధిష్ఠానము 3) కర్త 4) కరణము 5) చేష్టలు ఇవి పుణ్యకర్మకు కారణములు.

(**పాపకర్మలకు కారణములు :** కర్త, కరణము, చేష్టలు, మనస్సులోగల అరిషడ్వర్గములు, అస్థిరబుద్ధి అను ఈ ఐదును కారణములు.)

బంధము, బంధకారణము గాని పుణ్యకర్మలు : 1) ప్రవృత్తి కర్మ/కామ్య కర్మ/ అవ్యవసాయికా బుద్ధి.

ఇది కర్మబంధమును కలుగజేయును. వీరికి నివృత్తికర్మ చేయవలయుననే బుద్ధి కలుగదు. ఇహలోక, పరలోక సుఖాపేక్షపరులు ప్రవృత్తికర్మను చేయుదురు. ప్రవృత్తికర్మలో విశేషమైన కర్మలు, మతభేదము కలదు. వీరు ఆత్మను దర్శింపనందువలన కృపణులు. పూవులు కంటికి ఆనందము కలిగించునట్లు ఈ ప్రవృత్తి కర్మావలంబులైన గురువులు చెవులకు వినసొంపుగా వుండు మాటలను పలుకుదురు. కోరికలు గలవారికి వీరి మాటలు ఇష్టము. పుణ్యకర్మలైన యజ్ఞయాగములు, దానములు మొదలైనవి చేసి ఈ కామ్యకర్మపరులు పుణ్యఫలితము కోరుదురు. అందువలన వీరు కర్మబద్ధులు.

వీరు శాంతిని పొందరు. వీరు బ్రహ్మలోకమును చేరి పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మించుదురు. చండామార్కులు ఈ కోవకు చెందిన గురువులు. రాక్షసులు శిష్యులు.

నివృత్తికర్మ/నిష్కామకర్మ/ వ్యవసాయాత్మకాబుద్ధి : ఇది కర్మబంధమును కలుగచేయదు. ఆత్మస్థానమును చేరదలచినవారు నిష్కామకర్మ చేయుదురు. ఇందు విశేషకర్మలు, మతభేదము ఉండదు. అందరునూ ఒకే మాటను చెప్పుదురు. నివృత్తికర్మలో పుణ్యకర్మలు ఏ కొంచెము ఆచరించినా జననమరణ వలయమునుండి విడివడి మృత్యుభయము నుండి విడివడుదురు. యజ్ఞయాగాది పుణ్యకర్మలు చేసి పుణ్యఫలితమును దేవతలకు సమర్పింతురు. దేవతలు తిరిగి ప్రసాదించినవాటిని అనుభవింతురు. మోహమాలిన్యము తొలగుటవలన వీరిలో కోరికలు వుండవు. వేదమునందు చెప్పబడిన ప్రయోజనము నిష్కామకర్మయందు ప్రతిష్ఠితము. నిష్కామకర్మపరుడు కర్మబద్ధుడు కాడు. శాంతిని పొందును.

**ఉపదేశము :** పుణ్యకర్మలు చేయవలయును. కానీ పుణ్యఫలితమును కోరరాదు. ఫలాపేక్ష లేనివాడు, ద్వంద్వాతీతుడు, గుణరహితుడు, పుణ్యకర్మలు చేసిననూ కర్మబద్ధుడు కాడు. వీరు శాంతిని పొందుదురు. దేహత్యాగానంతరం బ్రహ్మయై విరాజిల్లుదురు.

## యోగము

చిత్తవృత్తి నిరోధము యోగము అని పతంజలి మహర్షి చెప్పెను. కాని ఇందు ద్వంద్వాతీతస్థితి కలిగి కర్మఫలితము కోరకుండుటయే సన్యాసము లేదా యోగము అని చెప్పబడెను. అగ్నిహోత్రాది పుణ్యకర్మలు చేయనివాడు సన్యాసియు కాడు, యోగియు కాడు. సర్వులకు పగలు, యోగికి రాత్రి. సర్వులకు రాత్రి యోగికి పగలు. అనగా యోగమును రాత్రి అభ్యసించుట శ్రేష్ఠము.

యోగములో యోగారూఢుడు, యోగభ్రష్టుడు అని రెండు విధములు. అటులనే యోగములో ప్రారంభకుడు (అరురుక్షుడు), యోగారూఢుడ అని రెండు తరగతులవారు కలరు. యోగము ధ్యానయోగము, ప్రాణాయామము అను రెండు విధములు.

ధ్యానయోగము : శ్రోత్రాది జ్ఞానేంద్రియములను వాటివాటి ఇంద్రియార్థముల నుండి మరలించి, జ్ఞానేంద్రియములను నిగ్రహించి, ధ్యాన, ధారణ, సమాధులను

పొంది ఆత్మసంయమము కలిగి ఉండుట. (దీనినే రాజయోగము అని అందురు).

**ప్రాణాయామము :** ఆహార నియమము కలిగి ప్రాణమును అపానమునందు, అపానమును ప్రాణమునందు ప్రాణాపానములను సమము చేసి అనగా పూర్ణకుంభకము నందు ఉండుట.

యోగము ఎవరికి వచ్చును? ఎవరికి రాదు?

అతిగా భుజించినవానికి, ఉపవాసమున్నవానికి, అతిగా నిద్రపోవువానికి, జాగరణ ఉన్నవానికి, మిక్కిలి సంసారసుఖము అనుభవించువానికి, పూర్తిగా సంసారసుఖము తెలియనివానికి యోగములో సిద్ధి కలుగదు.

కావున యుక్తాహారునకు, యుక్తావిహారునకు, యుక్త చేష్టలు కలవానికి, సరియైన నిద్ర మొదలైనవి కలవానికి యోగము సిద్ధించును.

యోగము ఎలా చేయవలయును?

వివిక్తదేశములో ప్రజలతోటి సంబంధమును వదలి, ఏకాంతమున ఉండి శుచిప్రదేశమున యోగమును అభ్యసించవలయును. అపరిగ్రహమును పాటించవలయును. స్వగురువును, ఇష్టదేవతలను పూజించవలయును. ఈ యోగమును పతంజలి అష్టాంగములుగా తీర్చిదిద్దినారు.

1) యమ : అహింస, సత్యము పలుకుట, దొంగతనము చేయకుండుట, అపరిగ్రహము, బ్రహ్మచర్యము ఇవి యమము.

2) నియమము : బాహ్యశౌచము, అంతరశౌచము, సంతోషము, పుణ్యకర్మలైన స్వాధ్యాయము, ఈశ్వరార్చన, తపస్సు మొదలైనవి చేయుట అగ్నిహోత్రాది పుణ్యకర్మలు చేయుట ఇవి నియమములు.

3) ఆసనము : మెత్తని ఆసనముపై స్థిరముగా కూర్చొని శరీరము, మెడ, శిరస్సు నిటారుగా ఉంచి నాసికాగ్రమున దృష్టిని నిలిపి ఓంకారమును జపించుచూ

4) ప్రాణాయామము : ఆధారచక్రమును పీడించి ప్రాణమును నాభికి చేర్చి ఆ తర్వాత హృదయమునకు చేర్చి, ఆ తర్వాత తాలుమూలములకు చేర్చి చివరకు బ్రహ్మరంధ్రమును తెచ్చి

5) ప్రత్యాహారము : జ్ఞానేంద్రియములను వాటివాటి ఇంద్రియార్థములందు ప్రసరించకుండా నిగ్రహించి (దీనినే పంచేంద్రియోన్మాదంబున్ పరిమార్చి అని భాగవతమున అష్టమస్కంధమున గజేంద్రమోక్షములో చెప్పబడినది).

మిథ్యాచారుడు: కర్మేంద్రియములను నిగ్రహించి ఇంద్రియార్థములను మనస్సులో స్మరించువాడు మిథ్యాచారుడు.

సదాచారుడు: జ్ఞానేంద్రియములను నియమించి తాబేలువలె కర్మేంద్రియముల ద్వారా కర్మలు చేయువాడు సదాచారుడు.

6) ధ్యానము: అహంకారము లేకుండా చిత్తశుద్ధి కలిగి మనస్సును గాలిలేనిచోట ఉన్న దీపమువలె అభ్యాస వైరాగ్యములచే నిశ్చలము చేసి, మనస్సులో ఓంకారము జపించుచూ బుద్ధిద్వారా పరమాత్మను ధ్యానించవలయును. అనగా మనోబుద్ధులను ఏకము చేయవలయును.

7) ధారణ : కూటస్థుని క్షేత్రజ్ఞునితో కలుపుట. (జీవాత్మను పరమాత్మతో అనుసంధానము చేయవలయును).

8) సమాధి : నిశ్చలసమాధిని పొంది ఆత్మరతి, ఆత్మక్రీడయందు ఉందురు. దీనినే భాగవతములో గోపికలు, కృష్ణుడి యొక్క రాసక్రీడలుగాను, గోపబాలురు, కృష్ణునియొక్క క్రీడలను ఆత్మక్రీడగాను వర్ణించిరి.

**నిశ్చల సమాధిని పొందిన యోగియొక్క లక్షణములు ఏమిటి?**

శమదమాదులు కలిగి జితేంద్రియుడై, సర్వసంకల్పములను వదలి, సర్వత్రా ఆత్మను దర్శించుచూ కాలానుసారము కలుగు సుఖదుఃఖములకు విచలితుడుగాకుండా ద్వంద్వరహితుడై గుణరహితుడైనవాడు నిశ్చలసమాధి పొందినట్లు భావించవలయును. ఇతనిని యోగారూఢుడు అని అందురు. ఇట్టి యోగి కర్మబంధమునుండి విడివడుచున్నాడు. దేహత్యాగ సమయమున బ్రహ్మరంధ్రము చీల్చి బ్రహ్మమందు కలియుచున్నాడు.

**యోగారూఢుడు, యోగభ్రష్టుల గురించి**

**శ్రద్ధయా ఉపేతః కాం గతిం గచ్ఛతి**

1) శ్రద్ధతో యోగమును అభ్యసించినవాని గతి ఏమి?

సమాధానము : ఇతడు సిద్ధిని పొంది దేహత్యాగానంతరము ఆత్మలో ఏకీభూతుడై ఆత్మయై విరాజిల్లును. ఇతడు యోగారూఢుడు.

**2) యోగాత్ చరిత మానసః – యోగ సంసిద్ధిం అప్రాప్య కాం గతిం గచ్ఛతి?**

**కచ్చిత్ ఛిన్న అభ్రం ఇవ ఉభయ విభ్రష్టః న నశ్యతి**

అనగా యోగములో మనస్సు చలించి యోగసిద్ధిని పొందనివాని గతి ఏమి? అతడు వర్షము కురియని మేఘమువలె వ్యర్థుడై ఆత్మస్థానము చేరక ఉభయభ్రష్టుడై నశించిపోడు కదా?

**దీనికి సమాధానముగా నాలుగు స్థాయిలు చెప్పబడినవి.**

1. ఆత్మను దర్శించి, దేహత్యాగ సమయమున ఇంద్రియములతోటి సంగమము విడువని స్థితి. దీనికి ఉదాహరణ ధ్రువుడు. 2. శాశ్వత అంతరాయము. యోగములో కొంతస్థాయికి చేరి ఇంద్రియసుఖములకు అనగా కామమునకు లోను అయినవాడు. దీనికి ఉదాహరణగా రామాయణములో మాండుకర్ణికథ చెప్పబడినది. 3. యోగభ్రష్టత. మోహములో కూరుకుపోయి ఆత్మస్థానమునకు చేరక యోగభ్రష్టుడగుట. దీనికి ఉదాహరణగా జడభరతుని కథ చెప్పబడినది. అతడు తిరిగి జన్మించి జీవన్ముక్తుడైనాడు. 4. తాత్కాలిక అంతరాయము. కామక్రోధములకు వశమై ఆత్మను దర్శింపలేకున్ననూ సాధనచే కామక్రోధములను జయించి, ఆత్మను దర్శించి ఆత్మస్వరూపుడగుట. దీనికి ఉదాహరణగా రామాయణములో విశ్వామిత్రుడు ఈ తాత్కాలిక అంతరాయములను అధిగమించి చివరకు బ్రహ్మర్షియైనట్లు చెప్పబడినది.

మనస్సుపై ఓంకారశబ్ద ప్రభావముండును. ఈ ఓంకారమునే శంఖముగా చెప్పినాడు. శంఖమనగా దుఃఖమును ఉపశమింపచేయునది అని అర్థము. దుఃఖనివారణకు సాధనమైన ఓంకారమే శంఖము. ఈ ఓంకారమునే శ్రీకృష్ణుడు పంచపాండవుల పేర్లతో చెప్పబడినది. ఈ ఓంకారము దేవదత్తము– అనగా వేదముచే జీవన్ముక్తికి అనుగ్రహింపబడినది. పౌండ్రము – స్వచ్ఛమైనది. సుఘోషము – వీనులకు, మనస్సుకు హాయినిగొలుపును. మణిపుష్పకము – హృదయ కమలమును (మణిని) వికసింపచేయును. అనంతవిజయము – ఆత్మస్థానము పొందుట అనే గొప్ప

విజయమును చేకూర్చునది. పాంచజన్యము – ప్రాణము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారులనే ఈ ఐదింటిని ఏకాగ్రమొనరించి జీవుడు ఉచ్చరించునది. యోగప్రారంభములో ఆసనము స్థిరముగా ఉండదు. మనస్సు చలించును. చేతినుండి జపమాల జారిపోవును. నోరు ఎండిపోవును. కుండలినీశక్తి విజృంభించు సమయమున చర్మము మండిపోవునట్లు ఉండును. ఆసనములో కొంతసేపు ఉన్న తర్వాత లేచి నిలబడుటకు శక్తి చాలదు. హఠాత్తుగా అలా లేచి నిలబడిన భూమిపై పడిపోవును. ఈ లక్షణములను అర్జునుని పరముగా చెప్పబడినవి.

## భక్తి

యోగులు, భక్తులు ఇద్దరూ శ్రేష్ఠులే. యోగములో నిరాకారమైన ఆత్మను ధ్యానింతురు. భక్తిలో సాకారరూపమున పరమాత్మను నిరంతరము ధ్యానింతురు. కావున యోగమన్నా, భక్తి అన్నా ఒక్కటే. భక్తులు దేహేంద్రియ మనోబుద్ధులను పురుషోత్తముని పరముగా పనిచేయించెదరు. సమస్తకర్మలు భగవంతునియందు సమర్పింతురు. సంసారబంధమును తొలగించుకొని ఇహలోక విషయములను చింతింపక, సర్వభావములు పరమాత్మకు సమర్పించి, పరమాత్మనే శరణుగోరి, పరమాత్మనే ఆశ్రయించి ఉందురు. భక్తులకు ఉదాహరణగా నారదుడు గోపికలను ఉదహరించినాడు. వీరు అహంకార నిబద్ధంబగు కర్మను త్రుంచివైతురు. అనగా కర్మబంధములను తొలగించుకొందరు. భక్తులలో ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞాని అని నలుగురు కలరు. వీరిలో జ్ఞాని శ్రేష్ఠుడు.

పూజ : తమోగుణయుతులు ఘోరరూపులైన భూతములను పూజింతురు. ఈశ్వరుని శరణుకోరరు. కావున వీరు నశించిపోవుదురు. రజోగుణయుతులు కోరికలు నెఱవేఱుటకు దేవతలను పూజింతురు. ఇహలోక, పరలోక సుఖాపేక్షాపరులు దేవతలను యజించుచున్నారు. సత్త్వగుణయుతులు పరమాత్మను సేవించుచున్నారు. దేవతలను ఆరాధింతువారు దేవతలను, పితృదేవతలను ఆరాధించువారు పితృదేవతలను, భూతములను ఆరాధించువారు భూతములను పొందుదురు. ఆవిధముగా పరమాత్మను ఆరాధించువారు పరమాత్మను పొందుచున్నారు అని గ్రహించవలయును. అనన్యభక్తిచే ఈశ్వరుని భజియించి, ద్వంద్వాతీతులై, గుణరహితులై శాంతిని పొంది, ఇహలోకమున

అమృతత్త్వమును పొందుచున్నారు. గుణరహితులై దేహత్యాగ సమయమున పరమాత్మను స్మరించి పరమాత్మస్థానమును పొందుచున్నారు.

## జ్ఞానయోగము - సాంఖ్యము

గుణరహితస్థితిని పొందుటయే జ్ఞానము. సాధనద్వారా అనగా కర్మయోగమును అవలంబించి జ్ఞానులైనవారు, జన్మతః సాంఖ్యులైనవారు అని సాంఖ్యులు రెండు రకములు. పుణ్యకర్మాచరణచే జ్ఞానము పొందుట సులభము. కర్మాచరణ చేయకుండా జ్ఞానము పొందుట కష్టము. జ్ఞానేంద్రియములు వాటివాటి ఇంద్రియార్థములపై ప్రసరించుచున్నవనియు, తను కర్తను కాననియు జ్ఞాని తలంచును. దేహి, దేహ, విచారణ చేసి క్షేత్రజ్ఞుడైన ఆత్మను దర్శించుటయే జ్ఞానము. అటులనే ప్రకృతి, పురుష వివేకము కలిగియుండుట జ్ఞానము. తను దేహిని కానని, ఆత్మస్వరూపుడనని గ్రహించి సాంఖ్యుడు ఇట్టి జ్ఞానమును కలిగియుందురు. జ్ఞానమువలన వీరు సంసారములో తామరాకుపై నీటిబొట్టువలె ఉందురు. తాబేలువలె అవసరమైనప్పుడు కర్మేంద్రియములద్వారా పనిచేయుదురు. జ్ఞానికూడా అగ్నిహోత్రము, యజ్ఞయాగాది క్రతువులు మొదలైన పుణ్యకర్మలు చేయవలయును. కాని పుణ్యకర్మల ఫలితమును కోరరాదు. జ్ఞాని పుణ్యకర్మలు చేయవచ్చు. లేదా చేయకుండానూ ఉండవచ్చు. అయిననూ ఇతరులకు ఆదర్శముగా ఉండుటకు జ్ఞానికూడా పుణ్యకర్మలు శ్రద్ధగా, వేదవిహితముగా చేయవలయును. అజ్ఞానులకు బుద్ధిభేదము కలిగించరాదు. రాగద్వేషములు జ్ఞానికి శత్రువులు. కావున వాటిని జయించవలయును. ద్వంద్వాతీతులు కావలయును. గుణరహితులు కావలయును. శాంతిని పొందవలయును. ద్వంద్వాతీతుడైన సాంఖ్యుడు కర్మబంధముల నుండి విడివడును. శాంతిని పొందును. దేహత్యాగానంతరము పరమాత్మను ధ్యానించి ఆత్మయై విరాజిల్లును.

**ఆత్మస్థానము పొందువాని లక్షణములు:** 1) దుఃఖము పోయి ఆత్మకు శాంతి ఎలా కలుగును? 2) స్థితప్రజ్ఞుని లక్షణములు ఏమిటి? 3) త్రిగుణములను అతిక్రమించి గుణరహితునియొక్క లక్షణములు ఏమిటి? 4) ప్రయాణకాలమునందు ఏమి చేయవలయును?

సమాధానము : గుణరహితుడు శాంతిని పొందును. ఎవడు ఏ ఆచరణపద్ధతిని పాటించినా ద్వంద్వాతీతుడై, గుణరహితుడై శాంతిని పొందవలయును.

**గుణరహితుని లక్షణములు :** 1. ప్రాపంచిక విషయములందు ఆసక్తి లేనివాడు, 2. ఇహలోక–పరలోక సుఖములందు ఆపేక్ష లేనివాడు, 3) ఉండవలసిన లక్షణములు: ధర్మపరుడై ఉండవలయును. త్రిగుణములను అధిగమించవలయును. వైరాగ్యము కలిగి ధనేషణ, దారేషణ, పుత్రేషణ అనే ఈషణత్రయములను వదలి ఉండవలయును. అపరిగ్రహమును పాటించవలయును. దొరికినదానితో తృప్తి పొంది నిత్యతృప్తుడై ఉండవలయును. బుద్ధిసంపన్నత్వమున స్థిరబుద్ధి కలిగి అనగా విశుద్ధబుద్ధి కలిగి ఉండవలయును. యోగయుక్తుడై అనగా పరమాత్మతో ఆత్మానుసంధానము కలిగి యుండవలయును. పరమాత్మను శరణుగోరి పరమాత్మను ఆశ్రయించినవాడై ఉండవలయును. శత్రుమిత్రులయందు, ప్రియాప్రియములందు, నిందాస్తుతులయందు, సుఖదుఃఖములయందు, మానావమానములయందు, జయాపజయములందు, లాభాలాభములందు, ఫలితాఫలితములందు, శీతోష్ణములందు, సిద్ధి అసిద్ధియందు, బంగారము, మట్టి, రాయియందు సమభావన కలిగి ఉండవలయును. అనగా ద్వంద్వాతీతుడై ఉండవలయును. సర్వభూతములయందు సమభావన కలిగి సర్వత్రా ఆత్మను దర్శించవలయును. జితాత్మా, ప్రసన్నాత్మా కలిగియుండవలయును. ప్రకృతిని పరిత్యజించవలయును. 4) ఉండకూడనివి : రాగము, ద్వేషము ఉండరాదు. కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అను అరిషడ్వర్గములు ఉండరాదు. మమతానురాగములు ఉండరాదు. దంభము, దర్పము, అహంకారము, అష్టమదములు ఉండరాదు. ఆశ ఉండరాదు. కోరికలు ఉండరాదు. మరణభయము ఉండరాదు.

ఈ లక్షణములు కలవాడు గుణరహితుడు. ఇతడు శాంతిని పొందును. ఈ స్థితినే బ్రాహ్మీస్థితి అని యందురు. ఇతడే జీవన్ముక్తుడు. గుణరహితుడై బ్రాహ్మీస్థితిని పొంది దేహత్యాగ సమయమున పరమాత్మను ధ్యానించినవాడు ఆత్మస్థానమును పొంది ఆత్మయై విరాజిల్లును.

**ఆత్మస్థానమును పొందనివారు :** అశ్రద్ధతో పుణ్యకర్మలు చేయువారు, వ్యర్థ ఆశలు కలవారు, వ్యర్థకర్మలు చేయువారు, విపరీతజ్ఞానము కలవారు, పరమాత్మను ఆశ్రయింపనివారు, త్రిగుణయుతులు, ఆత్మతత్త్వమును ఎఱుగనివారు, వీరు ఆత్మస్థానమును పొందక జన్మపరంపరలలో చిక్కుకొందురు.

**పండితుడు – యోగారూఢుడు – ఏకాంత భక్తుడు – జ్ఞాని**

పుణ్యకర్మానుష్ఠానములో నిష్కామముగా, పుణ్యకర్మలు చేసి పుణ్యఫలితమును కోరక, కోరికలను విడచి ద్వంద్వాతీతుడై గుణరహిత స్థితిని పొంది, దేహత్యాగ సమయమున పరమాత్మను ధ్యానించి, ఆత్మయై విరాజిల్లువాడు **పండితుడు**.

యోగము చేసి నిశ్చలసమాధిని పొంది, ద్వంద్వాతీతుడై గుణరహిత స్థితిని పొంది, దేహత్యాగ సమయమున పరమాత్మను ధ్యానించి, ఆత్మయై విరాజిల్లువాడు **యోగారూఢుడు**.

సర్వక్రియలు, సర్వభావములు పరమాత్మయందు ఉంచి నిరంతరము పరమాత్మను ధ్యానించుచూ, ద్వంద్వాతీతుడై గుణరహిత స్థితిని పొంది, దేహత్యాగ సమయమున పరమాత్మను ధ్యానించి, ఆత్మయై విరాజిల్లువాడు **ఏకాంతభక్తుడు**.

సాంఖ్యపద్ధతిలో దేహి, దేహవిచారణ చేసి, ప్రకృతి, పురుష వివేకము కలిగి స్థిరబుద్ధి కలిగి ద్వంద్వాతీతుడై గుణరహిత స్థితిని పొంది, దేహత్యాగ సమయమున పరమాత్మను ధ్యానించి, ఆత్మయై విరాజిల్లువాడు **జ్ఞాని**.

భీష్మపర్వంలోని 25వ అధ్యాయము నుండవ 42వ అధ్యాయము వఱకు అధ్యాత్మ విషయములు **సంక్షిప్తము**గా చెప్పబడినవి. ఉపనిషత్తులలో వేదోపబృంహణములైన రామాయణ, భారత, భాగవతములలో వీటి గుఱించి విపులముగా చెప్పబడినవి. కావున అధ్యాత్మతత్త్వమును గ్రహించదలచినవారు ఈ అధ్యాయములతోపాటు వాటిని గూడ చదివిన విషయము చక్కగా అర్థమగును. కేవలము ఇందు చెప్పిన విషయములను చదివి, గ్రహించి, ఆచరించినచో ఫలితము మిక్కుటము.

***కేనోపనిషత్‌లో ఒక కథ గలదు. దేవతలు విజయమును పొంది, ఆ విజయము తమదేనని పొంగిపోయినారు. అంతట ఉమ ఈ జయమునకు పరమాత్మ కారకుడు అని చెప్పినది. అటులనే ఈ గ్రంథమునకు కర్త, ఫలితము కూడ పరమాత్మయే.***

...... ❖ ❖ ❖ ......